# కాపిటల్‌లో కార్ల్ మార్క్స్
# ఏంచెప్పాడు?



ఇ.ఎస్. బ్రహ్మాచారి




విప్లవ రచయితల సంఘం

2020



**కాపిటల్‌లో కార్ల్‌మార్క్స్ ఏం చెప్పాడు?**

**CAPITAL LO KARL MARX EM CHEPPADU**

**ఇ.ఎస్. బ్రహ్మోచారి**

**విరసం ప్రచురణలు**

వెబ్‌సైట్ : www.virasam.org

మెయిల్ ఐడి : arunatara1977@gmail.com,
virasam 1970@gmail.com

ప్రథమ ముద్రణ: జనవరి, 2020

కాపీలు: 500
వెల: రూ. 200/-

రచన, డి.టి.పి. & లేఅవుట్:
**ఇ.ఎస్. బ్రహ్మోచారి**
37-1-408/28ఎ, భాగ్యనగర్, 3వ లైను, 3వ అడ్డరోడ్డు
ఒంగోలు, ప్రకాశం జిల్లా, ఆంధ్రప్రదేశ్ - 523001
మొబైల్: 9441067046

Email: esbrahmachari@gmail.com
Blog: saamaajikam.blogspot.com
esbrahmachari.wordpress.com
youtube channel:
https://www.youtube.com/channel/UCrjuYa-3O_IYL36GSjYn-Og

ప్రతులకు:
**డి.వి. రామక్రిష్ణారావు,**
ఎం.ఐ.జి. 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్-500040, తెలంగాణ
**నవోదయ బుక్ హౌస్,** కాచిగూడ, హైదరాబాద్. ఫోన్ : 040-24652387
**నవతెలంగాణ,** చిక్కడపల్లి, హైదరాబాద్ - 500020, ఫోన్ : 040-27608107
**అనేక బుక్ స్టాల్,** ఏలూరురోడ్, విజయవాడ - 520 002, ఫోన్ : 8977493465



నా అర్ధాంగి



**పొతకమూరి నాగేశ్వరమ్మకు**

# 'కాపిటల్' ఇప్పుడెందుకు?

కారల్ మార్క్స్ జన్మించి 200సంవత్సరాలపైగా అయింది. 2018లో ప్రపంచవ్యాప్తంగా ఆయన ద్విశత జయంతి సభలు జరిగాయి. ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతాలను వర్తమాన ప్రపంచానికి అన్వయిస్తూ అనేకానేక సదస్సులు జరిగాయి. మార్క్సిస్టు భావజాలాన్ని విమర్శనాత్మకంగా పరిశీలిస్తూ, నేటి ప్రపంచ సమాజాలకి దాని అవసరాన్ని తెలియజేస్తూ వివిధ భాషలలో పుస్తకాలు, వ్యాసాలు వచ్చాయి. మార్క్స్ రాసిన గ్రంథాలలో సుప్రసిద్ధమైనది 'కాపిటల్'. 1867లో దాన్ని ఆయన ప్రచురించారు. అందులో ఆయన రెండు ప్రధానమైన సైద్ధాంతిక ప్రతిపాదనలు చేశారు. అవి శ్రమశక్తి సరుకుగా మారడం, రెండు అదనపు విలువ సృష్టి కావడం. తన సమకాలీన సమాజాన్నేకాక అంతకంటే కొన్ని వందల సంవత్సరాల క్రితం ఆయా సమాజాలలో ఆర్థిక, సామాజిక రంగాలలో వచ్చిన మార్పులను చారిత్రకంగా శాస్త్రీయ దృష్టితో పరిశీలించిన ఫలితంగానే ఆయన రూపొందించిన అదనపు విలువ సిద్ధాంతానికి ఇప్పటికీ విశ్వసనీయత లభించింది. మార్క్స్ చనిపోయి కూడా ఇప్పటికి దాదాపు 137 సంవత్సరాలు అయింది.

రెండు శతాబ్దాల క్రితం పుట్టి పెరిగిన ఒక ఆలోచనాపరుడు రూపొందించిన సిద్ధాంతానికి ఇప్పటికీ కాలం తీరకపోవడం చాలామందికి అర్థంకాని అంశం. కమ్యూనిస్టులు మార్క్సును, ఆయన సిద్ధాంతాలని నెత్తినపెట్టుకొని మోస్తున్నారని, వాళ్ళకు వర్తమానంతో సంబంధంలేదని, మార్క్స్ జీవించిన కాలంనాటి పరిస్థితులకి, ఇప్పటికీ మధ్య ఏ మాత్రం పోలికలేదని, ఆ కారణంగా మార్క్సిజానికి కాలం చెల్లిందని వాదించే మేధావులు చాలామంది వున్నారు. వర్తమాన కాలంలో దేశాల ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి రంగానికి ప్రాధాన్యత తగ్గి, సేవారంగం ప్రాధాన్యత పెరిగిన క్రమంలో మార్క్స్ ప్రతిపాదించిన అదనపు విలువ సిద్ధాంతానికి కాలం చెల్లిందని విమర్శించే వాళ్ళూ ఉన్నారు.

ఇది ఒక పార్శ్వం మాత్రమే. మరోపక్క సామ్రాజ్యవాద ప్రపంచీకరణలోని డొల్లతనం బయటపడుతోన్న కొద్దీ పెట్టుబడిదారీ దేశాలలో సైతం అర్థశాస్త్రవేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు పరిష్కారాల కోసం తిరిగి మార్క్స్ 'కాపిటల్' గ్రంథాన్ని పరిశీలించక తప్పని పరిస్థితి ఏర్పడడం మరో పార్శ్వం. మార్క్స్ 'కాపిటల్' గ్రంథాన్ని కేవలం పుస్తకాల పఠనం ద్వారా వచ్చిన జ్ఞానం నుండి రాయలేదు. గతంతో సంబంధం లేకుండా కేవలం వర్తమానాన్ని మాత్రమే అర్థం చేసుకొని రాయలేదు. ఆయనది వివరణాత్మక పద్ధతి కాదు. విశ్లేషణాత్మక పద్ధతి. ఈ విశ్లేషణ కూడా చారిత్రక చలనంతో ముడిపడిన విశ్లేషణ. సమాజంలో వివిధ తలాలలో జరిగే మార్పుల మధ్య వుండే అంతస్సంబంధాన్ని అర్థం చేసుకున్న విశ్లేషణ. ఆయనది సమ్యక్ దృష్టి. సమాజాన్ని దాని ఉపరితల పరిశీలన ద్వారా అర్థం చేసుకోలేదు. సమాజ గతిచలనానికి కారణమైన పునాదిని, దానికీ ఉపరితలానికి మధ్య వుండే గతితార్కిక సంబంధాన్ని ఆయన అవగాహన చేసుకోగలిగారు.

ఇలాంటి అత్యంత శాస్త్రీయమైన పద్ధతి కారణంగానే మార్క్స్ 'కాపిటల్'కి, ఇతర రచనలకి ఇంతటి శక్తి వచ్చింది.

మార్క్స్ రచనా పద్ధతి ఎంత శాస్త్రీయమైనా, దాన్ని ఒక ఆచరణాత్మక శాస్త్రంగా అర్థం చేసుకోలేనివాళ్ళకి దాని శక్తి అర్థం కాదు. ఆయన తన రచనలన్నింటిలో ప్రతిపాదించిన అంశాలని వర్తమానంలో మన శాస్త్రీయ పరిశీలనా ఫలితాలకు అన్వయించుకొని అర్థం చేసుకుంటేనే దాని విలక్షణత, కాలానికి నిలబడే తత్వం అర్థమవుతాయి. అలా అర్థం చేసుకోలేనివాళ్ళే మార్క్స్ రచనలకు కాలం చెల్లిందని, ఆయన ప్రతిపాదనలలో ఖాళీలు వున్నాయని, వాటిని మనదైన అధ్యయనంతో పూరించాలని, ఆనాటి సమాజంలోని నిర్దిష్ట పరిస్థితుల పరిశీలనల నుండి ఆయన చేసిన నిర్ణయాలు, వర్తమానంలో, విలక్షణమైన పరిస్థితులున్న సమాజాలకు అన్వయించడం వైఫల్యానికి దారితీస్తుందని సూత్రీకరణలు చేస్తున్నవాళ్లు ఎవరూ 'కాపిటల్' తో సహా మార్క్స్ రచనలు వేటినీ అన్వయదృష్టితో అర్థం చేసుకున్నవాళ్ళు కారు.

మార్క్స్ 'కాపిటల్' గ్రంథంలో అదనపు విలువకు సంబంధించి చేసిన మౌలికమైన ప్రతిపాదనలన్నీ నేటికీ వాస్తవాలే. మనం చేయాల్సిందల్లా ఆయన అనుసరించిన విమర్శనాత్మక దృక్పథాన్ని ఆయన గ్రంథాలను పరిశీలించడానికి కూడా అనుసరించడమే. అలా చేస్తే తప్ప మార్క్స్ కాలానికి, ఇప్పటి కాలానికి వచ్చినట్లు కనపడుతోన్న మార్పులు పునాదిలో, గుణాత్మకంగా జరిగిన మార్పులా లేక పైపైన ఉపరితలానికి మాత్రమే పరిమితమైన మార్పులా అనేది అర్థం కాదు. అందుకే మార్క్స్ రచనలన్నింటినీ పదేపదే చదవాలనటం. చదవడం అంటే కంఠతా పట్టటమని కాదు. ఆయన ప్రతిపాదించిన ప్రతి సూత్రీకరణను, ప్రతి విలువను వర్తమాన సమాజానికి గతితార్కిక, చారిత్రక దృక్పథంతో అన్వయించడం. ఇలా అర్థం చేసుకున్నవాళ్ళకు మార్క్సిజం ఒక అన్వయ శాస్త్రమే కాక, ఆచరణాత్మక శాస్త్రంగా కూడా మారుతుంది.

మార్క్స్ 1867లో ప్రారంభించిన 'కాపిటల్' ఒక ఉద్గ్రంథం. అది ప్రపంచంలో అనేక భాషలలోకి అనువాదం అయింది. అందులో ఆయన పరిశీలనకు ఎంచుకున్న అంశాల దృష్ట్యా అది క్లిష్టమైన గ్రంథం కూడా. అయినా కేవలం మేధావులకు, ఆలోచనాపరులకు మాత్రమే కాక సాధారణ ప్రజలకు కూడా అర్థం కావడానికి వీలుగా ఆయన ఆ గ్రంథ రచన చేశారు. అప్పటి నుండి ఇప్పటి వరకు 'కాపిటల్' అనేక పునర్ముద్రణలు పొందింది. దానికి చాలామంది వ్యాఖ్యానాలు రాశారు. అనేక విశ్వవిద్యాలయాల్లో 'కాపిటల్'మీద పరిశోధనలు కూడా జరిగాయి.

ప్రపంచవ్యాప్తంగా అట్టహాసంగా ప్రారంభమైన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అనుకున్న ఫలితాలను సాధించడానికి బదులు పెట్టుబడిదారీ వ్యవస్థల్లో తీవ్ర సంక్షోభాలను సృష్టించింది. ప్రపంచ సామ్రాజ్యవాద మొనగాడుగా బోరవిరుచుకున్న అమెరికా ఊహించని రీతిలో ఆర్థిక సంక్షోభంలోకి కూరుకుపోయింది. తన ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవింప చేయడానికి ఏం చేయాలో తెలియక సతమతమౌతున్న కాలంలో మేధావులు తిరిగి 'కాపిటల్' గ్రంథాన్ని అధ్యయనం చేయడం ప్రారంభించారు. ప్రపంచీకరణను ప్రారంభించిన దేశం తిరిగి రక్షిత ఆర్థిక విధానాన్ని

అనుసరించక తప్పని స్థితిలోకి జారిపోయింది. పెట్టుబడి కేంద్రక ఆర్థిక వ్యవస్థ ఉన్నంతకాలం అదనపు విలువ సృష్టి, దోపిడీ రూపం మారి సారంలో కొనసాగుతాయి. వ్యక్తిగత పెట్టుబడి పూర్తిగా సామాజిక నియంత్రణలోకి వచ్చేవరకూ మార్క్స్ మౌలిక సూత్రీకరణల ప్రాసంగికత ఉంటుంది.

మనదేశంలోనూ ప్రపంచవ్యాప్తంగానూ అదనపు విలువ దోపిడీ గురించి, శ్రమశక్తి గురించి, వర్గపోరాటాల ఆవశ్యకత గురించి, వర్గ రహిత సమాజ స్థాపన గురించి అంచనాలు, పునరంచనాలు జరుగుతున్న ఈ కాలంలో, తెలుగు పాఠకులు మార్క్స్ తన పెట్టుబడి గ్రంథంలో వివరించిన అంశాలను, ప్రతిపాదనలను అర్థం చేసుకోవడానికి వీలుగా మిత్రులు బ్రహ్మాచారి రచించిన ఈ పుస్తకాన్ని తెలుగు పాఠకులకు అందిస్తున్నాం. ఆయన ఈ పుస్తకంలో 'కాపిటల్' మొదటి సంపుటంలోని ఎనిమిది భాగాలను వివరించారు. ఇందులో సరుకు, డబ్బు పెట్టుబడిగా మారటం, అదనపు విలువ ఉత్పత్తి, వేతనాలు, పెట్టుబడి పుట్టుక, పెట్టుబడి సంచయం అనే అంశాలను వివరించారు. బ్రహ్మాచారిగారి పరిచయం సోదాహరణంగానూ, చాలా సరళంగానూ ఉంది. దీన్ని చదవటం ద్వారా తెలుగు పాఠకులకు మార్క్సిస్టు మౌలిక ఆర్థిక సూత్రాలపట్ల సరైన అవగాహన కలుగుతుందని, తద్వారా ఈ శతాబ్దపు ప్రత్యేకతలను అవగాహన చేసుకోగలుగుతారని, పెట్టుబడిదారీ ఆర్థికశాస్త్రవేత్తలు సృష్టిస్తున్న గందరగోళం నుండి బయటపడి మారుతోన్న ప్రపంచాన్ని చారిత్రక భౌతికవాద దృష్టితో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తారని మేం ఆశిస్తున్నాం. ఈ పుస్తకంకోసం, రచయిత చేసిన కృషి మాకు తెలుసు. దాదాపు మూడు, నాలుగు సంవత్సరాలుగా బ్రహ్మాచారి ఈ పనిలో తలమునకలై ఉన్నారు. ఇంతటి కృషిచేసి ఒక విలువైన పుస్తకాన్ని అందించిన ఆయనకు విరసం విప్లవాభినందనలు తెలియజేస్తూ ఉంది.

**– సి.ఎస్.ఆర్. ప్రసాద్**

4-12-2019

# నామాట

In view of the incredibly widespread nature of the distortions of Marxism, our first task is to restore the true doctrine of Marx on the state - Lenin

రాజ్యం గురించి వక్రీకరించినట్లే, ఆయన అర్థిక సిద్ధాంతాన్ని కూడా వక్రీకరించారు. వక్రీకరిస్తున్నారు. ఇంకా వక్రీకరిస్తూనే ఉంటారేమో అనిపిస్తుంది. మార్క్స్ చెప్పినవి చెప్పనట్లు, చెప్పనివి చెప్పినట్లు రాస్తున్నారు. అంతే కాదు ఆయన చెప్పినవి కొన్ని తప్పులు అంటున్నారు.

శ్రమే విలువకి ఏకైక వనరు అనీ, సమాన విలువలే మారకం అవుతాయనీ – అర్థికవేత్తలు ఎప్పుడో తేల్చారు. అయితే పెట్టుబడి, శ్రమ అనే సరుక్కి పూర్తి విలువ చెల్లిస్తే, పెట్టుబడికి లాభం రాకూడదు. అయినా వస్తున్నది. ఈ వైరుధ్యాన్ని అర్థశాస్త్రజ్ఞులు పరిష్కరించలేక గిజగిజలాడారు. మార్క్స్ దీన్ని పరిష్కరించాడు. అప్పటివరకూ కార్మికుడు అమ్ముతున్న సరుకు, శ్రమ అనుకున్నారు.వాళ్ళ పరిశోధన ముందుకు పోలేదు. కార్మికుడు అమ్ముతున్నది శ్రమని కాదు, శ్రమశక్తిని అని మార్క్స్ తేల్చాడు. శ్రమశక్తి అనే నూతన భావాభివర్గాన్ని ఆవిష్కరించాడు. తద్వారా విలువ నియమం భంగం కాకుండా, సమాన విలువల మారకం మీదనే అదనపు విలువని మార్క్స్ శాస్త్రీయంగా రుజువుచేశాడు. అయినా కొందరు 'మేధావులు' సొంత తర్కంతో మార్క్స్ చెప్పింది తప్పంటున్నారు– అదీ 'మార్క్సిస్టు' ముద్రతో. వాళ్ళని – మార్క్సిస్టులం అని చెప్పుకుంటున్న వారినైనా సరే – ఉపేక్షించకూడదు. ఎప్పటికప్పుడు ఎదుర్కోవాలి. సైద్ధాంతిక పోరాటం చెయ్యాలి. అందుకోసం మార్క్స్ ఏం చెప్పాడో తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. అందుకే ఈ ప్రయత్నం.

**కృతజ్ఞతలు**

పుస్తకాన్ని రాయడం మొదలుపెట్టినప్పటినించీ చిరకాలమిత్రుడు డా. ఎన్. (బాపట్ల) చంద్రశేఖరరావు గారికి ఎప్పటికప్పుడు రాసినవి పంపించేవాడిని. ఆయన చదివి తగిన సూచనలు చేసేవారు. ఆయన సలహాలు అమూల్యమైనవి. ఒక్క మాటలో, వారి జోక్యం వల్లనే ఈపుస్తకం వెలువడుతున్నది. ఈసందర్భంలో, ఆప్త మిత్రుడికి కృతజ్ఞతలు.

ఎప్పడికప్పుడు పంపిన పేజీలు చదివి సలహాలిచ్చిన. డా. ఇ. దిలీప్ కుమార్ కి కృతజ్ఞతలు.

ప్రోత్సహిస్తూవచ్చిన వై. కరుణాకర్‌కీ, నాతాని హనుమంతరావుకీ, రెండుసార్లు చదివి సలహాలిచ్చిన బెజవాడ వెంకటేశ్వర్లుకీ, అర్జా ప్రసాదరావుకీ కృతజ్ఞతలు. పుస్తకం ప్రచురణ విషయంలో ఎంతో శ్రద్ధ చూపిన డి.వి. రామక్రిష్ణారావు (రాంకి) గారికీ ప్రత్యేక కృతజ్ఞతలు. ప్రచురించిన 'విరసం' సంస్థకు, 'విరసం' కార్యదర్శి పాణి గారికి కృతజ్ఞతలు. ముందుమాట రాసిన సి.ఎస్.ఆర్. ప్రసాద్ గారికి కృతజ్ఞతలు. చివరి నిముషంలో ఒకసారి చూసి సూచనలు చెప్పిన ఎన్. వేణుగోపాల్ గారికి కృతజ్ఞతలు.

– ఇ.ఎస్. బ్రహ్మాచారి

# విషయ సూచిక

## భాగం 4 సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తి 175

# భాగం 1

# సరుకులూ - డబ్బూ

అధ్యాయం 1 సరుకులు

అధ్యాయం 2 మారకం

అధ్యాయం 3 డబ్బు
లేదా సరుకుల చలామణీ

# అధ్యాయం 1
# సరుకులు

## విభాగం (సెక్షన్) 1– సరుకుకుండే రెండు పార్శ్వాలు: ఉపయోగపు విలువా – విలువా (విలువ సారమూ– విలువ పరిమాణమూ)

పెట్టుబడి పుస్తకంలో మార్క్స్ పరిశీలించింది పెట్టుబడిదారీ అర్థిక విధానాన్ని. ఆయన లక్ష్యం: పెట్టుబడిదారీ విధానం యొక్క చలన నియమాన్ని బయట పెట్టడం. అందుకోసం, తనపరిశోధనని, సరుకు విశ్లేషణతో మొదలు పెట్టాడు. సరుకురూపంతోనే ఎందుకు మొదలుపెట్టాలో పెట్టుబడి పుస్తకం తొలివాక్యం వివరిస్తుంది:

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ప్రబలంగా అమల్లోవున్న సమాజాల్లో, సంపద అనేది అపారమైన సరుకుల సముదాయం. ఆ సంపదకి 'ప్రమాణం' (unit) ఒక విడి సరుకే. అందువల్ల, "మన పరిశోధన సరుకు విశ్లేషణతోనే మొదలు కావాలి"

### తొలి విశ్లేషణలో తేలిన విషయం: సరుకు ద్వంద్వ స్వభావి

సరుకు ఒకపక్క, దాని సహజ రూపంలో ఉపయోగపడే వస్తువు. ఉపయోగపు విలువ. మరొకపక్క మారకం విలువకు వాహకం. ఈ దృక్పథం నించి, దానికదే మారకం విలువ. సరుకు ఉపయోగపు విలువా, మారకపు విలువా – అవి రెండూ సరుకుకి ఉండే రెండు పార్శ్వాలు. సరుకు ద్వంద్వ స్వభావి అనేది ఇందుకే.

తదుపరి విశ్లేషణలో తేలిన విషయం: మారకం విలువ అనేది కేవలం వ్యక్తీకరణ రూపం మాత్రమే, అంటే సరుకులో ఉన్న విలువని తెలిపే స్వతంత్ర పద్ధతి మాత్రమే.[1] ఇక విలువ విశ్లేషణకి పూనుకుంటాడు.

**సరుకు – మారకం కోసం తయారైన వస్తువు** – మార్కెట్లో మారకం అయ్యేవన్నీ సరుకులే. మారకానికి పెట్టిన వస్తువులేవైనా సరుకులే. మారకంలోకి రాని వస్తువులు సరుకులు కావు. ఉదాహరణకి, మనింట్లో మనకోసం వండుకున్న అన్నం సరుకు కాదు. అది మారకంలోకి రాదు కనుక. హొటల్లో అన్నం, అమ్మకానికి పెట్టింది కాబట్టి, సరుకు అవుతుంది.

**మరి, మారకాలు మొదట్నించీ ఉన్నాయా?** అంటే, లేవు. ఆదిమ సమాజంలో మారకాలు లేవు. ఎందువల్లనంటే ఆ సమాజంలో ఒక తెగంతా ఒకే కుటుంబంగా ఉండేది. అందరూ కలిసి వేటాడే వాళ్ళు, దుంపలూ కాయలూ సేకరించేవారు. అందరూ తినేవారు. ఏవస్తువూ ఎవ్వరి సొంతమూ కాదు. అన్నీ అందరివీ. మారకాలు ఎరగని సమాజం. సరుకులు లేని సమాజం. అటువంటి సమాజం అంతరించే దశలో మారకాలు మొదలయ్యాయి. అంటే శ్రమ ఉత్పాదితాలు సరుకులు అవడం ఆరంభం అయింది.

**సరుకులు ఏర్పడడమూ– పెరగడమూ.** చాలా కాలం సరుకులు తెలియకుండానే సమాజం సాగింది. కాలం గడిచేకొద్దీ పశుపోషణా, వ్యవసాయమూ అభివృద్ధయ్యాయి. కొంత కాలానికి కొన్నితెగలు వ్యవసాయాన్ని ప్రధానంగా చేసుకుంటే, మరికొన్ని పశుపోషణను ఎంచుకున్నాయి.

శ్రమ విభజన జరిగింది. దాంతో వ్యావసాయిక తెగలకు వ్యవసాయోత్పత్తులు మిగులుగా ఉండేవి. కాని పశుసంబంధమైన వస్తువులు చాలినన్ని ఉండేవికావు. అలాగే పశుపోషక తెగలకు పశు ఉత్పత్తులు మిగులుగా వున్నా, వ్యవసాయోత్పత్తులు తక్కువ అయ్యేవి. ఆపరిస్థితుల్లో ఆ తెగల వస్తువులు వారివి వీరూ, వీరివి వారూ ఇచ్చి పుచ్చుకునేవారు. అంటే, ఆయా వస్తువులు మారకం అయ్యేవి. అలా వ్యవసాయ శ్రమ, పశుపోషణ శ్రమల విభజన వల్ల, వారి ఉత్పత్తుల్లో మిగులు వస్తువులు సరుకులయ్యాయి. కాలక్రమంలో చేతివృత్తులు విడివడ్డాయి. తయారైన వస్తువులు ఎక్కువగా మారకమయ్యేవి. మారకం అభివృద్ధి చెందింది. మారకంకోసం తయారయ్యే వస్తువుల రకాలూ, సంఖ్యా పెరుగుతూ వచ్చాయి. శ్రమవిభజనవల్ల మారకమూ, మారకంవల్ల శ్రమవిభజనా అభివృద్ధయ్యాయి. మారకాలు బాగా పెరిగినందువల్ల, డబ్బు ఏర్పడింది. డబ్బు వల్ల మారకాలు సులువయ్యాయి. బానిస, భూస్వామ్య వ్యవస్థల్లో మారకాలు పెరుగుతూ వచ్చాయి. పెరుగుతూ ఉన్నప్పటికీ, ఎక్కువగా మిగులు వస్తువులే మారకంలోకి వచ్చేవి. మారకం కోసమే ఉత్పత్తయ్యే సరుకులు ఏర్పడ్డాయి, కాని తక్కువగా ఉండేవి. అంటే అప్పటి సరుకు ఉత్పత్తి లక్ష్యం ప్రధానంగా వాడకం, మారకం కాదు. ఇక, పెట్టుబడిదారీ విధానంలో తయారైనవన్నీ సరుకులే. పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి మారకం కోసమే సాగుతుంది. ఆవిధానం వేళ్ళూనుకునే కొద్దీ, ప్రతిదీ సరుకవుతుంది. **సరుకు ఉత్పత్తి సార్వత్రికం అవుతుంది. ప్రతిదీ సరుకు అవడమే పెట్టుబడిదారీ విధానపు విశిష్టలక్షణం.**

అయితే సరుకులు లేని కాలం లేదా? ఉంది. చరిత్రలో సరుకులు లేకుండా గడచిన కాలమే ఎంతో ఎక్కువ. అంటే వస్తువుల మారకాలు లేకుండానే మానవులు దీర్ఘకాలం గడిపారు. సరుకులు లేనప్పుడు ఏవి ఉండేవో చూచి, తిరిగి సరుకు వద్దకు వద్దాం. ప్రకృతిలో దొరికిన వస్తువులు (ప్రకృతి ఉత్పాదితాలు) వాడుకొని బతికారు. శ్రమ ఉత్పాదితాలు కూడా మారకం లేకుండానే వినియోగంలోకి వచ్చేవి.

మనిషి వాడే వస్తువులు రెండు రకాలు

1. మనిషి శ్రమ కలవనివి – **ప్రకృతి ఉత్పాదితాలు**

విశ్వం పదార్థంతో నిండి ఉంటుంది. పదార్థం (matter) వస్తువుల రూపాల్లో ఉంటుంది. అనేక వస్తువులు ప్రకృతి ఉత్పాదితాలు. కొండలూ, అడవులూ, నదులూ సముద్రాలూ, గనులూ, గ్రహాలూ, గాలీ, నీరూ మొదలైనవెన్నో లెక్కించలేనన్ని ఉన్నాయి. ఇవన్నీ మనిషికి ముందునించే వున్నాయి. మనిషి శ్రమ కలవకుండా ప్రకృతి చర్యలవల్ల ఏర్పడ్డవి. ఇవి ప్రకృతి ఉత్పాదితాలు.

2. మనిషి శ్రమ కలిసినవి – **శ్రమ ఉత్పాదితాలు**

బట్టలూ, చెప్పులూ,కుర్చీలూ, సైకిళ్ళూ, కార్లూ, ఫాన్లూ, సెల్ ఫోన్లూ టి.వీలూ వగయిరా. ఇవి మనిషి శ్రమ వల్ల తయారయినవి. ఇవి మనిషి శ్రమ కలిసిన వస్తువులు. శ్రమ ఉత్పాదితాలు.

శ్రమ ఉత్పాదితానికి 'మూలాధార వస్తువు' ప్రకృతి ఉత్పాదితమే. ప్రకృతి ఉత్పాదితం లేకుండా మనిషి శ్రమ మొదలుకాదు. మట్టి లేనిదే కుండలు చేసే శ్రమ మొదలుకాదు. తేనెతుట్టె

లేనిదే తేనెపిండే శ్రమ ఉండదు. ఏ శ్రమ ఉత్పాదితానికైనా 'మూలాధారవస్తువు '(substratum) ప్రకృతి ఉత్పాదితమే. మనిషి శ్రమ చేసేది అప్పటికే వున్న వస్తువు మీదే. ప్రకృతి చర్యల వల్ల మాత్రమే తయారైన వస్తువుల మీదే. దీన్నిబట్టి మనిషి ఉత్పత్తిచేసే వస్తువులు రెండు అంశాల సమ్మేళనాలు – ప్రకృతి ఇచ్చిన వస్తువూ, దాని రూపం మార్చే మనిషి శ్రమా. "సంపదకు ...శ్రమ ...ఎంత వనరో ప్రకృతి కూడా అంతే వనరు"[2]

అయితే ప్రకృతి తయారుచెయ్యని, చెయ్యలేని అనేక వస్తువుల్ని మనిషి చేశాడు. ఒక నట్టో బోల్టో ప్రకృతిలో కనబడదు. చెప్పులో, చొక్కాలో, రొట్టెలో ప్రకృతిలో దొరకవు. అలాంటివి లక్షల సంఖ్యలో మనిషి తయారు చేసుకున్నాడు. రోజురోజుకీ వీటి సంఖ్య పెరుగుతున్నది. మానవుడు ఈనాడు ప్రకృతి ఉత్పాదితాలతో పాటు తన శ్రమ ఉత్పాదితాలనూ వాడుకుంటున్నాడు.

## సరుకు విశ్లేషణ

పెట్టుబడిదారీ సమాజంలో శ్రమ ఉత్పాదితం (శ్రమతో తయారైన వస్తువు) సరుకు రూపంతీసుకుంటుంది.

శ్రమతో తయారైన వస్తువు మారకంలో పడుతుంది. మారకం కాకుండా వాడకానికి రాదు. శ్రమ ఉత్పాదితం సరుకురూపం పొందుతుంది అంటే అర్థం ఇదే. శ్రమ ఉత్పాదితం సరుకు అయింది. కనక పరిశోధన సరుకు విశ్లేషణతోనే మొదలు కావాలి. మార్క్సు లక్ష్యం: పెట్టుబడిదారీ సమాజ చలననియమాన్ని బయటపెట్టడం. అందుకోసం మొదట పెట్టుబడిదారీ సమాజ ఆర్థిక జీవకణం (economic cell) అయిన సరుకుని విశ్లేషించి తీరాలి – సరుకు కనపడే రూపంతో, సరుకు భావనతో కాదు. ఆయన విశ్లేషణలో సరుకు గురించి తేలిన విషయాలు:

1. సరుకు మనకు బయట ఉండే వస్తువు

   ఒక సరుకు అది స్టవ్ కావచ్చు, మందు బిళ్ల కావచ్చు, ఫానో, దోమల బాటో కావచ్చు. అది ఏదైనా మనకు బయట వుండే వస్తువే.

2. ప్రతి సరుకూ ఏదో ఒక కోరికని, అవసరాన్ని తీరుస్తుంది

   వంటకి స్టవ్ అవసరం. జ్వరం వస్తే మందు బిళ్ల వెయ్యాలి. గాలికోసం ఫాన్, దోమలు పీకుతుంటే బాట్ కావాలి.

3. వస్తువులు తీర్చే కోర్కెలు పొట్టలో పుట్టినవైనా, మనసులో ఏర్పడినవైనా, తేడా ఉండదు. ఆకలైతే రొట్టో, పండో ఏదో ఒకటి తినాలి. పిల్లవాడికి ఆడుకోడానికి నచ్చిన బొమ్మ కావాలి. ఒకటి ఆకలి తీర్చేది, మరొకటి మనసుకి కలిగిన కోరిక తీర్చేది. కోర్కెలు ఎలాటివైనా, వాటి స్వభావం ఏదైనా, తేడా ఉండదు.

4. ఒక వస్తువు కోర్కెల్ని ఎలా తీర్చినా ఒకటే. ఒక వస్తువు ప్రత్యక్షంగా జీవితావసర వస్తువుగా (బొక్కెనగా) కోరిక తీరుస్తుందా, లేక పరోక్షంగా (బొక్కెన) ఉత్పత్తికి అవసరమైన వస్తువుగా కోరిక తీరుస్తుందా అనే పట్టింపు ఉండదు. అలా తీర్చినా, ఇలా తీర్చినా తేడాలేదు. తీర్చగల సత్తా వుంటే సరి.

దప్పిక తీర్చుకోడానికి నీరుకావాలి. నీటిని తోడటానికి తాడు బొక్కెన కావాలి. ఆ బొక్కెన తయారుచేసే వాడికి రేకు, కడ్డీ, తాపడం చీలలూ కావాలి. కొలిమి సామాను, బొగ్గులూ, సుత్తీ, శానం వగయిరా ఉండాలి. వాటిలో ప్రతిదీ ఏదో అవసరాన్ని తీర్చేదే.

5. ప్రయోజనకరమైన ప్రతివస్తువూ ఎన్నో ధర్మాల సమ్మేళనం. అందువల్ల అది ఎన్నోవిధాలుగా ఉపయోగ పడుతుంది. నీరు దప్పిక తీరడానికీ, వంటకీ, ఐస్ తయారీకీ, మురికి కడగడానికీ, వ్యవసాయానికీ, ఆవిరి యంత్రం నడిపేందుకు, నిప్పుని ఆర్పడానికి ఉపయోగపడుతుంది. ఇంజన్లు చల్లబరచడానికీ, విద్యుదుత్పత్తికీ, గుంపుల్ని చెదరగొట్టడానికీ పనికొస్తుంది.

   భిన్న ప్రయోజనాలున్న వస్తువులు గుణాత్మకంగా భిన్నమైనవి. స్పూనూ, గిన్నే, పళ్ళెమూ స్టీల్ వే కావచ్చు. కాని వాటి ఆకారాల్లో తేడాల వల్ల ప్రయోజనాలు వేరుగా ఉంటాయి. అవి గుణాత్మకంగా భిన్నమైన వస్తువులు. ఒకే ఆకారంలో ఉన్నా, బూరా, ఫుట్ బాలూ, ఒక ఇనపగుండూ ఒకటి కావు. తయారీకి వాడిన పదార్థంలో తేడావల్ల వాటి గట్టితనంలో తేడాలుంటాయి. గట్టితనం ఒక భౌతిక ధర్మం. నీరూ, ఆనీటితో తయారైన ఆవిరీ, ఐసూ గుణాత్మకంగా భిన్నమైనవి.

6. కాలక్రమంలో వస్తువుల కొత్త ప్రయోజనాలు తెలుస్తాయి. మనిషి ఆలోచనలూ, అవసరాలూ పెరిగేకొద్దీ, కొత్తకొత్త అవిష్కరణలు వచ్చేకొద్దీ, చరిత్ర నడిచే క్రమంలో వస్తువుల వివిధ ప్రయోజనాలు తెలుస్తాయి. అందుబాటులోకి వస్తాయి. ఆవిరి ఇంజన్ కనుక్కోకముందు నీటిని ఇంజన్ నడపడానికి వాడలేదు. అయితే నీటికి ఆ ప్రయోజనం అంతకు ముందుకూడా ఉంది. విద్యుత్ కనుగొన్నాక రాగితీగ మంచి వాహకం అయింది. రాగి గురించి క్రీ.పూ. 4000 సంవత్సరాలనాడే తెలుసు. నాగలి కర్రూ, గొడ్డళ్ళూ రాగితో చేసేవారు. రాగిరేకుల్ని ఇంటి కప్పుకి వాడారు. ఇప్పుడెవరు అలా వాడడం లేదు– రాగికి ఆప్రయోజనం అలానే ఉన్నప్పటికీ.

7. వస్తువుల్ని కొలిచే ప్రమాణాలు మారుతూ ఉంటాయి – అరటి పళ్ళు డజన్లలో, కాగితాలు దస్తాల్లో, రీముల్లో చెబుతాం. సిరా ఔన్సుల్లో, బట్టలు గజాల్లో మీటర్లలో చెబుతాం. బరువుని గ్రాముల్లో చెబుతాం. అయితే అన్నిచోట్లా ఒకే కొలత ప్రమాణాలు ఉండవు. కొన్ని దేశాల్లో దూరాన్ని కిలోమీటర్లలో చెబుతుంటే, కొన్ని దేశాల్లో మైళ్ళలో చెబుతారు. బరువుని కొన్ని దేశాల్లో పౌన్లలో చెబుతుంటే, కొన్ని దేశాల్లో కిలోగ్రాముల్లో చెబుతారు.

   ఒకే చోటయినా అన్ని కాలాలలో ఒకే ప్రమాణాలు లేవు. పూర్వం బారలూ మూరలూ వేసి పొడుగు కొలిచేవారు. ఆతర్వాత అడుగులూ గజాలూ వచ్చాయి. ప్రస్తుతం మీటర్లు అమల్లో ఉన్నాయి. బరువుని నేడు కిలోగ్రాముల్లో చెబుతున్నాం. ఒకప్పుడు సేర్లు, మణుగుల్లో చెప్పేవాళ్ళు. ఇంతెందుకు ఇంతకుముందు ధాన్యాన్ని మానికలతో కొలిచేవారు. మరి నేడు అదే ధాన్యాన్ని తూస్తున్నాం. అంటే కొలత ప్రమాణాలూ, పద్ధతులూ ప్రాంతాల్ని బట్టీ, కాలాన్ని బట్టీ మారుతూ ఉంటాయి.

8. ఒక వస్తువు ప్రయోజనమే (utility) ఆవస్తువుని ఉపయోగపు విలువగా చేస్తుంది. అది గాలిలో నుండి వచ్చేది కాదు. అది సరుకు ధర్మాలను బట్టి ఉంటుంది. కాబట్టి ఆ సరుకు నించి విడిగా దానికి అస్తిత్వం ఉండదు. అంటే, ఒక వస్తువు ప్రయోజనం ఆ వస్తువు

నుండి విడిగా వుండజాలదు. కొయ్యడం అనే ప్రయోజనం బ్లేడుకో, చాకుకో ఉంటుంది. వాటితో సంబంధం లేకుండా ఉండదు. ఏవస్తువు ప్రయోజనాన్నైనా ఆవస్తువునించి విడదీయలేం.

9. ఏదైనా, అది భౌతిక వస్తువు అయిన మేరకు– ఉపయోగపు విలువ, ఒక ఉపయోగకరమైన వస్తువు. ఇనుము, ధాన్యం, లేక వజ్రం వగయిరా.

10. సరుకు తన ప్రయోజనకర లక్షణాన్ని పొందడానికి కొంత శ్రమ అవసరమవుతుంది. ఆయితే ఆ శ్రమ ఎంత అనే దానితో ఆసరుకు ప్రయోజనానికి ఏమాత్రం నిమిత్తం ఉండదు. ఒక వస్తువు ఉత్పత్తికి పట్టిన శ్రమ పరిమాణానికీ, దాని ప్రయోజనానికీ సంబంధం ఉండదు. అంటే, ఒకవస్తువు తయారీకి పట్టే కాలాన్ని బట్టి దాని ప్రయోజనం మారదు. ఎక్కువ బడితే దాని ప్రయోజనం పెరగదు. తక్కువ బడితే దాని ప్రయోజనం తగ్గదు. "ఏదయినా కొత్త పరికరం కనిపెట్టినందువల్ల, రొట్టె తయారీకి పట్టే శ్రమలో 95 శాతం తగ్గినా రొట్టె ప్రయోజనంలో మార్పు రాదు"[3].

    వేరొకచోట గోధుమలు "అలాగే మంచులాగా ఆకాశం నుండి కురిసినా వాటి ఉపయోగపు విలువని ఏమాత్రం కోల్పోవు"[4].

11. ఉపయోగించడం వల్లనో లేక వినియోగించడం వల్లనో మాత్రమే ఉపయోగపు విలువ యధార్థమవుతుంది. చెప్పులు వేసుకోవాలి, చొక్కా తొడుక్కోవాలి. అలా వాడడం వల్ల ఉపయోగపు విలువ యధార్థమవుతుంది.

12. ఉపయోగపు విలువలు సమస్త సంపద యొక్క సారాంశం అయివుంటాయి – ఆసంపదయొక్క సామాజిక రూపం ఏదయినా సరే.

ఒక వస్తువు ఏ సామాజిక సంబంధాలలో ఉత్పత్తయింది? అనే విషయం దాని ప్రయోజనానికి అనవసరం.

ఈ సంబంధాలు ఆదిమ, బానిస, భూస్వామ్య, పెట్టుబడిదారీ సమాజాల్లో భిన్నమైనవిగా వుంటాయి. అయితే ఉపయోగపు విలువకు ఈతేడాలతో సంబంధం ఉండదు. మార్క్స్ మాటల్లో:

"గోధుమల్ని రుచిచూచి వాటిని పండించింది రష్యన్ భూదాసుడో, ఫ్రెంచ్ రైతో, ఇంగ్లిష్ పెట్టుబడిదారుడో చెప్పడం సాధ్యం కాదు" [5] అలాగే "గోధుమల్ని పండించింది బానిసైనా, భూదాసుడైనా, స్వేచ్ఛాశ్రామికుడైనా ఒకే ఉపయోగపు విలువను కలిగి వుంటాయి." [6] దీన్ని బట్టి "ఉపయోగపువిలువ అత్యంత భిన్నమైన ఉత్పత్తి విధానాలకు ఉమ్మడి అంశం" [7]

సరుకుని ఉపయోగపు విలువగా ఇంతగా వివరించాక, సరుకుని మారకం విలువగా పరిశీలిస్తాడు.

### సరుకు ఉపయోగపు విలువ మాత్రమే కాదు, మారకం విలువ కూడా

ఉపయోగపు విలువలు (లేక ప్రయోజనకరవస్తువులు) ఈవ్యవస్థలో మారకం విలువకు వాహకాలుగా కూడా ఉంటాయి. అంటే వస్తువులు ఉపయోగపు విలువలే కాదు, మారకం విలువలు కూడా.

## మారకం విలువ, లేదా విలువ రూపం

ఉపయోగపువిలువ రూపం అంటే సరుకు భౌతికరూపమే. ఏవస్తువుకైనా భౌతిక రూపం ఉంటుంది. అది కేవలం ఉపయోగపువిలువే అయినా, సరుకయినా. అయితే, సరుకైన వస్తువుకి మాత్రం, భౌతిక రూపానికి తోడు విలువరూపం కూడా ఉంటుంది. పెట్టుబడి తొలి అధ్యాయంలో ఆయన వివరించదల్చుకున్నది దీన్నే – సరుకు విలువరూపాన్నే.

## విలువ రూపం విశ్లేషణ

తొలిచూపుకి మారకం విలువ పరిమాణాత్మక సంబంధంగా, ఒకరకం సరుకులు మరొక రకం సరుకులతో మారే నిష్పత్తిగా, బయటపడుతుంది. స్థలకాలాల్ని బట్టి ఎప్పటికప్పుడు మారే సంబంధంగా అన్నమాట.

20 గజాలబట్ట ఒక కోటుతో మారితే, మారక నిష్పత్తి 20:1

20 గజాలబట్ట = 1 కోటు  అనే సమీకరణ దీన్ని తెలుపుతుంది. బట్టా కోటూ ఏ పరిమాణాల్లో సమానమవుతాయో తెలుపుతుంది. అంటే, మారకం విలువ పరిమాణాత్మక సంబంధంగా మొదట కనిపిస్తుంది.

అయితే ఆ నిష్పత్తి అన్నిచోట్లా అలాగే ఉండదు. ఒకే చోటైనా, అన్ని కాలాల్లో అలాగే ఉండదు. మారుతూ ఉంటుంది.

ఉదాహరణకి, ఒకప్పుడు ఒక అరేబియా తెగ, ఒక పౌను ఇనుముకి 10 పౌన్ల బంగారం ఇచ్చింది.  అంటే,  పౌను ఇనుము = 10 పౌన్ల బంగారం

ఒక పౌను వెండికి 2 పౌన్ల బంగారం ఇచ్చింది. అంటే,

పౌను వెండి = 2 పౌన్ల బంగారం. అప్పట్లో వెండి, బంగారం, మారిన నిష్పత్తి 1:2. అయితే 1865 ప్రాంతంలో వెండి, బంగారం మారిన నిష్పత్తి 15:1; 1890 లో 22:1. ఇండియాలో వైదిక కాలంలో వెండి, బంగారం సరికి సరి మారేవి.

అల్యూమినియమైతే మరీ ఆశ్చర్యం కలిగిస్తుంది. 1850లలో అల్యూమినియం, వెండి బంగారాలకన్నా విలువయింది. మూడవ నెపోలియన్ ఇచ్చిన విందులో, పరివారానికి బంగారం వెండి పళ్ళాల్లో పెట్టి, రాజులకి అల్యుమినియం పళ్ళాల్లో పెట్టేవాడు. అంటే అల్యూమినియం అప్పట్లో వెండి బంగారాలకంటే విలువైనది.  పౌను అల్యూమినియం 550 డాలర్లుండేది. 50 ఏళ్ళతర్వాత 25 సెంట్లకు పడిపోయింది. మామూలుగా కిలో పొటాటోలకి 4 కిలోల టొమాటోలొస్తాయి. అదే ఎండాకాలంలో ఒక్కొక్కప్పుడు కిలో టోమాటోలకు 4 కిలోల పోటాటోలొస్తాయి. ఇది అందరికీ అనుభవమే.

అందువల్ల, మారకం విలువ ఏదో యాదృచ్ఛికమైనదైనట్లూ, కేవలం సాపేక్షమైనదైనట్లూ అగపడుతుంది. ఫలితంగా అంతర్గత విలువ, అంటే సరుకుల్లో అంతర్గతంగా ఉండి, ఆ సరుకులనుండి విడిదీయరాని మారకం విలువ స్వయం విరుద్ధం అనిపిస్తుంది.

### తార్కిక వైరుధ్యం

సరుకులు మారకం విలువకు నిలయాలు. అంటే, సరుకులో అంతర్గతంగా మారకం విలువ ఉంటుందని అర్థం. అయితే మారకం విలువ రెండు సరుకుల సంబంధంగా బయటపడుతుంది. కాబట్టి మారకం విలువని ఒక సరుకుకి ఆపాదించడం కుదరదు. కనక అది సాపేక్షమైనది. మరొక అర్థంలో కూడా ఇది సాపేక్షం. మారక పరిస్థితుల్ని బట్టి – స్థల కాలాలను బట్టి – మారే పాళ్ళు ఎప్పటికప్పుడు, ఎక్కడికక్కడ  మారుతుంటాయి. మారకం విలువ  అమ్మేవాని, కొనేవాని ఇష్టాయిష్టాల పైన ఆధారపడి ఉన్నట్లు అనిపిస్తుంది.

ఫ్రెంచ్ తత్వవేత్త కాండి లాక్ (1714–1780) అన్నట్లు అది "మనకోర్కెలతో సరుకుల యొక్క సంబంధంగా మాత్రమే  ఉండేదిగా" కనిపిస్తుంది. అలా అయితే, ఆ నిష్పత్తిని నిర్ణయించే అంశం ఆసరుకుల్లో ఉండ కూడదు. ఇంగ్లిష్ ఆర్థికవేత్త బార్బాన్ (1640–1698) అన్నట్లు "దేనికీ అంతర్గత విలువ ఉండదు" అనాల్సి వస్తుంది. అంటే, సరుకులో విడదీయరాని లంకెలో ఉండే మారకంవిలువ స్వయం వైరుధ్యం అనిపిస్తుంది.

**సరుకులో అంతర్గతంగా మారకం విలువ ఉంటుందని ఒకచోటా, ఉండదని మరొకచోటా చెప్పడం తార్కిక వైరుధ్యం కదా!** పరస్పరవిరుద్ధమైన దాన్ని సిద్ధాంతానికి ఆధారం చేసుకోకూడదు. అందుకే విషయాన్ని ఇంకొంత లోతుగా పరిశీలించాలి అంటాడు. ఇలాంటి చిక్కులు వచ్చినప్పుడల్లా మార్క్స్ లోతుగా పరిశీలించాలి అంటాడు.

పరిశీలించి, ఇందులోవైరుధ్యమేమీ లేదని తన తర్కంతో తేలుస్తాడు:

ఒక సరుకు మారకం విలువని మిగిలిన అన్నిసరుకుల భిన్న పరిమాణాల్లో చెప్పవచ్చు. కనక మిగిలిన  సరుకులు కూడా ఆయాపరిమాణాల్లో, ఒకదానికొకటి సమానం. ఒకదాని స్థానంలో మరొకదాన్ని పెట్టవచ్చు.

ఒకరకం సరుక్కి ఒక మారకం విలువ కాదు, ఎన్నో మారకం విలువలుంటాయి.

ఉదాహరణకి, ఒక సరుకు – 10 కిలోల గోధుమలు 6 లీటర్ల పాలతోనో, 7 సబ్బులతోనో 6 కిలోల చక్కెరతోనో మారతాయి. 10 కిలోల గోధుమలకు అన్ని ఇతర సరుకులతో  మారకం కుదురుతుంది– భిన్న పరిమాణాల్లో.

గోధుమలకు ఒక మారకం విలువకాకుండా, 3 మారకం విలువలున్నాయి. ఇంకా ఎన్నైనా ఉండవచ్చు అయితే, 6 లీటర్ల పాలూ, 7 సబ్బులూ, 6 కిలోల చక్కెరా – ప్రతిదీ 10 కిలోల గోధుమల మారకం విలువకు ప్రాతినిధ్యం వహిస్తుంది. కనుక మారకం విలువలుగా అవి ఒకదాని స్థానంలో మరొకటి ఉండగలవు. దానర్థం అవి ఒకదానితో మరొకటి సమానం అని.

అంటే, నిష్పత్తులు ఏవైనా కావచ్చు గాని, ఒక సరుక్కి అనేక మారకం విలువలు ఉంటాయి. అవన్నీ 10 కిలోల గోధుమల మారకం విలువకి ప్రతినిధులుగా ఉంటాయి. దీన్నిబట్టి, అవి ఒకదానికొకటి సమానమై తీరాలి.

**మారకం విలువ నుండి విలువకి**

దీన్నించి తన సిద్ధాంతానికి అతి ముఖ్యమైన రెండు నిర్ధారణలు రాబడతాడు:

1) మొదటి విషయం, ఒక సరుకు మారకం విలువలు ' ఏదో ' సమానమైన దాన్ని వ్యక్తం చేస్తాయి.

2) రెండో విషయం, మారకం విలువ అనేది దానిలోనే వుండి, దానినుండి వేరైనదిగా గమనించదగ్గ 'దాని' వ్యక్తీకరణ పద్ధతి (mode of expression), దృగ్గోచర రూపం (phenomenal form). 'దానిలోనే ఉండి' అంటే 'సరుకులోనే ఉండి' అని. సరుకులో ఏదో ఉంది. దాన్ని సరుకునుండి వేరైనదిగా గమనించవచ్చు. దాన్ని వ్యక్తీకరించే పద్ధతే మారకం విలువ. దాని దృగ్గోచర రూపమే మారకం విలువ.

మరి, మారకపు విలువ వ్యక్తీకరిసున్నది దేన్ని? అది దేని దృగ్గోచర రూపం?

దీన్ని తేల్చడానికి, మారక సంబంధాన్ని పరిశీలిస్తాడు: ఉదాహరణకి,

1 కిలో గోధుమలు = 2 కిలోల ఇనుం

ఈసమీకరణ మనకి ఏమి చెబుతుంది? అని ప్రశ్నిస్తాడు. తానే సమాధానం చెబుతాడు.

రెండు భిన్న వస్తువుల్లో – 1కిలో గోధుమల్లోనూ 2 కిలోల ఇనుం లోనూ – ఒకే సారం ఉన్నదని. ఆసారం ఒకే పరిమాణంలో ఉన్నదని.

ఈ రెండు వస్తువుల్లో ఏదో అంశం (సారం) ఉంది. అది గోధుమా కాదు, ఇనుమూ కాదు. మరొకటి. అందులోనూ ఉంది ఇందులోనూ ఉంది. కాని అదీ ఇదీ కాని మూడోది. ఈ రెండు వస్తువులూ ఆమూడో ఉమ్మడి అంశానికి సమానమై ఉండాలి. ఆ ఉమ్మడి అంశం గోధుమా కాదు, ఇనుమూ కాదు.

"రెంటిలో ప్రతి ఒకటీ మూడోదానికి మార్చబడాలి". ఈరెండు వస్తువుల్లో ఒకే సారం వున్నది. అది వేర్వేరు వస్తువుల్లో వేర్వేరు పరిమాణాల్లో ఉంటుంది. అన్ని సరుకుల్లోనూ అంతే. కనక అన్ని సరుకులూ భిన్న పరిమాణాల్లో, ఒకే సారాన్ని ఒకేపరిమాణంలో కలిగి ఉంటాయి. కాబట్టి, ఆ ఉమ్మడి సారం రీత్యా సమానమౌతాయి.

ఉదాహరణకి, 10 కిలోల గోధుమలు = 6 లీటర్ల పాలు
= 7 సబ్బులు
= 6 కిలోల చక్కెర

ఆసారం 10 కిలోల గోధుమల్లో ఎంత ఉందో, 6 లీటర్ల పాలలో అంతే వుంది, 7 సబ్బుల్లోనూ, 6 కిలోల చక్కెరలోనూ అంతే ఉంది అని అర్థం. ఒకేసారం, ఒకే పరిమాణంలో ఉన్నందువల్ల ఈ 4 వస్తువులూ ఆసారం రీత్యా సమానమౌతాయి.

మారక సంబంధాల్లో ఈసారం ఒక్కటే లెక్కకొస్తుంది. దాని పరిమాణమే సరుకులు మారే పాళ్ళని నిర్ణయిస్తుంది. మరే ఇతర అంశమూ లెక్కకి రాదు. కనక ఈసారం, ఆ ఉమ్మడి అంశం ఏదో కనిపెట్టడం తప్పనిసరి.

## సమపరిచే సారం, ఆ ఉమ్మడి అంశం ఏది?

ఆ అంశం సరుకులకుండే సహజ ధర్మం కాకూడదు. ఎందుకంటే, అటువంటి ధర్మాలు ఆయా సరుకుల ప్రయోజనాన్ని ప్రభావితం చేస్తాయి. వాటిని ఉపయోగపు విలువలుగా చేస్తాయి. అయితే సరుకుల మారకం అనేది స్పష్టంగా ఉపయోగపు విలువని పూర్తిగా పక్కనబెట్టే చర్య. మారకానికి సంబంధించి అన్ని ఉపయోగపు విలువలూ ఒకటే. తగిన పరిమాణాల్లో ఉంటే చాలు. బార్బన్ అన్నట్లు: ఒకరకం వస్తువులు మరొకరకం వస్తువుల వంటివే – వాటి విలువలు సమానమైతే. సమాన విలువలున్న వస్తువులకు తేడా ఉండదు. 100 పౌన్ల విలువ వున్న వెండి, లేక బంగారం ఎంత ఎక్కువ విలువైనవో, 100 పౌన్ల విలువ వున్న సీసమూ లేక ఇనుమూ అంతే విలువైనవి. సరుకులు ఉపయోగపు విలువలుగా వేర్వేరు గుణాలుగల వస్తువులు. అయితే మారకం విలువలుగా వేర్వేరు పరిమాణాలుగలవి. పర్యవసానంగా, అవి అణుమాత్రమైనా ఉపయోగపు విలువను కలిగి ఉండవు.

సరుకుల ఉపయోగపు విలువని పట్టించుకోకుండా పక్కనపెడితే, వాటిలో ఒక ఉమ్మడి ధర్మం మిగిలి ఉంటుంది. ఆధర్మం: అవన్నీ శ్రమతో తయారయినవి కావడమే. శ్రమ ఉత్పాదితం సైతం మన చేతుల్లో మార్పు చెందింది. దాని ఉపయోగపు విలువని వదిలేస్తున్నాము. అంటే, దాన్ని ఉపయోగపు విలువగా చేసిన భౌతిక అంశాల్నీ, ఆకారాల్నీ సైతం వేరు పరుస్తున్నాం. ఇక మనం దానిలో ఒక బల్లనో, ఇల్లునో, దారాన్నో మరేదన్నా ప్రయోజనకర వస్తువునో చూడం. ఒక భౌతిక వస్తువుగా దాని ఉనికే ఉండదు. కొయ్యపనివాని, తాపీపనివాని, వడికేవాని లేక మరో రకం పనిచేసేవాని శ్రమ ఉత్పాదితంగానో దాన్ని పరిగణించం. ఉత్పాదితాల ప్రయోజనకర లక్షణాలతో పాటుగా, వాటిలో ఇమిడి వున్న వివిధరకాల శ్రమల ప్రయోజనకర స్వభావాన్ని కూడా పక్కన పెడతాము. ఆ శ్రమయొక్క నిర్దిష్ట రూపాల్ని పట్టించుకోము. ఇక వాటిలో మిగిలేదేమిటంటే: వాటిలో ఉమ్మడిగా ఉన్న ఒకేరకమైన శ్రమ, అనిర్దిష్ట మానవ శ్రమ. ఒకేరకమైన అభౌతిక వాస్తవికత, గడ్డ కట్టిన ఒకేతరహా మానవ శ్రమ. ఖర్చయిన పద్ధతితో నిమిత్తంలేని శ్రమశక్తి వ్యయం.

అది (అటువంటిశ్రమ) ఏవస్తువులో రూపొందినా – అది బంగారమైనా, ఇనుమైనా, గోధుమలైనా, సిల్కయినా ఒకటే. ఆక్సిజన్ తుప్పుఇనుంలో ఉన్నా, వాతావరణంలో ఉన్నా, ద్రాక్ష రసంలో ఉన్నా, మనిషి రక్తంలో ఉన్న ఆక్సిజన్ ఒకటే అయినట్లు.[8]

అంటే, శ్రామికుల వైయక్తిక లక్షణాలు వదలివేసిన శ్రమ. ఆవిధంగా మారకం విలువని సృజించే శ్రమ సాధారణ అనిర్దిష్ట శ్రమ (abstract general labour)[9]. ఇతర ఆర్థిక వేత్తలు పట్టుకోనిదీ, మార్క్స్ తన విశ్లేషణ ద్వారా కనిపెట్టింది దీన్నే, అనిర్దిష్ట శ్రమనే. కనిపెట్టింది నేనే అని చెప్పుకున్నాడు కూడా.

అలా దాని లోనే ఉండి, దానినుండి వేరుగా గమనించదగ్గ దాన్ని మార్క్స్ విలువ అన్నాడు. ఆవిధంగా మారకపువిలువ వెనక ఉన్న విలువని పట్టుకున్నాడు. విలువ అనేది మారకపు విలువ కాదు వేరొక భావాభివర్గం (category).

## విలువా, మారకపు విలువా ఒకటి కాదు

"శ్రమ వుత్పాదితం ఏ సామాజిక రూపంలో కనబడుతుందో ఆ రూపంలో దాన్ని విశ్లేషించాను. ఒకవైపున అది తన సహజరూపంలో ఉపయోగకరమయిన వస్తువు. మరోవైపు, మారకపు విలువకు వాహకం. ఈ దృష్ట్యా, దానికదే మారకపు విలువ. మారకపువిలువ గురించిన తదుపరి విశ్లేషణలో మారకపు విలువ కేవలం 'అగపడే రూపం' అనీ, సరుకులోవున్న విలువని తెలిపే స్వతంత్ర మార్గం అనీ, తేలింది. అప్పుడు నేను విలువ విశ్లేషణకు బయలుదేరాను. అందువల్ల నేను కాపిటల్ రెండోముద్రణ 36 పేజీలో బహిరంగంగా ప్రకటించాను: ఈచాప్టర్ మొదట్లో వాడుక మాటల్లో (common parlance) సరుకు ఒక వుపయోగపు విలువా లేక ప్రయోజనకర వస్తువూ, ఒక మారకంవిలువా అన్నప్పుడు, నిక్కచ్చిగా చెప్పాల్సొస్తే మేము తప్పు. సరుకు ఒక వుపయోగపు విలువా లేక ప్రయోజనకర వస్తువూ, ఒక విలువా."[10]

"సరుకు ఒకవైపు వుపయోగపు విలువ, మరొకవైపు విలువ, మారకపు విలువ కాదు. ఎందుకంటే కనబడేరూపం దాని సొంత సారం కాదు గనక"[11] "నాదృష్టిలో, సరుకు విలువ దాని వుపయోగపు విలువాకాదు, మారకపు విలువా కాదు."[12] ఆవిధంగా విలువనీ, మారకం విలువనీ భిన్నమైనవిగా స్పష్టపరుస్తాడు.

అంతకు ముందు ఆర్థికవేత్తలకు విలువకూ, విలువ రూపానికీ తేడా తెలియదు. ఈ తేడాని గ్రహించి మార్క్స్ ముందుకు పోతాడు.

సరుకులన్నిటిలోనూ ఉండి, ఒకే ప్రమాణంతో కొలవడానికి వీలయిన ఆ సారాన్ని మార్క్స్ విలువ అంటాడు. "సరుకులు మారకం అయినప్పుడల్లా, సరుకుల మారకం విలువలో బయటపడే ఆ ఉమ్మడిసారమే వాటి విలువ"[13].

దీన్నిబట్టి మార్క్స్‌కి విలువ వేరూ, మారకం విలువ వేరూ. రెండూ రెండు భావాభివర్గాలు.

**మరి, ఈ విలువ పరిమాణాన్ని కొలిచేదెలా?** ఆ వస్తువులో ఉన్న విలువని సృజించే శ్రమ పరిమాణాన్ని బట్టి, అనేది స్పష్టమే. శ్రమ ఎంత సేపు జరిగింది అనేదాన్ని బట్టి, శ్రమ పరిమాణం కొలత కొస్తుంది. శ్రమకాలం పరిమాణం వారాల్లో, రోజుల్లో, గంటల్లో ఉంటుంది. ఒక బ్రష్ తయారీకి 2 గంటలు పట్టి, కొడవలి తయారీకి 4 గంటలు పడితే 2 బ్రష్‌ల విలువా, ఒక కొడవలి విలువా సమానం.

**ఇక్కడ చిన్న చిక్కు.** ఏమంటే అన్నిరకాల శ్రమలూ ఒకే కాలంలో ఒకే విలువని ఏర్పరుస్తాయా?

ఒక గంట గుంట తీసే శ్రమా, మెదడు ఆపరేషన్ చేసే డాక్టర్ శ్రమా ఒకే విలువని ఏర్పరుస్తాయా?

గుంట తవ్వే శ్రమకి పెద్దగా శిక్షణ పనిలేదు. కాని డాక్టర్ కావడానికి కొన్ని సంవత్సరాల శిక్షణ అవసరం. చిన్నప్పటి నించే ఎవరైనా గుంటలు తవ్వగలరు. కాని మెదడు ఆపరేషన్ చేసే వైద్యుడికి కనీసం 30 సంవత్సరాల వయసు దాటుతుంది. పైగా ప్రతి వైద్యుడూ చెయ్యలేదు. అందుకు మరికొంత ప్రత్యేక శిక్షణ అవసరం. అతనిది నిపుణ శ్రమ. గుంటతీసే శ్రమ సాదా శ్రమ.

**నిపుణ శ్రమ.** నిపుణ శ్రమ పరిమాణం, సాదాశ్రమ పరిమాణానికి ఎన్నోకొన్ని రెట్లుంటుంది. ఉదాహరణకి, ఒక గంట కోటు కుట్టే శ్రమ, 3 గంటలు మట్టిమోసే శ్రమకు సమానం కావచ్చు. నెక్లెస్‌లో వజ్రాలు పోదిగే శ్రమ కోటుకుట్టే శ్రమకి, 5 రెట్లుండవచ్చు. గుండె ఆపరేషన్ చేసే శ్రమ వజ్రాలు పొదిగే శ్రమకి 100 రెట్లుండచ్చు. ఒకగంట నిపుణ శ్రమ మరిన్ని గంటల సాదాశ్రమకు సమానమవుతుంది.

**ఇక్కడ ఒక సందేహానికి ఆస్కారం ఉంది.** పనివాడు ఎంత సోమరి అయితే, ఎంత తక్కువ నిపుణుడు అయితే అంత ఎక్కువ శ్రమ పడుతుంది. అందువల్ల ఆసరుక్కి అంత ఎక్కువ విలువ ఉంటుందా అన్నదే ఆసందేహం.

ఒకేరకం బుట్ట అల్లడానికి ఒకడికి 2 గంటలు పడితే, ఒక సోమరికి 4 గంటలు పట్టిందనీ, సరిగా పనిరాని వానికి 6 గంటలు పట్టిందనీ అనుకుందాం. అప్పుడు మొదటివాని బుట్టకు రెండవ వాని బుట్ట రెట్టింపు విలువ ఉంటుందా? మూడవ వాని బుట్ట 3 రెట్ల విలువ ఉంటుందా? ఉండదు.

**సామాజికంగా అవసరమైన శ్రమ.** సరుకు విలువ పరిమాణాన్ని నిర్ణయించేది ఆసరుకు ఉత్పత్తికి వాస్తవంగా పట్టిన శ్రమ కాలం కాదు. దాని ఉత్పత్తికి సామాజికంగా అవసరమైన శ్రమకాలం. అంటే, అప్పటి ఉత్పత్తి పరిస్థితుల్లో, ఆకాలంలో ప్రబలంగా వున్న నైపుణ్య స్థాయితో, తీవ్రతతో ఒక వస్తువును ఉత్పత్తి చెయ్యడానికి అవసరమైన శ్రమకాలమే సామాజికంగా అవసరమైన శ్రమ కాలం. ఇంగ్లండ్ లో ఆవిరిమగ్గాలు వచ్చాక, కొంత దారాన్ని బట్ట నెయ్యడానికి అంతకు ముందు పట్టే శ్రమ కాలం సగానికి తగ్గింది. అయితే, చేతి మగ్గాలమీద నేసే వాళ్ళకి మాత్రం అంతకు ముందెంత కాలం పట్టిందో, అంతే పట్టింది. అందువల్ల, వాళ్ళు గంట నేసిన బట్ట అరగంట సామాజిక శ్రమకి సమానం అయింది. ఫలితంగా దాని విలువ సగానికి పడిపోయింది. దీన్నిబట్టి చూస్తే, ఏ వస్తువు విలువ పరిమాణాన్నయినా నిర్ణయించేది సామాజికంగా అవసరమైన శ్రమ కాలమే.

"ఒక సరుకు ఉత్పత్తికి అవసరమయ్యే శ్రమకాలానికి మరొక సరుక్కి అవసరమయ్యే శ్రమకాలం ఎలాగో, ఒక సరుకు విలువ మరొక సరుకు విలువకి అలాగు."

దీన్నిబట్టి, ఒకసరుకు ఉత్పత్తికి పట్టే సామాజికంగా అవసరమయ్యే శ్రమకాలం స్థిరంగా మారకుండా ఉంటే, దాని విలువ పరిమాణం కూడా స్థిరంగా వుంటుంది. నిజమే. కాని అది అసలే మారకుండా, స్థిరంగా వుండేది కాదు.

ఉత్పత్తి పరిస్థితుల్లో మార్పు వచ్చినా, సగటు శ్రమ నైపుణ్యంలో, తీవ్రతలో మార్పులొచ్చినా అవసరమయ్యే శ్రమకాలం మారుతుంది. ఈ అంశాల్లో ఎందులో మార్పొచ్చినా, శ్రమ ఉత్పాదకత మారుతుంది.

**శ్రమ ఉత్పాదకత.** శ్రమ ఉత్పాదకత శ్రమకాలానికీ, ఆ కాలంలో ఉత్పత్తయిన వస్తువుల పరిమాణానికీ, సంబంధం ద్వారా వ్యక్తం అవుతుంది.

ఒక విషయాన్ని గుర్తుచేసుకోవాలి: ఒకే కాల వ్యవధిలో జరిగిన అదే శ్రమ ఎప్పుడూ ఒకే విలువ మొత్తాన్ని సృజిస్తుంది. కాని ఒకే మొత్తంలో ఉపయోగపువిలువలను సృజించాలని లేదు. ఉత్పత్తయ్యే వస్తువుల పరిమాణం పెరగావచ్చు, తరగా వచ్చు. పరిమాణం పెరిగితే, ఉత్పాదకత పెరిగినట్లు. పరిమాణం తగ్గితే, ఉత్పాదకత తగ్గినట్లు. ఉత్పాదకతలో వచ్చే మార్పులు కొన్ని పరిస్థితులను బట్టి వుంటాయి.

ఉదాహరణకి, మామూలు తోపుడుతో ఒకడు గంటలో 2 దర్వాజాల కమ్మిల్ని తోపుడేస్తాడు. అదే గంటలో మరతోపుడుతో అయితే 10 దర్వాజా కమ్మిల్ని తోపుడు పడతాడు. రెండో సందర్భంలో ఉత్పాదకత పెరిగింది. కాని మొదటి సందర్భంలో 2 కమ్మిల్లో ఎంత శ్రమకాలం ఉందో, రెండో సందర్భంలోని 10 కమ్మిల్లో అంతే శ్రమకాలం ఉంది. అప్పుడు రెండు కమ్మిలు సాపు చేయడం వల్ల వాటికి ఎంత విలువ కలిసిందో, ఇప్పుడు పది కమ్మిలకీ అంతే విలువ కలుస్తుంది. కారణం, గంటలో ఒకే శ్రమ సృజించే విలువపరిమాణం స్థిరమైనది. "దానికీ ఉత్పాదకత హెచ్చు తగ్గులకీ సంబంధం ఉండదు." పై ఉదాహరణలో ఉత్పాదకత 5 రెట్లయింది. కాని మనిషి చేసిన శ్రమ గంటే. తేడా లేదు. కనుక అంతే విలువ ఏర్పడుతుంది.

"ఒకే శ్రమ ఒకే కాలవ్యవధిలో భిన్న పరిమాణాల్లో ఉపయోగపువిలువల్ని ఉత్పత్తి చేస్తుంది. ఉత్పాదకత పెరిగితే ఎక్కువ పరిమాణంలో, తగ్గితే తక్కువ పరిమాణంలో." కాని అంతే విలువని ఏర్పరుస్తుంది.

శ్రమ ఉత్పాదకతకు దోహదపడే కొన్ని పరిస్థితులు:

1. పనివాళ్ళ సగటు నైపుణ్య స్థాయి.
2. సైన్స్ అభివృద్ధీ, దాని సాంకేతిక అన్వయింపూ
3. ఉత్పత్తి ప్రక్రియ నిర్వహణ
4. ఉత్పత్తి సాధనాల విస్తృతీ, సామర్ధ్యమూ
5. ప్రకృతి పరిసరాల్లో ఉండే పరిస్థితులు.

ఉదాహరణకి, అనుకూల వాతావరణంలో 8 బుషెల్స్ గోధుమల్లో వ్యక్తమయిన శ్రమ, అననుకూల వాతావరణంలో4 బుషెల్స్ లో వ్యక్తం కావచ్చు. ఫలితంగా గోధుమల విలువ పెరుగుతుంది. (బుషెల్ = 8 గాలన్లు/ 36.4 లీటర్లు. అప్పట్లో ద్రవపదార్థాల్నీ, ధాన్యాల్నీ బుషెల్స్‌లో చెప్పేవాళ్ళు).

ఒకే పరిమాణమున్న శ్రమ మంచి గనుల్లో, మామూలు గనుల్లో కంటే ఎక్కువ లోహాల్ని తీస్తుంది. వజ్రాలు భూమ్మీద అరుదుగా దొరుకుతాయి. అందువల్ల వాటిని పట్టుకోడానికి సగటున ఎంతో కాలం పడుతుంది. ఫలితంగా, అవి ఎంతో శ్రమకి ప్రాతినిధ్యం వహిస్తాయి.

"మరోవంక, ఒకనేత కార్మికుడు ఒక పనిదినంలో పూర్వం రాట్నంతో వడక గలిగిన పత్తికి, ఆధునిక ఉత్పత్తి సాధనాలతో యిప్పుడు కొన్ని వేల రెట్లు ఎక్కువ పత్తిని ఒక్క పనిదినంలో నూలుగా మార్చగలుగుతున్నాడు. ప్రతి ఒక్క పౌను పత్తీ ఇప్పుడు ఇంతకుముందు కన్నా అనేక

వేల రెట్లు తక్కువ వడికే శ్రమను గ్రహిస్తోందన్న మాట, తత్పర్యవసానంగా ప్రతి ఒక్కపౌను పత్తికి జోడింపబడుతున్న విలువ యింతకు ముందు కన్నా అనేక వేల రెట్లు తగ్గుతుందన్నమాట. నూలు విలువ తదనుగుణంగా దానికి తగినట్లు పడి పోతుంది." [14] ఎవరైనా బొగ్గుని స్వల్పశ్రమతో వజ్రాలుగా మార్చగలిగితే, వాటి విలువ ఇటుక విలువ కంటే తగ్గిపోతుంది.

**శ్రమ విభజన పెరిగేకొద్దీ ఉత్పాదకత ఊపందుకుంటుంది.** దాన్ని గమనించే, స్కాట్ లాండ్ ఆర్థికవేత్త ఆడం స్మిత్ (1723–1790) ముగ్ధుడయ్యాడు:

"సుత్తి వాడే కమ్మరి అంతకుముందు చీలలు చెయ్యకపోయినా, రోజుకి 200 లేక 300 చీలలు చేస్తాడు. చీలలు చేసే అలవాటున్నా, అదే అతని ఏకైక వృత్తి కాని కమ్మరి మహా అయితే రోజుకి 800 లేక 1000 చేస్తాడు. అయితే నేను చీలలు మాత్రమే చేసే 20 ఏళ్ల లోపు పిల్లల్ని చాలా మందిని చూచాను. కష్టపడితే, ఒక్కొక్కరూ రోజుకి 2,300 చీలలకు పైగా చెయ్యగలరు."[15]

స్మిత్ దే బాగా తెలిసిన పిన్నుల ఉదాహరణ: " ఒక పనివాడు రోజంతా కష్టపడితే బహుశా ఒక పిన్ను చేస్తాడేమో! 20 పిన్నులు ఎలాగూ చెయ్యలేడు. ఇప్పుడు ఈ పనిసాగే విధానం .... ఒక మనిషి తీగ తీస్తాడు. మరొకడు ఆతీగని సాపు చేస్తాడు. మూడోవాడు తెగ్గొడతాడు. ఇంకొకడు మొన తేలుస్తాడు. అయిదో వాడు తలపైన నునుపు చేస్తాడు. తల తయారీలో రెండు, మూడు చర్యలు వుంటాయి. పిన్నుల్ని తెల్లగా చెయ్యడం వేరొక చర్య. వాటిని పేపర్లో పెట్టడం మరోకరిపని. ఈ విధంగా పిన్నుల తయారీ 18 చర్యలుగా విడి పోయింది.... నేనొక చిన్న పిన్నుల ఫాక్టరీ చూచాను. అక్కడ 10 మంది పనివాళ్ళున్నారు. కొందరు రెండు, మూడు చర్యలు చేసేవారు... వాళ్ళు రోజుకి 48,000 పిన్నులచేస్తారు. అంటే, ఒక్కొక్కరూ 4,800 పిన్నులు చేసినట్లు లెక్క."[16]

విభిన్న చర్యల విభజన, కలయికల వల్ల 20 పిన్నులు చెయ్యలేని వాళ్ళు 4,800 పిన్నులు చేస్తున్నారంటే, ఉత్పాదకత 240 రెట్లకంటే ఎక్కువే పెరిగింది.

సాధారణంగా: శ్రమ ఉత్పాదకశక్తి పెరిగితే, ఒకవస్తువు తయారీకి పట్టే శ్రమ తగ్గి, దాని విలువ తగ్గుతుంది. అందుకు భిన్నంగా శ్రమ ఉత్పాదకశక్తి తగ్గితే, ఒకవస్తువు తయారీకి పట్టే శ్రమ పెరిగి, ఆవస్తువు విలువ పెరుగుతుంది. ఒకసరుకు విలువ పరిమాణం ఆసరుకులో ఇమిడివున్న శ్రమ మొత్తానికి అనులోమంగానూ, ఆశ్రమ ఉత్పాదకశక్తికి విలోమంగానూ మారుతుంది. అంటే శ్రమ ఎంత పెరిగితే విలువ అంత పెరుగుతుంది. ఉత్పాదకత ఎంత పెరిగితే సరుకు విలువ అంత తగ్గుతుంది.

## ఏవి సరుకులు? ఏవి కావు?

ఈ సెక్షన్ చివరి పేరాలో ఏవి కేవలం ఉపయోగపు విలువలో, ఏవి సరుకులో స్పష్టం అవుతుంది.

1. "ఒక వస్తువు విలువ లేకుండానే, ఉపయోగపు విలువగా ఉండగలదు. దాని ప్రయోజనం శ్రమ వల్ల ఏర్పడకపోతే పరిస్థితి అదే. గాలీ, దున్నని పొలమూ, సహజ పచ్చికబయళ్ళూ, నాటని అడవులూ మొదలైనవి ఈకోవకి చెందుతాయి."

2. "ఒక వస్తువు ప్రయోజనకరమైనదీ, శ్రమ ఉత్పాదితమూ అయివుండి కూడా, సరుకు కాకుండా ఉండగలదు. తన సొంతశ్రమతో తయారైన ఉత్పాదితంతో, తన కోర్కెను తీర్చుకునే మనిషి ఉపయోగపు విలువల్ని ఉత్పత్తిచేస్తాడు, సరుకుల్ని కాదు." ఉదాహరణకి ఒక నేతగాడు కుటుంబ సభ్యుల వాడకానికి నేసే బట్టలు సరుకులు కావు. ఉపయోగపు విలువలు మాత్రమే. కారణం అవి మారకంలోకి రావు. సరుకయ్యేది మారకం కోసం తయారు చేస్తేనే కదా!

3. ప్రతి సరుకూ శ్రమ ఉత్పాదితమే, కాని ప్రతిశ్రమ ఉత్పాదితమూ సరుకు కాదు. మారకం ద్వారా ఇతరుల వాడకం కోసం బదిలీ అయ్యే శ్రమ ఉత్పాదితాలే సరుకులు.

"సరుకుల్ని ఉత్పత్తిచెయ్యడానికి, అతను ఉపయోగపు విలువల్ని తయారు చెయ్యడమే కాదు, ఆ ఉపయోగపు విలువల్ని ఇతరులకొరకు, అంటే, సామాజిక ఉపయోగపు విలువల్ని తయారుచెయ్యాలి. (ఇతరులకోసం చేస్తేనే చాలదు. మధ్య యుగాల రైతు, భూస్వామి కోసం కౌలు ధాన్యాన్నీ, మతాధికారికొసం 'టితీ' ధాన్యాన్ని పండించాడు. అయితే ఇతరులకోసం పండించినంత మాత్రాన, అవి సరుకులు కావు. సరుకు అవాలంటే మరొకరికి – ఎవరికైతే అది ఉపయోగపు విలువగా ఉంటుందో వారికి – మారకం ద్వారా బదిలీ కావాలి)"*

*బ్రాకెట్లో ఉన్నది నాల్గవ జర్మన్ ప్రతికి ఎంగెల్స్ చేర్చిన నోట్: "బ్రాకెట్లో ఉన్న దాన్ని నేను చేర్చాను. కారణం ఇది లేకపొవడంవల్ల ఒక అపార్థం తరచూ కలిగింది. ఉత్పత్తిదారుడు కాకుండా ఇతరులు ఎవరైనా వినియోగించే ప్రతి ఉత్పాదితాన్నీ మార్క్స్ సరుకుగా భావించాడని."

ఒక వడ్రంగి కొయ్యతో మూడు గాళ్ళ బండి తయారుచేసి నడక తొందరగా రావడానికి తన బిడ్డకిస్తే అది సరుకు కాదు. ఉత్త ఉపయోగపు విలువ. అదే బండిని మరొకరికి ఉచితంగా ఇస్తే, అప్పుడూ అది సరుకు కాదు. దానికి బదులుగా మరొక వస్తువు తీసుకొని ఇస్తేనే – అంటే మారకం చేసుకుంటేనే – అది సరుకు అవుతుంది. అంటే మారకం లేకుండా బదలాయించినవేవీ సరుకులు కావు. మారకం కోసం ఉత్పత్తయినవే సరుకులవుతాయి.

పైన చెప్పినట్లు మధ్య యుగాల రైతు భూస్వామి కోసం కౌలు ధాన్యాన్ని పండించి ఇచ్చాడు. మతాధికారికొసం 'టితీ' ధాన్యాన్ని పండించాడు. వాటిని తన శ్రమతో పండించింది తనకోసం కాదు, ఇతరులకొసం. అయినా అవి సరుకులు కావు." కారణం అవి మారకం లోకి రావు.

(టితీ అంటే పదోవంతు అని అర్థం. ఆకాలంలో రైతు పండించిన ధాన్యంలో పదోవంతు చర్చికి పోతుంది. దానికి బదులు రైతుకి వచ్చే వస్తువేదీ ఉండదు. కనక ఆ ధాన్యం సరుకు కాదు)

4. "చివరగా, ప్రయోజనం లేని ఏ వస్తువూ విలువ కాజాలదు. ఆవస్తువు నిరుపయోగమయిందయితే, దానిలో ఇమిడివున్న శ్రమ కూడా అంతే నిరుపయోగమయింది; ఆశ్రమ, శ్రమగా లెక్కకు రాదు. కనుక విలువను సృజించదు."

**ఇతరుల వాడకం కొరకు మారకంద్వారా బదిలీ అయ్యే శ్రమ ఉత్పాదితవస్తువులు మాత్రమే సరుకులు.**

ప్రకృతి ఉత్పాదిత వస్తువులూ, సొంతవాడకానికి తయారుచేసుకున్న వస్తువులూ, ఇతరుల

వాడకం కోసమే అయినా ఊరకే అంటే, మారకం లేకుండా ఇతరులకు బదిలీ అయ్యే వస్తువులూ సరుకులు కావు.

ఈ విభాగంలో మార్క్స్ పెట్టుబడిదారీ సమాజపు 'ఆర్థిక జీవకణం' అయిన సరుకుని విశ్లేషించి, తన అర్థశాస్త్రానికి సంబంధించిన ముఖ్యమైన భావాభివర్గాల్ని అభివృద్ధిచేస్తాడు. మొదట సరుకు ద్వంద్వ రూపి అనీ, దానికి ఉపయోగపు విలువ రూపంతో పాటు విలువ రూపం/ మారకం విలువ కూడా ఉంటుందని తెలుస్తాడు. తదుపరి మారకం విలువని విశ్లేషించి దాని వెనక దాగి వున్న విలువని పట్టుకుంటాడు. విలువ అనేది మార్క్స్ సిద్ధాంతానికి సంబంధించిన భావాభివర్గం. విలువని విశ్లేషించి, అనిర్దిష్ట శ్రమ అనే మరొక భావాభివర్గాన్ని వివరిస్తాడు. ఈ విభాగంలో మార్క్స్ రెండు కొత్త భావాభివర్గాల్ని ప్రవేశపెట్టాడు: 1. విలువ 2. అనిర్దిష్ట శ్రమ.

ఇప్పటికి సరుకుల రెండు అంశాలైన ఉపయోగపు విలువ, విలువల గురించీ, విలువ సారం, విలువ పరిమాణం గురించీ చెప్పాడు. అంటే, సరుకు ద్వంద్వ స్వభావాన్ని వివరించాడు. ఇక సరుకుల్లో రూపొందిన శ్రమ ద్వంద్వ స్వభావాన్ని విశదీకరిస్తాడు.

## NOTES


1. Marginal Notes on Adolf Wagner's "Lehrbuch der politischen ̈Okonomie" Marx Engels Collected works volume 24. p 544
2. Critique of the Gotha ProgrammeP.1
3. Karl Marx- A contribution to the critique of political Economy, Progress Publishers .P36
4. Marx Engels Collected works volume 29. p 252
5. Karl Marx- A contribution to the critique of political Economy, P32

6,7 Marx Engels Collected works volume 29. p 252

8, 9 Karl Marx- A contribution to the critique of political Economy, p29

10. Capital vol.1 p.66

11, 12 Marginal Notes on Adolf Wagner's "Lehrbuch der politischen ̈Okonomie" - Marx Engels Collected works, volume 24 p545

13 Marginal Notes on Adolf Wagner's ... Marx Engels Collected works, volume 24 p 533

14 మార్క్స్ ఎంగెల్స్ సంకలిత రచనలు 2 .42

15,. Adam Smith –Wealth of Nations .P.11,

16. Adam Smith –Wealth of Nations.,P.8

## విభాగం 2
## సరుకుల్ని ఏర్పరచిన శ్రమ ద్వంద్వ స్వభావం

సరుకు ద్వంద్వ స్వభావి – అది ఉపయోగపు విలువా, విలువా కూడా. అలాగే సరుకుని తయారుచేసిన శ్రమ కూడా ద్వంద్వ స్వభావే. ఉపయోగపు విలువల్ని ఏర్పరిచేటప్పుడు శ్రమ కుండే లక్షణాలు వేరు. విలువలో వ్యక్తమయ్యేటప్పుడు శ్రమకుండే లక్షణాలు వేరు. ఉపయోగపు విలువలో వ్యక్తమయినప్పుడు అది నిర్దిష్టశ్రమ. విలువలో వ్యక్తమయినప్పుడు అనిర్దిష్టశ్రమ. అది ఒకవైపు నిర్దిష్టశ్రమా, మరొకవైపు అనిర్దిష్టశ్రమా.

సరుకుకున్న రెండు అంశాల్నీ శ్రమ ప్రక్రియ ఏకకాలంలో ఏర్పరుస్తుంది. అది ఒకపక్క సరుకు ఉపయోగపు విలువని ఏర్పరుస్తుంది. మరొకపక్క విలువని ఏర్పరుస్తుంది.

***సరుకుల్లో ఇమిడివున్న శ్రమ ద్వంద్వ స్వభావం అంటే ఇదే.***

***దీన్ని గురించి "మొదట చెప్పిందీ, విమర్శనాత్మకంగా పరిశీలించిందీ నేనే" అని చెప్పుకున్నాడు***

**సరుకులో ఉండే శ్రమ ఒక్కటే, రెండు కావు.** సరుకు విరుద్ధాంశాలు సరుకువైనట్లే, శ్రమ విరుద్ధాంశాలు శ్రమవే. ఒకే శ్రమకుండే రెండు అంశాలు. అవి పరస్పర విరుద్ధాలు.

"ఒకే శ్రమ ఇక్కడ దానికదే విరుద్ధంగా ఉంటుంది." అని ఫ్రెంచ్ ఎడిషన్లో స్పష్టంగా ఉంటుంది. తొలి జర్మన్ ఎడిషన్లో ఈ వైరుధ్యాన్ని గురించి: "...సరుకులో భిన్న రకాల శ్రమలు ఉంటాయి అనేది వాస్తవం కాదు. అయినప్పటికీ, ఒకే శ్రమ భిన్నమైన, పరస్పర వ్యతిరేకమైన నిర్ణాయకతల్ని (determinations) కలిగి ఉంటుంది" – అంటాడు. ఆవిధంగా సరుకులోని విరుద్ధాంశాలను ఉత్పత్తిచేసే శ్రమ లోని విరుద్ధాంశాలను విడగొట్టి చూపాడు. ఒకదానిలోని విరుద్ధాంశాలను విడగొట్టి చూడటమే గతితర్కం[1] అన్న లెనిన్ మాటలు తెలిసినవే.

### సాధారణ శ్రమా (labour in general) అనిర్దిష్ట శ్రమా (labour in the abstract) ఒకటేనా?

కాదు. సరుకులు ఉత్పత్తిచేసేటప్పుడు, ఏ నిర్దిష్ట శ్రమ చేస్తున్నప్పుడయినా శారీరక, మానసిక శ్రమ వ్యయం అవుతుంది. అది సాధారణ శ్రమ. సమాజంలో సార్వకాలికమైనది. అది కొన్ని నిర్దిష్ట పరిస్థితుల్లో, సరుకుల వుత్పత్తిలో, అనిర్దిష్ట శ్రమ రూపం పొందుతుంది. "ఈ పాయింట్ రాజకీయఅర్థశాస్త్రం అర్థం చేసుకోవడానికి ఇరుసు. కనక ఇంకా వివరాల్లోకి వెళ్ళాలి" అంటాడు. అంటే, లోతుగా పరిశీలించాలి అని.

### నిర్దిష్టశ్రమ– ఉపయోగపు విలువను ఏర్పరచే శ్రమ

రెండు సరుకుల్ని తీసుకుందాం– ఒక కోటు, 10 గజాల బట్ట.

కోటు ఒక ప్రత్యేకమైన కోరికను తీరుస్తుంది. దాని తయారీకి ప్రత్యేక తరహా ఉత్పాదకచర్య అవసరం. ఈ చర్యని దాని లక్ష్యమూ, చేసేపద్ధతీ, కావలసిన వస్తువులూ, వాడేసాధనాలూ, దాని ఫలితమూ నిర్ణయిస్తాయి. లక్ష్యం: కోటు తయారు చెయ్యడం. కావలసిన వస్తువులు బట్ట, గుండీలు, దారం వగయిరా, చేసేది కుట్టుపని. సాధనాలు కుట్టుమిషన్, కత్తెర, సూది వగయిరా. శ్రమ పదార్థాలమీద, శ్రమ సాధనాలతో కుట్టుపనిచేస్తే కోటు తయారవుతుంది. అది ఒక ఉపయోగపు విలువ. దాన్ని తయారుచేసే కుట్టుపని ఒక ప్రత్యేక తరహా శ్రమ, ప్రయోజనకర

శ్రమ, నిర్దిష్టశ్రమ. అలాగే దారంతో మగ్గం మీద నేతపనిచేస్తే, బట్ట అవుతుంది. నేతపని మరొక రకమైన (ప్రత్యేక) శ్రమ. వేరొక నిర్దిష్టశ్రమ.

ఏ వస్తువు తయారీ కయినా దానికి సంబంధించిన ప్రత్యేక శ్రమ ఉంటుంది. అంటే, ఎన్నిరకాల ఉపయోగపు విలువలుంటే వాటిని చెయ్యడానికి శ్రమ, అన్నిరూపాల్లో ఉంటుంది. భిన్నరూపాల శ్రమ ఉత్పాదితాలు కాకపోతే, అవి ఒకదానితో మరొకటి మారవు. ఒక ఉపయోగపు విలువ, అదే రకం ఉపయోగపు విలువతో మారకం కాదు. కోట్లు కోట్లతో మారవు.

## శ్రమ విభజనా – సరుకుల ఉత్పత్తీ

వ్యవసాయం – పశుపోషణ ముందుగా విడి వడ్డాయి. తర్వాత చేతి వృత్తులు. వాటిలో తిరిగి వడ్రంగం, కమ్మరం, కుండలు చెయ్యడం, గుడ్డలు నెయ్యడం, బట్టలు కుట్టడం, గంపలల్లడం లాంటి ఎన్నో రకాల శ్రమలు దేనికది విడిపోయాయి. విభిన్న ప్రయోజనకర శ్రమలు జాతులుగా, ఉపజాతులుగా, శ్రేణులుగా, తరగతులుగా వర్గీకరించబడి ఉంటాయి. అదే సామాజిక శ్రమ విభజన. సమాజంలోని వ్యక్తులు తమకు కావలసిన వస్తువుల్లో కొన్నితామే చేసుకున్నా, చాలా వస్తువులు ఇతరులు తయారు చేసినవే అయి ఉంటాయి. పొతే, ఎవరుచేసినవి వారివే. కనుక ఒకరు చేసినవి మరోకరికిచ్చి వారు చేసినవి తీసుకోవడమే మార్గం. అదే మారకం. మారకం అయ్యే ఆ శ్రమ ఉత్పాదితాలే సరుకులు. తమకు కావలసిన వస్తువులన్నీ ఎవరికివారే తయారుచేసుకో గలిగితే, మారకంతో పని వుండదు. కనుక అవి శ్రమ ఉత్పాదితాలు అయినంత మాత్రాన, సరుకులు కాలేవు. ఆ శ్రమ విభజనే లేకపోతే మారకం ఉండదు. సరుకుల ఉత్పత్తికి నేపథ్యం ఉండదు. సరుకుల ఉత్పత్తే ఉండదు. కనుకనే సరుకుల ఉత్పత్తికి శ్రమ విభజన అవసరమైన షరతు.

### అయితే, శ్రమ విభజన ఉన్నదంటేనే, సరుకుల ఉత్పత్తి ఉన్నట్లా?

శ్రమ విభజన ఉండి, సరుకులు లేని సమాజాలు చరిత్రలో ఉన్నాయి. ఉదాహరణకి, "ప్రాచీన భారత సమాజంలో, సరుకుల ఉత్పత్తి లేకుండానే, సామాజిక శ్రమ విభజన ఉంది." అనాటి సమాజంలో సభ్యులు తలా ఒక పనిచేసినా, తయారైన వస్తువులన్నీ అందరివీ. అందువల్ల ఒక వస్తువుని వాడుకోవాలంటే, మరొక వస్తువు ఇవ్వాల్సిన పని లేదు. మారకం లేదు. కనక అటువంటి సమాజంలో శ్రమ విభజన ఉంటుంది, కాని సరుకుల ఉత్పత్తి ఉండదు. ఇంకా దగ్గరైన ఉదాహరణ: ప్రతి ఫాక్టరీ లోనూ శ్రమ విభజన ఒక పద్ధతి ప్రకారం ఉంటుంది. అయితే ఈ విభజన పనివాళ్ళు, వాళ్ళ ఉత్పాదితాల్ని ఒకరితో ఒకరు మారకం చేసుకున్నందువల్ల ఏర్పడింది కాదు. ఉదాహరణకి, చొక్కాలు కుట్టే ఫాక్టరీ చూద్దాం. అక్కడ బట్టని ఒకరు కత్తిరిస్తారు. కాలర్ ఒకరు. చేతులు మరొకరు. బాడి మరొకరు. కాజాలు తీసేది మరొకరు, గుండీలు కుట్టేది వేరొకరు. ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్కరు చేస్తారు. అన్నిటినీ కలిపి కుట్టేవారు ఇంకొకరు. ఒకరినించి ఒకరికి మారతాయి. అయితే అది మారకం కాదు. వారి శ్రమ కలిసినవే, కాని వారివి కావు. వేరేవారివి. కనక వాటిని వారు మారకం చేసుకోలేరు. అవి వారికి సరుకులు కావు. అందుకే అంటాడు: సరుకుల ఉత్పత్తికి శ్రమవిభజన అవసరం. కాని దానిననుసరించి.....

శ్రమ విభజనకి సరుకుల ఉత్పత్తి అవసరం– అనేది రాదు. దీన్ని బట్టి సరుకుల ఉత్పత్తికి శ్రమ విభజన ఒక్కటే సరిపోదు.

**మరి ఇంకేం కావాలి?** మారకం కొసం ఉత్పత్తయిన వస్తువులే సరుకులు. మారకం జరగాలంటే ఆయావస్తువులు ప్రైవేటు వ్యక్తులవై ఉండాలి. అంటే వాటిని మారకంలో పెట్టే హక్కు వాళ్ళకి ఉండాలి.

ఆ హక్కు లేనప్పుడు శ్రమ విభజన ఉన్నా సరుకుల ఉత్పత్తి లేనట్లే. " ప్రైవేట్ వ్యక్తులకోసం, దేనికది స్వతంత్రంగా నిర్వహించబడే భిన్న రకాల శ్రమ ఫలితంగా తయారయ్యే ఉత్పాదితాలు మాత్రమే ఒకదానికొకటి సరుకులు కాగలవు."

## అనిర్దిష్ట శ్రమ– విలువను ఏర్పరచే శ్రమ

మన ఉదాహరణలో రెండు సరుకులు – ఒక కోటు, 10 గజాల బట్ట. కోటు విలువ బట్ట విలువకి రెట్టింపు అనుకుందాం. ఇది కేవలం విలువ పరిమాణంలో తేడా మాత్రమే. కోటు విలువ 10 గజాల బట్టకి రెండు రెట్లుంటే, 20 గజాల బట్ట ఒక కోటు విలువకి సమానం కావాలి. మారకం విలువలుగా అవి రెండూ ఒకే సారం ఉన్న వస్తువులు. ఒకే రకమైన శ్రమకు వస్తురూపాలు. అయితే, కుట్టుపనీ, నేతపనీ గుణాత్మకంగా వేరు వేరు రకాల శ్రమలు. వాటివాటి ప్రత్యేకతల్ని వదలివేస్తే, ఉత్పత్తి చర్య మానవ శ్రమ శక్తి వ్యయం మాత్రమే. కుట్టుపనీ, నేతపనీ భిన్న శ్రమలే అయినప్పటికీ రెంటిలోనూ మనిషి మెదడూ, నరాలూ, కండరాలూ వ్యయమవుతాయి. అంటే, మానవశ్రమశక్తి ఖర్చవుతుందన్న మాట. ఆరెండూ శ్రమశక్తి ఖర్చయ్యే రెండు వేర్వేరు వైఖరులు. అంతే.

**నిపుణ శ్రమ.** నైపుణ్యం గల శ్రమ ఎక్కువ సాదాశ్రమ కింద లెక్కకొస్తుంది. ఈ సర్దుబాటు ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. ఒక సరుకు గొప్ప నైపుణ్యం గల శ్రమ వల్ల తయారై ఉండవచ్చు. దాని విలువ సాదాశ్రమతో తయారైన వస్తువు విలువకు కొన్నిరెట్లుగా లెక్కకొస్తుంది. దీన్ని లెక్కించే పద్ధతులు సమాజంలో అలవాటు వల్ల స్థిరపడుతుంటాయి. అయితే మార్క్స్ ఈ లెక్కించే పని లేకుండా ఉండడానికి ప్రతి శ్రమనీ సాదా శ్రమగా భావిస్తాడు. "దీంతో మనకి సర్దుబాటు చేసే ఇబ్బంది తొలిగి పోతుంది" అంటాడు. ఇక శ్రమ లెక్క కొచ్చేది కేవలం శ్రమ శక్తి వ్యయంగా మాత్రమే. కోటునీ, బట్టనీ విలువలుగా చూస్తున్నప్పుడు, వాటి ఉపయోగపు విలువల్ని తప్పిస్తాం. వాటిని ఉత్పత్తిచేసిన శ్రమ ప్రయోజనకర రూపాల్ని–కుట్టుపని, నేతపని– కూడా పక్కన బెడతాం. ఇక విలువలుగా కోటూ బట్టా ఏ తేడా లేని శ్రమకి వస్తు రూపాలు మాత్రమే.

**విలువ పరిమాణం.** కోటూ, బట్టా కేవలం విలువలే కాదు. నిర్దిష్ట పరిమాణం వున్న విలువలు. మన ఉదాహరణలో కోటు విలువ 10 గజాల బట్ట విలువకి రెట్టింపు. ఎందువల్ల వాటి విలువల్లో ఈ తేడా ఏర్పడింది? కోటులో ఉన్న శ్రమలో సగం మాత్రమే బట్టలో ఉన్నందువల్ల. సరుకును ఉపయోగపు విలువగా చూచినప్పుడు, శ్రమ గుణాత్మకమైనదిగా పరిగణనలోకి వస్తుంది. మారకం విలువగా చూచినప్పుడు, పరిమాణాత్మకమైనదిగా పరిగణించబడుతుంది. అందువల్ల రెండో సందర్భంలో శ్రమను సాదా శ్రమలోకి మార్చాలి.

IV. డబ్బు రూపం.




## ప్రాథమిక విలువ రూపమే డబ్బు రూపం యొక్క రహస్యం

డబ్బు రూపం దానికదిగా ఏ చిక్కూ పెట్టదు. సాధారణ సమానక రూపం నించి చూస్తే, ఈ రూపం బంగారం వంటి ఏదో ఒక ప్రత్యేక సరుకుకి అంటి పెట్టుకుంటుందని గ్రహించడానికి జుట్టు పీక్కోవాల్సిన /బుర్రబద్దలు కొట్టు కోవాల్సిన పనేమీ లేదు. సాధారణ సమానక రూపం దాని స్వభావ రీత్యానే, అన్ని ఇతర సరుకుల నుండీ, ఒక సరుకు తొలగించ బడాలి. ఇక ఈ తొలగింపు సామాజిక ఆమోదాన్నీ, స్థిరత్వాన్నీ పొందడమే అని తేలికగా తెలుసుకోవచ్చు.

మారక ప్రక్రియలో వేర్వేరు శ్రమ ఉత్పాదితాలు ఒకదానికొకటి సమపరచ బడతాయి. ఆవిధంగా ఆచరణద్వారా "డబ్బు రూపం భావనలో కష్టమంతా సాధారణ సమానకాన్ని (మూడో రూపాన్ని) అర్థం చేసుకోవడం లోనే వున్నది." ఏమయినా, మూడో రూపం, రెండో రూపంగా దానికదే తేలుతుంది (resolve). ఆ రెండో రూపాన్ని ఏర్పరిచేది మొదటి రూపమే:

20 గజాల బట్ట = 1 కోటు. ఇటువంటివి కొన్ని కలిస్తే రెండో రూపం ఏర్పడుతుంది అనేది తేలికగా తెలిసేదే.

ఇక ఇప్పుడు, ఉపయోగపు విలువ అంటే ఏమిటో, మారకం విలువ అంటే ఏమిటో తెలిస్తే, ఈ మొదటి రూపం ఏ శ్రమ ఉత్పాదితానికైనా ప్రాతినిధ్యం వహించే సరళమైన, ఏమాత్రం అభివృద్ధి చెందని సరళి అని మనకు తెలుస్తుంది. అదే సమయంలో 20 గజాల బట్ట = 1 కోటు అనే ఈ సరళ రూపం 20 గజాల బట్ట = 2 పౌండ్ స్టెర్లింగ్‌లు అనే డబ్బు రూపానికి మారడంలో ఉన్న వరస క్రమాన్ని సులువుగా గ్రహిస్తాం.

## సాధారణ రూపం నించి డబ్బు రూపానికి పరిణామం

ఇప్పుడు బంగారం డబ్బు. అంతకు ముందు అది మామూలు సరుకు అయి ఉన్నందువల్లనే బంగారం డబ్బు అయింది. అది ప్రాథమిక విలువ రూపంలో అటో ఇటో ఒక వైపు వుంది. అలాగే విస్తారిత విలువ రూపంలో కూడా ఆవైపో ఈ వైపో అంటే సాపేక్ష విలువ రూపంలోనో, సమానకం రూపం లోనో వుంది. అలాగే సాధారణ రూపంలో కూడా ఉండేది. క్రమంగా అది

సార్వత్రిక సమానకంగా విభిన్న పరిమితుల్లో ఉపకరించింది. ఆ స్థానాన్ని తానొక్కటే సొంతం చేసుకుంది. ఇప్పుడు సార్వత్రిక సమానకం రూపం/ స్థానం లో బంగారం మాత్రమే కనబడుతుంది. అన్ని సరుకుల విలువ డబ్బు రూపం అయిన బంగారంలోనే వ్యక్తమవుతుంది. ఒక సరుకు విలువ డబ్బులో చెబితే అదే ధర. 20 గజాల బట్ట = 2 ఔన్సుల బంగారం అనేది బట్ట యొక్క ధర రూపం. ఆబంగారాన్ని నాణెంగా చేస్తే 20 గజాల బట్ట = £2 .అదయినా ఇదయినా చరిత్రలో స్థల కాల భేదాల్ని బట్టి భిన్న సరుకులు సార్వత్రిక సమానకాలుగా వ్యవహరించాయి. అంతిమంగా వాటినన్నిటినీ పక్కకు నెట్టి సమాజం బంగారాన్ని మాత్రమే సార్వత్రిక సమానకంగా ఆమోదించింది. కనుకనే బంగారం డబ్బు కాగలిగింది. మార్క్స్ కాపిటల్ అంతటా బంగారమే డబ్బు అనుకుని (assumption) రాశాడు.

డబ్బురూపం భావన (concept) ఏర్పరచు కోవాలంటే ఉన్న చిక్కంతా, సార్వత్రిక సమానకాన్ని స్పష్టంగా గ్రహించడంలో ఉంది. అలాగే ఈ రూపం సాధారణ రూపానికి అవసరమైన విపర్యయం అని తెలుసుకోవడం లోనూ (ఆచిక్కు) ఉంది. సాధారణ రూపం విస్తారిత విలువ రూపం నించి వచ్చేదే (deducible). ప్రాథమిక విలువ రూపమే డబ్బు రూపానికి క్రిమిరూపం అని మార్క్స్ రుజువుచేశాడు. దాని అంతర్గత వైరుధ్యాల మూలంగా ఈ రూపం అత్యున్నతమైన డబ్బురూపం లోకి ఎలా పరివర్తన చెందిందో వివరించాడు.

మారక ప్రక్రియలో వేర్వేరు శ్రమ ఉత్పాదితాలు ఒకదానికొకటి సమపరచ బడతాయి. ఆవిధంగా ఆచరణద్వారా సరుకులుగా మారతాయి. ఈ మారకాల ప్రక్రియలో అనివార్యంగా/ ఆవశ్యకంగా డబ్బు రూపొందుతుంది. మారకాల చారిత్రిక అభివృద్ధీ, విస్తృతీ, సరుకుల్లో నిద్రాణంగా/స్తబ్ధంగా ఉన్న ఉపయోగపు విలువకూ, విలువకూ మధ్యవున్న వైరుధ్యాన్ని వృద్ధి పరుస్తుంది. వాణిజ్య ప్రయోజనాల కోసం ఈ వైరుధ్యానికి బాహ్య వ్యక్తీకరణ అవసరమవుతుంది. ఆ అవసరమే విలువకు స్వతంత్రరూపాన్ని ఏర్పాటు చేసేందుకు వత్తిడి పెడుతుంది. సరుకుల్ని సరుకులుగానూ, డబ్బుగానూ పూర్తిగా విడగొట్టేదాకా విశ్రాంతి చెందదు. ఉత్పాదితాలు సరుకులుగా ఎంతవేగంగా మారతాయో, అంతే వేగంగా ఒక ప్రత్యేక సరుకు డబ్బుగా మారుతుంది.

సీతాకోకచిలుక క్రిమి రూపంతో మొదలై దశలవారీగా రూపొందుతుంది. అలాగే డబ్బుకూడా. ప్రాథమిక రూపంతో మొదలై దశలవారీగా డబ్బురూపం పొంది జిగేల్ మంటుంది. పోయే కొద్దీ, ఉపయోపువిలువ నించి, విలువ వేరుపడడం అంతకంతకూ స్పష్టమవుతుంది. ఈ మార్పు అంతర్గత వైరుధ్యాల వల్ల అనివార్యంగా జరిగేదే గాని, యాదృచ్ఛికంగా ఏర్పడింది కాదు.

**References**


1. Marx- A contribution to the Critique of Political Economy . p64
2. Marx's letter to Engels June 22, 1867,

3,4 Appendix to the 1st German edition of Capital, volume 1

## విభాగం 4
## సరుకుల మార్మికతా – దాని రహస్యమూ

సమాజంలో ఎవరికివారు ఇతరులతో సంబంధం లేకుండా వేర్వేరు వస్తువులు ఉత్పత్తి చేస్తారు. ఒకరు దారం తీస్తారు. మరొకరు బట్ట నేస్తారు. ఇంకొకరు కుండలు చేస్తారు. వేరొకరు నాగళ్ళు చెక్కుతారు. ఇలా శ్రమ విభజన వుంటుంది. ఒకరివి ఒకరికి అవసరం. కనుక ఆయా వ్యక్తులు సంబంధంలోకి వస్తారు. అయితే ఉత్పత్తి జరిగేటప్పుడు కాదు. వస్తువులు తయారయ్యాక మార్కెట్లో కలుస్తారు. మారకాలు జరుగుతాయి. 1నాగలికీ 5 కుండలకీ మారకం జరిగిందనుకుందాం. ఇది వ్యక్తులమధ్య సామాజిక సంబంధం. కాని ఉత్పత్తిదారులకి అది నాగలికీ, కుండలకీ మధ్య సంబంధంగా కనబడుతుంది. నాగలి చెయ్యడానికి పట్టిన శ్రమ కాలం, కుండ చెయ్యడానికి పట్టిన శ్రమ కాలానికి 5 రెట్లు. వాటిని చేసిన శ్రమలు భిన్నమైనప్పటికీ, అనిర్దిష్ట మానవశ్రమగా వాటిలో ఉన్నది ఒకేరకమైనది. కనుక భిన్న పరిమాణాల్లో సమానమవుతాయి. మారతాయి. అయితే అన్ని రకాల శ్రమలు అనిర్దిష్టమానవ శ్రమగా ఒకటే అనే విషయం ఉత్పాదకులు నేరుగా గ్రహించలేరు. మారుతున్నది సరుకులు కనుక వాటి విలువలు సమానమైనట్లు భావిస్తారు. 1నాగలి విలువ కుండ విలువకి 5 రెట్లు అనీ, వాటికి స్వతహాగా విలువ వున్నదనీ అనిపిస్తుంది. మారకం ఆ విలువల వల్ల జరిగినట్లుంటుంది. వ్యక్తుల సామాజిక సంబంధాలు వస్తువుల మధ్య సామాజిక సంబంధాలుగా వాళ్లకి అగపడతాయి. "మనుషుల మధ్య సామాజిక సంబంధం వాళ్ళ దృష్టిలో వస్తువుల మధ్య సంబంధం రూపం తీసుకుంటుంది." దీన్నే మార్క్స్ మార్మికత (fetishism) అంటాడు.

సరుకుల ఉత్పత్తి, ఉత్పత్తిదారుల మధ్య సంబంధాన్ని నెలకొల్పుతుంది. అదే సామాజిక సంబంధం. ఉత్పత్తి దారులకి వాళ్ళలో వాళ్ళ మధ్య సంబంధం. అయితే అది అలా పైకి కనబడదు. వాళ్ళు తయారుచేసిన వస్తువుల మధ్య సంబంధంగా కనబడుతుంది. ఒక నేతగానికీ, చెప్పులు కుట్టే వానికీ మధ్య ఉండే సంబంధం బట్టకీ, చెప్పులకీ మధ్య సంబంధంగా అగపడుతుంది. ఆ వస్తువులు మారకం అయ్యే నిష్పత్తి రీత్యా కనబడతాయి. కాని వాటిలో ఇమిడివున్న శ్రమ రీత్యా కనబడవు. పెట్టుబడి దారీ విధానం లోని ఆర్థికరూపాలు వాటి వెనక వున్న సామాజిక సంబంధాల్ని దాచి పెడతాయి, పైకి కనబడనీయవు.

సరుకులుగా ఉత్పత్తి అయ్యీ అవగానే శ్రమ ఉత్పాదితాలకు ఈ మార్మికత అంటుకుంటుంది.

సరుకుల ఉత్పత్తి అభివృద్ధితోపాటు మార్మికత వృద్ధవుతుంది.

### డబ్బు మార్మికత

డబ్బు అమల్లోకి రాగానే సరకుల మార్మికత, డబ్బు మార్మికత రూపం తీసుకుంటుంది. ప్రపంచ డబ్బు బంగారం. బంగారంతో ఏవస్తువునైనా కొనవచ్చు. ప్రజల దృష్టికి ఇది బంగారానికున్న సహజ లక్షణంగా అగపడుతుంది. నిజానికి, ఏవస్తువుకీ స్వతస్సిద్ధంగా విలువ ఉండదు. కాని సరుకులకి స్వయం సిద్ధంగా విలువ ఉన్నట్లు కనబడుతుంది. ఇదే మార్మికత. కాని నిజానికి విలువ సామాజిక సంబంధాల వల్ల ఏర్పడింది. సామాజిక లక్షణం.

**ఈ మార్మికత ఎక్కడ నించి పుట్టింది?** అని ప్రశ్నించి,

"స్పష్టంగా సరుకు రూపం నించే" అంటాడు మార్క్స్.

శాస్త్రీయ విశ్లేషణలో తేలిన విషయాలు సరుకు ఉత్పత్తిదారులకు వేరేవిధంగా కనబడతాయి.

అందువల్ల, సరుకు నిగూఢమైన వస్తువు: సరుకులో మానవ శ్రమ సామాజిక స్వభావం వాళ్లకి వాళ్ళ ఉత్పాదితాల కున్న వస్తుగత ధర్మంగా కనిపిస్తుంది; మొత్తం శ్రమతో వాళ్ళ సంబంధం వాళ్ళ వాళ్ళ మధ్య సంబంధంగా కాకుండా, వాళ్ళ శ్రమ ఉత్పాదితాల మధ్య సామాజిక సంబంధంగా కనబడుతుంది. దీనికి పోలిక కావాలంటే మత ప్రపంచంలోకి పోవాల్సిందే. అందులో మనిషి మెదడు సృష్టించిన వాళ్ళు, ప్రాణం వున్న స్వతంత్ర వ్యక్తులుగా కనబడతారు. ఒకరితో ఒకరు సంబంధంలోకి వస్తారు. అంతే కాదు, మానవ జాతితో కూడా సంబంధంలోకొస్తారు. అలాగే సరుకుల ప్రపంచంలో మనిషి చేసిన సరుకులు కూడా. సరుకులుగా ఉత్పత్తి అయ్యీ కాగానే, శ్రమ ఉత్పాదితాలకు ఈ మార్మికత అంటుకుంటుంది. అందువల్ల అది సరుకుల ఉత్పత్తి నించి విడివడదు. మార్మికతకీ, సరుకుల ఉత్పత్తికీ విడగొట్టలేని సంబంధం ఉంది.

## సరుకు అవగానే మార్మికత ఎక్కడనించి వస్తుంది?

పైకి సరుకు తేలికగా తెలిసేదే అనిపిస్తుంది. తీరా విశ్లేషిస్తే, అదేదో మార్మికమైనదిగా, నిగూఢమైనదిగా తేలుతుంది. సరుకు ఉపయోగపు విలువా, విలువా అని తెలుసు. మరి, సరుకు మార్మిక స్వభావం ఎందులో ఉంది?

### A. ఉపయోగపు విలువలో ఉన్నదా?

సరుకు ఉపయోగపు విలువ అయినమేరకు

1. తన ధర్మాల ద్వారా మనిషి అవసరాలను తీరుస్తుంది.
2. ఆ ధర్మాలు మానవ శ్రమ వల్ల ఏర్పడినవి.

ఈ విషయం తెలియడంలో చిక్కేమీ లేదు. కనుక సరుకు మార్మికత ఉపయోగపు విలువలో లేదు.

### B. పోనీ విలువని నిర్ణయించే అంశాల్లో ఉన్నదా? అంటే లేదంటాడు.

మార్క్స్ విలువ యొక్క 3 నిర్ణాయక అంశాల్ని చూస్తాడు:

1. విలువ సారం 2. విలువ పరిమాణం 3. విలువ రూపం.

విలువ సారం అనిర్దిష్ట మానవ శ్రమ (అంటే శ్రమశక్తి వ్యయం). విలువ పరిమాణాన్ని నిర్ణయించేది సామాజికంగా అవసరమైన శ్రమకాలం. విలువ రూపాన్ని నిర్ణయించేది ఉపరితలం మీద సామాజిక సంబంధం (మారకం విలువే విలువ రూపం, అది సామాజిక సంబంధం).

ఎందుకంటే,

- మొదటిది, ప్రయోజనకర శ్రమలు భిన్నమైనవే, అయినప్పటికీ అవన్నీ మనిషి భౌతిక చర్యలే, అలాంటి ప్రతి చర్యా, (దాని రూపం ఏదయినకావచ్చు) సారాంశంలో మనిషి మెదడూ, నరాలూ కండరాలూ వగయిరాల వ్యయమే.
- రెండు, విలువ పరిమాణాన్ని నిర్ణయించేది ఆశ్రమ వ్యయ వ్యవధి లేక శ్రమ పరిమాణం. దీనికి సంబంధించి గుణానికీ, పరిమాణానికీ తేడా ఉన్నదనేది స్పష్టమే. అన్ని సమాజాల్లోనూ జీవనాధార సాధనాలని ఉత్పత్తి చేసేందుకు పట్టే శ్రమ కాలం పట్ల మనుషులకు ఆసక్తి ఉంది.
- చివరగా, మనుషులు ఒకరికొరకొకరు పనిచేస్తుంటే, వాళ్ళ శ్రమసామాజికరూపం తీసుకుంటుంది.

ఇవన్నీ స్పష్టంగా బోధపడేవే. అన్ని సమాజాల్లోనూ ఉన్నవే. మార్మికత అనేది విలువని నిర్ణయించే అంశాల నుంచి తలెత్తదు. ఎందుకంటే ఇవి మూడూ ఏ మర్మమూ లేనివి. స్పష్టమైనవి. ఇవి సరుకుల్ని ఉత్పత్తిచేసే సమాజాలకు ప్రత్యేకమైనవి కావు.

**C. శ్రమ సామాజికం అవడంలో ఉందా?** కావలసినవన్నీ తయారుచేసుకుని తామే వాడుకున్న కాలం ఉంది, కాని అది ఏనాడో పోయింది. ఒకరు చేసినవి ఒకరు ఉపయోగించుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఒకరి శ్రమను మరొకరు పరస్పరం వాడుకోవడం అవసరమయింది. శ్రమ సామాజికం అయింది. ఉత్పత్తిదారుల మధ్య సంబంధాలు ఉండి తీరాలి. ఇందులోనూ మార్మికత లేదు.

**D. మార్మికత శ్రమ విభజననుండి తలెత్తిందా?** అంటే అదీ కాదు. సరుకుల ఉత్పత్తి లేకముందు కూడా శ్రమవిభజన ఉంది. దీన్నిబట్టి, మార్మికత శ్రమ విభజననుండి తలెత్తలేదని స్పష్టమవుతుంది.

## మరి ఈ మార్మికత ఎక్కడ నించి పుట్టింది?

'స్పష్టంగా సరుకు రూపం నించే'

- అన్ని రకాల మానవ శ్రమలూ సమానమే, అనే విషయం విశ్లేషణలో తేలింది. అయితే అది వస్తుగతంగా ఆశ్రమల ఉత్పాదితాలన్నీ, విలువలు కావడంగా వ్యక్తం అవుతుంది.
- శ్రమ శక్తి వ్యయానికి కొలబద్ద శ్రమ కాలం. అంటే, ఎంత సేపు ఆ శ్రమ జరిగింది? అనేది. అయితే అది వస్తుగతంగా శ్రమ ఉత్పాదితాల విలువ పరిమాణం రూపం తీసుకుంటుంది. ఉదాహరణకి, టేబుల్ తయారీకి 4 గంటల శ్రమ పడితే, దాని విలువ పరిమాణం 200 రూపాయలుగా వ్యక్తం అవుతుంది.
- ఒకరికొరకొకరు శ్రమ చెయ్యడంలో శ్రమ సామాజిక స్వభావం ఉంటుంది. అయితే ఇక్కడ ఉత్పత్తిదారుల సామాజిక సంబంధాలు వాళ్ళ ఉత్పాదితాల మధ్య సంబంధాల రూపం తీసుకుంటాయి.

## వ్యష్టి శ్రమ, సామాజిక శ్రమ

ఒకరితో ఒకరు సంబంధం లేకుండా విడివిడిగా ఉత్పత్తిచేసే ప్రైవేటు వ్యక్తుల, లేక బృందాల శ్రమ ఉత్పాదితాలు అయినందువల్లనే, ప్రయోజనకర వస్తువులు సరుకులవుతాయి. అందరు ప్రైవేటు వ్యక్తుల శ్రమ మొత్తం కలిసి సమాజపు శ్రమ అవుతుంది. ఉత్పత్తిదారులు వాళ్ళ వాళ్ళ ఉత్పాదితాల్ని మారకం చేసుకునేదాకా, ఒకరితో ఒకరు సంబంధంలోకి రారు. ఆకారణంగా ప్రతి ఉత్పత్తిదారుని శ్రమ యొక్క విశిష్ట సామాజిక స్వభావం, మారకంలో తప్ప బయట పడదు. వ్యక్తి శ్రమ సమాజ శ్రమలో భాగంగా ఎలా తెలుస్తుంది? మారకచర్య ప్రత్యక్షంగా ఉత్పాదితాల మధ్యా, పరోక్షంగా వాటిద్వారా ఉత్పాదకుల మధ్యా ఏర్పరచే సంబంధాల ద్వారా మాత్రమే నిర్ధారణవుతుంది. అందువల్ల ఆ ఉత్పాదకులకి, ఒకరి శ్రమని మిగతా వారి శ్రమతో కలిపే సంబంధాలు, వ్యక్తుల మధ్య ప్రత్యక్ష సామాజిక సంబంధాలుగా కనబడవు. అవి నిజంగా ఎలాగో అలాగే – అంటే మనుషుల మధ్య పాదార్థిక సంబంధాలుగానూ, వస్తువుల మధ్య సామాజిక సంబంధాలుగానూ – కనబడతాయి. మారకం అయినందువల్లనే, ప్రయోజనకర వస్తువులుగా వాటి వివిధ రూపాలకు భిన్నంగా, శ్రమ ఉత్పాదితాలు విలువలుగా ఒకేరకమైన సామాజిక హోదాని పొందుతాయి. ఉపయోగపు విలువగానూ, విలువగానూ ఒక ఉత్పాదితం విభజన ఎప్పుడు ముఖ్యం అవుతుందంటే, ప్రయోజనకర వస్తువులు మారకం కోసమే ఉత్పత్తయ్యే స్థాయికి మారకం విస్తరించినప్పుడు, విలువలుగా వాటి స్వభావాన్ని ముందుగా ఉత్పత్తిలోనే లెక్కలోకి తీసుతీసుకోవలసి వచ్చినప్పుడు. **ఆ క్షణం నించీ వ్యష్టి ఉత్పత్తిదారుని శ్రమ సామాజికంగా ద్వంద్వ స్వభావాన్ని సంతరించుకుంటుంది.** ఒకవైపు, నిర్దిష్టమైన ప్రయోజనకర శ్రమగా అది ఒక నిర్దిష్ట సామాజిక అవసరాన్ని తీర్చాలి. ఉదాహరణకి, కుండలు చేసే శ్రమ ఒక నిర్దిష్ట ప్రయోజనకర శ్రమ. సమాజానికి కుండలు అవసరం. ఆ అవసరాన్ని ఆశ్రమ తీరుస్తుంది. సామాజిక శ్రమ విభజనలో ఒక శాఖగా తన స్థానాన్ని పొందుతుంది.

మరొకపక్క , అది ఆ శ్రమ చేసే వాని వివిధ కోర్కెలనూ తీర్చగలదు. అంటే కుండలకు మారుగా తనకు కావలసిన వస్తువులు తీసుకోగలదు. మిగతా అందరి శ్రమ తోనూ సమాన హోదా సాధిస్తుంది. సమాజ శ్రమలో భాగం అయినట్లు రుజువవుతుంది. అతని ప్రత్యేక శ్రమ, అన్ని ఇతర రకాల శ్రమలతో సమానమైనది అనే సామాజిక స్వభావం ఏరూపం తీసుకుంటుందంటే: భౌతికంగా భిన్నమైన అన్ని శ్రమ ఉత్పాదితాలకూ ఒక ఉమ్మడి లక్షణం ఉంది. అదే విలువని కలిగి వుండడం. **విలువ ఇద్దరు వ్యక్తుల మధ్య సంబంధం అన్నాడు ఇటలీ ఆర్థికవేత్త గాలియాని (1728–1787).** అయితే అది అలా వ్యక్తం అవదు అంటాడు మార్క్స్. వ్యక్తుల మధ్య సంబంధమే అయినాగాని, వాళ్ళు తయారుచేసిన వస్తువుల మధ్య సంబంధంగా వ్యక్తం అవుతుంది. **అందుకే వస్తువుల మధ్య సంబంధంగా వ్యక్తమయ్యే సంబంధం అనేమాటలు కలిపి ఉండాల్సింది అన్నాడు మార్క్స్.**

## విలువ – శాస్త్రీయ విశ్లేషణ

విలువ అనేది పైకి తెలిసేది కాదు, కనకనే విలువ శాస్త్రీయ విశ్లేషణకు వస్తువయింది. ఆర్థికవేత్తలు శ్రమ నించి విలువ వస్తుంది అని కనుక్కున్నారు. ఇదొక గొప్ప ఆవిష్కరణ. అయితే

అంతకు ముందు లాగానే ఈ ఆవిష్కరణ తర్వాత కూడా శ్రమ సామాజిక స్వభావం, శ్రమ ఉత్పాదితాల వస్తుగత స్వభావంగానే కనిపించడం ఆగలేదు. అలా కనిపించేట్లు చేసే మంచుపొరని ఈ ఆవిష్కరణ తొలగించలేక పోయింది.

**ఎందువల్ల?** మారకం చేసుకునేటప్పుడు ఉత్పత్తిదారుల ఆలోచనంతా తమ సరుకుకి ఇతర సరుకులు ఎంత పరిమాణంలో వస్తాయనే దానిమీద ఉంటుంది. ఏ నిష్పత్తిలో ఆ ఉత్పాదితాలు మారగలగుతాయి?

అలవాటువల్ల, ఈ మారక నిష్పత్తులు ఒకింత స్థిరత్వం పొందుతాయి. అప్పుడు ఆనిష్పత్తులు ఉత్పాదితాల స్వభావం నించే వచ్చినట్లు కనబడతాయి. ఉదాహరణకి ఒక టన్ను ఇనుమూ, రెండు ఔన్సుల బంగారమూ ప్రకృతి సిద్ధంగానే సమాన విలువ గలవిగా కనిపిస్తాయి. ఇది ఎంత సహజంగా కనిపిస్తుందంటే: బంగారమూ, ఇనుమూ వేర్వేరు భౌతిక, రసాయన ధర్మాలు కలిగి ఉన్నప్పటికీ, ఒక పౌను బంగారమూ, ఒక పౌను ఇనుమూ సమాన బరువుని కలిగివున్నంత సహజంగా. విలువ ఉండడం అనే స్వభావం ఒకసారి సరుకుల మీద పడితే, ఆస్వభావం విలువ పరిమాణాలుగా చర్యలు ప్రతిచర్యలు జరగడం మూలంగా స్థిరపడుతుంది. ఈ పరిమాణాలు మారుతుంటాయి. ఉత్పాదకుల సంకల్పంతోగానీ, ముందు చూపుతో గానీ, చర్యతోగానీ ఎటువంటి సంబంధమూ లేకుండానే మారుతుంటాయి. వాళ్లకి వాళ్ళ సామాజిక చర్య, వస్తువుల చర్య రూపం తీసుకుంటుంది. ఉత్పత్తిదారుల చేత పాలించ బడే బదులు, ఆసరుకులే వాళ్ళని పాలిస్తున్నట్లుంటుంది.

**సరుకుకి స్వయంసిద్ధంగా విలువ వున్నదనిపిస్తుంది.** మార్కెట్లో సరుకులు యజమాని చెప్పినట్లుండవు. యధేచ్ఛగా వ్యవహరిస్తాయి. ఒకరోజు ఒక కలం 5 పెన్సిళ్ళతో మారవచ్చు. ఇంకోరోజు 8 రావచ్చు. మరో రోజు 3 రావచ్చు. ఒకసారి అసలు మారక పోవచ్చు. మార్కెట్లో నడిచే ఈ యాదృచ్ఛికమైన పరిస్థితి మూలంగా సరుకుకి స్వయంసిద్ధంగా విలువ వున్నదనిపిస్తుంది. ఉత్పత్తి యొక్క సామాజిక సంబంధాలను ఉత్పాదకులు గ్రహించరు. వస్తువులమధ్య సంబంధాలను మాత్రమే గమనిస్తారు. వస్తువుల మధ్య సంబంధాల మాటున వ్యక్తుల సామాజిక సంబంధాలు మరుగున పడిపోతాయి. అలా మరుగున పడకుండా, స్పష్టంగా కనపడే సమాజాలు లేవా? అంటే ఉన్నాయి.

## మార్మికత లేని సమాజాలు

మార్మికత లేని ఉత్పత్తి గురించి చెప్పడానికి మార్క్స్ రాబిన్సన్ క్రూసోని ఉదాహరిస్తాడు.

**1. రాబిన్సన్ ఉత్పత్తి.** ఒక దీవిలో ఒక్కడే చిక్కుకుంటాడు. ఇంకెవ్వరూ ఉండరు. ఒంటరివాడు గనక తన అవసరాలు తీర్చే వస్తువుల్ని తనే తయారు చేసుకోక తప్పదు. కనక రకరకాల పనులు చేశాడు. ఇల్లు కట్టాడు. చుట్టూ కంచె వేశాడు. పనిముట్లు, ఫర్నిచర్ చేసుకున్నాడు. జంతువుల్ని వేటాడేవాడు. బార్లీ పండించేవాడు. కుండలు చెయ్యడానికీ, మేకలు పెంచడానికీ అలవాటు పడ్డాడు. బుట్టలల్లాడు. చిన్న పడవ చేసుకున్నాడు. చేపలు పట్టడం అలవరచుకున్నాడు. "అతని పనిలో ఎంత వైవిధ్యం ఉన్నా, ఆశ్రమ రూపం ఏదయినా అంతా తన ఒక్కడి శ్రమే

అనీ, దాని భిన్న రూపాలేననీ  అతనికి తెలుసు. అవసరాన్ని బట్టి తన కాలాన్ని వివిధ పనులకు కేటాయించేవాడు.

ఆతను తన స్టాక్ పుస్తకంలో వస్తువుల జాబితా రాశాడు. వాటి తయారీకి అవసరపడే పనుల గురించి రాశాడు. నిర్దిష్ట పరిమాణాల్లో ఆయా వస్తువుల తయారీకి సగటున ఎంత సమయం పడుతుందో రాశాడు. రాబిన్సన్‌కీ, అతని శ్రమతో తయారుచేసుకున్న వస్తువులకీ ఉన్న అన్ని సంబంధాలూ చాలా సరళమైనవి, స్పష్టమైనవి. అయినా ఆ సంబంధాలలో విలువ నిర్ణయానికి కావలసినవి అన్నీఉన్నాయి.

**2. అర్ధబానిసల ఉత్పత్తి.** మధ్యయుగాల ఐరోపాలో ఉన్నది స్వతంత్రుడైన వ్యక్తికాదు. అందరూ ఆధారపడినవారే – అర్ధబానిసలూ–ప్రభువులూ, సామంతులూ–సామ్రాట్లూ, సామాన్యుడూ–మతాధికారీ. శ్రమా, శ్రమ ఉత్పాదితాలూ వాస్తవ రూపానికి భిన్నమైన రూపాల్ని తీసుకోవాల్సిన అవసరం లేదు. సామాజిక లావాదేవీల్లో అవి పనిరూపంలో సేవలు, పనిరూపంలో చెల్లింపులు. సరుకుల  ఉత్పత్తి ఆధారంగా ఉన్న సమాజంలో లాగా కాకుండా, ఇక్కడ శ్రమ యొక్క ప్రత్యేక ప్రాకృతిక రూపం శ్రమ యొక్క తక్షణ సామాజిక రూపం. బలవంతపు శ్రమ సరుకులు ఉత్పత్తి చేసే శ్రమ లాగే, కాలం చేత కొలవబడుతుంది; అయితే, తన యజమాని సేవలో వ్యయిస్తున్న శ్రమ నిర్దిష్ట పరిమాణంగల తనసొంత శ్రమ శక్తి  అని ప్రతి అర్ధబానిసకీ తెలుసు. పోతే, కార్వే పద్ధతిలో రైతు వారంలో కొంతకాలం తనపొలంలో పనిచేసుకుంటాడు. మిగిలిన రోజులు యజమాని పొలంలో తన పరికరాలతోనే పనిచేస్తాడు. ఇదంతా స్పష్టంగానే వుంటుంది. మార్మికతేమీ ఉండదు. పై సందర్భాల్లో వ్యక్తులమధ్య సామాజిక సంబంధాలు వాళ్ళ పరస్పర వ్యక్తిగత సంబంధాలు గానే కనబడతాయి. శ్రమ ఉత్పాదితాల మధ్య సామాజిక సంబంధాల ఆకృతి కింద దాగి ఉండవు.

**3. పితృస్వామిక రైతు కుటుంబం ఉత్పత్తి.** ఇది  ఉమ్మడి శ్రమకి ఉదాహరణ. ఆ కుటుంబం ఉమ్మడిగా ధాన్యం పండిస్తుంది. పశువులు పోషిస్తుంది. దారం వడుకుతుంది. బట్టలు నేస్తుంది. దుస్తులు కుడుతుంది. వాటిని ఆకుటుంబమే వాడుకుంటుంది. ఆ వస్తువులన్నీ ఆకుటుంబం శ్రమ ఉత్పత్తులే. కాని కుటుంబ సభ్యుల మధ్య అవి సరుకులు కావు. వాటిలో రూపొందిన భిన్న రకాల శ్రమలు – దున్నకం, పశు పెంపకం, వడకడం, నెయ్యడం, కుట్టడం– నేరుగా సామాజిక చర్యలే. ఎందుకంటే, అవి కుటుంబం చర్యలు. సరుకుల ఉత్పత్తి మీద ఆధారపడిన సమాజం లాగా, కుటుంబంలో సద్యోజనితంగా వృద్ధయిన శ్రమ విభజన ఉంది. కుటుంబంలో పని పంపిణీ, సభ్యుల యొక్క శ్రమ కాలమూ లింగ, వయో భేదాల్ని బట్టీ, ఋతువుల తేడాలని బట్టీ ఉంటుంది. ప్రతి సభ్యుని శ్రమ శక్తీ, మొత్తం కుటుంబ శ్రమ శక్తిలో నిర్దిష్ట భాగంగా మాత్రమేఉంటుంది. అందువల్ల, వ్యక్తి శ్రమ శక్తి వ్యయం దాని వ్యవధి ద్వారా కొలత, స్వభావసిద్ధంగానే శ్రమ యొక్క సామాజిక స్వభావంగా కనబడుతుంది.

**4. ఉమ్మడి ఉత్పత్తిసాధనాలున్న సమాజం ఉత్పత్తి.** ఇక్కడ  అందరి వ్యక్తుల శ్రమ శక్తీ, సమాజపు శ్రమ శక్తి అనే  చైతన్యంతో అన్వయించ బడుతుంది. రాబిన్సన్ శ్రమ కున్న లక్షణాలన్నీ ఇక్కడ పునరావృతమవుతాయి. అయితే ఒక తేడా ఉంది. అది వ్యక్తిగతం, ఇది సామాజికం.

రాబిన్సన్ ఉత్పత్తి చేసినదంతా పూర్తిగా అతని శ్రమ ఫలితమే, అతని వాడకం కోసమే. మన ఉమ్మడి ఉత్పత్తి అంతా సమాజపు ఉత్పత్తి. అందులో ఒక భాగం కొత్త ఉత్పత్తి సాధనాల కోసం, కనుక అది సామాజికం. అయితే మరొక భాగం సభ్యులు జీవనాధారసాధనాలుగా వినియోగించు కుంటారు. కనుక ఈ భాగం పంపిణీ అవసరం. పంపిణీ పద్ధతి సమాజపు ఉత్పత్తి వ్యవస్థని బట్టీ, ఆ ఉత్పాదకుల చారిత్రకాభివృద్ధి స్థాయిని బట్టీ మారుతుంటుంది. జీవితావసర వస్తువుల్లో ప్రతి వాని వాటా, అతని శ్రమ కాలాన్ని బట్టి నిర్ణయమవుతుందని అనుకుందాం. అప్పుడు శ్రమకాలం ద్వంద్వ పాత్ర పోషిస్తుంది. జరగవలసిన భిన్న రకాల శ్రమల మధ్య నిష్పత్తినీ, సమాజపు వివిధ అవసరాల నిష్పత్తినీ ఒక పద్ధతిప్రకారం జరిగే దాని విభజన నిర్వహిస్తుంది. మరొకవైపు, ఉమ్మడి శ్రమలో ప్రతి వ్యక్తీ చేసిన భాగాన్ని కొలిచేందుకూ, వ్యక్తుల వినియోగానికి కేటాయించిన ఉత్పాదితం మొత్తంలో అతని వాటా ఎంతో నిర్ణయించేందుకూ ఉపకరిస్తుంది. వ్యష్టి ఉత్పత్తిదారుల శ్రమతోనూ, ఆ శ్రమ ఉత్పాదితాలతోనూ వాళ్ళకున్న సామాజిక సంబంధాలు పూర్తిగా సరళ మైనవీ, తేలికగా తెలిసేవీ. ఉత్పత్తికి సంబంధించే కాదు, పంపిణీకి సంబంధించి కూడా.

## రాజకీయ అర్థశాస్త్రం బలహీనత

రాజకీయ అర్థశాస్త్రం, అసంపూర్ణంగానే అయినప్పటికీ, విలువనీ, విలువ పరిమాణాన్నీ విశ్లేషించి ఆరూపాల వెనక దాగి ఉన్న దాన్ని కనుక్కున్నది. కాని సాంప్రదాయ అర్థశాస్త్రం* విలువలో కనబడే శ్రమకీ, ఉపయోగపు విలువలో కనబడే శ్రమకీ ఉన్న తేడాని పూర్తి స్పృహతో, స్పష్టతతో వ్యక్తం చెయ్యలేదు. అది దాని బలహీనతల్లో ఒకటి. అయితే ఆచరణలో తేడా చూసింది. ఎందుకంటే, శ్రమని ఒకసారి పరిమాణాత్మక అంశం గానూ, మరొకసారి గుణాత్మక అంశం గానూ చూసింది. అయితే వివిధ రకాల శ్రమల్నీ కేవలం పరిమాణాత్మకంగా చూసేటప్పుడు, ఆశ్రమల ఏకత్వం, లేక సమానత ఉంటుంది. ఆకారణంగా ఆశ్రమల్ని అనిర్దిష్ట మానవ శ్రమగా దింపడం అనే అర్థం ఇమిడి ఉంది. అయితే ఆ అర్థశాస్త్రానికి ఈ గ్రహింపు ఇసుమంతయినా లేదు.

**శ్రమ ద్వంద్వ స్వభావం భావన లేదు.** శ్రమ దాని ఉత్పాదితపు విలువ చేత ఎందుకు ప్రాతినిధ్యం వహించ బడుతుంది? శ్రమ కాలం ఆవిలువ పరిమాణం చేత ఎందుకు ప్రాతినిధ్యం వహించ బడుతుంది? అనే ప్రశ్నలు ఆనాటి రాజకీయ అర్థశాస్త్రం సంధించు కోలేదు.

సరుకుల విశ్లేషణ ద్వారా, ప్రత్యేకించి సరుకుల విలువ విశ్లేషణ ద్వారా సాంప్రదాయ అర్థశాస్త్రం విలువ ఏ రూపంలో మారకం విలువ అవుతుందో ఆరూపాన్ని కనుక్కోలేక పోయింది. ఆ శాఖకు అత్యుత్తమ ప్రతినిధులైన **స్మిత్, రికార్డోలు సైతం విలువ రూపాన్ని అప్రధాన విషయంగా, సరుకుల స్వతస్సిద్ధ స్వభావంతో సంబంధం లేని విషయంగా చూశారు.** ఇందుకు కారణం వారు విలువ పరిమాణం మీదనే ధ్యాసపెట్టడం ఒక్కటే కాదు. ఇంకా లోతయినది. సరుకురూపం బూర్జువా సమాజంలో ఉత్పాదితం తీసుకునే సార్వత్రిక రూపం కూడా. విలువరూపం ఆ ఉత్పత్తిని ప్రత్యేక సామాజిక ఉత్పత్తిగా ముద్ర వేస్తుంది. ఆవిధంగా ఆ ఉత్పత్తికి దాని ప్రత్యేక చారిత్రక స్వభావాన్ని ఇస్తుంది. అలాంటప్పుడు ప్రతి సమాజానికి ఇదే ఉత్పత్తి విధానం

శాశ్వతమైనది, ప్రకృతి సిద్ధమైనది అనుకున్నామంటే, విలువరూపపు విశిష్ట లక్షణాన్ని (differentia specifica) పట్టించుకోము. తత్ఫలితంగా, సరుకు రూపపు విశిష్ట లక్షణాన్నీ పట్టించుకోము. సరుకు రూపపు పరిణామాలైన డబ్బు రూపం, పెట్టుబడి రూపం వగయిరాల విశిష్ట లక్షణాల్ని పట్టించుకోము. ఆకారణంగా విలువ పరిమాణం కొలతకి శ్రమకాలాన్ని అంగీకరించిన ఆర్దికవేత్తలే **సాధారణ సమానకం** యొక్క పరిపూర్ణ రూపం అయిన డబ్బు విషయంలో వింతైన, విరుద్ధమైన అభిప్రాయాలు వ్యక్తం చేశారు.

**ఈ సూత్రీకరణలు ఒక సామాజిక వ్యవస్థకి చెందుతాయి.** ఏవ్యవస్థలో అయితే ఉత్పత్తి ప్రక్రియ, మనిషి అదుపులో ఉండే బదులు మనిషి మీద తనే పెత్తనం చేస్తుందో, ఆ వ్యవస్థకి చెందుతాయి. ఈ సూత్రీకరణలు స్వయంస్పష్టమైన, ప్రకృతి విధించిన ఆవశ్యకత లాగా బూర్జువా మనస్సుకి కనబడుతుంది. ఈ ఆర్దికవేత్తలకి ఒకే ఒక పద్ధతి ఉంది. వారికి రెండురకాల సంస్థలు ఉన్నాయి – సహజమైనవి, కృత్రిమమైనవి. భూస్వామ్య సంస్థలు కృత్రిమమైనవి, బూర్జువా సంస్థలు సహజమైనవి. ఈ విషయంలో వీళ్ళు మతతత్వవేత్తల వంటి వారే. వాళ్లకి రెండు రకాల మతాలు ఉంటాయి. వాళ్ళది కాని మతం మనుషులు సృష్టించింది, వాళ్ళ మతం ఒక్కటే దైవసృష్టి.–కాపిటల్ 1.85 ఫుట్ నోట్ 2

**ఆర్థికవేత్త విలువ (అంటే మారకం విలువ) వస్తువుల ధర్మం అంటాడు: ఒక ముత్యం ముత్యంగా విలువైనది.** ఒక వజ్రం వజ్రంగా విలువైనది – అన్న బెయిలీ మాటలు చూపి మార్క్స్ ఇలా అంటాడు: ఇప్పటి దాకా, ఏ రసాయనవేత్తా ముత్యంలోగానీ, వజ్రంలోగానీ మారకం విలువని కనుక్కున్నది లేదు. ఆవిధంగా మార్క్స్ సరుకుల మార్మికత ఏమిటో, దాని మూలాలేవో లోతుగా పరిశీలించి వివరిస్తాడు. శాస్త్రీయంగా పరిశోధన చేసిన సాంప్రదాయ ఆర్థికవేత్తలు సైతం దీని నుండి ఎందుకు తప్పించుకోలేక పోయారో తేల్చి చెప్పాడు. ఇక పెట్టుబడి దారీ విధానానికి సమర్ధనలు చేకూర్చడమే పనిగా పెట్టుకున్న బూర్జువా ఆర్థికవేత్తలు, మార్మికతకి ఎంతగా అంటుకుపోయారో వివరంగా చెప్పాడు. సరుకుల ఉత్పత్తి ఉన్నంత కాలమూ సరుకుల మార్మికత ఉండి తీరుతుందనీ, సరుకుల ఉత్పత్తి పోతేనే గాని మార్మికత పోదనీ తేల్చి చెప్పాడు.

**సరుకుల మార్మికత పైపై విషయం కాదు.** మార్క్స్ సిద్ధాంత పునాదిలో ఒక కీలకమైన విషయం. ఆయన ఆర్థిక సంక్షోభ భావనతో నేరుగా ముడివడి వున్న అంశం. ఈ భావన కాపిటల్ 3 సంపుటాల్లోనూ, అదనపు విలువ సిద్ధాంతాలలోనూ ఉంటుంది. సందర్భం వచ్చినప్పుడు ఆవిషయం లోతుగా పరిశీలించవచ్చు.

* సాంప్రదాయ అర్థశాస్త్రం అంటే: విలియం పెట్టీ కాలం నించీ బూర్జువా సమాజంలో వాస్తవ ఉత్పత్తి సంబంధాల్ని పరిశోధించిన అర్థశాస్త్రం. –కాపిటల్ 1.85 ఫుట్ నోట్

# అధ్యాయం 2
# మారకం

శ్రమ ఉత్పాదితంలో ఉపయోగపు విలువా, విలువా ఉత్పత్తిలోనే ఉంటాయి – అయితే నిద్రాణంగా. ఉపయోగపు విలువగా ఉండడం వేరు, అవడం వేరు. ఎందుకంటే ఉత్పత్తిదారునికి అది ఉపయోగపు విలువ కాదు. కాబట్టి ఇతరులకు ఉపయోగపు విలువగా అవాలి. అవాలంటే, ఇతరుల చేతుల్లోకి పోవాలి. ఇతరుల చేతుల్లోకి పోవాలంటే, మారకం అవసరం. మరొకవైపు, సరుకులలో ఎంతో కొంత శ్రమ ఇమిడి ఉంటుంది. అంటే సరుకులకి విలువ ఉంటుంది. ఈ సరుకుల్ని ఉత్పత్తి చేసిన శ్రమ వ్యష్టి శ్రమ. దానికి సమాజ ఆమోదం లేదు. అది సమాజ శ్రమలో భాగం అయితేనే, మారకం విలువగా అవుతుంది. సమాజ శ్రమలో భాగం అవాలంటే, మారకం తప్పనిసరి. శ్రమ ఉత్పాదితాలు ఉపయోగపు విలువలుగా అవాలన్నా, మారకం విలువలుగా అవాలన్నా మారక ప్రక్రియ అనివార్యం. ఎవరికి వారుగా ఉత్పత్తిచేసే సమాజంలో వారిని సంబంధంలోకి తెచ్చేది మారకం మాత్రమే.

## ఉత్పత్తిదారుల సంబంధాలూ – ఒప్పందాలూ

ఉత్పత్తిదారులు విడివిడిగా, ఎవరికివారుగా సరుకులు తయారు చేస్తారు. మారకంలో ఒకరితో ఒకరు సంబంధంలోకి వస్తారు. ఎవరి సరుకులకి వాళ్ళే సొంతదార్లు. జల్లెళ్ళు తీసుకొని వాటి ఓనర్ వస్తాడు. చేంతాళ్ళు మరొకడు పట్టుకొస్తాడు. ఒకరికివి ఒకరికి అవసరమైతే, ఎన్ని జల్లెళ్ళకి ఎన్ని చేంతాళ్ళో బేరం మొదలవుతుంది. ఇద్దరికీ ఇష్టమయితే బేరం తెగుతుంది. ఒక ఒప్పందానికి వస్తారు.

2 చేంతాళ్ళు = 7 జల్లెళ్ళు అనుకుందాం.

వాళ్ళిద్దరి అంగీకారంతో మాత్రమే అవి మారతాయి. కనక వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు **ప్రైవేట్ ఒనర్లుగా** గుర్తించాల్సి ఉంటుంది. ఎవరి సరుకుల మీద వారికి హక్కులున్నట్లు అంగీకరించాల్సి వస్తుంది. లేకుంటే, వాళ్ళమధ్య ఒప్పందం సాధ్యం కాదు. అంటే, సరుకుల సొంత దార్ల మధ్య సామాజిక సంబంధం అవసరం.

## వ్యక్తిగత ఆస్తి హక్కు

సరుకుల సమాజంలో వ్యక్తిగత ఆస్తి హక్కు అవసరం. ఉత్పత్తిదారుడికి తన వస్తువులపైన సంపూర్ణమైన హక్కు ఉండాలి. అలాగే వాటిని పరుల పరం చెయ్యగల హక్కు కూడా ఉండాలి. ఎవరి సరుకు వారికి తక్షణ ఉపయోగపు విలువ కాదు. అయి వుంటే, వాటిని మార్కెట్‌కి తేరు. జల్లెళ్ళు చేసిన వానికి వాటితో అక్కర లేదు. చేంతాళ్ళ వానికి జల్లెళ్ళు అవసరం. మరి జల్లెళ్ళ వానికి జల్లెళ్ళ ఉపయోగపు విలువ ఏమిటి? తనకు ఉపయోగపువిలువలు కాని వాటిని ఇచ్చి, తనకు ఉపయోగపు విలువలయిన సరుకుల్ని ఇతరుల నించి తీసుకుంటాడు. ఇక్కడ జల్లెళ్ళు ఇచ్చి, తాళ్ళు తీసుకుంటాడు. జల్లెళ్ళు అతనికి **మారక సాధనాలుగా** ఉపయోగపడతాయి. అదే అతనికి వాటి ఉపయోగపు విలువ. సరుకులు వాటి ఒనర్లకు ఉపయోగపు విలువలు కావు. వాటి ఓనర్లు కానివారికి, అంటే ఇతరులకు ఉపయోగపు విలువలు. అందువల్ల, సరుకులు చేతులు మారి తీరాల్సిందే. ఇలా సరుకులు చేతులు మారడమే మారకం.

## మారక చర్యలో ఏం జరుగుతుంది? మారక చర్య ప్రాధాన్యత

మారకం సరుకుల్ని, విలువలుగా సంబంధంలో పెడుతుంది. విలువలుగా సిద్ధింప జేస్తుంది. అందువల్ల, **సరుకులు ఉపయోగపు విలువలుగా సిద్ధించాలంటే, ముందు విలువలుగా సిద్ధించాలి.** మరొక పక్క, అవి విలువలుగా సిద్ధించాలంటే, ముందు అవి ఉపయోగపు విలువలుగా కనబడాలి. వాటి ఉత్పత్తికి వ్యయమైన శ్రమ ఇతరులకు ఉపయోగపడేదా, లేదా? ఆ శ్రమ ఉత్పాదితం ఇతరుల కోర్కెల్ని తీర్చగలదా, లేదా? అనేది వాటి మారక చర్య వల్ల మాత్రమే రుజువవుతుంది. ఒకనికి పరుపు కావాలంటే, దాని విలువ పరుపు ఉత్పత్తిదారునికి మరొక సరుకు రూపంలో చేరాలి. విలువలుగా సిద్ధించడం అంటే అదే. ఉపయోగపు విలువలుగా కనబడక పోతే ఎవ్వరూ వాటిని మారకం చేసుకోరు. అంటే అవి విలువలుగా సిద్ధించవు. ఇనప కర్రు వచ్చాక రాగి కర్రు ఉపయోగపు విలువగా కనబడదు. అది మారకం కాదు. కనుక చేసిన శ్రమ ఇతరులకు ప్రయోజనకరమైన రూపంలో ఉంటేనే సఫలమవుతుంది. ఆ శ్రమ ఉత్పాదితం ఇతరుల కోర్కెలు తీర్చగలిగినదో, కాదో తేలేది మారకచర్యలో మాత్రమే.

తీసుకుంటున్న సరుకుకి సంబంధించి, మారక ప్రక్రియ పూర్తిగా వ్యక్తిగత ప్రక్రియ. సరుకు యజమాని, ఎవ్వరినీ సంప్రతించాల్సిన అగత్యం లేదు. తాను ఎంచుకునే ఉపయోగపు విలువ గురించి ఏ సామాజిక ఒత్తిళ్ళూ ఉండవు. అతను మారకంలో ఇచ్చే సరుకుకి సంబంధించి అతని అంచనా ఏమంటే, దానికి తగిన సమానకం రావాలి అనేదే.

## ఏ సరుకూ స్వతహాగా సాధారణ సమానకం కాదు

ఇక్కడ 'విషయాన్ని కొంచెం లోతుగా పరిశీలిద్దాం' అంటాడు. ఒక సరుకు సొంతదారుడికి ప్రతి ఇతర సరుకూ తన సరుకుకి ప్రత్యేక సమానకం అనుకుంటాడు. ఫలితంగా, తనసరుకు ఇతర సరుకులు అన్నింటికీ సార్వత్రిక సమానకం అయినట్లుంటుంది. ప్రతి సొంతదారునికీ ఇదే వర్తిస్తుంది. తన జల్లెడని, చేంతాడుతో, పావు కిలో టీ పొడితో, 2 దస్తాల కాగితాలతో మారేట్లయితే, అతను ఎలా భావిస్తాడు?

జల్లెడకి చేంతాడు ఒక ప్రత్యేక సమానకం. పావు కిలో టీ పొడి మరొక ప్రత్యేక సమానకం. 2 దస్తాల కాగితాలు వేరొక ప్రత్యేక సమానకం. ఇలా ఎన్నైనా ఉండవచ్చు. ప్రతి సరుకు సొంత దారునికీ ఇదే వర్తిస్తుంది. తనసరుకు సాధారణ సమానకం అనిపిస్తుంది. ఇతరుల సరుకులు దేనికది తన సరుక్కి ప్రత్యేక సమానకం అయినట్లుంటుంది. ఎవరికి వారు తమసరుకే సాధారణ సమానకం అనుకుంటారు. అందువల్ల, ఏ సరుకూ స్వతహాగా సాధారణ సమానకం కాదు. కనుక, వాస్తవానికి సార్వత్రిక సమానకంగా వ్యవహరించే సరుకంటూ ఉండదు.

## అయితే సార్వత్రిక సమానకం ఎలా ఏర్పడుతుంది?

ఒక ప్రత్యేక సరుకు, సామాజిక చర్య ద్వారా మాత్రమే సాధారణ సమానకం కాగలుగుతుంది. అన్ని ఇతర సరుకుల సామాజిక చర్య ద్వారా, ఒక ప్రత్యేక సరుకులో తమవిలువల్ని వ్యక్తం చేసి ఆసరుకుని వేరుపరుస్తాయి. ఈ సామాజిక చర్య ద్వారా సార్వత్రిక సమానకంగా వ్యవహరించడం దాని విశిష్ట విధి అవుతుంది. **ఆవిధంగా అది డబ్బు అవుతుంది.**

## విలువకు స్వతంత్ర రూపం

మారక ప్రక్రియలో వేర్వేరు శ్రమ ఉత్పాదితాలు ఒకదానికొకటి సమపరచ బడతాయి. ఆ విధంగా ఆచరణద్వారా సరుకులుగా మారతాయి. ఈ మారకాల పరంపరలో అవసరం వల్ల డబ్బు ఏర్పడింది. సరుకుల వైవిధ్యమూ, సంఖ్యా పెరిగింది. ఆకారణంగా విలువా ఉ పయోగపు విలువా ఒకదానితో ఒకటి అంతకంతకూ మరింతగా వైరుధ్యంలోకొచ్చాయి. వ్యాపార అవసరాలకు ఈ వైరుధ్యం యొక్క బాహ్య వ్యక్తీకరణ అవసరమైంది. ఆ అవసరం, విలువకు స్వతంత్ర రూపం ఏర్పడేట్లు ప్రేరేపిస్తుంది. సరుకులు సరుకులుగానూ, డబ్బుగానూ విడివడే వరకూ విశ్రమించదు. ఉత్పాదితాలు సరుకులుగా మారడం ఎంత వేగంగా జరుగుతుందో, అంతే వేగంగా ఒక ప్రత్యేక సరుకు డబ్బుగా మారడమూ జరుగుతుంది.

సరుకు యజమాని తన వ్యక్తిగత ప్రయోజనాలు నెరవేరే విధంగా మారకాలు చేసుకోవాలి అనుకుంటాడు. అందుకు ఆ యజమానికి అడ్డంకులు ఏర్పడతాయి. ఇవి వ్యక్తి స్థాయిలో పరిష్కారం అయ్యేవికావు. సరుకులనించి డబ్బుని వేరుపరచే సామాజిక చర్య, దాని పరిష్కారానికి ఒక ఆధారాన్ని ఏర్పరుస్తుంది.

## ఆ సామాజిక చర్య, చరిత్రలో ఎలా జరిగింది?

మొదట్లో వస్తువు వస్తువుతో మారేది. అదే వస్తు మార్పిడి. ప్రత్యక్ష వస్తుమార్పిడి రూపం ఇది: 20 గజాల బట్ట = 1 కోటు

ఈసందర్భంలో బట్టా, కోటూ ఇప్పటికింకా సరుకులు కావు. వస్తుమార్పిడి ద్వారా మాత్రమే అవి సరుకులవుతాయి. ఒక ప్రయోజనకర వస్తువు మారకం విలువని సంతరించుకునే తొలి అడుగు ఎప్పుడు వేస్తుందంటే: ఆవస్తువు సొంతదారునికి అది ఉపయోగపు విలువ కానిదైనప్పుడు. అలా ఎప్పుడు జరుగుతుందంటే: ఏదయినా వస్తువు తన వాడకానికి పోను మిగులుగా ఉన్నప్పుడు. ఒకరి వస్తువులు ఒకరికి పరస్పరం పరాధీనం చెయ్యాలంటే, ఆ వస్తువుల సొంతదార్లని ప్రైవేట్ ఒనర్లుగా, స్వతంత్ర వ్యక్తులుగా ఒకర్నొకరు గుర్తించాలి. ఇది తప్పనిసరి. అప్పుడు మాత్రమే వస్తు మార్పిడి సాధ్యమవుతుంది. దీన్ని బట్టి **ఆస్తి వ్యక్తిగతం అయితేనే, వస్తు మార్పిడికి భూమిక ఏర్పడుతుంది.** అయితే ఆది నుండీ ఆస్తి వ్యక్తిగతం కాదు. ఆదిమ సమాజాల్లో ఆస్తి సభ్యులందరిది, ఉమ్మడిది. అక్కడ ఉత్పాదితాలు సమాజ సభ్యులందరివీ. ఉమ్మడివి. ఏ ఒక్కరూ వాటికి ఓనర్లు కాదు. కనుక ఏ సభ్యుడూ వాటిని పరాధీనం చెయ్యలేడు. అలాంటి సమాజాల్లోపల, వస్తుమార్పిడికి ఆస్కారం ఉండదు.

## మరి వస్తుమార్పిడి ఎలా, ఎక్కడ మొదలయింది?

ఉమ్మడి ఆస్తి ఉన్న సమాజాల లోపల మారకానికి అవకాశమే లేదన్నది స్పష్టమే. అలాంటి సమాజాల వెలుపల జరగవచ్చు. ఒక సమాజం మరొక సమాజంతో కలిసే చోట్లలో, సరిహద్దుల్లో సరుకుల మారకం ఆరంభం అయింది. సమాజాలతో కావచ్చు, సమాజ సభ్యులతో కావచ్చు. అలా మారకాలు సమాజాల మధ్య మొదలయ్యాయి. ఒక సమాజం బయట సంబంధాల్లో ఉత్పాదితాలు మారకం జరిగి సరుకులవుతాయి. అలా అయిన తర్వాత త్వరత్వరగా సమాజం లోపల సైతం మారకాలు జరిగి సరుకులవుతాయి.

**మారక నిష్పత్తి మొదట యాదృచ్ఛికం.** మారకం జరుగుతుందా, లేదా అనేది కూడా యాదృచ్ఛికమే. మొదట మొదట సరుకులు మారే నిష్పత్తులు యాదృచ్ఛికంగా ఉంటాయి. ఉదాహరణకి, ఒక మేకకి ఎన్ని గొడ్డళ్ళు అనేది ప్రతి చోటా ఒకటే ఉండదు. ఒకే చోటయినా, ప్రతిసారీ ఒకే నిష్పత్తిలో మారవు. నిష్పత్తులు మారతాయి. అందుకే నిష్పత్తులు యాదృచ్ఛికం. ఒక గొర్రెకి ఒకసారి 3 బరిసెలు రావచ్చు. మరొక సారి నాలుగు, ఇంకోసారి రెండే రావచ్చు. అంతేకాదు ఒకప్పుడు రెంటికీ మారకమే జరగక పోవచ్చు. అడపాదడపా మారకాలు జరిగే సందర్భాల్లో మారకం యాదృచ్ఛికమే. అవి అసలు మారడానికి కారణం: వాటి ఓనర్లు వాటిని పరాధీనం చెయ్యాలి అనుకోవడమే.

## యాదృచ్ఛికత ఎలా పోతుంది?

కాలక్రమంలో ఇతరులు ఉత్పత్తిచేసిన వస్తువులకోసం అవసరం అధికమవుతుంది. మారకాలు పదేపదే జరుగుతాయి. అందువల్ల ఆసామాజిక చర్య అలవాటుగా జరిగే చర్య అవుతుంది. కాలం గడిచేకొద్దీ, శ్రమ ఉత్పాదితాల్లో కొంతభాగం మారకం కోసం తయారై తీరుతుంది. ఆక్షణం నుండీ, వాడకం కోసం ఒక వస్తువు ప్రయోజనానికీ, మారకం కోసం ఒక వస్తువు ప్రయోజనానికీ తేడా కొట్టొచ్చినట్టు కనబడుతుంది. దాని ఉపయోగపు విలువ మారకం విలువ నుండి విడివడి పోతుంది. వేరొకవైపు, అవి మారే పరిమాణాత్మక నిష్పత్తులు, ఆయా వస్తువుల ఉత్పత్తి మీద ఆధారపడతాయి. అలవాటు వాటిని నిర్దిష్ట పరిమాణాలుగల విలువలుగా ముద్రవేస్తుంది. యాదృచ్ఛికత పోతుంది.

## వస్తు మార్పిడిలో వస్తువులు స్వతంత్రమైన విలువ రూపాన్ని తీసుకోవు

ప్రత్యక్ష వస్తు మార్పిడిలో ప్రతిసరుకూ దాని ఓనర్ కి నేరుగా మారక సాధనం. ఇతరులందరికీ అది సమానకం (equivalent) – ఉపయోగపు విలువ కలిగివున్న మేరకు. అందువల్ల ఈ దశలో మారకమయ్యే వస్తువులు వాటి ఉపయోగపు విలువనుండి స్వతంత్రమైన విలువ రూపాన్ని తీసుకోవు. అంటే, మారకం చేసుకునే వాళ్ళ సొంత అవసరాలకు భిన్నంగా స్వతంత్రమైన విలువరూపాన్ని పొందవు. ఉదాహరణకి, ఒకడు ఒక బుట్ట ఇచ్చి రెండు దుత్తలు తీసుకుంటున్నాడనుకుందాం. అతను తన బుట్టను మారక సాధనంగా భావిస్తాడు. దుత్తలు ఉపయోగపు విలువలు గానే ఉంటాయి. అవి అతని దృష్టిలో విలువలు కావు. కనుక విలువ రూపం పొందవు. ప్రత్యక్ష వస్తుమార్పిడిలో పరిస్థితి ఇది.

## విలువ రూపం అవసరం

అయితే, మారకం అయ్యే సరుకుల సంఖ్యా, వైవిధ్యమూ పెరిగేకొద్దీ విలువ రూపం అవసరం కూడా పెరుగుతుంది. ఒక్కోచోట, ఒక ప్రత్యేక సరుకు ఇతర అన్ని సరుకులకు సమానకం అవుతుంది. అది పరిమిత పరిధిలోనయినా, సాధారణ సమానకం స్వభావం పొందుతుంది. ఒకప్పుడు ఒక సరుక్కీ, మరొకప్పుడు మరొక సరుక్కీ ఈ స్వభావం వస్తుంది, పోతుంది. తాత్కాలికంగా ఉంటుంది. అయితే, మారకాలు వృద్ధయ్యేకొద్దీ, ఏదో ఒక ప్రత్యేక సరుకుకి ఆరూపం అంటుకుంటుంది. ఆ సరుకు డబ్బురూపం తీసుకుని, నిలదొక్కుకుంటుంది.

అంటే డబ్బు రూపం దానికి స్థిర పడుతుంది.

## డబ్బుగా వ్యవహరించిన సరుకులు

డబ్బుగా వ్యవహరించిన వస్తువులు చాలా ఉన్నాయి. అవి ప్రాంతాన్నిబట్టీ, కాలాన్ని బట్టీ మారేవి. అన్ని చోట్ల ఒకటే ఉండేది కాదు. ఒక చోట కూడా ఎప్పుడూ ఒకటే ఉండేది కాదు. ఆసియా, ఆఫ్రికాలకి చెందిన ఎన్నో ఆదిమజాతుల్లో నత్త గుల్లలూ, ఆల్చిప్పలూ డబ్బుగా ఉండేవి. చైనా, జపాన్, ఇండియా దేశాల్లో సీమబాదం పెంకులు డబ్బుగా పనిచేశాయి. కుక్క దంతాలూ, బర్రె దంతాలూ, గాజు పూసలూ, గుల్లలూ – ఎన్నో వస్తువులు డబ్బు పాత్ర పోషించాయి. ఆవులు, ఎద్దులు, గొర్రెలు వంటి పశువులు డబ్బుగా బాగా వాడుకలో ఉండేవి. డబ్బురూపాన్ని మొదట అభివృద్ధి చేసింది సంచార జాతులు. కారణం వాళ్లకి ఉన్నవన్నీ చరాస్తులే. పరాధీనం చెయ్యడానికి వీలున్నవే. అంతేకాదు, ఒకచోట నించి మరొకచోటికి వెళుతూ ఉంటారు. కనుక, వాళ్ళు పరాయి తెగలతో తరచుగా కలుస్తుంటారు. అలాంటి జీవన విధానం వాళ్ళ వాళ్ళ సరుకుల మారకాన్ని ప్రేరేపిస్తుంది, ప్రోత్సహిస్తుంది. మనిషి తరచుగా మనిషినే బానిస రూపంలో డబ్బుగా వాడాడు.

మారకం స్థానిక బంధాల్ని క్రమంగా తెంచుకుంటుంది. సరుకుల విలువ, అనిర్దిష్ట మానవ శ్రమ ఆకారంలోకి అంతకంతకూ విస్తరిస్తుంది. ఇవి ఏ స్థాయిలో జరుగుతాయో, అదే స్థాయిలో సార్వత్రిక సమానకంగా వ్యవహరించడానికి ప్రకృతి సిద్ధంగా అనువైన సరుకులకు డబ్బు స్వభావం కలుగుతుంది. ఆ సరుకులే విలువైన లోహాలు.

## వెండి బంగారాలు

"బంగారమూ, వెండీ ప్రకృతి సిద్ధంగా డబ్బు కానప్పటికీ, డబ్బు ప్రకృతి సిద్ధంగా బంగారమూ, వెండీ." – అనేది నిజమే. డబ్బుగా వ్యహరించడానికి అనువైన భౌతిక ధర్మాలు వీటికి ఉండడమే కారణం. ఇంతదాకా మనకి డబ్బు విధుల్లో ఒక్కటి మాత్రమే తెలుసు. అదేమంటే: సరుకుల విలువని వ్యక్తపరిచే రూపంగా ఉండడం. లేక, సరుకుల విలువల పరిమాణాలు సామాజికంగా ఏ పదార్థంలో వ్యక్తమవుతాయో, ఆ పదార్థంగా ఉపకరించడం. అందుకు ఆ పదార్థంలో ఏ ముక్కని నమూనాగా తీసుకున్నా, ఏ తేడా లేకుండా ఒకే రకంగా ఉండాలి. విలువలో తేడా కేవలం పరిమాణంలోనే కనుక, డబ్బుసరుకు పరిమాణాత్మక తేడా సాధ్యం కావాలి. అంటే, విభజించే వీలుండాలి. అలాగే కలిపే వీలూ ఉండాలి. బంగారానికీ, వెండికీ ఈ ధర్మాలు ప్రకృతి సిద్ధంగానే ఉన్నాయి.

## డబ్బు– ద్వంద్వ ఉపయోగపు విలువ

డబ్బుగా వుండే సరుకు ద్వంద్వ ఉపయోగపు విలువను సంతరించుకుంటుంది. ఒక సరుకుగా దానికుండే ఉపయోగపువిలువ దానికి ఉంటుంది. ఉదాహరణకు, బంగారం బోలుపళ్ళలో నింపడానికి, ఆభరణాలకూ ఉపయోగ పడుతుంది. ఆ ప్రత్యేక ఉపయోగపువిలువతో పాటు, లాంచన ప్రాయమైన ఉపయోగపు విలువని పొందుతుంది. ఆ లాంఛన ప్రాయమైన ఉపయోగపువిలువ: **డబ్బుగా వ్యవహరించడమే.** ఈ ఉపయోగపు విలువ, సామాజిక చర్య

వల్ల ఏర్పడుతుంది, కాని, దాని ప్రకృతి ధర్మాలవల్ల కాదు. అన్ని ఇతర సరుకులూ డబ్బుకి ప్రత్యేక సమానకాలు. డబ్బు వాటన్నిటికీ సార్వత్రిక సమానకం. అందువల్ల, ఆ ఇతరసరుకులు ఈ సార్వత్రిక సమానకానికి ప్రత్యేక సరుకులుగా ఉంటాయి.

డబ్బు రూపం అనేది అన్ని ఇతర సరుకుల మధ్య ఉండే విలువ సంబంధాల్ని ప్రతిబింబించే ఒకే ఒక సరుకు. **అప్పటికే ఉన్న ఒకసరుకు డబ్బయింది. అంతే కాని ఈ సరుకు కొత్తది కాదు.** ఇతర సరుకుల మధ్య ఉండే విలువ సంబంధాల్ని ప్రతిబింబించే ప్రత్యేక లక్షణం దానికి మాత్రమే ఉంది. మిగిలిన వాటికి లేదు. కనుక డబ్బుకూడా ఒక సరుకే అని తెలిసిన విషయమే. అయితే డబ్బుని పూర్తిగా అభివృద్ధిచెందిన ఆకారంతో విశ్లేషణ మొదలెట్టిన వారికి అది కొత్త ఆవిష్కరణ. సరుకుతో మొదలుపెట్టినట్లయితే అది కొత్త విషయం కాదని ముందే తెలుస్తుంది. అలా కాకుండా డబ్బుతో ప్రారంభించిన వారికి, కొన్ని పొరపాటు అభిప్రాయాలు కలిగాయి.

## 1. డబ్బు విలువ ఉహాత్మకమైనది

డబ్బులోకి మారిన సరుకుకి మారక చర్య ఇచ్చేది దాని విలువని కాదు, దాని ప్రత్యేక విలువ రూపాన్ని. అది అప్పటికే కలిగివున్న విలువ యొక్క ప్రత్యేక రూపాన్ని. ఈ రెంటి మధ్య గందరగోళంలో పడి కొందరు రచయితలు వెండి బంగారాల విలువ ఊహాత్మకం అని పొరబడ్డారు. అలా వాళ్ళు తప్పుదోవ పట్టారు.

బంగారం, వెండి డబ్బుకాక ముందే, లోహాలుగా విలువగలవి – అని గాలియానీ సరిగానే చెప్పాడు. ఇంగ్లిష్ తత్వవేత్త జాన్ లాక్ (1632–1704) ఇందుకు భిన్నంగా: వెండికి డబ్బుకి ఉండాల్సిన లక్షణాలు ఉన్నందున, మానవుల సార్వత్రిక అంగీకారం వెండికి ఊహాత్మక విలువను ఇచ్చింది – అన్నాడు. ఇది తప్పు. ఎందుకంటే, మారక ప్రక్రియ ఒక సరుకుని సార్వత్రిక సమానకంగా ఎంపిక చేస్తుంది. ఈ ఎంపిక ప్రక్రియ సార్వత్రిక సమానకానికి విలువని ఏర్పరచదు. ప్రత్యేకమైన విలువ రూపాన్నిస్తుంది.

## 2. డబ్బు కేవలం చిహ్నం మాత్రమే

కొందరు ఆర్థికవేత్తలు డబ్బు చిహ్నం మాత్రమే అనీ, విలువైన లోహాల విలువ ఊహాత్మకమనీ చెప్పారు. డబ్బు ఒక వస్తువుకి చిహ్నం. దానికి ప్రతినిధిగా ఉంటుంది అన్నాడు 1767 లో ఫ్రెంచ్ రాజకీయ తత్వవేత్త మాంటెస్క్యూ. ఆర్థిక వేత్తలకంటే ముందే లాయర్లు చెప్పారు. రాజుల అధికారానికి సేవచేస్తూ వారు, నాణేల విలువని తగ్గించే అధికారం రాజుకు ఉన్నదని ప్రచారం చేశారు. రోమన్ చట్టం ప్రకారం, డబ్బు విలువని రాజశాసనం నిర్ణయిస్తుంది.

ఫ్రెంచ్ ఆర్థికవేత్త లె ట్రాస్నే (1728–1780) ప్రకారం: డబ్బు కేవలం చిహ్నం కాదు, ఎందుకంటే దానికదే సంపద. అది విలువలకి ప్రాతినిధ్యం వహించదు. అది వాటి సమానకం. కొన్ని చర్యలలో డబ్బు బదులు దాని చిహ్నాలని వాడవచ్చు. అది మరొక పొరపాటు అభిప్రాయానికి తావిచ్చింది. ఏమంటే: డబ్బు దానికదే కేవలం చిహ్నం మాత్రమే. పెళ్లి ఉంగరం ఒక చిహ్నం. అది దాని నించి స్వతంత్రంగా ఉండే ఒక సంబంధాన్ని తెలిపే చిహ్నం. అయితే, బంగారు నాణెం విలువ యొక్క చిహ్నం కాదు. దాని కదే విలువ.

**3. డబ్బు మనిషి ఆలోచన వల్ల ఏర్పడ్డది అనేది మూడో పొరపాటు అభిప్రాయం.** అంటే, డబ్బుని మనిషి కావాలని ఏర్పరిచాడు. ఇది తప్పు. డబ్బు మారకాల అభివృద్ధిలో తప్పనిసరై ఏర్పడ్డది. ఒక సరుకు సమానక రూపం, ఆసరుకు విలువ పరిమాణాన్ని తెలియ జెయ్యదు. బంగారం డబ్బని తెలిసినా, అది తెలియడం వల్ల, 10 పౌన్ల బంగారం విలువ ఎంతో తెలియదు. బంగారం కూడా తన విలువని ఇతర సరుకుల రీత్యా మాత్రమే వ్యక్తంచేయ్యగలదు. దాని సొంత విలువ, దాని ఉత్పత్తికి అవసరమైన శ్రమ కాలం చేత నిర్ణయం అవుతుంది; ఆ విలువ అంతే శ్రమ కాలం ఇమిడివున్న మరొక సరుకు పరిమాణంలో వ్యక్తీకరణ పొందుతుంది. ఇక్కడ మార్క్స్ ఫుట్ నోట్ లో విలియం పెట్టీ ఉదాహరణని చూపాడు: ఒకటొక బుషెల్ ధాన్యాన్ని ఎంత కాలంలో పండించ గలడో, అంతే కాలంలో పెరూ గనులనుండి ఒక ఔన్సు వెండి తేగలిగితే ఒకటి మరొకదాని సహజ ధర. సులువుగా తవ్వగల కొత్త గనుల నుండి అతను ఇంతకు ముందు ఔన్సు తెచ్చిన కాలంలోనే 2 ఔన్సుల వెండి తెస్తే, అంతకు ముందు 5 షిల్లింగులున్న బుషెల్ ధాన్యం, ఇప్పుడు 10 షిల్లింగులు అవుతుంది. బంగారం విలువ ఎంత అనేది అది ఉత్పత్తయిన చోట బార్టర్ ద్వారా నిర్ణయం అవుతుంది. అది డబ్బుగా చలామణీ లోకి వచ్చేటప్పటికే, దాని విలువ నిర్ణయమై ఉంటుంది. 17 వ శతాబ్దం చివరి దశాబ్దంలో డబ్బూ ఒక సరుకే అని తెలిసింది. అయితే విశ్లేషణలో ఈ గ్రహింపు పసిదశ మాత్రమే. డబ్బు కూడా సరుకే అని గ్రహించడంలో, చిక్కేమీ లేదు. ఉన్న చిక్కంతా ఒక సరుకు ఎలా, ఎందుకు, దేనిద్వారా డబ్బు అవుతుందో తెలుసుకోవడంలో ఉంది.

## డబ్బు ఇంద్రజాలం

మనం ఇప్పటికే ఒక విషయాన్ని గమనించాం. ఏమంటే, అత్యంత ప్రాథమిక విలువ వ్యక్తీకరణలో, ఏ వస్తువు మరొక వస్తువు విలువ పరిమాణానికి ప్రతినిధిగా ఉంటుందో, ఆవస్తువు సమానక రూపాన్ని కలిగి ఉంటుంది. 20 గజాల బట్ట = 1 కోటు – ఇక్కడ సమానకం కోటు. అయితే ఈ సంబంధంతో నిమిత్తం లేకుండానే, ఆరూపం ఆవస్తువుకు ఉన్నట్లు అగపడుతుంది. అంటే, అది దానికి ప్రకృతి ప్రసాదించిన సామాజిక ధర్మం అయినట్లు కనబడుతుంది. అన్ని ఇతర సరుకులూ తమ విలువల్ని బంగారంలో వ్యక్తం చెయ్యడం వల్ల బంగారం డబ్బు అయినట్లుగా కాకుండా, అందుకు వ్యతిరేక దిశలో బంగారం డబ్బు అయినందువల్లనే అన్ని ఇతర సరుకులూ బంగారంలో తమ విలువల్ని వ్యక్తం చేస్తున్నట్లు అగపడుతుంది. ఒకసరుకు డబ్బు కావడంలో ఉన్న దశలన్నీ జాడైనా లేకుండా మాయమవుతాయి. ఈ సరుకులు వెండీ, బంగారమూ. అవి భూగర్భం నుండి బయటకు రాగానే, సమస్త మానవ శ్రమకీ ప్రత్యక్ష అవతారాలుగా ఉంటాయి. అదే డబ్బు ఇంద్రజాలం. సరుకు ఉత్పత్తి దారుల సమాజం క్రమబద్ధమైన అభివృద్ధి ఒక విశేషమైన సరుకు (privileged commodity) మీద డబ్బు స్వభావాన్ని ఎలా ముద్రిస్తుందో చూశాం. అందువల్ల, డబ్బు మన ముందు పెట్టిన చిక్కు ప్రశ్న (riddle), సరుకులు లేవనెత్తిన చిక్కు ప్రశ్నే. ఇప్పుడు కళ్ళు చెదిరే రూపంలో మీదిమీదికి వస్తున్నది. అంతకు మించి మరేమీ లేదు.

## అధ్యాయం 3

# డబ్బు లేక సరుకుల చలామణీ

### విభాగం 1 విలువల కొలమానం

బంగారమే డబ్బు సరుకుగా ఉన్నది - అనుకొని మార్క్స్ పరిశోధన సాగిస్తాడు. ఈ అధ్యాయం మొదటి వాక్యం: సరళత కోసం, ఈపుస్తకం అంతటా 'డబ్బుసరుకు' గా బంగారం ఉన్నదని అనుకుంటాను. అంటే డబ్బుగా ఉండే సరుకు ఏఏ చర్యలు చేస్తుందో, బంగారం ఆయా చర్యలు చేస్తుంది.

#### డబ్బు చేసే చర్యలు

1. డబ్బు ప్రధాన విధి సరుకుల విలువని తెలపడం. ఇప్పుడు ఏ సరుకు విలువ పరిమాణం అయినా బంగారం పరిమాణంలో వ్యక్తమవుతుంది. ఉదాహరణకు, 100 కిలోల బియ్యం = 1 గ్రాము బంగారం. రెండూ సరుకులే. రెంటిలోనూ ఒకే పరిమాణంలో అనిర్దిష్ట మానవ శ్రమ ఇమిడి ఉంది. కనుక 100 కిలోల బియ్యం విలువని 1 గ్రాము బంగారం వ్యక్తం చేస్తుంది. ఈవిధి నిర్వహణ ద్వారా మాత్రమే బంగారం డబ్బు అవుతుంది. అంటే,

**బంగారం దానికదిగా మొదటినించీ డబ్బుకాదు.** ఎందుకంటే, ఎంతో కాలం ఒక సరుకు విలువ ఇతర సరుకుల ద్వారా వ్యక్తమయ్యేది. అప్పుడు బంగారం కూడా అన్ని సరుకులవంటి సరుకే, కాని, డబ్బు సరుకు కాదు. అయితే ఒకప్పటికి, అన్ని సరుకుల విలువల కొలమానంగా బంగారాన్ని సమాజం గుర్తించింది.

అప్పుడు బంగారం డబ్బు సరుకు అయింది. సరుకువిలువని బంగారంలో చెప్పడమే డబ్బురూపం. అదే ధర. ఏసరుకు విలువనైనా బంగారంలో చెప్పవచ్చు. అంటే ప్రతిసరుక్కీ ధర ఉంటుంది.

**డబ్బుకూడా సరుకే కదా. మరి డబ్బుకి ధర ఉంటుందా?** ఉండదు. ఎందుకు ఉండదు?

డబ్బు రీత్యా విలువ వ్యక్తీకరణే ధర. డబ్బు ధర అంటే డబ్బులో వ్యక్తమయ్యే డబ్బు విలువ. అంటే డబ్బువిలువ డబ్బులోనే చేబితే అది దాని ధర. ఏ సరుకు విలువ ఆసరుకు రీత్యా వ్యక్తం కాదు అని తెలిసిందే.

1 గ్రాము బంగారం = 1 గ్రాము బంగారం- అనేది అర్థవంతమైన విలువ సమీకరణ కాదు. ధనానికి ధర ఉండదు. అయితే డబ్బు సరుకు విలువని అన్ని ఇతర సరుకుల రీత్యా చెప్పవచ్చు:

1 గ్రాము బంగారం = 100 కిలోల బియ్యం = 4 మంచాలు = 10 పంచెలు … వగయిరా. అయితే ఇక్కడ వ్యక్తమయింది బంగారం విలువే. కాని 100 కిలోల బియ్యం అనేది

బంగారం ధర కాదు. బంగారంలో చెబితేనే అది ధర. ఏ ఇతర సరుకుల్లో చెప్పినా అది ధరకాదు.

**ధర అనేది కేవలం మనసులో ఉండేదే.** సరుకుల ధర సరుకుల భౌతిక రూపానికి భిన్నమైనది. అందువల్ల ధర అనేది కేవలం మనసులో ఉండేదే. మానసిక రూపం మాత్రమే. ఇనుం, బట్ట, ధాన్యం వంటి సరుకుల విలువ కనబడదు. కాని వాటిలో వాస్తవంగా ఉంటుంది. అది బంగారంతో సమపరచబడడం చేత మనసులో తెలుసుకోడానికి వీలవుతుంది. అందువల్ల తమ సరుకుల ధర ఎంతో వాటి ఓనర్లు చెప్పాలి. లేకపోతే, ఒక చీటీని వాటికి కట్టాలి. అప్పుడు మాత్రమే వాటిధరలు ఇతరులకి తెలుస్తాయి.

**ధర ఎంతో చెప్పడానికి బంగారం అక్కడ ఉండక్కర లేదు.** సరుకుల విలువని ధరగా వ్యక్తం చెయ్యడానికి అక్కడ బంగారం ఉండక్కర్లేదు. చిన్నమెత్తు బంగారం లేకుండానే లక్షల పౌన్ల విలువగల సరుకుల్ని అంచనా కట్టవచ్చు. విలువ కొలమానంగా వాడేటప్పుడు, డబ్బు ఊహాత్మక డబ్బు (imaginary) గా మాత్రమే ఉంటుంది. అంటే ఊహలో మాత్రమే ఉండే డబ్బు అని. "ఇంగ్లండ్ సంపదనంతా వెలగడితే, ఆ వెలని పొందడానికి ప్రపంచంలోనే అంత డబ్బు లేదు అని అందరికీ తెలుసు. ఇక్కడ డబ్బు ఒక కాటగరీగా, ఒక మానసిక సంబంధంగా మాత్రమే అవసరం" అని వివరిస్తాడు తన రచన గ్రుండ్రిసే (Grundresse) లో.

### మరొక విషయం, రెండు సరుకులు కొలమానాలుగా కుదరవు

బంగారం వెండి వంటి రెండు సరుకులు ఒకేకాలంలో విలువ కొలమానాలుగా ఉన్నట్లయితే, అన్ని సరుకులకీ రెండు ధరలుంటాయి - ఒకటి బంగారం ధర, రెండు వెండి ధర. ఆ రెండు లోహాల ధరల నిష్పత్తి 15:1 అనుకుందాం. ఆ నిష్పత్తి మారకుండా ఉన్నంత కాలమూ ఆరెండు ధరలూ పక్కపక్కనే కొనసాగుతాయి. నిష్పత్తి మారితే, బంగారంలో చెప్పే ధర, వెండిలో చెప్పే ధరల నిష్పత్తి మారుతుంది. ఇలా మారడం ప్రమాణం విధికి పొందికలేనిది. రుజువుగా మార్క్స్ చారిత్రక వాస్తవాలు చూపుతాడు:

వెండి బంగారాల విలువలు మారకుండా ఉన్నంతవరకూ అవి రెండూ డబ్బుగా పనిచేస్తాయి. దేని విలువ మారినా చిక్కు ఏర్పడుతుంది. ఒకప్పుడు బంగారం విలువ పెరిగితే, మరొకప్పుడు వెండి విలువ పెరిగేది. తన విలువ కంటే తాత్కాలికంగా తక్కువగా అంచనా వెయ్యబడిన లోహం, చలామణీ నించి తప్పించబడేది, కరిగించబడి ఎగుమతి చేయబడేది. అప్పుడు మళ్ళీ ఆ లోహాల నిష్పత్తిని చట్టం మార్చేది. అయితే త్వరలోనే మళ్ళీ ఈ నామక నిష్పత్తికీ, వాస్తవ నిష్పత్తికీ తేడా వచ్చేది. పాత కథ పునరావృతమయ్యేది. అనుభవమూ, చరిత్రా చెప్పేదేమంటే: **రెండు సరుకులు విలువ కొలమానాలుగా ఉన్న ప్రతిచోటా ఒక్కటి మాత్రమే ఆచరణలో ఆ స్థానాన్ని నిలుపుకుంటుంది.**

## 2. డబ్బు నిర్వర్తించే మరొక విధి ధరల ప్రమాణంగా ఉండడం

5 బస్తాల బియ్యంలో ఎంత శ్రమ ఉందో, అంతే శ్రమ ఒక గ్రాము బంగారంలో ఉంది అని తెలిసినంత మాత్రాన బియ్యం ధర తెలిసినట్లు కాదు. అందుకు ఎంత బంగారం ఒక

డబ్బు యూనిట్ అవుతుందో కూడా తెలియడం అవసరం. ఈ రెండవ మెట్టు ధరల ప్రమాణంగా బంగారం విధి. ఇది విలువ కొలమానం కన్నా ఉన్నతమైన విధి కాదు, అనుబంధ విధి. సాంకేతిక విధి. విలువ కొలమానంగా దాని విధి నిర్వహణలో, బంగారం ప్రతిసరుకునీ కొంత బంగారంతో అనుసంధానం చేస్తుంది. చేశాక భిన్న బంగారం పరిమాణాల్ని, ఒకదానితో ఒకటి పోల్చాల్సిన అవసరం కలుగుతుంది. ఈ పోలికలో బంగారం విలువల ప్రమాణంగా వ్యవహరిస్తుంది.

10 చొక్కాలు =1 గ్రాము బంగారం

ఒక జత ఎద్దులు = 10 గ్రాముల బంగారం వగయిరా

ఈ సరుకుల విలువలు భిన్న పరిమాణాల బంగారంలోకి మనస్సులో మారతాయి. కనుక ఎన్నో రకాల సరుకులున్నా, వాటి విలువలు బంగారం పరిమాణాలు అవుతాయి. ఇప్పుడవి ఒకదానితో ఒకటి పోల్చడానికీ, కొలవడానికీ సాధ్యమవుతాయి. ఒక నిర్దిష్ట పరిమాణం ఉన్న బంగారం **కొలత యూనిట్** సాంకేతికంగా అవసరమవుతుంది.

### విలువల కొలమానానికీ, ధరల ప్రమాణానికీ మధ్య అనుకూలతా ప్రతికూలతా

షాపుల్లో చీటీ మీద ధర ఫలానింత బంగారం అని ఉండదు. పౌన్లలోనో, మరొక కరెన్సీలోనో ఉంటుంది. పౌను అనేది ఒక నిశ్చిత పరిమాణంలో ఉన్న బంగారం. అది ఒక **కొలత యూనిట్** గా ఉంటుంది.

1 టేబుల్ = 5 పౌన్లు అనుకుందాం. ఇక్కడ డబ్బు రెండు పనులు చేస్తుంది:

ఒకపక్క విలువ కొలమానంగా, 1 టేబుల్ = 3 ఔన్సుల బంగారం.

మరొక పక్క ధరల ప్రమాణంగా, అంటే, ఆ బంగారం ఎన్ని పౌను నాణేలు అవుతుందో అన్ని నాణేలలో చెప్పడం.

ఆవిధంగా డబ్బు రెండు పూర్తిగా భిన్నమైన పనులు చేస్తుంది:

1. విలువ కొలమానంగా ఉండడం
2. ధర ప్రమాణంగా వ్యవహరించడం.

### రెంటికీ తేడాలు

A. సమాజం గుర్తింపుపొందిన మానవ శ్రమ అవతారంగా డబ్బు విలువ కొలమానం, ఒక లోహం యొక్క నిశ్చితమైన బరువుగా అది ధర ప్రమాణం.

పౌను ఇంగ్లండ్ డబ్బు పేరు. అది ఒక పౌను వెండిబిళ్ళ. కనుక అది ధర ప్రమాణం.

B. విలువ కొలమానంగా అది అన్ని సరుకుల విలువల్నీ ధరల్లోకి మారుస్తుంది. అంటే ఊహాత్మక బంగారు పరిమాణాల్లోకి మారుస్తుంది.

ధర ప్రమాణంగా అది ఈ బంగారు పరిమాణాన్నే కొలుస్తుంది. ఆ బంగారం మొత్తం ఎన్ని పౌన్ల బిళ్లలో చెబుతుంది.

C. విలువల కొలమానం విలువలుగా పరిగణించిన సరుకుల్ని కొలుస్తుంది. ధర ప్రమాణం అలాకాకుండా, బంగారం పరిమాణాల్ని, బంగారం యూనిట్ పరిమాణంతో కొలుస్తుంది. బంగారం ధర ప్రమాణంగా ఉండాలంటే, ఒక నిర్దిష్ట పరిమాణం గల బంగారం యూనిట్ ఏర్పడాలి.

ఒకే పేరుగల పరిమాణాల్ని కొలిచేటప్పుడు స్థిరంగా ఉండే యూనిట్ ఉండడం ముఖ్యం. అలాగే విలువ పరిమాణాల్ని కొలవడానికి కూడా మారని యూనిట్ అవసరం. ఈ యూనిట్ (ఇక్కడ బంగారం పరిమాణం) ఎంత తక్కువగా మార్పుకి లోనయ్యేదయితే, ధర ప్రమాణంగా అంత చక్కగా విధి నిర్వర్తిస్తుంది. శ్రమ ఉత్పాదకతలో వచ్చే ప్రతిమార్పూ ఉత్పాదితం విలువని మారుస్తుంది. బంగారం కూడా శ్రమ ఉత్పాదితమే. అందువల్ల బంగారం విలువ కూడా మారుతూ ఉంటుంది

## మరైతే విలువ స్థిరంగా ఉండని బంగారం, ధరల ప్రమాణంగా ఉండగలదా?

శ్రమ ఉత్పాదితం అయినందువల్లనే దాని విలువలో మార్పులు వచ్చే అవకాశం ఉంది. కనుకనే బంగారం విలువ కొలమానంగా ఉపకరించగలదు. ఏ సరుకు విలువ అయినా మారుతుంటుంది, ఎందుకంటే, సరుకు విలువ దాన్ని ఉత్పత్తిచేసిన శ్రమ ఉత్పాదకతని బట్టి ఉంటుంది. శ్రమ ఉత్పాదకత మారుతూ ఉంటుంది. కనుక సరుకుల విలువ మారుతూ ఉంటుంది. బంగారమూ సరుకే. కనుక దాని విలువ మారుతూ ఉండవలసిందే.

**"మారుతూ ఉండడం అనేది విలువ లక్షణం"[1]**

బంగారం విలువ మారుతూ ఉన్నా, ధరల ప్రమాణంగా పనిచెయ్యడానికి ఆటంకం ఏమీ ఉండదు. ఎలాగో చూద్దాం:

బంగారం విలువ ఎంతమారినా, బంగారం పరిమాణాలు ఒకదానికొకటి అదే నిష్పత్తిలో ఉంటాయి.

ఉదాహరణకి, బంగారం విలువ 1000 శాతం పెరిగినా, తగ్గినా అంతకు ముందులాగే 12 ఔన్సుల బంగారం, ఒక ఔన్సుకి 12 రెట్ల విలువే కలిగి ఉంటుంది. ధరలకి సంబంధించి, వివిధ బంగారు పరిమాణాల నిష్పత్తి తోనే పని. కనుక బంగారం నిశ్చిత ధరల ప్రమాణంగా పనిచెయ్యగలదు – దాని విలువ ఎంత మారినా. ఎందుకంటే, బంగారం విలువ ఎంత పెరిగినా ఎంత తగ్గినా ఒక ఔన్సు బంగారం బరువులో తేడా రాదు. అలాగే ఔన్సులోని భాగాల బరువులోనూ మార్పు ఏర్పడదు. ఇతర సరుకుల విలువలు స్థిరంగా వుండి, బంగారం విలువ తగ్గితే, సరుకుల ధరలు పెరుతాయి, బంగారం విలువ పెరిగితే సరుకుల ధరలు తగ్గుతాయి. అయితే వాటి విలువలకి అనుగుణంగా లెక్కించాలి కనుక ఒక సరుకును మరొక సరుకు పోలికలో అదే విలువ వుంటుంది. మార్క్స్ చెప్పినట్లు "2:4:8 అనే నిష్పత్తి, 1:2:4 గా మారినా, 4:8:16 గా మారినా తేడా ఏమీ ఉండదు."[2] కనుక బంగారం ధర ప్రమాణంగా ఉండగలదు – దాని విలువ మారుతూ ఉన్నా. తేలిందేమంటే, బంగారం విలువలో వచ్చే మార్పు ధర ప్రమాణంగా, బంగారం విధి నిర్వహణ మీద ప్రభావం చూపదు.

## బరువుల పేర్లనించి డబ్బుపేర్లు వేరయినాయి

మొదట్లో డబ్బు ప్రమాణాలకి పెట్టిన పేర్లు బరువు ప్రమాణాల నించి వచ్చినవే. డబ్బుగా ఉండే లోహం వివిధ బరువులలో ఉన్న ఇప్పటి డబ్బుపేర్లకూ, మొదట్లో ఆపేర్లు ప్రతినిధులుగా వున్న వాస్తవ బరువులకూ తేడా అంతకంతకూ ఎక్కువవుతున్నది. ఇందుకు చారిత్రక కారణాలున్నాయి. వాటిలో ముఖ్యమైనవి:

1. సరిగా అభివృద్ధి చెందని కమ్యూనిటీలోకి విదేశీ డబ్బు దిగుమతి గావడం. పాతరోజుల్లో రోమ్ లో అదే జరిగింది. అక్కడ వెండి, బంగారు నాణేలు విదేశీ సరుకులుగా చలామణీ అయ్యాయి. ఆ విదేశీ నాణేల పేర్లు స్వదేశీ బరువులతో సరిపోలేదు.
2. లోహాలు డబ్బు పదార్థాలుగా వున్నప్పుడు, డబ్బు ప్రమాణానికి పెట్టిన పేర్లన్నీ బరువు ప్రమాణాల నించి తీసుకున్నవే. సంపద పెరిగేకొద్దీ, తక్కువ విలువ వున్న లోహాన్ని ఎక్కువ విలువ వున్న లోహం విలువ కొలమానంగా తొలగించింది. రాగిని తప్పించి వెండి వచ్చింది. అప్పుడు పౌను అనేది పౌను వెండికి పెట్టిన డబ్బు పేరు. తర్వాత వెండిని తప్పించి బంగారం ఆ స్థానాన్ని ఆక్రమించింది. పౌను వెండికి విలువలో సమానమైన బంగారం యూనిట్ అయింది. వెండితో పోలిస్తే ఆనాడు బంగారం విలువ 15 రెట్లు. కనుక పౌనులో 15వ వంతు బంగారం యూనిట్ అయింది. అయితే పౌను అనే పేరు అలానే కొనసాగింది. ఆ కారణంగా, డబ్బు పేరుగా పౌనూ, బంగారం బరువుగా పౌనూ, వేరువేరు అంశాలు అయ్యాయి.
3. రాజులు, శతాబ్దాల తరబడి కరెన్సీ విలువని తగ్గించారు. ఎంతగానంటే, నిజానికి మొదటి నాణేల బరువుల్లో పేర్లు మినహా మరేమీ మిగల్లేదు. ఈ చారిత్రక కారణాల వల్ల బరువు పేరునుండి డబ్బు పేరు వేరవడం ఆ కమ్యూనిటీలలో అలవాటుగా మారింది.

డబ్బు ప్రమాణం, ఒకపక్క, కేవలం వాడుకకి సంబంధించింది. మరొకపక్క, అది ప్రజామోదం పొంది ఉండాలి. అందువల్ల, చివరికి అది చట్టం ద్వారా క్రమబద్ధం కావాలి. ఒకానొక విలువైన లోహం నిశ్చిత బరువు, ఉదాహరణకి ఒక ఔన్సు బంగారం అధికారికంగా కొన్ని భాగాలుగా విభజితమవుతుంది. ఆ భాగాలకు చట్టం పెట్టిన పౌను, డాలర్, వంటి పేర్లు వస్తాయి. డబ్బు ప్రమాణాలుగా ఉండే ఈ భాగాలు ఉపభాగాలుగా విభజితమవుతాయి. వాటికి షిల్లింగులు, పెన్నీలు వంటి చట్టం పెట్టిన పేర్లు ఉంటాయి. అయితే ఈ విభాగాలు కాక ముందూ, అయిన తర్వాతా కూడా ఒక నిశ్చిత బరువుగల లోహమే 'లోహం డబ్బు' ప్రమాణం. మార్పు కేవలం ఉపవిభజన లోనూ, భాగాల పేర్లలోనూ మాత్రమే. బంగారం మొత్తాల్లోకి ఊహలో మార్చిన సరుకుల విలువలే ధరలు. ఇప్పుడు నాణేల పేర్లలో ధరలు వ్యక్తమవుతాయి. ఒక క్వార్టర్ గోధుమలు ఒక ఔన్సు బంగారం అనే బదులు 3 పౌన్లా 17 షిల్లింగులా 10 పెన్నీలు అని చెబుతాం. ఈ విధంగా సరుకులు వాటి విలువని ధరలద్వారా వ్యక్తం చేసుకుంటాయి.

## విలువకీ ధరకీ మధ్య పొంతన లేకపోవడం

ధర సరుకు విలువపరిమాణాన్ని తెలిపేదయినందువల్ల, డబ్బుతో అది మారే నిష్పత్తిని తెలుపుతుంది. అంతమాత్రాన, ఈ మారక నిష్పత్తిని తెలిపేది తప్పనిసరిగా సరుకు విలువ

## ద్రవ్య సంక్షోభం

అయితే లావాదేవీలు మనం ఇంతకు ముందిచ్చిన ఉదాహరణలో చెప్పినంత సులువుగా జరగవు. ఎలాగంటే, మన నేతగాడు నాలుగు నెలల్లో తన సరుకు అమ్ముడవుతుంది అనుకొని, వడికేవాడికి రు.1000 చెల్లించేందుకు 4 నెలలు గడువు పెట్టుకున్నాడు అనుకుందాం. అయితే అతను తన సరుకు అమ్మలేకపోయాడు అనుకుందాం. వడికే వాడేమో తనకి డబ్బు అందుతుందనీ, ఇస్తాడనీ ఎదురు చూస్తుంటాడు. ఎందుకంటే తను వ్రడంగికి చెల్లించాలి. ఆ వ్రడంగి మరొకరికెవరికో ఇవ్వాలి. ఇలా...ఒకరి చెల్లింపు ఆగిపోతే, వరసగా మరికొంతమంది చెల్లింపులు ఆగిపోతాయి. అమితోత్పత్తి కారణంగా, కొందరు ఉత్పత్తిదారులు తమ సరుకులు అమ్ముకోలేకపోతే, చెల్లింపులకి డబ్బు కొరత ఏర్పడుతుంది. ద్రవ్య సంక్షోభం తలెత్తుతుంది. చెల్లింపులు పరస్పరం రద్దవడం సామాజిక స్థాయిలో వీలవకపోతే, చెల్లించాల్సిన బాధ్యతలు సెటిల్ చెయ్యడానికి అందుబాటులో ఉన్న డబ్బు సరిపోదు. ఎక్కువ కావాలి. అప్పుడు ద్రవ్య సంక్షోభం ఏర్పడుతుంది. ఖాతా డబ్బు అకస్మాత్తుగా, తక్షణమే నగదులోకి మారుతుంది. అప్పు విధానం నుంచి ఆకస్మికంగా నగదు విధానానికి వెనుదిరగడం భయోత్పాతాన్ని కలిగిస్తుంది.

పేదలు పనిలేక కాళీగా ఉంటారు. కారణం పనివ్వడానికి ధనవంతులదగ్గర, యచ్చాలూ, బట్టలూ ఇవ్వడానికి గతంలోలాగే భూమీ, చేతులూ ఉన్నప్పటికీ, డబ్బు లేకపోవడం. లేడి నీటికోసం ఎలా పరితపించి పోతుందో, ఏకైక సంపద రూపం అయిన డబ్బు కోసం బూర్జువా ఆత్మ అలా పరితపిస్తుంది. ఆ పరిస్తితుల్లో సంపద అంటే ఒక్క డబ్బే. సంక్షోభం వచ్చే ముందు మత్తుగొలిపే భారీ సంపదవల్ల కలిగిన స్వయం సమృద్ధి భావనతో ఉన్న బూర్జువా డబ్బు అనేది నిష్ఫలమైన ఊహ మాత్రమే అంటాడు. సరుకులు మాత్రమే డబ్బు. అయితే ప్రస్తుతం **ప్రతిచోటా ఒకటే కేక: డబ్బు మాత్రమే సరుకు.** సంక్షోభంలో డబ్బు కరువు కొనసాగుతుంది.

**అలాంటి పరిస్థితుల్ని వ్యాపారులు తమకనుకూలంగా వినియోగించుకుంటారు.** 1839 లో ఒక సందర్భంలో స్వార్ధపరుడైన ఒక బాంకర్ అతను కూర్చున్న డెస్క్ తెరిచి నోట్ల కట్టలు ఒక మిత్రుడికి చూపాడు. అవి 6 లక్షల పౌండ్లు అని ఆనందపడుతూ చెప్పాడు. డబ్బు చలనంలో లేకుండా ఉంచడానికి వాటిని బిగబట్టినట్లూ, అదే రోజు 3 గంటలు కొట్టాక విడుదల చేయబోతున్నట్లూ చెప్పాడు. 1864 ఏప్రిల్ అబ్జర్వర్ లో ఇలాఉంది: బాంక్ నోట్ల కొరత సృష్టించడానికి అవలంబించే సాధనాల గురించి ఆసక్తికరమైన రూమర్లు చక్కర్లు కొడుతున్నాయి ... అలాంటి ట్రిక్కులు పన్నుతారని అనుకోవడం సందేహించదగినదే అనిపించినా, ఆ రిపోర్టు సర్వత్రా ఉన్నది కనక దాన్ని ప్రస్తావించడం నిజంగా సముచితం.

## ఒక నిర్ణీత కాలంలో చలనంలో ఉండే డబ్బు మొత్తం

చలనవేగమూ, చెల్లింపు సాధనాల చలన వేగమూ నిర్దిష్టంగా వున్నప్పుడు చలనంలో ఉండే డబ్బుమొత్తం = సిద్ధించాల్సిన ధరలమొత్తం + చెల్లించాల్సిన బాకీల మొత్తం – ఒకదాన్నొకటి రద్దుపరుచుకునే చెల్లింపులు – ఒకసారి చలామణీ సాధనంగానూ, మరొకసారి చెల్లింపు సాధనంగానూ ఉపకరించే ఒకే నాణెం చేసే సర్క్యూట్ల సంఖ్య. దీని ప్రకారం చివరికి వచ్చేదే చలనంలో ఉండే డబ్బుమొత్తం.

**చెల్లింపు సాధనంగా డబ్బు చేసే చర్య నుండి ఖాతా డబ్బు నేరుగా తలెత్తుతుంది.** కొన్న సరుకుల వల్ల ఏర్పడిన అప్పుల పత్రాలు ఆ అప్పుల్ని ఇతరులకు బదిలీ చేయడం కోసం చలామణీ అవుతాయి. మరొక పక్క, అప్పు వ్యవస్థ ఏ మేరకు వృద్ధవుతుందో, ఆ మేరకు చెల్లింపు సాధనంగా డబ్బు చర్య కూడా వృద్ధవుతుంది. ఆపాత్రలో అది తనకు ప్రత్యేకమైన వివిధ రూపాలు – మారకం బిల్లులు (bills of exchange), చెక్కులు, స్థానిక నోట్లు మొదలయిన రూపాలు – తీసుకుంటుంది. ఆయారూపాల్లో అది భారీ వాణిజ్య లావాదేవీల రంగంలో సౌకర్యవంతంగా మసులుకోగలుగుతుంది. మరొకపక్క, వెండి బంగారు నాణేలు ఎక్కువగా చిల్లర వర్తక రంగానికి పరిమితం చేయ బడతాయి.

**ప్రత్యేక చెల్లింపు దినాలు.** ప్రతి దేశంలోనూ వివిధ  చెల్లింపులూ కొద్దివీ పెద్దవీ సెటిల్ చేసుకునే రోజులు ఆనవాయితీగా ఉంటాయి. ఈస్టర్ తర్వాతవచ్చే 8 వ ఆదివారం (Whitsunday). దాని తర్వాత వారం (Whitsuntide). 1824 సంవత్సరం ఆ వారంలో ఎడింబరో బాంక్ కి నోట్ల కోసం విపరీతమైన డిమాండ్ ఏర్పడ్డది. ఎంతగా అంటే 11గంటలకల్లా కస్టడీలో ఒక్క నోటన్నాలేదు. అప్పుకోసం అన్ని బాంకులకూ పంపారు. కాని దొరకలేదు. చాలా లావాదేవీలు కాగితం చీట్లమీద సర్దుబాటు చెయ్యబడ్డాయి. అయితే సాయంత్రం 3 గంటలయ్యేసరికి ప్రొద్దున ఇచ్చిన నోట్లన్నీ తిరిగి బాంకుల్లో పడ్డాయి. అది చేతినుండి చేతికి బదిలీ అవడమే.– స్కాట్ లాండ్‌లో సగటు బాంక్ నోట్ల చలామణీ 3 మిలియన్ల స్టెర్లింగ్ లకు లోపే ఉంటుంది. అయితే సంవత్సరంలో కొన్ని చెల్లింపు రోజుల్లో బాంకర్ల చేతిలో ఉన్న 7 మిలియన్లలో ప్రతినోటూ క్రియాశీలమవుతుంది. ఆసందర్భాలలో నోట్లకి ఒకే ఒక ప్రత్యేక చర్య ఉంటుంది. ఆ పని అయ్యీ అవగానే, అవి ఇచ్చిన బాంకులకే తిరిగి వస్తాయి. చెల్లింపు సాధనం యొక్క చలన వేగం నియమాన్ని అనుసరించి, అన్నినిర్ణీత కాలాల చెల్లింపులకూ కావలసిన చెల్లింపు సాధనం పరిమాణం వాటి గడువుల పొడవుకి అనులోమంగా ఉంటుంది. గడువు కాలం ఎక్కువయితే, ఎక్కువడబ్బు కావాలి, తక్కువయితే తక్కువ డబ్బు కావాలి.

## అప్పులు తీర్చడానికి నిల్వ అవసరం

చలామణీ సాధనంగా డబ్బు అభివృద్ధి చెందడం వల్ల  బాకీల మొత్తాల్ని గడువు తేదీలు వచ్చేటప్పటికి కూడ బెట్టాల్సిన అవసరం ఏర్పడింది. సంపద సముపార్జనకి డబ్బు కూడ బెట్టడం ఒక విస్పష్ట విధానం. చెల్లింపు సాధనం **నిల్వలు ఏర్పడడం** సమాజ పురోగమనంతో పాటు పెరుగుతుంది. అంటే అంతకుముందు సంపదగా డబ్బుని కూడబెట్టడం ఏర్పడి ఉంది. ఖాతా డబ్బు వచ్చాక అప్పులు తీర్చడానికి నిల్వ చెయ్యాల్సిన అవసరం ఏర్పడింది.

**డబ్బు సరుకు విలువలో వచ్చే హెచ్చుతగ్గులు** రుణదాతలమీదా, రుణగ్రహీతలమీదా ప్రభావం చూపుతాయి. డబ్బు సరుకు విలువ తగ్గితే, అది రుణగ్రహీతలకు అనుకూలం, రుణదాతలకు ప్రతికూలం. వాటి విలువ పెరిగితే అది రుణదాతలకు అనుకూలం, రుణగ్రహీతలకు ప్రతికూలం. ఉదాహరణకి, A అనేవాడు B దగ్గర 10 సైకిళ్ళు కొన్నాడు. వాటి ధర 6 బంగారు నాణేలు. ఆడబ్బు 6 నెలల తర్వాత ఇచ్చేట్లు ఒప్పందం చేసుకున్నాడు. అయితే ఆ టయానికి బంగారం

విలువ మూడింట ఒక వంతు పడిపోయింది. అప్పటితో పోలిస్తే, అప్పటి 6 నాణేల విలువ ఇప్పుడు 4 నాణేల విలువకి సమానం. ఇది కొన్న వాడికి A కి అనుకూలం అమ్మిన వాడికి B కి ప్రతికూలం. ఇందుకు విరుద్ధంగా బంగారం విలువ మూడింట ఒక వంతు పెరిగితే, అప్పటి 6 బంగారు నాణేల విలువ ఇప్పుడు 8 బంగారునాణేల విలువకి సమానం. అందువల్ల ఇది అమ్మిన వాడికి, B కి అనుకూలం, కొన్న వాడికి A కి ప్రతికూలం.

**అప్పిచ్చినవాడికీ, పుచ్చుకున్న వాడికీ మధ్య సంబంధాలు మొరటుగా మారవచ్చు**

ప్రాచీన ప్రపంచంలో వర్గపోరాటాలు ముఖ్యంగా అప్పులిచ్చినవాళ్ళకీ, తీసుకున్న వాళ్ళకీ మధ్య పోటీ రూపం తీసుకున్నవే. రోమ్ లో ఈ పోరాటాలు అప్పుపడ్డ సామాన్యుల వినాశనంతో ముగిసింది. వాళ్ళ స్థానంలో బానిసలొచ్చారు. మధ్య యుగాల్లో ఫ్యూడల్ రుణగ్రస్తుల నాశనంతో పోటీ ముగిసింది. 18 వ శతాబ్దం మొదట్లో

"ఇంగ్లండ్ వర్తకుల మధ్య ఉన్న మొరటుదనం మరే ఇతర సమాజాల్లోనూలేదు. ప్రపంచంలో ఏ ఇతర దేశంలోనూ లేదు"– (An Essay on Credit and the Bankrupt Act)

## C. ప్రపంచ డబ్బు (Universal Money)

ఒక దేశపు డబ్బు – అది నాణెం రూపంలో ఉన్నా లేక చిహ్నం రూపంలోఉన్నా – ఆదేశ సరిహద్దుల లోపల మాత్రమే చెల్లుబాటు అవుతుంది. దేశహద్దులు దాటగానే, చెల్లుబాటు అవదు. తన అసలు రూపం అయిన మూస బంగారం రూపాన్నో, వెండి రూపాన్నో తీసుకుంటుంది.

ప్రపంచ మార్కెట్ల మధ్య వర్తకం జరగడానికి, సరుకుల విలువ సర్వత్రా గుర్తింపు ఉండే విధంగా వ్యక్తం కావాలి. అందువల్ల దాని స్వతంత్ర విలువరూపం కూడా సరుకులకి ప్రపంచడబ్బు రూపంలో ఎదురవుతుంది. ప్రపంచ మార్కెట్లలో మాత్రమే డబ్బు సరుకు యొక్క సంపూర్ణ స్వభావాన్ని సముపార్జించుకుంటుంది. డబ్బు శరీర రూపం అనిర్దిష్ట మానవ శ్రమ యొక్క తక్షణ సామాజిక ఆకారం. దాని వాస్తవ రూపం ఈ రంగంలో దాని భావనకి సరిగ్గా సరిపోతుంది.

ఏదేశ మార్కెట్లోనయినా, విలువ కొలమానంగా ఉండే డబ్బు సరుకు ఒకటి మాత్రమే ఉంటుంది. అయితే ఒక దేశంలో ఈ పని బంగారం చేస్తే, మరొకదేశంలో వెండి చేస్తుంది. కాబట్టి ప్రపంచ మార్కెట్లో రెండు విలువ ప్రమాణాలు గుర్తింపు పొంది ఉంటాయి. డబ్బు చర్యలు రెంటిలోనూ జరుగుతాయి. బంగారంలో చెప్పే ధరల్ని వెండిలో ధరలకీ, వెండిలో ధరల్ని బంగారంలో ధరలకీ మార్చాల్సి వస్తుంది. ఇది ఈ రెండు లోహాల సాపేక్ష విలువ మీద ఆధారపడి ఉంటుంది. వాటి సాపేక్ష విలువ ఎప్పటికప్పుడు మారుతూ ఉంటుంది. దాన్ని నిర్ణయించడం కూడా నిరంతర ప్రక్రియగా ఉంటుంది. సరుకుల ఓనర్లు విదేశీ వర్తకానికి ఒకచోట బంగారాన్నీ, వేరొకచోట వెండినీ వాడవలసి వస్తుంది. ఆ విధంగా ప్రపంచడబ్బుగా ప్రతి దేశం వెండినీ, బంగారాన్నీ రెంటినీ వాడుతుంది.[1] బంగారం, వెండి – ఆ రెండు లోహాలూ ప్రపంచ డబ్బే.

**ప్రపంచ డబ్బు విధులు:**

- సార్వత్రిక చెల్లింపు సాధనంగా ఉపకరించడం
- సార్వత్రిక కొనుగోలు సాధనంగా ఉపయోగపడడం
- సార్వత్రిక గుర్తింపు ఉన్న సంపద రూపంగా ఉండడం.

పై విధుల్లో **ప్రపంచ డబ్బు ప్రధాన విధి:** అంతర్జాతీయ వ్యాపార శేషాల్ని (trade balances) పరిష్కరించే చెల్లింపు సాధనంగా పనిచెయ్యడమే. ఈ విధి నిర్వహణకు ప్రతి దేశం లోనూ కొంత నిల్వ అవసరం.

భిన్న దేశాల మధ్య ఉత్పత్తుల మారకాల్లో ఉండే సమతుల్యత దెబ్బ తినవచ్చు. అటువంటి సమయాల్లో వెండి బంగారాలు అంతర్జాతీయ కొనుగోలు సాధనాలుగా పనిచేస్తాయి. అందుకు తగిన నిల్వలు ఉండాలి. దేశంలో చలామణీకి నిల్వ ఎలా అవసరమో, అలాగే ఇంకొక నిల్వ ప్రపంచ మార్కెట్లలో చలామణీకి అవసరం. కాబట్టి, నిల్వల విధులు కొంత వరకూ దేశీయ చలామణీ చర్య నుంచీ, కొంత వరకూ ప్రపంచ డబ్బు చర్య నుండీ ఏర్పడ్డాయి. ఈ రెండో చర్యకి, అంటే ప్రపంచడబ్బు చర్యకి నిజమైన వెండి బంగారాలు తప్పనిసరిగా కావాలి.

అంతర్జాతీయ సర్దుబాటు సులువుగాచేసే నిల్వల సామర్థ్యానికి ఫ్రాన్స్‌ని మించిన ఉదాహరణ లేదు. విదేశీ దండయాత్ర నుండి అప్పుడప్పుడే కోలుకుంటున్న ఫ్రాన్స్, తనపై బలవంతంగా రుద్దిన 'మిత్రదేశాల కూటమి' (allied powers) కి ఇంచుమించు 2 కోట్లు 27 నెలల్లో ఇచ్చింది. పైగా దేశీయ కరెన్సీలో గమనించగలిగే తగ్గుదలగానీ, అస్తవ్యస్తత గానీ, మారకాల్లో ఆందోళన కలిగించే ఆటుపోట్లు గానీ ఏర్పడకుండానే, చెల్లించింది. నాలుగో జర్మన్ కూర్పుకు ఎంగెల్స్ కలిపిన ఇంకొక మంచిఉదాహరణ. 1871-73 కాలంలో ఇదే ఫ్రాన్స్ 30 నెలల్లో అంతకు పదింతలు అంతే సుకరంగా చెల్లించింది. అదికూడా బలవంతంగా తనపై రుద్దినదే. అందులో గణనీయమైన భాగం వెండి బంగారాల్లో చెల్లించింది. అందుకు తగినన్నివెండి బంగారు నిల్వలుండడం వల్లనే ఇది సాధ్యమయింది - అనేది స్పష్టమే.

డబ్బు అంతర్జాతీయ డబ్బుగా అభివృద్ధి చెందినప్పుడు, సరుకు ఓనర్ అన్నిదేశాలకూ చెందినవాడు (cosmopolitan) అవుతాడు. సరుకుల ఓనర్లుగా మాత్రమే వాళ్ళ సంబంధాలు ఉంటాయి. సరుకులకి మత, రాజకీయ, జాతీయ, భాషా పరమైన ఏ అడ్డంకులూ ఉండవు. జాతీయత అనేది నాణెం మీద **గినియా** అనే ముద్ర ఎటువంటిదో అటువంటిది తప్ప మరేమీ కాదు. ఎందుకంటే అదే బంగారం మొత్తం అమెరికా డేగల రూపంలో ఇంగ్లండ్‌కి వస్తే సావరిన్లలోకి మారిపోతుంది. మూణ్ణాళ్ళ తర్వాత పారిస్‌లో నెపోలియన్ గా చలామణీ అవుతుంది. కొన్ని వారాల తర్వాత డకెట్లుగా వెనిస్ లో ఉంటుంది. అతనికి ప్రపంచం మొత్తం - ప్రపంచ మార్కెట్టే - అనిపిస్తుంది [2]

దేశాల మధ్య పరస్పర సంబంధాలు మొత్తం ప్రపంచాన్ని చుట్టివేస్తాయి. ఎంతగానంటే, మొత్తం ప్రపంచం ఒకే ఒక నగరం అనుకొవచ్చు. భూమీ, జంతువులూ, మనుషులూ ఉత్పత్తిచేసే సమస్త సరుకులూ ఉండే శాశ్వత సంత జరిగే ఏకైక నగరంగా భావించవచ్చు.

Montanari, Della Moneta (1683), p. 40[3]

బంగారం, వెండి – వీటి ప్రవాహచలనం ద్వంద్వచలనం. ఒకపక్క, అది ఉత్పత్తయిన చోట్ల నుండి ప్రపంచ మార్కెంట్లన్నిటికీ వ్యాపిస్తుంది:

1. భిన్న జాతీయ చలామణీ రంగాల్లో వివిధ స్థాయిల్లో ఇమిడి ఉండడానికి
2. కరెన్సీని తీసుకెళ్ళేకాలువల్ని నింపడానికి
3. అరిగిపోయిన వెండి బంగారు నాణేలను సరి చెయ్యడానికి
4. విలాస వస్తువులకు తయారీకి
5. నిల్వలుగా ఏర్పడడానికి.

మరొకపక్క, భిన్న జాతీయ చలామణీ రంగాల మధ్య బంగారమూ, వెండీ అటుకీ ఇటుకీ నిరంతరాయంగా ప్రవహిస్తూ ఉంటాయి. తమ దేశ శ్రమ ఇమిడి ఉన్న సరుకుల్ని అమూల్య లోహాలు ఉత్పత్తి చేసే దేశాల వెండి బంగారాలతో మార్చుకునే దేశాలు ఈ ప్రవాహాన్ని ప్రారంభిస్తాయి. మరొకపక్క, భిన్న జాతీయ చలామణీ రంగాల మధ్య బంగారమూ, వెండీ అటుకీ ఇటుకీ నిరంతరాయంగా చలనంలో ఉంటాయి. ఈ చలనం మారక క్రమంలో ఆగకుండా ఏర్పడే హెచ్చుతగ్గుల మీద ఆధారపడుతుంది.

బూర్జువా ఉత్పత్తి విధానం ఒకమేరకు అభివృద్ధి చెందిన దేశాలు నిల్వల ప్రత్యేక చర్యలని సక్రమంగా నిర్వ హించడం కోసం బ్యాంకుల గదుల్లో (strong rooms) ఉన్న నిల్వల్ని కనీస స్థాయికి పరిమితం చేస్తాయి.

**ఈ నిల్వలు సగటు స్థాయిని మరీ మించి ఉంటే,** కొన్నిమినహాయింపులతో, అది సరుకుల చలామణీలో స్తబ్ధతకి (stagnation) ఒక సంకేతం. సరుకుల రూప పరివర్తనల సమ ప్రవాహ అంతరాయానికి సంకేతం.

**References**

1. A Contribution to the Critique of Political Economy p.149-150
2. A Contribution to the Critique of Political Economy p.152-153
3. A Contribution to the Critique of Political Economy footnote p.153

# భాగం 2

# డబ్బు పెట్టుబడి అవడం

# అధ్యాయం 4
# పెట్టుబడి సాధారణ సూత్రం

పెట్టుబడి తలెత్తడానికి సరుకుల ఉత్పత్తి ఉండాలి. సరుకుల చలామణీ, దాని అభివృద్ధి చెందిన రూపం అయిన వాణిజ్యమూ ఉండాలి. చారిత్రకంగా చూస్తే, 16వ శతాబ్దంలో వాణిజ్యం ప్రపంచమంతా విస్తరించింది. ప్రపంచ మార్కెట్ ఏర్పడింది. అప్పటి నుండీ ఆధునిక పెట్టుబడి చరిత్ర ఆరంభమయింది. అంతకుముందే, ఎప్పటినించో డబ్బు ఉంది. ముందు డబ్బు, తర్వాతే పెట్టుబడి. అయితే ప్రతి కొత్త పెట్టుబడీ డబ్బుగానే మార్కెట్లోకి వస్తుంది. ఆ డబ్బు ఒక నిర్దిష్ట ప్రక్రియ ద్వారా పెట్టుబడిగా మార్చబడుతుంది. దీన్ని బట్టి, డబ్బు దానికదిగా, స్వతహాగా పెట్టుబడి కాదు. కాని కొత్తగా మార్కెట్లోకి దిగే పెట్టుబడి డబ్బు రూపంలోనే ఉంటుంది. దీన్ని బట్టి, పెట్టుబడి కాని డబ్బూ ఉంటుంది. పెట్టుబడి అయిన డబ్బూ ఉంటుంది. మొదటిది కేవలం డబ్బుగా ఉన్న డబ్బు. రెండోది పెట్టుబడిగా ఉన్న డబ్బు, రెంటికీ ఉన్న మొదటి తేడా వాటి చలామణీ రూపంలో ఉంది:

## 1. సరళ చలామణీ రూపం

ఒక రైతు తాను పండించిన ధాన్యం అమ్మి, బట్టలు కొంటాడు. ధాన్యం అమ్మడం దేనికి? బట్టలు కొనుక్కోడానికి. ఈ లావాదేవీ ఒక సరుకు అమ్మడంతో మొదలై, మరొకసరుకు కొనడంతో ముగుస్తుంది. ఈ చలామణీ రూపం:

సరుకు – డబ్బు – సరుకు క్లుప్తంగా స – డ – స

సరుకుల్ని అమ్మడంలో ఉద్దేశం: సొంత వాడకం కోసం మరొక రకం సరుకుల్ని కొనడం. ఇది సరుకుల చలామణీ యొక్క అత్యంత సరళ రూపం: స–డ–స.

## 2. పెట్టుబడి చలామణీ రూపం

దీని పక్కనే దీనికి భిన్నమైన రూపం కూడా ఉంది. ఒకడు కొంత డబ్బు పెట్టి ఎరువులు కొంటాడు. వాటిని డబ్బుకే తిరిగి అమ్ముతాడు. ఎరువులు కొనడం దేనికి? అమ్మడానికి. ఈ లావాదేవీ ఒక సరుకు (ఎరువులు) కొనడంతో మొదలై, అదే సరుకు అమ్మడంతో ముగుస్తుంది. దీని సంకేతం:

డబ్బు – సరుకు – డబ్బు. క్లుప్తంగా డ – స – డ

ఈ వలయం డబ్బుతో మొదలై, డబ్బుతో ముగుస్తుంది. ఈ రెండో సరళిలో చలామణీ అయ్యే డబ్బు పెట్టుబడి అవుతుంది.

## ఈ రెంటికీ ఉన్న ఉమ్మడి లక్షణాలు :

డ–స–డ వలయాన్ని మరింత దగ్గరగా పరిశీలిద్దాం అంటాడు. స–డ–స లో ఉన్నట్లే ఇందులోనూ రెండు విరుద్ధ దశలు ఉన్నాయి. మొదటిది డ–స, కొనుగోలు. డబ్బు సరుకులోకి

మారుతుంది. రెండో దశ స-డ, అమ్మకం. సరుకు తిరిగి డబ్బులోకి మారుతుంది. మొత్తం చర్య ఫలితం డబ్బు డబ్బుతో మారకం అవడం,

డ-డ. ఉదాహరణకి, ఒక వర్తకుడు కిలో పత్తిని 1,000 రూపాయలకు కొని దాన్ని 1,100 రూపాయలకు అమ్మితే, 1,000 రూపాయలను 1,100 రూపాయలకు మారకం చేసినట్లు. ఈ చలనం ధాన్యం అమ్మి వచ్చిన డబ్బుతో బట్టలు కొనే రైతు చేతిలో పొందే చలనానికి భిన్నమైనది. అందువల్ల మనం డ-స-డ వలయాన్నీ, స-డ-స వలయాన్నీ వేరుపరిచే లక్షణాల్ని పరిశీలించాలి. అలా చేసే క్రమంలో కేవలం రూపంలోఉన్న భేదం వెనక ఉన్న నిజమైన భేదం దానికదే బయటపడుతుంది.

## రెండు వలయాలకూ ఉన్న తేడాలు

- కొట్టొచ్చినట్టు కనబడే తేడా - వాటిలోని రెండు దశలు తిరగబడిన క్రమంలో ఉంటాయి. డ-స-డ లో ముందు డ-స దశ, తర్వాత స-డ దశ. స-డ-స లో ముందు స-డ దశ తర్వాత డ-స దశ.
- సరళ చలామణీ (స-డ-స వలయం) అమ్మకంతో మొదలై కొనుగోలుతో ముగుస్తుంది. ఇందుకు వ్యతిరేకంగా పెట్టుబడిగా డబ్బు చలామణీ (డ-స-డ వలయం) కొనుగోలుతో ఆరంభమై అమ్మకంతో అంతమవుతుంది.
- స-డ-స లో మొదలూ చివరా రెండూ సరుకులు. డ-స-డ విషయానికొస్తే అదీ ఇదీ డబ్బు.
- స-డ-స లో డబ్బు జోక్యంతో చలనం ఏర్పడింది. డ-స-డ లో కదలిక సరుకు ప్రమేయంతో వచ్చింది.
- స-డ-స చివరలో డబ్బుతో మారిన సరుకు ఉపయోగపు విలువగా ఉపకరిస్తుంది. ఆ డబ్బు అంతటితో ఖర్చయి పోయినట్లే. ఇందుకు భిన్నంగా డ-స-డ లో కొనేవాడు, తర్వాత అమ్మేవాడుగా డబ్బుని తిరిగి పొందడానికే ముందు ఖర్చు చేస్తాడు. సరుకుని కొనడం ద్వారా డబ్బుని చలామణీలో పడేస్తాడు - అదే సరుకుని అమ్మడం ద్వారా డబ్బుని తిరిగి తీసుకోవడానికే. డబ్బుని పోనిస్తాడు - కాని దాన్ని తిరిగి వెనక్కి లాక్కునే కపట ఉద్దేశంతో మాత్రమే. కనుక ఆడబ్బు ఖర్చు చేయబడలేదు, కేవలం బయానా పెట్టబడింది. డబ్బు వెనక్కి తిరిగి వస్తుంది. ఇక్కడే పెట్టుబడిగా డబ్బు చలామణీకీ, కేవలం డబ్బుగా డబ్బు చలామణీకీ తేడా స్పష్టంగా తెలుస్తుంది.
- స-డ-స వలయం ఒక సరుకుతో మొదలై మరొక సరుకుతో ముగుస్తుంది. ఆ రెండో సరుకు చలామణీ నుంచి బయటపడి వాడకంలోకి పోతుంది. ఉపయోగపు విలువ అనేదే దీని గమ్యమూ, లక్ష్యమూ. ఇందుకు వ్యతిరేకంగా డ-స-డ వలయం డబ్బుతో మొదలై డబ్బుతో ముగుస్తుంది. అందువల్ల, దాన్ని నడిపించే ఉద్దేశమూ, దాని లక్ష్యమూ కేవలం మారకంవిలువే.

- సరళ సరుకుల చలామణీలో రెండు చివరలా ఒకే ఆర్థిక రూపం ఉంది. ఇరువైపులా ఉన్న ధాన్యమూ, బట్టలూ రెండూ సరుకులే. సమాన విలువలే. అయితే అవి గుణాత్మకంగా భిన్నమైన ఉపయోగపు విలువలు.

డ–స–డ ఇందుకు భిన్నమైనది. రెండు చివరలా ఒకే ఆర్థిక రూపం ఉంది. అది డబ్బు. అటూ డబ్బే, ఇటూ డబ్బే. కనుక అవి గుణాత్మకంగా భిన్నమైన ఉపయోగపు విలువలు కావు.

**డబ్బుకి డబ్బుని మార్చుకోవడం అర్థం లేనిదా? అర్థవంతమైనదా?** 1,000 రూపాయల్ని పత్తిగా మార్చి, అదే పత్తిని తిరిగి అంతే డబ్బులోకి మార్చడం అసంబద్ధమైనదిగా అగపడుతుంది. అయితే, రెంటి **పరిమాణంలో తేడా ఉంటే, ఆ మారకం అర్థవంతమైనదే** అవుతుంది.

## అదనపు విలువ

1,000 రూపాయలకి కొన్న వాడు అదే పత్తిని బహుశా 1,100 రూపాయలకి తిరిగి అమ్మవచ్చు. అప్పుడు ఆ చర్య అర్థవంతం అవుతుంది. అందువల్ల దీని కచ్చితమైన రూపం డ–స–డ'. ఇందులో డ' = డ+ Δడ.

(1,100 = 1,000+100) అంటే, మొదట పెట్టినది+పెరుగుదల (increment). ఈ పెరుగుదలకే మార్క్స్ అదనపు విలువ అని పేరుపెట్టాడు. ఆయన మాటల్లోనే: ఈ పెరుగుదలనే, అసలు విలువమీద ఎక్కువనే నేను అదనపువిలువ అంటున్నాను. అందువల్ల మొదట అడ్వాన్స్ చేసిన విలువ చలామణీలో చెక్కుచెదరకుండా ఉండడమే కాకుండా, తనకుతాను అదనపు విలువను కలుపుకుంటుంది, లేక తననుతాను పెంపుచేసుకుంటుంది, వ్యాకోచింప చేసుకుంటుంది. దాన్ని పెట్టుబడిలోకి మార్చేది ఈచలనమే.

## హద్దుల్లో ఉండే చలనమూ – హద్దుల్లేని చలనమూ

కొనడం కోసం అమ్మడం అనే చర్యని మళ్ళీ మళ్ళీ చెయ్యడం హద్దుల్లో ఉంటుంది. ఎందుచేతనంటే, దాని లక్ష్యం వాడకం, నిర్దిష్ట కోర్కెలు తీర్చుకోవడం. ఈ లక్ష్యం చలామణీ రంగం బయట ఉంటుంది. అయితే అమ్మడం కోసం కొన్నప్పుడు, అందుకు భిన్నంగా మనం డబ్బుతో మొదలెట్టి డబ్బుతోనే, ముగిస్తాం – ఆవిధంగా చలనం ఎప్పటికీ ఆగిపోదు. సాగుతూనే ఉంటుంది. డ, నిస్సందేహంగా, డ+ Δ డ అవుతుంది 1,000 రూపాయలు 1,100 రూపాయలు అవుతాయి. ఇప్పుడు ఆ 1,100 రూపాయలనూ డబ్బుగా ఖర్చు చేస్తే, ఆ డబ్బు పెట్టుబడి పాత్ర నిర్వహించదు. అది ఇక కాసేపైనా పెట్టుబడి కాదు. చలామణీ నుండి ఉపసంహరించబడడం వల్ల ఆ డబ్బు నిల్వగా ఘనీభవిస్తుంది. ప్రపంచం ఉండే ఆఖరి రోజు (doomsday) దాకా అవి ఆస్థితిలో (నిల్వగా) అలాగే ఉన్నా, ఒక్క పైసా అయినా వాటికి కలవదు.

**విలువ పెరగడమే లక్ష్యంగా పెట్టుకుంటే,** ముందటి 1,000 రూపాయలని పెంచిన ప్రేరణే ఇప్పటి 1,100 రూపాయలనీ పెంచడానికీ ఉంటుంది. మొదటి 1,000 రూపాయలు పెరిగే ప్రక్రియని ప్రారంభించడానికి తగినవిగా ఎలాఉన్నాయో, ఈ 1,100 రూపాయలు కూడా అలాగే తగి ఉన్నాయి. డబ్బు చలనాన్ని ముగించేది మళ్ళీ మొదలుబెట్టడానికే. సరుకుల సరళ చలామణీ

– అంటే కొనడం కోసం అమ్మడం – చలామణీతో సంబంధం లేని ఒక లక్ష్యాన్ని, ఉపయోగపు విలువల్ని సముపార్జించడం, కోర్కెలు తీర్చుకోవడం అనే లక్ష్యాన్ని నెరవేర్చే సాధనం. ఇందుకు విరుద్ధంగా పెట్టుబడిగా డబ్బు చలామణీ దానికదే లక్ష్యం. కారణం విలువ పెరుగుదల నిరంతరం పునరావృతమయ్యే ఈ చలనం లోపల మాత్రమే జరుగుతుంది. అందువల్ల, పెట్టుబడి చలామణీకి పరిమితులు ఉండవు.

ఈ చలనాన్ని ఉద్దేశించిన ప్రతినిధిగా, డబ్బు వాడు పెట్టుబడిదారుడు అవుతాడు. డబ్బు బయలుదేరే చోటూ, తిరిగి వచ్చి చేరే చోటూ అతడి జేబే. డ–స–డ చలామణీకి ప్రాతిపదిక అయిన విలువ పెరుగుదల ఆతని లక్ష్యం అవుతుంది. ఎప్పటికప్పుడు అంతకంత సంపద సొంతం చేసుకోవడమే ఆతని చర్యలకు ఏకైక లక్ష్యం. ఆ మేరకు, అతడు పెట్టుబడి దారుడుగా, అంటే మూర్తీభవించిన పెట్టుబడిగా వ్యవహరిస్తాడు. ఉపయోగపువిలువలు పెట్టుబడిదారుని లక్ష్యాలుగా ఎన్నడూ భావించరాదు. అలాగే ఎదో ఒక లావాదేవీలో వచ్చే లాభం మాత్రమే అతని లక్ష్యంకాదు. అతని లక్ష్యం: ఎన్నటికీ ముగియ కుండా లాభంచేసుకునే నిర్విరామ ప్రక్రియే.

## పెట్టుబడి స్వయం విస్తరణ

ఇప్పుడు స్వయం ప్రవర్ధమాన విలువ దాని జీవితంలో వరసగా తీసుకునే రెండు రూపాల్నీ ఒకదానితర్వాత మరొకదాన్ని చూస్తే, మనం ఈ రెండు ప్రతిపాదనల్ని చేరుకుంటాం:

**1. పెట్టుబడి అంటే డబ్బు 2. పెట్టుబడి అంటే సరుకులు**

వాస్తవానికి ప్రక్రియలో విలువ క్రియాశీలమైన అంశం. ఆ ప్రక్రియలో ఒకసారి డబ్బురూపం, ఇంకోసారి సరుకురూపం అదేపనిగా తీసుకుంటూనే, అదేసమయంలో తన పరిమాణాన్ని మార్చుకుంటుంది. అది సజీవ సంతానాన్ని కంటుంది. లేదా కనీసం బంగారు గుడ్లనైనా పెడుతుంది.

## సరుకు రూపంపొందకపోతే, డబ్బు పెట్టుబడి అవదు

విలువ తన సొంత ఉత్పత్తి యొక్క ప్రతి చర్యనీ మొదలు పెట్టేదీ, ముగించేదీ మళ్ళీ మొదలు పెట్టేదీ డబ్బురూపంలోనే. అది 1,000 రూపాయలుగా మొదలయింది. ఇప్పుడది 1,100 రూపాయలు....ఇంకా అలాగే ముందుకుపోతుంది. అయితే డబ్బు, రెండు విలువ రూపాల్లో ఒకటి మాత్రమే. అయితే అది ఏదో సరుకు రూపం పొందకపోతే, పెట్టుబడి అవదు. ఇక్కడ డబ్బు సరుకుల మధ్య నిల్వ విషయంలో ఉన్నట్లు వైరుధ్యం ఏమీ లేదు. సరుకులు ఎంత రోతగాఉన్నా, దుర్వాసన కొడుతున్నా అవి నిజంగా డబ్బేననీ, అంతకు మించి డబ్బునించి మరింత డబ్బుని పుట్టించే అద్భుతసాధనమనీ, పెట్టుబడి దారుడికి తెలుసు.

అదనపు విలువ 100 రూపాయల వల్లనే, మొదట పెట్టిన 1,000 రూపాయలు పెట్టుబడి అయింది. అలా అయ్యీ అవగానే తేడా లేకుండా పోతుంది. రెండూ ఒకటై 1,100 రూపాయలవుతుంది. ఇప్పుడు విలువ, ఆ విధంగా పెట్టుబడి అవుతుంది. చలామణీ నుండి బయటకొస్తుంది, మళ్ళీ చలామణీలో చేరుతుంది. తన్నుతాను పెంచుకుంటుంది. పెరిగిన మొత్తంగా మళ్ళీ బయటకొస్తుంది. కొత్తగా అదేపనిని ప్రారంభం చేస్తుంది. సిస్మాండీ అన్నట్లు

పెట్టుబడి శాశ్వత స్వయం వర్ధమాన  విలువ. డ–డ'. డబ్బుని తెచ్చే డబ్బే పెట్టుబడి – పెట్టుబడి ప్రథమ వ్యాఖ్యాతలు మర్కెంటలిస్టుల వర్ణన ఇదే.

## మూడు రకాల పెట్టుబడులు

'అమ్మడం కోసం కొనడం', మరీ కచ్చితంగా 'ఎక్కువకి అమ్మడం కోసం కొనడం' (డ–స–డ') అనేది ఒక తరహా పెట్టుబడికి, **వర్తకుని పెట్టుబడికి** మాత్రమే ప్రత్యేకమైన రూపం అయినట్లు అగుపిస్తుంది. అయితే, **పారిశ్రామిక పెట్టుబడి** కూడా డబ్బే, సరుకుల్లోకి మార్చబడి, సరుకుల అమ్మకం ద్వారా మరింత డబ్బులోకి తిరిగి మార్చబడే డబ్బే. కొనడానికీ అమ్మడానికీ మధ్య విరామ సమయంలో, చలామణీ రంగం బయట జరిగే సంఘటనలు ఈ చలనం రూపాన్ని ప్రభావితం చెయ్యవు. చివరగా, **వడ్డీ నిచ్చే పెట్టుబడి** విషయంలో డ–స–డ' చలామణీ కుదించబడినట్లు అగపడుతుంది. మధ్య దశ లేకుండా డ–డ' అనే రూపం అవుతుంది. మరింత డబ్బు అయిన డబ్బు, తనకంటే ఎక్కువైన విలువ అన్నమాట. అందువల్ల, చలామణీ రంగంలో

**పెట్టుబడి సాధారణ సూత్రం: డ–స–డ'**

## అధ్యాయం 5
# పెట్టుబడి సాధారణ సూత్రంలోని వైరుధ్యాలు

డబ్బు పెట్టుబడిలోకి పరివర్తన చెందే చలామణీ రూపం డ-స-డ'. మొదట చలామణీలో పెట్టిన డబ్బు కంటే చివరలో తిరిగి వచ్చే డబ్బు ఎక్కువ. ఇప్పటి దాకా చేసిన పరిశీలనలు పెట్టిన డబ్బు ఎలా పెరుగుతుందో వివరించలేదు.

### స-డ-స లో పెరగని విలువ, డ-స-డ లో ఎలా పెరిగింది?

రెంటిలోనూ స-డ, డ-స అనే రెండు దశలూ ఉన్నాయి. తేడా ఏమిటి? పైకే తెలుస్తూ ఉంది. స-డ-స లో ముందు స-డ దశ, తర్వాత డ-స దశ వస్తాయి. అయితే డ-స-డ లో ముందు డ-స దశ, తర్వాత స-డ దశ వస్తాయి. అంటే, ఈ రెండు వలయాల్నీ వేరుపరుస్తున్నది ఈ దశల ముందు వెనకల తేడాయే. కొనుగోలు, అమ్మకం వరుస తారుమారు కావడమే. ఇది కేవలం రూపంలో తేడా.

### ఈ రూపంలో తేడా, పెట్టిన డబ్బుని ఎలా పెంచుతుంది?

ఉదాహరణ: కిలో ధాన్యం - 30 రూపాయలు (స-డ); 30 రూపాయలు - 1 స్టీల్ గ్లాస్ (డ-స). పూర్తి వలయం స-డ-స.

30 రూపాయలు - కిలో ధాన్యం (డ-స); కిలో ధాన్యం - 35 రూపాయలు (స-డ). వలయం డ-స-డ'

రెండు వలయాల్లోనూ ఉన్నది అవే రెండు దశలు. అయినాగాని రెండో వలయంలో డబ్బు ఎలా పెరిగింది. ఆ 5 రూపాయలూ ఎక్కడనించి వచ్చి కలిశాయి? మారక నియమం ప్రకారం సమాన విలువలే మారకం అవుతాయి. **చలామణీలో తప్పనిసరిగా సమాన విలువల మారకమే ఉంటుంది** - శుద్ధరూపం (pure form) లో ఇది జరిగితే. అయితే, సరుకుల మారకం, విలువలకు అటూ ఇటూగా జరగవచ్చు. సరుకులు వాటివిలువలకు అటూ ఇటూగా ఉన్న ధరలకు అమ్ముడవచ్చు. అది సరుకుల మారక నియమాల్ని అతిక్రమించడంగా అగపడుతుంది.

లె ట్రాస్నే చెప్పినట్లు:

'ఏదో ఒక బాహ్య పరిస్థితి వల్ల, ఇరుపక్షాలలో ఒకరికి ప్రతికూలంగా ఉంటే, అప్పుడు సమానత్వం అతిక్రమించబడుతుంది. అయితే ఈ అతిక్రమణ ఆ బాహ్య కారణం మూలంగా తలెత్తింది కాని, స్వయంగా మారకం నుండి కాదు.'

**స్వచ్ఛమైన రూపంలో సరుకుల మారకం సమాన విలువల మారకమే.** కాబట్టి చలామణీ రంగంలో విలువ మారే అవకాశం ఉండదు.

### ఇంకేమైనా అవకాశాలు ఉన్నాయేమో!

ఎంత చిన్నదాన్నైనా వదలకుండా పరిశీలించడం తప్పనిసరి. అందుకే **మార్క్స్ నిశ్చితాభిప్రాయానికి వచ్చేముందు జాగ్రత్తగా మొత్తం విషయాన్ని చూస్తాడు.** చలామణీలో మారే సరుకులు విలువలో సమానమైనవి కావచ్చు. అసమానమైనవీ కావచ్చు. ఈ రెంటిలో దేనివల్లయినా

అదనపు విలువ వస్తుందేమో చూస్తాడు. సమాన విలువలు మారితే, అదనపు విలువ రాదు. స్వచ్ఛమైన రూపంలో చలామణీ ప్రక్రియ సమాన విలువల మారకాన్ని ఆశిస్తుంది. అయితే, ఆచరణలో ప్రక్రియలు శుద్ధ రూపంలో జరగవు. అందువల్ల మనం అసమాన విలువల మారకాన్ని ఊహిద్దాం.

### అమ్మేవాడు తన సరుకుల విలువకన్నా ఎక్కువకు అమ్మగలిగితే

కారణం తెలియని అవకాశం వచ్చి, అమ్మేవాడు తన సరుకుల విలువకన్నా ఎక్కువకు అమ్మగాలిగాడు అనుకుందాం. 100 విలువ గల సరుకుల్ని 110 కి అమ్మితే అతను 10 అదనపు విలువను జేబులో వేసుకుంటాడు. అయితే ఉన్న సరుకులు అమ్మాక, అతను కొనేవాడు అవుతాడు. ఇప్పుడు మూడో వాడొస్తాడు. అతను సరుకులు కలవాడు. వాటిని అమ్మేవాడుగా మొదటి వాని వద్దకొస్తాడు. అతనికి కూడా 10 శాతం ఎక్కువకి అమ్మే ప్రత్యేక అవకాశం ఉంటుంది. మన మిత్రుడు అమ్మేవాడుగా 10 లాభం పొందింది, కోనేవాడుగా పోగొట్టుకునేందుకే. ఇది స్పష్టం. తేలికగా తెలిసేదే.

### కొనేవాడు సరుకుల్ని వాటి విలువ కన్నా తక్కువకి కొనగలిగితే

దీని ప్రకారం కొనేవాడు సరుకుల్ని వాటి విలువ కన్నా తక్కువకి కొనగలుగుతాడు. ఈసందర్భంలో అతనిప్పుడు అమ్మేవాడవుతాడు అని అనుకోవాల్సిన పని లేదు. కొనే ముందు అతను అమ్మినవాడే. 10 శాతం లాభించేటప్పటికే, అంతకుముందే ఆ 10 శాతం పోగొట్టుకున్నవాడే. కనుక ఇప్పుడు అంతా అంతకు ముందు ఎలాగుందో అలాగే, ఉన్నదున్నట్లే ఉంటుంది.

అందువల్ల అదనపువిలువ ఏర్పడడాన్ని – తత్ఫలితంగా డబ్బు పెట్టుబడిగా మారడాన్ని– సరుకులు వాటి విలువకన్నా ఎక్కువకి అమ్మబడతాయని ఊహించడం ద్వారానో, అవి వాటి విలువలకన్నా తక్కువకి కొనబడతాయని ఊహించడం ద్వారానో వివరించడం సాధ్యం కాదు.

## మోసంచేసి ఎక్కువకి అమ్మితే విలువ పెరుగుతుందా?

ఒక వ్యక్తి మోసంతో ఎక్కువకి అమ్మవచ్చు. A కి B నుంచీ C నుంచీ ఎక్కువ రాబట్టే తెలివి ఉండవచ్చు.

వాళ్ళు దాన్ని తిప్పికొట్టగలిగినవాళ్ళు కాకపోవచ్చు. 40 రూపాయల విలువగల ద్రాక్ష సారాని Bకి ఇచ్చి, A, 50 రూపాయల విలువగల ధాన్యాన్ని తీసుకున్నాడు అనుకుందాం. అంటే, తన 40 రూపాయలనీ A, 50 రూపాయలలోకి మార్చాడు. తక్కువ డబ్బుని ఎక్కువ డబ్బు చేశాడు. తన సరుకుల్ని పెట్టుబడిలోకి మార్చాడు.

**ఇక్కడ ఏమనిపిస్తుంది? అదనపువిలువ చలామణీ లోనే ఏర్పడింది అనిపిస్తుంది.** కనుక దీన్ని మరింత దగ్గరగా పరీక్షించాలి అంటాడు.

మారకానికి ముందు – చేతిలో 40 రూపాయల విలువచేసే ద్రాక్ష సారా ఉంది, B చేతిలో 50 రూపాయల విలువచేసే ధాన్యం ఉంది. మొత్తం కలిపితే 90 రూపాయలు. మారకం అయ్యాక పరిస్థితిని పరిశీలిద్దాం. ఇప్పుడు A చేతిలో 50 రూపాయల విలువచేసే ధాన్యం

ఉంది. B చేతిలో 40 రూపాయల విలువచేసే ద్రాక్షసారా ఉంది. రెండూ కలిపితే 90 రూపాయలు. విలువ మొత్తంలో ఏమాత్రం మార్పు లేదు. అంటే, చలామణీలో అణుమాత్రమైనా విలువ పెరగలేదు అని తేలింది. ఉన్న విలువ బదిలీ అయిందే తప్ప, కొత్త విలువ ఏర్పడలేదు. మారిందల్లా, A కీ, B కీ మధ్య పంపిణీ. ఒకవైపు తగ్గిన విలువే, మరొకవైపు అదనపు విలువగా పెరిగింది; అటు మైనస్ అయినది ఇటు ప్లస్ అయింది. మారకం ముసుగు లేకుండానే, B నించి 10 రూపాయలు A నేరుగా దొంగిలించినా ఇదే మార్పు జరిగుండేది. చలామణీలో ఉన్న విలువల మొత్తం వాటి పంపిణీలో మార్పువల్ల పెరగదన్నది స్పష్టం. **అసలు సరుకుల చలామణీ కొత్తవిలువను ఏర్పరచదు.**

అందువల్ల, పెట్టుబడిదారీ విధానం గురించిన పరిశోధన చరిత్రలో పెట్టుబడికి ముందున్న రూపాలతో–వర్తక పెట్టుబడితో, వడ్డీ పెట్టుబడితో–ప్రారంభించలేము. ఎందుకంటే అవి రెండూ కొత్త విలువను చేర్చేవి కావు. అదనపు విలువను ఏర్పరచేవి కావు. అదనపు విలువను ఏర్పరిచే మూల రూపం నుండి వచ్చిన ఉత్పన్న (derived) రూపాలు. ముందు అదనపు విలువ ఏర్పడాలి. దానినుంచి వచ్చే రూపాలే వడ్డీలు, వర్తక లాభాలు. కాబట్టి కొత్తవిలువ వచ్చే రూపాన్ని ముందు విశ్లేషించాలి.

## పెట్టుబడికి ముందున్న రూపాలు – వర్తక పెట్టుబడి, వడ్డీ పెట్టుబడి

### 1. వర్తక పెట్టుబడి

సమాన విలువలు మాత్రమే మారినంత కాలం వర్తకుని పెట్టుబడి అసాధ్యం అయినది అనిపిస్తుంది. అలాగని, వర్తకపెట్టుబడి పెరగడం కేవలం సరుకుల ఉత్పత్తిదారులు చేసే మోసాలతో వివరించలేం. ఇంకేదయినా కారణం ఉండి ఉండాలి.

### 2. వడ్డీ పెట్టుబడి

వర్తక పెట్టుబడిని గురించి చెప్పినది, వడ్డీ పెట్టుబడికి ఇంకా బాగా వర్తిస్తుంది. వర్తకపెట్టుబడి పెరుగుదలకు సంబంధించి, కనీసం ఒక కొనుగోలు, ఒక అమ్మకం అయినా ఉంటాయి. అంటే వర్తకుడు సరుకులు కొంటాడు, అమ్ముతాడు. డబ్బు పెరుగుతుంది డ–స–డ'. కాని వడ్డీవాడు సరుకులు కొనడు, అమ్మడు. కాని ఎక్కువ లాగుతాడు. మధ్యలో వడ్డీ పెట్టుబడిలో డ–స–డ' రూపం రెండు చివరలుగా డ– డ' గా కుదింప బడుతుంది. డబ్బు మరింత డబ్బుతో మారే రూపం అది. అందువల్ల, సరుకుల చలామణీ దృష్ట్యా ఈ రూపాన్ని వివరించడం వీలవదు. ముందుముందు మన పరిశోధనలో వర్తక పెట్టుబడీ, వడ్డీ పెట్టుబడీ రెండూ మూల రూపాలు కావనీ, మూల రూపం నుంచి ఏర్పడినవనీ, అందువల్ల అవి ఉత్పన్న రూపాలనీ తెలుసుకుంటాం. ముందుగా మూల రూపాన్ని విశ్లేషించాలి.

అదనపు విలువ చలామణీ నుండి రాదు అని రుజువు చేశాం. కాని అదనపు విలువ చలామణీలో కాకుండా మరెక్కడైనా ఏర్పడగలుగుతుందా? అందువల్ల అదనపు విలువ ఏర్పడాలంటే, చలామణీలో కనబడనిది ఏదో నేపథ్యంలో జరిగి ఉండాలి.

## చలామణీ బయట అదనపువిలువ ఎలా ఏర్పడుతుంది?

చలామణీ బయట సరుకు ఓనర్ తనసరుకుతో మాత్రమే సంబంధంలో ఉంటాడు. అతని సరుకు శ్రమని ఇముడ్చుకొని ఉంది. ఆ శ్రమ మొత్తం అతనిసరుకు విలువ పరిమాణం ద్వారా వ్యక్తమవుతుంది. ఆ విలువ ఖాతాడబ్బులో లెక్కకొస్తుంది. కనుక ఆ మొత్తాన్ని ఆ సరుకు ధర వ్యక్తంచేస్తుంది. ఉదాహరణకి, 10రూపాయలు అనుకుందాం. అయితే ఈ 10రూపాయల ధరా అదేసమయంలో దానికంటే ఎక్కువైన 11రూపాయల ధరకి ప్రతినిధి అవదు. సరుకు ఓనర్ తనశ్రమతో విలువని సృజించగలడు. కాని 'వాటంతట అవే పెరిగే విలువల'ను సృజించజాలడు.

అతను కొత్త శ్రమను కలపడం ద్వారా విలువని పెంచగలడు. అంటే చేతిలో ఉన్న విలువకు మరికొంత విలువ చేర్చగలడు. ఉదాహరణకి, తోలుని బూట్లు చెయ్యడం ద్వారా. అదే పదార్థం ఇప్పుడు ఎక్కువ విలువతో ఉంది.

కారణం ఎక్కువశ్రమని ఇముడ్చుకొని ఉండడమే. అయితే తోలు విలువ అంతకు ముందు ఎంతో ఇప్పుడూ అంతే ఉంటుంది. అది తనంతట తాను పెరగ జాలదు. బూట్లు చేస్తున్నప్పుడు ఆతోలు అదనపు విలువని కలుపుకొని సొంతం చేసుకోలేదు. కనుక సరుకుల ఉత్పాదకుడు చలామణీ రంగంలో ఇతర సరుకుల ఓనర్లతో సంపర్కంలోకి రాకుండా విలువని పెంచడం అసాధ్యం. ఫలితంగా డబ్బుని లేదా సరుకుల్ని పెట్టుబడి లోకి మార్చడమూ అసాధ్యమే.

ఎవరైనా ఒక వస్తువుకి తనశ్రమ ద్వారా విలువని కలిపితే, అప్పటికే ఉన్న విలువ స్వయంగా దానికది పెరిగినట్లు కాదు. ఎందు కంటే ఇక్కడ కర్త విలువ కాదు, అతని శ్రమ. విలువ తనంత తాను, తనవిలువని పెంచుకున్నట్లయితే అది విలువ స్వయం విస్తరణ అవుతుంది. ఇక్కడ శ్రమ ఉన్నవిలువను పెంచింది.

**అదనపు విలువ చలామణీలో ఏర్పడదు. అలాగే చలామణీ లేకుండా కూడా ఏర్పడదు.** చలామణీలో పెట్టుబడి ఏర్పడడం సాధ్యంకాదు. చలామణీతో సంబంధం లేకుండా ఏర్పడడం కూడా సాధ్యం కాదు. కాబట్టి, **పెట్టుబడి పుట్టుక చలామణీలోనూ ఉండాలి, చలామణీలో ఉండనూ కూడదు.**

డబ్బు పెట్టుబడిలోకి పరివర్తన యొక్క అభివృద్ధి సరుకుల మారక నియమాల ప్రాతిపదికపైన జరగాలి.

అంటే ఆనియమాలకి అనుగుణంగా జరగాలి, అవి అనుల్లంఘనీయ నియమాలు. సమాన విలువల మారకం ఆరంభ బిందువుగా పెట్టుకుని డబ్బు పెట్టుబడిలోకి పరివర్తన చెందడాన్ని వివరించాలి.

1. మిత్రుడు 'డబ్బుసంచీ' ఇప్పటికి లార్వా రూపంలోనే ఉన్న పెట్టుబడిదారుడు. అతను సరుకుల్ని వాటి విలువలకే కొనాలి, వాటి విలువలకే అమ్మాలి. అయినాగాని ప్రక్రియ చివరలో చలామణీలో మొదట పెట్టిన విలువ కంటే ఎక్కువ విలువని చలామణీ నుండి రాబట్టాలి.
2. అతను సీతాకోక చిలుకగా, అంటే సంపూర్ణ పెట్టుబడి దారుడుగా, వృద్ధి అవడం, చలామణీ రంగంలోనూ జరగాలి, చలామణీ రంగంలో జరగనూ కూడదు.

ఇవీ సమస్యకున్న షరతులు.

పై రెండు షరతులూ నెరవేరుస్తూనే, పెట్టుబడి దారుడు తాను పెట్టిన డబ్బుని మరింత డబ్బుగా ఎలా చేస్తాడో చూపించాలి. ఇదీ సమస్య.

# అధ్యాయం 6
# శ్రమ శక్తి కొనుగోలూ అమ్మకమూ

1. సమాన విలువలే మారాలి.
2. పెరుగుదల చలామణీ రంగంలో కాకూడదు, కాకుండానూ ఉండకూడదు.

పై షరతులు నేరవేరుతూ డబ్బు పెరిగేదెలా? డ-స-డ' ని సాధించేదేలా? సమస్య ఇదే.

డబ్బు పెరగడం వీలవదు అనిపిస్తుంది. అంటే డ-స-డ' ని సాధించడం అసాధ్యం అనిపిస్తుంది. అయితే అది ప్రతి రోజూ  జరుగుతున్నది. డబ్బు మన కళ్ళెదుటే తనకుతాను పెరిగి మరింత డబ్బు అవుతున్నది. డ-స-డ' వలయంలోని ప్రతి దశనీ దానికి  ఆదనపువిలువ ఉత్పత్తితో సంబంధం ఉన్నదేమోనని పరీక్షిస్తాడు.

## విలువ పెరుగుదల డబ్బులో జరుగుతుందా?

డబ్బు పెట్టుబడి అవాల్సిన సందర్భంలో విలువ మార్పు ఆ  డబ్బులోనే జరగదు. ఎందుకంటే, అది కొనుగోలు సాధనం, అమ్మకం సాధనం. కొనే సరుకు ధరని రాబట్టడమే దాని పని. అంతకుమించి ఏమీ చెయ్యదు. నగదుగా డబ్బు చలనంలేని విలువ అవుతుంది. కనుక దాని విలువ ఎన్నటికీ మారదు. అలానే ఉంటుంది. అంటే, డబ్బు రూపంలో ఉన్నంతకాలం అది పెట్టుబడి కాదు. డబ్బు కాకుండా, ఉన్నది సరుకే. కనుక ఆ సరుకులో తప్ప విలువ పెరిగే అవకాశం మరెక్కడా లేదు. అందువల్ల మొదటి చర్యలో కొన్న సరుకులో జరగాలి.

డ-స లో డ విలువ స విలువకి సమానం. స-డ లో స విలువ డ' (డ + Ä డ) విలువకి సమానం. మొదటి చర్యలో కంటే రెండో చర్యలో డ విలువ ఎక్కువ. అయితే ఈ రెండు మారక చర్యల వల్ల డబ్బు పెరగడం సాధ్యం కాదు. సాధ్యం అవాలంటే, మొదటి చర్యలో కొన్న సరుకు విలువ కంటే రెండో చర్యలో అమ్మిన సరుకు విలువ ఎక్కువ  అయి ఉండాలి. అంటే, మొదటి చర్యలో కొన్న సరుకు విలువ పెరగాలి. అదికూడా రెండో చర్యలో అమ్మకానికి ముందే పెరిగి ఉండాలి. ఈ పెరగడం మొదటి చర్యలో కొన్న సరుకు వల్లనే జరగాలి. అదికూడా ఆ సరుకు విలువలో కాదు. కారణం సమాన విలువలే మారతాయి కాబట్టి, ఆ సరుకు విలువ అప్పటికే పూర్తిగా చెల్లించబడింది. అందువల్ల మనం ఈ నిర్ధారణకు రాక తప్పదు.

## విలువ పెరుగుదల సరకు విలువలో జరుగుతుందా?

ఆ సరుక్కి విలువ ఉన్నా, అది మారేది దానంత విలువతోనే. సరుకు దాని పూర్తివిలువకే మారుతుంది. కనుక అది విలువని పెంచలేదు. మరిక మిగిలింది ఆ సరుకు ఉపయోగపు విలువే. కాబట్టి  మనం ఒక నిర్ధారణకు రాక తప్పదు: ఈ మార్పు సరుకు ఉపయోగపు విలువలో, అంటే వాడకం లోనే వచ్చితీరాలి. ఇది తప్పితే విలువ దానికదే పెరగడం కుదరదు. అలా అన్ని ప్రత్యామ్నాయాల్నీ తోసిపుచ్చాక, ఇదొక్కటే మిగిలి ఉంటుంది*

మొదటి చర్యలో కొన్న సరుకు ఉపయోగపు విలువే విలువ విస్తరణకి కారణం. అంటే ఆ సరుకు ఉపయోగపు విలువ విలువని ఉత్పత్తి చెయ్యడం అయి ఉండాలి. విలువకి శ్రమే ఏకైక వనరు. కనుక **ఆసరుకు ఉపయోగపు విలువ శ్రమ అయి తీరాలి.** అయితే శ్రమ ఏ సరుకుకి ఉపయోగపు విలువ? శ్రమ శక్తి అనే సరుకుకి. అంటే విలువని సృజించగల సరుకు శ్రమశక్తి ఒక్కటే. పెట్టుబడి దారుడికి అటువంటి విలువని సృజించే సరుకు దొరికితేనే, మొదట పెట్టిన డబ్బు పెరగడం సాధ్యం అవుతుంది. అప్పుడు మాత్రమే డ, డ' కాగలుగుతుంది –

మరొక మార్గం లేదనేది స్పష్టమే.

డబ్బువాడికి అలాంటి సరుకు మార్కెట్లో దొరికింది. ఆ సరుకే శ్రమ శక్తి, శ్రమ చెయ్యగల సామర్థ్యం. దాని విశిష్టత ఏమంటే: దాని ఉపయోగపు విలువ, విలువని సృజించ గలగడం. మరే ఇతర సరుకూ విలువని సృజించలేదు. అటువంటి సరుకుని, శ్రమ శక్తిని కొని డబ్బువాడు తన సంచీని పెద్దది చేసుకోగలడు. పెట్టుబడి దారుడు కాగలడు.

ఒక ఉపయోగపువిలువని అంటే వస్తువుని తయారుచేసేటప్పుడు, మనిషి తనలో ఉన్న మానసిక శారీరక సామర్థ్యాల్ని ఉపయోగిస్తాడు, చలనంలో పెడతాడు. ఆసామర్థ్యాల మొత్తమే శ్రమశక్తి లేక శ్రమచేసే సామర్థ్యం.

శ్రమ శక్తి సరుకు. కాబట్టి దానికి ఉపయోగపు విలువా, విలువా రెండూ ఉండాలి. విలువని సృజించగలగడం దాని ఉపయోగపు విలువ.

## శ్రమశక్తి విలువ ఎలా నిర్ణయమవుతుంది?

డబ్బుదారుడికి శ్రమశక్తి సరుకుగా మార్కెట్లో దొరకాలంటే ముందు కొన్ని షరతులు నెరవేరాలి. శ్రమశక్తి కల వ్యక్తి తన శ్రమశక్తిని ఒక సరుకుగా అమ్మజూపితేనే, లేదా అమ్మితేనే మార్కెట్లో శ్రమశక్తి సరుకుగా కనబడుతుంది. తను తన శ్రమశక్తిని అమ్మాలంటే, అది పూర్తిగా అతని స్వాధీనంలో ఉండాలి. దానికి అతనే పూర్తి యజమాని అయి ఉండాలి, పెట్టుబడిదారుడు డబ్బుకి యజమాని అయినట్లే. ఇద్దరికీ తేడా ఒక్కటే, ఒకడు అమ్మేవాడూ, మరొకడు కొనేవాడూ. చట్ట రీత్యా ఇద్దరూ సమానులే. ఈసంబంధం కొనసాగాలంటే శ్రామికుడు తన శ్రమశక్తిని నిర్ణీత కాలానికి మాత్రమే (అంటే గంటకో రోజుకో నెలకో ఇలా) అమ్మాలి. అలాకాక ఒకేసారి ఏకమొత్తంగా అమ్మాల్సి వస్తే అతను తనను తనే అమ్ముకున్నట్లు. తనను స్వేచ్ఛగల వ్యక్తి నుంచి బానిసగా తననుతాను మార్చుకున్నట్లు. ఒక సరుకు ఓనర్ స్థితినుంచి తానే సరుకుగా అయినట్లు. అతను తన శ్రమ శక్తిని ఎల్లప్పుడూ తన సొంత ఆస్తిగా, తన సొంత సరుకుగా చూడాలి. ఇదెలా వీలవుతుంది?

- తన శ్రమశక్తిని కొంత కాలం మాత్రమే కొన్నవాని అధీనంలో ఉంచితేనే అలా చెయ్యగలడు. అప్పుడు మాత్రమే అతను తన యాజమాన్య హక్కును వదులుకోకుండా నిలబెట్టుకో గలుగుతాడు.
- పెట్టుబడిదారుడికి శ్రమశక్తి సరుకుగా మార్కెట్లో దొరకాలంటే శ్రామికుడు, తన శ్రమ ఇమిడి ఉన్న ఉత్పాదితాన్ని కాకుండా తన శ్రమశక్తినే అమ్ముకోవాల్సిన పరిస్థితిలో పడాలి.

శ్రమ శక్తిని కాకుండా సరుకుల్ని అమ్మగలగాలంటే, అతనికి ఉత్పత్తిసాధనాలు – ముడి పదార్థాలూ, శ్రమ సాధనాలూ వగైరా – ఉండాలి. తోలు లేకుండా బూట్లు చెయ్యలేడు. ఆకాలంలో బతకడానికి జీవనాధార వస్తువులు కావాలి.

సరుకులు ఉత్పత్తయ్యాక అమ్ముడవాలి. అమ్ముడుబోయిన తర్వాతనే ఉత్పత్తిదారుడి అవసరాల్ని అవి తీర్చగలుగుతాయి. శ్రామికుడికి ఆ అవకాశాలు లేనట్లయితే, అతను తన శ్రమ ఉత్పాదితాల్ని అమ్మలేడు, తన శ్రమశక్తిని అమ్ముకోవలసిందే.

ఆ పరిస్థితుల్లో డబ్బువాడికి మార్కెట్లో శ్రమశక్తి కొనడానికి దొరుకుతుంది. తన శ్రమశక్తిని అమ్ముకునే స్వేచ్ఛ ఉన్న కార్మికుడు సిద్ధంగా ఉంటాడు.

## శ్రామికుడికి రెండర్థాలలో స్వేచ్ఛ ఉండాలి:

1. స్వతంత్రుడిగా తన శ్రమశక్తిని తన సొంత సరుకుగా అమ్ముకోగలిగి ఉండాలి
2. అమ్ముకోవడానికి అతని చేతిలో శ్రమశక్తి మినహా మరే ఇతర సరుకూ లేనివాడై ఉండాలి

అతనికి అమ్ముకునే స్వేచ్ఛ ఉంది. ఏ నిర్బంధాలూ లేని స్వేచ్ఛ అది. ఇది ఒక అర్థంలో స్వేచ్ఛ. అమ్ముకోడానికి అతనికి మరే సరుకూ లేదు. ఇక అతన్ని శ్రమ శక్తిని అమ్ముకోకుండా అడ్డుపడేది ఏదీలేదు. ఇది రెండో అర్థంలో స్వేచ్ఛ.

## శ్రమశక్తి సరుకుగా అయ్యే పరిస్థితులు

సరుకులున్నచోట డబ్బు ఏర్పడుతుంది. పెట్టుబడి అలాకాదు. సరుకులూ డబ్బూ చలామణీ ఉన్నంత మాత్రాన పెట్టుబడి ఉన్నట్లు కాదు. అదెప్పుడు ప్రాణం పోసుకుంటుందంటే:

ఉత్పత్తిసాధనాల, జీవనాధార సాధనాల ఓనర్ మార్కెట్లో తన శ్రమశక్తిని అమ్ముతున్న స్వేచ్ఛాయుత శ్రామికుడిని కలిసినప్పుడు. అందువల్ల, పెట్టుబడి మొదట కనబడినప్పుడే, సామాజిక ఉత్పత్తిప్రక్రియలో నూతన శకాన్ని ప్రకటిస్తుంది. శ్రామికుని దృష్టిలో శ్రమశక్తి తన ఆస్తి అయిన సరుకు అవుతుంది. ఫలితంగా అతని శ్రమ వేతనశ్రమ అవుతుంది.

### అలాంటి పరిస్థితి ఏర్పడడం చారిత్రకాభివృద్ధి ఫలితం

స్వేచ్ఛగల కార్మికుడు తనకి ఎందుకు ఎదురయ్యాడు అనే విషయం గురించి డబ్బువాడికి ఆసక్తి ఉండదు. ఎందుకంటే, అతను శ్రమ మార్కెట్‌ని సాధారణ సరుకుల మార్కెట్‌లో ఒక బ్రాంచ్‌గా చూస్తాడు కనుక. ప్రస్తుతానికి మనకీ పెద్ద ఆసక్తి లేదు. ఈ వాస్తవానికి అతను ఆచరణాత్మకంగా ఎలా అంటుకొని ఉన్నాడో అలానే మనం సిద్ధాంతపరంగా అంటుకొని ఉందాం.

ఏమైనా ఒక్క విషయం స్పష్టం – డబ్బుదారుల్నీ, సరుకుల్నీ ఒకవైపూ, శ్రమ శక్తి తప్ప మరేమీ లేని శ్రామికులని వేరొకవైపూ ప్రకృతి సృష్టించలేదు. ఈ సంబంధానికి ప్రాకృతిక ప్రాతిపదిక లేదు. దాని సామాజిక పునాది కూడా అన్ని చారిత్రిక దశలకూ ఉమ్మడి అయినది కాదు. అది స్పష్టంగా చారిత్రకాభివృద్ధి ఫలితం, అనేక ఆర్థిక విప్లవాల ఉత్పాదితం, సామాజిక

ఉత్పత్తి యొక్క పాతరూపాల పరంపర రూపుమాసిపోతే వచ్చిన ఫలితం. మనం ఇక్కడ చర్చించిన ఇతర ఆర్థిక భావాభివర్గాలూ (categories) కూడా అంతే – చరిత్ర ముద్ర ఉన్నవే.

### సరుకు కావడానికి కావలసిన ప్రమాణాలు శ్రమ శక్తికి ఉన్నాయా?

- అది ఉత్పత్తిదారుడికి ఉపయోగపు విలువ కాకూడదు
- కొన్నవాడికి అది ఉపయోగపు విలువ
- దాని ఉపయోగపు విలువా, విలువా వేర్వేరు విషయాలు
- అది మారకం కోసం ఉత్పత్తవుతుంది
- అమ్మేవాడూ కోనేవాడూ మార్కెట్లో కలుస్తారు. సరుకుని వాడుకునే హక్కు కొన్నవానిదే. అమ్మినవానికి ఆ హక్కు ఉండదు.

శ్రమశక్తి, పై ప్రమాణాలకి అనుగుణంగా ఉంటుంది కనుక అది సరుకే.

### శ్రమ శక్తి విలువ

శ్రమశక్తి అనే ఈ విశిష్టమైన సరుకుని దగ్గరగా పరిశీలించాలి. అన్ని ఇతర సరుకులకి ఉన్నట్లే దీనికీ విలువ ఉంది. ఇంగ్లిష్ తత్వవేత్త థామస్ హాబ్స్ (1588–1679) అన్నట్లు "మనిషి విలువ...మిగిలిన అన్ని వస్తువులకి లాగే, అతని ధర. అంటే అతని శక్తిని వినియోగించడానికి ఎంతిస్తే అంత."

ఆయన తర్వాతి వారు ఈ ఆవిష్కరణని గమనించలేదు అంటాడు మార్క్స్ (వేతనం,ధర, లాభం, మార్క్స్ ఎంగెల్స్ సంకలిత రచనలు, భాగం 2, పే. 46). అందువల్లనే శ్రమనీ, శ్రమశక్తినీ వేరుగా చూడలేకపోయారు. రికార్డో కూడా ఈ రెంటినీ గందరగోళ పరిచాడు. 'శ్రమ బదులు శ్రమ శక్తి అనుకుని ఉండాల్సింది' - Theories of surplus value vol 2.400

### శ్రమ శక్తి విలువ పరిమాణం ఎలా నిర్ణయమవుతుంది?

శ్రమశక్తి అనేది ఒక శక్తిగా, బతికున్న వ్యక్తి శక్తిగా ఉనికిలో ఉంటుంది. అది ఉండాలంటే, శ్రమ చేసేవాడు జీవించి ఉండాలి. అందుకు అతని శరీర పోషణ అవసరం. అందుకు తగిన జీవనాధార సాధనాలు కావాలి.

ఆ జీవనాధారాల విలువే శ్రమ శక్తి విలువ.

శ్రమశక్తి విలువలో చేరేవి:

1. శ్రామికుని తిండీ, బట్టా మొదలైన జీవనాధార వస్తువుల విలువ.
2. శ్రామికుని సాంస్కృతిక, సామాజిక అవసరాలను తీర్చే వస్తువుల విలువ.
3. శ్రామికుని కుటుంబ సభ్యుల పోషణకు కావలసిన వస్తువుల విలువ.
4. శ్రామికుని శిక్షణకీ, నైపుణ్య సాధనకీ అయ్యే ఖర్చు.

**వినియోగిస్తేనే, శ్రమశక్తి వాస్తవమవుతుంది.** పనిచెయ్యడం ద్వారానే, శ్రమశక్తి క్రియాశీల మవుతుంది. ఈచర్యలో అంటే శ్రమచెయ్యడంలో నిర్దిష్ట పరిమాణంలో మనిషి కండరాలూ,

నరాలూ, మెదడూ వగైరా ఖర్చవుతాయి. వాటిని పునరుద్ధరించాల్సి ఉంటుంది. ఆహారం, బట్టలు, ఇంధనం, ఇల్లు వంటి అవసరాలు అతని దేశపు వాతావరణాన్నిబట్టీ, ఇతర భౌతిక పరిస్థితుల్ని బట్టీ, మారుతూ ఉంటాయి. మరొకవైపు, అతని అవసరాల సంఖ్యా, విస్తృతీ, వాటినీ తీర్చుకునే పద్ధతీ – చారిత్రకాభివృద్ధిని బట్టి ఉంటాయి. అందువల్ల ఆ దేశ నాగరికత స్థాయి మీద ఆధారపడి ఉంటాయి. మరీ ముఖ్యంగా స్వేచ్ఛాయుత శ్రామికవర్గం ఏర్పడిన పరిస్థితుల మీదా, అప్పటి అలవాట్ల మీదా, సౌకర్యాల మీదా ఆధారపడి ఉంటాయి. ఇతర సరుకులకు భిన్నంగా, శ్రమశక్తి విలువ నిర్ణయంలో చారిత్రక, నైతిక అంశం కలుస్తుంది. అయినాగాని ఒక దేశంలో, ఒక కాలంలో ఒక శ్రామికునికి అవసరమయ్యే సగటు జీవనాధారాల పరిమాణం ఎంతో ఆచరణలో తెలిసే ఉంటుంది.

డబ్బుపెట్టుబడిలోకి నిరంతరాయంగా మారాలంటే శ్రమశక్తిని అమ్మేవాడు మార్కెట్లో ఎల్లవేళలా దొరుకుతూనే ఉండాలి. అయితే శ్రమశక్తి ఓనర్ మరణం ఉన్న మనిషి. అలాంటప్పుడు మార్కెట్లో అతను నిరంతరాయంగా దొరకాలంటే, అతని అనంతరం ఆ స్థానంలోకి వచ్చే బిడ్డలు కావాలి. పని చేసిచేసి నలిగిపోయో, చనిపోయో కొందరు మార్కెట్‌లో ఉండరు. అందువల్ల అతని స్థానంలోకి వచ్చేవారికి, అంటే అతని పిల్లల పోషణ ఖర్చు కూడా అతని శ్రమశక్తి విలువలో చేరుతుంది. ఇక్కడ ఐర్లండ్ ఆర్థికవేత్త టోరెన్స్ (1814–1884) మాటలు కోట్ చేస్తాడు: వాతావరణాన్ని బట్టీ, దేశ అలవాట్లను బట్టీ శ్రామికుని పోషణకీ, మార్కెట్లో శ్రమశక్తి సరఫరా తగ్గకుండా ఉండేందుకు సంతానాన్ని పోషించేందుకూ, సౌకర్యాలకూ కావలసిన జీవనాధార వస్తువుల పరిమాణమే దాని (శ్రమ) సహజ ధర.

ఏ పరిశ్రమ శాఖలోనైనా శ్రామికునికి నైపుణ్యం, చాకచక్యం ఉండాలి. అందుకు ప్రత్యేక విద్యా, శిక్షణా పొందాలి. అందుకు ఎన్నోకొన్ని సరుకుల ఖర్చు ఉంటుంది. శ్రమశక్తి సంక్లిష్టతని బట్టి అందుకు కావలసిన సరుకుల పరిమాణం మారుతుంటుంది. ఈ ఖర్చు శ్రమశక్తి ఉత్పత్తికి అయ్యే మొత్తంలో చేరుతుంది. మామూలు శ్రమశక్తి కయితే ఈ ఖర్చు అతి తక్కువగా ఉంటుంది.

శ్రమశక్తి విలువ ఒక నిర్దిష్ట పరిమాణంగల జీవనాధారసాధనాల విలువే. అయితే ఆ వస్తువుల ధరలు మారుతూ ఉంటాయి. వాటితోపాటు శ్రమశక్తి విలువకూడా మారుతూ ఉంటుంది.

### ఒక రోజు శ్రమశక్తి ధర

ఆహారం ఇంధనం వంటివి ప్రతిరోజూ అవసరం. కనక వాటిని ఏరోజుకారోజు సరఫరా చెయ్యాలి. బట్టలూ, ఇంటి సామాగ్రీ (furniture) వంటివి ఎక్కువకాలం ఉంటాయి. వాటిని అప్పుడప్పుడు మాత్రమే మార్చాల్సి వస్తుంది. ఒక వస్తువుని రోజూ కొనాలి, మరొకదాన్ని వారానికి, వేరొకదాన్ని మూడు నెలలకి కొనాలి. ఏది ఎప్పుడు కొన్నప్పటికీ, ఒక సంవత్సరంలో అయిన మొత్తం ఖర్చు ఒకరోజు సగటు ఆదాయానికి తగినట్లు ఉండాలి.

అదెలా లెక్కించాలో చెబుతాడు:

శ్రమశక్తి ఉత్పత్తికి కావలసిన సరుకుల మొత్తం

ప్రతిరోజూ వాడేవి = A

వారం వారం కావలసినవి = B

మూణ్ణెల్లకోసారి కావలసినవి = C...... అలా అలా

ఈ అన్ని సరుకుల రోజు సగటు = (365A + 52 B + 4 C + ...) / 365

ఉదాహరణ:

A 200 రూపాయలు. B 2 వేలు, C 4 వేలు, ఏటా ఒక్కసారి కోనేవి 12 వేలు అనుకుంటే

(365 × 200) + (52 × 1000) + (4 × 4000) + (1 × 12000)

= 73000 + 52000 + 16000 + 12000 = 153000

ఈమొత్తాన్ని 365తో భాగిస్తే 377 రూపాయలు. సుమారు 400 అనుకుందాం. ఇది ఒకరోజు శ్రమశక్తి ధర.

సగటున ఒకరోజుకి కావలసిన సరుకుల ఉత్పత్తికి 6 గంటల సామాజిక శ్రమ అవసరం అనుకుందాం. రోజు శ్రమ శక్తిలో ఒకపూట సామాజిక శ్రమ (అరరోజు) ఉంటుంది. వేరే రకంగా చెబితే ఒకరోజు శ్రమశక్తి ఉత్పత్తికి, సగం రోజు శ్రమ సరిపోతుంది. ఈ శ్రమ పరిమాణమే, అంటే అరరోజు సామాజిక శ్రమే, ఒకరోజు శ్రమశక్తి విలువ అవుతుంది. దాని ఓనర్ రోజుకి 400 రూపాయలకు అమ్మజూపితే, దానిధర దాని విలువకి సమానం. మనం అనుకున్నదానికి అనుగుణంగా తన డబ్బుని పెట్టుబడిలోకి మార్చాలని కూర్చున్న మిత్రుడు డబ్బుసంచీ ఈ విలువ చెల్లిస్తాడు.

## అప్పు పెట్టేవాడుగా పనివాడు

పెట్టుబడిదారీ దేశాలన్నిటిలోనూ కొంతకాలం (ఉదాహరణకు ఒక వారం) పనిచేసేదాకా, వేతనం ముట్టదు. అదొక ఆనవాయితీ. ప్రతి చోటా శ్రామికుడు పెట్టుబడిదారుడికి అప్పిస్తాడు. ఈ అప్పుఫలితం ఏమంటే: పనివాళ్ళ దగ్గర డబ్బు ఉండకపోవడం వల్ల అప్పిచ్చే షాపుల్లో కొనాల్సివస్తుంది. (తరచుగా ఆ షాపులు వాళ్ళ యజమానివే అయివుంటాయి). ఈషాపులకి పోటీ భయం ఉండదు. కనుక వాళ్ళు కీతారకం వస్తువులు అమ్ముతారు లేదా ఎక్కువ ధరలు వేసుకుంటారు.

ఏది ఏమయినా డబ్బు కొనుగోలు సాధనంగా పనిచేసిందా, చెల్లింపు సాధనంగా పనిచేసిందా అనేది సరుకుల మారక స్వభావాన్ని మార్చదు. శ్రమ శక్తి ధర ఒప్పందంలో నిర్ణయమయి ఉంటుంది- తర్వాత వచ్చే ఇంటి అద్దె లాగా, ఇదీ అప్పటికప్పుడు రాకపోయినప్పటికీ. శ్రమశక్తి అమ్మబడింది - తర్వాత ఎప్పుడో చెల్లించబడినప్పటికీ. కనుక ఇరుపక్షాల సంబంధాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవడానికి **మనం ప్రస్తుతానికి శ్రామికుడు శ్రమశక్తి ధరని వెంటనే తీసుకుంటున్నట్లు భావిద్దాం అంటాడు మార్క్స్.**

## చలామణీ రంగం నుంచి, ఉత్పత్తి రంగానికి

శ్రమశక్తిని కొన్నవాడికి దాని ఉపయోగపువిలువ వస్తుంది. శ్రమశక్తిని అతను వాడుకుంటాడు. అందుకు కావలసిన ప్రతి వస్తువునీ పూర్తి విలువ చెల్లించి మార్కెట్లో కొంటాడు. శ్రమశక్తి వినియోగం ఒకే సమయంలో సరుకుల ఉత్పత్తీ, అదనపువిలువ ఉత్పత్తీ కూడా.

సరుకుల వాడకం మార్కెట్ బయట జరుగుతుంది. చలామణీ రంగంలో జరగదు. కనుక మనం చలామణీ రంగాన్ని వదిలి వారి వెంట వెళదాం. వాళ్ళతో ఉత్పత్తి జరిగే గోప్య స్థలానికి పోదాం.

లోపలి అడుగు పెట్టేముందే, ముఖద్వారం మీద 'పనిమీద రాని వాళ్లకి ప్రవేశం లేదు' అని ముఖం మీద కొడుతుంది. ఇక్కడ మనం పెట్టుబడి ఎలా ఉత్పత్తి చేస్తుందో చూస్తాం. అంతేకాదు. ఆ పెట్టుబడి ఎలా ఉత్పత్తవుతుందో కూడా చూస్తాం. చివరలో లాభాన్నిలాగే రహస్యాన్ని బయటకు లాగేస్తాం. ఇప్పటికి

1. అన్ని సరుకులూ వాటివాటి విలువలకే అమ్ముడవుతూనే, లాభాలేలా వస్తాయో వివరించడంలో ముందుకుపోయాం.

2. లాభాన్ని చేకూర్చేది ఒక్క శ్రమశక్తి మాత్రమే అని తేల్చాం.

3. ఏ పరిస్థితుల్లో శ్రమశక్తి సరుకయిందో, దాని విలువ ఎలా నిర్ణయం అవుతుందో తెలుసుకున్నాం.

ఇప్పుడిక ఒక్క విషయం తేలాలి:

**శ్రమశక్తి వినియోగం దాని సొంత విలువ (అంటే, దానికి పెట్టుబడి దారుదు చెల్లించిన విలువ) కన్నా ఎక్కువ విలువను ఎలా ఉత్పత్తి చేస్తుంది?**

ఇది తేలాలంటే, శ్రమశక్తి వాడకాన్ని పరిశీలించడం అవసరం.

అయితే ఇది ఇక్కడ కాదు, ఏడో అధ్యాయంలో. ఇప్పుడు ఈ అధ్యాయం చివర్లో వెనక్కి తిరిగి చలామణీ రంగం వైపు చూస్తాడు.

శ్రమశక్తి అమ్మకం కొనుగోలు జరిగే చలామణీ రంగాన్ని మనం విడిచి వెళుతున్నాం. ఆ రంగం నిజానికి మనిషి హక్కులకు స్వర్గం. అక్కడ మాత్రమే స్వేచ్ఛా, సమానత్వమూ, ఆస్తీ, బెంథం రాజ్యం ఏలుతాయి.

A. స్వేచ్ఛ ఎందుకంటే, శ్రమశక్తిని సరుకుగా అమ్మేవాడూ కొనేవాడూ ఇద్దరూ వారి ఇష్టానుసారమే వ్యవహరిస్తారు. వాళ్ళను అడ్డగించేది ఏదీ ఉండదు. కనుకనే స్వేచ్ఛ. స్వేచ్ఛగల వ్యక్తులుగా వాళ్ళు ఒక ఒప్పుదల కోస్తారు.

B. సమానత్వం ఎందుకంటే, మామూలు సరుకుల ఓనర్ల లాగే, వీళ్లిద్దరూ కూడా ఒకరికొకరితో సంబంధంలోకి వస్తారు. సమానకాన్ని సమానకంతో మార్చుకుంటారు. కనుక సమానత్వం.

C. ఆస్తి ఎందుకంటే, ఎవరి సొంతమైన దాన్ని మాత్రమే వారు ఇస్తున్నారు. కనుక ఆస్తి .

D. బెంథం, ఎందుకంటే, ఇద్దరూ ఎవరి గురించి (విషయం) వారు చూసుకుంటారు. వాళ్ళని ఒకచోటకు తెచ్చిందీ, సంబంధం కలిపిందీ స్వార్థమే, వారివారి వ్యక్తిగత ప్రయోజనమే. ప్రతివాడూ తనసంగతే చూసుకుంటాడు. మిగిలిన వాళ్ళ సంగతి పట్టించుకోడు. అలా చేస్తారు గనకనే, పరస్పర ప్రయోజనం కోసం, అందరూ కలిసి పనిచేస్తారు.

అయితే, చలామణీ రంగాన్ని వీడగానే మన నాటక పాత్రధారుల రూపురేఖల్లో ఒక మార్పు జరుగుతుంది లేదా జరిగినట్లు అగపడుతుంది.

ఇంతకు ముందు, డబ్బుదారుడుగా ఉన్నవాడు ఇప్పుడు పెద్దపెద్ద అంగలేసుకుంటూ పెట్టుబడి దారుడుగా ముందు నడుస్తుంటాడు. అతని వెనకీడితే, అతని పనివాడిగా శ్రమ శక్తి సొంతదారుడు అతన్ని అనుసరిస్తాడు. ఒకడు ముఖ్యుడయినట్లుగా, వ్యవహారం నిర్వహించాలనే ఉద్దేశంతో కృత్రిమంగా నవ్వుతూ ఉంటాడు. మరొకడు పిరికిగా, సంకోచిస్తూ ఉంటాడు – మార్కెట్‌కి తన ఒంటి చర్మాన్ని తెచ్చినవాడిగా, తనతోలు తీయించుకునే వాడిగా ఉంటాడు. మార్క్సు వాళ్ళ ముఖకవళికల్నీ, శరీర కదలికల్నీ నాలుగు ముక్కల్లో వర్ణించాడు.

# భాగం 3

# పరమ అదనపు విలువ ఉత్పత్తి

## అధ్యాయం-7
# శ్రమ ప్రక్రియా, అదనపు విలువ ఉత్పత్తి ప్రక్రియా
## విభాగం 1.
## శ్రమ ప్రక్రియ లేదా ఉపయోగపు విలువల ఉత్పత్తి

పెట్టుబడి దారుడు శ్రమశక్తిని కొన్నది, దాన్ని ఉపయోగించుకోడానికి, శ్రమ చేయించుకోడానికి. అతను శ్రమ చేయించేది, ఏదో ఒక ప్రత్యేకమైన ఉపయోగపు విలువని ఉత్పత్తి చెయ్యడానికి. అయితే తయారయ్యే సరుకు ఉపయోగపు విలువ గురించి అతనికి ఏమాత్రం ఆసక్తి ఉండదు. అతని ధ్యాసంతా దాని విలువ మీదే.

అయితే ఉపయోగపు విలువ లేని దానికి విలువ ఉండదు గదా! విలువ చేతికి రావాలంటే ఉపయోగపు విలువని ఉత్పత్తి చేసి తీరాలి. ఎందుకంటే విలువకి వాహకం ఉపయోగపు విలువే.

ఉత్పత్తి నిర్వహణ అతని అదుపాజ్ఞలలో సాగుతుంది. అతని తరఫున జరుగుతుంది. అంతమాత్రాన సాధారణ ఉత్పత్తి స్వభావం మారదు. మానవులు చరిత్రలో ఎంతో కాలం ప్రకృతిలో దొరికిన వస్తువులు వాడుకొని బతికారు - ఇతర జంతువుల లాగా. తర్వాత వాటిని తమ శ్రమతో మార్పులు చెయ్యడం మొదలు పెట్టారు. ఉదాహరణకి మాంసాన్ని కాల్చడం, మట్టిని కుండగా మలచడం. అప్పటి నించీ మూడు ఉత్పత్తి విధానాలు (ఆదిమ, బానిస, ఫ్యూడల్) గడిచి, నాలుగోది పెట్టుబడిదారీ విధానం నడుస్తున్నది. ఉత్పత్తికి సంబంధించి దేని ప్రత్యేక రూపం దాని కుంది. ఆప్రత్యేక రూపాల్ని పక్కనబెట్టి, శ్రమ ప్రక్రియని మొదట దానికదిగా, స్వతంత్రమైనదిగా పరిశీలించాలి.

**ఉత్పత్తి అనేది మనిషీ, ప్రకృతీ పాల్గొనే ప్రక్రియ.** దీన్ని మొదలుపెట్టేదీ, అదుపు చేసేదీ మనిషి. ప్రకృతి ఉత్పాదితాల్ని తన కోర్కెలకు అనువైన రూపంలోకి మార్చి స్వాధీనం చేసుకుంటాడు. బాహ్య ప్రపంచం మీద చర్య చేసి, దాన్ని మారుస్తాడు. అదే సమయంలో తన్ను తాను మార్చుకుంటాడు. తనలో నిద్రాణంగా ఉన్న శక్తుల్ని మేల్కొల్పుతాడు. తన అదుపాజ్ఞలలో పనిచేసేట్లు ఒత్తిడి పెడతాడు. శ్రమ ప్రక్రియలో ముందు దేన్ని ఊహిస్తాడో, ఆ ఫలితాన్ని సాధిస్తాడు. ఉదాహరణకి కత్తెర అతని ఊహలో ఉంటే దాన్ని తయారు చేస్తాడు.

**శ్రమ ప్రక్రియలోని మౌలికాంశాలు మూడు: 1. మనిషి శ్రమ 2. పదార్థం 3. పరికరాలు**

మొదట శ్రమ పదార్థం గురించి- శ్రమ ఏపదార్థం మీద జరుగుతుందో అది శ్రమ పదార్థం/ శ్రమ గ్రహీత. శ్రమ పదార్థాలలో మనిషి శ్రమ కలవనివి కొన్ని, కలిసినవి కొన్ని. భూమి మనిషి శ్రమ కలవనిది. అది మనకి అవసరమైన జీవనాధార సాధనాల్ని సిద్ధంగా ఉంచుతుంది. అవన్నీ మనిషి శ్రమ కలవనివి. నదిలో చేపలూ, అడవిలో కొట్టే కట్టెలూ, గనుల్లో తీసే ముడి ఖనిజమూ అప్పటికి మనిషి శ్రమ కలవని శ్రమ పదార్థాలే. ఒకసారి శ్రమ కలిసిన

శ్రమ పదార్థాల్ని ముడి పదార్థాలు అంటాం. బయటకు తీసి, కడగ బోతున్న ముడి ఖనిజం ముడి పదార్థమే. ప్రతి ముడి పదార్థమూ శ్రమ పదార్థమే, కాని ప్రతి శ్రమ పదార్థమూ ముడి పదార్థం కాదు.

**శ్రమ పదార్థాలు రెండు రకాలు:** 1. ప్రధాన పదార్థం 2. ఉప పదార్థం

శ్రమ పదార్థం ప్రధాన పదార్థం కావచ్చు. సహాయక పదార్థం కావచ్చు. కర్రు చెయ్యడానికి ప్రధానపదార్థం ఇనపముక్క. దాన్ని కాల్చడానికి బొగ్గు కావాలి. బొగ్గు కర్రులో చేరదు. కాని అది లేనిదే కర్రు తయారవదు. ఇక్కడ బొగ్గు సహాయక పదార్థం. అలాగే అది శ్రమ సాధనాలకు వాడే పదార్థం కావచ్చు– చక్రానికి నూనె లాగా, లాగే జంతువులకు గడ్డి లాగా. అలాగే అది ముడి పదార్థాన్ని మార్చేందుకు చేర్చే పదార్థం కావచ్చు – బట్టల్ని చలవచేసేందుకు వాడే క్లోరిన్ లాగా, ఊలుకి కలిపే రంగు పదార్థం లాగా. అంతేకాక, పనిస్థలాన్ని వెచ్చబరిచేందుకూ, వెలుతురు వచ్చేట్లు చేసేందుకూ వాడే పదార్థాలు ఈ కోవలోవే.

**శ్రమ సాధనాలు/ పరికరాలు.** ఏ శ్రమ చెయ్యాలన్న తగిన పనిముట్లు కావాలి. చింతకాయలు కొయ్యాలంటే దోటీ కావాలి. గుంట తొవ్వాలంటే గునపం ఉండాలి. పరికరాలు లేకుండానే, చేసే పనులు కొన్ని ఉంటాయి. మంచానికి నవారు అల్లడం, చెట్టెక్కి పళ్ళు కొయ్యడం, కలుపు మొక్కలు పీకడం, తాళ్ళు పేనడం వగయిరా ఈ కోవకి చెందుతాయి. ఈ పనుల్లో చేతులూ, కాళ్ళే శ్రమ సాధనాలు. అయితే అనేక పనులకి పరికరాలు వాడక తప్పదు. తొలి ఆహార భాండాగారంగా ఉన్నట్లే, భూమే తొలి పరికారల నిలయం కూడా. రాళ్ళూ, కర్రలూ, ఎముకలూ– ఇలాంటివే మనిషి తొలి పరికరాలు. శ్రమ అభివృద్ధి చెందేకొద్దీ ప్రత్యేక పరికరాలు అవసరమవుతాయి. వాటిని తయారు చేసే శ్రమలు ఏర్పడతాయి. జంతువులు కూడా మనిషి శ్రమవల్ల మార్పులు చెంది, వ్యవసాయం లోనూ, రవాణాలోనూ శ్రమ సాధనాలుగా బాగా ఉపకరించాయి. విస్తృతార్థంలో శ్రమ ప్రక్రియకు తోడ్పడే అన్ని వస్తువులూ శ్రమ సాధనాలే. అయితే అవన్నీ శ్రమ ప్రక్రియలో నేరుగా ప్రవేశించవు. కాని అవి లేకుంటే, ప్రక్రియ సాగదు, సాగినా సరిగా సాగదు. భూమి ఈ కోవకు చెందినదే. శ్రామికుడు నిలబడేది నేల మీదే. ఇంతకు ముందే శ్రమకలిసిన పనిస్థలాలూ, కాలవలూ, రోడ్లూ వంటివి అలాంటివే.

**ఉత్పాదితాలు.** శ్రమ పదార్థాలతో, శ్రమ సాధనాలతో మనిషి శ్రమ చేస్తాడు. ఫలితంగా ఉత్పాదితాలు ఏర్పడతాయి. ఉత్పాదితం (ఉత్పత్తైన వస్తువు) ఒక ఉపయోగపు విలువ. అది మనిషి అవసరాలకు తగినట్లు మార్చబడిన ప్రకృతి పదార్థం. శ్రమ ఆ పదార్థంలో చేరింది. అంటే, శ్రమ పాదార్థీకృతం అయింది అని. శ్రమ పదార్థం మార్పు చెందింది. శ్రామికుడిలో ఏదైతే కదలికగా కనబడిందో, అదిప్పుడు చలనం లేని స్థిర లక్షణంగా ఉత్పాదితంలో కనబడుతుంది. కమ్మరి ఇనప ముక్కని కొలిమిలో కాల్చి సాగ్గొడతాడు. మేకు ఆకారం వచ్చేట్లు చేస్తాడు. ఇది ఒక చర్య. ఏర్పడిన ఉత్పాదితం మేకు. సాగ్గొట్టేటప్పుడు కమ్మరి కదలికల్లో శ్రమ కనబడుతుంది. తయారైన ఉత్పాదితం మేకు. ఆ మేకులో ఆ కమ్మరిశ్రమ స్థిరపడి ఉంటుంది.

## ఉత్పాదక శ్రమ

శ్రమ ప్రక్రియని ఉత్పాదితం దృష్ట్యా చూస్తే, శ్రమ పదార్థమూ, శ్రమ సాధనాలూ రెండూ ఉత్పత్తి సాధనాలు అవుతాయి. ఇది స్పష్టమే. ఆశ్రమ ఉత్పాదక శ్రమ అన్నదీ అంతే స్పష్టం. ఇక్కడ ఉత్పాదక శ్రమ అంటే ఉత్పాదితాన్ని ఉత్పత్తిచేసే శ్రమ అని అర్థం. అయితే పెట్టుబడిదారీ ఉత్పత్తిలో వేరే అర్థంలో ఉంటుంది. శ్రమ ప్రక్రియ వైపు నుంచి మాత్రమే చూసి, ఉత్పాదక శ్రమని నిర్ణయించే పద్ధతి పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియ విషయంలో వర్తించదు – అని ఫుట్ నోట్ లో స్పష్టగా చెబుతాడు.

(ఇక్కడ ఉత్పాదితాన్ని ఉత్పత్తిచేసే శ్రమ అని అర్థం. అక్కడ దానికి వేరే అర్థం (అదనపు విలువని ఉత్పత్తిచేసే శ్రమ) ఉంటుంది. ఆ అర్థాన్ని 16 వ అధ్యాయంలో చెబుతాడు, అదీ క్లుప్తంగా. కాపిటల్ లో దీనిగురించి పెద్దగా ఉండదు. అదనపువిలువ సిద్ధాంతాలు మొదటి భాగంలో 'ఉత్పాదక, అనుత్పాదక శ్రమ సిద్ధాంతాలు' పేరుతో 153 పేజీల అధ్యాయం ఉంది. అందులో ఈ విషయం వివరంగా ఉంటుంది. ఇక్కడ దాని గురించి పనిలేదు. కనక దీని గురించి చర్చ ఉండదు.)

## ఉపయోగపు విలువల ఉత్పత్తి

**శ్రమ ప్రక్రియ ఉద్దేశం** ఉపయోగపు విలువల ఉత్పత్తి. మనిషి అవసరాలకు ప్రకృతి పదార్థాల్ని స్వాధీన పరుచుకోవడం. దీనికి సామాజిక దశతో నిమిత్తం లేదు. అంటే ఇది అదీ ఇదీ అని కాకుండా ప్రతి సామాజిక దశలోనూ ఉంటుంది. పెట్టుబడిదారీ విధానంలో పెట్టుబడిదారుడు ఉపయోగపు విలువల ఉత్పత్తికి నిర్వాహకుడుగా వ్యవహరిస్తాడు. మనమింకా విలువ ఉత్పత్తి విభాగంలోకి రాలేదు. అందువల్ల విలువ ఉత్పత్తికి ప్రతినిధిగా అతని విధిని ఇప్పుడు చర్చించడం లేదు. ఉపయోగపు విలువలు ఉత్పత్తి చేసే వాడుగా అతని మొదట పని తగిన శ్రమశక్తినీ, ఉత్పత్తి సాధనాల్నీ కొనడం. కొన్నాక గాని పని ప్రారంభించ లేదు.

**ఉత్పత్తి అతని అదుపాజ్ఞలలో జరుగుతుంది.** కొన్న శ్రమశక్తిని వాడుకుంటాడు. అంటే శ్రామికుడి చేత పనిచేయించి ఉత్పత్తి సాధనాల్ని వినియోగించుకుంటాడు. శ్రామికుడు తనకోసం కాకుండా, పెట్టుబడి దారుడి కోసం పనిచేస్తాడు. అయితే అంతమాత్రాన దాని సాధారణ స్వభావం మారదు. పెట్టుబడిదారుడి జోక్యం ఉన్నంత మాత్రాన బూట్ల తయారీలో, దారం తీయడంలో పద్ధతులూ చర్యలూ వెంటనే మారవు. మార్కెట్లో దొరికిన శ్రమ శక్తిని ఉన్నదున్నట్లుగా కొనాల్సిందే. కాబట్టి పెట్టుబడిదారులు లేని కాలంలో ఎటువంటి శ్రమ ఉందో అటువంటి శ్రమతో అతను సంతృప్తి చెందాల్సిందే. పెట్టుబడికి శ్రమ లోబడడం వల్ల ఉత్పత్తి విధానంలో వచ్చే మార్పులు ఆ తర్వాత కాలంలో మాత్రమే జరుగుతాయి. ఆ మార్పుల్ని రాబోయే అధ్యాయంలో చూస్తాం.

శ్రామికుడు సొంతానికి వాడుకునేందుకు, తన శ్రమతో ఉత్పత్తి చేసే శ్రమ ప్రక్రియ మనకు తెలుసు. అలాంటి శ్రమ ప్రక్రియ ఇక్కడ పెట్టుబడి దారుడు ఆ శ్రమ శక్తిని వాడుకొని ఉత్పత్తి చేసే ప్రక్రియ అయింది.

**ఈ ప్రక్రియకి రెండు ప్రత్యేక లక్షణలున్నాయి. అవి:**

- అజమాయిషీ పెట్టుబడిదారుడిదే. శ్రామికుడు పెట్టుబడిదారుడి అజమాయిషీలో అతను చెప్పినట్లు పని చేస్తాడు. పెట్టుబడిదారుడు సరిగా పని జరిగేట్లు చూసుకుంటాడు. అవసరాన్ని మించి శ్రమ సాధనాలు అరగకుండా, ముడిపదార్థాలు వ్యర్థం కాకుండా జాగ్రత్తపడతాడు.
- తయారైన సరుకు పెట్టుబడిదారుడి ఆస్తి. తక్షణ ఉత్పత్తిదారుడయిన కార్మికుడి ఆస్తి కాదు. ఎందువల్ల? ఒక పెట్టుబడి దారుడు ఒకరోజు పూర్తి శ్రమ శక్తి విలువని చెల్లించాడు అనుకుందాం. అప్పుడు ఆ శ్రమశక్తిని ఒక రోజంతా వాడుకునే హక్కు పెట్టుబడి దారుడికి చెందుతుంది. ఒక రోజుకి గుర్రాన్ని అద్దెకు తీసుకున్న వానికి గుర్రాన్ని ఆ రోజు వాడుకునే హక్కు ఉంటుంది గదా. అలాగే ఇది కూడా. ఏ సరుకు ఉపయోగమయినా, ఆ సరుకుని కొన్నవానిదే. ఈ సందర్భంలో కార్మికుడు శ్రమ శక్తిని అమ్మాడు. మారకం విలువని తీసుకున్నాడు.

ఉపయోగపు విలువని వదులుకోక తప్పదు. పనిస్థలంలో అడుగు పెట్టిన క్షణం నించీ, **శ్రమ శక్తి ఉపయోగపు విలువ పెట్టుబడి దారుడిదే.** అందువల్ల దాని వాడకం, అంటే శ్రమ అతనికే చెందుతుంది. శ్రమ శక్తిని వాడుకోవాలంటే, ఉత్పత్తి సాధనాలు కావాలి. ఆ సాధనాలు కూడా పెట్టుబడిదారుడే సమకూరుస్తాడు. అవన్నీ అతనివే. అందువల్ల ఈ ప్రక్రియలో తయారయ్యే ఉత్పాదితం అతనికే చెందుతుంది.

**ఉత్పత్తయిన వస్తువు (ఉత్పాదితం) ఎవరిది?** ఉత్పత్తికి కావలసిన వాటిని సమకూర్చిన **పెట్టుబడిదారుడిదా లేక తయారుచేసిన శ్రామికుడిదా?**

ముడి పదార్థమూ, జీవితావసర వస్తువులూ ఇచ్చిన పెట్టుబడిదారుడు ఒక్కడికే ఉత్పాదితం పూర్తిగా దక్కుతుంది. ఇది స్వాధీన నియమం (law of appropriation) యొక్క కఠిన ఫలితం. -అని స్విస్ ఉదారవాద ఆలోచనాపరుడు (చెర్బూలియాజ్ 1797-1869 )1841 లో చెప్పాడు.

ఇదే విషయాన్ని మార్క్స్ తన ఆర్థిక రచనలలో చెబుతాడు: ఉత్పాదితం పెట్టుబడిదారుడికి చెందుతుంది, శ్రామికుడికి కాదు. Cap1.549 శ్రమ ఉత్పాదితం లేక దాని విలువ శ్రామికుడికి చెందదు. - Theories of Surplus Value1.72

"ఉత్పత్తయిన సరుకులోగానీ, దాని ధరలో గానీ అతనికి (కార్మికుడికి) ఏమీ భాగం లేదు - మగ్గానికి లేనట్లే - వేతనశ్రమా- పెట్టుబడీ - సంకలిత రచనలు 1. పేజీ 95

## విభాగం 2
## అదనపు విలువ ఉత్పత్తి

పెట్టుబడిదారుడు సొంతపరుచుకున్న ఉత్పాదితం ఒక ఉపయోగపు విలువ. – నూలైనా, బూట్లయినా. అయితే అతను దాన్ని ఉపయోగపు విలువ అనే ఉద్దేశంతో ఉత్పత్తి చెయ్యడు. మారకం విలువకు నిలయం అయినందువల్లనే ఉత్పత్తి చేస్తాడు. అతని లక్ష్యం: మారకం విలువ వున్న ఉపయోగపు విలువని ఉత్పత్తి చెయ్యడం. అంటే, అమ్మకానికి ఉద్దేశించిన వస్తువుని, సరుకుని ఉత్పత్తి చెయ్యడం. అంతే కాదు, ఆ సరుకు ఉత్పత్తిలో వాడిన సరుకుల మొత్తం విలువ కన్నా – అంటే, ఉత్పత్తి సాధనాలవిలువ, శ్రమ శక్తి విలువల మొత్తం కన్నా– ఎక్కువ విలువవున్న సరుకుని ఉత్పత్తి చెయ్యడం. విలువని మాత్రమే కాదు, అదే సమయంలో అదనపు విలువని కూడా ఉత్పత్తి చెయ్యడం. అదనపు విలువ ఉత్పత్తి చెయ్యాలంటే, ముందు విలువని ఉత్పత్తి చెయ్యాలి.

### విలువ ఉత్పత్తిగా ఉత్పత్తి

నిర్దిష్ట సామాజిక పరిస్థితుల్లో ఒక సరుకు ఉత్పత్తికి అవసరమైన, దానిలో వస్తుత్వం చెందిన శ్రమ కాలం చేత ఆ సరుకు విలువ నిర్ణయమవుతుంది. ఇది మనకు తెలిసిందే. మన పెట్టుబడి దారుడు నిర్వహించిన శ్రమ ప్రక్రియ ఫలితంగా అతనికి చేరిన ఉత్పాదితం 10 కిలోల నూలు అనుకుందాం. అప్పుడు అందులో వున్న శ్రమ పరిమాణాన్ని లెక్కించడమే మన మొదటి స్టెప్.

అందులో ఉన్న శ్రమ పరిమాణం రెండు భాగాలుగా ఉంటుంది:

1. ఉత్పత్తి సాధనాల్లో ఇమిడివున్న శ్రమ పరిమాణం
2. కొత్తగా ఉత్పాదితంలో కలిసిన కొత్త శ్రమ పరిమాణం

మొదట ఉత్పత్తి సాధనాల్లో ఇమిడివున్న శ్రమ పరిమాణాన్ని గురించి చెబుతాడు.

నూలు వడకాలంటే, ముడిపదార్థం కావాలి. 10 కిలోల దూది అనుకుందాం. అతను దాని పూర్తివిలువకే, 1000 రూపాయలకి కొన్నాడని అనుకుందాం. అన్ని శ్రమపరికరాల అరుగుదల విలువ 200 రూపాయలు అనికూడా అనుకుందాం. ఆనూలులో 24 గంటల శ్రమ, రెండు పనిదినాల శ్రమ ఇప్పటికే రెండురోజులశ్రమ ఇమిడి ఉంది.

**బదిలీ అయిన శ్రమ.** ఉన్నదంతా వడికే శ్రమద్వారా శ్రమ పదార్థాల నుంచీ, శ్రమ సాధనాల నుంచీ బదిలీ అయ్యేదే. అంతే కాని వడికే శ్రమ కొత్తగా ఏర్పరచింది కాదు. అది ఇందులో లేదు.

40 కిలోల నూలు విలువ = 40 కిలోల దూది విలువ + మొత్తం కదురు విలువ అనుకుందాం. అంటే, ఇరువైపులా ఉన్న సరుకుల ఉత్పత్తికి ఒకే శ్రమకాలం పట్టిందని అర్థం. అలాంటప్పుడు,

10 పౌన్ల నూలు విలువ = 10 పౌన్ల దూది విలువ + ¼ కదురు విలువ. 1000 + 200 = 1200 ఇది దూదినించీ, కదురునించీ నూలుకి బదిలీ అయిన విలువ.

## ముడి పదార్థాల విలువా, శ్రమసాధనాల విలువా ఉత్పాదితానికి బదిలీ

నూలు ఉత్పత్తిలో ముడిపదార్థం దూది. కదురు అరగకపోతే దూది నూలుగా మారదు. అందువల్ల దూది ఉత్పత్తికీ, కదురు ఉత్పత్తికీ అవసరమైన శ్రమ ఇప్పుడు నూలులో ఉంటుంది. ఆ శ్రమంతా **గతశ్రమే.** అది వడికే ప్రక్రియ మొదలవక ముందే, దానికి ముందు దశలో వ్యయమైన శ్రమ. కదురు ఉత్పత్తిలో అవసరమైన శ్రమ కాలం 20 గంటలనుకుందాం.అంటే అది అరిగిపోయేదాకా వడికితే ఆ 20 గంటల శ్రమ కాలాన్నే బదిలీ చెయ్యగలదు. ఎందుకంటే అందులో ఉన్న శ్రమ కాలం అంతే. అది కొత్త విలువని ఏర్పరచే సరుకుకాదు.

**కొత్త విలువని ఏర్పరచే సరుకు శ్రమ శక్తి ఒక్కటే.** దూదిని నూలుగా మార్చే శ్రమ ఒక ప్రత్యేక మానవ చర్య. వడికే శ్రమ. ఆశ్రమ మిగిలిన ఉత్పాదకశ్రమల కన్నా భిన్నం అయింది. కొయ్యని నాగలిగా చేసే వడ్రంగి శ్రమ వంటిది కాదు. వడికే చర్యకి దూదీ, కదురూ అవసరం. కాని నాగలి తయారీలో అవెందుకూ కొరగావు. కొయ్య, పెద్ద బాడిశె కావాలి. ఒక్కో శ్రమ వల్ల ఒక్కో ఉత్పాదితం తయారవుతుంది. వడికే శ్రమ వల్ల నూలు తయారయితే, వడ్రంగం వల్ల నాగలి తయారవుతుంది. కాబట్టి ఉపయోగపు విలువని ఏర్పరిచేదిగా చూస్తే, దేనికది మిగిలిన వాటికంటే భిన్నమైనది. వడికే శ్రమ మిగిలిన శ్రమలకంటే భిన్నమైంది.

అందుకు భిన్నంగా వడికే వాని శ్రమని విలువని ఏర్పరచే మేరకు పరిగణిస్తే, అంటే విలువకి వనరుగా చూస్తే, అతని శ్రమ నాగలి చెక్కే వాని శ్రమకి భిన్నమైనది కాదు. మనకి ఇంకాస్త దగ్గరయిన విషయానికొస్తే, ఉత్పత్తి సాధనాలైన దూది పండించేవాడి శ్రమకీ, కదురుచేసేవాడి శ్రమకీ భిన్నమైనదికాదు. ఈ ఏకత్వం వల్లనే, పత్తి పండించడమూ, కదురు చెయ్యడమూ, వడకడమూ అనేవి మొత్తం నూలు విలువలో భాగాలు కాగలిగాయి. అవి ఒకదాన్నించి మరొకటి పరిమాణంలో మాత్రమే తేడాగా ఉంటాయి. ఇక్కడ శ్రమ గుణంతో, శ్రమ ప్రత్యేక స్వభావంతో మనకి ప్రమేయం లేదు. ప్రమేయం ఉన్నదల్లా శ్రమ పరిమాణంతోనే. విలువ ఎలా ఉత్పత్తవుతుందో, దాని పరిమాణాన్ని కోలిచేది ఎలాగో మునుపే చెప్పాడు. ఇక అదనపు విలువ ఉత్పత్తిని వివరిస్తాడు.

## అదనపు విలువ ఉత్పత్తిగా ఉత్పత్తి

పెట్టుబడిదారుడు మొదట పెట్టిన డబ్బు కంటే చివరలో తీసుకునే డబ్బు ఎక్కువ. ఈ ఎక్కువనే మార్క్స్ అదనపు విలువ అంటాడు. అదనపు విలువ శ్రామికుడు వాడిన ఉత్పత్తి సాధనాలవల్ల ఏర్పడింది కాదు. అతని శ్రమ వల్ల ఏర్పడింది. కాబట్టి అదనపు విలువ ఎంతో తేల్చాలంటే, కొత్తగా ఏర్పడిన విలువని పెట్టుబడిదారుడి ఖర్చుతో పోల్చాలి. ముందుగా 6 గంటల శ్రమ ఏర్పరచిన విలువ ఉత్పాదితాన్ని లెక్కలోకి తీసుకుంటాడు. ఎందుకంటే శ్రామికునికిచ్చిన వేతనం 6 గంటల శ్రమకి ప్రతినిధి కనుక. మరి వేతనం 6 గంటలశ్రమకి సమానకం అయినప్పుడు శ్రామికుడు 6 గంటల పైన ఎందుకు పనిచెయ్యాలి? ఇది శ్రామికుడికి

బాగానే ఉంటుంది. అయితే పెట్టుబడిదారుడు తృప్తిపడడు. కారణం అదనపు విలువ ఏర్పడక పోవడమే. అతని డబ్బు పెట్టుబడిలోకి మారక పోవడమే.

**అదనపు విలువ ఎలా ఏర్పడుతుంది?** విలువని ఏర్పరచేది శ్రమ ఒక్కటే. 6 గంటలు దాటి శ్రామికుడు పనిచేస్తేనే అదనపు విలువ వస్తుంది. **శ్రామికుడు 6 గంటల పైన ఎందుకు పనిచెయ్యాలి?**

రోజు శ్రమ శక్తి విలువని 6 గంటలలో ఉత్పత్తి చెయ్యచ్చు. కాబట్టి శ్రామికుడు 6 గంటలు మాత్రమే పనిచేస్తే చెల్లుబోతుంది. అయితే 6 గంటల పని అవగానే పనివాళ్ళని ఇంటికి పంపాల్సిన పనిలేదు. ఎందుకంటే, అతను రోజుకు సరిపడా జీవితావసర వస్తువులు ఇచ్చాడు; ఒకమామూలు పనిదినం అంతా పనిచేయించుకునే హక్కు అతనికి ఉంటుంది.

ఒక రోజు శ్రమశక్తి విలువ 400 రూపాయలు అనుకుందాం. దాన్ని బట్టి ఆ శ్రమశక్తిలో రూపొంది ఉన్న శ్రమ అరరోజు శ్రమ. అంటే, ఒక రోజు శ్రమశక్తి ఉత్పత్తికి కావలసిన జీవితావసర వస్తువులు అరరోజు శ్రమతో ఉత్పత్తవుతాయి. అంటే, శ్రమశక్తి నిర్వహణకు అయ్యే రోజు ఖర్చు, రోజు పనిలో అదిచేసే ఖర్చు రెండూ రెండు వేర్వేరు విషయాలు. మొదటిది, శ్రమశక్తి మారకం విలువని నిర్ణయిస్తుంది. రెండోది, దాని ఉపయోగపు విలువని నిర్ణయిస్తుంది. ఒక శ్రామికుడు 24 గంటలపాటు జీవించడానికి అరరోజు శ్రమ చాలు. ఈ వాస్తవం అతడు 6 గంటలు దాటి రోజంతా పనిచేయడాన్ని నివారించదు. 6 గంటలు పనిచేస్తే తన శ్రమశక్తి విలువని ఉత్పత్తిచేస్తాడు. 6 గంటలు దాటి పనిచేస్తే అతను తన శ్రమ శక్తి విలువకన్నా ఎక్కువ విలువని ఉత్పత్తి చేస్తాడు. అందువల్ల **శ్రమశక్తి విలువా, ఆశ్రమశక్తి ఉత్పత్తిచేసే విలువా రెండూ రెండు వేర్వేరు పరిమాణాలు.** రోజు శ్రమశక్తి ఉత్పత్తి అవడానికి కావలసిన వస్తువులు ఎక్కడెక్కడో ఉత్పత్తవుతాయి. వాటి ఉత్పత్తికి 6 గంటల శ్రమ సరిపోవచ్చు. అయితే వాటిని వాడుకున్న శ్రామికుడు 12 గంటలైనా పనిచెయ్యగలడు. దీన్నిబట్టి, శ్రమశక్తి యొక్క ఉత్పత్తి విలువా, అది ఉత్పత్తిచేసే విలువా భిన్నమైనవి. రెంటికీ పరిమాణంలో తేడా ఉంటుంది. పెట్టుబడిదారుడు శ్రమశక్తిని కొన్నప్పుడు అతని మనసులో ఉన్నది సరిగ్గా ఈ తేడాయే. అతన్ని ప్రభావితం చేసింది శ్రమశక్తికున్న విశిష్ట ఉపయోగపు విలువే. అది విలువకి వనరు, అంతే కాదు, తన విలువకన్నా ఎక్కువ విలువకు వనరు. పెట్టుబడిదారుడు శ్రమశక్తి నుంచి ఆశించే విశిష్టసేవ ఇదే.

ఈ లావాదేవీలో అతను శాశ్వతమైన సరుకుల మారక నియమాలకు అనుగుణంగానే వ్యవహరిస్తాడు. శ్రమశక్తిని అమ్మేవాడు, అన్ని ఇతర సరుకులు అమ్మేవాళ్ళ లాగే, మారకం విలువని పొందుతాడు,ఉపయోగపువిలువని వదులుకుంటాడు.ఒకదాన్ని ఇవ్వనిదే,రెండోదాన్ని తీసుకోలేడు. శ్రమ శక్తి ఉపయోగపువిలువ, అంటే శ్రమ, అమ్మినవానికి చెందదు – నూనె అమ్మినవానికి ఆ నూనె ఉపయోగపువిలువ ఎలా చెందదో అలాగే. అంటే ఈ సందర్భంలో

**శ్రమ శక్తి ఉపయోగపు విలువ కొన్న వానికే, గాని అమ్మిన శ్రామికునికి చెందదు**

**పెట్టుబడిదారుడు ఏమీ ఇవ్వకుండానే, కొంత తీసుకుంటాడు**

**అయితే అతను సరుకుల మారక నియమాల్ని ఉల్లఘించడు**

డబ్బువాడు ఒక రోజు శ్రమశక్తికి డబ్బిచ్చాడు. అందువల్ల, ఆ రోజు శ్రమశక్తి ఉపయోగపు విలువ అతనికే చెందుతుంది. ఒకవైపు, రోజు శ్రమశక్తి పోషణకి అర రోజు శ్రమ సరిపోతుంది. మరొకపక్క అదే శ్రమశక్తి రోజంతా పనిచేయ్య గలుగుతుంది. ఫలితంగా ఒక రోజులో అది ఉత్పత్తి చేసే విలువ, దాన్ని ఉపయోగించు కున్నందుకు చెల్లించిన విలువకి రెండింతలు ఉంటుంది –

**ఈపరిస్థితి నిస్సందేహంగా కొన్నవాని అదృష్టమే**
**కాని ఏవిధంగానూ అమ్మినవానికి కీడు కాదు**

కొన్న పెట్టుబడి దారుడికి అదృష్టం ఎందుకంటే, అది ఉచితంగా వచ్చింది, అందులో అతని శ్రమ లేదు. అమ్మిన శ్రామికుడికి హాని ఎందుకు లేదంటే, అతనికి రావలసిన శ్రమశక్తి విలువ అతనికి వచ్చింది.

## ఈపెరిగిన ప్రక్రియలో వచ్చిన ఉత్పాదితాన్ని పరిశీలిద్దాం

ఒకరోజు శ్రమశక్తి విలువ 400 రూపాయలు. అది 6 గంటల శ్రమకి సమానం. గంటకి 1 2/3 కిలోల చొప్పున 6 గంటలలో 10 కిలోల నూలు ఉత్పత్తవుతుంది – అలా అనుకుందాం. అప్పుడు 6 గంటలలో 400 రూపాయల విలువ కలుస్తుంది. అందువల్ల ఆనూలు విలువ రూ. 1600 (ఉత్పత్తి సాధనాల విలువ 1200 + శ్రమశక్తి విలువ 400). ఇది పెట్టుబడి దారుడు పెట్టిందే. అదనం ఏమీ లేదు.

అయితే పెట్టుబడిదారుడు రోజు శ్రమ శక్తిని కొన్నాడు. 6 గంటలు పని చేయించాడు. అతను పెట్టింది వచ్చింది. మరొక 6 గంటల పాటు శ్రమ శక్తిని వాడుకోవచ్చు. ఈపరిస్థితిని మన పెట్టుబడిదారుడు ముందే తెలుసుకున్నాడు. మన కార్మికుడు కార్ఖానాకి పోయి చూస్తే అక్కడ 6 గంటల పనికి కాదు, 12 గంటల పనికి అవసరమైనన్ని ఉత్పత్తి సాధనాలు ఉంటాయి.

మొదటి 6 గంటల ప్రక్రియలో 10 కిలోల దూది 6 గంటల శ్రమని పీల్చుకుని, 10 కిలోల నూలు ఎలా అయిందో, అలాగే ఇప్పుడు 20 కిలోల దూది 12 గంటల శ్రమని పీల్చుకొని, 20 కిలోల నూలు అవుతుంది. ఈ 6 గంటలకు ఇంతకు ముందు లాగే ఉత్పత్తిసాధనాలు 1200 రూపాయలు పెట్టాలి. అయితే శ్రమ శక్తికి ఏమీ ఖర్చవదు. మొత్తం 12 గంటల్లో రూ. 3200 విలువగల నూలు తయారవుతుంది. ఇందుకుగాను పెట్టింది 2800. (ఉత్పత్తి సాధనాల విలువ 2400 + శ్రమశక్తి విలువ 400). అతనికి పెట్టింది పోను అదనంగా రూ. 400 వచ్చింది. అతని డబ్బుపెట్టుబడి లోకి మారింది.

**సరుకుల మారక నియమాల్ని భంగపరచ కుండానే అదనపు విలువ ఉత్పత్తయింది.**
**సమస్యలో ఉన్న ప్రతి షరతూ నెరవేరింది.**

సరుకుల మారకాన్ని నియంత్రించే నియమాలేవీ ఏ విధంగానూ భంగం కాలేదు. అదెలాగో వివరిస్తాడు.

**సమానకాలకు సమానకాలే మారకం అయ్యాయి.** పెట్టుబడిదారుడు కోనేవాడుగా ప్రతి సరుకుకీ, దూదికీ, కదురుకీ, శ్రమశక్తికీ – దేనిపూర్తి విలువ దానికి చెల్లించాడు.

అప్పుడిక సరుకులు కొన్న ప్రతివాడూ ఏం చేస్తాడో అదే చేశాడు. అంటే వాటి ఉపయోగపు విలువల్ని వాడుకున్నాడు. శ్రమశక్తి వాడకం సరుకుల్ని ఉత్పత్తి చేసే ప్రక్రియ కూడా. ఇక్కడ అతనికి కొన్న వస్తువుల వాడకం వల్ల రూ.3200 విలువగల 20 కిలోల నూలు వచ్చింది. ఇంతకుముందు కొనేవాడుగా ఉన్న పెట్టుబడిదారుడు ఇప్పుడు అమ్మేవాడుగా మార్కెట్ కి మరల వస్తాడు. అతను నూలుని కిలో రూ.160 లెక్కన అమ్ముతాడు. అదే దాని కచ్చితమైన విలువ. అంతచొప్పునే అమ్మినప్పటికీ, మొదట్లో పెట్టినదానికంటే రూ. 400 అదనంగా రాబడతాడు.

"ఈ క్రమం అంతా, అతని డబ్బు పెట్టుబడిగా మారడం అంతా చలామణీ రంగం లోపలే జరిగింది, అదే సమయంలో అది దాని లోపల జరగనూ లేదు. **ఇది చలామణీ జోక్యంతో జరిగింది, ఎందుచేతనంటే దానికి శ్రమశక్తి కొనుగోలు తప్పనిసరి షరతు. ఇది చలామణీ రంగం లోపల జరగలేదు, ఎందుచేతంతే ఉత్పత్తి రంగంలో జరిగిన, విలువచే విలువని పుట్టించడం అనే క్రమాన్ని ఇది కేవలం సిద్ధం చేసేది. అంతే."**

మొదటి చర్య లేకుండా రెండో చర్య అసంభవం. శ్రమ శక్తిని చలామణీ రంగంలో కొంటేనే రెండో చేర్య అయిన ఉత్పత్తి మొదలవుతుంది. ఇది చలామణీ రంగంలో జరిగింది. అదనపు విలువ ఉత్పత్తికి రెండో చర్య అంటే ఉత్పత్తి లేకపోతే, ఉన్న విలువ పెరగదు. డబ్బు పెట్టుబడిలోకి మారదు. అందువల్ల డబ్బు పెట్టుబడి అవడం చలామణీ రంగంలోనూ జరగాలి, ఆరంగం బయటా జరగాలి.

అలాగే జరిగింది – అని రుజువు చేశాడు మార్క్స్. ఇది అంతకు ముందు ఆర్థికవేత్తలకు అంతుబట్టలేదు. ప్రయత్నించినా పరిష్కారం దొరకలేదు. సమానవిలువలే మారితే, లాభం ఎలావస్తుంది? ఇదే వాళ్ళు శాస్త్రీయంగా తేల్చలేకపోయిన సమస్య. మార్క్సుకి మిగిల్చిన సమస్య. మార్క్సు తేల్చిన సమస్య.

# అధ్యాయం 8
# స్థిర పెట్టుబడీ - అస్థిర పెట్టుబడీ

ఉత్పత్తి సాధనాల విలువ కొత్త ఉత్పాదితానికి బదిలీ అవుతుంది. శ్రమశక్తి ఆ ఉత్పాదితానికి కొత్త విలువని చేరుస్తుంది. ఈ రెండు అంశాలు మీదా పెట్టుబడి ఉంటుంది. అంటే పెట్టిన పెట్టుబడి రెండు భాగాలుగా ఉంటుంది

1. ఉత్పత్తి సాధనాలమీద పెట్టింది. ఈవిలువ కొత్త ఉత్పాదితానికి **బదిలీ అవుతుంది**
2. శ్రమ శక్తి మీద పెట్టింది. ఈవిలువ ఉత్పాదితానికి **కొత్త విలువని చేరుస్తుంది**

ఈ రెండు భిన్నమైన ఫలితాలకోసం శ్రామికుడు రెండుసార్లు వేర్వేరుగా పనిచెయ్యడు. సరుకులో ఉండే ఉపయోగపు విలువనీ, విలువనీ ఏర్పరచేటప్పుడు ఎలాగో అలాగే. అక్కడ శ్రమ ఒక్కటే. దానికి ద్వంద్వ స్వభావం ఉంటుంది. ఇక్కడా అలాగే శ్రమ ఒక్కటే, ఫలితాలు రెండు. ద్వంద్వ ఫలితాల స్వభావం శ్రమ ద్వంద్వస్వభావం నుంచి వచ్చింది. అనిర్దిష్ట శ్రమగా అది కొత్త విలువని ఏర్పరుస్తుంది. నిర్దిష్ట శ్రమగా ఉన్న విలువని బదిలీ చేస్తుంది.

పెట్టుబడిలో ఉత్పత్తి సాధనాలయిన ముడిపదార్థానికీ, ఉపపదార్థాలకూ, శ్రమ సాధనాలకూ పెట్టిన పెట్టుబడి విలువ ఉత్పత్తి ప్రక్రియలో ఏ మాత్రం మారదు. అందువల్ల దాన్ని స్థిర పెట్టుబడి (constant capital) అంటాడు. మరొకవైపు, శ్రమశక్తికి పెట్టిన పెట్టుబడి విలువ ఉత్పత్తి ప్రక్రియలో మార్పు చెందుతుంది. దాని సొంత విలువని పునరుత్పత్తి చెయ్యడమే కాక, అదనపు విలువని కూడా ఉత్పత్తి చేస్తుంది. అదనపువిలువ దానికదిగా మారవచ్చు, పరిస్థితుల్ని బట్టి ఎక్కువ కావచ్చు, తక్కువ కావచ్చు. పెట్టుబడిలోని ఈ భాగం నిరంతరం స్థిర పరిమాణం నించి అస్థిరపరిమాణంగా మార్చబడుతూ ఉంటుంది. అందువల్ల, పెట్టుబడిలోని ఈ భాగాన్ని అస్థిర పెట్టుబడి (variable capital) అంటాడు.

## స్థిర పెట్టుబడిలోని అంశాల విలువ మారవచ్చు

స్థిర పెట్టుబడిలోని అంశాల విలువ మారకుండా ఉండాలనేమీ లేదు. మారే అవకాశాలున్నాయి. ఉదాహరణకి, కిలో దూది ధర ఒకరోజు 100 రూపాయలు ఉండవచ్చు. తర్వాత దిగుబడి తగ్గి 150 రూపాయలు అవచ్చు. 100 రూపాయలకు కొని ధర పెరిగాక వాడినట్లయితే, ప్రతి కిలోకీ 150 రూపాయలు విలువ ఉత్పాదితానికి బదిలీ అవుతుంది; పెరగడానికి ముందు తయారై, మార్కెట్లో చలామణీలో ఉన్న నూలు దాని అసలు విలువకు రెట్టింపు విలువని బదిలీ చేస్తుంది. అయితే, విలువలో ఈ మార్పులు వడకడం వల్ల దూదికి కలిసిన అదనపు విలువతో సంబంధం లేనివి. ఇది స్పష్టమే. పాత దూది వడకక పోయినా, ధర పెరిగాక కిలో దూది ధర 100 రూపాయలకు కాకుండా 150 రూపాయలకు తిరిగి అమ్ముడవుతుంది. శ్రమ సాధనాలకూ ఇదే వర్తిస్తుంది.

ప్రక్రియలో ఉపయోగించే ముడి పదార్థం విలువ మారవచ్చు. అలాగే శ్రమ సాధనల విలువ కూడా మారిపోవచ్చు. ఫలితంగా, వాటినుంచి ఉత్పాదితానికి బదిలీ అయ్యే విలువ

మారుతుంది. కొత్త యంత్రం పాతదాని కంటే తక్కువ శ్రమతో ఉత్పత్తయ్యే పనయితే, పాతయంత్రం విలువ ఎంతోకొంత తగ్గుతుంది. ఫలితంగా, అంటే తక్కువ విలువని ఉత్పాదితానికి బదిలీ చేస్తుంది. అయితే మళ్ళీ ఇక్కడ విలువ మార్పు, ఈ యంత్రం ఉత్పత్తి సాధనంగా పనిచేసే ప్రక్రియకు బయట జరుగుతుంది. ఒకసారి ఈ ప్రక్రియలో ప్రవేశిస్తే, ఈ యంత్రం ప్రక్రియకి బయట సంతరించుకున్న విలువకన్నా, ఎక్కువ విలువని బదిలీ చెయ్యజాలదు. శ్రమ ప్రక్రియలో పాల్గొనడం మొదలయ్యాక కూడా ఆ ఉత్పత్తిసాధనాల విలువలో మార్పు స్థిర పెట్టుబడిగా వాటి స్వభావాన్ని మార్చదు. అదే విధంగా స్థిర పెట్టుబడికి అస్థిర పెట్టుబడితో ఉండే నిష్పత్తి వాటి చర్యల్ని మార్చదు.

శ్రమ ప్రక్రియలో సాంకేతిక పరిస్థితులు ఎంతో అభివృద్ధి కావచ్చు. ఇదివరకు కొద్ది విలువ గల 10 పరికరాలతో, 10 మంది తక్కువ ముడిపదార్థాల్ని వాడి పనిచేసి ఉండవచ్చు. ఆ స్థాయి నుండి, ఇప్పుడు ఒక ఖరీదయిన యంత్రంతో అంతకు 100 రెట్ల ముడి పదార్థాలు వాడే స్థాయికి అభివృద్ధి కావచ్చు. రెండో సందర్భంలో స్థిర పెట్టుబడి బాగా పెరిగిపోతుంది. అదే సమయంలో శ్రమశక్తికి వెచ్చించిన అస్థిర పెట్టుబడి బాగా తగ్గుతుంది. అటువంటి విప్లవం స్థిర పెట్టుబడికీ అస్థిర పెట్టుబడికీ మధ్య ఉండే పరిమాణాత్మక సంబంధాన్ని మాత్రమే మారుస్తుంది. లేక మొత్తం పెట్టుబడి స్థిరపెట్టుబడి, అస్థిర పెట్టుబడి అనే భాగాలుగా ఏ నిష్పత్తిలో విభజితమవుతాయో ఆ నిష్పత్తిని మారుస్తుంది. అంతేగాని ఆ రెండు భాగాలకూ అంటే స్థిర పెట్టుబడికీ అస్థిర పెట్టుబడికీ ఉన్న సారభూతమైన భేదాన్ని అతికొద్దిగా నైనా ప్రభావితం చెయ్యలేదు. అంటే ఏమాత్రం మార్చలేదు.

**మార్క్స్‌కి ఈవిభజన ఎంతో ముఖ్యమయినది.** ఎందుకంటే, అదనపు విలువ ఎక్కడ నుండి వస్తుంది? తెలుకునేందుకు ఈ విభజన ఉపకరిస్తుంది. ఈ విభజన ప్రవేశ పెట్టి, అస్థిర పెట్టుబడి మాత్రమే అదనపు విలువను సృష్టిస్తుందని రుజువు చేశాడు.

**"స్థిర పెట్టుబడి, అస్థిర పెట్టుబడి అనే భావాభివర్గాల్ని మొదట వాడినవాడిని నేనే."**
**అని చెప్పుకున్నాడు-** 1- Capital 1.572 ఫుట్ నోట్. 3

**నిశ్చల పెట్టుబడి** (fixed capital), **చంచల పెట్టుబడి** (circulating capital)

ఇక బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు మార్క్స్ చేసిన స్థిర అస్థిర విభజనని ఒప్పుకోరు. ఎందుకంటే అది దోపిడీని బట్టబయలు చేస్తుంది. వాళ్ళు పెట్టుబడిదారీ విధాన వకాల్తాదారులు. పెట్టుబడి దోపిడీ స్వభావాన్ని మభ్య పెట్టేందుకు ప్రయత్నిస్తారు. కనుక వాళ్లకి నిశ్చల పెట్టుబడి, చంచలపెట్టుబడి అనే విభజన అవసరం. పెట్టుబడిదారుడు తన లెక్కల్లో రాసుకున్నట్లే పెట్టుబడిన నిశ్చల పెట్టుబడిగానూ, చంచల పెట్టుబడిగానూ విభజించారు.

**నిశ్చల పెట్టుబడి** – ఫాక్టరీ భవనాలు, యంత్రాలు, పరికరాలు
**చంచల పెట్టుబడి** – ముడి సరుకులు, ఇంధనాలు, కార్మికుల కూలి.

నిశ్చల భాగంగానూ చలామణీ అయ్యే భాగంగానూ పెట్టుబడిని విభజించడం వల్ల ఉత్పత్తిసాధనాలకూ, శ్రమ శక్తికీ మధ్యగల ముఖ్యమైన తేడా మరుగవుతుంది. శ్రమశక్తి,

ముడిపదార్థాలు ఇంధనాలు ఉపకరణాలతో కలిసి ఉంటుంది. మిగిలిన ఉత్పత్తి సాధనాల వలెనే పరిగణించబడుతుంది. ఈరకమైన విభజన అదనపు విలువను సృష్టించడంలో శ్రమశక్తి ప్రత్యేక పాత్రను కప్పిపుచ్చుతుంది. పెట్టుబడిదారీ దోపిడీని మరుగు పరుస్తుంది. పెట్టుబడిలో ఏభాగం వల్ల అదనపు విలువ ఏర్పడుతుందో ఈవిభజనలో తేలదు. అందుకే మార్క్స్ ఇలా అంటాడు:

**"సాంప్రదాయ అర్థశాస్త్రం ఆడమ్ స్మిత్ కాలం నుంచీ ఈ భావాభివర్గాలకున్న ప్రధాన వ్యత్యాసాల్ని, చలామణీ ప్రక్రియలో తలెత్తే నిశ్చల పెట్టుబడి, చంచలపెట్టుబడి అనే కేవల రూప వ్యత్యాసాలతో కలగాపులగంచేసి, గందరగోళపరిచారు"** - Capital 1.572 ఫుట్ నోట్.3

ఈ రెండు పద్ధతులకీ ఉన్న తేడా తెలుసుకోవడం అవసరం. స్థిర అస్థిర విభజన అదనపు విలువకి అస్థిర పెట్టుబడి నిజమైన ఏకైక వనరు అని చూపిస్తుంది. నిశ్చల, చంచల పెట్టుబడి విభజన అదనపు విలువకి నిజమైన వనరు అయిన శ్రమని, కొత్త విలువని కలపని ఇతర అంశాలతో కలిపి గందరగోళపరుస్తుంది. ఆవిధంగా పెట్టుబడి దారులు అవలంబించే ఈ విభజన పెట్టుబడిదారీ దోపిడీ సారానికి ముసుగు వేస్తుంది.

మార్క్స్ విభజన ప్రకారం:

స్థిరపెట్టుబడి – ఫాక్టరీ భవనాలు, యంత్రాలు, పరికరాలూ, ముడిపదార్థాలు, ఉపపదార్థాలూ, ఇంధనాలు

అస్థిరపెట్టుబడి – కార్మికుల కూలి.

ఈ విభజనద్వారా అస్థిర పెట్టుబడి మాత్రమే అదనపు విలువను సృష్టిస్తుందని రుజువు చేశాడు.

అదనపు విలువ రేటు కట్టడానికి ఈ విభజన ఆధారం. అందువల్ల ఇది సింపుల్‌గా కనబడినా మార్క్స్ అర్థశాస్త్రంలో ముఖ్యమైనవాటిలో ఒకటి.

# అధ్యాయం 9
# అదనపు విలువ రేటు
## విభాగం 1 శ్రమశక్తి దోపిడీ స్థాయి

పెట్టిన పెట్టుబడి (C) రెండు భాగాలుగా ఉంటుంది:

1. స్థిర పెట్టుబడి, ఉత్పత్తి సాధనాలమీద పెట్టింది.
2. అస్థిర పెట్టుబడి, శ్రమ శక్తి మీద పెట్టింది.

ఉదాహరణకి పెట్టిన మొత్తం పెట్టుబడి 50,000 రూపాయలయితే, అందులో స్థిర పెట్టుబడి 40,000 రూపాయలు, అస్థిర పెట్టుబడి 10,000 రూపాయలు అవచ్చు. అంటే 50,000 = 40,000c+10,000v. ఉత్పత్తి ప్రక్రియ పూర్తయ్యాక, ఏర్పడే సరుకు విలువ = (c+v) + s (40,000C + 10,000v) + 10,000s = 60,000 ఇక్కడ s అదనపు విలువకి గుర్తు.

తొలి పెట్టుబడి C పెరిగి ఇప్పుడు $C^{I}$ అయింది, 50,000 రూపాయలు 60,000 రూపాయలు అయింది.

ఈతేడా 10,000 రూపాయలు అదనపు విలువ s.

C పెరిగి ఇప్పుడు $C^{I}$ అయింది. మన ఫార్ములా $C^{I} = (c+v) + s$ అవుతుంది.

### అవసర శ్రమ కాలం, అదనపు శ్రమ కాలం

ఆ సరుకుని ఏర్పరచిన భాగాల విలువ పెట్టిన పెట్టుబడి విలువకి సమానం. కాబట్టి అంతకన్నా పైన ఉన్న సరుకు విలువ అదనపు విలువకి సమానం.

### ఉత్పత్తయిన కొత్తవిలువ

ఉత్పత్తయిన కొత్తవిలువ 60,000 రూపాయలు కాదు. 20,000 రూపాయలు మాత్రమే. 10,000V + 10,000S. 40,000 రూపాయల విలువ కొత్తగా ఏర్పడ్డది కాదు. అంతకుముందే ఏర్పడి ఉన్నది. ఇప్పుడు తయారైన సరుకులోకి కేవలం బదిలీ అయినది మాత్రమే.

దాన్ని, మన ఉదాహరణలో (40,000 ని) పక్కనబెడితే, తొలి పెట్టుబడి C = (0 + v) అవుతుంది, పెరిగిన పెట్టుబడి $C^{I} = 0 + v + s$ అవుతుంది. అందువల్ల $C^{I} - C = s$ అవుతుంది. C సున్నా ఎందుకు చేస్తాం. అటూ ఇటూ ఉంది కాబట్టి. అది లేదనుకొని లెక్కించవచ్చు. మరొకపక్క శ్రమశక్తి తన విలువ వరకే ఉత్పత్తి చేస్తే, s = 0 అవుతుంది. C = c + v , $C^{I} = (c + v) + 0$. అప్పుడు $C = C^{I}$. పెట్టిన పెట్టుబడి విలువ పెరగదు.

కొత్తగా ఏర్పడ్డ విలువ 20,000 రూపాయలు. 10,000v + 10,000s

అదనపు విలువ కేవలం అస్థిర పెట్టుబడి విలువలో (అంటే, శ్రమశక్తి లోకి మార్చబడిన భాగంలో) వచ్చిన తేడా ఫలితమే; అయితే అస్థిర భాగం పెరిగితే పెట్టిన పెట్టుబడి మొత్తం కూడా పెరుగుతుంది. కాబట్టి ఈ పెరుగుదల v వల్లనే వచ్చింది అనే వాస్తవం మరుగున

పడుతుంది. పెట్టిన పెట్టుబడి మొత్తం 50,000 రూపాయలు. అదిప్పుడు 60,000 రూపాయలకు పెరిగింది.

### అదనపు విలువ రేటు

అదనపు విలువ రేటు = అదనపు విలువ/అస్థిర పెట్టుబడి =10,000/10,000 = 100%.

"అస్థిర పెట్టుబడిలో వచ్చిన ఈ సాపేక్ష పెరుగుదలని లేదా, అదనపు విలువ యొక్క సాపేక్షపరిమాణాన్ని – నేను **అదనపు విలువ రేటు** అంటాను. శ్రామికుడు శ్రమప్రక్రియలో ఒక భాగంలో శ్రమ శక్తి విలువని, అంటే తన జీవితావసర వస్తువుల విలువని, ఉత్పత్తి చేస్తాడు. అంటే ఆ వస్తువుల్ని స్వయంగా తయారు చేస్తాడని కాదు. ఆవస్తువుల విలువ ఎంతో అంతే విలువగల వేరే సరుకుని (నూలో, కదురో, మరొకటో) ఉత్పత్తిచేస్తాడు. ఇందుకు 6 గంటల శ్రమ కావలసివస్తే, శ్రామికుడు ఆ విలువని ఉత్పత్తి చెయ్యడానికి 6 గంటలు పనిచెయ్యాలి. ఇది శ్రామికుడు తనకోసం తాను చేసుకున్న పని, పెట్టుబడిదారుడి కోసం చేసిన పనికాదు. ఆ కాలంలో పెట్టుబడి దారుడు తనకిచ్చిన విలువకి సమానమైన విలువని (డబ్బులో 400 రూపాయలు అనుకుందాం) ఉత్పత్తి చేస్తాడు.

పెట్టుబడిదారుడు పెట్టిన అస్థిరపెట్టుబడి విలువ మొత్తం ఎంతో, శ్రామికుడు ఉత్పత్తి చేసిన ఈ కొత్త విలువ మొత్తం అంతే. రెండూ సమానం. శ్రామికుడు పనిదినంలో తన శ్రమశక్తి విలువని పునరుత్పత్తి చేసే భాగాన్ని "నేను **'అవసర శ్రమ కాలం'** అంటాను, ఆకాలంలో వ్యయమైన శ్రమని **'అవసర శ్రమ'** అంటాను".

శ్రమ ప్రక్రియలోని రెండో భాగంలో కూడా శ్రామికుడు శ్రమ శక్తిని వ్యయిస్తాడు. అయితే ఆశ్రమ 'అవసర శ్రమ'కాదు. అదనపు శ్రమ. అదనపు విలువని ఉత్పత్తి చేస్తాడు. పెట్టుబడిదారుడికి అది శూన్యంలో సృష్టి అయినప్పుడు కలిగే ఆనందం కలుగుతుంది. "పనిదినం లోని ఈ భాగాన్ని నేను **అదనపు శ్రమ కాలం** అంటాను. ఈ సమయంలో వ్యయమైన శ్రమని **అదనపు శ్రమ** అంటాను"– అంటాడు మార్క్స్

### అదనపు శ్రమ అన్ని సమాజాల్లోనూ ఉంది

బానిస శ్రమ మీద ఆధారపడ్డ సమాజానికీ, వేతన శ్రమ మీద అద్దారపడ్డ సమాజానికీ తేడా వాస్తవ ఉత్పత్తిదారుడైన శ్రామికుడి నుండి అదనపు శ్రమని గుంజే విధానంలో మాత్రమే ఉంది. కాబట్టి, అదనపు విలువ అస్థిర పెట్టుబడికి ఏ నిష్పత్తిలో ఉంటుందో, అదనపు శ్రమ అవసర శ్రమకి అదే నిష్పత్తిలో ఉంటుంది. దీని ప్రకారం,
అదనపు విలువ రేటు = అదనపువిలువ/అస్థిర పెట్టుబడి = అదనపు శ్రమ/ అవసరశ్రమ.
ఇవి రెండూ భిన్న విధాల్లో ఒకే విషయాన్ని వ్యక్తం చేస్తాయి.

### లాభం రేటు కన్నా అదనపు విలువ రేటు మరింత ఎక్కువ

మన ఉదాహరణలో ఉత్పాదితం విలువ = (40,000c+10,000v)+10,000s = 60,000.

పెట్టిన పెట్టుబడి = 50,000 అదనపు విలువ = 10,000. కాబట్టి అదనపు విలువ

రేటుని (లాభం రేటుతో గందరగోళ పరిచి, అంటే అదే ఇదనుకుని) ఇలా లెక్కిస్తారు:

అదనపు విలువ/పెట్టిన పెట్టుబడి, S/C=10,000/50,000 = 20%. ఈ 20% అనేది ఎంతో తక్కువ రేటు. ఇది లాభం రేటుని వ్యాపారులు లెక్కించే పద్ధతి. అదనపు విలువ రేటుని లెక్కించే పద్ధతి  అది కాదు.

వాస్తవానికి అదనపు విలువ రేటు = అదనపు విలువ/ పెట్టిన పెట్టుబడి కాదు. అదనపు విలువ/ అస్థిర పెట్టుబడి. దీన్ని బట్టి, అదనపు విలువ రేటు 10,000/50,000 కాదు. 10,000/ 10,000 అంటే 100%. పైకి కనపడే 20 శాతానికి ఇది 5 రెట్లు. దీన్నిబట్టి, దోపిడీ స్థాయిని కచ్చితంగా వ్యక్తీకరించేది అదనపు విలువ రేటు, లాభం రేటు కాదు.

### అదనపు విలువ అనేది లాభం, వడ్డీ, అద్దెల మొత్తం

అదనపు విలువని ఒక మొత్తంగా చూసిన వాడు మార్క్సు. అంతకు ముందు వాళ్ళు అందులోని భాగాల్ని విడివిడిగా చూశారు. కలిపి ఒకటిగా చూడలేదు. అందరు ఆర్థికవేత్తలూ ఒక పొరపాటు పడ్డారు. ఏమంటే, అదనపు విలువని దానికదిగా దాని స్వచ్ఛరూపంలో, పరిశీలించలేదు. దాని ప్రత్యేక రూపాలైన లాభంగా, అద్దెగా పరిశీలించారు. అందుమూలంగా, వాళ్ళ పరిశీలనలో అనివార్యంగా కొన్ని సైద్ధాంతిక దోషాలు దొర్లాయి. మరింత పూర్తిగా మూడవ విభాగంలో అదనపువిలువ ఎంతగానో మారి, లాభం రూపం పొందడాన్ని విశ్లేషించేటప్పుడు చెప్పబడుతుంది. -Theories of Surplus Value 1.40.

### సీనియర్ (1790-1864) 'చివరి గంట'

1836 లో ఆ చమత్కారి అయిన ఆర్థికవేత్త సీనియర్‌ని మాంచెస్టర్ కి పిలిపించారు. అతను ఆక్స్ ఫర్డ్ లో చెప్పే అర్థ శాస్త్రాన్ని మాంచెస్టర్ లో అతను నేర్చుకోడానికి. తయారీ పరిశ్రమ యజమానులు ఆయన్ని తమ చాంపియన్ గా ఎంచుకున్నారు. ఎందుకంటే:

1. కొత్తగా రాబోతున్న ఫాక్టరీ చట్టానికి వ్యతిరేకంగా రాయడానికి

2. అంతకన్నా, ప్రమాదకరమైన 10 గంటల పనిదినం కోసం కార్మికులు చేస్తున్న పోరాటానికి వ్యతిరేకంగా రాయడానికి

వాళ్ళనుంచి తెలుసుకున్న దాన్ని, సీనియర్ ఫాక్టరీ చట్టం మీద ఉత్తరాలు పేరుతో పాంఫ్లెట్ రాశాడు.

అందులో అయన వాదన ఏమంటే, నికర లాభం చివరి గంట పనివల్ల వస్తుంది. రోజుకి ఒక గంట పని తగ్గిస్తే, నికర లాభం నశిస్తుంది. గంటన్నర తగ్గిస్తే, స్థూల లాభం కూడా ధ్వంసం అవుతుంది. కనుక పనిగంటలు తగ్గించ కూడదు. తగ్గించే చట్టాలు నష్టదాయకం. ఇదీ సారాంశం. కార్ఖానా యజమాని లాభమూ, జౌళి పరిశ్రమ మనుగడా శ్రామికుల చివరిగంట పని మీదనే ఆధారపడి ఉంటాయని అయన వాదన.

సీనియర్ చివరి గంట నినాదాన్ని 1836 లో కనిపెట్టాడు. అది అతనితో  ఆగిపోలేదు. అదే నినాదాన్ని 12  ఏళ్ళ తర్వాత 1848 లో ప్రఖ్యాత ఆర్థికవేత్త జేమ్స్ విల్సన్ అదే నినాదాన్ని

ప్రతిధ్వనించాడు. అయితే ఈసారి 10 గంటల పనిదినం బిల్లుకి వ్యతిరేకంగా.

## అదనపు ఉత్పాదితం

ఉత్పాదితంలో అదనపు విలువకి ప్రాతినిధ్యం వహించే భాగమే అదనపు ఉత్పాదితం. ఉదాహరణకి, ఒక నేతగాడు రోజులో 10 మీటర్ల బట్ట నేశాడనుకుందాం. దాని ధర 1000 రూపాయలనీ, అందులో అదనపు విలువ 200 రూపాయలనీ అనుకుందాం. అప్పుడు ఈ 200 రూపాయల బట్ట అదనపు ఉత్పాదితం అవుతుంది. అదనపు విలువ రేటుని మొత్తం పెట్టుబడిని బట్టి లెక్కించం; అస్థిరపెట్టుబడిని బట్టి లెక్కిస్తాం. అలాగే అదనపు ఉత్పాదితం సాపేక్ష పరిమాణాన్ని, ఉత్పాదితంలో అవసరశ్రమ ఇమిడి ఉన్న భాగంతో దానికున్న నిష్పత్తిని బట్టి నిర్ణయిస్తాం. మిగతా భాగంతో దానికున్న నిష్పత్తిని బట్టి కాదు. పెట్టుబడి దారీ ఉత్పత్తి ప్రధాన ధ్యేయమూ, లక్ష్యమూ, అదనపు విలువ ఉత్పత్తే. కార్మికుడు తన శ్రమశక్తి విలువని పూరించడానికీ, అదనపు విలువని ఉత్పత్తి చేయడానికి వెచ్చించే కాలమే పనిదినం.

**పని దినం = అవసర శ్రమ కాలం + అదనపు శ్రమ కాలం**

## అధ్యాయం 10
# పనిదినం
### విభాగం 1 పనిదినం పరిమితులు

పనివాళ్ళు ప్రతిరోజూ టయానికి పనికి పోయి పనయ్యాక టయానికి ఇళ్ళకెళతారు. అంటే వాళ్ళు 8 గంటలో 10 గంటలో12 గంటలో పనిచేస్తారు. అందువల్ల మామూలుగా పనిదినం స్థిరమైనది అనుకుంటారు. అంతే కాదు, పనిదినం మొత్తం ఒకటి గానే పరిగణిస్తారు. అయితే పనిదినం రెండు భాగాలుగా ఉంటుంది.

1. అవసర శ్రమ కాలం 2. అదనపుశ్రమ కాలం.

తన రోజు వేతనానికి సమానమైన విలువని ఉత్పత్తిచేసే శ్రమ కాలం అవసర శ్రమకాలం. పెట్టుబడిదారుడు సమానకం ఇవ్వకుండానే సొంతం చేసుకునే విలువని ఉత్పత్తిచేసే శ్రమ కాలం అదనపు శ్రమ కాలం. రెండూ కలిసి పనిదినం.

పనిదినం = అవసర శ్రమ కాలం + అదనపుశ్రమ కాలం

### A) అవసర శ్రమ కాలం

శ్రమ దినం 8 గంటలు అనుకుందాం. బతకడానికీ, శ్రమ చెయ్యడానికీ, పిల్లల్ని కనీ పెంచడానికీ శ్రామికునికి కావలసిన వస్తువులు అతని సగటు రోజువేతనాన్ని నిర్ధారిస్తాయి– విలియం పెట్టీ (1672). ఆ వస్తువుల విలువ నిర్ధారించవచ్చు. ఉదాహరణకి, ఒకరోజు జీవితావసరవస్తువుల ఉత్పత్తికి 3 గంటలు అవసరం అనుకుందాం. అప్పుడు శ్రామికుడు చేసే శ్రమలో 3 గంటల శ్రమ కాలం అవసర శ్రమ కాలం. ఈ భాగం ఆర్థిక నియమాల చేత ఫిక్స్ అవుతుంది. పనిదినం 3 గంటల కన్నా తక్కువ ఉండడం కుదరదు. అది ఒక స్థిర పరిమాణం. పనిదినం అంతవరకే ఉన్నట్లయితే, పెట్టుబడిదారుడికి ఏమీ రాదు. ఏ ప్రయోజనమూ చేకూరదు. కనుక పెట్టుబడి పెట్టాలనే ప్రేరణ ఉండదు. ఉండకపోతే, పెట్టుబడిదారీ ఉత్పత్తే ఉండదు. కాబట్టి, పెట్టుబడిదారీ ఉత్పత్తిలో, శ్రామికుడు అవసర శ్రమ కాలాన్ని దాటి ఎన్నోకొన్ని గంటలు శ్రమచేసి తీరాలి. ఇది రెండో భాగం.

### B) అదనపు శమ కాలం

అవసర భాగం పోను పనిదినంలో మిగిలిన పనిగంటలు అదనపు భాగం. మన ఉదాహరణలో శ్రమ దినం 8 గంటలు, అందులో 3 గంటలు అవసర శ్రమ భాగం. పోగా మిగిలిన 5 గంటలు అదనపు శ్రమ భాగం. ఇది పెట్టుబడిదారుడికి చెందుతుంది.

### అదనపు శ్రమభాగం కూడా స్థిరమైనదా? కాదు

అవసర భాగం 3 గంటలుగానే ఉన్నట్లు, అదనపు భాగం 5 గంటలుగానే ఉండాలని లేదు. ఇది పెరగావచ్చు, తగ్గావచ్చు. పనిదినం 9 గంటలకి పెరిగితే, అవసరభాగం 3 గంటలు

అలాగే ఉంటుంది, అదనపుభాగం మాత్రం 6 గంటలకు పెరుగుతుంది. అందుకు భిన్నంగా పనిదినం 7 గంటలకి తగ్గితే, అవసరభాగం 3 గంటలు అలాగే ఉంటుంది, అదనపు భాగం మాత్రం 4 గంటలకు తగ్గుతుంది. అంటే, పనిదినం పొడవు మారితే, అదనపు భాగం మారుతుంది. అదనపుభాగం ఎంత పెరిగితే పెట్టుబడిదారుడికి అంత ప్రయోజనం అన్నది స్పష్టమే. ఇది పెరగాలంటే పనిదినం పెరగాలి.

## పనిదినాన్ని ఏమేరకు పొడిగించవచ్చు?

పనిదినం నిడివి పెరగడం, తగ్గడం ఆర్థిక నియమాల చేత నిర్ణయం కాదు. అయితే వాస్తవంలో అది 8, 10, 12, 14, 16 గంటలుగా ఉంటూ వచ్చింది. ఆర్థిక నియమాల మీద కాకపోతే దేన్ని బట్టి నిర్ధారణ అవుతుంది? పెట్టుబడి దారుల, కార్మికుల బలాబలాల మీద ఆధారపడి ఉంటుంది. ఫలితంగా ప్రభుత్వాలు చేసే చట్టాలచేత నిర్ధారణ అవుతుంది.

## పనిదినం కాల పరిమితులు

పనిదినంలో ఒక భాగం అయిన అవసర శ్రమ స్థిర పరిమాణం. రెండో భాగం అదనపు శ్రమ భాగం మారవచ్చు. అది మారిన 3 పనిదినాల్ని వివరిస్తాడు మార్క్స్.

| పనిదినం 1 | పనిదినం 2 | పనిదినం 3 |
|---|---|---|
| A———B—C. | A———B——C. | A———B——— C |

A———B అవసర శ్రమకాలం. మూడు పనిదినాల్లోనూ ఒకటే. అది 6 గంటలు అనుకుందాం. అదనపు శ్రమ భాగం పనిదినం 1 లో 1 గంట. 2 లో 3 గంటలు. 3 లో 6 గంటలు అనుకుందాం. ఇప్పుడు పనిదినం 1 పొడవు 7 గంటలు, పనిదినం 2 పొడవు 9 గంటలు, పనిదినం 3 పొడవు 12 గంటలు.

A———B అవసర శ్రమ నిడివి. B——C అదనపు శ్రమ నిడివి . ఈ రెండూ కలిస్తే పనిదినం నిడివి.

B——C అనేది అస్థిర పరిమాణం. కనుక అది మారితే పనిదినం నిడివి మారుతుంది.

A——B స్థిరపరిమాణం. కనుక B——C కి A——B తో నిష్పత్తి లెక్కించవచ్చు.

పనిదినం 1 లో నిష్పత్తి 1/6. పనిదినం 2 లో 3/6. పనిదినం 3 లో 6/6.

అదనపు విలువ రేటు = అదనపు శ్రమకాలం/అవసర శ్రమకాలం. కనుక B—C కి A——B తో నిష్పత్తి అదనపు విలువ రేటుని తెలుపుతుంది.

పనిదినం 1 లో అదనపు విలువ రేటు-$16^2/_3$ శాతం.. పనిదినం 2 లో 50 శాతం. పనిదినం 3 లో 100 శాతం.

మరొకపక్క, అదనపువిలువ రేటు ఒక్కటే పనిదినం పొడవెంతో చెప్పదు. ఉదాహరణకి, ఈ రేటు 100 శాతం అయితే, పనిదినం 8, 10, 12 గంటల్లో ఏదైనా కావచ్చు. ఇంకా ఎక్కువైనా అవచ్చు. అది పనిదినం లోని రెండు భాగాలు (అవసర శ్రమకాలం, అదనపు

శ్రమకాలం) నిడివిలో సమానం అని తెలుపుతుంది. అంతేకాని ఏది ఎంత పొడవో, ఏది ఎన్ని గంటలో చెప్పదు.

## ఆవిధంగా పనిదినం అనేది స్థిర పరిమాణం కాదు, అస్థిర పరిమాణం

పనిదినానికి గరిష్టపరిమితి ఉంటుంది. ఒక పాయింట్ దాటి పొడిగించడం వీలవదు. ఈ పరిమితిని రెండు అంశాలు నిర్ణయిస్తాయి:.

**1. శ్రమశక్తి కుండే శారీరక పరిమితులు.** రోజుకి 24 గంటలు. అందులో కొన్ని గంటలు మాత్రమే పని చెయ్యగలడు. కొంత విశ్రాంతి కావాలి. నిద్ర పోవాలి. తిండి తినాలి. స్నానం చెయ్యాలి. బట్టలేసుకోవాలి.

**2. నైతిక పరిమితులు.** సామాజిక బౌద్ధిక అవసరాలు తీర్చుకోవాలి. అందుకు కొంత సమయం కావాలి.ఆ అవసరాలు సమాజ అభివృద్ధిని బట్టి ఉంటాయి. కాబట్టి పనిదినం పొడవు శారీరక, సామాజిక పరిమితుల్లో మారుతూ ఉంటుంది.

కాబట్టి మనం వేర్వేరు నిడివి ఉన్న –8, 10, 12, 14, 16 , 18 గంటలు – పనిదినాల్ని చూస్తాం.

## పెట్టుబడి దారుడి దృక్పథం

అతను శ్రమశక్తిని దాని రోజుధరకి కొన్నాడు. కాబట్టి ఆ రోజుకి దాని ఉపయోగపు విలువ అతనిదే. ఆవిధంగా ఒక రోజు శ్రామికునితో పనిచేయించుకునే హక్కు పొందాడు. సరేగాని, పనిరోజు పొడవెంత, ఎన్ని గంటలు అయితే ఒక పనిదినం కింద లెక్కకొస్తుంది? ఇది తేలాల్సి ఉంది.

పెట్టుబడి దారుడిగా అతను మనిషి ఆకారంలో ఉన్న పెట్టుబడి. పెట్టుబడి ఆత్మే అతని ఆత్మ. అందరు కొన్నవాళ్ళ లాగే అతను కొన్న సరుకు ఉపయోగపు విలువనుండి, ఎంత వీలయితే అంత ప్రయోజనం పొందేందుకు ప్రయత్నిస్తాడు. అంటే ఎక్కువ గంటలు పనిచేయించేందుకు పూనుకుంటాడు.

## శ్రామికుడి దృక్పథం

తన శ్రమశక్తిని అమ్మాడు కనక దాన్నెలా వాడుకోవాలో వాదించలేడు. అయితే పెట్టుబడి దారుడు దాన్ని వాడుకునే దానికి, మారక నియమాలనుండి పరిమితి ఉంటుంది. దాన్ని దాటి శ్రమశక్తిని వాడుకో కూడదు. ఈ పరిమితి ఉంది అనే విషయాన్ని సరుకు మారక నియమాలనుండే శ్రామికుడు రాబడతాడు.

"తన శ్రమ శక్తిని అమ్ముకోవడం ద్వారా ......కార్మికుడు తన శ్రమ శక్తిని పెట్టుబడిదారుకి అతని వినియోగం నిమిత్తం సమర్పిస్తాడు, కాని **హేతుబద్ధమైన కొన్ని హద్దుల్లో మాత్రమే** అతనలా సమర్పిస్తాడు. అతడు తన శ్రమ శక్తిని నిలుపుకునేటందుకుగాను, దాన్ని అమ్ముతాడు, అంతేగాని దాన్ని నాశనం చేసుకునేందుకు కాదు; కానైతే ఉపయోగ క్రమంలో సహజ సిద్ధంగా దానిలో కొంత అరుగుదల ఉండవచ్చు. తన శ్రమశక్తిని దాని రోజువారీ లేక వారం వారీ విలువకు

దాన్ని అమ్ముతున్నాడంటే, ఒకరోజులోనే రెండు రోజుల శ్రమశక్తీ, ఒక వారంలోనే రెండు వారాల శ్రమశక్తీ వ్యర్థమై పోకూడదనీ, వ్యయమై పోకూడదనే దానర్థం – వేతనం, ధర, లాభం., సంకలిత రచనలు 2. 62–63

నేను నీకు అమ్మిన సరుకు ఇతర సరుకుల వంటిది కాదు. ఏ విషయంలోనంటే, దాని ఉపయోగపు విలువ, విలువను సృజిస్తుంది, దాని సొంత విలువకన్నా ఎక్కువ విలువని సృజిస్తుంది. అందుకనే దాన్ని నీవు కొన్నావు. ఏదైతే నీకు పెట్టుబడి సహజ పెంపుగా కనబడుతుందో, అదే నాకు శ్రమశక్తి అదనపు ఖర్చుగా అగపడుతుంది. మార్కెట్లో నీకూ, నాకూ తెలిసిన సూత్రం ఒక్కటే – సరుకుల మారక సూత్రం. సరుకు వాడకం ఆ సరుకుని అమ్మినవానికి చెందదు, కొన్నవానికి చెందుతుంది. అందువల్ల, **నా శ్రమశక్తి వాడకం నీకు చెందుతుంది.** అయితే, ప్రతిరోజూ నీవు దానికి చెల్లించే ధరతో దాన్ని తిరిగి అమ్మడం కోసం రోజూ పునరుత్పత్తి చెయ్యాలి. వయసు మీదబడి, బలహీనపడడం వంటి ప్రకృతిసిద్ధమైన వాటిని పక్కనబెట్టినా, నేను ఇవ్వాళ్టి లాగే రేపుకూడా అదే శక్తితో, అదే ఆరోగ్యంతో,అదే తాజాతనంతో పనిచెయ్యగలగాలి.

రెండు, శ్రామికుడు తనకు పెట్టుబడిదారుడు ఇచ్చే సలహాని తన వాదనకి అనుకూలంగా తిప్పుకుంటాడు:

నీవు నాకు నిరంతరం 'పొదుపుచెయ్యమనీ, కోర్కెలకు దూరంగా ఉండమనీ హితబోధ చెస్తుంటావు. మంచిది! నేను ఒక వివేకమున్న, పొదుపరి ఓనర్ గా, నా ఏకైక సంపద అయిన శ్రమశక్తిని పొదుపుగా వాడుకుంటాను. దాన్ని ఏమాత్రం వృథా అవకుండా చూసుకుంటాను. ప్రతిరోజూ దాన్ని మామూలు వ్యవధికీ, ఆరోగ్యకరమైన అభివృద్ధికీ అనుగుణమైన మెరకే దాన్ని నేను ఖర్చు పెడతాను. నేను 3 రోజుల్లో పూరించగల శ్రమశక్తి పరిమాణం కంటే ఎక్కువ పరిమాణాన్ని, పనిదినాన్ని అపరిమితంగా పొడిగించి, నీవు ఒక్కరోజులో వాడుకోగలవు. శ్రమగా నీవు లాభించిందానిని, సారంగా నేను కోల్పోతాను.

శ్రామికుడు తన శ్రమశక్తిని వాడుకోడానికి ఒప్పుకున్నాడు. కాని తన సారాన్ని అమ్మలేదు. అంటే, శ్రామికుడు ఇస్తానని చెప్పనిదాన్ని పెట్టుబడిదారుడు వాడుకున్నాడు. కనక విలువ నియమాన్ని ఉల్లంఘిస్తున్నాడు – ఇదీ శ్రామికుడి వాదన.

## శ్రమశక్తిని వాడుకోవడం వేరు, కొల్లగొట్టడం వేరు

ఒక సగటు కార్మికుడు సరిగా పనిచేస్తూ బతికే కాలం 30ఏళ్ళు (10950 రోజులు) అయితే, నీవు నాకు రోజూ ఇచ్చే శ్రమశక్తి విలువ = 1/ (365 X 30). అంటే, దాని మొత్తం విలువలో 10950 వ వంతు. నీవు దాన్ని 10 ఏళ్లలోనే పూర్తిగా వాడుకుంటే, రోజుకి మొత్తం విలువలో 3650 వ వంతుకు బదులు 10,950 వ వంతు ఇస్తావు. అంటే రోజు విలువలో 3వ వంతన్నమాట. దీన్నిబట్టి, నీవు నా సరుకు విలువలో మూడింట రెండొంతులు ప్రతిరోజూ దోచుకుంటున్నావు. ఒకరోజు శ్రమ శక్తికి చెల్లిస్తున్నావు. మూడు రోజుల శ్రమ శక్తిని వాడుకుంటున్నావు. ఇది మన ఒప్పందానికీ, మారకాల నియమానికీ వ్యతిరేకం. అందువల్ల, నేను మామూలు పొడవున్న పనిదినాన్ని డిమాండ్ చేస్తున్నాను.

## హక్కుకి వ్యతిరేకంగా హక్కు

సరుకుల మారక స్వభావం, దానికదిగా పనిదినానికి పరిమితి విధించదు, అదనపు శ్రమకీ పరిమితి పెట్టదు. పెట్టుబడిదారుడు ఒక పని రోజుని రెండు పనిదినాలు చెయ్యడానికి వీలైనంత పొడిగిస్తున్నప్పుడు కొనుగోలు దారుడిగా తనహక్కుని నిలబెట్టుకుంటున్నాడు. మరొక పక్క, అమ్ముడయిన సరుకు ప్రత్యేక స్వభావంవల్ల, కొన్నవాడికి వినియోగించుకునేందుకు ఒక పరిమితి ఉంటుంది. శ్రామికుడు పనిదినాన్ని నిర్దిష్టమైన మామూలు కాలానికి తగ్గించాలని కోరినప్పుడు, శ్రామికుడు అమ్మకందారుడిగా తన హక్కుని నిలబెట్టుకుంటున్నాడు. అందువల్ల ఇక్కడ **పరిష్కారసాధ్యంకాని వైరుధ్యం** తలెత్తింది. హక్కుకి వ్యతిరేకంగా హక్కు.

ఇరుపక్షాల హక్కులకీ మారకాల నియమం యొక్క ఆమోద ముద్ర సమానంగానే ఉంది.

## సమాన హక్కుల విషయంలో ఎప్పుడయినా బలమే నిర్ణేత

అందువల్ల, పెట్టుబడిదారీ ఉత్పత్తి చరిత్రలో పనిదినం పొడవు ఎంత అనే దాని నిర్ధారణ పోరాట ఫలితం, సమష్టి పెట్టుబడికీ, సమష్టి శ్రమకీ మధ్య, అంటే పెట్టుబడిదారుల వర్గానికీ, కార్మిక వర్గానికీ మధ్య పోరాట ఫలితం.

# విభాగం 2
# అదనపు శ్రమ కోసం అత్యాశ

అదనపు శ్రమ పెట్టుబడితో మొదలవలేదు. అంతకుముందే ఉంది. ఉత్పత్తి సాధనాలు తనవి కానప్పుడు, శ్రామికుడు ఉత్పత్తి సాధనాల యజమాని పోషణకు అదనపు శ్రమ చెయ్యాల్సి ఉంటుంది. ఆ యజమాని అమెరికా బానిస యజమాని కావచ్చు. ఆధునిక భూస్వామో, పెట్టుబడి దారుడో కావచ్చు. అది ఏ వ్యవస్థ అయినా కావచ్చు. ఉత్పత్తి సాధనాలు తమకు లేనందువల్ల, శ్రామికులు యజమాని ఉత్పత్తి సాధనాలతో పనిచెయ్యాల్సి ఉంటుంది. కనుక యజమాని పోషణ భారం శ్రామికులదే. అందుకు వాళ్ళు అదనపు శ్రమ చేయవలసిందే.

## పరిమిత అదనపు శ్రమ– అపరిమిత అదనపు శ్రమ

ఉపయోగపు విలువ ప్రధానమైన ఏ సమాజంలో నయినా, అదనపుశ్రమ పరిమితంగా ఉంటుంది. ప్రాచీన కాలంలో వెండి బంగారాలు ఉత్పత్తయ్యే చోట్ల మాత్రమే భయంకరమైన అతి శ్రమ ఉండేది. కారణం ఆ లోహాలు మారకం విలువకి స్వతంత్ర రూపం అయిన డబ్బుగా ఉండడమే. ఈజిప్ట్, ఇథియోపియా మధ్య ఉన్న గనుల్లో పనిచేసేవారి దైన్య స్థితిని గురించి గ్రీకు చరిత్రకారుడు డియోడరస్ సికులస్ (క్రీ.పూ. 90 – క్రీ.పూ. 30) రాశాడు. అక్కడి శ్రామికులు బట్టలేసుకోడానికీ, నీళ్ళు పోసుకోడానికీ నోచుకోని దురదృష్టవంతులు అన్నాడు. రోగుల పట్లా, ముసలివాళ్ళ పట్లా, స్త్రీలపట్లా అక్కడ జాలిలేదు. వారు చచ్చే వరకూ దెబ్బలుతింటూ, బలవంతంగా పనిచెయ్యాల్సిందే. మిగిలిన ఉత్పత్తి స్థలాల్లో అదనపు శ్రమ కోసం ఇంత ఆరాటం ఉండేది కాదు.. కనుక పనివాళ్ళ పరిస్థితులు మరీ అంత దారుణంగా ఉండేవి కావు.

పెట్టుబడిదారీ ప్రభావంతో క్రమంగా ఉత్పాదితాల ఎగుమతి ముఖ్యం అయింది. ఇక అప్పుడు బానిస, అర్ధబానిసల అధిక శ్రమ ఘోరంగా తయారయింది. రుజువుకి, అమెరికా దక్షిణ రాష్ట్రాల్లో నీగ్రో శ్రమ. అక్కడ ఉత్పత్తి స్థానిక వినియోగానికే అయినంతకాలం, నీగ్రో శ్రమ పితృస్వామిక స్వభావాన్ని నిలబెట్టుకుంది. అయితే పత్తి ఎగుమతి ప్రధానం అయ్యాక అమిత శ్రమకి భూమిక ఏర్పడింది. కొన్ని సందర్భాల్లో 7 పని సంవత్సరాల్లోనే శ్రామికుని పని అయిపోయేది. శక్తి ఉడిగిపోయేది.

## పనిదినం పొడిగింపు– కుదింపు

అదనపు విలువ కోసం పేరాశతో పెట్టుబడిదారుడు పనిదినాన్ని వీలైనంత పొడిగించే ప్రయత్నంచేస్తాడు. అతని అత్యాశకు ఇంగ్లిష్ ఫాక్టరీ చట్టాలు అడ్డుకట్ట వేశాయి. పనిదినాన్ని పరిమిత పరిచాయి.

## పెట్టుబడిదారుల రాజ్యం, భూస్వాముల రాజ్యం శ్రమ దోపిడీని ఎందుకు పరిమితం చేసింది?

ఇందుకు రెండు కారణాలున్నాయి:

1. రోజురోజుకీ పెరుగుతున్న కార్మికవర్గ ఉద్యమం.

## 2. కార్మికుల జీవశక్తిని కొల్లగొట్టి, ధ్వంసం చేయ్యనియ్యకుండా చట్టాలు అవసరమయ్యాయి

పొలాలని కొల్లగొట్టినందువల్ల ఎరువులు చల్లాల్సి వచ్చింది. శ్రమ శక్తిని కొల్లగొడుతున్న కారణంగా పనిగంటల్ని నిర్దేశిస్తూ శాసనాలు చేయాల్సి వచ్చింది. లేకుంటే, శ్రమశక్తి ధ్వంసం అయిపోతుంది.

పెట్టుబడిదారుడు ..వేతనాలను శారీరకంగా అవసరమైన కనీస పరిమితికి తగ్గించేందుకూ, పనిదినాన్ని శారీరకంగా సాధ్యమైన గరిష్ఠ పరిమితికి పెంచేందుకు నిరంతరం ప్రయత్నిస్తూ వుంటాడు, రెండవవైపు కార్మికుడు యిందుకు విరుద్ధదశలో నిరంతరం పోరాడుతూ వుంటాడు. ఈ విషయం ప్రత్యర్థుల బలాబలాల తారతమ్యపు సమస్యగా పరిణమిస్తుంది.

"అన్నిదేశాల్లో మాదిరిగానే, ఇంగ్లండ్ లో కూడా పనిదినాన్ని పరిమితం చేసే సమస్యకు సంబంధించినంత వరకు, చట్టపరమైన జోక్యం ద్వారా తప్ప అదెన్నడూ పరిష్కారం కాలేదు. బయట నుండి కార్మికుల నిరంతరాయమైన ఒత్తిడి లేకుండా ఆజోక్యం ఎన్నడూ సంభవించియుండేది కాదు - విలువ, ధర, లాభం-సం.ర.2. పే 68-69

ఆ కారణాలవల్ల ప్రభుత్వం ఫ్యాక్టరీ చట్టాలు తెచ్చింది.

## ఫ్యాక్టరీ చట్టాలు

1850 ఫ్యాక్టరీ చట్టం పనిదినాన్ని 10 గంటలకు పరిమితం చేసింది. మొత్తం 6 రోజుల పని 60 గంటలు. కాపిటల్ వచ్చిన 1867 లో అదే చట్టం కొనసాగింది. దీన్ని అమలు పరిచేందుకు ఇన్స్పెక్టర్లను నియమించింది. వాళ్ళ నివేదికలు ఆరునెల్ల కొకసారి వచ్చేవి. వాటిలో అదనపు శ్రమ కోసం పెట్టుబడిదారుల పేరాశ గురించిన గణాంకాలు ఉండేవి.

## నివేదికల్లో ఇన్స్పెక్టర్లు ఏం చెప్పారు?

యజమానులు ఉదయం 15 నిమిషాలు ముందే పని మొదలెట్టేవారు. చివరలో 15 నిమిషాలు ఆలస్యంగా ముగించేవారు. ఉదయం భోజన సమయం, మధ్యాహ్నభోజన సమయం తగ్గించేవారు. మొత్తం వారానికి దగ్గరదగ్గర 6 గంటలు కాజేసేవాళ్ళు.

"ఏడాదికి లెక్కిస్తే ఇది ఇంచుమించు 27 పనిదినాలతో సమానం." "రోజుకి గంట అదనంగా పనిచేయిస్తే అది సంవత్సరానికి ఇంచుమించు 13 నెలలకు సమానం." అంటే మోసకారులయిన మిల్లు యజమానులు అంత ఎక్కువ పని చేయించేవారని వారు నివేదికల్లో తేల్చారు.

## సంక్షోభ కాలాల్లో ఎలా కాజేసే వారు?

సంక్షోభ సమయాల్లో ఉత్పత్తి అంతకుముందున్నంత ఉండదు. కనుక ఫ్యాక్టరీలు తక్కువ కాలం అంటే వారంలో కొంత భాగం మాత్రమే పనిచేస్తాయి. ఆ పరిస్థితి పనిదినాన్ని పెంచడాన్ని ఆపజాలదు. పైగా తక్కువ వ్యాపారం జరిగితే, దానిమీదే మరింత లాభం చేసుకోవాలి. ఎంత తక్కువ టైం పని జరిగితే, ఆ టైం అంత ఎక్కువ అదనపు విలువగా మార్చబడాలి.

1857–1858 సంక్షోభ కాలం గురించి ఇన్స్పెక్టర్ ఇలా రాశాడు:

"వర్తకం మరీ బాగా లేనప్పుడు అతిపని ఉండడం అసంగతం అనిపించవచ్చు. కాని ఆ బాగాలేక పోవడమే మనస్సాక్షి లేని మనుషులు అతిక్రమించేదానికి దారి చూపుతుంది. వాళ్ళు అధిక లాభాన్ని పొందుతారు…."

గడచిన 6 నెలల్లో మా జిల్లాలో 122 మిల్లులు మూతబడగా, 143 పనిచేశాయి. అయినా చట్టబద్ధమైన గంటల్ని దాటి అతిపని కొనసాగింది – అని లియోనార్డ్ హార్నర్ రాశాడు. వాళ్లకి అతిగా పనిచేయించి లాభం లాగడం అంటే ఎంత ఇష్టమో!

ఇలా చేసినా **పట్టుబడం** అని వాళ్లకి నమ్మకం. ఒకవేళ పట్టుబడినా పడే జుల్మానా చిన్నదే, కనుక అది పోయినా మిగిలే లాభమే ఎక్కువగా ఉంటుంది. అందువల్ల వాళ్ళు వెనక్కి తగ్గలేదు.

## విభాగం 3

## దోపిడీకి చట్టపరమైన హద్దులు లేని ఇంగ్లిష్ పారిశ్రామిక శాఖలు

లాభాల కోసం మిల్లు ఓనర్లు ఎంతటి క్రూర కృత్యాలకైనా వెనకాడేవారు కారు. వీళ్ళ ఘోరాల్ని శ్పానియార్డులు బంగారం వేటలో అమెరికాని జయించాక రెడ్ ఇండియన్లమీద సాగించిన ఘోరాలు సైతం మించవేమో!

ఇప్పటికి (1867) కూడా ఫ్యాక్టరీ చట్టాలు ప్రవేశపెట్టబడని పరిశ్రమ శాఖలు – లేసులు, అగ్గి పెట్టెలు, వాల్ పేపర్, బట్టలు, బేకింగ్ పరిశ్రమలు – ఉన్నాయి. ఫ్యాక్టరీ చట్టాలు వాటి గురించి చెప్పాయి. లేసు శాఖలో పనివాళ్ళు పడుతున్న బాధలు నాగరిక ప్రపంచంలో ఎక్కడా ఉండవు. 9,10 ఏళ్ల పిల్లల్ని రాత్రి 2, 3,4 గంటలప్పుడు పక్కల మీదనించి ఈడుస్తారు. రాత్రి 10,11,12 గంటలయ్యే దాకా చాకిరీ చేయిస్తారు. కేవలం బతికి ఉండడానికి మాత్రమే సరిపడే కూలి ఇస్తారు. ఈపద్ధతి ఇంగ్లిష్ ఆర్థికవేత్త రెవరెండ్ మాంటెగూ (1766–1834) అన్నట్లు: **ఏ మినహాయింపులూ లేని పరమ బానిసత్వం**

పురుష కార్మికుల పనిగంటల్ని 18 గంటలకు తగ్గించాలని విజ్ఞప్తి చెయ్యడం కోసం బహిరంగ సభ పెట్టిన పట్టణం గురించి ఏమను కోవాలి? వర్జీనియా, కరోలినా పత్తి పొలాల యజమానుల్ని విమర్శిస్తాం. వాళ్ళ బ్లాక్ మార్కెట్టూ, వాళ్ళ కొరడా, పెట్టుబడిదార్ల ప్రయోజనాలకోసం నెమ్మదిగా జరిగే ఈ నరబలి కంటే ద్వేషించ దగినవా? అని 1860 జనవరి 17న టెలిగ్రాఫ్ పత్రిక రాసింది.

కాల్చిన మట్టివస్తువుల పరిశ్రమలున్న వోల్ స్టాన్ టన్ జిల్లాలో మనిషి బతికే కాలం సగటు చాలా తక్కువ. ఎదుగుదల లేకుండా, సరైన ఆకారం లేకుండా ఉంటారు. ముందుగానే ముసలి వాళ్లవుతారు. అర్ధాయుష్షుతో చనిపోతారు. రక్తహీనతా, అజీర్ణం, కాలేయం మూత్రపిండాలు సరిగా పనిచేయకపోవడం, కీళ్ళ నొప్పులు వాళ్ళని బాధిస్తాయి. ఎక్కువగా నిమోనియా, క్షయ, బ్రాంకైటిస్, ఉబ్బసం వేధిస్తాయి. వీటికి కారణాలు చెప్పి ఒక హౌస్ సర్జెన్ కమిషనర్‌కి రాసిన లేఖలో "దీర్ఘమైన పనిగంటలు" అని క్లుప్తంగా పేరుపెట్టాడు.

లుసిఫర్ అగ్గిపుల్లలు తయారు చెయ్యడం పుల్లలకి భాస్వరం పూసి అగ్గిపుల్ల చెయ్యడం ఇంగ్లండ్‌లో జనం ఎక్కువగా నివసించే ప్రాంతాల్లో అభివృద్ధి చెందింది. ఈ పరిశ్రమలో పనిచేసే వాళ్లకి 'ధనుర్వాతం' అనే వ్యాధి వచ్చేది. ఈ పనిలో సగం మంది 13 ఏళ్లలోపువాళ్ళు, 18 ఏళ్లలోపు వాళ్ళు. దుర్వాసనలో పని కనుక, గతిలేని వాళ్ళు మాత్రమే పిల్లల్ని పంపేవారు. రోజూ 12 గంటలనించీ 14, 15 గంటలపాటు పనిచెయ్యాలి. రాత్రి పని ఉంటుంది. అన్నం తినే వేళ అంటూ ఒకటుండదు. అదీ గాక ఫాస్ఫరస్‌తో నిండివున్న ఆపని గదుల్లోనే తింటారు. బ్రెడ్ తయారీలో పని సీజన్లో వాళ్లకి 5,6 గంటలు మాత్రమే నిద్రపోయే అవకాశం ఉంటుంది. కాల్చే గదుల్లో 75–90 డిగ్రీల ఉష్ణోగ్రత ఉంటుంది. అలాంటి పరిస్థితుల్లో వాళ్ళ ఆరోగ్యం దెబ్బతింటుంది. బేకరీ కార్మికులు అరుదుగా మాత్రమే 42 ఏళ్ళుదాటి బతుకుతారు అని కమిషన్ చెప్పింది.

**పరిస్థితి అలాఉన్నా, ఈపని చెయ్యడానికి ఎందరో సిద్ధంగా ఉన్నారు.** 1858-60 కాలంలో ఐర్లాండ్ బేకరీ పనివాళ్ళు రాత్రిపనినీ, ఆదివారం పనినీ వద్దని సభలు పెట్టారు. ప్రజలు ఆప్యాయంగా పాల్గొన్నారు. ఫలితంగా కొన్నిచోట్ల పగటి పని స్థిరపడింది. కాని లిమరిక్ లో మాస్టర్ బేకర్లు వ్యతిరేకించారు. పనిలో నించి తీసేస్తామని బెదిరించారు. ఉద్యమాన్ని ఓడించారు. పనివాళ్ళ మెడలువంచి రాత్రి పనికీ, ఆదివారాల పనికీ ఒప్పించారు.

**రైలు ప్రమాదం** అప్పట్లో ఒక రైలు ప్రమాదంలో వందలమంది చనిపోయారు. కారణం ఉద్యోగుల నిర్లక్ష్యం. గార్డ్, డ్రైవర్, సిగ్నల్ మన్ ముగ్గురూ విచారించే జూరీ ముందు నిలబడ్డారు. ముక్తకంఠంతో ఒకటే చెప్పారు: 10,12 ఏళ్ల కిందట రోజుకి 8 గంటలు మాత్రమే పని ఉండేది. ఈ అయిదారు ఏళ్లలో 14,18,20 గంటలకు చేరింది. సెలవు దినాల్లోనూ, విహారయాత్రల రైళ్ళు నడిచే కాలంలోనూ విరామం లేకుండా 40,50 గంటలు పని చెయ్యాల్సి వస్తుంది. వాళ్ళూ మనుషులే. ఏదోసమయంలో శ్రమశక్తి విఫలం అయింది. బద్ధకం పట్టుకుంది. మెదడు పనిచెయ్యడం ఆగింది. కళ్ళు చూడడం మానేశాయి. అని వాళ్ళ నిర్లక్షానికి కారణమేమిటో చెప్పారు. అంతావిని, 'గౌరవనీయులైన' జూరీ 'మానవ హత్య' అనే నేరారోపణతో పైకోర్టుకు పంపుతూ తీర్పు చెప్పింది. రైల్వే పెట్టుబడి దారులు ముందుముందు తగినంత శ్రమ శక్తిని కొనేందుకు మరింత వ్యయించేవారుగా ఉండాలని పవిత్రమైన ఆశాభావం వ్యక్తంచేసింది. అంతే.

పెట్టుబడి ముందు పనివాళ్ళంతా ఒకటే – స్త్రీలైనా, పురుషులైనా, పిల్లలయినా. వాళ్ళలో ఇద్దర్ని– దొరసానుల డ్రెస్సులు కుట్టే యువతినీ, ఒక కమ్మరినీ – గురించి చెబుతాడు మార్క్స్.

**'కేవలం పనిభారం మూలంగా మరణం'** అనే సంచలనాత్మక శీర్షికతో 1863 లో లండన్ పత్రికలన్నీ ఒక పేరా ప్రచురించాయి. అది మేరీ ఆన్ వాక్లీ అనే 20 ఏళ్ల యువతి మరణ వార్త. ఆమె ఎలీస్ అనే లేడీ నడిపే ఎంతో గౌరవనీయమైన డ్రస్సులు తయారుచేసే సంస్థలో పనిచేస్తుంది. సగటున రోజుకి 16½ గంటలు పనిచేసేది. సీజన్లో అయితే ఒక్కోసారి 30 గంటలదాకా చేసేది – అదీ విరామం లేకుండా. వేల్స్ యువరాణీ గౌరవార్థం జరగబోయే బాల్ డాన్స్‌లో పాల్గొనే ప్రభువర్గపు స్త్రీల కోసం మెరిసే డ్రెస్సులు అర్జెంటుగా తయారు చెయ్యాల్సి వచ్చింది. 26½ గంటలపాటు 60 మందితో కలిసి మేరీ ఏకబిగిన పనిచేసింది. ఒక్కో రూములో 30 మంది. అవసరమైన గాలిలో 3 వ వంతు మాత్రమే ఉండేది. పడక గది బోర్డులతో పార్టీషన్ చేసి ఉండేది. ఊపిరాడని ఇరుకుచోట్లలో ఇద్దరిద్దరు కలిసి నిద్రించేవాళ్ళు. అయినప్పటికీ, ఇది మంచి సంస్థల్లో ఒకటి. మేరీ శుక్రవారం సిక్ అయింది. ఆదివారం చనిపోయింది.

మరణ కారణాన్ని విచారించే జూరీ ముందు డాక్టర్ కీస్ ఇలా చెప్పాడు:

క్రిక్కిరిసిన, గాలాడని చిన్న గదిలో ఎక్కువ గంటల పనివల్ల మేరీ మరణించింది. అయితే ఆ డాక్టర్‌కి గుణపాఠం చెప్పాలని జూరీ ఇలా తీర్పు చెప్పింది: ఆమె 'మెదడులో రక్తస్రావం' వల్ల చనిపోయింది. అయితే క్రిక్కిరిసిన గదిలో పనిభారంవల్ల ఆమె చావు వేగవంతం అయివుంటుందని అనుకునేందుకు కారణం ఉంది. స్వేచ్ఛా వ్యాపారుల పత్రిక, Morning Star ఇలా అంది:

సమాధి చేరేవరకూ అతి తీవ్రంగా పనిచేసే మన తెల్ల బానిసలు, చాలావరకూ మౌనంగా బాధపడి, అనారోగ్యం పాలై చనిపోతారు.

చచ్చేటట్లు పనిచెయ్యడం అనేది ఒక డ్రస్ తయారీ గదుల్లోనే కాదు, వెయ్యి ఇతరచోట్ల కూడా అదే పరిస్థితి ఉంది అంటూ డాక్టర్ రిచర్డ్ సన్, నమూనాగా కమ్మరిని తీసుకుంటాడు. కవులు చేప్పేది నిజమయితే అతనంత హాయిగా ఉండేవాడు మరొకడు ఉండడు. ఎండ రాకముందే పెందలాడి లేస్తాడు, పనిమొదలుబెడతాడు. ఇతరులందరికంటే బాగా తింటాడు, తాగుతాడు, నిద్రపోతాడు. తగుమాత్రంగా పనిచేస్తూ మెరుగైన మానవ స్థాయిలో ఉంటాడు. అయితే మనం అతనితో పడి నగరానికో, పట్టణానికో పోదాం. అక్కడ ఆ బలవంతుని మీద పడే పని భారాన్ని చూస్తాం. దేశ మరణ రేటులో అతని స్థాయి ఏమిటో చూస్తాం. మెల్‌బోర్న్‌లో కమ్మరులు ఏటా ప్రతి వెయ్యిమందిలో 31మంది చనిపోతారు. మొత్తం వయోజనుల మరణాల కంటే 11 ఎక్కువ. ఈ మంచి వృత్తి, పనిభారం వల్ల మానవ నాశనకారిగా మారిపోయింది. మామూలు పని అయితే, అతను సగటున 50 ఏళ్లు బతుకుతాడు. చెయ్యగల పనికి నాలుగో వంతు పెంచేట్లయితే, అతని జీవితం ముందుగా ముగుస్తుంది. అలా ఒక కమ్మరి నాలుగోవంతు ఎక్కువ పనిచేస్తే, 50వ ఏట చనిపోవాల్సిన వాడు 37వ ఏటనే చనిపోతాడు.

## విభాగం 4
## పగటి పనీ, రాత్రి పనీ, రిలే పద్ధతీ

పనిగంటలు పెరిగినా, పెట్టుబడిదారుల పేరాశ తీరలేదు. యంత్రాలు రాత్రుళ్ళు ఖాళీగా ఉంటున్నాయి. కనుక సగం రోజు పెట్టుబడి పెరగనట్లే. మరింత స్థిర పెట్టుబడి ఉన్న పరిశ్రమల్లో నిరంతరాయంగా పనిజరగాలి. లేకుంటే యంత్రాలు వృధాగా పడుంటాయి. పగలూ, రాత్రీ వాటిని ఆడించాలని యజమానులకి సహజంగానే ఉంటుంది. కాని మనుషులు 24 గంటలూ పని చేయ్యలేరు.

ఈ భౌతిక అవరోధాన్ని అధిగమించేందుకు రిలే పద్ధతి కనిపెట్టారు. రెండు జట్ల కార్మికుల్ని నియమించారు. ఒక జట్టు పగలు 12 గంటలు, ఇంకో జట్టు రాత్రి 12 గంటలు పనిచెయ్యాలి. అలా షిఫ్ట్ విధానం ప్రవేశపెట్టారు. 24 గంటలూ అవిరామంగా ఉత్పత్తి ప్రక్రియ జరుగుతూ ఉంటుంది. కనుక మామూలు పనిదినం పరిమితుల్ని దాటడానికి అవకాశం దొరుకుతుంది.

కార్మికులమీద దీని ప్రభావం గురించి వేరే చెప్పక్కర్లేదు. రాత్రంతా నిద్రలేకపోతే, పగటి నిద్రతో ఆనష్టం తీరదు. చికాకు, నిరుత్సాహం, శరీర బలహీనత – అని ఎంగెల్స్ 'ఇంగ్లండ్ లో కార్మికవర్గ పరిస్థితి' లో రాశాడు.

రాత్రుళ్ళు పిల్లలతో పనిచేయించే ఒక ఉక్కు పారిశ్రామికుడి మాటలివి: రాత్రి పనిచేసే బాలురు నిద్రపోలేరు, పగలు సరిపడే విశ్రాంతి పొందలేరు. శరీర రక్షణకీ పెరుగుదలకీ, సూర్యరశ్మి ఎంత ముఖ్యమో ఒక డాక్టర్ చెప్పాడు: కాంతి శరీర టిష్యూలను గట్టిపరుస్తుంది, వాటి స్థితిస్థాపకతకి సపోర్ట్ ఇస్తుంది. ఎండ తగలకపోతే టిష్యూలు మెత్తబడతాయి. స్థితిస్థాపక శక్తిని కోల్పోతాయి.......పిల్లలకు కొద్దిసేపైనా ఎండ తగలడం అవసరం. మంచి నెత్తురు కోసం, చూపు కోసం,మెదడు చర్యల వేగం కోసం కాంతి కావాలి. ఈ అవకాశాలు రాత్రిపని చేసే వాళ్లకు ఉండవు – పగలు నిద్రపోవాలి కనుక. ఏ కారణం చేతైనా. కొందరు పనిలోకి రాకపోయారంటే, వచ్చి పనిచేస్తున్న వేరే షిఫ్ట్ వాళ్లకి శాపమే. అప్పుడు వాళ్ళచేతే చేయిస్తారు. నివేదిక మాటల్లో: అధికారిక పనిదినం పగలైనా, రాత్రయినా

12 గంటలు దాటితే అది 'నిజానికి భయంకరం' అయినది.

**కనుకనే మామూలు పనిదినంకోసం కార్మికులు పోరాటాలు చేయక తప్పలేదు**

# విభాగం 5
## మామూలు పనిదినం కోసం పోరాటం
### 14 వ శతాబ్దం మధ్యనుండీ 17వ శతాబ్దం చివరి వరకూ పనిదినం పొడిగింపు

#### పనిదినం ఎన్ని గంటలు?

రోజంతా అంటే 24 గంటలూ పనిచెయ్యడం సాధ్యంకాదు. కొంత విశ్రాంతి లేకపోతే, ఏ మనిషీ మర్నాడు పనిచెయ్య లేడు. ఒకరోజు పనిచేశాక, తన శ్రమ శక్తిని తిరిగి పొందడానికి అతనికి ఎన్ని గంటలు కావాలి? ఈ ప్రశ్నకి పెట్టుబడిదారుడి జవాబూ, కార్మికుడి వాదనా వేరువేరుగా ఉంటాయి.

**పెట్టుబడిదారుడి జవాబు:** పనిచేసిన వానికి కొంత విశ్రాంతి అవసరమే. అది లేకపోతే శ్రమశక్తి పని చెయ్యడానికి నిరాకరిస్తుంది. కాబట్టి ఆ కొన్ని గంటలని మినహాయిస్తే, మిగిలిన కాలం అంతా పనిదినమే. శ్రామికుడు ఇకెంత మాత్రమూ పనిచెయ్యలేని స్థితి వచ్చేదాకా పనిదినమే. అదే పరిమితి. ఆకాలం అంతా పెట్టుబడి స్వయం విస్తరణకి వినియోగించబడాలి. మరెందుకూ వాడకూడదు.

**కార్మికుడి జవాబు:** విశ్రాంతికీ నిద్రకే కాకుండా, చదువుకీ, మేధోవికాసానికీ, సామాజిక విధులు నెరవేర్చడానికీ, సమాజ సంబంధాలకీ, అతని శారీరక, మానసిక కార్యకలాపాల స్వేచ్ఛాయుత నిర్వహణకీ, ఆదివారం విశ్రాంతికీ అవసరమైన కాలాన్ని కూడా మినహాయించాలి. మిగిలినదే పనిదినం.

పెట్టుబడిదారుడు శ్రామికుని వాదనని ఒప్పుకోడు. శ్రామికుడు పెట్టుబడి దారుడి వాదనని అంగీకరించడు. పెట్టుబడికి పనిదినం ఎక్కువ గంటలుండాలి. శ్రామికులకి తక్కువ గంటలుండాలి. పనిగంటలు పెంచడానికి పెట్టుబడి దారులూ, తగ్గించటానికి కార్మికులూ పట్టుపడతారు. ఒకటి అటు లాగితే రెండోది ఇటు లాగుతుంది. పెట్టుబడి కార్మికుల కాలాన్ని లాక్కునే ప్రయత్నం చేస్తుంది. శ్రమ తన కాలాన్ని తాను సాధించు కునేందుకు చూస్తుంది.

#### ఫలితమే వర్గపోరాటం

**1. పెట్టుబడి శ్రామికుని నైతిక, సాంస్కృతిక హద్దుల్లోకి జొరబడుతుంది.** అందుకు తగిన సమయాన్ని ఇవ్వదు. అంతటితో దాని అతిక్రమణ ఆగుతుందా అంటే, ఆగదు.

**2. భౌతిక హద్దుల్లోకి కూడా చొచ్చుకుపోతుంది.** శ్రామికుని శరీరనిర్వహణకీ, పెరుగుదలకీ, స్వచ్ఛమైన గాలికోసం, సూర్యరశ్మి కోసం కావలసిన కాలాన్ని కాజేస్తుంది. నిద్రపోవడానికీ, అన్నం తినడానికీ అవసరమైన టైంని కూడా తగ్గిస్తుంది. పెట్టుబడి పనిదినాన్ని హద్దుమీరి పొడిగిస్తుంది, శ్రామికుని జీవితకాలాన్ని కుదిస్తుంది. ఒక కార్మికుడు పొతే మరొకణ్ణి పెట్టుకుంటాడు – ఒక బానిస చనిపోతే యజమాని ఇంకొక బానిసని కొనుక్కున్నట్లే, ఇక్కడకూడా.

## కార్మికుడి కథకూడా బానిస కథే

బానిసల్నీ, వేతనబానిసల్నీ పోల్చి ఎంగెల్స్ The English Ten Hours' Bill అనే వ్యాసంలో ఇలా అంటాడు: భారీ స్థాయి పరిశ్రమ వచ్చినప్పటినించీ "ఇంగ్లిష్ కార్మికుల జీవితంతో పోలిస్తే అమెరికా తోటల్లో అత్యంత హీనమైన బానిస బతుకు ఎంతో మెరుగైనది". (Marx & Engels Collected Works volume 10 p291) అందుకే అదనపు శ్రమ పట్ల పెట్టుబడికుండే ఆకలిని తోడేలు ఆకలి అంటాడు మార్క్స్.

పెట్టుబడి తన ప్రయోజనం మాత్రమే చూసుకుంటుంది. శ్రమశక్తి జీవించే ఉండే కాలాన్ని గురించి పట్టించుకోదు. దాని ధ్యాసంతా ఒకరోజులో గుంజగల గరిష్ఠ శ్రమ గురించే. శ్రామికుని జీవితకాలాన్ని తగ్గించడం ద్వారా పెట్టుబడి తన లక్ష్యాన్ని సాధిస్తుంది. ఇందుకొక పోలిక చెబుతాడు. దురాశాపరుడైన రైతు పొలం సారాన్ని కొల్లగొట్టడం ద్వారా అధిక దిగుబడి తీయడం ఎలాంటిదో శ్రామికుని కొల్లగొట్టి అదనపు శ్రమ లాగడం కూడా అలాంటిదే అంటాడు మార్క్స్.

పెట్టుబడిదారీ విధానం శ్రమశక్తిని ముందుగానే నీరస పరుస్తుంది, పనిభారం వల్ల శ్రామికులు ముందుగానే చనిపోతారు. యజమానులకేమీ ఇబ్బంది కలగదు.

### చనిపోయిన వారి బదులు కొత్త వాళ్ళు మార్కెట్లో సిద్ధంగా ఉంటారు

ఎంతో సంపదనిస్తున్న వెస్టిండిస్ వ్యవసాయం లక్షలాది ఆఫ్రికన్లను మింగేసింది. అయినా కొత్త బానిసలు మార్కెట్లో దొరికారు. లండన్ బెకరీల్లో అతిశ్రమ వల్ల పనివాళ్ళు తగ్గిపోయారు. అయినా అక్కడ చనిపోవడానికి లండన్ శ్రామిక మార్కెట్ నిండా మరెందరో వేచి ఉండేవారు.

మట్టి పాత్రల (pottery) పరిశ్రమలో కార్మికులు అతి తక్కువ కాలం బతుకుతారు. అట్లాగని ఆ పరిశ్రమకి శ్రామికుల లోటు ఏమైనా ఉందా? లేదు. 1861లో బ్రిటన్లో అందులో పని చేసేవాళ్ళు 1 లక్షమందికి పైగా ఉన్నారు. పత్తి వర్తకం అక్కడ 90 ఏళ్లనించీ ఉంది. ఆ కాలంలో అది 9 తరాల ఫాక్టరీ శ్రామికులని నాశనం చేసింది. అయినా కొత్తగా వచ్చే వాళ్ళకి కొరవేమీ లేదు.

ఇక్కడ మార్క్స్ మరొక ముఖ్యమైన కొత్తభావనని (concept) ప్రవేశ పెట్టాడు. అదే **అదనపు జనాభా**

కొత్తవాళ్ళు చౌకగానే దొరుకుతారు కాబట్టి, పాతవాళ్లని ఎంత అతిగా పనిచేయించినా పెట్టుబడిదారులకి పోయేదేమీ లేదు. శ్రామికుల ఆరోగ్యం గురించీ, బాగోగుల గురించీ పట్టించు కోవాల్సిన పని లేదు. వాళ్లకి కావలసిందల్లా, అదనపు జనాభా అందుబాటులో ఉండడమే. అదనపు జనాభా అంటే పెట్టుబడి దారులకు అవసరమైన వారికంటే ఎక్కువమంది అని. వాళ్లకి 100 మంది అవసరమైతే మార్కెట్లో అంతకు మించి 150 మందో 200 మందో ఉండాలి.

## పెట్టుబడిదారుల మంచితనం

ఇదంతా విడి పెట్టుబడిదారుల మంచితనం మీదో, చెడ్డతనం మీదో ఆధారపడి ఉండదు. వాళ్ళ మధ్య నిర్నిబంధ పోటీ ఉంటుంది. ఎవరికి వాళ్ళు, వాళ్ళ సరుకులే వేగంగా అమ్ముకొని

లాభాలు పెంచుకోవాలనుకుంటారు. అలా అమ్ముకోవాలంటే చౌకగా ఉత్పత్తి చెయ్యాలి. అందుకున్న మార్గం అత్యధికంగా అదనపు శ్రమని పిండడం. అందుకు తగినట్లు వాళ్ళపద్ధతులు ఉంటాయి. వాళ్ళలో వాళ్ళ పోటీ కారణంగా, పెట్టుబడిదారులు మంచోళ్ళయినా, చెడ్డోళ్ళయినా, పోటీ దారులు అవలంబించే పద్ధతులే అవలంబించాలి. పరిస్థితి విడి పెట్టుబడి దారుడి మంచితనం మీదో, చెడ్డతనం మీదో ఆధారపడి ఉండదు.

ఈ విషయం **ప్రత్యర్థుల బలాబలాల తారతమ్యపు సమస్యగా** పరిణమిస్తుంది.

## చట్టాలద్వారా పరిష్కారం

ఇది ఇరువర్గాల ఒప్పందం వల్ల పరిష్కారం అయ్యే సమస్య కాదు. ఏ దేశంలోనైనా చట్టపరమైన జోక్యం ద్వారాతప్ప సమస్య ఎన్నడూ పరిష్కారం కాలేదు. పైగా, బయటనుండి కార్మికుల ఒత్తిడి లేకుండా చట్టాలు ఎన్నడూ రాలేదు. ఏది ఏమైనా, కార్మికులకూ పెట్టుబడిదార్లకూ మధ్య ప్రైవేటు ఒప్పందంద్వారా ఈ ఫలితం ఎన్నడూ సాధ్యంకాదు. ఈ పోరాట చరిత్రలో రెండు విరుద్ధ పోకడలు కనబడతాయి. 14వ శతాబ్దం నించీ 18వ శతాబ్దం మధ్య వరకూ కార్మిక శాసనాలు బలవంతంగా పనిదినాన్ని పొడిగించాయి. అక్కడినించీ, ఆధునిక ఫాక్టరీ చట్టాలు పనిదినం నిడివిని తగ్గించాయి.

## పనిదినం పొడవు గురించి పోరాటం

పనిదినాన్ని 7,8 గంటలనుండి 16 గంటలదాకా పెంచడానికి అవకాశం ఉంది. పారిశ్రామిక విప్లవం ఆరంభంలో అలాగే జరిగింది.

1. 14 వ శతాబ్దం మధ్య నుండీ 17 వ శతాబ్దం చివరి దాకా చట్టాలు పనిదినాన్ని పొడిగించాయి
2. ఆధునిక ఫాక్టరీ చట్టాలు పనిదినాన్ని తగ్గించాయి

ఇంగ్లండ్‌లో మొదటి శ్రామిక శాసనం 3 వ ఎడ్వర్డ్ హయాంలో 1349 లో వచ్చింది. 1348లో ప్లేగు వ్యాధి స్వైర విహారం చేసింది. భారీ సంఖ్యలో ప్రజలు చనిపోయారు. వ్యవసాయంలో కూలీలు దొరక్క వాళ్లకి డిమాండ్ పెరిగింది. కూలీ పెంచాల్సి వచ్చింది. భూస్వాములకు ఇబ్బందయింది. సమంజసమైన నిబంధనల ప్రకారం పనివాళ్ళు దొరకడం లేదని ఒక టోరీ రచయిత రాశాడు. 'సమంజసమైన నిబంధనలు' అంటే యజమానికి సమంజసమైన పరిమాణంలో అదనపు శ్రమని మిగిల్చే ధర అని మార్క్స్ వివరణ ఇచ్చాడు. యజమానులకి తగినట్లు వేతనాలూ, పనిగంటలూ నిర్ణయిస్తూ 1349 శాసనం వచ్చింది. వాళ్ళకోసం ఎడ్వర్డ్ Ordinance of Labourers1349 పేర ఆజ్ఞ జారీ చేశాడు. దాని ప్రకారం

1. 60 ఏళ్ల లోపువాళ్ళందరూ పనిచేయాల్సిందే
2. ప్లేగు రాక ముందుకన్నా ఎక్కువ వేతనాలు ఇవ్వకూడదు

ఈ చట్టం చెయ్యడానికి ప్లేగు ఒక సాకు మాత్రమే అన్నాడు మార్క్స్. ఎందుకంటే ఆచట్టం ప్లేగుపోయాక శతాబ్దాల తరబడి ఉంది. చివరకి 1863లో Statute Law Revision Act ద్వారా రద్దయింది. అందుకే మార్క్స్ దాన్ని (ప్లేగు) ఒక వంక మాత్రమే అన్నాడు.

అదే పనిగంటల నిర్ణయం 7 వ హెన్రీ హయాంలో 1496 శాసనంలో పునరావృతమైంది. దీని ప్రకారం మార్చ్ నించీ సెప్టెంబర్ వరకూ పనిదినం ఉదయం 5 నించీ సాయంత్రం 7,8 వరకూ. చలి కాలంలో అయితే చీకటి పడే దాకా. మూడు సార్లు తినడానికి మొత్తం 3 గంటలు. ఎలిజబెత్ కాలంలో చేసిన 1562 శాసనం పనిగంటల్ని అలాగే ఉంచింది. అన్నం తినే సమయాన్ని వేసవిలో అయితే 2 ½ గంటలకు, చలికాలంలో 2 గంటలకు పరిమితపరిచింది. హాజరవకపోతే గంటకి పెన్నీ చొప్పున కూలీలో కోత ఉంటుంది. కార్ఖానా కూలీలు 6 రోజులు పనిచేసి, ప్రస్తుతం 4 రోజుల పనికి వస్తున్న కూలితో తృప్తి చెందాలి. ఇదీ వాళ్ళ కోరిక. 'పెట్టుబడిదారులు శ్రామికుల సోమరితనం గురించి ఆక్రందించడం లోని రహస్యం అదే' అని 18వ శతాబ్దంలో లండన్ లో నివసించిన డచ్ కొయ్యల వర్తకుడు వాండర్ లింట్ అన్నాడు.

వాళ్ళ లక్ష్యం కోసం అంటే సోమరితనాన్ని పోగొట్టి, పరిశ్రమించే స్వభావాన్ని పెంపొందించడం కోసం, కార్ఖానాల్లో శ్రమశక్తి విలువ తగ్గించడం కోసం, పేదవాళ్ళ పోషణకోసం వేసే పన్నులనించి భూముల్ని విముక్తి చెయ్యడం కోసం ఈపద్ధతి ప్రతిపాదించాడు: ప్రభుత్వ మద్దతు మీద బతికే శ్రామికుల్ని, అంటే దరిద్రుల్ని 'ఆదర్శ శ్రమగృహం' లో పెట్టాలి. అటువంటి గృహాన్ని 'భీతావహగృహం' గా చెయ్యాలి. అక్కడ పేదలు రోజుకి 14 గంటలు పనిచెయ్యాలి. అన్నానికి పోను బిర్రుగా 12 గంటలు.

1770 నాటి 'ఆదర్శగృహం' లో ('భీతావహగృహం'లో) రోజుకి 12 పనిగంటలు! 63 ఏళ్ల తర్వాత 1833లో 13–18 ఏళ్ల పిల్లలకు పనిదినాన్ని పార్లమెంట్ తగ్గించినప్పుడు 4 పరిశ్రమ శాఖల్లో పనిదినం 12 గంటలు. తర్వాత జూరిక్ లో, ఆర్గాన్ లో, ఆస్ట్రియాలో, పిల్లల పనిదినాన్ని 12 గంటలకు తగ్గించారు.

1770 లో పెట్టుబడి కలగన్న 'భీతావహగృహం' కొన్నేళ్ళతర్వాత వాస్తవం అయింది– అతిపెద్దదిగా. **దాని పేరే ఫాక్టరీ.** దీనిముందు ఆదర్శం తేలి పోయింది.

## విభాగం 6.

## విభాగం 6
## మామూలు పనిదినం కోసం పోరాటం
## చట్ట రీత్యా పనిదినానికి నిర్బంధ పరిమితి

అదనపు శ్రమ పెట్టుబడి కంటే ఎంతో ముందు నించే ఉంది. ఉత్పత్తి సాధనాలు కొందరి గుత్తాధిపత్యం కింద ఉన్నప్పటి నించీ, వాటితో పనిచేసే శ్రామికుడు – స్వేచ్ఛాయుతుడయినా, కాకున్నా – యజమాని కోసం అదనపు శ్రమ చెయ్యక తప్పదు. అంటే బానిసలయినా, అర్ధబానిసలయినా, వేతనకార్మికులయినా అదనపు శ్రమ చేయాల్సిందే. అందువల్ల, అదనపు శ్రమని పెట్టుబడి కనిపెట్టలేదు. కాని, పెట్టుబడి అదనపుశ్రమని పీల్చడంలో రక్త పిశాచే. అదనపు శ్రమ పెరగాలంటే శ్రామికుల చేత ఎక్కువ గంటలు పనిచేయించాలి. అంటే పనిదినాన్ని పొడిగిస్తూ పోవాలి. పెట్టుబడి పనిదినాన్ని నిరంతరం పొడిగించే ప్రయత్నం చేస్తుంటుంది. ఎందుకంటే, ఎంత పొడిగిస్తే అదనపు శ్రమ కాలం అంత పెరిగి, అంత ఎక్కువ అదనపు విలువ చేతికొస్తుంది. 17వ శతాబ్దం లోనూ, 18వ శతాబ్దంలో మూడింట మొదటి రెండు భాగాల్లోనూ సైతం ఇంగ్లండ్ అంతటా 10 గంటల పనిదినం సామాన్యమైన పనిదినంగా ఉంటూ వచ్చింది. జాకొబిన్ వ్యతిరేక యుద్ధకాలంలో – నిజానికది బ్రిటిష్ కార్మికజన సామాన్యంపై బ్రిటిష్ పారిశ్రామిక ప్రభువులు జరిపిన యుద్ధం తప్ప వేరుకాదు – పెట్టుబడి విలయతాండవం చేసి, పనిదినాన్ని 10 నించి 12, 14, చివరకి 18 గంటలదాకా కూడా పెంచింది."–మార్క్స్ 'వేతనం,ధర, లాభం'. సంకలిత రచనలు 2 వ భాగం.పే 62

"సుమారు 1815 లో ప్రచురించబడిన తన చిన్న పుస్తకమొకదానిలో యీ మాదిరి పరిస్థితి యిలాగే కొనసాగితే, బ్రిటిష్ జాతి జీవితపు మూలాధారానికే దెబ్బ తగులుతుందని మాల్తుస్ రాశాడు."

దీనికి 50 ఏళ్ల ముందు సుమారు 1765 ప్రాంతంలో ఇంగ్లండ్‌లో 'పరిశ్రమలను గురించిన రచన' అనే పేరున చిన్న పుస్తకం వెలువడింది. ఆచిన్న పుస్తకం రచయిత కార్మికవర్గపు గర్భశత్రువు. పనిదినాన్ని పెంచాల్సిన ఆవశ్యకతపై మాటలు గుప్పించాడు. ఈ ప్రయోజనసిద్ధి కోసం మిగిలిన సాధనాలతోపాటు, వర్క్ హౌస్ లు నిర్మించబడాలని ప్రతిపాదించాడు. అతను చెప్పినదాని ప్రకారం అవి 'భీభత్సనిలయాలు' గా ఉండాల్సి వుంటుంది. ఈ భీభత్సనిలయాలకు ఆ గుప్త రచయిత నిర్దేశించిన పనిదినపు వ్యవధి ఎంతో తెలుసాండీ? 12 గంటలు! తర్వాత 1832 లో పెట్టుబడిదారులూ, అర్థశాస్త్రజ్ఞులూ, మంత్రులూ సరిగా యీ 12 గంటల కాలాన్నే 12 ఏళ్ల లోపు పిల్లలకు అమల్లో ఉన్నదే కాకుండా, ఆవశ్యకమైన పనిదినపు వ్యవధి అని ప్రకటించారు." మార్క్స్ 'వేతనం,ధర, లాభం' – సంకలిత రచనలు 2 వ భాగం.పే 62

### పనిదినాన్ని పరిమితం చేసిన ఇంగ్లిష్ ఫాక్టరీ చట్టాలు

1766కి ముందు శతాబ్దాలలో పెట్టుబడిదారులు పనిదినాన్ని క్రమంగా వీలైనంత పై పరిమితికి పెంచేటట్లు చేశారు. పైపరిమితి అంటే వేలుతురుండే 12 గంటలు. అంతకన్నా

తక్కువ పనిగంటలున్న శాఖల్లో కూడా 12 గంటలుండేట్లు చూశారు. అయితే ఇది నెమ్మదిగా జరిగింది. ఇందుకు పెట్టుబడికి శతాబ్దాలు పట్టింది. అయితే 18వ శతాబ్దం మూడవ క్వార్టర్ (1766-1800) లో ఆధునిక పరిశ్రమ వచ్చినప్పటి నుండీ ఈ ప్రక్రియ వేగం పుంజుకుంది. కార్ఖానా దారులు అన్ని నైతిక, ప్రాకృతిక హద్దుల్నీ హింసాత్మకంగా అతిక్రమించారు. స్త్రీ, పురుష భేదాన్నీ, పిల్లలూ పెద్దలూ అనే వయోభేదాన్నీ, పరిమితుల్నీ పాటించలేదు. పగలూ రాత్రీ అనే తేడా లేకుండా పనిచేయించారు. పండగ చేసుకున్నారు. పారవశ్యంతో వీరంగమేశారు విశృంఖలంగా వ్యవహరించారు. వాళ్లకి పెట్టుబడి విస్తరణ తప్ప మరే అంశమూ లెక్కలోకి రాదు. **మనిషి రూపం పొందిన పెట్టుబడే పెట్టుబడిదారుడు** అన్నది అందుకే. ఆ అతిక్రమణ తీవ్రతలోనూ, విస్తృతిలోనూ 'వాలు ప్రదేశంలో బండలు దొర్లడంతో (avalanche) పోల్చాడు మార్క్స్ . 1799 కాంబినేషన్ చట్టం కార్మిక సంఘాల్ని నిషేధించింది. వేతనాల్ని గురించి అందరూ ఒకటిగా చర్చించడాన్ని తిరస్కరించింది. మొదట్లో బిత్తరపోయినా, శ్రామికవర్గం క్రమంగా తేరుకొని ఇంగ్లండ్‌లో కొంత మేరకు ప్రతిఘటనకు దిగింది.

### 1802 - 1833 కాలం

1802 లో చెప్పుకోదగిన శ్రామిక చట్టం వచ్చింది. అది

1. పనిదినాన్ని 12 గంటలకు పరిమితం చేసింది
2. రాత్రిపనిని నిషేధించింది

క్రమంగా తయారీ రంగం వేగం పుంజుకుంది. పిల్లల్ని విపరీతంగా పనిలో పెట్టారు. వాళ్ళు దారుణమైన పరిస్థితుల్లో పనిచెయ్యాల్సి వచ్చింది. 1819 ఫాక్టరీ చట్టం 9 ఏళ్ల లోపు పిల్లల్ని పనిలో పెట్ట కూడదని ఆదేశించింది. 9-16 ఏళ్ల పిల్లల పనిదినాన్ని 12 గంటలకు పరిమిత పరిచింది. ఆతర్వాత, 1833చట్టం రాకముందు పిల్లలతో రేయనకా, పగలనకా పనిచేయించినట్లు ఇన్స్‌పెక్టర్ రిపోర్ట్ లో ఉంది. అయినాగాని, 30 ఏళ్లలో అది సాధించిన రాయితీలు స్వల్పమే, నామమాత్రమే. 1802 - 1833 కాలంలో పార్లమెంటు 5 చట్టాలు చేసింది. అయితే వాటి అమలుకోసం చిల్లి గవ్వైనా కేటాయించలేదు. అలా తెలివిగా వాటిని అమలు కాకుండా చూసింది. ప్రణాళికలో చెప్పినట్లుగా రాజ్యం పెట్టుబడిదారుల ప్రయోజనాలు నెరవేర్చే కమిటీ కదా!

1833 చట్టానికి ముందు యువకులచేతా, బాలురచేతా పగలంతానో, రేయంతానో, లేదా రాత్రీ పగలూనో యధేచ్ఛగా పని చేయించే వారు - అని 1860లో ఒక ఇన్స్‌పెక్టర్ తన నివేదికలో రాశాడు.

### 1833 చట్టం

ఆధునిక పరిశ్రమకు సంబంధించి మామూలు పనిదినం ఎంతో 1833 ఫాక్టరీ చట్టం మొదటగా చెప్పింది. పత్తి, ఊలు, నార, సిల్కు పరిశ్రమలకు వర్తిస్తుంది. 1833-1864 కాలంలో ఇంగ్లిష్ ఫాక్టరీ చట్టాల చరిత్ర కంటే, పెట్టుబడికి స్వభావోచితమైంది మరొకటి లేదు.

1. పనిదినం – ఉదయం 5½ నుండీ రాత్రి 8½ వరకూ. మొత్తం 15 గంటల్లో 12 గంటల మించి పనిచెయ్యకూడదు.
2. భోజనానికి ఒకటిన్నర గంటలు విడిచిపెట్టాలి.
3. యువకుల్ని (13–18 ఏళ్ల వాళ్ళని) నియమించుకోవచ్చు.
4. 9 ఏళ్ల లోపు పిల్లల్ని పనిలో పెట్టుకో కూడదు.
5. 9–13 ఏళ్ల వాళ్లతో 8 గంటలు మాత్రమే పనిచేయించవచ్చు.
6. 9–18 ఏళ్ల పిల్లలతో రాత్రిపూట (రాత్రి 8½నించీ ఉదయం 5½ వరకూ) పని చేయించకూడదు

వయోజనుల పనికాలానికి పరిమితి విధించలేదు. బాలురు యువకులూ కలిసే పనిచెయ్యాలి, కాబట్టి బాలుర పనిగంటల్ని నియంత్రించి, యువకుల పనిగంటల్ని నియంత్రించక పోవడం విరుద్ధమైనవి. చట్టం చేసేవాళ్ళకి పెట్టుబడి స్వేచ్ఛని నియంత్రించే ఉద్దేశం లేదు.

## ఈ చట్టాన్ని అమలు పరచడానికి ఇన్స్‌పెక్టర్లను పెట్టాలని ఆదేశించింది

1834లో 11 ఏళ్లలోపు, 1835లో 12 ఏళ్లలోపు, 1836లో 13 ఏళ్లలోపు పిల్లలకు 8 గంటల పనిని ఖరారు చేస్తూ పార్లమెంటు శాసనాలు చేసింది. ఈ చివరి చట్టప్రకారం పిల్లలంటే 13 ఏళ్లలోపు వాళ్ళన్నమాట. పెట్టుబడిదారుల ప్రకారం బాల్యం 10 ఏళ్ల వరకే. అక్కడనించి పనిలోపెట్టుకోవచ్చు. ఇదీ వాళ్ళ కోరిక. చట్టం 13 ఏళ్ల పరిమితి పెట్టింది.

**ఈ చట్టాలకు వ్యతిరేకంగా పెట్టుబడిదారులు ఆందోళనకి దిగారు.** కొన్ని ఏళ్ల పాటు సాగించారు. వాళ్ళు ప్రభుత్వాన్ని బెదరగొట్టారు. 1835లో 13 ఏళ్ల నించీ 12 ఏళ్లకి తగ్గించేందుకు ప్రభుత్వం రెడీ అయింది. అయితే బయట వత్తిడికి తలొగ్గి తగ్గించ లేకపోయింది. చట్టం పూర్తి స్థాయిలో అమల్లోకి వచ్చింది. అప్పటినించీ 1844 జూన్ దాకా మారకుండా అలాగే ఉంది.

1833–1836 కాలంలో ఈ చట్టాన్ని అసలుకి అమలుకాకుండా విశ్వప్రయత్నం చేసినా, వీలవలేదు. పెట్టుబడిదారులు వేరే దారులు వెదికారు. ఫాక్టరీ చట్టాలవల్ల తమకు ఇబ్బంది లేకుండా ఉండేందుకు పెట్టుబడిదారులు ఒక ప్రత్యేక పద్ధతి ప్రవేశపెట్టారు.

## అదే రిలేల పద్ధతి

ఈ పథకం ప్రకారం ఉదయం 5 ½ నించీ 1½ దాకా 9–13 ఏళ్ల పిల్లల ఒక జట్టూ, 1½ నించీ రాత్రి 8½ వరకూ మరొక జట్టూ పని చెయ్యాలి. ఆవిధానంలో చట్టాన్ని అమలుచేయ్యడం అసాధ్యం అయింది. **ఎందువల్ల అసాధ్యం?** చట్టరీత్యా

1. పొద్దున 5½నించీ రాత్రి 8½వరకూ 15 గంటల్లో యువకులతోనూ, పిల్లలతోనూ 12 లేక 8 గంటల పనిని ఎప్పుడైనా చేయించుకోవచ్చు.

2. పని మొదలుబెట్టడం, విరామమివ్వడం, తిరిగి మొదలుబెట్టడం, ముగించడం – అన్నిటినీ 1833 చట్టం యజమానుల యిష్టానికి వదిలిపెట్టింది.

3. అన్నం తినడానికి వేర్వేరు పనివాళ్ళకి, వేర్వేరు టయాలు పెట్టడానికి యజమానులకు స్వేచ్ఛ నిచ్చింది.

ఈ రిలే విధానంలో ఏమాత్రం నియత్రించడం సాధ్యం కాదని ఇన్స్‌పెక్టర్లు లెక్కలేనన్ని ఫిర్యాదులు చేశారు. 1844 లో హోమ్ సెక్రెటరీకి నేరుగా వివరించారు. ఇంటర్వ్యూలో నిరూపించారు కూడా.

## 1844 ఫాక్టరీ చట్టం

రిలే విధానంలో జరిగే మోసాన్ని ఆపడానికి కొన్ని నిబంధనలు పెట్టింది.

1. పొద్దున ఏ పిల్లవాడయినా మొదలుపెట్టిన టైం నించీ పనిగంటలు లెక్కించాలి. ఉదాహరణకి, A అనే వాడు 8 గంటలకీ, B 10 గంటలకీ పనిమొదలుబెట్టినా, B పని A తో పాటే ముగుస్తుంది.
2. ఒక ప్రభుత్వ గడియారాన్ని బట్టి పనివేళలు జరగాలి.
3. పని మొదలుబెట్టే టైం, ముగించే టైం, భోజనాల టైం స్పష్టంగా నోటీసు పెట్టాలి.
4. మధ్యాహ్నం 12 గంటలకు ముందు పని మొదలు పెట్టే పిల్లలచేత మళ్ళీ ఒంటిగంట తర్వాత పని చేయించకూడదు. అంటే ఉదయం జట్టులో వాళ్ళు, సాయంత్రం జట్టులో ఉండరాదు.
5. భోజనాలకి రోజూ ఒకే టైం ఉండాలి.
6. 18 ఏళ్లుదాటిన స్త్రీలకి పనిదినం 12 గంటలు మించ కూడదు.
7. రాత్రుళ్ళు పనిచేయించకూడదు.
8. 13 ఏళ్ల లోపు పిల్లల పనిని 6½ గంటలకీ, కొన్ని పరిస్థితుల్లో 7 గంటలకూ మించరాదు.

## 1844 వస్త్ర ఫాక్టరీ చట్టం ఇన్స్ పెక్టర్లకి అధికారాలు పెంచింది

ఇవన్నీ పార్లమెంట్ ఊహలో నించి రాలేదు. పరిస్థితుల నించి సహజ నియమాలుగా రూపొందాయి. ప్రభుత్వాలు వాటిని గుర్తించి, చట్టబద్ధం చెయ్యడం అనేది దీర్ఘకాల వర్గ పోరాటాల ఫలితం. అవే పరిమితులు మగవాళ్ళకి కూడా వర్తించాయి. కారణం ఎక్కువ ఉత్పత్తి శాఖల్లో పిల్లల, స్త్రీల సహకారం అవసరం. అందువల్ల 1844–1847 కాలంలో అన్ని శాఖల్లోనూ 12 గంటల పనిదినం మామూలు పనిదినం అయింది.

1844 అదనపు చట్టం జూన్ 7 న వచ్చింది. మోసపూరితమైన రిలే పద్ధతిలోని అస్పష్టతల్ని తొలగించింది. కన్నాల్ని (loopholes) పూడ్చింది. పిల్లల పనిగంటల్ని ఇంకొంత తగ్గించింది. వయోజన స్త్రీలకూ తగ్గించింది. అయితే వయోజన పురుషుల పనిగంటలని యధాతథంగా ఉంచింది. పనిగంటల తగ్గింపువల్ల యజమానులు ఎక్కువమంది పిల్లల్ని నియమించాల్సి వస్తుంది. కనుక వాళ్ళ సరఫరా పెరగాలి. యజమానుల ఒత్తిడికి తలొగ్గి, పిల్లల కనీస వయస్సుని 9 నించీ 8 కి తగ్గించింది.

## 1847 ఫాక్టరీ చట్టం

ఇంగ్లండ్ ఆర్థిక చరిత్రలో 1846-1847 కాలం కొత్త యుగాన్ని ఆవిష్కరించింది. భూస్వాములకు ప్రయోజనం కలిగించే ధాన్య చట్టాలు (1815-1846) రద్దయ్యాయి. ముడిపదార్థాలపైన వేసే సుంకం తొలిగిపోయింది. శాసనాలకిక స్వేచ్ఛా వాణిజ్యమే మార్గదర్శకం అని ప్రకటించబడింది. అంటే ఒక్క ముక్కలో వాణిజ్య స్వర్ణయుగం వచ్చింది. ఇది ఒక వైపయితే, మరొకవైపు ఆ సంవత్సరాల్లోనే చార్టిస్ట్ ఉద్యమమూ, 10 గంటల పనిదినం పోరాటమూ ఉధృతం అయ్యాయి. 1838 నించీ 10 గంటల పని దినాన్ని కార్మికులు ఎన్నికల నినాదంగా పెట్టారు. కార్ఖానాదారుల్లో, రాజకీయ నాయకుల్లో మార్పు వచ్చింది. వాళ్ళు 'ధాన్య చట్టాల' (corn laws) రద్దు కోసం ఆందోళన మొదలుపెట్టారు. అందుకు కార్మికుల సహకారం అవసరమైంది. కనుక వాళ్ళు 10 గంటల పనిదినం చట్టం తెస్తామని కార్మికులకు వాగ్దానం చేసారు. సుదీర్ఘ ఘర్షణ సాగినా, చివరకి 10 గంటల బిల్లు పార్లమెంట్‌లో నెగ్గింది. అదే 1847 ఫాక్టరీ చట్టం. దాన్నే 10 గంటల చట్టం అంటారు. దాని ప్రకారం **1848 మే 1 నించీ పనిదినం 10 గంటలయింది.** "బూర్జువా వర్గం లోని చీలికలను ఉపయోగించుకొని, అది కార్మికుల ప్రత్యేక ప్రయోజనాలను ప్రభుత్వ శాసనాలు గుర్తించేటట్లు చేస్తుంది. ఈ విధంగా ఇంగ్లండ్ లో 10 గంటల బిల్లు పాసయింది."-ప్రణాళిక. 42-43

### పెట్టుబడి పన్నాగాలు

ఈ చట్టాన్ని ఆచరణలోకి రాకుండా ఆపడానికి పెట్టుబడిదారులు ప్రయత్నాలు సాగించారు. వాళ్ళ పన్నాగాలు:

1. **కార్మికులచేతనే చట్టం రద్దుకోసం అర్జీలు పెట్టించారు.** అందుకు అనువైన సమయాన్ని ఎంచుకున్నారు కూడా. 1846-1847 సంక్షోభం వల్ల చాలా మిల్లులు మూతపడ్డాయి. మరెన్నో మిల్లులు తక్కువసేపు పనిచేస్తున్నాయి. ఫలితంగా కార్మికులు ఇబ్బందుల్లో పడ్డారు. అప్పుల పాలయ్యారు. బయటపడాలంటే, ఎక్కువ గంటలు పనిచేయాలనే ఆలోచనతో ఉంటారని, పెట్టుబడిదారులు అనుకున్నారు.

2. **వేతనాలు తగ్గించారు.** వేతనాలు 10 శాతం తగ్గించి, ఈ ప్రభావాన్ని పెంచేందుకు ప్రయత్నించారు. పనిదినం 11 గంటలకు తగ్గగానే, వేతనం మరొక $8\,^{1}/_{3}$ శాతం తగ్గించారు. 10 గంటలకు తగ్గగానే వేతనంలో అంతకు రెట్టింపు కోతపెట్టారు. మొత్తం మీద వీలయిన చోటల్లా వేతనం కనీస 25 శాతం తగ్గించారు. కార్మికులే చట్టాన్ని రద్దు చెయ్యండని అడిగేట్లు, అంతా సిద్ధం చేశారు. ఆ పరిస్థితుల్లో 1847 చట్టం రద్దు చెయ్యాలని శ్రామికుల ఆందోళన మొదలయింది. ఈ ప్రయత్నంలో కార్ఖానాదారులు అబద్ధాలాడారు, లంచాలిచ్చారు, బెదిరించారు.

3. **బలవంతంగా కార్మికులచేత సంతకాలు పెట్టించారు.** చట్టం తమని అణచివేస్తున్నది- అనే అర్జీలని విచారించగా, అర్జీలు పెట్టిన కార్మికులు బలవంతంగా తమచేత సంతకాలు పెట్టించారని చెప్పారు. ఎందుకు సంతకం పెట్టారని అడిగితే, పెట్టకపోతే పనిలోనించి తీసేస్తారు

అని చెప్పారని నివేదికలో ఉంది. "వారు అణచి వేయబడ్డామని అనుకున్నది నిజమే. కాని చట్టం వల్ల మాత్రం కాదు - అని అదే నివేదికలో ఉంది. ప్రయత్నించినాగాని, యజమానులు తమకనుకూలంగా కార్మికులచేత చెప్పించలేకపోయారు

ఈ ప్రయత్నం విఫలమయింది. వాళ్ళు అంతటితో ఆగలేదు.

**4. ఇన్స్‌పెక్టర్లకి వ్యతిరేకంగా ప్రచారం.** కార్మికుల పేర్లతో పత్రికల్లోనూ, పార్లమెంట్ లోనూ కేకలు బెట్టారు. ఫాక్టరీ ఇన్ స్పెక్టర్లని నిందించారు. ఇన్‌స్పెక్టర్ హార్నర్ తానూ, తన ఇన్ స్పెక్టర్లతోనూ లాంక్ షైర్ ఫాక్టరీల్లో సాక్షుల్ని విచారించాడు. 181 ఫాక్టరీల్లో 10,270 మందిని విచారించాడు. వాళ్ళలో దాదాపు నూటికి 70 మంది 10 గంటల పనికి అనుకూలంగా ఉన్నారు. అలా ఆ పాచికా పారలేదు.

**5. బలవంతంగా ఎక్కువగంటలు పనిచేయించి, స్వచ్ఛందంగా చేసినట్లు కార్మికులచేత చెప్పించడం**

మరో పన్నాగం. మగ కార్మికులతో 12-15 గంటలు పనిచేయించి, తర్వాత కార్మికులు ఏమి కోరుతున్నారనే దానికి దాన్నే ఉదాహరణగా ప్రచారం చెయ్యడం. హార్నర్ మళ్ళీ రంగం మీదకి వచ్చాడు. ఎక్కువ గంటలు పనిచేసిన కార్మికుల్లో చాలా ఎక్కువమందికి **వేతనం తక్కువయినా, 10 గంటల పనే ఇష్టం** అని ప్రకటించాడు. ఆ విధంగా 10 గంటల బిల్లుకి వ్యతిరేకంగా పెట్టుబడిదారుల ప్రయత్నాలు విఫలమయ్యాయి.

**1848 మే 1 న 10 గంటల చట్టం** అమల్లోకొచ్చింది.

కాని బయట పరిస్థితులు మారాయి. అందువల్ల వల్ల **కార్మికులకు ఎదురుదెబ్బ** తగిలింది. అందుకు కారణాలు:

(1) చార్టిస్ట్ పార్టీ దెబ్బతిన్నది.. నాయకులు అరెస్టయి జైళ్లలో వున్నారు. ఆ ఉద్యమం ఛిన్నాభిన్నమయింది. దాంతో కార్మికుల మనోస్థైర్యం కూడా దెబ్బతిన్నది.

(2) జూన్‌లో పారిస్ లో వచ్చిన తిరుగుబాటు అణచి వేయబడింది. ఆ తీవ్రమైన దమనకాండ భూస్వాముల్నీ, పెట్టుబడిదారుల్నీ ఐక్యం చేసింది. ప్రభుత్వ పక్షాలనీ, ప్రతిపక్షాల్నీ ఒక్క తాటి మీదకి తెచ్చింది. ఆస్తి, కుటుంబం, మతం సమాజం - వీటి రక్షణ అనే నినాదంతో కలిసిపోయారు.

(3) కార్మికులు బహిష్కృతులయ్యారు, అనుమానితులు అయ్యారు.

ఇక విజయోత్సాహంతో పెట్టుబడిదారులు 10 గంటల బిల్లుమీద బహిరంగంగా తిరుగుబాటు చేశారు. అంతేగాదు. 1833 నించీ వాళ్ళని కాస్తో కూస్తో కట్టడి చేసిన అన్ని శాసనాలనూ వ్యతిరేకించారు. అది ఒకపాటి బానిసత్వ అనుకూల తిరుగుబాటు. దీన్ని దౌర్జన్యంగా పశుబలంతో రెండేళ్ళు నిరాఘాటంగా సాగించారు.

1833, 1844, 1847 చట్టాలు మూడూ వాటిలో వాటికి తేడా రానంత వరకు అమల్లో వున్నాయి. వాటిలో ఏదీ 18 ఏళ్ళు పైబడ్డ మగ కార్మికుని పనిదినాన్ని పరిమితం చెయ్యలేదు.

కాబట్టి 1833 నించీ పొద్దున 5½ నించీ రాత్రి 8½ వరకూ 15 గంటలూ పనిదినమే. ఇది చట్టబద్ధమే. ఈ హద్దుల్లోపల యువకులకీ, స్త్రీలకీ మొదట 12 గంటల శ్రమా, తర్వాత 10 గంటలశ్రమా అమల్లో ఉంది. మనం ఈ విషయాల్ని గుర్తుంచు కోవాలి. **దీన్ని యజమానులు వాళ్ళ ప్రయోజనాల కోసం ఉపయోగించుకున్నారు:**

1. అక్కడక్కడ చాలామంది పిల్లల్నీ, స్త్రీలనీ పనిలోంచి తొలిగించారు. చాలాచోట్ల సగం మందిని తీసేశారు. మగవాళ్ళకి దాదాపు ఎక్కడా కనిపించని రాత్రిపనిని తిరిగి మొదలుపెట్టారు. 10 గంటల చట్టం వచ్చినందువల్ల వాళ్లకి వేరే మార్గం ఏదీ లేదని బిగ్గరగా అరిచి మరీ చెప్పారు.

2. భోజనానికి పనిదినంలో విరామం ఇవ్వాల్సిన బాధ్యత తమకు లేదన్నారు. ఎందుకంటే: 10 గంటల పనిదినం పొద్దున్న 9 నించీ రాత్రి 7 వరకూ. అలా అనుకుంటే, ఉదయం 9 కి ముందు గంట, రాత్రి 7 తర్వాత ½ గంటా ఇవ్వడంద్వారా బాధ్యత తీరుస్తామని అంటున్నారు. అంటే వాళ్ళు ఇళ్ళదగ్గరే 9 కి ముందు తిని రావాలి. మళ్ళీ 7 గంటలకి ఇళ్ళకు వెళ్ళి తినాలి. ఇప్పుడు కొన్ని సందర్భాల్లో గంటో, అరగంటో భోజనానికి విరామం ఇస్తున్నారు. అయితే అదే సమయంలో విరామాన్ని పనిదినంలోనే ఇవ్వాలనే విధి తమకు లేదని గట్టి పట్టు పడుతున్నారు.– అని ఫాక్టరీ ఇన్‌స్పెక్టర్లు చెప్పారు.

అయితే విరామం పది పనిగంటల్లోనే ఉండాలనీ, 9నించీ 7దాకా 10 గంటలు విరామం లేకుండా పనిచేయించడం చట్టవిరుద్ధం అనీ, ప్రభుత్వ న్యాయవాదులు నిర్ణయించారు.

3. 1844 చట్టం ప్రకారం మధ్యాహ్నానికి ముందు పనిచేయించిన 8–13 ఏళ్ల పిల్లలచేత మధ్యాహ్నం ఒంటిగంట తర్వాత పనిచేయించ కూడదు. అయితే, ఆ చట్టం మధ్యాహ్నం 12 గంటలకో, ఆ తర్వాతో మొదలుబెట్టే పిల్లల 6½ గంటల పనిని నియంత్రించలేదు. .

4. ఈ చట్టం ముఖ్యోద్దేశం తప్పుడు రిలే విధానాన్ని రద్దుపరచడం. 1844 చట్టం ప్రకారం మధ్యాహ్నానికి ముందు కనీసం 30 నిమిషాల భోజన విరామం ఇవ్వాలి. ఏకబిగిన 5 గంటలు పనిచేయించకూడదు. అయితే మధ్యాహ్నం తర్వాత పనికి అలాంటి నిబంధన చట్టంలో లేదు. పెట్టుబడిదారులు దీన్ని అవకాశంగా మలుచుకొని మధ్యాహ్నం 2 గంటల నుండీ రాత్రి 8½ వరకూ విరామం ఇవ్వకుండా పనిచేయించారు.

ఆవిధంగా చట్టంలో మాటల్ని పట్టుకొని అమలు పెట్టారు.

అయితే వాళ్ళు యువకుల, స్త్రీల పనిని నియంత్రించడం గురించి అదే చట్టం చెప్పినదాన్ని తిరస్కరించారు. బహిరంగ తిరుగుబాటు చేశారు. పాత పద్ధతిని తిరిగి మొదలుపెడతామని ఇన్స్‌పెక్టర్లకి గట్టిగా చెప్పారు.

ఫాక్టరీ ఇన్స్‌పెక్టర్లు న్యాయస్థానాలకి వెళ్ళారు. యజమానులు హోమ్ సెక్రెటరీకి పిటీషన్లు పెట్టారు. ఆయన ఇన్స్‌పెక్టర్లకు ఇలా చెప్పాడు: రిలేల ద్వారా యువకార్మికుల్ని పెట్టుకున్నంత మాత్రాన, వాళ్ళచేత చట్టం అనుమతించిన కాలం కంటే ఎక్కువ కాలం పనిచేయించినట్లు

నమ్మేందుకు ఆధారాలు లేనప్పుడు, మిల్లు ఓనర్లకు వ్యతిరేకంగా సమాచారం ఇవ్వవద్దు.

## కేసులు పెట్టడం వృధా – రిలే నెగ్గింది

యజమానుల పిటీషన్లు స్కాట్ లాండ్‌లో నెగ్గాయి. ఇన్స్ పెక్టర్ స్టువార్ట్ స్కాట్ లాండ్ మొత్తంలో రిలే విధానాన్ని ఒప్పుకున్నాడు. వెనకటి లాగే త్వరలోనే ఆ విధానం అమలయింది. ఇంకొకవైపు, ఇన్స్‌పెక్టర్లు చట్టాన్ని నిరోధించే అధికారం సెక్రెటరీకి లేదని వాదించారు. వాళ్ళు న్యాయస్థానాలకు వెళ్లి పోరాడారు. పది కేసులు పెడితే, ఒక్కదాంట్లో మాత్రమే మాజిస్ట్రేట్లు సపోర్ట్ చేశారు. అందువల్ల కేసులు పెట్టడం వృధా అని అనుకున్నారు. షిఫ్టుల విధానం పెట్టిన మిల్లులు పెరిగాయి. పనిదినం పొద్దున 6 గంటలనించీ రాత్రి 7½ దాకా – అంటే 13½ గంటలకు పెరిగింది. కొన్నిసందర్భాల్లో 15 గంటలు కూడా ఉండేది – 5½ నించీ రాత్రి 8½ దాకా. అయితే తప్పుడు రిలే పద్ధతి అవలంబించారు. ఒక శ్రామికుడు ఎన్నిగంటలు పనిచేశాడో తేల్చడం సాధ్యం కాదు. ఈ పద్ధతిని 1844 చట్టంగానీ, 1847 చట్టంగానీ స్పష్టంగా నిషేధించలేదు. ఈ అస్పష్టత భిన్నాభిప్రాయాలకి అవకాశం ఇచ్చింది. స్కాట్ ల్యాండ్ ఇన్స్పెక్టర్ చట్టబద్ధమేనన్నాడు. బ్రాడ్ ఫోర్డ్ ఇన్స్పెక్టర్ చట్టవ్యతిరేకంగా భావించాడు, స్థానిక మాజిస్ట్రేట్ అతనితో ఏకీభవించాడు. మాంచెస్టర్ ఇన్స్పెక్టర్ చట్టవ్యతిరేకమన్నాడు. కాని మాజిస్ట్రేట్ ఒప్పుకోలేదు. 1850 లో రిలే పద్ధతి చట్టవ్యతిరేకం అనడానికి అక్కడున్న మాటలు సరిపోవు అని Court of Exchequer అభిప్రాయపడింది. 1844 చట్టాన్ని కొట్టేసింది.

కార్ఖానాదారులు 1844 చట్టం అభిప్రాయాలకి వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నట్లు కోర్టు తేల్చింది. కాని, చట్టం లోని కొన్న మాటలు చట్టాన్ని అర్థంలేనిదిగా చేశాయంది. దాంతో 10 గంటల చట్టం రద్దయింది. అప్పటిదాకా స్త్రీలకీ, తరుణ వయస్కులకీ రిలే పద్ధతి పెట్టడానికి బెదురుగా ఉన్న కార్ఖానాదారులు పూర్తిగా ఆచరణలో పెట్టారు.

## విస్తరించిన రిలే విధానం – దీటుగా పెరిగిన కార్మికుల నిరసన

పెట్టుబడిదారులు తమకు కావలసింది పొందారు. అయితే కార్మికులు దీన్ని వ్యతిరేకించారు. బహిరంగ సమావేశాల్లో తీవ్ర నిరసన వ్యక్తంచేశారు. వర్గశత్రుత్వం తీవ్రస్థాయికి చేరిందని ఇన్స్‌పెక్టర్లు ప్రభుత్వాన్ని హెచ్చరించారు. ఈ పరిస్థితుల్లో కార్మికులకూ, కార్ఖానాదారులకూ రాజీ ఏర్పడింది. 1850 ఆగస్ట్ అదనపు చట్టంగా పార్లమెంటు దీన్ని ఆమోదించింది.

1844 చట్టం 1847 చట్టం రెండూ స్త్రీల, యువవయస్కుల పని గంటల్ని తగ్గించాయి. కాని ఎప్పటినించి ఎప్పటిదాకా అని కచ్చితంగా చెప్పలేదు. ఫాక్టరీ పనిచేసే సమయాన్ని తగ్గించలేదు. ఎప్పటిలాగే ఉదయం 5½ నించీ రాత్రి 8½ దాకా అలాగే ఉంచాయి. అంటే, ఫాక్టరీ 15 గంటలు పనిచేస్తుంది. ఆ 15 గంటల్లోపల ఎప్పుడైనా పనిచేయించుకోవచ్చు. ఎన్నివిడతలుగానైనా చేయించుకోవచ్చు.

## 1850 చట్టం – రిలే విధానం రద్దు

స్త్రీలూ, యువకార్మికులూ ఉదయం 6 నించీ సాయంత్రం 6 వరకూ పనిచెయ్యాలి.

అందులో 1½ గంట విరామం ఇవ్వాలి. అంటే, అరగంట పని పెరిగింది. 10½ గంటలయింది. శనివారం సాయంత్రం 2 గంటలకే పని ముగించాలి. పనివారం 58 నించీ 60 గంటలకు పెరిగింది. విరామం అందరికీ ఒకేసారి ఇవ్వాలి. దాంతో రిలే విధానం శాశ్వతంగా రద్దయింది.

స్త్రీలకూ, యువకార్మికులకూ మాత్రమే పనిదినాన్ని మార్చింది. పిల్లల విషయంలో ఏ మార్పూ చెయ్యలేదు. అంటే వాళ్ళ చేత ఉదయం 6 నించీ 8½ మధ్యలో ఎప్పుడయినా 6½ గంటల పని చేయించవచ్చు. ఇలా క్రమబద్ధత లేకపోవడం వల్ల పిల్లల పరిస్థితి దారుణంగా ఉండేది. ఇన్స్‌పెక్టర్లు గణాంకాలతో పార్లమెంటు ముందు పెట్టారు. కాని ప్రయోజనం కలగలేదు.

1853 చట్టం ఈ లోపాన్ని సవరించింది. అందరికీ, అన్నిశాఖల్లోనూ పనిదినాన్ని ఒకే విధంగా ఉండేట్లు నిర్ణయించింది. అప్పటికి తొలి ఫాక్టరీ చట్టం వచ్చి అర్ధశతాబ్దం అయింది.

## సూత్రం విజయం - 10 గంటల బిల్లు

1853-1860 కాలంలో ఫాక్టరీ పనివాళ్ళు భౌతికంగానూ నైతికంగానూ బాగా పుంజుకున్నారు. **పెద్ద శాఖల్లో సూత్రం నెగ్గింది** అంటాడు మార్క్స్. 1864 అక్టోబర్లో First International ప్రారంభోపన్యాసంలో: 10 గంటల బిల్లు కేవలం ఆచరణాత్మక విజయం మాత్రమే కాదు; అది సూత్రం విజయం కూడా; **మధ్యతరగతి ఆర్థిక విధానం కార్మికవర్గపు ఆర్థిక విధానానికి మొదటిసారి పూర్తిగా లోబడి పోయింది.**

ఇదంతా జరిగేటప్పటికి 50 ఏళ్ల అంతర్యుద్ధం సాగింది. అన్ని సంవత్సరాలూ కొంచెం కొంచెంగా యజమానుల నించీ చట్టబద్ధమైన పరిమితుల్నీ, క్రమబద్ధతనీ కార్మికులు లాక్కోవలసి వచ్చింది. క్రమంగా యజమానులకు ప్రతిఘటించే శక్తి సన్నగిల్లింది. శ్రామికులకు పోరాట పటిమ పెరిగింది. ఇతర సామాజిక తరగతులనుండి మద్దతిచ్చేవాళ్ళు పెరిగారు. 1860 నించీ కార్మికుల పురోగమనానికి కారణం అదే.

## ఇతర పరిశ్రమలకు చట్టాల విస్తరణ

1860 లో Bleach and Dye Works Act వచ్చింది. ఆ చట్టం నిబంధనల్ని తెల్లబరిచే (bleach) పనులకీ, రంగులద్దే (dye) పనులకీ కూడా వర్తింపచేసింది. 1861లో లేసు పనులకీ, మేజోళ్ళ పనులకీ వర్తింపచేసింది. 1863 పిల్లల ఉద్యోగ కమిషన్ నివేదిక వల్ల అన్ని మట్టి పాత్రల పరిశ్రమలూ, లుసిఫర్ అగ్గిపుల్లల పరిశ్రమలతో పాటు మరికొన్ని కూడా చట్ట పరిధిలోకి వచ్చాయి. 1864లో Factory Acts Extension Act వచ్చింది. అది మరో 6 కొత్త పరిశ్రమల్ని కూడా ఈ నియమాల కిందికి తెచ్చింది. 1867 Factory Acts Extension Act 50 కన్నా ఎక్కువమంది పనివాళ్ళున్న అన్ని ఫాక్టరీల్నీ ఇదే పరిధిలో పెట్టింది. 1867 Workshops Regulation Act 50 మందిలోపు పనివాళ్ళున్న ఫాక్టరీల్ని కూడా ఈనిబంధనల కిందకి తెచ్చింది.

1878 చట్టం నిబంధనల్ని అన్నిటికీ వర్తింప చేసింది. 10 ఏళ్ల లోపు పిల్లల్ని పనిలో పెట్టకూడదు. వాళ్ళకు చదువు తప్పనిసరి. 10-14 ఏళ్ల వాళ్ళని అరరోజు మాత్రమే పనిలో పెట్టుకోవాలి. స్త్రీలచేత వారానికి 56 గంటలు మించి పనిచేయించ కూడదు.

(ఈ చట్టం కాపిటల్ రెండో కూర్పునాటికి రాలేదు. అందువల్ల దీని గురించి అందులో

లేదు. అయితే ఇది వచ్చినప్పుడు మార్క్స్ ఉన్నాడు)

ఫాక్టరీ చట్టాలు మొదట యంత్రాలు వాడిన వస్త్ర పరిశ్రమలో వచ్చాయి.

## పారిశ్రామిక విప్లవం

1764లో నూలు వడికే యంత్రాన్ని హర్ గ్రీవ్స్ తయారుచేశాడు. అదే జెన్నీ. చేత్తో నడిపేదే. అయితే ఇందులో 16 కదుర్లుంటాయి. అంతకుముందున్న రాట్నంలో ఒక్క కదురే ఉండేది. 3 రాట్నాల మీద వచ్చే నూలు ఒక్క నేతపనివానికయినా సరిపోయేది కాదు. జెన్నీ వచ్చాక ఎక్కువ దారం ఉత్పత్తి మొదలయింది. పెట్టుబడిదారులు భారీ భవనాలలో పెద్ద సంఖ్యలో జేన్నీలు పెట్టారు. వాటిని నడపడానికి జలశక్తిని వాడసాగారు. ఆ విధంగా ఫాక్టరీ వ్యవస్థ ప్రారంభమయింది. 1767 లో ఆర్క్ రైట్ త్రాసెల్ అనే మరొక వడికే యంత్రాన్ని కనిపెట్టాడు. ఇది యాంత్రిక చోదకశక్తిని ఉపయోగిస్తుంది. జేన్నీ, త్రాసెల్ – ఈ రెంటి లోని ప్రత్యేకతల్ని కలిపి 1785 లో శామ్యూల్ క్రాంప్టన్ 'మ్యూల్' అనే మరొక వడికే యంత్రాన్ని రూపొందించాడు. అదే కాలంలో ఏకే యంత్రం వచ్చింది. నూలు వడకడంలో ఫాక్టరీ విధానం పూర్తిగా ఏర్పడింది. చిన్న చిన్న మార్పులతో ఈ యంత్రాలు ఉన్ని, నార వడకడానికి ఉపకరించాయి. ఆ రంగాల్లో అంతకుముందున్న చేతిపనివాళ్ళని తగ్గించాయి. అయితే నెయ్యలేనంత దారం ఉత్పత్తయ్యేది. నేతగాళ్ళు కొరవ పడ్డారు.

1784లో కార్ట్ రైట్ మరమగ్గం నిర్మించాడు. 1804 నాటికి చేమగ్గం నేతతో పోటీ పడేటంతగా మెరుగు పరిచాడు. ఈ యంత్రాలన్నీ జేమ్స్ వాట్ తయారుచేసిన ఆవిరి యంత్రం (1764) వల్ల ఎంతో ప్రాధాన్యత పొందాయి. 1785 నుండి నూలు వడికేందుకు ఆవిరియంత్రం చోదక శక్తినిచ్చింది. క్రమంగా ఇంగ్లిష్ పరిశ్రమలో అన్ని ముఖ్య శాఖల్లోనూ చేతిపని స్థానంలో యంత్రాల వాడకం వచ్చింది. ఉత్పత్తి విపరీతంగా పెరిగింది. ఈ యంత్రాలు సామాజిక ఉత్పత్తి సంబంధాల్ని మార్చాయి. పిల్లల శ్రమ పెరిగింది. శ్రమ చేయించడం ఎక్కువయింది. కార్మికుల దుస్థితిని యజమానులు పట్టించుకోలేదు. పట్టించుకోరు కూడా. కనుక ఈ అతిశ్రమకు సామాజిక అదుపు అవసరమైంది.

## మొదట వస్త్ర పరిశ్రమకే అదుపు – క్రమగా అన్ని పరిశ్రమలకీ

పనిదినాన్ని అపరిమితంగా పెంచాలని పెట్టుబడి ఆరాటపడుతుంది. ఈ తపన ముందుగా జలశక్తి వల్లా, ఆవిరివల్లా, యంత్రాలవల్లా ఆధునీకరించబడిన పరిశ్రమల్లో నెరవేరింది. అవి దూది, ఊలు, నార, సిల్క్ వడికే పరిశ్రమలూ, నేసే పరిశ్రమలు. వీటిలో హద్దులు మీరి పనిదినం పొడిగించబడింది. దీనికి వ్యతిరేకంగా సమాజం జోక్యం చేసుకొని, అదుపు చెయ్యాల్సి వచ్చింది.

# విభాగం 7
## మామూలు పనిదినం కోసం పోరాటం
## ఇతర దేశాలపైన ఇంగ్లిష్ ఫాక్టరీ చట్టాల ప్రభావం

**మొదటి విషయం.** 19వ శతాబ్దం తొలి  అర్థభాగంలో ఈ అదుపు వస్త్ర పరిశ్రమకి – అదికూడా ఆవిరినో, జలశక్తినో ఉపయోగించే వాటికి – మాత్రమే. అదే ఫాక్టరీ విధానాన్ని ఎన్నో ఇతర శాఖలు అనుసరించాయి. శాసనాల్ని అన్ని పరిశ్రమలకీ వర్తింపచేయ్యాల్సి వచ్చింది. చట్టరీత్యా పనిదినాన్నీ, విరామ సమయాల్నీ నిర్ణయించి, క్రమబద్ధీకరించి, అన్ని పరిశ్రమల్లో ఒకే నియమాలు  ఉండేట్లు చూడాల్సి వచ్చింది. 1864 చట్టాలలో  ఫాక్టరీ అనడానికి యంత్రాలు నడపడానికి యాంత్రికశక్తి ఉపయోగించాలనేది లేదు. అందువల్ల ఉత్పత్తిసంస్థలు అసంఖ్యాకంగా ఫాక్టరీ లయ్యాయి. ఫాక్టరీ చట్టంపరిధిలో పడ్డాయి. సామాజిక అదుపులోకి వచ్చాయి.

**రెండో విషయం.** ఒంటరి కార్మికుడు తన శ్రమ శక్తిని స్వేచ్ఛగా అమ్ముకోగలడు. పెట్టుబడిదారీ ఉత్పత్తి ఒకానొక స్థాయికి చేరాక, ప్రతిఘటించే శక్తిలేక లొంగిపోతాడు. అందువల్ల మామూలు పనిదినం ఏర్పడడం అనేది పెట్టుబడిదారీ వర్గానికీ కార్మికవర్గానికీ అంతో ఇంతో ప్రచ్ఛన్నంగా జరిగే ఒక దీర్ఘ కాల అంతర్యుద్ధ  ఫలితం. ఈ ఘర్షణ ఆధునిక పరిశ్రమ రంగంలో జరుగుతుంది. కనుక ఆ పరిశ్రమకి పుట్టినిల్లయిన ఇంగ్లండ్‌లో మొదలవుతుంది.

ఐరోపా ఖండ ఉదారవాదానికి (continental liberalism) స్వర్గం అయిన బెల్జియంలో ఈ ఉద్యమం మచ్చుకైనా కనబడదు. బొగ్గు, లోహ గనుల్లో సైతం అన్ని వయస్సుల స్త్రీలచేతా, పురుషులచేత అతి తక్కువ వేతనాలకు ఎంతకాలమైనా పనిచేయించుకో గలరు.

ఇంగ్లిష్ ఫాక్టరీ కార్మికులు ఇంగ్లిష్ శ్రామిక వర్గానికే కాక, ఆధునిక శ్రామిక వర్గానికి కూడా చాంపియన్లు. ఎందుకంటే, పెట్టుబడి సిద్ధాంతానికి మొదటి సవాలు విసిరిన వాళ్ళు వాళ్ళే. అలాంటి సవాలుని మార్క్స్ ఫుట్ నోట్ లో ఇస్తాడు: 1810 తర్వాత రాబర్ట్ ఓవెన్ పనిదినాన్ని పరిమితం చెయ్యాల్సిన అవసరాన్ని  సిద్ధాంతపరంగా నిలబెట్టాడు. అంతే కాదు. న్యూ లేనార్క్ లో ఉన్న తన ఫాక్టరీలో 10 గంటల పనిదినాన్ని ప్రవేశపెట్టాడు. కమ్యూనిస్ట్ ఊహాస్వర్గం అంటూ ఆయన్ని ఎగతాళి చేశారు. మొట్టమొదటగా ఆయనే ఏర్పరచిన  పిల్లలకు శ్రమతో పాటు చదువు అనేదాన్నీ, కార్మికుల సహకార సంఘాల్నీ కూడా అలాగే గేలి చేశారు. ఇవ్వాళ మొదటి ఊహా స్వర్గం ఫాక్టరీ చట్టం అయింది. రెండోది ప్రతి ఫాక్టరీ చట్టంలోనూ అధికారిక పదంగా కనపడింది. మూడోది అభివృద్ధి నిరోధక మోసానికి ముసుగుగా ఉంటున్నది. ఇందుకు వ్యతిరేకంగా, పెట్టుబడిని సమర్థించే ఉరే అనే ఫాక్టరీ తత్వవేత్త ఇంగ్లిష్ కార్మికవర్గం 'సంపూర్ణ శ్రమ స్వేచ్ఛ' కోసం ప్రయత్నిస్తూ  తన బానర్ మీద ' ఫాక్టరీ చట్టాల బానిసత్వం' అంటూ  పెట్టుబడికి వ్యతిరేకంగా రాయడాన్ని చెప్పలేని అవమానం అంటూ నిందించాడు.

## ఇంగ్లాండ్ వెనక ఫ్రాన్స్

ఫ్రాన్స్ ఇంగ్లాండ్ వెనక నెమ్మదిగా కుంటుతోంది. 12 గంటల చట్టాన్ని తెచ్చేందుకు ఫిబ్రవరి విప్లవం అవసరమైంది. రోజుశ్రమని 12 గంటలకు పరిమితం చేసే ఫ్రెంచ్ చట్టం ఆ 12 గంటలు ఎప్పటినుండి ఎప్పటివరకో చెప్పలేదు. పిల్లల పనికి మాత్రమే ఉదయం 5 నించీ రాత్రి 9 వరకూ అని నిర్ణయించింది. అందువల్ల కొందరు యజమానులు ఈ మౌనాన్ని ఆసరాగా తీసుకుని పోద్దుకూకులూ విరామం లేకుండా పని సాగించారు. ఇందుకు రెండు జట్ల పనివాళ్లని పెట్టేవారు. ఫాక్టరీలో రేబవళ్ళూ పని కొనసాగేది. ఏ జట్టూ 12 గంటలకు మించి పనిలో ఉండదు. చట్టానికి ఇది సరే, మనిషికి? పైగా మనిషిమీద **రాత్రిశ్రమ కలిగించే దుష్ప్రభావం సంగతేంటి?**

అయినప్పటికీ ఫ్రెంచ్ పద్ధతికి ప్రత్యేక ప్రయోజనాలు ఉన్నాయి. అక్కడ చట్టాలు అన్నిచోట్లా, అందరు పనివాళ్ళకీ ఏ తేడా లేకుండా ఒకేవిధంగా, ఒకేసారి ప్రవేశపెట్టబడ్డాయి. ఇంగ్లండ్‌లో అలాకాదు. పరిస్థితుల ఒత్తిడిని బట్టి అక్కడొకరకంగా, ఇక్కడొకరకంగా ఉన్నాయి. మరొకవైపు ఫ్రెంచ్ చట్టం ఒక సూత్రంగా ప్రకటించింది. ఇంగ్లండ్ అలాకాదు. పిల్లల పేరుతో, మైనర్ల పేరుతో, స్త్రీల పేరుతో చేసింది. ఇటీవలనే ఒక సాధారణ హక్కుగా చెప్పింది.

## ఉత్తర అమెరికాలో – బానిసత్వం పోయాకనే కార్మికోద్యమం

ఉత్తర అమెరికాలో కార్మిక ఉద్యమం రావడానికి ముందుగా బానసత్వ నిర్మూలన అవసరమైంది. అక్కడ ఒకభాగంలో బానిసత్వం ఉన్నంతకాలం ఏ స్వతంత్ర కార్మికోద్యమమూ ముందుకు సాగలేదు. నల్లతోలు శ్రామికుడు బానిసగా ఉండగా, తెల్లతోలు శ్రామికుడు విముక్తం కాడు. అయితే బానిసత్వం అంతం కావడంతోటే, కొత్త జీవం ఏర్పడింది.

## 8 గంటల పనిదినం

అంతర్యుద్ధం ప్రథమ ఫలం 8 గంటల పనిదినం కోసం ఉద్యమం. అది అట్లాంటిక్ నుండి పసిఫిక్ దాకా, న్యూ ఇంగ్లండ్ నుండి కాలిఫోర్నియా దాకా పెద్దపెద్ద అంగలేసుకుంటూ పరుగు పెట్టింది. 1866 ఆగస్ట్ 16న బాల్టిమోర్ లోజరిగిన సర్వసభ్య శ్రామిక సమావేశం ఇలా ప్రకటించింది:

ఇప్పుడు తొలి అవసరం పెట్టుబడిదారీ బానిసత్వం నించి శ్రమకి స్వేచ్ఛనివ్వడానికి, అన్ని రాష్ట్రాలలోనూ పనిదినాన్ని 8 గంటలుగా నిర్దేశించే చట్టం చెయ్యాలి. ఈ గొప్ప ఫలితం వచ్చేవరకూ మా శక్తీ ఒడ్డాలని కృతనిశ్చయంతో ఉన్నాం.

యూరప్ లో కూడా అలాంటి ప్రకటనలే వచ్చాయి. అదే కాలంలో జెనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మికసంఘం మహాసభ (Congress of the International Working Men' Association) కూడా, లండన్ జనరల్ కౌన్సిల్ సూచనమేరకు 8 గంటల పనిదినాన్ని ప్రతిపాదించింది. ఆ విధంగా అట్లాంటిక్‌కి ఇటువైపూ, అటువైపూ ఉత్పత్తి పరిస్థితుల నుండి

దానికదే పుట్టి పెరిగిన కార్మికోద్యమం సాండర్స్ అనే ఇన్స్ పెక్టర్ మాటల్ని ఆమోదించింది: పనిగంటల్ని పరిమితపరచనిదే, కచ్చితంగా అమలుపరచనిదే సమాజాన్ని సంస్కరించడానికి ముందడుగు పడడం సాధ్యంకాదు.

పనిదినాన్ని తగ్గించడం ఎందుకు ముఖ్యమో తెలుసుకోవాలంటే ఈ ప్రశ్నకు జవాబు చెప్పాలి: **స్వచ్ఛందంగా తమ శ్రమశక్తిని అమ్ముతున్న శ్రామికులు అతిగా అమ్మకుండా చట్టం ఎందుకు అడ్డు కుంటున్నది?**

శ్రామికుడు ప్రక్రియలో ప్రవేశించినప్పటికంటే, దాన్నించి భిన్నంగా బయటికి వస్తాడు – అని మనం ఒప్పుకోవాలి. మార్కెట్‌లో శ్రమశక్తి అనే సరుకు ఓనర్‌గా ఇతరసరుకుల ఒనర్లందరికీ ఎదురుగా, వర్తకుడికి ఎదురుగా వర్తకుడుగా నిలబడ్డాడు.

**అతను తనను తాను స్వేచ్ఛగా అమ్ముకున్నట్లు, తన శ్రమశక్తిని పెట్టుబడిదారుడికి అమ్మిన ఒప్పందం రుజువు చేసింది. బేరం అయ్యాక అతను స్వేచ్ఛాయుతుడు కాదనీ, తన శ్రమశక్తిని ఎంతకాలం పాటు అమ్మడానికి అతనికి స్వేచ్ఛ ఉన్నదో, అంత కాలం పాటు అతను గత్యంతరం లేక అమ్ముకోవాల్సివచ్చిందనీ తెలుస్తుంది**

వాస్తవానికి అక్కడదోచుకోడానికి 'ఒక కండరం, ఒక నరం, ఒక నెత్తుటిబొట్టు' ఉన్నంతవరకూ ఆ రక్తపిశాచి అతన్ని పట్టిన పట్టు విడువదు. వాళ్ళని బాధించే సర్పం నించి రక్షణ కోసం వాళ్ళు కలిసికట్టుగా ఆలోచించి తీరాలి, పెట్టుబడితో చేసుకునే స్వచ్ఛంద ఒప్పందం ద్వారా అదే శ్రామికులు తమనీ, తమ కుటుంబాల్నీ బానిసత్వంలోకి, అమ్ముకోకుండా ఆపగలిగిన చట్టం చెయ్యడంకోసం ఒక వర్గంగా ఒత్తిడి పెట్టితీరాలి.

10 గంటల చట్టం రాక ముందు అధిక శ్రమవల్ల శ్రామికులకు ముందుగానే ముసలితనం వచ్చేది. చట్టం అమలయిన పారిశ్రామిక శాఖల్లో ఆ పరిస్థితి అంతమైంది – రిపోర్ట్ 1859 అక్టోబర్ 31.

'పరాధీనం చెయ్యరాని మానవ హక్కులు' అనే ఆడంబర జాబితా స్థానంలో చట్టబద్ధ పనిదినం అనే నమ్రత గల హక్కుల పత్రం (Magna Carta) వస్తుంది. అది శ్రామికుడు అమ్మిన కాలం ఎప్పుడు ముగుస్తుందో, అతని సొంత టైం ఎప్పుడు మొదలవుతుందో స్పష్టపరుస్తుంది. సొంత సమయం ఎప్పుడు మొదలవుతుందో కార్మికునికి తెలుసు. కనుక సొంత పనులకు సొంత నిమిషాల్ని ముందుగానే ప్లాన్ చేసుకుంటాడు. ఇదొక 'గొప్ప వరం'. వాళ్ళ సమయానికి వాళ్ళనే యజమానులు చెయ్యడం ద్వారా చట్టాలు వాళ్ళకి రాజకీయ అధికారం కోసం ప్రయత్నించే నైతిక శక్తిని కలిగించాయి – అని అదే రిపోర్ట్ చెప్పింది.

పెట్టుబడిదారులకి సహజంగా ఉండే పాశవికత నుండి చట్టాలు ఒకమేరకు విముక్తి చేసినట్లు సూచన ప్రాయంగా ఇన్స్‌పెక్టర్లు చెప్పారు. ఇంతకు ముందు యజమానులకి డబ్బుకోసం తప్ప మరెందుకూ టైం ఉండేది కాదు. సేవకుడికి పనిచేయడానికి తప్ప మరెందుకూ టైం ఉండేది కాదు. ఆనాటి నించీ ఈనాటికి ఎంతటి మార్పు!

## అధ్యాయం 11
# అదనపు విలువ రేటూ, అదనపు విలువ మొత్తమూ

అదనపు విలువరేటు తెలియాలంటే మొదట అదనపువిలువ మొత్తం ఎంతో తెలియాలి. అదనపు విలువ మొత్తం లెక్కగట్టాలంటే తెలియాల్సిన అంశాలు:

1. పనిదినం పొడవు.
2. పనిదినం విభజన (అవసర శ్రమ కాలం + అదనపు శ్రమ కాలం)
3. గంటకి ఉత్పత్తయ్యే విలువ
4. శ్రమశక్తుల విలువ (అస్థిర పెట్టుబడి)

పనిదినం పొడవు 10 గంటలు. అందులో 5 గంటలు అవసర శ్రమకాలం కాగా, మరో 5 గంటలు అదనపు శ్రమ కాలం. శ్రమశక్తుల విలువ 50 X 400 = 20,000. ఈ విలువ అవసర శ్రమ కాలంలో ఉత్పత్తి అవుతుంది. అంటే, గంటకి 20,000/5 = 4,000. అదనపు శ్రమ కాలం 5 గంటలు. ఆకాలంలో ఉత్పత్తయ్యే విలువ 4,000X5 = 20,000. పనిదినం 10 గంటల్లో ఉత్పత్తయిన విలువ మొత్తం రూ. 40,000.

శ్రమ సృజించిన విలువ = శ్రమశక్తి విలువ + అదనపు విలువ

### శ్రమశక్తి విలువా- అదనపు విలువా

అవసరశ్రమ కాలంలో ఉత్పత్తయిన విలువ శ్రమశక్తి విలువ. అదనపు శ్రమ కాలంలో ఉత్పత్తయిన విలువ అదనపు విలువ. దీన్ని బట్టి అదనపు విలువ = శ్రమశక్తి ఉత్పత్తి చేసిన విలువ - శ్రమశక్తి విలువ

ఉదాహరణకి, శ్రమశక్తి ఉత్పత్తిచేసిన విలువ 40,000 రూపాయలు అనుకుందాం. ఒక శ్రమశక్తి విలువ 400 రూపాయల చొప్పున 50 శ్రమశక్తుల విలువ 20,000 అనికూడా అనుకుందాం. అప్పుడు అదనపు విలువ మొత్తం = 40,000 - 20,000 = రూ 20,000

### అదనపు విలువ రేటు

అదనపు విలువ రేటు తేల్చాలంటే, అదనపు విలువ మొత్తం ఎంతో తెలిస్తేనే చాలదు. అదనపు విలువ ఏ అంశం నుంచి ఏర్పడుతుందో, ఆ అంశం మొత్తం ఎంతో కూడా తెలియాలి. అది శ్రమశక్తుల విలువ, అస్థిర పెట్టుబడి. అంటే: ఒక పెట్టుబడిదారుడు ఒకే కాలంలో నియోగించే శ్రమశక్తుల (శ్రామికుల) కిచ్చే విలువ మొత్తం.

అస్థిర పెట్టుబడి = 1 శ్రమశక్తి విలువ X కొన్న శ్రమ శక్తుల సంఖ్య (n)

పై ఉదాహరణలో అస్థిర పెట్టుబడి = 400 X 50 = 20,000 రూపాయలు

అదనపు విలువ మొత్తం = 40,000-20,000 = 20,000 రూపాయలు

అదనపు విలువ మొత్తానికీ, శ్రమశక్తుల విలువ మొత్తానికీ (అంటే అస్థిర పెట్టుబడికీ) ఉండే నిష్పత్తే అదనపువిలువ రేటు. 20,000:20,000. 20,000/20,000 X 100 =100. ఇక్కడ అదనపువిలువ రేటు 100 శాతం. ఈ విషయం గురించి 9 వ అధ్యాయం (అదనపు విలువ రేటు) లో వివరంగా ఉంటుంది.

**అదనపు విలువ మొత్తానికి సంబంధించిన అంశాలు:** అదనపు విలువ రేటు, అస్థిర పెట్టుబడి మొత్తం. అదనపు విలువ రేటు 100 శాతం అయితే, 20,000 అస్థిర పెట్టుబడికి వచ్చే అదనపు విలువ మొత్తం 20,000 రూపాయలు.

## ఒక అంశం తగ్గినా, మరొక అంశం పెరిగి సరిపోవచ్చు

అదనపు విలువ మొత్తానికి సంబంధించిన అంశాల్లో ఒక అంశం పరిమాణం తగ్గినా, మరొక అంశం పరిమాణం అదే నిష్పత్తిలో పెరిగి అదనపు విలువ మొత్తం అంతే ఉండవచ్చు. అస్థిర పెట్టుబడి తగ్గినా, అదేనిష్పత్తిలో అదనపు విలువ రేటు పెరిగితే, అదనపు విలువ మొత్తం మారకుండా అలానే ఉంటుంది.

1. అస్థిర పెట్టుబడి సగానికి అంటే 10,000 రూపాయలకు తగ్గినా, అదనపు విలువ రేటు రెట్టింపై అంటే, 200 శాతానికి పెరిగితే, అప్పుడు కూడా 20,000 రూపాయల అదనపు విలువే వస్తుంది.

2. అలాకాకుండా, అదనపు విలువ రేటు సగానికి అంటే 50 శాతానికి తగ్గినా, అస్థిర పెట్టుబడి రెట్టింపైతే, అంటే, 40,000 రూపాయలకి పెరిగితే, అప్పుడు కూడా 20,000 రూపాయల అదనపు విలువే వస్తుంది.

శ్రామికుల సంఖ్యతగ్గినా, అస్థిరపెట్టుబడి తగ్గినా అదనపు విలువ మొత్తం తగ్గుతుంది. ఈ తగ్గిన అదనపు విలువని పనిదినాన్ని పొడిగించడం ద్వారానో, అదనపు విలువ రేటు పెంచడం ద్వారానో భర్తీ చెయ్యవచ్చు.

**ఆ తగ్గిన మొత్తం ఎంతయినా భర్తీ చెయ్యవచ్చా? అంటే కుదరదు.** దీనికి హద్దులున్నాయి. అవి అధిగమించరానివి. పనిదినాన్ని 24 గంటలకన్నా పొడిగించడం సాధ్యమవదు కదా! అతను రోజులో ఏర్పరచే విలువ 24 గంటల లోపు ఉత్పత్తి చేసే విలువే. మన ఉదాహరణలో 50 మంది పనివాళ్ళకి పెట్టిన అస్థిర పెట్టుబడి 20,000 రూపాయలు. పనిదినం 10 గంటలు. అందులో అవసర శ్రమకాలం 5 గంటలు. అదనపు శ్రమకాలం 5 గంటలు. కనుక అదనపు విలువ రేటు 100 శాతం. దీని ప్రకారం రోజుకి 20,000 రూపాయల అదనపు విలువ వస్తుంది.

రోజు పనిగంటలు 15. అవసర శ్రమ కాలం 5 గంటలు + అదనపు శ్రమకాలం 10 గంటలు. అప్పుడు అదనపు విలువ రేటు 200%. అదనపు విలువ మొత్తం 40,000 రూపాయలు. 24 గంటలూ పనిచేయించినా, అవసర శ్రమ కాలం 5 గంటలు + అదనపు శ్రమకాలం 19 గంటలు. అప్పుడు అదనపు విలువ రేటు 380%. అవసర శ్రమ కాలం 1 గంటన్నా ఉండక తప్పదు. కనక అదనపు విలువ రేటుని పరిమితులు దాటి పెంచడం సాధ్యం

కాదు. కార్మికుల సంఖ్యలో తగ్గుదలని దోపిడీ స్థాయిని పెంచడం ద్వారా భర్తీ చేయడానికి ఒక పరిమితి ఉంటుంది. శ్రామికుల సంఖ్య తగ్గినా, అదనపువిలువ రేటు పెంచడం ఈ పరిమితుల లోపలే సాధ్యమవుతుంది. పరిమితులు దాటితే సాధ్యం కాదు. ఈ విషయం తేలిగ్గా తెలిసేదే.

## ఇక పెట్టుబడి దారుల ధోరణులు

1. వీలైనంత తక్కువమంది పనివాళ్ళని పెట్టాలి
2. వీలైనంత ఎక్కువ అదనపు విలువ లాగాలి

ఇవి రెండూ పరస్పర విరుద్ధ ధోరణులు

ఎక్కువ అదనపువిలువ లాగాలంటే, ఎక్కువమందిని పెట్టాలి. అయితే అతనికి తక్కువ మందిని పెట్టుకోవాలని ఉంటుంది. ఈ రెండు పోకడలూ ఒకదానితో ఒకటి పొసగనివి అనేది స్పష్టమే.

### అదనపువిలువ మొత్తం ఉత్పత్తిని రెండు అంశాలు నిర్ణయిస్తాయి:

1. అదనపువిలువ రేటు
2. పెట్టిన అస్థిర పెట్టుబడి.

అస్థిర పెట్టుబడి స్థిరంగా అలాగే ఉన్నప్పుడు, అదనపు విలువ రేటు పెరిగితే అదనపు విలువ మొత్తం పెరుగుతుంది. అదనపు విలువ రేటు తగ్గితే, అదనపు విలువ మొత్తం తగ్గుతుంది. అదనపు విలువ రేటు స్థిరంగా అలాగే ఉన్నప్పుడు, అస్థిర పెట్టుబడి పెరిగితే అదనపు విలువ మొత్తం పెరుగుతుంది. అస్థిర పెట్టుబడి తగ్గితే, అదనపు విలువ మొత్తం తగ్గుతుంది.

అందువల్ల శ్రమశక్తి విలువా, దోపిడీ స్థాయీ మారకుండా ఉంటే, అదనపు విలువ మొత్తాలు ఆయా అస్థిర భాగాలకు అనుగుణంగా ఉంటాయి.

## ప్రతి డబ్బు మొత్తం పెట్టుబడిలోకి మార్చబడజాలదు

డబ్బు పెట్టుబడిగా పరివర్తన చెందాలంటే, వ్యక్తి చేతిలో కొంత కనీస మొత్తం డబ్బు ఉండాలి. అస్థిర పెట్టుబడి కనీస పరిమితి : అదనపు విలువ ఉత్పత్తికోసం ఏడాదిపాటు రేబవళ్ళూ ఒక శ్రమ శక్తిని నియమించడానికి కావలసిన శ్రమ శక్తి ధర.

## పని చెయ్యకుండా, శ్రామికుని లాగా బతికే వ్యక్తి

ఒకవేళ ఈ శ్రామికుడికి సొంత ఉత్పత్తి సాధనాలు ఉండి, ఒక శ్రామికుని లాగానే బతకితే చాలు అనుకుంటే, అతని జీవితావసర వస్తువుల పునరుత్పత్తికి పట్టే కాలాన్ని మించి పని చెయ్యక్కరలేదు. అందుకు రోజులో 8 గంటలు పడితే, ఆ 8 గంటలు పనిచేస్తే సరిపోతుంది. అంతే కాదు. ఆ 8 గంటల పనికీ కావలసిన ఉత్పత్తిసాధనాలు ఉంటే చాలు.

మరొకవైపు, 8 గంటలకు తోడు, 4 గంటలు అదనపుపనిచేయించే పెట్టుబడిదారుడికి అదనంగా ఉత్పత్తి సాధనాలు కావాలి. వాటికి మరింత డబ్బు కావాలి. పైన అనుకున్న ప్రకారం అయితే, పెట్టుబడిదారుడు అదనపు విలువతో శ్రామికుని స్థాయిలో బతకడానికి ఇద్దరు పనివాళ్ళని

పెట్టుకోవాలి. ఎందుకంటే, కార్మికుడు బతకడానికి 8 గంటల పని అవసరం. పెట్టుబడి దారుడు అతని లాగే బతకడానికి 8 గంటల పని అవసరం. ఒక పనివాడు ఇచ్చే అదనపు శ్రమ 4 గంటలు. కనుక అదనపు విలువతో బతకాలంటే అతను ఇద్దరిని పెట్టుకోవాలి. ఈ సందర్భంలో అతని లక్ష్యం తన పోషణ మాత్రమే, సంపదపెంచుకోవడం కాదు; అయితే పెట్టుబడిదారీ ఉత్పత్తి లక్ష్యం సంపద పెంపే. అతను శ్రామికునికన్న రెండింతలు మెరుగ్గా బతకుతూ, వచ్చే అదనపు విలువలో సగం పెట్టుబడిలోకి చేర్చాలంటే, శ్రామికుల సంఖ్యతో పాటు కనీస పెట్టుబడిని 8 రెట్లు చెయ్యాల్సి ఉంటుంది.

## చిన్న యజమాని

తన పనివాడిలాగే, అతనుకూడా ఉత్పత్తిప్రక్రియలో నేరుగా పాల్గొనవచ్చు. అయితే అప్పుడతను పెట్టుబడిదారుడికీ కార్మికుడికీ మధ్య హైబ్రిడ్– అంటే చిన్న యజమాని – అవుతాడు. అతను తన పూర్తి సమయాన్ని పెట్టుబడి దారుడుగా ఖర్చు పెట్టాల్సిన దశ ఒకటి వస్తుంది. అప్పుడిక తన కార్మికుడిలాగా ఉత్పత్తిలో ఉండడు. కార్మికుల శ్రమని అదుపు చేసి ఉత్పాదితాన్ని సొంతం చేసుకోడానికీ, అమ్ముకోడానికీ తన పూర్తి సమయాన్ని కేటాయించాల్సి వస్తుంది.

## వృత్తి యజమాని

అందువల్ల మధ్య యుగాల గిల్డులు (వృత్తిసంఘాలు) ఒక యజమాని తక్కువమంది శ్రామికులని మాత్రమే నియమించుకోగలిగేట్లు నియమం పెట్టాయి. తద్వారా వృత్తి యజమాని పెట్టుబడిదారుడిగా మారడాన్ని బలవంతంగా నిరోధించాయి.

## పెట్టుబడిదారుడు

మధ్యయుగాల్లో పెట్టిన గరిష్టమొత్తం కంటే చాలా ఎక్కువ పెట్టగలిగిన సందర్భాలలోనే, డబ్బున్నవాడు పెట్టుబడి దారుడిగా అవగలడు. ఇతను అడ్వాన్స్ చేసే కనిష్ట మొత్తం వృత్తియజమాని పెట్టే గరిష్టమొత్తం కంటే ఎంతో ఎక్కువ వుంటుంది. భిన్న ఉత్పత్తి రంగాలలో వాటివాటి ప్రత్యేక, సాంకేతిక పరిస్థితులకు తగినట్లుగా 'కనీస పెట్టుబడి విలువ' వుంటుంది.

**కేవలం పరిమాణాత్మక తేడాలు ఒకస్థాయి దాటితే**

**గుణాత్మక మార్పులు అవుతాయని హెగెల్ చెప్పిన నియమం ఇక్కడ రుజువైంది.**

**– అంటాడు మార్క్స్.**

## పెట్టుబడి ఒక బలవంతపు సంబంధంగా అభివృద్ధి

ఇప్పటిదాకా తెలుసుకున్న దాన్నిబట్టి, ఉత్పత్తి ప్రక్రియలో శ్రమ మీద పెట్టుబడి ఆధిపత్యం సాధించింది. కార్మికుడు క్రమబద్ధంగా శ్రమ చేసేట్లు పెట్టుబడిదారుడు శ్రద్ధ పెడతాడు. తగినంత తీవ్రతతో పనిచేసేట్లు జాగ్రత్త వహిస్తాడు.

పెట్టుబడి బలవంతపు సంబంధంగా అభివృద్ధి అయింది. ఆ సంబంధం కార్మిక వర్గాన్ని తన కొద్దిపాటి జీవితావసరాలకోసం చేసే పనిని మించి పని చేసేట్లు ఒత్తిడి పెడుతుంది. అదనపు విలువని తోడేదిగా, శ్రమశక్తిని దోచేదిగా ఆ సంబంధం ప్రత్యక్ష, నిర్బంధ శ్రమమీద

ఆధారపడింది. ఇది శక్తిలోనూ, హద్దులు మీరడంలోనూ, దేన్నీ లక్ష్యపెట్టక పోవడంలోనూ, నిర్దయలోనూ అంతకుముందు నిర్బంధశ్రమ మీద ఆధారపడిన వ్యవస్థలన్నిటినీ అధిగమించింది.

మొదట, చరిత్రలో అప్పటివరకూ శ్రమ కొనసాగించబడిన సాంకేతిక పరిస్థితులని బట్టి పెట్టుబడి శ్రమని లోబరుచుకుంటుంది. అందువల్ల అది ఉత్పత్తి విధానాన్ని వెంటనే మార్చదు. ఇంతదాకా మనం పరిశీలించిన రూపంలో, పనిదినాన్ని పొడిగించడం ద్వారా అదనపువిలువ ఉత్పత్తి, ఉత్పత్తి విధానంలో మార్పులేకుండానే స్వతంత్రమైనదని రుజువయింది.

## సాదా శ్రమ ప్రక్రియగా చూస్తే

ఉత్పత్తి ప్రక్రియని సాదా శ్రమ ప్రక్రియ అనుకొని చూస్తే, అప్పుడు సొంత ఉత్పత్తి సాధనాలతో సొంత శ్రమతో జరిగే సరుకు ఉత్పత్తి అది. ఉత్పత్తి సాధనాలు అతనివే, శ్రమఫలం అతనిదే. ఈ ఉత్పత్తిలో దోపిడీ అనేది ఉండదు.

## అదనపు విలువని ఉత్పత్తిచేసే ప్రక్రియగా చూస్తే

భిన్నంగా ఉంటుంది. ఉత్పత్తి సాధనాలు ఇతరుల శ్రమను పీల్చే సాధనాలుగా మారిపోతాయి. ఇక ఉత్పత్తి సాధనాలని వినియోగించేది కార్మికుడు కాదు, ఆ ఉత్పత్తి సాధనాలే కార్మికుణ్ణి వినియోగిస్తాయి. పెట్టినదానికి అదనపువిలువ కలుస్తూ ఉంటుంది. అదనపు విలువ ఎంత స్థాయిలో కలుస్తుంటే పెట్టుబడి అంతగా వృద్ధి అవుతుంది.

## అదనపు విలువరేటు ఇంకా ఇంకా పెరగాలి

అదనపు విలువ రేటు ఏ స్థాయికి పెరిగినా అది పెట్టుబడికి చాలదు. పెట్టుబడి దారుడిని తృప్తి పరచలేదు. రేటు ఇంకా పెరగాలి. దానికి పరిమితంటూ ఎప్పటికీ లేదు. ఉండదు. అయితే అపరిమితంగా పెంచుకోడానికి ఆటంకాలున్నాయి.

1. పనిదినాన్ని ఒక పరిమితిదాటి పొడిగించడం కుదరదు. పైగా తగ్గించమని శ్రామికవర్గం పోరాటం కొనసాగిస్తూనే ఉంటుంది. ఫలితంగా తగ్గిస్తూ చట్టాలు వచ్చాయి. అందువల్ల పనిదినాన్ని పొడిగించడం ద్వారా - అంటే పనిగంటలు పెంచడం ద్వారా - అదనపు విలువని పెంచడం వీలుకాదు.
2. శ్రమ తీవ్రత పెంచితే శ్రమ కాలాన్ని పెంచిన ఫలితమే వస్తుంది. అయితే శ్రామికులతో ఘర్షణ ఏర్పడుతుంది.
3. శ్రామికులని పెంచితే అదనపు విలువ పెరిగేది నిజమే. కాని పెట్టుబడిదారులు శ్రామికులని పెంచకుండా, తగ్గించి కూడా అదనపువిలువ పెంచుకోవాలనుకుంటారు. అనుకోవడమే కాదు సాధిస్తున్నారు కూడా.

అంటే పై నియమానికి అనుభవం విరుద్ధంగా ఉంది.

## ఈ వైరుధ్యానికి పరిష్కారం

వాస్తవాన్ని బట్టి, శ్రామికుల సంఖ్యా, పనిదినం పొడవూ స్థిరంగా ఉన్నప్పటికీ అదనపు విలువ పెరిగే మార్గం ఉండి ఉండాలి. ఏదో కొత్త అంశం దీన్ని సాధ్యం చేస్తుందన్నమాట.

ఆ అంశాన్ని ఇంతదాకా ఈ మూడో భాగం ముగిసేదాకా మార్క్స్ పరిశీలించలేదు. అందుకే అంటాడు:

అయితే ఉత్పత్తి ప్రక్రియని **అదనపు విలువని ఉత్పత్తిచేసే ప్రక్రియగా చూస్తే,** భిన్నంగా ఉంటుంది– అని.

దీన్ని బట్టి పనిదినం పొడవు స్థిరంగా వుంటే, శ్రామికుల సంఖ్య పెంచడం ద్వారా మాత్రమే అదనపు విలువమొత్తం పెరగగలదు – అనే సూత్రం ఇప్పటిదాకా పరిశీలించిన అదనపు విలువ రూపానికి మాత్రమే వర్తిస్తుంది.

***ఆ అంశాలు రెండూ స్థిరంగా ఉన్నా,***
***అదనపు విలువ ఎలా పెరుగుతుంది అనేదే సమస్య***

# భాగం 4

# సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తి

అధ్యాయం 12

# సాపేక్ష అదనపు విలువ భావన

మార్క్స్ ఇప్పటివరకూ అవసర శ్రమ భాగం స్థిరంగా ఉందనీ, మొత్తం పనిదినం మారుతున్నదనీ అనుకొని పరిశోధన సాగించాడు. కాపిటల్ లో 'పనిదినం' అనే 10వ అధ్యాయంలో పనిదినం మారుతుండడమే విషయం. అయితే, పనిదినాన్ని పెంచుతూ పోవడం కుదరదు. తగ్గించమని కార్మికవర్గం పోరాడుతుంటుంది. పోరాట తీవ్రతను బట్టి ప్రభుత్వాలు తగ్గిస్తూ చట్టాలు చేయాల్సి వస్తుంది. అలా వచ్చిందే 10 గంటల చట్టం. తర్వాత పనిదినం స్థిరంగా ఉంది. కనుక అదనపు విలువ పెరగకూడదు. కాని పెరుగుతూనే ఉంది. లాభాలు నిరంతరం పెంచుకోగలుగుతున్నారు. ఇది ఊహాత్మక విషయం కాదు. వాస్తవ పరిస్థితి.

10 గంటల పనిదినంలో 5 గంటలు అవసరశ్రమ కాలం అయితే, 5 గంటలు అదనపు శ్రమకాలం. సమస్య ఏమంటే: పనిదినాన్ని 10 గంటలు గానే ఉంచి, అదనపు శ్రమ కాలాన్ని 5 గంటలకంటే పెంచేదెలా? ఎలాగో తెలుసుకోవడం అంత 'సులభం కాదు' అంటాడు మార్క్స్.

## కార్మికుడికి వేతనం తగ్గించడం

పెట్టుబడిదారుడు కార్మికుడికి 400 రూపాయలు కాకుండా తగ్గించి 300 ఇస్తే 100 ఎక్కువ అదనపు విలువ వస్తుంది. ఆచరణలో ఈ పద్ధతి ప్రముఖ పాత్ర వహించేది నిజమే. అయినప్పటికీ, ఇక్కడ దీన్ని పట్టించుకోకుండా వదిలేస్తాడు. ఎందుకో చెబుతాడు. కాపిటల్ మొదటి సంపుటం అంతటా **శ్రమశక్తి పూర్తివిలువకే అమ్ముడవుతుంది అనుకొని** పరిశోధన కొనసాగిస్తాడు. వేతన తగ్గింపు అనే అంశాన్ని పరిగణించడు. కనుక వేతన తగ్గింపు ద్వారా అదనపు విలువ పెరుగుదలని వివరించకూడదు.

**సమస్య అలాగే ఉంది:** 1. వేతనాలుతగ్గించ కూడదు. 2. పనిగంటలు పెంచకూడదు. అయినా అదనపు విలువ పెరగాలి. ఇప్పటిదాకా పరిశీలించిన దాని ప్రకారం ఇది సాధ్యం కాదు. ప్రతిష్టంభన ఏర్పడింది. ఇతర ప్రతిష్టంభన పరిస్థితుల్లో అప్పటిదాకా పరిగణించని కొత్త అంశాన్ని చర్చలోకి తేవడం ద్వారా ప్రతిష్టంభన తొలుగుతుంది. ఇక్కడ కూడా అంతే.

## ఆ అంశమే ఉత్పాదకత

పనిదినం పెరగకుండా, అదనపు శ్రమ కాలం పెరగాలంటే అవసర శ్రమ కాలాన్ని తగ్గించడం తప్ప మరొక మార్గం లేదు. అవసర శ్రమకాలాన్ని ఎంత తగ్గిస్తే అదనపు శ్రమకాలం అంత పెరుగుతుంది. ఇది స్పష్టమే. శ్రమ శక్తి విలువ ఎంత అయితే, అంతా చెల్లించక తప్పదు. అయినా అవసర శ్రమకాలం తగ్గాలి. ఎలా సాధ్యం? అసలు శ్రమ శక్తి విలువే తగ్గితే తప్ప, ఇది సాధ్యం కాదు. శ్రమశక్తి విలువ అంటే శ్రామికుని జీవితావసర వస్తువుల విలువే కదా. అతను వాడే వస్తువుల విలువ తగ్గితే, తన శ్రమశక్తి విలువ పునరుత్పత్తికి, అతను వ్యయించే

కాలం తగ్గుతుంది. అంటే, అవసరశ్రమ కాలం తగ్గుతుంది. మన ఉదాహరణలో, 5 గంటల అవసర శ్రమ 4 గంటలకు తగ్గితే, ఆ తగ్గిన 1 గంట అదనపు శ్రమ కాలానికి కలుస్తుంది. అప్పుడు అదనపుశ్రమ 5 గంటల నుండి 6 గంటలకు పెరుగుతుంది.

ఇందుకు ఇప్పటిదాకా 5 గంటల్లో తయారయిన జీవనాధార వస్తువులు, ఇప్పుడు 4 గంటల్లో తయారు కావాలి.

అప్పటికున్న ఉత్పాదక శక్తికి ఆవస్తువులు తయారుచెయ్యడానికి ఇప్పుడైనా ఎప్పుడైనా 5 గంటలే పడుతుంది. ఇప్పుడు 4 గంటల్లో వాటిని ఉత్పత్తి చెయ్యాలంటే, ఉత్పాదకశక్తి పెరిగి తీరాలి. శ్రమ ఉత్పాదకతని పెంచడం అంటే, అంతే శ్రమకి ఎక్కువ వస్తువులు తయారుచేసే శక్తిని చేకూర్చడమే. సరుకు ఉత్పత్తికి సామాజికంగా అవసరమైన శ్రమ కాలాన్ని తగ్గించడమే. సరుకుల విలువని తగ్గించడమే, చౌక చెయ్యడమే.

### ఇందుకు పెట్టుబడిదారీ విధానం తన ఉత్పత్తివిధానాన్ని మార్చుకోవాలి

ఉదాహరణకి, ఒకడు అప్పటికున్న తన పరికరాలతో 10 గంటల పనిదినంలో ఒక జత బూట్లు తయారు చేస్తాడనుకుందాం. అంతే సమయంలో రెండు జతలు చెయ్యాలంటే, అతని ఉత్పాదక శక్తి రెట్టింపు అయి తీరాలి. అలా కావాలంటే, అతని పనిముట్లలోనో, పని విధానంలోనో, లేదా రెంటిలోనో మార్పురావాలి. ఫలితంగా ఉత్పత్తి విధానమే మారాలి. ఆ పద్ధతిలో మాత్రమే, అవసర శ్రమకాలాన్ని తగ్గించి, శ్రమ శక్తి విలువని తగ్గించడం, సాధ్యపడుతుంది. అన్యథా అసాధ్యం.

## పరమ అదనపు విలువ–సాపేక్ష అదనపు విలువ

పనిదినాన్ని పొడిగించడం ద్వారా ఏర్పడే అదనపువిలువని – పరమ అదనపు విలువ అంటాను. అవసర శ్రమకాలాన్ని తగ్గించడం ద్వారా ఉత్పత్తయ్యే అదనపువిలువని – సాపేక్ష అదనపు విలువ అంటాను.

a ————————————b————————————c

పనిదినం a-c. అందులో a-b అవసర శ్రమ కాలం. b-c అదనపు శ్రమ కాలం. b-c లో ఉత్పత్తయ్యేది అదనపువిలువ. కాబట్టి b-c ని పొడిగిస్తే అదనపు విలువ పెరుగుతుంది. ఇది స్పష్టమే.

a ————————————b——————————————————c

మొదటి సందర్భంలో పనిదినం 10 గంటలు. అందులో 5 గంటలు అవసర శ్రమకాలం, 5 గంటలు అదనపు శ్రమకాలం.

రెండో సందర్భంలో పనిదినం 12 గంటలు. అందులో 5 గంటలు అవసర శ్రమకాలం, 7 గంటలు అదనపు శ్రమకాలం. అదనపు శ్రమ కాలం 2 గంటలు పెరిగింది. దానికి తగినట్లుగా అదనపు విలువ పెరుగుతుంది. రెండో సందర్భంలో పని దినం పొడవులో మార్పులేదు. కాని అవసర శ్రమ కాలం తగ్గింది. ఎంత తగ్గిందో అంత అదనపు శ్రమకాలం పెరిగింది.

a ——————-b——————————————-c

ఫలితంగా అదనపు విలువ పెరుగుతుంది. ఈ పెరుగుదల పనిదినాన్ని పొడిగించినందువల్ల వచ్చింది కాదు. అవసర శ్రమకాలాన్ని తగ్గించడం వల్ల వచ్చింది. ఆ విధంగా వచ్చే అదనపువిలువని మార్క్స్ - సాపేక్ష అదనపు విలువ అన్నాడు.

## ఉత్పాదకశక్తి పెరగడమే పరిష్కారం

శ్రామికుల జీవనాధార సాధనాలు - ఆహారపదార్థాలు, బట్టలు చెప్పులు వగయిరా- ఉత్పత్తయ్యే పరిశ్రమల్లో ఉత్పాదకత పెరిగితే అవి చౌక బడతాయి. దానికి తగినట్లు శ్రమశక్తి విలువ తగ్గుతుంది.

## సాంకేతిక ఆవిష్కరణల కోసం పెట్టుబడి దారుడుకి ప్రేరణ

సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తి చెయ్యడానికి వ్యష్టి ఉత్పత్తిదారులు ప్రేరణ పొందుతారు. పోటీ పడి, అవసర శ్రమకాలం తగ్గించ గలిగితే ఆ పెట్టుబడిదారుడికి పోటీ దారులకన్నా సరుకు విలువ తగ్గుతుంది. అంటే సామాజిక విలువకన్నా అతనికి తక్కువ పడుతుంది. తోటి వాళ్ళకన్నా 20 శాతం చౌకగా ఉత్పత్తిచేశాడనుకుందాం. అంటే, వ్యష్టి విలువ సామాజిక విలువకన్నా తక్కువవుతుంది. అయినా అది సామాజిక విలువకే అమ్ముడవుతుంది. ఫలితంగా అతను అందరికన్నా మరింత అదనపు విలువ లాగుతాడు. ఇందుకోసం అతను ఉత్పాదకతను పెంచాలి.

ఉత్పాదకత పెరగాలంటే కొత్త శ్రమ సాధనాలు పెట్టాలి. ఉత్పాదకతను పెంచి, సాపేక్ష అదనపు విలువని ఎక్కువగా పొందడమే సాధనాలను మెరుగుపరచడానికి ప్రేరణ.

పోటీ ఉద్దేశం. పెట్టుబడిదారుడిసొంత ఉద్దేశ్యం కాదు. అతను పెట్టుబడి పోటీ నియమాలకు ఆవిధంగా లొంగిపోతాడు. 50 రూపాయల్లో ఒక గంట శ్రమ రూపొంది ఉంటే, 12 గంటల పనిదినంలో 600 రూపాయల విలువ ఉత్పత్తవుతుంది. అప్పటికున్న ఉత్పాదకతతో ఆ 12 గంటల్లో 12 వస్తువులు తయారయ్యాయనుకుందాం. ఒక్కొకదానికి వాడిన ఉత్పత్తిసాధనాల విలువ 50 రూపాయలనుకుందాం. ఈ పరిస్థితుల్లో ఒక వస్తువు 100 రూపాయలవుతుంది : శ్రమసాధనాల విలువ 50 రూపాయలూ, ఆశ్రమసాధనాలతో పనిచేసినందువల్ల కొత్తగా కలిసిన విలువ 50 రూపాయలూ. వెరసి 100 రూపాయలు.

ఉత్పాదకతలో మార్పు రానప్పటి పరిస్థితి అది. ఉత్పాదకతలో మార్పు వచ్చాక పరిస్థితి చూద్దాం.

ఒక పెట్టుబడిదారుడు శ్రమ ఉత్పాదకతని రెట్టింపు చేసి, 12 గంటలలో 12 ఉరువులకి బదులు 24 చేశాడనుకుందాం. ఉత్పత్తి సాధనాల విలువ మారకుండా అలాగే ఉంటే, ఒక్కో వస్తువు విలువ 75 రూపాయలకు తగ్గుతుంది. అయితే ఉత్పాదకత పెంచని మిగిలిన పెట్టుబడి దారులకి ఒక్కో వస్తువు 100 రూపాయలుగానే ఉంటుంది. మన పెట్టుబడిదారుడు కూడా వాళ్ళలాగే 100 రూపాయలకు అమ్ముతాడు. అతనికి 25 రూపాయలు ఎక్కువ వస్తాయి.

## వ్యష్టి విలువ–సామాజిక విలువ

ఇప్పుడు ఈ వస్తువు సామాజిక విలువ 100. మన పెట్టుబడిదారుడి వస్తువు విలువ 75. ఇది వ్యష్టి విలువ. సామాజిక విలువ కన్నా వ్యష్టి విలువ తక్కువ ఉంది. ఏమైనప్పటికీ సరుకు నిజమైన విలువ వ్యష్టి విలువ కాదు, సామాజిక విలువ. అంటే, నిజ విలువని కొలిచేది దేనికదిగా ప్రతి వస్తువుకీ పట్టిన శ్రమ కాలంతో కాదు, దాని ఉత్పత్తికి సామాజికంగా అవసరమైన శ్రమ కాలంతో.

## అధిక అదనపు విలువ (extra surplus-value)

కాబట్టి, కొత్త పద్ధతిలో ఉత్పత్తిచేసే పెట్టుబడిదారుడు సామాజిక విలువ 100 రూపాయలకు అమ్ముతాడు. అది వ్యష్టి విలువకంటే 25 రూపాయలు ఎక్కువ. ఆవిధంగా అతను ఇతర ఉత్పత్తి దారులకంటే 25 రూపాయలు ఎక్కువ అదనపు విలువ పొందుతాడు. దీన్ని మార్క్స్ **అధిక అదనపు విలువ** అన్నాడు. పెట్టుబడి దారులు కొత్త పద్ధతులు ప్రవేశ పెట్టేది అధిక అదనపు విలువ కోసమే. అధిక అదనపు విలువ కావాలనుకుంటే, కొత్తపద్ధతులు ప్రవేశ పెట్టక తప్పదు.

## అతనికొక సమస్య వస్తుంది

ఏమంటే అతను ఎక్కువ ఉత్పత్తి చేస్తాడు. అదంతా అమ్ముడవాలి. ఇంతకుముందు 12 గంటలలో 12 వస్తువులు తయారయితే, ఇప్పుడు 24 తయారవుతున్నాయి. వాటన్నిటిని అమ్మాలంటే, మార్కెట్ విస్తరించాలి. ఒకవేళ విస్తరించకుండా, అంతకు ముందులాగే ఉంటే, వాటిని అమ్మడానికి ధర తగ్గించాలి. అందువల్ల వ్యష్టి విలువకంటే ఎక్కువకు, సామాజిక విలువ కంటే తక్కువకు అమ్ముతాడు. 90 రూపాయలకు అనుకుందాం. ఇతరులు 100 రూపాయలకి అమ్ముతుంటారు. ఇతను 10 రూపాయలు తగ్గించి అమ్మినా కూడా వాళ్లకన్నా ప్రతి ఉరువు మీదా 15 రూపాయలు అదనపు విలువని అధికంగా పొందుతాడు. అందువల్ల ప్రతి వ్యష్టి పెట్టుబడి దారుడికీ శ్రమ ఉత్పాదకతని పెంచి, తన సరుకుల్ని చౌక బరచాలనే ప్రేరణ ఉంటుంది. అధిక అదనపువిలువ పట్ల ఆకర్షణ ఉంటుంది.

## అధిక అదనపు విలువ తాత్కాలికమే, శాశ్వతం కాదు

ఈ అధిక అదనపు విలువ తాత్కాలికమైనదే. దీన్ని కొత్త ఉత్పత్తి పద్ధతి ప్రవేశ పెట్టిన వాళ్ళు మాత్రమే పొందుతారు. మిగిలిన ఉత్పత్తి దారులు కూడా అదే పద్ధతికి మళ్ళుతారు. మళ్ళగానే అది ఎంత మాత్రమూ ఉండదు. పాత పద్ధతినే కొనసాగిస్తే తమ ఉత్పత్తుల్ని అమ్మలేక పోవచ్చు. పోటీలో దెబ్బ తినవచ్చు. అందువల్ల పోటీలో నిలబడాలంటే వాళ్ళుకూడా కొత్తపద్ధతుల్ని అనుసరించక తప్పదు. కాబట్టి ఎవరి అధిక అదనపు విలువైనా తాత్కాలికమే. అయితే

## ఈ అధిక అదనపు విలువకి వనరు ఏది? ఇదెలా వస్తుంది?

అవసర శ్రమని తగ్గించడం వల్లనే అధిక అదనపు విలువ వస్తుంది. అంటే సాపేక్ష అదనపు విలువ ఎలాగో అలాగే. అయితే, అధిక అదనపు విలువ విషయానికొస్తే, కొత్త పద్ధతి పెట్టిన

సంస్థ ఇతర సంస్థల కంటే ఎక్కువ విలువని ఉత్పత్తి చెయ్యడం వల్ల వస్తుంది. కాబట్టి "ఉత్పత్తి సాధనాలలో నిరంతరం విప్లవం తేకుండా బూర్జువా వర్గం మనలేదు" - ప్రణాళిక. పే 36 1989. -ప్రగతి ప్రచురణాలయం

"బూర్జువా వర్గం యింకా నూరెండ్లయినా నిండని తన పరిపాలనాకాలంలో గడచిన తరాల మానవులందరూ కలిసి సృష్టించిన ఉత్పాదక శక్తుల కంటే విస్తారమైన, బ్రహ్మాండమైన ఉత్పాదక శక్తుల్ని సృష్టించింది."- ప్రణాళిక. పే 38

## సరుకుల విలువా, ఉత్పాదకతా

పెట్టుబడిదారుల ఆసక్తి అంతా ఉత్పాదితాల విలువ అంశం గురించే. అయినాగాని వాళ్ళు వాళ్ళ సరుకుల విలువల్ని ఎప్పటికప్పుడు నిరంతరం తగ్గించే ప్రయత్నం చేస్తుంటారు. ఒక పెట్టుబడిదారుడు మెరుగైన యంత్రాలని పెట్టడంలో ఉద్దేశం తరచుగా పోటీదారులకంటే సరుకులు చౌకగా అమ్ముకోవడమూ, లాభాలు పెంచుకోడానికి ఉత్పత్తిని విస్తరింప చెయ్యడమూ. ఏదైనా, మెరుగైన యంత్రాల వల్ల కలిగే ప్రయోజనాలన్నిటినీ తానే పొంది, శ్రామికుణ్ణి ఉన్నచోటే ఉంచుతాడు. ఆవిధంగా యంత్రాలు పెట్టుబడి దారుడికీ, కార్మికుడికీ మధ్య ఉండే దూరాన్ని పెంచుతాయి.

**శ్రమ ఉత్పాదకత పెరిగితే, సరుకుల విలువ తగ్గుతుంది. అది తగ్గితే, ఇది పెరుగుతుంది.** అంటే సరుకులవిలువ శ్రమ ఉత్పాదకతకి విలోమ నిష్పత్తిలో ఉంటుంది. శ్రమశక్తి విలువ సరుకుల విలువలను బట్టి ఉంటుంది. కనుక శ్రమశక్తి విలువ కూడా శ్రమ ఉత్పాదకతకి విలోమ నిష్పత్తిలో ఉంటుంది. అంటే శ్రమ ఉత్పాదకత పెరిగితే, శ్రమశక్తి విలువ తగ్గుతుంది; శ్రమ ఉత్పాదకత తగ్గితే శ్రమశక్తి విలువ పెరుగుతుంది. ఇందుకు భిన్నంగా, సాపేక్ష అదనపు విలువ శ్రమ ఉత్పాదకతకి అనులోమంగా ఉంటుంది. ఉత్పాదకతను బట్టి పెరుగుతూ, తగ్గుతూ ఉంటుంది.

### ఇక్కడ రెండు విషయాలు స్పష్టం అవుతున్నాయి

1. సరుకులు చౌక బడడం అంటే శ్రామికుడు చౌక బడడమే
2. అందువల్ల శ్రమ ఉత్పాదకతని పెంచే పోకడ పెట్టుబడిలోనే అంతర్గతంగా ఉంటుంది

## సరుకుల విలువ తగ్గినా, అదనపు విలువ పెరగవచ్చు

పెట్టుబడిదారుడికి సరుకు విలువ పట్ల ఆసక్తి ఉండదు. దానిలో ఇమిడివుండి, అమ్మకంద్వారా చేతికందే అదనపు విలువ పట్ల మాత్రమే అతనికి ఆసక్తి. అదనపువిలువతో పాటు తాను పెట్టిన విలువకూడా తిరిగి వస్తుంది. ఇప్పుడు శ్రమఉత్పాదకత వృద్ధికి అనుగుణంగా సాపేక్ష అదనపు విలువ పెరుగుతుంది; మరొకపక్క, అదే నిష్పత్తిలో సరుకుల విలువ కూడా పడిపోతుంది. ఒకే ప్రక్రియ సరుకులని చౌకపరుస్తుంది, వాటిలో ఉన్న అదనపు విలువని పెంచుతుంది.

## క్వేస్నే చిక్కు ప్రశ్నకి జవాబు

మారకం విలువని ఉత్పత్తి చెయ్యడానికి మాత్రమే శ్రద్ధ పెట్టే పెట్టుబడిదారుడు, సరుకుల

మారకంవిలువని నిరంతరం తగ్గించేందుకు ఎందుకు ప్రయత్నిస్తాడు? రాజకీయ అర్థ శాస్త్ర నిర్మాతల్లో ఒకడైన క్వెస్నే ఈ ప్రశ్నవేసి తన ప్రత్యర్థుల్ని వేధించేవాడు. వాళ్ళు సమాధానం చేప్పలేక పోయేవారు.

పెట్టుబడిదారీ ఉత్పత్తి లక్ష్యం పనిదినం పొడవుని తగ్గించడం కాదు. నిర్దిష్ట పరిమాణంలో వున్న సరుకుల్ని ఉత్పత్తి చెయ్యడానికి అవసరమయ్యే శ్రమ కాలాన్ని తగ్గించడం. శ్రామికుని ఉత్పాదకత పెరిగినప్పుడు, అతను అంతకు ముందు కన్నా పదింతల సరుకులు ఉత్పత్తి చేస్తాడు; ఒక్కొక సరుకులో పదోవంతు శ్రమకాలాన్నే వ్యయిస్తాడు.

ఈ వాస్తవం అంతకు ముందులాగే 12 గంటల శ్రమ చెయ్యకుండా అతన్ని ఆటంక పరచదు. ఆ 12 గంటల్లో మునుపటి 120 వస్తువుల స్థానంలో ఇప్పుడు 1200 వస్తువులు చెయ్యకుండా నిరోధించదు. పెట్టుబడిదారీ ఉత్పత్తిలో శ్రమ ఉత్పాదకత పెంచడంలో ఉద్దేశం అవసర శ్రమ కాలాన్ని తగ్గించి, అదనపు శ్రమ కాలాన్ని పెంచడమే, అంటే పెట్టుబడి దారుడికి ఉచితంగా దక్కే శ్రమ కాలాన్ని పెంచడమే. ఇదే ఫలితాన్ని సరుకుల్ని చౌక పరచకుండానే ఎంతవరకూ సాధించవచ్చో ముందు అధ్యాయాల్లో, సాపేక్ష అదనపు విలువని ఉత్పత్తి చేసే ప్రత్యేక పద్ధతుల్ని పరిశీలించేటప్పుడు తెలుస్తుంది.

# అధ్యాయం 13
# సహకారం

కొద్దిమంది పనివాళ్ళని పెట్టుకొని, బతకటానికి తానుకూడా వాళ్ళతో పాటు పనిచేసే వాడు కచ్చితమైన అర్థంలో పెట్టుబడిదారుడు కాదు, 'చిన్న యజమాని'. ఎక్కువమంది శ్రామికుల్ని పెట్టుకుని, తాను పనిచెయ్యకుండా, పెద్ద పరిమాణంలో సరుకులు ఉత్పత్తి చేసేవాడు పెట్టుబడిదారుడు. కార్ఖానా తొలిదశల్లో పని సాగింది చేతిపనిముట్లతోనే – వృత్తి మేస్త్రీల వర్క్ షాపుల్లో లాగానే. దీన్నిబట్టి పని పద్ధతికి సంబంధించి రెంటికీ తేడాలేదు. తేడా కేవలం పనివాళ్ళ సంఖ్యలో మాత్రమే. "ఒకేకాలంలో, ఒకే చోట, ఒకే యజమానికింద ఒకే రకమైన సరుకు తయారు చెయ్యడానికి అధిక సంఖ్యలో కార్మికులు కలిసి పని చెయ్యడమే పెట్టుబడిదారీ ఉత్పత్తికి చారిత్రకంగానూ, తార్కికం గానూ ఆరంభ బిందువు"

వృత్తి మేస్త్రీ దగ్గర కొద్దిమంది పనివాళ్ళు ఉండేవాళ్ళు. పెట్టుబడిదారుడి వద్ద తొలిదశలో సైతం ఎక్కువమంది ఉంటారు. ఇంతకు మించి మరే తేడా లేదు. దీన్నిబట్టి "మధ్యయుగాల నాటి చేతివృత్తుల యజమాని వర్క్ షాప్ పెద్దదయింది, అంతే.

## ఒకేచోట ఎక్కువమందిని నియమిస్తే దాని ప్రభావాలు

పని చేసే పద్ధతిలో మార్పు లేకున్నా, అనేకమంది శ్రామికులని ఒకేచోట నియమించడం వల్ల పరిస్థితుల్లో పెద్ద మార్పు వస్తుంది. వాళ్ళు పనిచేసే భవనాలూ, ముడిపదార్థాలు పెట్టే గోదాములూ, పరికరాలూ, పాత్రలూ – ఒక్కముక్కలో ఉత్పత్తి సాధనాల్లో కొంత భాగం ఉమ్మడిగా వినియోగమవుతాయి. ఒక నేతగాడు ఇద్దరు సహాయకులతో పనిచేసే గదికన్నా, 20మంది నేసే గది పెద్దది కావాలి. అయితే ఇద్దరిద్దరు పనిచేసే 10 రూములు కట్టే కంటే 20మంది నేసే ఒక పెద్దగది కట్టడానికి ఖర్చు తగ్గుతుంది. ఫలితంగా స్థిర పెట్టుబడి కొంత తగ్గుతుంది. ఆమేరకు ఉత్పత్తయ్యే మొత్తం సరుకు విలువ కూడా తగ్గుతుంది.

## సామాన్య సహకారం

చాలామంది పనివాళ్ళు పక్కపక్కనే పనిచేస్తున్నప్పుడు వాళ్ళు సహకరించుకుంటున్నట్లు. వాళ్ళ శ్రమ సహకారశ్రమ. ఆ శ్రమ అనేది కేవలం పరిమాణాత్మక మార్పు కాదు. అదో కొత్త సృష్టి. విడి విడిగా ఒక్కొక్కని శక్తిని కలిపిన మొత్తం కంటే, వాళ్ళే ఉమ్మడిగా ఒకే పనిలో పాల్గొన్నప్పటి శక్తి, ఎక్కువగా ఉంటుంది. మార్క్స్ దాన్ని **'సామాజిక శక్తి'** అన్నాడు. అది ఎక్కువ బరువైన వస్తువుని లేపడం, ఒక యంత్రాన్ని హాండిల్ తో తిప్పడం, దేన్నైనా అడ్డు తొలగించడం, వంటి పనులు చెయ్యగలదు. సహకారం ద్వారా, ఉత్పాదకశక్తి పెరుగుతుంది; అంతేకాదు ఒక కొత్త శక్తి పుడుతుంది. జాన్ బెల్లర్స్ అన్నట్టు: "ఒకడు టన్ను బరువు ఎత్తలేడు. పదిమంది కష్టం మీద ఎత్తుతారు. అదే వందమంది అయితే ఒక్కొక్కడు ఒక్కొక్క వేలి బలంతో ఎత్తేస్తారు" అదే **సంయుక్త శక్తి**

## సహకారం ఉత్సాహపరుస్తుంది, హుషారుకలిగిస్తుంది

అనేక శక్తుల ఐక్యత కొత్త శక్తిని పుట్టిస్తుంది, అంతే కాదు. సామాజిక సంపర్కం ప్రతి ఒక్కరినీ ఉత్సాహపరిచి, సమర్ధతని పెంచుతుంది. ఇది పొలం పనుల్లో స్పష్టంగా తెలుస్తుంది. అందువల్ల, కలిసి పనిచేస్తున్న 12 మంది సంయుక్త పనిదినం 144 గంటల్లో 12 మంది విడివిడిగా తలా 12 గంటల్లో ఉత్పత్తి చేసినదానికన్నా ఎక్కువ ఉత్పత్తి చేస్తుంది.

## సామాన్య సహకారంలో వ్యక్తం కాకపోయినా శ్రమ విభజన ఉంటుంది

అనేకమంది ఒకేసమయంలో ఒకే రకమైన పనిలో ఉండవచ్చు. అయినాగాని ప్రతివాని శ్రమా, సమష్టిశ్రమలో ఒక భాగంగా ఉంటుంది. పనివాళ్ళు వరసలో నిలబడి రాళ్ళు పైకి చేర్చేటప్పుడు ప్రతి పనివాడూ ఒకే పని చేస్తాడు. ఆ రాళ్ళని ఒక్కడే మోసుకొని నిచ్చెన ఎక్కుతూ దిగుతూ పైకి చేర్చడం కంటే, 12మంది నిచ్చెన మెట్ల మీద వరసగా ఉండి, పైకి చేర్చడం తక్కువ కాలంలో సాధ్యమవుతుంది.

ఒకవేళ పని సంక్లిష్టమైనదయితే, ఒకేసమయంలో చాలా పనులు చెయ్యాల్సి ఉంటుంది. ఒకరు ఒక పనిచేస్తే, మరొకరు మరొక పని చేస్తారు. దాంతో ఆయా చర్యలు ఒకే కాలంలో జరిగే వీలుంటుంది. ఒకేవ్యక్తి తేలేని ఫలితాన్ని అందరూ కలిసి తెస్తారు. అందుకు వాళ్ళు సహకరిస్తారు. ఒకడు తెడ్డు వేస్తే, మరొకడు చుక్కానీ పట్టుకుంటాడు, మూడోవాడు వల విసురుతాడు, లేదా పెద్దచేపల్ని కొట్టే ఈటె తో పొడుస్తాడు. ఈవిధంగా చేపల వేట విజయవంతం అవుతుంది. మొత్తం పని అయ్యే కాలం తగ్గుతుంది.

## కీలక సమయాలు

చాలా పరిశ్రమల్లో నిర్దిష్ట ఫలితాల్ని రాబట్టాల్సిన కీలక సమయాలుంటాయి. ఆసమయాల్ని ఆయాప్రక్రియల స్వభావం నిర్ణయిస్తుంది. ఉదాహరణకి, ఒక మందలో గొర్రెల బొచ్చు కత్తిరించాల్సివస్తే, ఒక నిర్ణీత కాలంలో పని మొదలై, పూర్తయిపోవాలి. అలాగే ఒక గోధుమ చేను నూర్చాల్సి వచ్చినా అంతే. ఒక రోజు నుండి 12 గంటలు మించి, పనిదినాన్ని ఏ ఒక్క వ్యక్తీ పెంచలేడు. అయితే, సహకరించుకునే 100 మంది, పనిదినాన్ని 1200 గంటలకు పెంచగలరు. పనికి కావలసిన సమయం తక్కువగావుంటే, ఎక్కువమందిని దింపి పని పూర్తి చెయ్యవచ్చు. ముంపు నీళ్ళని బయటకు పంపడం, కరకట్టలు కట్టడం, నీటిపారుదల పనులు, కాలవలు తవ్వడం, రోడ్లు రైల్వే లైన్లు వెయ్యడం వంటి పనుల్లో సహకారం అనివార్యం.

## సహకారం యొక్క పెట్టుబడిదారీ స్వభావం

సహకారానికి శ్రామికులు ఒకే చోట కూడడం అవసరమైన షరతు. అలా కూడాలంటే, ఒకే పెట్టుబడిదారుడు వాళ్ళని పనిలో పెట్టుకోవాలి. అనేకమంది శ్రమశక్తిని కొని శ్రామికుల్ని ఒకచోటకి చేర్చకపోతే, వాళ్ళు సహకరించుకోలేరు. ఎక్కువమందిని నియమించాలంటే, అస్థిర పెట్టుబడి తగినంత ఉండాలి. 30 మందికి సరిపడే డబ్బుతో 300 మందిని పెట్టుకోజాలడు. స్థిర పెట్టుబడికి సంబంధించి కూడా అంతే. 30 మందికి కావాల్సిన పరికరాలు - ఉమ్మడిగా వాడుకునేవి చాలా ఉన్నా - 300 మంది పనిచెయ్యడానికి పరికరాలు చాలా ఎక్కువే కావాలి. శ్రమపదార్థాలు 10 రెట్లు కావాలి. కనుక అందుకు తగినంత పెట్టుబడి ఉండాలి.

## సహకారంలో పెట్టుబడిదారుడు పర్యవేక్షకుడు అవుతాడు

భారీ సంఖ్యలో శ్రామికులున్నప్పుడు, పర్యవేక్షణ అవసరమవుతుంది. వాళ్ళు చేసే పనుల్ని సమన్వయ పరచడానికీ, నిర్దేశించడానికీ, సర్దుబాటు చెయ్యడానికీ సారధి అవసరం. అజమాయిషీ అవసరం. ఈ ఆధిపత్యానికి ప్రతిఘటన ఏర్పడుతుంది. పెట్టుబడిదారీ ఉత్పత్తి ఉద్దేశ్యమూ, లక్ష్యమూ వీలైనంత అదనపు విలువ గుంజడమే. అందుకోసం శ్రమశక్తిని ఎంత సాధ్యమైతే అంత దోచడమే. సహకరించుకునే కార్మికుల సంఖ్య పెరిగే కొద్దీ, పెట్టుబడి ఆధిపత్యానికి ప్రతిఘటనా ఎక్కువవుతుంది. దాంతో ఆ ప్రతిఘటనని ప్రతి ప్రతిఘటనతో అధిగామించాల్సిన అవసరం అంతకంతకూ పెట్టుబడికి కలుగుతుంది. శ్రమ శక్తి దోపిడీకీ, అధిక శ్రమకీ కార్మికుల ప్రతిఘటన పెరిగేకొద్దీ మరింత పర్యవేక్షణ అవసరం అవుతుంది. శ్రామికులు వాడే ఉత్పత్తి సాధనాలు శ్రామికులవి కావు, అవి ఇతరుల ఆస్తి, పెట్టుబడిదారుడివి. కార్మికులు వాటిని వృధా చెయ్యకుండా కనిపెట్టి ఉండడం అవసరం. వాటి పరిమాణం ఎంత పెరిగితే అంత నియంత్రణ అవశ్యకమవుతుంది.

## ప్రత్యేక పర్యవేక్షకుల నియామకం

సహకారం విస్తరించే కొద్దీ, ఈ నిరంకుశత్వం దానికి తగిన రూపాలు తీసుకుంటుంది. కనీస పెట్టుబడి కూడగానే తన శ్రమను వదిలించుకున్నట్లే, ఇప్పుడు పనివాళ్ళని నిరంతరం పర్యవేక్షించే పనిని కూడా మాను కుంటాడు. ఆ పని చేసేందుకు ప్రత్యేకమైన వేతన శ్రామికులని నియోగిస్తాడు. వాళ్ళందరూ పని జరిగేటప్పుడు పెట్టుబడిదారుడి పేరుమీద అతని తరపున ఆధిపత్యం నెరుపుతారు. పర్యవేక్షణ వారి ఏకైక చర్య అవుతుంది.

## సంయుక్త శ్రమశక్తికి చెల్లింపు ఉండదు

శ్రామికులని అందరినీ కలిపేవాడు పెట్టుబడిదారుడే. కాబట్టి, అనేకమంది శ్రామికుల సహకారం ఫలితం అయిన సామాజిక ఉత్పాదకశక్తి పెట్టుబడి యొక్క ఉత్పాదక శక్తిగా అగపడుతుంది. అమ్ముకునే దాకా, శ్రమశక్తికి శ్రామికుడే ఓనర్. తనదైన శ్రమశక్తిని మించి అతను అమ్మలేడు. పెట్టుబడి దారుడు ఒక శ్రమశక్తిని కాక 100 శ్రమశక్తుల్ని కొని, ఒకనితో కాక ఒకరితో ఒకరికి సంబంధంలేని 100 మందితో ఒప్పందాలు చేసుకున్నా పరిస్థితిలో తేడా ఉండదు. వాళ్ళని సహకారంలో పెట్టకుండానే పని చేయించుకోగలడు. 100 స్వతంత్ర శ్రమశక్తుల విలువ అతను చెల్లించాడు. కానీ ఆ 100 మంది సంయుక్త శ్రమశక్తికి ఏమీ చెల్లించలేదు. ఒకరికొకరు స్వతంత్రులు కావడం వల్ల, వాళ్ళు ఏకాకులు, ఎవరికివారుగావున్న విడివిడి వ్యక్తులు. పెట్టుబడిదారుడితో సంబంధంలోకి వచ్చే విడివిడి వ్యక్తులు. అంతేగాని, వాళ్ళలో వాళ్ళకి సంబంధం లేదు. ఈ సహకారం అనేది శ్రమప్రక్రియతో మొదలవుతుంది. అయితే శ్రమ ప్రక్రియ మొదలయ్యేటప్పటికే శ్రామికులు తమకు తాము చెందకుండా పోతారు. ఆ ప్రక్రియలో ప్రవేశించగానే, పెట్టుబడిలో కలిసిపోతారు. పెట్టుబడిలో అంతర్భాగమవుతారు. అందువల్ల కలిసి పనిచేసేటప్పుడు పెంపొందే ఉత్పాదకశక్తి, ఉచితంగా ఉత్పన్నం అవుతుంది. అలాంటి పరిస్థితుల్లో పనివాళ్ళని పెట్టేది పెట్టుబడే. ఒక పక్క, ఈ శక్తి కోసం పెట్టుబడిదారుడికి ఏ

ఖర్చూ ఉండదు; మరోపక్క, పెట్టుబడికి చెందే ముందుగా, శ్రామికుడు ఈ శక్తిని పెంపొందించు కోలేదు. కనుక ఆశక్తి పెట్టుబడికి ప్రకృతి ప్రసాదించిన శక్తిగా, పెట్టుబడిలో అంతర్గతంగా ఉన్న శక్తిగా అగపడుతుంది. ఈ శక్తి శ్రామికుల నుండి కాకుండా, పెట్టుబడి నుండి పుట్టినట్లూ, పెట్టుబడిదైనట్లూ, అగపడుతుంది.

## భిన్న ఉత్పత్తి సంబంధాల్లో సహకారం పాత్ర

ప్రాచీన ఆసియన్లూ, ఈజిప్షియన్లూ, ఎట్రూస్కన్లూ బ్రహ్మాండమైన కట్టడాలు నిర్మించారు. అవన్నీ సరళ సహకారం యొక్క గొప్ప ఫలితాలు. ప్రాచీన కాలాల్లో ప్రాచ్య రాజ్యాల్లో పౌర, మిలిటరీ ఖర్చులు పోను మిగులు ఉండేది. వ్యవసాయేతర జనాభామీద ఆ రాజ్యాలకు ఆధిపత్యం ఉండేది. కనుక మహత్తర నిర్మాణాలు చేపట్టగలిగాయి. భారీ విగ్రహాల్నీ, అపార పరిమాణంలో ఉండే వస్తువుల్నీ తరలించడానికి మానవ శ్రమే విస్తారంగా వాడబడేది. వాటిని ఎలా రవాణా చేశారా అని మనం ఆశ్చర్యచకితులమవుతుంటాం. వారి సంఖ్యే వారి బలం. అంతంత మందిని పురమాయించగల అధికారం ఉన్నందువల్లనే ఆ రాజప్రాసాదాలూ, కోటలూ, గుళ్ళూ గోపురాలూ, పిరమిడ్లూ నిర్మించగలిగారు. అంతమంది కార్మికుల్ని పోషించడానికి సరిపోయే ఆదాయం ఒకవ్యక్తి చేతుల్లోనో, కొందరి చేతుల్లోనో చేరి ఉంటేనే గాని అంతటి నిర్మాణాలు సాధ్యం కావు. ఆసియా, ఈజిప్ట్ రాజులకూ, ఎట్రూస్కన్ మతపాలకులకూ ఉన్న ఈ ఆదాయం, అధికారం ఆధునిక సమాజంలో పెట్టుబదారుడికి బదిలీ అయింది. అతను ఒక్కడే కావచ్చు, లేదా జాయింట్ స్టాక్ కంపెనీల్లో లాగే సమష్టి పెట్టుబడిదారుడు అయినా కావచ్చు.

## సామాన్య సహకారం వేరు, పెట్టుబడిదారీ సహకారం వేరు

మానవాభివృద్ధి తొలి కాలంలో వేటాడి బతికే తెగల్లోనూ, భారతీయ వ్యవసాయదారుల్లోనూ ఉత్పత్తిసాధనాల ఉమ్మడి యాజమాన్యం ఉండేది. మరోకవైపు, ఏ ఒక్కడూ తన తెగతో బొడ్డుతాడు ఇంకా తెంచుకోలేదు. కలిసికట్టుగా ఉన్నారు. ఏ తేనెటీగ అయినా తేనెతెట్టెతో సంబంధం తెంచుకోజాలదు, అలాగే ఏ వ్యక్తి అయినా తనతెగలోని మనుషులతో తెగతెంపులు చేసుకోజాలడు. ఈ రెండు లక్షణాల వల్లా, అది పెట్టుబడిదారీ సహకారానికి భిన్నంగా ఉంటుంది. ప్రాచీన కాలాల్లోనూ, మధ్య యుగాల్లోనూ, ఆధునిక వలసల్లోనూ అక్కడక్కడ అప్పుడప్పుడు భారీ స్థాయిలో సహకారం ఉంటుంది. అది ఆదిపత్యమూ, దాసత్వమూ అనే సంబంధం మీద, మరీ ముఖ్యంగా బానిస విధానం మీద ఆధారపడి ఉంటుంది. అందుకు విరుద్ధంగా పెట్టుబడి దారీ సహకారం తన శ్రమశక్తిని అమ్ముకునే స్వేచ్ఛగల వేతన కార్మికుని ఉనికిని ఆశిస్తుంది. చారిత్రకంగా ఈ రూపం రైతుల వ్యవసాయానికీ, స్వతంత్ర చేతివృత్తుల నిర్వహణకూ భిన్నమైనదిగా అభివృద్ధయింది. ఆ వ్యవసాయం, చేతివృత్తుల దృష్ట్యా చూస్తే, స్వయంగా పెట్టుబడిదారీ సహకారం, సహకారం యొక్క ఒక ప్రత్యేక చారిత్రక రూపం, అనే వాస్తవం బయటపడదు. పడకపోగా, అసలు సహకారమే పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియ యొక్క ప్రత్యేక రూపం అయినట్లుగా, ఒక చారిత్రక రూపంగా అగపడుతుంది. శ్రమ యొక్క సామాజిక ఉత్పాదకశక్తి, సహకారం వల్ల అభివృద్ధయింది. అయినాగాని, అది పెట్టుబడి యొక్క ఉత్పాదక శక్తి లాగా కనబడుతుంది. అలాగే విడివిడి

స్వతంత్ర వ్యక్తులో, చిన్న యజమానులో నిర్వహించే ఉత్పత్తి ప్రక్రియతో పోల్చి చూస్తే, అసలు సహకారమే పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియ యొక్క విశిష్ట రూపంగా అగపడుతుంది.

ఇంతదాకా సహకారం అనేదాన్ని మౌలిక రూపంలో పరిశీలిస్తున్నాం. ఆ రూపం సమస్త భారీ స్థాయి ఉత్పత్తికి కూడా అవసరమైనదే. అయితే అది పెట్టుబడిదారీ అభివృద్ధిలో ఒక ప్రత్యేక శకానికి లాక్షణికమైన స్థిర రూపం కాదు. మహా అయితే చేతివృత్తుల తొలి కార్ఖానా దశ మొదట్లోనూ, కార్ఖానాల కాలంలో పెద్దస్థాయి వ్యవసాయంలోనూ అలా అయినట్లు అగపడుతుంది– అదీ ఇంచుమించుగా మాత్రమే. భారీ పెట్టుబడి ఉన్న ఏయే ఉత్పత్తి శాఖల్లో శ్రమ విభజనా, యంత్రాలూ అప్రధానంగా ఉంటాయో ఆయా ఉత్పత్తి శాఖల్లో సామాన్య సహకారం ఎప్పుడూ ప్రబల రూపంగా ఉంటుంది. పెట్టుబడి దారీ ఉత్పత్తి విధానంలో ఎప్పుడూ సహకారం మౌలిక పాత్ర పోషిస్తుంది. అయినాగాని, తొలి సహకార రూపం మరింత అభివృద్ధి చెందిన సహకార రూపాల సరసన కొనసాగుతూనే ఉంటుంది.

# అధ్యాయం 14
# శ్రమ విభజనా - కార్ఖానా ఉత్పత్తీ

కార్ఖానా దశ దాదాపు 1550 నుంచీ 1770 వరకూ విస్తరించింది. కార్ఖానా ఉత్పత్తిలో సహకారం శ్రమ విభజన మీద అధారపడి ఉంటుంది. **శ్రమని విభజించాలి అనే ఆలోచన వల్ల శ్రమ విభజన ఏర్పడ్డది** అని ఫ్రెంచ్ రాజకీయవేత్త జోసెఫ్ ప్రౌధన్ (1809–1865) అభిప్రాయ పడ్డాడు. ఆయన అభిప్రాయాన్ని మార్క్స్ ఖండిస్తాడు. పెట్టుబడిదారుడు శ్రామికులని ఒకచోట చేర్చడం శ్రమ విభజన చెయ్యడం కోసం కాదు, అదనపు విలువకోసం. ఎంత ఎక్కువమందిని పెడితే, అంత ఎక్కువ అదనపువిలువ వస్తుంది. వర్క్ షాప్ లోపల శ్రమ విభజన అభివృద్ధి కావడానికి కారణం: ఉత్పత్తి సాధనాలూ, కార్మికులూ ఒకచోట చేర్చబడడమే.... శ్రమ విభజన అభివృద్ధికి వర్క్ షాప్‌లో పనివాళ్ళు కూడడం ముందుగా అవసరం.

### విభాగం 1.కార్ఖానా ఉత్పత్తి తలెత్తే రెండు మార్గాలు
(Two-Fold Origin of Manufacture)

1. అంతకుముందు స్వతంత్రగా వున్న శ్రమ ప్రక్రియలు కొన్ని కలవడంద్వారా
2. ఒక శ్రమ ప్రక్రియ కొన్ని భాగాలుగా విడివడడం ద్వారా

### మొదటి మార్గం - ఉదాహరణ గుర్రబ్బండి తయారీ

ఒక బండి తయారవాలంటే, అనేక చేతివృత్తుల వాళ్ళు ఒకరితర్వాత ఒకరు పనిచెయ్యాలి.

కార్ఖానా దశకి ముందు బండి చాలామంది స్వతంత్ర చేతివృత్తుల ఉత్పత్తి. ఒక వృత్తిదారుడు చెయ్యాల్సిన పని అయ్యాక, మరొక వృత్తిదారుడు పనిచెయ్యాలి. ఎన్ని పనులు అవసరమైతే, అన్ని వృత్తులుచేసే పనివాళ్ళు ఒకరితర్వాత ఒకరు పనిచేస్తేనే ఆ వస్తువు పూర్తవుతుంది. ఇలా మొత్తం బండి పూర్తయ్యే వరకూ అయినంత వరకూ బండిని పనివాళ్ళ దగ్గరకి తిప్పాలి. లేదా వాళ్ళనైనా తయారవుతున్న వస్తువు దగ్గరకి తీసుకురావాలి. అలా కాకుండా ఆ పనివాళ్ళని ఒక కప్పుకింద చేరిస్తే ఆ వస్తువు ఒక్క చోటే తయారవుతుంది. ఒక వస్తువు తయారీకి అవసరమైన వివిధ వృత్తిదారుల్నీ ఒకేచోట చేరిస్తే కార్ఖానా ఉత్పత్తి తలెత్తుతుంది. ఆ వస్తువు తయారు కావడానికి ఒకేచోట కొందరు శ్రామికుల చేతులగుండా పయనిస్తుంది.

మార్క్స్ గుర్రబ్బండి తయారీని ఉదాహరిస్తాడు. బండిలో చాలా భాగాలుంటాయి. వాటిని వేర్వేరు వృత్తి దారులు చేసేవారు: చక్రాలు చేసేవారు, జీను తయారీ దారులు, కుట్టుపనివారు, తాళాలు చేసేవారు, పరదాలూ, పరుపులూ కుట్టే వారు, టర్నర్లు, జాలర్లు (అంచులు) తయారు చేసే వారు, కిటికీలకి గాజు తలుపులు పెట్టేపనివారు, రంగులేసేవారు, నునుపు చేసేవారు, రేకు వేసే ఇంకా కొన్నిపనులు చేసేవారు వరసగా పనిచేస్తేనే బండి తయారయ్యేది. అయితే బళ్ళు తయారు చేసే పెట్టుబడిదారుడు తన కార్ఖానాలో ఈ పనులు చేసే వేర్వేరు వృత్తిపనివాళ్ళని అందరినీ ఒకే కప్పుకింద చేరుస్తాడు. ఒకరి చేతిలో పనయ్యాక, మరొకరి చేతుల్లోకి వెళతుంది.

బండి మొత్తం ఒకేచోట తయారవుతుంది. వివిధ వృత్తులు చేసే వారు, ఇప్పుడు బండితయారీలో నిమగ్నమయ్యారు. ఇప్పటివరకూ మనం **సామాన్య సహకారం** పరిధిలోనే ఉన్నాం. అయితే ఇంతలోనే ఒక ముఖ్యమార్పు వస్తుంది. ఉదాహరణకి ఎన్నో కుట్టుపనులు చేసే ఒక దర్జీ ఇప్పుడు కేవలం బండికి కావలసినవి మాత్రమే కుడతాడు.

ఈ శ్రామికులు ఇంతదాకా తమతమ వృత్తులకి చెందిన అనేక వస్తువులు తయారు చేసేవారు. ఇప్పుడు బండి తయారీకి పరిమితమయ్యారు. కాబట్టి, మిగిలిన వస్తువులు తయారు చెయ్యరు. కనక అలవాటు తప్పిపోతుంది. మునుపు చేసిన వస్తువుల్ని చేసే శక్తినీ, నైపుణ్యాన్నీ కాలక్రమంలో కోల్పోతారు. మరొకవైపు, ఒకేపని చేస్తున్నందువల్ల ఆ చేసేపనిలో నైపుణ్యం సాధిస్తారు. వేగంగా కూడా చేస్తారు.

మొదట, బండి తయారీ అనేది వివిధ, స్వతంత్ర చేతివృత్తుల కలయిక. క్రమంగా బండి తయారీ దాని వివిధ పాక్షిక ప్రక్రియలుగా విడివడి పోతుంది. వాటిలో ప్రతి విడి ప్రక్రియా ఒక ప్రత్యేక పనివాని చర్య అవుతుంది. అతను అదే పాక్షిక ప్రక్రియలో ఉంటాడు. పాక్షిక పనివాడుగా స్థిరపడి కరుడు కట్టుకపోతాడు. మొత్తం మీద కార్ఖానా ఉత్పత్తి మనుషులు కలిసి చేసేదిగా ఉంటుంది. ఒకే పెట్టుబడిదారుడి అజమాయిషీలో భిన్న చేతి వృత్తుల కలయిక ద్వారా తలెత్తింది.

## రెండవ మార్గం – ఉదాహరణ గుండుసూదుల తయారీ

ఈ పద్ధతికి వ్యతిరేకంగా కూడా కార్ఖానా ఉత్పత్తి ఏర్పడుతుంది. ఒకే పెట్టుబడిదారుడు, ఒకే వర్క్ షాప్‌లో ఒకేరకం పనిచేసే వాళ్ళని ఎక్కువమందిని పెట్టుకోవడం వల్ల కూడా కార్ఖానా ఉత్పత్తి తలెత్తుతుంది.

ఈ పనివాళ్ళలో ప్రతివాడూ ఒకరిద్దరు అప్రెంటిస్‌ల సాయంతో మొత్తం సరుకుని చేస్తాడు. ఫలితంగా దాని ఉత్పత్తికి అవసరమైన చర్యలన్నీ వరసగా చేసుకుపోతాడు. అతను మునుపటి చేతివృత్తి పద్ధతిలోనే పనిచేస్తాడు. అయితే పనివాళ్ళు ఒకేచోట ఉండడం వల్లా, పని ఒకేరకమైనది అవడం వల్లా, ఒక ముఖ్యమార్పు వస్తుంది. తక్కువ సమయంలో ఎక్కువ వస్తువులు చేసి ఇవ్వాల్సి రావచ్చు. అందువల్ల పని పునఃపంపిణీ అవుతుంది.

ఒకే కార్మికుడు విడివిడి చర్యలన్నిటినీ ఒక్కడే వరసగా చేసే బదులు, ఒక్కొక్క చర్యని ఒక్కొక్క కార్మికుడు చెయ్యవచ్చు. కనుక ఆ విధంగా ఆ చర్యలలో ప్రతి ఒక్కటీ ఒక్కొకరికి కేటాయించబడుతుంది. ఆచర్యలు అన్నీ సహకరించుకునే శ్రామికుల చేత ఏక కాలంలో పూర్తిచేయబడతాయి. ఈ యాదృచ్ఛిక పునర్విభజన పునరావృతం అవుతూ ఉంటుంది. ఈ పునర్విభజన వల్ల ప్రయోజనాలు ఏర్పడతాయి. క్రమక్రమంగా అది (ఈ పునర్విభజన) ఒక క్రమబద్ధమైన శ్రమవిభజనగా ఘనీభవిస్తుంది.

ఒక సరుకు ఒక స్వతంత్ర వృత్తిదారుడి ఉత్పాదితంగా ఉండదు, ఒక్కొక్కచర్య చేసిన అందరు వృత్తిదారుల సామాజిక ఉత్పాదితం (social product) అవుతుంది. సూదుల తయారీక్రియని అనేక చర్యలుగా విడగొట్టి ఒక్కో చర్యని ఒక్కో పనివాడికి ఇవ్వవచ్చు. అప్పుడు ఎవ్వరూ పూర్తిగా గుండుసూదిని చెయ్యరు. కనుక అది కొంతమంది పనివాళ్ళు కలిసి చేసినది అవుతుంది.

నూరెంబెర్గ్ గిల్డ్ పునాది మీదనే ఇంగ్లాండ్ లో సూదుల కార్ఖానా లేచింది. అయితే అక్కడ సూదులు చేసేవాడు ఒకదాని తర్వాత ఒకటిగా 20 చర్యలు చేసేవాడు. కాగా ఇంగ్లండ్‌లో అనతి కాలంలోనే 20 మంది పనివాళ్ళు వరసగా కూర్చొని ఒక్కొక్కరూ ఒక్కొక్క చర్య మాత్రమే చేసేవారు. మరింత అనుభవం చేకూరిన ఫలితంగా ఈ 20 చర్యల్లో ప్రతిదీ కొన్ని చర్యలుగా విడిపోయింది. ఆ చర్యలు చెయ్యడం వేరేవాళ్ళ వంతయింది. 20 మంది వరస పెరిగింది. చర్యలు విడిపోయి పెరిగేకొద్దీ, అందుకనుగుణంగా పనివాళ్ళ వరస పొడుగు సాగుతుంది. ఈ యాదృచ్ఛిక పునర్విభజన పునరావృతం అవుతూనే ఉంటుంది.

**ఈ రెండు అభివృద్ధి మార్గాల అంతస్సంబంధం.** కార్ఖానా ఉత్పత్తి చేతివృత్తుల నుంచి తలెత్తి, అభివృద్ధి చెందింది. ఈ తీరు ద్విముఖమైనది. ఒకపక్క వివిధ స్వతంత్ర చేతివృత్తుల కలయిక ద్వారా ఏర్పడింది. ఆ వృత్తులు వాటి స్వతంత్రతని కోల్పోతాయి, ఎంతగానంటే, ఒకే రకం సరుకు ఉత్పత్తిలో పాక్షిక ప్రక్రియల స్థాయికి వస్తాయి.

ఉదాహరణకి, అన్ని రకాల కొయ్య వస్తువులు చేసే వడ్రంగి, గుర్రబ్బళ్ల కార్ఖానాలో బండికి సంబంధించినవి మాత్రమే చేస్తాడు. అంతదాకా చేస్తూ వచ్చిన ఏ ఇతర వస్తువునీ చెయ్యడు. అన్ని వస్తువుల్నీ చేసే స్వాతంత్ర్యాన్ని కోల్పోతాడు. ఒకే గాడికి పరిమితమవుతాడు. అలాగే అన్నిరకాల దుస్తులు కుట్టే దర్జీ బండికి సంబంధించినవి మాత్రమే కుడతాడు. మిగిలిన పని వాళ్ళు కూడా అంతే.

మరొకపక్క, ఒకే చేతివృత్తి చేసే శ్రామికుల సహకారం నించి కార్ఖానా ఉత్పత్తి తలెత్తుతుంది. ఒక ప్రత్యేక చేతి వృత్తిని విడివిడి చర్యలుగా విడగొడుతుంది. ఈ చర్యల్ని దేనికదిగా. ఒకదానితో ఒకటి సంబంధం లేనివిగా వేరుచేస్తుంది. వేర్వేరు శ్రామికులు ఎవరికీ వారు చేసే చర్యలుగా ప్రత్యేకపరుస్తుంది. అందువల్ల కార్ఖానా ఉత్పత్తి ఒకపక్క, శ్రమ విభజనని ప్రవేశపెట్టనైనా పెడుతుంది, లేదా ఆ విభజనని ఇంకా ఎక్కువ చెయ్యనైనా చేస్తుంది. మరొకపక్క, అంతదాకా వేరువేరుగా వున్న చేతి వృత్తుల్ని కలుపుతుంది. ఒకేచోటికి చేరుస్తుంది.

ఎలా మొదలైనా, దాని అంతిమ రూపం ఒక్కటే : మనుషులు భాగాలుగా వుండే ఉత్పాదక యంత్రాంగమే. కార్ఖానా ఉత్పత్తిలో శ్రమ విభజన సరిగా అర్థం కావాలంటే, రెండు విషయాలు కచ్చితంగా తెలియాలి:

1. చేతివృత్తిలో వరసగా చేసే చర్యలే, విడివిడి చర్యలుగా విడగొట్టబడతాయి. చర్య సరళమైనదైనా, సంక్లిష్టమైనదైనా చేతితో చేయాల్సిందే. అంటే చేతి వృత్తి స్వభావమే వుంటుంది. అందువల్ల, ఆ చర్య పరికరాలు వాడడంలో పనివాడి బలం మీదా, నైపుణ్యం మీదా, వేగం మీదా, చెయ్యగలననే నమ్మకం మీదా ఆధారపడి వుంటుంది. చేతి పనే ప్రాతిపదికగా కొనసాగుతుంది.
2. రెండోది, ఈ శ్రమ విభజన అనేది ఒక **ప్రత్యేక తరహా సహకారం.** దాని ప్రయోజనాలు సహకారం యొక్క సాధారణ స్వభావం నుండి తలెత్తుతాయి. కాని సహకారం యొక్క ప్రత్యేక రూపం నుండి కాదు.

# విభాగం 2
## విభాగ శ్రామికుడూ – అతని పరికరాలూ

### విభాగ శ్రామికుడూ – ఉమ్మడి శ్రామికుడూ

కార్ఖానాలో వస్తువు తయారీకి ఒక్కొక్క చర్యని ఒక్కొక్కరు చేస్తారు. ఒకేరకం వస్తువు తయారీలో కొన్ని చర్యలు వుంటాయి. వాటిలో ఒకటో రెండో చేసేవాడు విభాగ కార్మికుడు (Detail Labourer). ఉదాహరణకి మంచాలు తయారు చేసే చోట అయిదుగురు పనివాళ్ళున్నారు అనుకుందాం. ఎవరికి వారు మంచాన్ని ఆసాంతం చెయ్యవచ్చు. అలాకాకుండా కొయ్యని పట్టెలకూ, కోళ్ళకూ సరిపోయేట్లు ఒకరు కొయ్యవచ్చు. మరొకరు తోపుడు పట్టవచ్చు. పట్టెలొకరూ, కోళ్ళొకరూ చెయ్యవచ్చు. మరొకరు బిగించవచ్చు. ఎవ్వరూ మొత్తం మంచాన్ని చెయ్యలేదు. అలాగని పనిలో పాలు పంచుకోకుండా ఉండనూ లేదు. మొత్తం పనిలో తలా ఒక చర్య చేశారు. వీళ్ళని విభాగ శ్రామికులు అంటారు. మన ఉదాహరణలో ఉన్న అయిదుగురూ విభాగ శ్రామికులు. వీళ్ళని పాక్షిక శ్రామికులు అంటుంటారు. ఏ పేరు పెట్టినా మొత్తంపనిలో ఉన్న చర్యల్లో ఒకటో, రెండో చేసేవాడుగా ఉంటాడు.

వీళ్ళందర్నీ కలిపితే **ఉమ్మడి శ్రామికుడు** అవుతాడు. ఇక్కడ మంచాన్ని తయారు చేసింది ఒక శ్రామికుడు కాదు. సమష్టి కార్మికుడు. ఉమ్మడి కార్మికుడు. కార్ఖానా ఉత్పత్తికి సజీవ యంత్రాంగం. వృత్తి మేస్త్రీ వర్క్ షాప్ లో విభాగ శ్రామికుడు ఉండడు. ఒకరితో ఒకరికి సంబంధం లేకుండా ఎవరికి వారు మంచం చేస్తారు. కార్ఖానాలో ఏ ఒక్కరూ పూర్తిగా మంచం చెయ్యరు. ఒక్కొక్క చర్య ఒక్కొక్కరు చేస్తారు. అందరూ విభాగ శ్రామికులే.

### విభాగ శ్రామికుడూ – ఉత్పాదకతా

ఇప్పటిదాకా మాన్యుఫాక్చర్ పుట్టుక గురించి చెప్పాడు. ఇప్పుడు అందులోని అంశాల గురించి చెప్తాడు.

మొదటి అంశం: శ్రామికుడు జీవితాంతం ఒకే చర్య చెయ్యడం వల్ల, తన శరీరాన్ని ఆ చర్యని చేసే పరికరంగా మారుస్తాడు. ఫలితంగా ఆ చర్య చెయ్యడానికి అన్ని చర్యలూ వరసగా చేసేవానికంటే తక్కువ టైం తీసుకుంటాడు. అంటే శ్రమ ఉత్పాదకత పెరుగుతుంది.

శ్రమ విభజనవల్ల పెరిగిన ఉత్పాదకత గమనించి స్మిత్ ముగ్ధుడయ్యాడు:

"ఒక పనివాడు రోజంతా కష్టపడితే బహుశా ఒక పిన్ను చేస్తాడేమో! 20 పిన్నులు ఎలాగూ చెయ్య లేడు. ఇప్పుడు ఈ పనిసాగే విధానం ....ఒక మనిషి తీగ తీస్తాడు. మరొకడు ఆ తీగని సాపు చేస్తాడు. మూడోవాడు తెగ్గోడతాడు. ఇంకొకడు మొన తేలుస్తాడు. అయిదో వాడు తలపైన నునుపు చేస్తాడు. తల తయారీలో రెండు, మూడు చర్యలు వుంటాయి. పిన్నుల్ని తెల్లగా చెయ్యడం వేరొకరి చర్య. వాటిని పేపర్లో పెట్టడం మరోకరి పని. ఈ విధంగా పిన్నుల తయారీ 18 చర్యలుగా విడి పోయింది. ....

నేనొక చిన్న పిన్నుల ఫాక్టరీ చూచాను. అక్కడ 10 మంది పనివాళ్ళున్నారు. కొందరు రెండు, మూడు చర్యలు చేసేవారు...వాళ్ళు రోజుకి 48,000 పిన్నుల చేస్తారు. అంటే, ఒక్కొక్కరూ 4800 పిన్నులు చేసినట్లు లెక్క." - Adam Smith Wealth of Nations. p7

విభిన్న చర్యల విభజన, కలయికల వల్ల 20 పిన్నులు చెయ్యలేని వాళ్ళు 4800 పిన్నులు చేస్తున్నారంటే, ఉత్పాదకత 240 రెట్లయింది.

మరొకపక్క, ఒకే చర్య చెయ్యడంలో ఉత్సాహం కలగదు. ఒకేరకమైన పని మనిషి ఉత్సాహాన్నీ, దెబ్బతీస్తుంది. చర్యల మార్పు పనివాణ్ణి ఉత్సాహ పరుస్తుంది. విభాగ పనివాడికి ఆ అవకాశం ఉండదు.

విభాగ శ్రామికుడి శ్రమ ఉత్పాదకత శ్రామికుని నైపుణ్యాన్ని బట్టి వుంటుంది. అంతేకాదు అతను వాడే పనిముట్ల మెరుగుదలను బట్టీ వుంటుంది. చాకులు, పిడిసానలు, బరమాలు, సుత్తెలు మొదలైన పరికరాలు ఒకేరకమైనవి వేర్వేరు శ్రమ ప్రక్రియల్లో వాడవచ్చు; ఒకే పరికరం ఒకే శ్రమ ప్రక్రియలో వివిధ ప్రయోజనాలకు ఉపయోగపడవచ్చు. ఎప్పుడైతే ఒక శ్రమ ప్రక్రియ చర్యలుగా విడిపోయి, ఒక్కో చర్య ఒక్కో విభాగ శ్రామికుని వంతవుతుందో, ఒక్కొక్కరు వాడే పనిముట్లలో మార్పులు అవసరమవుతాయి. ఒకే పరికరాన్ని చాలా పనుల్లో వాడేటప్పుడు ఇబ్బందులొస్తాయి. ఆ ఇబ్బందులే ఈ మార్పుల్ని నిర్ణయిస్తాయి. ఏ చర్య చెయ్యడానికి ఏ మార్పులు అవసరమో ఆ మార్పులు జరుగుతాయి. బర్మింగ్ హామ్ లో 500 రకాల సుత్తెలు తయారయ్యాయి. వేర్వేరు చర్యలకు అనువుగా ఉంటాయి. నగలు చేసేవాడు నాలుగైదు రకాల సుత్తెలు వాడతాడు.

## కార్ఖానా ఉత్పత్తికి పరికరాల వైవిధ్యం లక్షణం

విభాగ కార్మికుని చేతిలో అతని చర్యకు అనువైనదిగా తయారైన పరికరం ఉంటుంది. పనిముట్లు ఒక్కొక విభాగ శ్రామికుని ప్రత్యేక చర్యకి అనువుగా ఉండాలి. కార్ఖానా కాలంలో పనిముట్లు సరళమయ్యాయి, మెరుగుపడ్డాయి. రకరకాల స్క్రూ డ్రైవర్లూ, పట్టకార్లూ, చాకులూ – పనినిబట్టి మార్పుగా ఉంటాయి.

ఇక కార్ఖానా ఉత్పత్తి అంశాన్ని మొత్తంగా చూద్దాం.

## విభాగం 3
## కార్ఖానా ఉత్పత్తి యొక్క రెండు మౌలిక రూపాలు

కార్ఖానా ఉత్పత్తికి రెండు మౌలిక రూపాలుంటాయి.

1. వైవిధ్యభరిత (heterogeneous) కార్ఖానా ఉత్పత్తి
2. ధారావాహిక (serial) కార్ఖానా ఉత్పత్తి

అవి రెండూ అడపాదడపా కలిసినప్పటికీ, సారంలో భిన్నమైనవి. పైగా, మాన్యుఫాక్చర్, యంత్రాలతో నడిచే ఆధునిక పరిశ్రమలోకి పరివర్తన చెందే క్రమంలో అవి భిన్నపాత్రల్ని పోషిస్తాయి. తయారయ్యే వస్తువు స్వభావమే ఈ ద్వంద్వ స్వభావానికి కారణం.

1. ఒక వస్తువు స్వతంత్రగా చేసిన భాగాల్ని (partial products) కూర్చడం ద్వారా తయారవచ్చు.

2. ఒక వరసలో జరిగే సంబంధిత చర్యల ద్వారా ఏర్పడవచ్చు.

మార్క్స్ మొదటిదాన్ని వైవిధ్య భరిత కార్ఖానా ఉత్పత్తి అనీ, రెండోదాన్ని ధారావాహిక కార్ఖానా ఉత్పత్తి అనీ అన్నాడు.

### వైవిధ్య భరిత కార్ఖానా ఉత్పత్తి

మాన్యుఫాక్చర్లో శ్రమవిభజనకి ఉదాహరణగా, విలియం పెట్టీ గడియారాల ఉత్పత్తిని చూపాడు. గతంలో నూరెం బెర్గ్ వృత్తిదారుడి కృషితో తయారైన చేతి గడియారం ఇప్పుడు అనేకమంది విభాగ శ్రామికుల సామాజిక ఉత్పత్తి అయింది. మెయిన్ స్ప్రింగులు, డయల్ లు, ముళ్ళు, స్క్రూలు, కేస్ లు, చక్రాలు, బాలెన్స్ చక్రాలు, వగయిరా అనేక విడి భాగాలుంటాయి. వాటిని వేర్వేరు పనివాళ్ళు చేస్తారు. వీటిలో కొన్నిటిని అనేకమంది కలిసి చేస్తారు. చివరకి ఈ భాగాలన్నీ అమర్చే పనివానికి చేరతాయి. అతను ఆ విడి భాగాల నన్నిటినీ అమర్చి పనిచేసే స్థితిలో గడియారాన్ని అందచేస్తాడు.

**వీళ్ళందర్నీ ఒకే బిల్డింగులోకి చేర్చడం వల్ల పెద్ద ప్రయోజనం ఉండదు.** ఇప్పటికీ చాలా భాగాలు బయటే తయారవుతాయి. విభాగ శ్రామికులని ఒకే వర్క్ షాప్ లో చేర్చానూ వచ్చు, చేర్చకపోనూ వచ్చు. రెండు సందర్భాలూ ఉన్నాయి. గడియారాల తయారీలో పనివాళ్లని ఒకేచోట కేంద్రీకరించడం సాధారణ పరిస్థితుల్లో లాభదాయకం కాదు. ఎందుకంటే, ఇళ్లదగ్గర పనిచేసే వాళ్ళ మధ్య పోటీ ఎక్కువగా ఉంది; పనిని అనేక ప్రక్రియలుగా విడగొట్టడం వల్ల శ్రమ పరికరాల్ని ఉమ్మడిగా వాడడం పెద్దగా ఉండదు; పనిని అక్కడక్కడ చెల్లాచెదరుగా చేయిస్తే, పెట్టుబడి దారుడికి వర్క్ షాప్ మీద పెట్టుబడి తగ్గుతుంది, పొదుపవుతుంది. ఇంట్లోనే పనిచేసినా అతను చేస్తున్నది పెట్టుబడిదారుడి కోసం. అలాచేసే విభాగ శ్రామికుని స్థానం, ఖాతా దారులకోసం చేసే స్వతంత్ర వృత్తిదారుని స్థానానికంటే ఎంతో భిన్నమైంది.

## ధారావాహిక కార్ఖానా ఉత్పత్తి

రెండో రకం మాన్యుఫాక్చర్‌లో సంబంధం వున్న దశలు మారుతూ, అంచలంచలుగా వస్తువులు తయారవుతాయి. సూదుల తయారీ లో ఒక తీగ 72 మంది చేతుల్లోకి వరసగా నడుస్తుంది. ఎవరిపని వారు చేస్తారు. ఫలితంగా సూదులు తయారవుతాయి. కొన్ని సార్లు 92 మంది చేతులగుండా పోతుంది.

## మాన్యుఫాక్చర్‌లో వైరుధ్యం

కార్ఖానా ఉత్పత్తి మొదలైనప్పుడు చెల్లాచెదరుగా వున్న చేతివృత్తుల్ని కలిపింది. ఆమేరకు అది ఉత్పత్తిలో వివిధ దశలకూ మధ్య ఉండే దూరాన్ని తగ్గించింది. ఒక దశ నుంచి మరొక దశకు పోయేందుకు పట్టే సమయాన్ని తగ్గించింది. పోయేందుకు పట్టే శ్రమనీ తగ్గించింది. చేతివృత్తితో పోలిస్తే, ఉత్పాదకశక్తి పెరుగుతుంది. ఈ పెరుగుదలకి కారణం కార్ఖానా ఉత్పత్తి యొక్క సాధారణ సహకార స్వభావమే. మరొకవైపు, చేస్తున్న వస్తువు ఒకరు కొంత చేశాక మరొకరు ఇంకొంత చెయ్యడానికి చేతులు మారాలి. రవాణా అవాలి. ఒక ప్రక్రియనుంచి మరొక ప్రక్రియకు మారాలి. మాన్యుఫాక్చర్లో ఇది అనివార్యం. ఖర్చుతో కూడిన అసౌకర్యం.

## విభాగ శ్రామికుడు పని సకాలంలో చెయ్యాల్సి వస్తుంది

ప్రతి ఉత్పత్తిదారుడూ తన సరుకుని మార్కెట్ ధరకే అమ్ముకోవాల్సి ఉంటుంది. కాబట్టి సరుకు ఉత్పత్తికి పట్టే సమయం సామాజికంగా అవసరమయ్యే సమయాన్ని సాధారణంగా మించకూడదు అనేనియమం పోటీ ప్రభావం వల్ల స్థిరపడ్డట్టు కనబడుతుంది; కాని ఇందుకు భిన్నంగా ఫలానింత కాలంలో, ఫలానింత సరుకు ఉత్పత్తి అవడం అనేది ఉత్పత్తి ప్రక్రియ యొక్క సాంకేతిక నియమం.

**ఒక విభాగ శ్రామికుని శ్రమ ఫలితం ఇంకొక విభాగ శ్రామికుని శ్రమకి ఆరంభ బిందువు**

ఒకడు కమ్మిచ్చుతో తీగ లాగుతాడు. అంతటితో అతని పని అయింది. దాన్ని వంపు తీసి చక్కగా చెయ్యడం వేరేవాని పని. మొదటివాని శ్రమ ఫలితం తీగ. అది రెండోవాని పనికి ఆరంబ బిందువు. చక్కగా ఉన్న తీగ ఇతని శ్రమ ఫలితం. అది మూడోవాని పనికి ఆరంభ బిందువు. ఇలా అందిస్తుంటే తీసుకొని ఎవరి వంతు వారు చేస్తారు. చివరకి వస్తువు వస్తుంది. ఒకరి పని అయితేనే మరొకరి పనిమొదలవుతుంది. అవతలవానికి సకాలంలో అందించాలి. ఎవరైనా ఎక్కువ సమయం తీసుకుంటే, ప్రక్రియకి అంతరాయం కలుగుతుంది. అందువల్ల, ఏ ఒక్కరూ ఎక్కువ సమయం తీసుకోకుండా ఒత్తిడి పడుతుంది. ఆ విధంగా తెంపు లేని కొనసాగింపు, ఏకరూపత (uniformity), క్రమబద్ధత, పద్ధతి ఏర్పడతాయి; ఇవి స్వతంత్ర చేతివృత్తులలో కానీ, సామాన్య సహకారంలో గానీ కనిపించే వాటికంటే భిన్నంగా ఉంటాయి.

## పరస్పరం ఆధారపడడం వల్ల సమన్వయం అవసరం

వేర్వేరు చర్యలకు వేర్వేరు సమయాలు పడతాయి. కనుక ఒకే కాలంలో తయారయ్యే ముక్క ఉత్పాదితాలు (fractional products) భిన్న పరిమాణాల్లో ఉంటాయి. అందువల్ల ఒక పనివాడు ప్రతిరోజూ ఒకే చర్య చేసే పక్షంలో, ప్రతి చర్యకూ శ్రామికులు వేర్వేరు సంఖ్యల్లో

ఉండాలి. అందుకు తగిన నిష్పత్తి ఏర్పడుతుంది. ఉత్పత్తిని విస్తరించాలంటే, మొత్తం జట్టునో, కొన్ని జట్లనో నియమించాల్సి ఉంటుంది.

ఉదాహరణకి టైపుల తయారీలో ఒక **నునుపు చేసేవాడికి** (rubber), నలుగురు పోత పోసేవాళ్ళూ (founders), ఇద్దరు విడగొట్టే వాళ్ళూ (breakers) ఉండాలి. పోతపోసేవాడు గంటకి 2,000 అక్షరాలు పోతపోస్తాడు. విడగొట్టేవాడు 4,000 విడగొడతాడు. నునుపు చేసే వాడు 8,000 నునుపు చేస్తాడు. ఇక్కడ ప్రతి చర్యకూ సాపేక్షంగా ఎంతమంది అవసరమో నిర్ణయమవుతుంది. ఉమ్మడి కార్మికునిలో విభాగాలయిన విభాగ కార్మికుల సంఖ్యను చర్యల వారీగా నిర్ణయిస్తుంది. సామాజిక శ్రమ ప్రక్రియ పరిమాణాత్మక నిష్పత్తిని ఏర్పరుస్తుంది. ఇక అక్కడనించీ ఉత్పత్తి స్థాయిని పెంచాలంటే, అప్పటికున్న బృందాలకి, ఇంకొక బృందాన్ని కలపాలి. ఒక్కొక్క బృందంలో 6 గురు చొప్పున 4 బృందాలు ఉన్నాయనుకుందాం. అక్కడ ఉత్పత్తి స్థాయిని పెంచాలంటే, ఒకటో, రెండో బృందాల్ని కలపాలి. అందుకు మరొక 6 గురినో, 12 మందినో కలపాలి. ఇద్దర్నో ముగ్గుర్నో పెట్టడం కుదరదు.

### కార్ఖానా ఉత్పత్తి వివిధ కార్ఖానా ఉత్పత్తుల సమ్మేళనంగా అభివృద్ధి చెందవచ్చు

గాజు సీసాల తయారీ. ఇందులో మూడు ముఖ్య దశలు ఉంటాయి. మొదటిదశ, గాజు లోవుండే పదార్థాల్ని తయారుచెయ్యడం, ఇసుక సున్నం వగైరాలని మిశ్రమం చెయ్యడం, వాటిని కరిగించి గాజు ద్రవాన్ని తయారుచెయ్యడం – ఇవన్నీ తొలి దశలో పనులు. వీటిని చెయ్యడానికి చాలామంది విభాగ శ్రామికులు నియమితులవుతారు. తుది దశలో ఆరబెట్టే బట్టీ నుండి సీసాలను వెలికి తీయడం, రకాలవారీగా వేరుచెయ్యడం, పాక్ చెయ్యడం తుది దశ పనులు. ఈ దశలో కూడా చాలామంది విభాగ శ్రామికులు నియమితులవుతారు. ఈ రెండు దశల మధ్యలో గాజుని కరిగించడం, గాజు ద్రవాన్ని నేర్పుతో నిర్వహించడం ఉంటాయి. కొలిమి ముఖద్వారాలలో ప్రతిదాని దగ్గరా హోల్ అనే ఒక బృందం పనిచేస్తుంది. హోల్ లో సీసా చేసేవాడు ఒకడు, గాలి ఊదేవాడు ఒకడూ, పోగుచేసే వాడు ఒకడూ, అందించేవాడు ఒకడూ, తీసుకునేవాడు ఒకడూ ఉంటారు. కాబట్టి వాళ్ళ అయిదుగురి సహకారంతో మాత్రమే పనిజరుగుతుంది.. వాళ్ళలో ఏ ఒక్కరు లేకున్నా, పని ఆగిపోతుంది.

ఒక గాజు కొలిమికి కొన్ని ముఖద్వారాలు (openings) ఉంటాయి – ఇంగ్లండ్ లో ఇవి 4 నించి 6 దాకా. ప్రతిదాంట్లో గాజుద్రవం ఉండే కరిగించే మట్టి కుండ ఉంటుంది. పైన చెప్పిన అయిదుగురు పనివాళ్ళ జట్టు ఉంటుంది. అయితే భిన్న జట్ల మధ్య సంబంధం సామాన్య సహకారమే. కొలిమిని ఉమ్మడిగా వాడడం వల్ల పొదుపు అవుతుంది. ఇది సామాన్య సహకారం వల్ల కలిగేదే. 4–6 జట్ల శ్రామికులు పనిచేసేటటువంటి కొలిమి, ఒక గాజు గృహం. ఒక గాజు కార్ఖానాలో అటువంటి గాజు గృహాలు చాలా ఉంటాయి. పనికి కావలసిన సామాగ్రి ఉంటుంది. అవసరమైనంత మంది శ్రామికులుంటారు.

**అంతిమ విషయం.** కార్ఖానా ఉత్పత్తి వివిధ చేతి వృత్తుల కలయిక వల్ల ఏర్పడింది. అలాగే అది వేర్వేరు కార్ఖానా ఉత్పత్తుల సమ్మేళనంగా అభివృద్ధి అవుతుంది. ఇంగ్లండ్‌లో పెద్ద

గాజు కార్ఖానాదారులు వారు కరిగించే మట్టి కుండల్ని వారే చేసుకుంటున్నారు. కారణం ప్రక్రియ ఫలితం వీటి నాణ్యతని బట్టి ఉండడమే. ఇక్కడ ఉత్పత్తి సాధనాల్లో ఒకదాని ఉత్పత్తి, ఉత్పాదితం ఉత్పత్తితో కలిసిపోయింది. మరొకపక్క, సరుకు కార్ఖానా ఉత్పత్తి, ఇతర కార్ఖానా ఉత్పత్తులతో కలవవచ్చు. వాటిలో అది ముడిసరుకు కావచ్చు. ఆవిధంగా ఫ్లింట్ గాజు ఉత్పత్తి గాజు కోతతోనూ, ఇత్తడి పోతతోనూ కలిసింది; ఇత్తడి పోత రకరకాల గాజు వస్తువులకు లోహ చట్రాలు తయారుచెయ్యడానికి ఉపయోగ పడుతుంది.

ఇలా కలిసిన వివిధ కార్ఖానా ఉత్పత్తులు ఒక భారీ కార్ఖానా ఉత్పత్తిలో అంతో ఇంతో వేరుపడ్డ శాఖలుగా ఏర్పడతాయి. అదే సమయంలో అవి స్వతంత్ర ప్రక్రియలు, దేనికిదానికి సొంత శ్రమవిభజన ఉంటుంది.

ఈ కలయిక వల్ల చాలా అనుకూలతలు ఉంటాయి. ఉన్నప్పటికీ, అది దాని సొంత పునాది మీద సంపూర్ణ సాంకేతిక వ్యవస్థగా ఎన్నటికీ ఎదగజాలదు. అది యంత్రాలతో నడిచే పరిశ్రమలోకి పరివర్తన చెందినప్పుడు మాత్రమే ఆవిధంగా ఎదుగుతుంది.

**కార్ఖానా కాలంలో యంత్రాల వాడకం.** కార్ఖానా ఉత్పత్తి తొలికాలంలో సరుకుల ఉత్పత్తికి అవసరమైన శ్రమ కాలాన్ని తగ్గించాలి అన్న సూత్రం ఆమోదం పొందింది, రూపం దిద్దుకుంది. అక్కడక్కడా యంత్రాల వాడకం మొదలయింది; ప్రత్యేకించి, భారీస్థాయిలో, ఎక్కువ శక్తిని వెచ్చించి నిర్వహించాల్సిన కొన్ని మామూలు ప్రారంభ ప్రక్రియలలో యంత్రాలు వచ్చాయి. కాగితం తయారీ తొలిదశలో గుడ్డ ముక్కల్ని చించే పని, కాగితం మిల్లులు చేసేవి. లోహ కార్ఖానాల్లో ముడిఖనిజాల్ని పొడుం చేసే పని, దంచే మిల్లులు చేసేవి. యంత్రాల అభివృద్ధి చరిత్రని ధాన్య మిల్లుల నుంచి తెలుసుకోవచ్చు. రోమన్ సామ్రాజ్యం సకల యంత్రాల తొలి రూపమయిన జల చక్రాన్ని (water-wheel) తర్వాతి తరాలకు అందించింది. చేతివృత్తుల కాలం గొప్ప ఆవిష్కరణల్ని భావితరాలకిచ్చింది. దిక్సూచి, తుపాకి మందు, అచ్చు అక్షరాల ముద్రణ, దానంతటది నడిచే గడియారం ఆకాలం అందించినవే. అయితే మొత్తంమీద శ్రమ విభజన పాత్రతో పోలిస్తే యంత్రాల పాత్ర తక్కువ. అందుకే స్మిత్ శ్రమ విభజన పాత్రకు ప్రథమ ప్రాధాన్యతా, యంత్రాల పాత్రకు ద్వితీయ ప్రాధాన్యతా ఇచ్చాడు. 17వ శతాబ్దంలో యంత్రాల వాడకం అడపాదడపా జరిగింది. అయినా అది అత్యంత ముఖ్యమయినది. ఎందుకంటే, అది యాంత్రిక శాస్త్ర సృష్టికి ఆకాలపు గొప్ప గణిత శాస్త్రజ్ఞులకు అవసరమైన ఆచరణాత్మక ఆధారాన్నీ, ప్రేరణనీ ఇచ్చింది.

## కార్మికుల పైన కార్ఖానా వ్యవస్థ ప్రభావం

కొంతమంది విభాగ శ్రామికుల కలయికతో ఉమ్మడి శ్రామికుడు రూపొందుతాడు. అలా రూపొందిన ఉమ్మడి శ్రామికుడే కార్ఖానా ఉత్పత్తి దశకి విలక్షణమైన శ్రామికుడు. ఏదైనా సరుకు తయారు చేసే శ్రామికుడు, కొన్ని చర్యలు ఒకటి తర్వాత ఒకటి చెయ్యాలి. ఒకదాన్ని మరొకదానితో సమన్వయ పరచాలి. అందుకు తన శక్తి సామర్థ్యాల్ని వివిధ విధాల్లో వెచ్చించాల్సి వస్తుంది. ఒకచర్యలో ఎక్కువ బలం ప్రయోగించాలి. మరొక చర్యలో ఎక్కువ నైపుణ్యం చూపాలి.

ఇంకోచర్యలో ఎక్కువ శ్రద్ధ పెట్టాలి. ఏ వ్యక్తికీ ఈ లక్షణాలన్నీ సమాన స్థాయిలో ఉండవు. ఈ చర్యలన్నీ దేనికది వేరయ్యాక, ఎవరికి ఏ చర్య చేసే సామర్థ్యం ఎక్కువగా ఉంటుందో ఆచర్య వారివంతు అవుతుంది. ఆవిధంగా జట్లు ఏర్పడతాయి. ఒకవైపు శ్రమ విభజన నిర్మాణానికి వారి సహజ శక్తులే పునాది. మరొకపక్క, ఒకసారి కార్ఖానా ఉత్పత్తి వచ్చాక, కొన్ని ప్రత్యేక చర్యలు చెయ్యడానికి మాత్రమే సరిపోయే కొత్త శక్తులు ఆ సహజ శక్తులలో పెంపొందుతాయి. ఇప్పుడు ఉమ్మడికార్మికుడికి అన్ని లక్షణాలూ వస్తువు ఉత్పత్తికి ఉండాల్సిన స్థాయిలో ఉంటాయి. అత్యంత పొదుపుగా వాటిని వాడతాడు. విభాగ శ్రామికునిలో ఉండే ఒకే చర్యకు కట్టుబడిన పాక్షికత్వమూ, లోపాలూ అతను ఉమ్మడి కార్మికుడిలో ఒకడయ్యాక పోతాయి. పరిపూర్ణత చేకూరుతుంది. విభాగ శ్రామికుడు చేసే ఒకే చర్య, అతనిని పనిలో విఫలం కాని పరికరంగా మారుస్తుంది. మొత్తం యంత్రాంగంతో అతని సంబంధం ఆయంత్రభాగాలు ఎంత క్రమబద్ధంగా పనిచేస్తాయో అంత క్రమ బద్ధంగా పనిచేసేట్లు ఒత్తిడి పెడతాయి.

## శ్రమ శక్తుల అంతస్తులు

ఉమ్మడి శ్రామికుడి చర్యల్లో సరళమైనవీ ఉంటాయి, సంక్లిష్టమైనవీ వుంటాయి. ఎక్కువ స్థాయివీ, తక్కువ స్థాయివీ ఉంటాయి. కనుక ఆయా శ్రమశక్తుల శిక్షణ భిన్నస్థాయిల్లో ఉంటుంది. ఫలితంగా వాటికి వేర్వేరు విలువలు ఏర్పడతాయి. అందువల్ల కార్ఖానా ఉత్పత్తి శ్రమశక్తుల అంతస్తులు ఏర్పరుస్తుంది. దేనికి తగిన వేతనం దానికి ఉంటుంది. ఒకదానికీ ఎక్కువా, మరోకదానికీ తక్కువా ఉంటాయి. ఏమైనప్పటికీ ప్రతి ఉత్పత్తి ప్రక్రియలో సరళమైన చర్యలుంటాయి, వాటిని ఎవరైనా చెయ్యగలరు. ఆచర్యలు ఇప్పుడు సంక్లిష్టమైన చర్యల నుంచి విడిపోతాయి. కొందరు ప్రత్యేకంగా నియమించబడ్డ కార్మికులు చేసే చర్యలుగా స్థిరపడతాయి.

## నిపుణ శ్రామికులూ – అనిపుణ శ్రామికులూ

అందువల్ల అప్పటి నుంచీ కార్ఖానా ఉత్పత్తి పట్టుకున్న ప్రతి చేతివృత్తిలో అనిపుణశ్రామికులు అనే ఒక తరగతిని ఏర్పరచింది. చేతివృత్తిలో ఇలాంటి వాళ్లకి ఎలాంటిచోటూ ఉండేదికాదు. ఇది ఒక ఒకే చర్య చేసే ప్రత్యేకతని లోపరహితంగా వృద్ధి చేస్తుంది, మిగిలిన మొత్తం పనిచేసే శక్తినీ దెబ్బతీస్తుంది. శ్రామికుల అంతస్తుల వర్గీకరణతో పాటు, నిపుణ శ్రామికులు అనిపుణ శ్రామికులు అనే సరళ విభజన వుంటుంది. అనిపుణ శ్రామికులకి పని నేర్చుకునే ఖర్చు ఉండదు. నిపుణ శ్రామికుడితో పోలిస్తే ఆఖర్చు తగ్గుతుంది, – చేసే క్రియలను సులభతరం చెయ్యడం వల్ల. రెండు సందర్భాల్లోనూ శ్రమశక్తి విలువ తగ్గుతుంది. పని నేర్చుకునేందుకు అయ్యే ఖర్చులు పూర్తిగానో పాక్షికంగానో తగ్గడం వల్ల శ్రమ శక్తి విలువ తగ్గుతుంది. ఫలితంగా పెట్టుబడికి దక్కే అదనపువిలువపెరుగుతుంది; శ్రమశక్తి పునరుత్పత్తికి అవసరమయ్యే శ్రమకాలం తగ్గించేది ఏదైనా అదనపు శ్రమకాలం పరిధిని పెంచుతుంది. అనిపుణ శ్రమ సృష్టి, శ్రమశక్తి విలువ తగ్గింపు రెండూ పెట్టుబడి దారుడికి సాపేక్ష అదనపు విలువనిచ్చేవే.

## విభాగం 4

## కార్ఖానాలో శ్రమ విభజనా – సమాజంలో శ్రమ విభజనా

కార్ఖానా ఉత్పత్తి పుట్టుక, దానిలోని మామూలు అంశాలు చూశాం. తర్వాత డిటైల్ శ్రామికుడి గురించీ, అతని పరికరాల గురించీ తెలుసుకున్నాం. చివరగా మొత్తం యంత్రాంగాన్ని పరిశీలించాం. ఇప్పుడు కార్ఖానా ఉత్పత్తిలో శ్రమ విభజనకూ, సామాజిక శ్రమ విభజనకూ ఉన్న సంబంధాన్ని టూకీగా చూద్దాం.

నాగరిక జాతుల్లో మూడు తరహాల శ్రమవిభజన గమనించవచ్చు:

1. **సాధారణ శ్రమ విభజన** (division of labour in general) – సామాజిక ఉత్పత్తి వ్యవసాయం, పరిశ్రమలు వంటి ప్రధాన భాగాలుగా వేరుపడింది. దీన్ని సాధారణ శ్రమవిభజన అనవచ్చు.

2. **ప్రత్యేక శ్రమ విభజన** (division of labour in particular) – వ్యవసాయం పరిశ్రమలు వాటిలో అవి ఉపభాగాలుగా పలుమార్లు విడిపోయాయి. ఇలా విడిపోవడాన్ని ప్రత్యేక శ్రమ విభజన అనవచ్చు.

3. **విభాగ శ్రమ విభజన** (division of labour in singular or in detail) ఒక వర్క్ షాప్ లో శ్రమ విభజనని విభాగ/ పాక్షిక శ్రమ విభజన అనవచ్చు.

### శ్రమ విభజన అభివృద్ధి

వ్యవసాయమూ, వస్తూత్పత్తీ అత్యంత భిన్నమైనవి. అవి విడిపోవడంతో శ్రమ విభజన మొదలయింది. వస్తూత్పత్తిలో మరల శ్రమ విభజన వచ్చింది. కుమ్మరం, కమ్మరం, వడ్రంగం వగైరాలుగా విడిపోయాయి. తిరిగి ప్రతి ఒక్కటీ విడిపోయాయి. అయితే దేనికది స్వతంత్ర వృత్తి. పూర్తి వస్తువు తయారవుతుంది. కార్ఖానా ఉత్పత్తి వచ్చాక, ఒక వస్తువు చెయ్యడం ఒకరి పని కాక, పలువురి పని అయింది. చీలలు చేసే కార్ఖానాలో ఏ ఒక్కడూ పూర్తిగా చీల చేయడు. అయిదారుగురి చేతులు పడితేనే గాని చీల రెడీ కాదు. శ్రమ విభజన క్రమంగా అభివృద్ధి చెందింది.

### ముందు సమాజంలో శ్రమవిభజన, తర్వాతనే కార్ఖానాలో శ్రమవిభజన

కార్ఖానా ఉత్పత్తిలో శ్రమ విభజనకి, సామాజిక శ్రమవిభజన ఒకానొక స్థాయికి అభివృద్ధి చెందడం ముందుగా అవసరం. కార్ఖానా ఉత్పత్తిలో శ్రమ విభజన, తిరిగి సామాజిక శ్రమవిభజన మీద ప్రభావం చూపుతుంది. చూపి, సామాజిక శ్రమవిభజనని మరింత పెంచుతుంది. శ్రమ సాధనాల్లో వైవిధ్యం వస్తూ వుంటుంది. వాటిని తయారు చేసే పరిశ్రమలు అంతకంతకూ

వేరువేరు అవుతాయి. ఉదాహరణకి, 17వ శతాబ్దంలోనే దారపు కండె నాడెల (shuttles) తయారీ ఒక ప్రత్యేక శాఖ అయింది. ఆవిధంగా సామాజిక శ్రమ విభజన అభివృద్ధి చెందుతుంది.

అప్పటికి ఇతర పరిశ్రమలతో కలిపి ఒక ఉత్పత్తిదారుడు నడిపే ఒక పరిశ్రమని కార్ఖానా వ్యవస్థ పట్టుకుంటే, ఈ పరిశ్రమలు వెంటనే తమ సంబంధాన్ని కోల్పోయి స్వతంత్రమవుతాయి. అది ఒక సరుకు ఉత్పత్తిలో ఒక ప్రత్యేక దశని పట్టుకుంటే, మిగిలిన దశలు అన్ని స్వతంత్ర పరిశ్రమలుగా పరివర్తన చెందుతాయి. ఒక పూర్తి సరుకు కొన్ని భాగాల్ని కలిపి కట్టిన దయితే, ఆ డిటైల్ చర్యలు విడివడి పోవచ్చు. తిరిగి అచ్చమైన వేర్వేరు చేతివృత్తులుగా రూపొందవచ్చు. కార్ఖానా ఉత్పత్తిలో శ్రమ విభజనని సంపూర్ణపరచడంకోసం, ఒక ఉత్పత్తి శాఖ అనేక కార్ఖానా ఉత్పత్తులుగా విడగొట్టబడుతుంది. వాటిలో కొన్నిపూర్తిగా కొత్తవి కావచ్చు. అవిగ్నాన్ (Avignon) లో, బట్టలు నేసేవాళ్ళు ఏక కాలంలో మరిన్ని రకాలు నేర్చుకో కూడదు అనే చట్టం ఉండేది.

## ప్రాదేశిక శ్రమ విభజన

కొన్ని ప్రత్యేక ఉత్పత్తి శాఖలు కొన్ని జిల్లాల్లోని ప్రత్యేక ప్రాంతాలకు పరిమితమవుతాయి. ఇదే ప్రాదేశిక శ్రమ విభజన. ఉన్ని వస్త్రాల్లో నాణ్యమైనవి సోమర్ సెట్ షైర్ లోనూ, ముతకవి యార్క్ షైర్ లోనూ, పొడవాటి ఎల్స్ ఎక్సెటర్ లోనూ, సర్జీలు సుడ్బరీ లోనూ క్రేప్ లు నార్విచ్ లోనూ, నార కలిసిన ఉన్ని బట్టలు కెండాల్ లోనూ, దుప్పట్లు విట్నే లోనూ ఇంకా ఇలా ఉత్పత్తి అవుతున్నాయి. కార్ఖానా ఉత్పత్తి లోని శ్రమ విభజనని గురించి చెప్పాక, మార్క్స్ సమాజంలో శ్రమ విభజనకీ, కార్ఖానా శ్రమవిభజనకీ తేడాలని వివరిస్తాడు. రెండు శ్రమ విభజనలకూ ఎన్నో పోలికలున్నప్పటికీ, అవి స్థాయిలోనూ, స్వభావం లోనూ భిన్నమైనవి. ఒక వృత్తికి సంబంధించిన వివిధ శాఖలను కలిపే అదృశ్యబంధం ఉన్నచోట రెంటికున్న పోలిక పేచీలేకుండా స్పష్టంగా కనబడుతుంది. ఉదాహరణకి, పశుపోషకుడు తోళ్ళు (hides) తీస్తాడు, చర్మకారుడు వాటిని పదును చేసి చర్మంగా చేస్తాడు. చెప్పులు కుట్టేవాడు ఆ చర్మాన్ని బూట్లుగా చేస్తాడు. ఇక్కడ ప్రతివాడూ ఉత్పత్తిచేసిన వస్తువు అంతిమ రూపానికి ఒక మెట్టు మాత్రమే. అంతిమ రూపం ఆముగ్గురి ఉమ్మడి శ్రమ ఉత్పాదితం. దీని పక్కనే, పశుపోషకుడికీ, చర్మకారుడికీ, చెప్పులు కుట్టేవానికీ ఉత్పత్తి సాధనాలు సమకూర్చే వివిధ పరిశ్రమలు ఉండనే ఉన్నాయి.

## ఈ ముగ్గురి స్వతంత్ర శ్రమల మధ్య బంధం ఏర్పరచేది ఏమిటి?

వారి ఉత్పాదితాలు సరుకులు అనే వాస్తవమే. మరొకవైపు, కార్ఖానా ఉత్పత్తిలో, శ్రమ విభజనకి లాక్షణికమైనది ఏమిటి? విభాగ శ్రామికుడు సరుకులు ఉత్పత్తి చెయ్యడు అనే వాస్తవమే. సమాజంలో శ్రమ విభజన భిన్న పరిశ్రమల శాఖల ఉత్పత్తుల క్రయవిక్రయాల ద్వారా ఏర్పడుతుంది. ఒక వర్క్ షాప్ లోని విభాగ చర్యల మధ్య సంబంధం అనేకమంది శ్రామికుల శ్రమ శక్తిని ఒక పెట్టుబడిదారుడు కొని సంయుక్త శ్రమ శక్తిగా ఉపయోగించడం ద్వారా ఏర్పడుతుంది.

## ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణా– విడబడడమూ

- కార్ఖానాలో శ్రమ విభజన అంటే ఒకే పెట్టుబడి దారుడి చేతిలో ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణ

ఉన్నట్లు. సమాజంలో శ్రమవిభజన అంటే ఉత్పత్తిసాధనాలు అనేకమంది స్వతంత్ర సరుకుల ఉత్పత్తిదారుల మధ్య చెల్లాచెదురుగా ఉన్నట్లు.

- కార్ఖానాలో ఫలానా పనికి ఫలానింతమంది పనివాళ్ళు ఉండాలనే కఠిననిబంధన ఉంటుంది. కాని సమాజంలో శ్రమవిభజనలో శ్రామికులసంఖ్యకీ, ఉత్పత్తి సాధనాల సంఖ్యకీ నిబంధనలుండవు. యాదృచ్ఛికతా, ఉత్పత్తిదారుల నియమరహిత చపలచిత్తతా పూర్తిగా పనిచేస్తాయి.
- భిన్న ఉత్పత్తి రంగాలు సమతూకం (equilibrium) వైపు మొగ్గుచూపేది నిజమే: ఎందుకంటే, ఒకవైపు ప్రతి సరుకు ఉత్పత్తిదారుడూ ఏదో ఒక సామాజిక అవసరాన్ని తీర్చే ఉపయోగపు విలువని ఉత్పత్తి చెయ్యాల్సుంటాడు. అదే సమయంలో ఈ కోర్కెలు పరిమాణ రీత్యా భిన్న మైనవి. అయినాగాని, వాటి నిష్పత్తుల్ని క్రమబద్ధమైన వ్యవస్థగా స్థిరపరిచే అంతస్సంబంధం ఉంది. ఆ వ్యవస్థ అనుకోకుండా పెరిగే వ్యవస్థ; మరొకవైపు, సమాజానికున్న కాలంలో ఏసరుకు ఉత్పత్తిమీద ఎంత పెట్టగలదనే విషయాన్ని సరుకుల విలువ నియమం అంతిమంగా నిర్ణయిస్తుంది. సమతుల్యత వైపు నిరంతరం మొగ్గే పోకడ, ఈ సమతుల్యతని నిరంతరం తలక్రిందులు చేసే ప్రయత్నానికి ప్రతిచర్యగా ఉంటుంది. కార్ఖానాలో క్రమబద్ధంగా నడిచే శ్రమ విభజన, సమాజంలో శ్రమ విభజన ప్రకృతి విధించిన అవసరం అవుతుంది. అది ఉత్పత్తిదారుల నియమరహిత చపలచిత్తతని, అదుపులో పెడుతుంటుంది. మార్కెట్ ధరల ఎగుడు దిగుళ్ళలో తెలుస్తుంది.

పెట్టుబడిదారుడి సొంత యంత్రాంగంలో భాగమైన శ్రామికులమీద అతనికి వివాదమే లేని అధికారం ఉన్నట్లు కార్ఖానా శ్రమ విభజన తెలుపుతుంది. సమాజం లోని శ్రమ విభజన స్వతంత్ర సరుకు ఉత్పత్తి దారుల్ని సంబంధంలో పెడుతుంది. వాళ్ళు పోటీ అనే అధికారాన్ని తప్ప మరి దేన్నీ ఒప్పుకోరు. పరస్పర ప్రయోజనాల ఒత్తిడి పెట్టే నిర్బంధాన్ని తప్ప ఇంకే అధారిటీని గుర్తించరు. కార్ఖానా శ్రమవిభజనని జీవితాంతం ఒకే చిన్న చర్యకు కార్మికుడు కట్టబడి ఉండడాన్ని, పెట్టుబడికి శ్రామికుడు పూర్తిగా అధీనుడై ఉండడాన్ని బూర్జువా మనస్సు మెచ్చుకుంటుంది. ఉత్పాదకతని పెంచే నిర్మాణంగా దాన్ని కొనియాడుతుంది.

## పెట్టుబడిదారీ శ్రమ విభజనా– అంతకు ముందు శ్రమ విభజనా

మరీ పురాతన భారత కమ్యూనిటీలలో (ఒకేచోట నివసించే జన సమూహం) భూమి అందరిదీ. వ్యవసాయమూ, చేతివృత్తులూ కలిసే ఉండేవి. మార్చరాని శ్రమ విభజన ఉండేది. ఒకవేళ కొత్త కమ్యూనిటీ ఏర్పడితే అక్కడ కూడా అదే శ్రమ విభజన అమలయ్యేది. ఆ కమ్యూనిటీలకు పై అంశాలు ప్రాతిపదిక. అటువంటి కమ్యూనిటీలు కొన్ని ఇప్పటికీ కొనసాగుతున్నాయి. 100 ఎకరాల నించీ ఎన్నో వేల ఎకరాల వరకూ విస్తరించి ఉంటాయి. ప్రతిదీ తనకు కావలసిన వస్తువులన్నిటినీ ఉత్పత్తి చేసుకుంటుంది. తన ఉత్పత్తులలో ప్రధాన భాగాన్ని తనే స్వయంగా ఉపయోగించుకోవడం తప్పనిసరి. అంటే ఆభాగం సరుకు రూపం తీసుకోదు. అందువల్ల మొత్తం భారత సమాజంలో ఉత్పత్తికి సరుకుల మారకం ద్వారా ఏర్పడ్డ

శ్రమవిభజనతో సంబంధం లేదు. అవసరాలకు పోగా ఉన్న మిగులు మాత్రమే సరుకు అవుతుంది. అందులోనూ కొంత భాగం కౌలుకింద వస్తు రూపంలో రాజ్యానికి చేరాలి. ఈ కమ్యూనిటీల ఏర్పాటు ఇండియాలో వేర్వేరు చోట్ల వేర్వేరుగా ఉంటుంది. సాదా రూపంలోవున్న కమ్యూనిటీల్లో భూమి సాగు ఉమ్మడిగా వుంటుంది. సభ్యులు అందరికీ పంట పంపిణీ అవుతుంది. అదే సమయంలో వడకడమూ, నెయ్యడమూ ఏ కుటుంబానికి ఆ కుటుంబం అనుబంధ పరిశ్రమలుగా చేసేవి. ఒకే పనిలో నిమగ్నమయిన మామూలు జనం పక్కనే ఈ క్రింది వాళ్ళు కూడా ఉండేవాళ్ళు:

- ప్రధాన గ్రామనివాసి – న్యాయాధికారీ అతనే, పోలీసూ అతనే, పన్నువసూలుదారూ అతనే.
- లెక్కలు రాసేవాడు – దున్నకం పద్దులు చూస్తాడు, దానికి సంబంధించి ప్రతివిషయాన్నీ నమోదు చేస్తాడు.
- నేర శిక్షకుడు – నేరస్తులని శిక్షిస్తాడు, కొత్త ప్రయాణీకులకి రక్షణ కల్పిస్తాడు. పక్క ఊరి దాకా వెంట వెళ్లి దిగ బెడతాడు.
- సరిహద్దు రక్షకుడు – పొరుగు వారు జొరబడకుండా సరిహద్దులు కాపాడతాడు.
- నీటి పర్యవేక్షకుడు – ఉమ్మడి చెరువుల నీటిని పంట సాగుకోసం పంపిణీ చేస్తాడు.
- బ్రాహ్మణుడు – మతపరమైన కార్యక్రమాలు నిర్వహిస్తాడు.
- ఉపాధ్యాయుడు – పిల్లలకు ఇసుకలో రాయడం, చదవడం నేర్పుతాడు.
- పంచాంగ బ్రాహ్మణుడు – విత్తనాలు పెట్టడానికీ, పంట కోతకూ, అన్ని ఇతర వ్యవసాయ పనులకూ మంచిరోజులు చెప్తాడు.
- కమ్మరి, వడ్రంగి – వ్యవసాయ పనిముట్లు చేస్తారు. చెడిపోతే బాగుచేస్తారు.
- కుమ్మరి – ఊరికి కావలసిన అన్ని మట్టి పాత్రలూ చేస్తాడు.
- మంగలి – తలపని చేస్తాడు
- చాకలి – బట్టలు ఉతుకుతాడు
- కంసాలి – వెండి ఆభరణాలు చేస్తాడు.
- కవి – అక్కడక్కడ. కొన్ని కమ్యూనిటీలలో కంసాలి పనీ, మరి కొన్నిటిలో అధ్యాపకుడి పనీ చేస్తాడు.

### వీళ్ళందరి ఖర్చు కమ్యూనిటీయే పెట్టుకుంటుంది

ఒకవేళ జనాభా పెరిగితే, కాళీగా ఉన్న నేలమీద కొత్త కమ్యూనిటీ ఏర్పడుతుంది. ఇది కూడా పాత కమ్యూనిటీ మాదిరిగానే ఉంటుంది. ఈ మొత్తం నిర్మితిలో ఒక క్రమబద్ధమైన శ్రమ విభజన కనబడుతుంది.

కమ్యూనిటీలో శ్రమ విభజనని నియంత్రించే నియమం ప్రకృతి నియమం లాగా ఎదురులేకుండా పనిచేస్తుంది. అదే సమయంలో ప్రతి వృష్టి వృత్తి దారుడూ – కంసాలి, వడ్రంగి మరెవరైనా కావచ్చు– తన వర్క్ షాప్‌లో చేతి వృత్తి చర్యలన్నిటినీ సాంప్రదాయ పద్ధతిలో నిర్వహిస్తాడు. అయితే స్వతంత్రగానూ, తనమీద ఎవ్వరి అధికారాన్నీ గుర్తించకుండానూ

నిర్వహిస్తాడు. ఈ స్వయం సమృద్ధ కమ్యూనిటీలు అదే రూపంలో తమ్ముతాము పునఃసృష్టి చేసుకుంటాయి. ఎప్పుడయినా యాదృచ్ఛికంగా ధ్వంసం అయినప్పుడల్లా, తిరిగి అదే పేరుతో, అదేచోట తలెత్తుతుంది. ఈ సరళతే ఆసియా గ్రామ సమాజాలు మారకపోవడానికి కీలకం. ఆసియా రాజ్యాల నిరంతర పతన, పునఃస్థాపనలకు కొట్టొచ్చినట్లు భిన్నంగా ఈ సమాజాలు మారకుండా ఉంటాయి.

పాలక వంశాలు నిరంతరం మారుతున్నా, గ్రామ సమాజాలు మారవు. అందుకు కీలకం ఉంది. ఏమంటే, రాజకీయ ఆకాశంలో ఏర్పడే తుఫాను మేఘాలు సమాజపు ఆర్థిక అంశాలను తాకలేవు.

గిల్డు నిబంధనలు ఒక మేస్త్రీ నియమించే పనివాళ్ళ సంఖ్యని పరిమితం చేశాయి. తద్వారా అతను పెట్టుబడి దారుడు కాకుండా అడ్డుకున్నాయి. అంతే కాదు, అతను మేస్త్రీ కాని ఇతర చేతివృత్తుల్లో తన పనివాళ్ళని నియమించ కూడదు. గిల్డులకి తెలిసిన పెట్టుబడి వర్తక పెట్టుబడి మాత్రమే. అయితే వర్తక పెట్టుబడి చేతివృత్తుల్లోకి చొచ్చుకు రాకుండా పట్టుబట్టి గిల్డులు తిప్పికోట్టేవి. వర్తకుడు ఎసరుకునైనా కొనగలడు, కాని శ్రమశక్తిని సరుకుగా కొనజాలడు. ఎందుకంటే అతను ఏచేతివృత్తిలోనూ మేస్త్రీ కాదుగనక. అతను సరుకుల వ్యాపారిగా ఉన్నాడంటే, గిల్డులు అతన్ని ఉండనిచ్చినందువల్లనే. ఇంకొంత శ్రమవిభజన జరిగితే, అప్పటికున్న గిల్డులు విడిపోయేవి, వాటి సరసన కొత్త గిల్డులు వచ్చి చేరేవి. అయితే ఇదంతా ఒకే వర్క్ షాప్ లో వివిధ చేతివృత్తులు కేంద్రీకృతం కాకుండా జరిగేది. అందువల్ల చేతి వృత్తుల్ని విడగొట్టడం ద్వారా, వేరుచెయ్యడం ద్వారా, లోపరహితం చెయ్యడం ద్వారా గిల్డ్ నిర్మాణం కార్ఖానా ఉత్పత్తి మనుగడకి భౌతిక పరిస్థితుల్ని ఎంతగా దోహదం చేసినప్పటికీ, వర్క్ షాప్ లో శ్రమ విభజనకి అవకాశం ఇవ్వలేదు. మొత్తం మీద శ్రామికుడు తన ఉత్పత్తి సాధనాలతో ఐక్యంగా ఉండేవాడు – నత్త తన గుల్లతో ఉన్నట్లు. అందువల్ల కార్ఖానా ఉత్పత్తికి ప్రధాన ప్రాతిపదిక – శ్రామికుణ్ణి అతని ఉత్పత్తి సాధనాలనుంచి వేరుపరచడమూ, ఆ సాధనాలని పెట్టుబడిలోకి మార్చడమూ – కొరవడి ఉంది.

సమాజంలో శ్రమ విభజనని తెచ్చింది వర్తకపు సరుకుల మారకం అయినా, కాకున్నా – సామాజిక శ్రమ విభజన సమాజంలో వివిధ ఆర్థిక నిర్మాణాలకు ఉమ్మడి అయినదే. కాగా వర్క్ షాప్‌లో కార్ఖానాదారుడు తెచ్చే శ్రమవిభజన కేవలం పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం యొక్క ప్రత్యేక సృష్టి.

## విభాగం 5
## కార్ఖానా ఉత్పత్తీ - దాని పెట్టుబడిదారీ స్వభావమూ

ఒక పెట్టుబడిదారుడి అజమాయిషీలో శ్రామికుల సంఖ్య పెరగడమే సహకారానికి, ప్రత్యేకించి కార్ఖానా ఉత్పత్తికి సహజమైన ఆరంభ బిందువు. మొదట్లో మరింతమంది కార్మికుల్ని కలపడంలో పెట్టుబడిదారుడికి ప్రేరణ/ఉద్దేశం ఆర్థిక పరమైనది, సాంకేతికపరమైనది కాదు: ఎంత ఎక్కువ మందిని పెట్టుకుంటే అంత ఎక్కువ అదనపు విలువ వస్తుంది.

ఒక పెట్టుబడి దారుడు అప్పటికున్న శ్రమవిభజన విధించిన కనీస సంఖ్యలో పనివాళ్ళని పెట్టుకోవాలి. కనీసం ఒక జట్టు ఉండాలి. స్మిత్ చూసిన పిన్నుల కార్ఖానాలో శ్రామికుల జట్టులో 10 మంది ఉన్నారు. అంటే అక్కడ కనీస శ్రామికుల సంఖ్య 10. మరొక పక్క, మరింత శ్రమ విభజన వల్ల ప్రయోజనాలు పనివాళ్ళని పెంచితేనే కలుగుతాయి. కార్ఖానాలో పనివాళ్ళని పెంచడమంటే జట్లను పెంచడమే. పిన్నుల కార్ఖానాలో అయితే పదేసి మంది చొప్పున పెట్టుకోవాలి. చొక్కాలు కుట్టే కార్ఖానాలో కత్తిరించేవాడూ, బాడీ కుట్టేవాడూ, కాలర్ కుట్టేవాడూ, చేతులు కుట్టేవాడూ, కాజాలుతీసేవాడూ, గుండీలు కుట్టేవాడూ మొత్తం 6 గురు ఒక జట్టు అనుకుందాం. ఉత్పత్తి పెంచాలంటే పనివాళ్ళని పెంచాలి. అయితే ఇక్కడ ఇంకోకరినో ఇద్దరినో పెట్టుకోవడం వల్ల ప్రయోజనం ఉండదు. వాళ్ళు వృధా. పెడితే మరో ఆరుగురి జట్టు పెట్టాలి. జట్లు జట్లు పెంచాలేగాని, విడివిడిగా పనివాళ్ళని నియమించడం కుదరదు.

**శ్రామికులు పెరిగితే, అస్థిర పెట్టుబడి పెరుగుతుంది.** శ్రామికుల జట్ల సంఖ్య పెరిగే కొద్దీ, అస్థిర పెట్టుబడి పెరుగుతుంది. ఇది స్పష్టమే. ఏడుగురున్న జట్టుకు వేతనం 1000 రూపాయలు అనుకుంటే, 4 జట్లకు 4000 కావాలి. అంటే జట్ల సంఖ్యను బట్టి అస్థిర పెట్టుబడి ఉంటుంది.

**స్థిర పెట్టుబడి కూడా పెరుగుతుంది.** అంతేకాదు జట్లు పెరిగితే వాడే ముడిపదార్థాలూ, పరికరాలూ మరిన్ని అవసరమవుతాయి. ఒక జట్టుకు కావలసిన పరికరాలూ, ముడిపదార్థాలూ ఏడు రెట్లు కావాలి. కాబట్టి స్థిరపెట్టుబడి కూడా పెరుగుతుంది. కనుక పెట్టుబడిదారుడి చేతిలో ఉండాల్సిన కనీస పెట్టుబడి పెరుగుతూ పోవాలి అనేది కార్ఖానా ఉత్పత్తి స్వభావం మీద ఆధారపడ్డ ఒక నియమం. సామాజిక ఉత్పత్తిసాధనాలూ, జీవనాధారసాధనాలూ పెట్టుబడిలోకి పరివర్తన చెందుతూ ఉండాలి అనేది నియమం.

**కార్మికులలో ఎక్కువ తక్కువల తేడాలు.** కార్ఖానా ఉత్పత్తి అంతకుముందు స్వతంత్రుడుగా వున్న శ్రామికుణ్ణి పెట్టుబడి క్రమశిక్షణకీ, అజమాయిషీకి లోబరుస్తుంది. అంతేకాదు పనివాళ్ళలోనే ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ, ఇంకొకరు మరీ తక్కువ అనే ఎక్కువ తక్కువల దొంతర

ఏర్పరుస్తుంది.

### వ్యష్టి శ్రామికుని మీద శ్రమ విభజన కలిగించే మార్పులు

సామాన్య సహకారం ఒకశ్రామికుని పనివిధానాన్ని చాలా వరకూ మార్పు చేయకుండా అలానే వుంచేస్తుంది. కార్ఖానా ఉత్పత్తి అలా కాదు, అతని పని విధానాన్ని పూర్తిగా, తీవ్రంగా మార్చివేస్తుంది. శ్రమ శక్తిని కూకటి వేళ్ళతో సహా స్వాధీనం చేసుకుంటుంది. లాప్లాటా రాష్ట్రాల్లో తోళ్ళ కోసమో, కొవ్వుకోసమో జంతువునే చంపేవారు. అలాగే కార్మికుణ్ణి ఒక ముక్క పనిలో ప్రావీణ్యత కోసం బలవంత పెడుతుంది. అతనికున్న అనేక ఉత్పత్తి సామర్ధ్యాలనూ, సహజ ప్రేరణలనూ అణగదొక్కుతుంది. ఒక ముక్కపనిలో నిపుణత కోసం ఎన్నో చేయగల శ్రామికుని శక్తిని బలి పెడుతుంది. బలవంతంగా అతన్ని ఒక అవిటి అనాకారిని చేస్తుంది - Dugald Stewart calls manufacturing labourers -living automatons ... employed in the details of the work. (I. c., p. 318.)

### శ్రామికుడు వర్క్ షాప్ కి తోక అవుతాడు

మొదట, సరుకు తయారీకి అవసరమైన ఉత్పత్తి సాధనాలు లేక పోవడం వల్ల, తన శ్రమ శక్తిని పెట్టుబడికి అమ్ముతాడు. ఇప్పుడు అదే శ్రమశక్తి పెట్టుబడికి అమ్ముడవకపోతే, అది అతనికి ఉపయోగపడదు. అమ్ముడయిన తర్వాత కార్ఖానాలో మాత్రమే పనులు చెయ్యగలుగుతాడు. స్వతంత్రంగా ఏదీ చెయ్యలేడు. కనుక కార్ఖానా కార్మికుడు పెట్టుబడిదారుడి వర్క్ షాప్‌కి ఉపాంగం (appendage) గా మాత్రమే తన ఉత్పాదక శక్తిని పెంచుకోగలడు. స్టార్చ్ (1766-1835) మాటలు కోట్ చేస్తాడు: మొత్తం వృత్తి చెయ్యగల శ్రామికుడు ఎక్కడయినా పనిచెయ్యగలడు, జీవనాధార సాధనాల్ని సంపాదించుకోగలడు. కార్ఖానాలోని విభాగ శ్రామికుడు తోటి వాళ్ళనుంచి వేరయితే, తన శ్రమ శక్తిని స్వతంత్రంగా, సొంతంగా ఉపయోగించుకోలేడు. కార్ఖానా దారుని మీద ఆధారపడక తప్పదు. అందువల్ల శ్రమ విభజన కార్ఖానా కార్మికుణ్ణి పెట్టుబడిదారుడి ఆస్తిగా ముద్ర వేస్తుంది.

### విభాగ శ్రామికుడు మేధో పరంగా వికలాంగుడు అవుతాడు

విభాగ కార్మికులకు ఆ ముక్క మాత్రమే చేసే నైపుణ్యం ఉంటుంది. మిగిలిన ముక్క పనులు చేసే నైపుణ్యాన్నీ, మేధోసామర్ధ్యాన్నీ కోల్పోతారు. స్మిత్ ఇలా అన్నాడు: జీవితాంతమూ చిన్న చర్యలు చేస్తూ ఉండే వాడికి, అవగాహనని ఉపయోగించే అవసరం రాదు. సాధారణంగా ఒక మనిషి ఎంతటి అజ్ఞానీ, మూర్ఖుడూ కాగలడో, అంతటి అజ్ఞానీ, మూర్ఖుడూ అవుతాడు... సహజంగానే అతని మనోధైర్యం దెబ్బతింటుంది. అలాంటి శ్రామికుని మేధ వికసించదు. అవగాహన కుంటుబడుతుంది - A. Smith: "Wealth of Nations," Bk. v., ch. i, art. ii.

### విభాగ శ్రామికుడు శారీరకంగా వికలాంగుడు అవుతాడు

విభాగ శ్రామికుని దేహం కూడా వికలాంగం అవుతుంది. ఒకే పని చేసిచేసి, మరొక పని చేయలేనిదిగా తయారవుతుంది. కార్ఖానా ఉత్పత్తి శ్రామికుడి జీవిత మూలాల్నే దెబ్బతీస్తుంది

మళ్ళీ స్మిత్: అతను ఏ పనికైతే నియోగించబడ్డాడో, అది తప్ప మరే పనిలోనూ తన సామర్థ్యాన్ని పట్టుదలతో ప్రదర్శించలేడు. ఏ నాగరిక సమాజంలోనైనా శ్రమించే పేదలు తప్పకుండా దిగబడేది ఈ స్థితిలోకే. స్కాటిష్ రాజకీయవేత్త ఊర్క్ హార్ట్ (1805–1877) అన్నట్లు : ఒక మనిషిని ఉప విభజన చెయ్యడమంటే – అతను శిక్షించదగిన వాడయితే – అతణ్ణి ఉరితీయడమే; శిక్షార్హుడు కానట్లయితే, అతణ్ణి హత్యచేయ్యడమే.

## దోపిడీ సాధనంగా శ్రమ విభజన

కార్ఖానా ఉత్పత్తిలో శ్రమవిభజన సామాజిక ఉత్పాదక శక్తిని పెంచుతుంది. అయితే ఇది పెట్టుబడిదారుడి కోసమే, శ్రామికుని కోసం కాదు. శ్రామికుల్ని అవిటివాళ్ళుగా చెయ్యడంద్వారా ఉత్పాదక శక్తిని పెంచుతుంది. అంతేకాదు, శ్రమ మీద పెట్టుబడి పెత్తనం చలాయించడానికి కొత్త పరిస్థితులు కల్పిస్తుంది. అందువల్ల, ఒకపక్క ఆర్థికాభివృద్ధిలో చారిత్రకంగా అవసరమైన, ప్రగతిశీలమైన దశ అయినట్లు తననుతాను ప్రదర్శించుకున్నా, మరొక పక్క అది నాజూకైన, నాగరికమైన దోపిడీ విధానం.

రాజకీయ అర్థశాస్త్రం కార్ఖానాఉత్పత్తి దశలో ఒక స్వతంత్ర శాస్త్రంగా అంకురించింది. అది సామాజిక శ్రమ విభజనని కార్ఖానా ఉత్పత్తి దృక్కోణం నుంచే చూసింది. అంతే సమయంలో మరిన్ని సరుకులు ఉత్పత్తిచేసి, ఫలితంగా సరుకుల్ని చౌక పరిచే సాధనంగా, పెట్టుబడి పోగుబడిని త్వరపరిచే సాధనంగా చూసింది. అంతకు ముందు రచయితలు సరుకు నాణ్యతనీ, ఉపయోగపు విలువనీ మాత్రమే పట్టించుకునే వాళ్ళు. పరిమాణాన్నీ, మారకపు విలువనీ కాదు. సరుకులు చౌకవడం గురించీ ఒక్క మాట చెప్పేవారు కాదు. సామాజిక ఉత్పత్తి శాఖలు వేర్పడడం వల్ల సరుకుల మెరుగవుతాయి. మనుషులు తమ అభిరుచులకూ, ప్రతిభలకూ తగిన రంగాన్ని ఎంచుకోగలుగుతారు. అంటే, శ్రమ విభజన వల్ల సరుకులు మెరుగయ్యేవి, వాటి తయారీ దారులూ ప్రయోజనం పొందేవారు. కార్ఖానా ఉత్పత్తిలో సరుకుల పరిమాణం ముఖ్యం, సరుకులు చౌకబడడమే ప్రధానం. పెట్టుబడిదారుల ప్రయోజాల పెంపుకే ఉత్పత్తి, శ్రామికుల కోసం ఏమాత్రం కాదు.

## శ్రమ విభజనకున్న పరిమితులు

శ్రమ విభజనకు పరిమితులున్నాయి. అవి పెట్టుబడిదారీ ఉత్పత్తికి పూర్తిగా సరిపడే రూపాన్ని ఇవ్వవు. ఎందుకంటే, ఆ విభజన మునుపటి ఉత్పత్తి విధానం మీద నిర్మితమయింది. కార్ఖానా ఉత్పత్తి కార్మికుని నైపుణ్యం మీద ఆధారపడింది. అందువల్లనే నిపుణ శ్రామికుల ప్రతిఘటనా, అవిధేయతా. పెట్టుబడిదారీ విధానం కార్ఖానా ఉత్పత్తిగా వున్న కాలంలో, దాని ప్రత్యేక పోకడలు పూర్తిగా అభివృద్ధి కాకుండా ఎన్నో ఆటంకాలు ఏర్పడ్డాయి.

1. కార్ఖానా ఉత్పత్తి శ్రామికులని నిపుణులుగానూ, అనిపుణులుగానూ వేరుచేస్తుంది. మెట్ల వారీ అమరిక ఏర్పరుస్తుంది. కొందర్ని పైస్థాయిలో పెడితే, కొందర్ని కింది స్థాయిలోనూ, ఇంకొందర్ని మధ్య నెక్కడో పెడుతుంది. అయినప్పటికీ అనిపుణుల సంఖ్య చాలా పరిమితంగానే ఉంటుంది. ముక్కపనిని స్త్రీలూ, పిల్లలూ చేయగలిగేటట్లు మలుస్తుంది.

వాళ్ళనీ దోచుకోడానికి అనుకూలం చేస్తుంది. అయితే ఈ ధోరణిమొత్తం పురుష శ్రామికుల ప్రతిఘటన మూలంగా భంగం అవుతుంది.

2. చేతివృత్తుల్ని విడగొట్టడం వల్ల, శ్రామికుడు పని నేర్చుకోడానికి అయ్యే ఖర్చు తగ్గుతుంది. ఫలితంగా అతని శ్రమశక్తి విలువ తగ్గిపోతుంది. అయినప్పటికీ కష్టతరమైన ముక్కపని నేర్చుకోడానికి ఎక్కువ కాలం పడుతుంది. అంతగా అవసరంలేని చోట కూడా పనివాళ్ళు అంత ఉండాలంటూ పట్టుబడుతుంటారు. ఉదాహరణకు ఇంగ్లండ్‌లో పనినేర్వాల్సిన (probation) కాలం ఏడేళ్ళు. అది కార్ఖానా ఉత్పత్తి ముగిసేదాకా అమల్లోనే ఉంది. ఆధునిక పరిశ్రమ వచ్చేదాకా అది పోలేదు.

3. కార్ఖానా ఉత్పత్తికి చేతివృత్తి నైపుణ్యమే ప్రాతిపదిక కనుకా, కార్ఖానా ఉత్పత్తి యొక్క యంత్రాంగానికి శ్రామికులు మినహా మరే చట్రమూ లేనందువల్లా, పెట్టుబడి శ్రామికుల అవిధేయతతో ఎప్పుడూ సిగపట్లు పట్టక తప్పేది కాదు.

## నిపుణ శ్రామికుల ప్రతిఘటనా, అవిధేయతా

మిత్రుడు ఉరే (1778–1857) ఇలా అంటాడు: కార్మికుడు ఎంత నిపుణుడు అయితే, అంతగా మాటవినని మొండిఘటంగా తయారవుతాడు. అందువల్ల ఒక యాంత్రిక వ్యవస్థలో భాగంగా ఇమడడానికి అంత తక్కువగా తగి ఉంటాడు. ఆ మొత్తం వ్యవస్థకి అతను పెద్ద నష్టం కలిగించవచ్చు. అందువల్ల కార్ఖానా ఉత్పత్తి దశ అంతటిలోనూ పనివాళ్ళకి క్రమశిక్షణ లేదనే ఫిర్యాదులు వినవస్తాయి. 16వ శతాబ్దానికీ, ఆధునిక పరిశ్రమకీ మధ్య కాలం కార్ఖానా కార్మికుల్ని తన పూర్తి అధీనంలో పెట్టుకోలేకపోయింది. ఈ విషయంలో పెట్టుబడి విఫలమైంది.

**కార్ఖానాలు కొద్దికాలమే మనుగడలో ఉండేవి.** వలస పోయే పనివారితోనూ, వలస వచ్చే పనివారితోనూ పరిశ్రమలు ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశానికి తరలి పోవాల్సి వచ్చేది. అదే సమయంలో కార్ఖానా ఉత్పత్తి సమాజ ఉత్పత్తిని పూర్తిస్థాయిలో అధీనంలో పెట్టుకోలేకపోయిందిబీ ఆ ఉత్పత్తిని ఆసాంతంగా విప్లవీకరించ లేక పోయింది. అది పట్టణ చేతివృత్తుల, గ్రామీణ గృహ పరిశ్రమల విస్తృత పునాది మీద ఆర్థిక నిర్మాణంగా పైకి లేచింది. దాని అభివృద్ధిలో ఒక దశ వద్ద, కార్ఖానా ఉత్పత్తి ఆధారపడ్డ సంకుచిత సాంకేతిక పునాది, అదే కార్ఖానా ఉత్పత్తి సృష్టించిన ఉత్పత్తి అవసరాలతోనే ఘర్షణలో పడ్డది. అయితే ఈ ప్రతిష్టంభన నుండి బయటబడే మార్గాన్ని కార్ఖానా ఉత్పత్తే ఏర్పాటుచేసింది – యంత్రాలను ఉత్పత్తి చెయ్యడం ద్వారా.

## యంత్రాల ఉత్పత్తీ – పెట్టుబడి ఆధిపత్యమూ

కార్ఖానాఉత్పత్తి యొక్క పరిపూర్ణ సృజనలలో శ్రమసాధనాల ఉత్పత్తి ఒకటి. ఆసాధనాల్లో ప్రత్యేకించి అప్పటికే వాడుకలోవున్న సంక్లిష్ట యంత్ర పరికరాలు కూడా ఉన్నాయి. కార్ఖానా శ్రమవిభజన మీద ఆధారపడ్డ వర్క్ షాప్ యంత్రాలను తయారు చేసింది. సామాజిక ఉత్పత్తిని నియంత్రించే నియమంగా చేతివృత్తి దారుల పనిని అవే యంత్రాలు తుడిచి వేశాయి. ఆవిధంగా ఒకపక్క, ముక్క పనికి జీవితాంతమూ కార్మికుణ్ణి కట్టిపడేసిన సాంకేతిక అవసరం తొలిగిపోయింది. మరొకపక్క, ఇదేనియమం పెట్టుబడి ఆధిపత్యాన్ని బంధించిన సంకెళ్ళు తెగిపోయాయి. యంత్రాలు వచ్చేదాకా పెట్టుబడి శ్రామికుల శక్తి సామర్థ్యాలమీద ఆదారపడి ఉండేది. కనుక దాని ఆధిపత్యం ఎంతో కొంత కట్టడిలో వుండేది. యంత్రాల రాకతో ఆ కట్లు వీడిపోయాయి. ఇక పెట్టుబడి ఆధిపత్యం ఊపందుకుంది.

## అధ్యాయం 15
# యంత్రాలూ – ఆధునిక పరిశ్రమా
## విభాగం 1
## యంత్రాల అభివృద్ధి

అచ్చుపనిలో యంత్రాలు రాక ముందు ఒక కొయ్య దిమ్మ మీద బొమ్మనో, అక్షరాలనో చెక్కి గుడ్డమీద అద్దేవారు. పనిముట్టు ఆ దిమ్మే. దాన్ని పట్టుకుని శ్రామికుడు అచ్చు వేసేవాడు. గంటకి చాలా తక్కువ కాపీలు మాత్రమే తియ్యగలడు. దీన్ని దిమ్మ అచ్చు (బ్లాక్ ప్రింటింగ్) అనేవారు. తర్వాత అచ్చు యంత్రం వచ్చింది. కాలితో తొక్కుతూ నడిపే అచ్చు యంత్రం మీద 1000 కాపీలు తీస్తాడు. ఆ యంత్రానికి మోటార్ తగిలిస్తే మహాఅయితే 3000 కాపీలు తియ్యగలడు. అంతకు మించి తియ్యలేడు. ఎందుకంటే అక్కడ మనిషి మిషన్‌కి కాగితాలు అందించాలి. అచ్చయ్యాక వెంటనే తియ్యాలి. అంతకన్నా ఎక్కువ కాపీలు తియ్యాలంటే, అదే కాలంలో ఎక్కువ కాగితాలు పెట్టి తియ్యగలగాలి. అందుకు తగినంత వేగంగా మనిషి చేతులు ఆడవు. కాబట్టి చెయ్యి చేసే పని కూడా యంత్రంలో ఉండే పనిముట్టు చేస్తేనే, ఎక్కువ కాపీలు తియ్యడం కుదురుతుంది. అప్పుడిక మనిషి కాగితాలు పెట్టి తీసే అవసరం ఉండదు. చేతికున్న పరిమితులు యంత్రంలో ఉండే పనిముట్టుకి ఉండవు. ఇక మనిషి పని కేవలం అచ్చైన కాగితాల్ని తట్టి సరిచేయ్యడమే. ఇప్పుడున్న ఆఫ్ సెట్ యంత్రంలో గంటకి 5 వేలు వస్తాయి. మల్టీకలర్ ఆఫ్‌సెట్‌లో 4 రంగులు ఒకేసారి అచ్చవుతాయి. వెబ్ ఆఫ్ సెట్ ప్రింటర్ 50 వేల కాపీలు తీస్తుంది. 16 పేజీలు ఒకేసారి వస్తాయి. దినపత్రిక మొత్తం 16 పేజీలు నాలుగు రంగుల్లో ఒకేసారి అచ్చయి మడతబడి బయటకొస్తాయి. ఇంతకీ ఆ యంత్రం దగ్గర ముగ్గురో నలుగురో ఉంటారు. అయితే వాళ్ళు అచ్చు పని ఏమీ చెయ్యక్కర్లేదు. ఇందుకు ఎన్నో చర్యలు అవసరం. ఒక్కొక్కదానికి ఒక్కొక్క యంత్రంకావాలి. అయితే అవన్నీ ఒక గొలుసుగా ఈ యంత్రంలో ఉ ంటాయి. ఒకటి తర్వాత ఒకటిగా అన్ని చర్యలూ జరుగుతాయి. కాబట్టి అచ్చుకు సంబంధించిన ఏ పనిముట్టూ మనిషి చేతిలో ఉండదు. అన్నీ యంత్రంలోనే ఉంటాయి.

### ఇంతకీ ఏమిటీ యంత్రం?

అప్పటికున్న రెండు నిర్వచనాల్ని పరిశీలిస్తాడు మార్క్స్.

**మొదటి నిర్వచనం:** పరికరం అనేది సరళ యంత్రం, యంత్రం అనేది సంక్లిష్ట పరికరం. ఈనిర్వచనం చెప్పే వాళ్ళు పరికరానికీ యంత్రానికీ మధ్య, సారభూతమైన వ్యత్యాసం చూడరు. అంతేకాదు, ఏతాము (లివర్), వాలుబల్ల, మరచీల, చప్పా (కొయ్యని చీల్చేటప్పుడు మధ్యలో కొట్టే కొయ్య మేకు -wedge) వంటి వాటిని కూడా యంత్రాలనేవారు. ఆర్థిక దృక్పథంలో ఈవివరణ విలువలేనిది. సాంకేతిక వివరణ అర్థ శాస్త్రజ్ఞులకు సరిపోదు.

**రెండో నిర్వచనం:** పరికరం విషయంలో చోదకశక్తి మనిషి. యంత్రానికి చోదకశక్తి మనిషి కాకుండా, మరేదైనా – జంతువో, జలమో, గాలో మరొకటో. చోదక శక్తిని బట్టి అది పరికరమో

యంత్రమో తేలుతుంది. ఇదీ సరైన నిర్వచనం కాదు. ఎందుకంటే, దీని ప్రకారం ఎద్దులు లాగే నాగలి యంత్రం అవుతుంది. నిముషానికి 96,000 చుక్కల్ని (picks) అల్లే క్లాసేన్ మగ్గం ఒకే ఒక మనిషి ఆడిస్తాడు కనక పరికరం అవుతుంది. అంతే కాదు, ఆ మగ్గం మీద చేత్తో నేస్తే అది పరికరం, దాన్నే ఆవిరితో నడిపిస్తే యంత్రం. అంతే కాదు, జంతుశక్తిని వాడడం మనిషికి అనాదిగా తెలుసు. కనుక యంత్రాలతో ఉత్పత్తి,, చేతివృత్తుల ఉత్పత్తికంటే ముందే ఉన్నట్లవుతుంది. కాబట్టి చోదక శక్తిని బట్టి తేడాగా చూడడం సరైనది కాదు.

### మార్క్స్ వివరణ:

పూర్తిగా అభివృద్ధి చెందిన యంత్రాలలో మూడు భాగాలుంటాయి:

1. మోటార్ యంత్రాంగం (motor mechanism)
2. అందజేత యంత్రాంగం (transmitting mechanism).
3. పనిముట్టు లేదా పనిచేసే యంత్రం (tool or working machine)

మొదటిది యంత్రాన్ని చలనంలో పెడుతుంది. అది తన సొంత చలన శక్తిని ఏర్పాటు చేసుకోవచ్చు–ఆవిరి ఇంజన్, కెలోరిక్ ఇంజన్, విద్యుదయస్కాంత యంత్రం వగైరా లాగా. అలాకాక, అప్పటికే ఉన్న ప్రకృతి శక్తి నుంచి ప్రేరణ పొందవచ్చు – జలపాతం ధార నుంచి జలచక్రంలాగా, గాలి నుంచి గాలి మరలాగా.

రెండవది. అందజేసే యంత్రాంగం. అందులో ఫ్లైవీల్స్, షాఫ్టింగు, పళ్ళ చక్రాలు, పుల్లీలు, స్ట్రాప్‌లు,తాళ్ళు, రకరకాల గేరింగ్ లూ ఉంటాయి. ఈ యంత్రాంగం, కదలికల్ని సరిగా ఉండేట్లు చేస్తుంది, అవసరమైన చోట దాని రూపాన్ని మారుస్తుంది. ఉదాహరణకు సరళ చలనం నించి చక్రీయ చలనానికి మారుస్తుంది. పైకీ కిందికీ, అటుకీ ఇటుకీ కదిలిస్తుంది. పై రెండు భాగాలూ పనిచేసే యంత్రాన్ని చలనంలో పెట్టడానికే, శ్రమ పదార్థాన్ని పట్టుకొని కోరినవిధంగా మార్చడానికే.

మూడవది. పనిముట్టు. ఇది మొత్తం యంత్రంలో ఒక భాగం.

ఈ మూడూ ఉండేది యంత్రం. అంతే కాని,

**యంత్రమా కాదా అని తేల్చేది చోదక శక్తి కాదు.** ఎందుకంటే మనిషి కదిలించే యంత్రాలున్నాయి. కాలితో తొక్కుతూ నడిపే అచ్చు యంత్రం, సానబట్టే యంత్రం, చెరకు రసం తీసే యంత్రం – ఉదాహరణలు. అలాంటిదేదైనా మనిషి తిప్పినప్పుడూ యంత్రమే, మోటార్ తగిలించినప్పుడూ యంత్రమే. చోదక శక్తి మనిషి నుంచి వచ్చినా, మరొక యంత్రం నుంచి వచ్చినా తేడా ఉండదు. అసలు పనిముట్టుని (tool proper) మనిషి నుంచి తీసుకొని యంత్రాంగంలో బిగించిన క్షణం నుంచీ యంత్రం అవుతుంది.

యంత్రం సైజూ, అందులో ఉండే పనిముట్ల సంఖ్యా పెరిగితే దాన్ని నడపడానికి భారీ యంత్రాంగం అవసరం అవుతుంది. మనిషికి అంత శక్తి ఉండదు. అదీగాక, మనిషి ఒకే రకమైన, నిరంతరాయమైన చలనాన్ని కలిగించ లేడు. అతని చేతిలోని పనిముట్టు యంత్రంలోకి

వెళ్ళిపోయింది. అతనిప్పుడు కేవలం ఒక మోటార్ చేసే పనే (దాన్ని నడిపే పని మాత్రమే చేస్తున్నాడు) చేస్తున్నాడు. ఆపని ప్రకృతి శక్తులకు అప్పగించవచ్చు అనేది విదితమే.

**మనుషుల బదులు వచ్చిన చోదక శక్తులు – గుర్రాలూ, జలమూ, గాలీ, ఆవిరి ఇంజన్**

**అశ్వ శక్తి** – ఇది అన్నిట్లోకీ కీతాది. అధ్వాన్నమయింది. ఇందుకు గుర్రానికి బుర్ర ఉ ండడం కొంత కారణం. ఖరీదు ఎక్కువ ఉండడం ఇంకొంత కారణం. ఫాక్టరీలలో గుర్రాల్ని ఉ పయోగించగలిగే అవకాశం చాలా పరిమితం. అయినప్పటికీ ఆధునిక పరిశ్రమ తొలిదశలో గుర్రం విస్తారంగా ఉపయోగించబడింది.

**వాయు శక్తి** – ఇది స్థిరంగా ఉండేది కాదు. మనిషి నియంత్రణకు లొంగేది కాదు.

**జల శక్తి** – ఆధునిక పరిశ్రమకు పుట్టినిల్లయిన ఇంగ్లండ్‌లో కార్ఖానా ఉత్పత్తి కాలంలో ప్రధానంగా జలశక్తి వాడకంలో ఉండింది. ఆర్క్ రైట్ రాట్నం మిల్లు మొదటి నించీ జల శక్తితో నడిచింది. అయినా దాంతో కొన్ని ఇబ్బందులున్నాయి.

- దాన్ని పెంచాలనుకున్నా పెంచడం కుదరదు.
- కొన్ని ఋతువుల్లో లభించదు.
- అన్నిటిని మించి, అది స్థానికంగా మాత్రమే ఉంటుంది. అన్ని చోట్లా ఉండదు.

జల శక్తిలో ఉన్న లోపాల్ని ఆవిరి శక్తి సరిచేసింది. జేంస్‌వాట్ రెండో ఆవిరి యంత్రాన్ని కనిపెట్టాడు. అది బొగ్గునీ, నీటినీ వాడుకొని, సొంతంగా శక్తిని సృష్టించు కుంటుంది.

- ఆ శక్తి పూర్తిగా మనిషి నియంత్రణలో ఉంటుంది.
- ఎక్కడకి బడితే అక్కడికి తీసుకుపోడానికి వీలవుతుంది.
- ఆవిరి ఇంజన్ ఉత్పత్తిని పట్టణాల్లో కేంద్రీకరించడం సాధ్యపరిచింది.

ఆవిరి ఇంజన్ అన్ని చిక్కుల్నీ తొలగించింది. దాంతో సరుకుల ఉత్పత్తి చౌక. అందుకే అది మంచి చోదక శక్తి అయింది.

అభివృద్ధి చెందిన చోదక శక్తి తిరిగి యంత్రాలమీద ప్రభావం చూపింది. అది ఏకకాలంలో ఎన్నో యంత్రాల్ని నడుపుతుంది. ఆ యంత్రాల సంఖ్య పెరిగే కొద్దీ చోదక యంత్రాంగం పెరుగుతుంది. అందజేత యంత్రాంగం కూడా విస్తారమవుతుంది.

1. ఒకే యంత్రం మునుపు ఒక చేతి పనివాడు చేసిన వివిధ చర్యల్నీ చేస్తుంది. ఉదాహరణకి, ఒక నేతగాడు తనమగ్గంతో చేసిన పనులన్నీ చేస్తుంది.
2. అనేకమంది ఒకరితర్వాత ఒకరు చేసినట్లు విడివిడిగానో, కార్ఖానా వ్యవస్థలో సభ్యుల లాగానో పని చేస్తుంది.

ఉదాహరణకి కవర్ల తయారీలో ఒక పనివాడు ఫోల్డర్ తో కాగితం మడుస్తాడు. మరొకడు జిగురు పట్టిస్తాడు. మూడోవాడు మూత (flap) ని తిప్పుతాడు. నాలుగోవాడు దానిమీద ముద్ర (emboss) వేస్తాడు. అలా పని తరవాత పని వరసగా జరుగుతాయి. ఈ పనులన్నిటినీ ఒకే యంత్రం చేస్తుంది. గంటకి 3,000 కవర్లు చేస్తుంది. 1862 లండన్ వస్తు ప్రదర్శనలో పెట్టిన కాగితం సంచులు చేసే అమెరికా యంత్రం గంటకి 18,000 తయారు చేసింది. ఇక్కడ

మొత్తం ప్రక్రియ వివిధ పనిముట్ల కలయికతో ఉండే ఒకే యంత్రం పూర్తిచేస్తుంది. కార్ఖానా వ్యవస్థలో ఇదే మొత్తం ప్రక్రియ వేర్వేరు చర్యల వరసగా నడిచేది.

## ఫాక్టరీలో సామాన్య సహకారం

ఫాక్టరీలో – యంత్రాలు మాత్రమే వాడే వర్క్ షాప్‌లో – సామాన్య సహకారం కనబడుతుంది. ఒకేచోట ఒకే తరహా యంత్రాలు కొన్ని ఏక కాలంలో నడుస్తుంటాయి. ఒక నేత ఫాక్టరీలో కొన్ని మరమగ్గాలు పక్కపక్కనే పనిచేస్తుంటాయి. కుట్టు ఫాక్టరీలో ఒకే బిల్డింగ్‌లో కొన్ని కుట్టు మిషన్లు ఆడుతూ ఉంటాయి. వాటిని నడిపే చోదక శక్తి ఒక్కటే. కొన్ని పనిముట్లు ఒకే యంత్రంలో అంగాలు అయినట్లే, కొన్ని యంత్రాలు ఒకే చోదక యంత్రాంగానికి అంగాలవుతాయి.

యంత్రవ్యవస్థని ఒక స్వయం చాలక చోదక సాధనం నడుపుతుంది. అప్పుడు, అది దానికది నడిచే భారీయంత్రం (automaton) అవుతుంది. మొత్తం ఫాక్టరీ ఆవిరి యంత్రాలతో నడపబడుతున్నా, కొన్ని కదలికలకి మనిషి సహాయం అవసరమవుతుంది. మనిషి జోక్యం లేకుండా యంత్రం నడుస్తున్నప్పుడు, కేవలం మనిషి అక్కడ ఉండడం మాత్రమే అవసరమైనప్పుడు, స్వయం చాలిత యంత్ర వ్యవస్థ ఏర్పడ్డట్లు. పాతకాలపు జర్మన్ కాగితం తయారీ, చేతి ఉత్పత్తికి ఉదాహరణ. 17 వ శతాబ్దపు హాలండ్, 18 వ శతాబ్దపు ఫ్రాన్స్ కార్ఖానా కాగితం ఉత్పత్తికి నమూనా, ఆధునిక ఇంగ్లండ్ కాగితం ఆటోమాటిక్ ఉత్పత్తికి నమూనా. ఇక్కడ విడి యంత్రం స్థానంలో ఒక యంత్ర భూతం ఉంది. అది ఫాక్టరీలకు ఫాక్టరీలనే ఆక్రమిస్తుంది.

## యంత్రాలని ఉత్పత్తిచేసే పరిశ్రమల అభివృద్ధి

కదుర్లూ, ఆవిరింజన్లూ చెయ్యడమే పనిగా పెట్టుకున్నవాళ్ళు రాక ముందు కూడా అవి వుండేవి – దర్జీలు లేక ముందు కూడా జనం బట్టలేసుకున్నట్లే. వాకాన్సన్, ఆర్క్ రైట్, వాట్ మొదలైనవారు కనిపెట్టినవి తయారయింది కార్ఖానా ఉత్పత్తిలోనే. తయారుచేసింది అక్కడ సిద్ధంగావున్న నిపుణ కార్మికులే. కొత్తయంత్రాలు కనిపెట్టడం ఊపందుకుంది. కొత్త యంత్రాలకు గిరాకీ పెరిగింది. దాంతో యంత్రనిర్మాణ పరిశ్రమ అనేక స్వతంత్ర శాఖలుగా విడిపోయింది. ఈ కార్ఖానా ఉత్పత్తిలో శ్రమ విభజన అంతకంతకూ పెరిగి పోయింది. కనుక, ఆధునిక పరిశ్రమ యొక్క తక్షణ సాంకేతిక పునాది కార్ఖానా ఉత్పత్తిలోనే ఉన్నదని గమనిస్తాము. కార్ఖానా ఉత్పత్తి యంత్రాలని ఉత్పత్తి చేసింది. ఆ యంత్రాలతోనే, ఆధునిక పరిశ్రమ చేతి వృత్తి వ్యవస్థనీ, కార్ఖానా ఉత్పత్తి వ్యవస్థనీ రద్దు చేసింది. ఇది తప్పనిసరి. ఎందుకంటే ఫాక్టరీ వ్యవస్థ దానికి సరిపోని పునాది మీద తలెత్తింది. అది ఒక స్థాయికి అభివృద్ధయ్యాక, ఆ పునాదిని తొలిగించి తన ఉత్పత్తి పద్ధతులకు తగిన పునాదిని ఏర్పరచుకోవాల్సి వచ్చింది. విడిగా ఉన్న యంత్రం, మానవ శక్తితోనే నడిచినంత కాలం, దాని మరగుజ్జు లక్షణం ఉన్నదున్నట్లే ఉంటుంది. వెనకటి చోదక శక్తులైన జంతువులు, గాలి, నీరు వంటి వాటి స్థానంలో ఆవిరియంత్రం వచ్చేదాకా యంత్ర వ్యవస్థ అనేది తగినంతగా వృద్ధి చెందదు. అదేవిధంగా అప్పటికి యంత్రం మనిషి శక్తి మీదా, నైపుణ్యం మీదా వాళ్ళ చిన్నచిన్న పనిముట్లమీదా ఆధారపడివుంది. అలా ఉన్నంత కాలం ఆధునిక పరిశ్రమ యొక్క సంపూర్ణాభివృద్ధి కుంటుబడే ఉంటుంది. అందుకు కారణాలు:

1. అలా తయారయ్యే యంత్రాల ఖరీదు ఎక్కువ.
2. కొత్తరంగాలకు యంత్రాలు విస్తరించే కొద్దీ యంత్రాలు చేసే పనివాళ్ళు పెరగాలి. అయితే అలాంటి పనివాళ్ళ సంఖ్య క్రమేణా, నెమ్మదిగా పెరుగుతుంది తప్ప, ఉరుకులు దుముకుల మీద పెరగదు.

దీనికి తోడు, ఆధునిక పరిశ్రమ అభివృద్ధి ఒకానొక స్థాయిని అందుకున్నప్పుడు, చేతివృత్తి, కార్ఖానా ఉత్పత్తి సమకూర్చిన ప్రాతిపదికతో ఆధునిక పరిశ్రమకు పొంతన కుదరదు. అంటే ఇక అక్కడనుంచీ అది అభివృద్ధి కాదు. చోదక సాధనాలసైజు, ప్రసార యంత్రాంగం సైజు, అసలు పనిముట్టు సైజు అంతకంతకూ పెరిగాయి. అవి మానవ శ్రమతో చేసిన తొలి నమూనాలకు దూరం అయ్యాయి. మారిపోయాయి. జటిలంగా ఉండేవి. క్రమబద్ధంగా పనిచేసేవి. స్వయం చాలక వ్యవస్థ నిర్దుష్టం అయింది. కొయ్య బదులు ఉష్ణాన్ని తట్టుకునే ఇనుం వంటి లోహాల్ని వాడడం పెరిగింది. పరిస్థితుల వల్ల తలెత్తిన ఈ సమస్యల్ని కార్ఖానా వ్యవస్థ లోని సమష్టి శ్రామికుడు సైతం సరిగా ఎదుర్కోలేక పోయాడు. కనుక ఈ వ్యక్తిగత పరిమితులు ప్రతిచోటా ప్రతిబంధకం అయ్యాయి. ఇప్పటి హైడ్రాలిక్ ప్రెస్, ఆధునిక మరమగ్గం, విత్తనాలు తీసే యంత్రం కార్ఖానా ఉత్పత్తిలో ఎప్పటికీ తయారయ్యేవి కావు.

ఒక పరిశ్రమ రంగంలో ఉత్పత్తి పద్ధతిలో పెనుమార్పువస్తే, అది ఇతర రంగాలకు కూడా విస్తరిస్తుంది. యంత్రాలతో దారం తీసినందువల్ల యంత్రాలతో నెయ్యాల్సి వచ్చింది. ఈ రెంటి మూలంగా బట్టల్ని తెలుపు చెయ్యడానికీ, అద్దకానికీ యంత్రాల్ని అనివార్యం చేశాయి. అలాగే మరొకపక్క, పత్తి నూలు వడకడంలో వచ్చిన పెనుమార్పు మూలంగా పత్తి నుండి విత్తనాలు తీసే యంత్రాన్ని జిన్ ని తయారుచెయ్యాల్సి వచ్చింది. జిన్ ని కనిపెట్టడం ద్వారానే, అవసరమైనంత దూది తయారీ వీలయింది. అంతకన్నా ఎక్కువగా, పారిశ్రామిక, వ్యావసాయిక విధానాల్లో వచ్చిన విప్లవాత్మక మార్పు, సమాచార, రవాణా సాధనాల్లో తీవ్ర మార్పుని అవసర పరిచింది. అందుకు సరిపోయే, స్టీమర్ లూ, రైలు మార్గాలూ, టెలిగ్రాఫ్ లూ వచ్చాయి. అయితే భారీ సైజులో ఉండే ఇనుముని కాల్చి, సాగ్గొట్టడానికీ, అతకడానికీ, నరకడానికీ, తొలవడానికీ, అవసరమైన ఆకారం ఇవ్వడానికీ, భారీ యంత్రాలు కావాల్సి వచ్చింది. అలాంటి భారీ యంత్రాలని నిర్మించడానికి కార్ఖానా ఉత్పత్తి పద్ధతులు ఏమాత్రం సరిపోలేదు.

### ఆ సమస్య యంత్రాలతో యంత్రాల్ని నిర్మించడం ద్వారా పరిష్కారం అయింది

అందువల్ల యంత్రాల్ని యంత్రాలతోనే నిర్మించాల్సి వచ్చింది. అలా చేశాక, తనకొరకు తానే యంత్రాలను తయారు చేశాకనే, యంత్ర పరిశ్రమకు తగిన సాంకేతిక ప్రాతిపదిక ఏర్పడింది. తన కాళ్ళమీద తాను నిలబడగలిగింది. 19 వ శతాబ్ది తొలి దశాబ్దాలలోనే యంత్రాల వాడకం పెరిగింది. దాంతో యంత్రాల తయారీని క్రమంగా యంత్రాలు తమచేల్లోకి తీసుకున్నాయి. యంత్రాలని యంత్రాలతో తయారు చెయ్యాలంటే, ఎంత శక్తినైనా ప్రయోగించగలిగే చోదక సాధనం కావాలి. అది పూర్తిగా అదుపులో ఉండేది కావాలి. అలాంటి సాధనం అప్పటికే రెడీగా ఉంది. అదే ఆవిరి యంత్రం. యంత్రాల విడి భాగాలకు – కచ్చితమైన సరళ రేఖలూ, సమతలాలూ, వృత్తాలూ, స్థూపాలూ, శంఖాలూ, గోళాలూ – (ఆకారాలు) అవసరమవుతాయి. వీటిని ఉత్పత్తి చేసే పరికరం అవసరం అయింది.

స్లైడ్ రెస్ట్ 19 వ శతాబ్దం మొదట్లో హెన్రీ మాడ్ స్లే స్లైడ్ రెస్ట్ కనిపెట్టి ఈ సమస్యని పరిష్కరించాడు. ఈ పరికరం మొదట లేత్ లో చేరింది. ఆ తర్వాత కొద్ది కొద్ది మార్పులతో ఇతర నిర్మాణ యంత్రాలకు పాకింది. ఈ పరికరం ఎదో ఒక పరికరానికి మాత్రమే ప్రత్యామ్నాయం కాదు. మొత్తం చేతికే ప్రత్యామ్నాయం. తయారు చెయ్యాల్సిన ఇనపదో, మరొకటో వస్తువుని పట్టుకొని కోసే పరికరాన్ని పూర్తిగా నడిపిస్తుంది. ఆ విధంగా యంత్రభాగాల్ని తయారుచెయ్యడం సాధ్యపరిచింది. దాంతో అయినంత వేగంగా, కుదిరిగ్గా, సులువుగా, కచ్చితంగా ఎంతటి నిపుణుడి చెయ్యి అయినా చెయ్యలేదు. ఆ పరికరం అంతలోనే స్వయం చాలితం అయింది.

## యంత్రాలు నిర్మించే యంత్రాల్లో పనిముట్లు

యంత్రాల్ని నిర్మించే యంత్రంలో కూడా పనిముట్లు ఉంటాయి. అవి భారీ స్థాయిలో ఉన్న చేతి పరికరాలే:

- రంధ్రాలు చేసే యంత్రంలో ఉండే పనిముట్టు ఆవిరి యంత్రంనడిపే భారీ బరమా. ఈ యంత్రం లేనిదే, పెద్ద ఆవిరియంత్రాల్లోనూ, హైడ్రాలిక్ ప్రెస్‌ల లోనూ ఉండే సిలెండర్లు తయారవవు.
- లేత్ యంత్రం కాలి లేత్‌కి భారీ ప్రతి రూపం మాత్రమే.
- కమ్మరి ఇనుముని చిత్రిక బట్టే యంత్రం, వడ్రంగి కొయ్య పనిలో వాడేది ఎటువంటిదో అటువంటిదే.
- లండన్ ఓడరేవుల్లో పై కొయ్య పొరల్ని కత్తిరించే సాధనం ఒక భారీ కత్తి (razor).
- కత్తిరించే యంత్రం ఒక దర్జీ గుడ్డల్ని కత్తెరతో ఎంత సులువుగా కత్తిరిస్తాడో, అంత సులువుగా ఇనుముని కత్తిరిస్తుంది. అది ఒక రాక్షస కత్తెర.
- ఆవిరి సమ్మెట మామూలు సమ్మెట తలతోనే పనిచేస్తుంది. అయితే అది విపరీతమైన బరువు. 6 టన్నుల బరువు వున్నది కూడా ఉంది. 36 టన్నుల బరువున్న దాగిలి (anvil) మీద 7 అడుగుల పైన్నించి కొడుతుంది. దానికి ఒక గ్రానైట్ దిమ్మని పొడుంపొడుం చెయ్యడం పిల్లల ఆట మాత్రమే. అదే సమ్మెట ఒక కోయ్యలోకి ఒక చీలని మెల్లమెల్లగా తట్టి సున్నితంగా దింపగలదు కూడా.
- లండన్ లో తెడ్డు చక్రాల ఇరుసులు చేసే ఒక యంత్రం పేరు తోర్. అది 16 ½ టన్నుల ఇరుసుని, ఒకకమ్మరి గుర్రపు నాడా చేసినంత సునాయాసంగా, తయారు చేస్తుంది.

అంతటి యంత్రాల్ని నడపడానికి మానవశక్తి చాలదు. ప్రకృతి శక్తులు అవసరమౌతాయి. యంత్ర వ్యవస్థలో మనుగడలో ఉన్న ఉత్పత్తియొక్క భౌతిక పరిస్థితికి శ్రామికుడు కేవలం తోక అవుతాడు. మామూలు సహకారంలో, శ్రమ విభజన మీద ఆధారపడ్డ సహకారంలో కూడా, సమష్టి కార్మికుడి చేత విడి శ్రామికుడు అణచబడడం ఇంకా ఎంతోకొంత యాదృచ్ఛికమైనదిగా కనబడుతుంది. ఏవో కొన్నితప్ప, యంత్రాలు సమీకృత శ్రమ ద్వారానో, ఉమ్మడి శ్రమ ద్వారానో పనిచేస్తాయి. కనుక యంత్రాల విషయంలో శ్రమ ప్రక్రియ యొక్క సహకార స్వభావం శ్రమ సాధనమే విధించిన సాంకేతిక అవసరం.

## విభాగం 2
## ఉత్పాదితానికి యంత్రాలు బదిలీ చేసే విలువ

చేతిపనిముట్ల స్థానంలో యంత్రాలు వచ్చాయి. అవీ శ్రమ సాధనాలే. కనుక పరికరాలు ఎలా తమ విలువని ఉత్పాదితాలకు బదిలీ చేస్తాయో అదే పద్ధతిలో యంత్రాలుకూడా తమకున్న విలువని ఉత్పాదితాలకు బదిలీచేస్తాయి. తమకున్న విలువకన్నా ఎక్కువ విలువని బదిలీ చెయ్యలేవు.

**యంత్రాలతో చేసే వస్తువులు చౌక.** చేతిపనిముట్లలో కంటే యంత్రాలలో శ్రమ పరిమాణం ఎంతో ఎక్కువ ఉంటుంది. అయినా అవి ఉత్పాదితానికి పరికరం బదిలీ చేసే విలువ కంటే, తక్కువ విలువని బదిలీ చేస్తాయి. అందువల్ల యంత్రాలు చేసే వస్తువులు చౌకగా ఉంటాయి.

**యంత్రాలలో శ్రమ పరిమాణం ఎక్కువ ఉన్నప్పుడు, ఆ యంత్రాలు ఉత్పాదితంలో శ్రమ పరిమాణాన్ని ఎలా తగ్గిస్తాయి?**

సరుకులో ప్రస్తుత శ్రమ, గత శ్రమ కలిసి ఉంటాయి. గత శ్రమ పెరగడం వల్లమాత్రమే, ప్రస్తుత శ్రమతగ్గుతుంది. మొత్తం శ్రమవ్యయం ఎందుకు తగ్గుతుందో మార్క్స్ చెప్పిన నాలుగు కారణాలు :

1. యంత్రాలు శ్రమ ప్రక్రియలో ఎల్లప్పుడూ మొత్తంగా పాల్గొంటాయి. అయినప్పటికీ, విలువ నేర్పరచే ప్రక్రియలో మాత్రం కొంతకొంతగా చేరతాయి. ఉదాహరణకి పది బూట్లే తయారుచెయ్యాలన్నా, యంత్రం – అది ఎంత ఖరీదైనదైనా – మొత్తం పనిచెయ్యాల్సిందే. అయినా వాటిలో చేరే విలువ ఆ యంత్రం అరుగుదల విలువ ఎంతో అంతే. యంత్రం అరుగుదల మూలంగా సగటున అది పోగొట్టుకునే విలువ కన్నా, ఎక్కువ విలువని సరుకులకు కలపదు. అందువల్ల ఒక యంత్రం విలువకూ, ఒక నిర్దిష్ట కాలంలో ఆ యంత్రం ఉత్పాదితానికి బదిలీ చేసే విలువకీ ఎంతో వ్యత్యాసం ఉంటుంది.
2. శ్రమ ప్రక్రియలో యంత్రం పనిచేసే కాలం – అంటే జీవిత కాలం (life of the machine)– ఎక్కువయ్యే కొద్దీ ఈ వ్యత్యాసం పెరుగుతుంది. ఉదాహరణకి, అది సంవత్సరానికి బదులు రెండు సంవత్సరాలు పనిచేస్తే, అది ఉత్పాదితానికి బదిలీ చేసే విలువ సగానికి తగ్గుతుంది.
3. యంత్రాలు ఎక్కువ కాలం మన్నుతాయి. ఎన్నో ఎక్కువ సరుకుల్ని ఉత్పత్తిచేస్తాయి. యంత్ర వ్యవస్థలో చోదక సాధనం ఎన్నోయంత్రాల్ని ఉమ్మడిగా నడుపుతుంది. కనుక పొదుపవుతుంది.
4. అంతిమంగా, ఒక పనిముట్టు ఉత్పత్తి రంగం కన్నా, ఒక యంత్రం ఉత్పత్తి రంగం చాలా విస్తృతంగా ఉంటుంది. బ్లాక్ బర్న్ కి చెందిన బేన్స్ 1858 లో ఒక ఆశ్విక శక్తి నడిపగలిగే వాటి సంఖ్యని అంచనావేసి చెప్పాడు. అవి:
   - 450 మూల్ కదుర్లు
   - 200 త్రాజిల్ కదుర్లు
   - 40 అంగుళాల వస్త్రం నేసే 15 మగ్గాలు.

ఒక ఆశ్వ శక్తి ఖరీదూ, అది నడిపే యంత్రం అరుగుదల ఖరీదూ ఉత్పాదితం అంతకూ పంపిణీ అవుతుంది. దీన్నిబట్టి, పై 3 సందర్భాల్లో మొదటి దాంట్లో 450 మూల్ కదుర్ల

ఉత్పాదితానికీ, రెండో సందర్భంలో 200 త్రాజిల్ కదుర్ల ఉత్పదితానికీ, మూడో సందర్భంలో 15 మగ్గాల ఉత్పాదితానికీ పరుచుకుంటుంది. అంటే, ఒక పౌను దారానికైనా, ఒక గజం బట్టకైనా అరుగుదల వల్ల బదిలీ అయ్యే విలువ అతి తక్కువ. ఆవిరి సమ్మెట విషయమైనా అంతే. దాని రోజు అరుగుదలా, బొగ్గు ఖరీదూ ఆ సమ్మెట సాగ గొట్టే ఇనుం భారీ మొత్తానికీ పంపిణీ అవుతుంది. కాబట్టి ఒక హండ్రెడ్ వైట్ (=50.8 కిలోలు) ఇనుంకి కొద్ది విలువ మాత్రమే కలుస్తుంది; అయితే ఆ బ్రహ్మాండమైన సాధనాన్ని చీలలు దింపడానికి వాడితే కలిసే విలువ చాలా ఎక్కువ.

## యంత్రాలను యంత్రాలతో చేసినప్పుడు యంత్రం విలువ తగ్గుతుంది

మరొక అంశం యంత్రంవిలువ. యంత్రాలను యంత్రాలతో చేసినప్పుడు యంత్రం విలువ తగ్గుతుంది. ఆ తగ్గుదల ఎంత అనేది, ఆ యంత్ర విస్తరణను బట్టీ, సామర్థ్యాన్ని బట్టీ ఉంటుంది. యంత్రం ఉత్పాదితానికి తన విలువని బదిలీ చేసే రేటు ఫలానింత అని తెలిస్తే, అలా బదిలీ అయ్యే మొత్తం, ఆ యంత్రం మొత్తం విలువని బట్టి ఉంటుంది. యంత్రంలో ఎంత తక్కువ శ్రమ వుంటే, ఉత్పాదితానికి అది చేర్చే విలువ అంత తక్కువ ఉంటుంది.

## యంత్రం వల్ల ఉత్పాదకత పెరుగుతుంది

యంత్రం ఉత్పాదితానికి బదిలీచేసే విలువ ఎంత తక్కువ అయితే, ఆ యంత్రం ఉత్పాదకత అంత ఎక్కువ ఉన్నట్లు. యంత్రం తయారీకి పట్టేశ్రమ, అది తొలిగించే శ్రమకన్నా తక్కువగా ఉన్నప్పుడు, యంత్రాన్నిపెడితే అది ఉత్పాదకతను పెంచుతుంది. మార్క్స్ ఇచ్చిన 4 ఉదాహరణలు

**1. వడకడం.** ఒక హార్స్‌పవర్‌తో నడిచే సన్నాహక యంత్రాలతో సహా 450 యంత్ర కదుళ్ళకు ఇద్దరు పనివాళ్ళు కావాలని చెప్పాడు బేన్స్; 10 గంటలలో ఒక్కొక స్వయంచాలక యంత్రకదురు 13 ఔన్సుల దారాన్ని ఉత్పత్తిచేస్తుంది. అంటే 2½ పనివాళ్ళు వారానికి 365 పౌన్ల దారం వడుకుతారు. 366 పౌన్ల దూది దారంగా మారడానికి 150 గంటలు పడుతుంది. రోజు పని గంటలు 10 అయితే, 15 రోజులు పడుతుంది. అదే పనికి రాట్నంతో చేతిపనివాడు 13ఔన్సుల దారాన్ని 60 గంటల్లో తీస్తాడు అనుకుంటే, 366పౌన్ల దూది దారంగా మారడానికి 2,700 రోజులు (రోజంటే 10 పనిగంటలు) పడుతుంది. అంటే 27,000 పనిగంటలు పడుతుంది.

**2. కాలికో ప్రింటింగ్.** బట్టమీద ముద్రించే పని చేత్తో చేసేవాళ్ళు. అదే అచ్చు దిమ్మతో ముద్రించే 200 మంది చేసినంత పని, ఒక యంత్రంతో ఒక మనిషి చేస్తాడు.

**3. విత్తనాల్నీ దూదినీ వేరు చెయ్యడం.** 1793లో విట్నే కాటన్ జిన్ కనిపెట్టక ముందు ఒకపౌను విడదీయడానికి ఒక రోజు పట్టేది. జిన్ తో అయితే ఒక నీగ్రో స్త్రీ రోజుకి 100 పౌన్లు తియ్యగలిగేది

**4. ఆవిరి నాగలి.** 66 మంది మనుషులు 15 షిల్లింగుల ఖర్చుతో ఎంతపని చేస్తారో అంతపనిని ఒక ఆవిరి నాగలి 3 పెన్నీల ఖర్చుతో చేస్తుంది.

## పెట్టుబడిదారులు తమ ఫాక్టరీల్లో కొత్త కొత్త యంత్రాలను ఎల్లప్పుడూ పెడుతూ ఉంటారా?

యంత్రాన్ని వినియోగించే దానికయ్యే ఖర్చు, ఆయంత్రం తొలిగించే కార్మికుల వేతనాల కంటే తక్కువగా ఉంటేనే ఆ యంత్రం పెట్టుబడిదారునికి లాభకరంగా వుంటుంది. అనగా,

వేతనాలు తక్కువగా వుంటే, మనుషులతోనే చేయించుకుంటారు. యంత్రాలు పెట్టరు. వేతనాలు ఎక్కువగా ఉన్నప్పుడు, యంత్రాలు ప్రవేశపెడతారు. రికార్డో అన్నట్లు వేతనాలు పెరిగేవరకూ యంత్రాలు పెద్దగా ఉపయోగించ బడవు. ఉత్పాదితాన్ని చౌకచేసేందుకే యంత్రాన్ని వాడడంలో ఈవిధమైన పరిమితి ఉంది. ఆ యంత్రం ఎంత శ్రమ నైతే తొలిగిస్తుందో, అంతకన్నా తక్కువ శ్రమ ఆ యంత్రం తయారీలో ఖర్చయి ఉండాలి.

**ఒక చోట లాభదాయకం కాని యంత్రాలు, మరొక చోట లాభదాయకం కావచ్చు.** ఇంగ్లండ్ లో లాభం తేని  యంత్రాలు అమెరికాలో లాభం తేవచ్చు. కొన్ని చట్టపరమైన నిబంధనల మూలంగా, పెట్టుబడికి ఇంతకు ముందు లాభదాయకంగా లేని యంత్రాలు ఆకస్మికంగా ప్రత్యక్షం  కావచ్చు. ఏమైనప్పటికీ, పెట్టుబడిదారుడికి ఈ ఉపయోగం మరింత పరిమితం అయినదిగా ఉంటుంది. శ్రమకి చెల్లించే బదులు, నియోగించిన శ్రమ శక్తికి మాత్రమే చెల్లిస్తాడు; అందువల్ల యంత్రాన్ని వాడడంలో అతనికి ఒక పరిమితి ఉంటుంది. ఆ పరిమితి యంత్రం విలువకీ, అది తొలిగించే శ్రమశక్తి విలువకీ ఉండే వ్యత్యాసాన్ని బట్టి ఉంటుంది. రోజు శ్రమ అవసర భాగం గానూ, అదనపు భాగం గానూ విభజన వేర్వేరు దేశాల్లో భిన్నంగా ఉంటుంది, ఒకే దేశంలో వేర్వేరు కాలాల్లోనూ, వేర్వేరు పరిశ్రమ శాఖల్లోనూ భిన్నంగానే ఉంటుంది. ఇంతకన్నా మరొకటి ఉంది. శ్రామికుడి వాస్తవ వేతనం ఒక్కోసారి శ్రమ శక్తి విలువకన్నా తక్కువగానూ, ఒక్కోసారి ఎక్కువగానూ ఉంటుంది. కనుక యంత్రం ధరకీ, అది తొలిగించే శ్రమ శక్తి ధరకీ మధ్య తేడా బాగా ఎక్కువా, తక్కువా అవుతుంది – ఆయంత్రం తయారీకి పట్టే మొత్తం శ్రమకీ, అది తొలిగించే మొత్తం శ్రమకీ తేడా మారకుండా అలానే ఉన్నప్పటికీ. అయినా, పెట్టుబడిదారుడికి సరుకు ఉత్పత్తి ఖర్చుని నిర్ణయించేది మొదటి తేడా మాత్రమే. అదే పోటీ ఒత్తిడి ద్వారా అతని చర్యని ప్రభావితం చేస్తుంది. అందువల్ల, ఈరోజుల్లో ఇంగ్లండ్‌లో కనిపెట్టిన యంత్రాలు అమెరికాలో మాత్రమే వాడబడుతున్నాయి. 16,17 శతాబ్దాలలో హాలండ్‌లోమాత్రమే వాడే యంత్రాలు  జర్మనీలో కనిపెట్టబడ్డాయి. అలాగే 18వ శతాబ్దంలో ఫ్రాన్స్‌లో కనిపెట్టిన అనేక యంత్రాలు ఇంగ్లండ్‌లో మాత్రమే ఉపయోగించబడేవి. కారణం, యంత్రాలతోకంటే, మనుషులతో చేయిస్తే చౌకగా ఉండడమే.

## చట్టాల వల్ల యంత్రాల వాడకం పెరగడం

గనుల్లో పదేళ్ళలోపు పిల్లలపనినీ, స్త్రీలపనినీ నిషేధించకముందు, పెట్టుబడిదారులు నగ్న మహిళలనూ, బాలికలనూ పురుషుల పక్కనే పనిచేయించే వారు. అలా చేయించడాన్ని వాళ్ళ నీతిశాస్త్రం, ప్రత్యేకించి వాళ్ళ లెడ్జర్లూ అనుమతించాయి. నిషేధిస్తూ చట్టం వచ్చాక వాళ్ళు యంత్రాలకు మొగ్గారు. అమెరికన్లు రాళ్ళుపగలగొట్టే యంత్రాన్ని కనిపెట్టారు. ఇంగ్లిష్‌వాళ్ళు ఆయంత్రాన్ని ఉపయోగించలేదు. ఎందుకంటే, అక్కడి చేసే అభాగ్యులు ఆపని చాలాతక్కువకి చేసే వాళ్ళు. ఎంత తక్కువకంటే, యంత్రాలతో చేస్తే పెట్టుబడిదారుడికి ఉత్పత్తిఖర్చు ఎక్కువవుతుంది.

ఇంగ్లాండ్‌లో ఇప్పటికీ (అంటే కాపిటల్ రాసేనాటికి) కాలవ పడవల్ని లాగడానికి గుర్రాల బదులు అడపాదడపా స్త్రీలని పెడుతున్నారు. కారణం, గుర్రాల పోషణ కంటే, అదనపు జనాభాలో ఉన్న స్త్రీల పోషణ చౌకగా ఉండడమే అందువల్లనే, యంత్రాల దేశం అయిన ఇంగ్లండ్‌లో కన్నా మరే దేశం లోనూ అలా కీతాపనులకు మానవ శ్రమని సిగ్గులేకుండా వాడడం కనబడదు.

## విభాగం 3
## శ్రామికుని మీద యంత్రవ్యవస్థ ప్రభావాలు

శ్రమ సాధనాల్లో విప్లవమే ఆధునిక పరిశ్రమకి నాంది, ఆరంభ బిందువు. యంత్రాన్ని నడిపే శక్తి ఆ యంత్రం లోనే ఇమిడి ఉంటుంది. అందువల్ల మనిషి కండబలం మునుపటంత అవసరం ఉండదు. కొద్దిపాటి శక్తి ఉన్న వాళ్ళు సరిపోతారు. స్త్రీలూ, పిల్లలూ కూడా యంత్రాలవద్ద పని చెయ్యగలరు. కనుక బలం తక్కువ స్త్రీలను పెట్టుబడి నియమించింది. కుటుంబానికి కొంత ఆసరాగా, ఒకమేరకు ఇంటిదగ్గరే చేసే స్వతంత్ర శ్రమని కూడా ఆక్రమించింది. శరీరం పూర్తిగా పెరగని కారణంగా, పిల్లల అవయవాలు సులువుగా వంగుతాయి. కనుక కొన్నిచోట్ల పిల్లల్ని పనిలో పెట్టడం వీలయింది. పిల్లల ఆటపాటల సమయాన్ని పెట్టుబడి లాగేసుకుంది. కార్మికుల కుటుంబ సభ్యుల్ని, లింగ వయో భేదం లేకుండా అందరినీ పనిలో పెట్టారు. అందువల్ల వేతన శ్రామికుల సంఖ్య వేగంగా పెరిగింది. యంత్రాలు వేతన కార్మికుల సంఖ్యను పెంచే సాధనాలయ్యాయి.

యంత్రాలు రాక ముందు కుటుంబంలో వేతన శ్రమ చెయ్యని వారిని సైతం ఇప్పుడు పనిలో పెట్టుకుంటారు. పురుషుని శ్రమ శక్తి కుటుంబ సభ్యుల శ్రమ శక్తికి అంతటికీ పరచ బడుతుంది. అంటే, శ్రమశక్తి విలువ తగ్గుతుంది. ఒక కుటుంబం బతకడానికి, ఇంతకు ముందు ఒక్కరే పనిచేస్తే, ఇప్పుడు నలుగురు చేస్తున్నారు. ఆనలుగురూ తమకోసం పనిచేయడమే కాకుండా, పెట్టుబడి కోసం అదనపు శ్రమ కూడా చేయాల్సి వుంటుంది.

#### శ్రామికుల మీద యంత్రాల ప్రభావాలు:

A. వేతనాల తగ్గింపు, దోపిడీ పెంపు

B. పనిదినం పొడిగింపు

C. శ్రమతీవ్రత పెంపు

ఈ విభాగంలో వీటి పరిశీలన ఉంటుంది.

### A. వేతనాల తగ్గింపు, దోపిడీ పెంపు

ఎందుకంటే, కుటుంబంలో ఎక్కువమంది సభ్యులు పనిచేస్తారు కనుక. శ్రమ శక్తి విలువని నిర్ణయించేది ఆ కార్మికుని పోషణకి అవసరమైన శ్రమకాలం ఒక్కటే కాదు, కుటుంబాన్ని నడపడానికి అవసరమైన శ్రమకాలం కూడా. యంత్రాలు కుటుంబ సభ్యుల నందరినీ శ్రమ మార్కెట్‌కి లాగుతాయి. ఆ విధంగా యంత్రాలు కుటుంబపెద్ద శ్రమ శక్తి విలువని అందరు కుటుంబ సభ్యులకూ పరుస్తాయి. అతని శ్రమ శక్తి విలువని తగ్గిస్తాయి. నలుగురు కుటుంబ సభ్యుల శ్రమ శక్తిని కొనడానికి మునుపు కుటుంబ పెద్ద ఒక్కడి శ్రమశక్తిని కొనడానికంటే ఎక్కువ అవచ్చు. అయితే ఒక రోజు శ్రమకి బదులుగా నాలుగు రోజుల శ్రమ వస్తుంది. ఒకరి అదనపు విలువ బదులు నలుగురి అదనపు విలువ వస్తుంది. ఆ నలుగురి ఎక్కువ అదనపు

శ్రమ ఒకని అదనపు శ్రమను మించి ఉంటుంది. అదే నిష్పత్తిలో వాళ్ళ ధర పడిపోతుంది. ఆ కుటుంబం బతకడానికి నలుగురు శ్రమ చెయ్యాలి, అంతేకాదు పెట్టుబడి దారుడి కోసం అదనపు శ్రమకూడా చెయ్యాలి. ఆవిధంగా, యంత్రాలు పెట్టుబడి దోపిడీ శక్తికి ప్రధాన వస్తువు అయిన మానవ వనరును పెంచుతాయి. అంతే కాక దోపిడీ స్థాయిని కూడా హెచ్చు చేస్తాయి.

### శ్రామికులకు ఖర్చు పెరుగుతుంది

పనులకు పోయినప్పటికీ, పిల్లల్ని చూసుకోవడం, పాలివ్వడం వంటి కొన్ని కుటుంబ విధుల్ని పూర్తిగా వదిలెయ్యడం సాధ్యం కాదు. కనుక పెట్టుబడి అధీనంలోకి తీసుకున్న తల్లులు వేరే ప్రత్యామ్నాయాలు చూసుకోవాల్సిందే. కుట్టడమూ, మరమ్మత్తులు చేయడమూ వంటి ఇంటి పనులు ఇక కుదరవు. రెడీగా దొరికే వస్తువుల్ని కొనుక్కోవలసి వస్తుంది. ఇంటి పని చెయ్యడం తగ్గినందువల్ల, డబ్బు ఖర్చు పెరుగుతుంది. కుటుంబ నిర్వాహణ ఖర్చుహెచ్చుతుంది, వచ్చే ఎక్కువ ఆదాయానికి సరికి సరి అవుతుంది. దీనికి తోడు జీవితావసరాల్ని వాడుకోవడం లోనూ, సిద్ధం చెయ్యడంలోనూ పొదుపూ, వివేకమూ సాధ్యం అవవు. ఈ వాస్తవాలకి సంబంధించిన సమాచారాన్ని అధికార అర్థశాస్త్రం దాచి ఉంచింది. అయినప్పటికీ ఫాక్టరీ ఇన్స్ పెక్టర్ల నివేదికల్లో బోలెడు సమాచారం ఉంది.

### కార్మికుడు బానిస వ్యాపారి అవుతాడు

మునుపు కార్మికుడు తన సొంత శ్రమ శక్తిని మాత్రమే అమ్ముకునే వాడు. ఇప్పుడు దానికి తోడు అదే కార్మికుడు భార్యా బిడ్డల శ్రమ శక్తిని కూడా అమ్ముతున్నాడు. అతనిప్పుడు బానిస వ్యాపారి (slave-dealer) అయినాడు. పెట్టుబడిదారులు బాల శ్రామికులు కావాలని ప్రకటన లిచ్చేవారు. ఒక ఫాక్టరీ ఇన్స్ పెక్టర్ చూపిన అలాటి ఒక ప్రకటనని మార్క్స్ ఉదాహరణగా చూపాడు. అదేమంటే: 12–20 మంది కుర్రవాళ్ళు కావాలి. వేతనం వారానికి 4 షిల్లింగులు. దరఖాస్తు చెయ్యండి. వాళ్ళు 13 ఏళ్లకి తక్కువ వయసున్నట్లు కన్పించకూడదు. ఎందుకంటే, ఫాక్టరీ చట్టం ప్రకారం 13 ఏళ్ల లోపు వాళ్ళు 6 గంటలు మాత్రమే పని చేయవచ్చు. వాళ్ళ వయస్సుని ఒక సర్జన్ అధికారి ధృవపరచాలి. అందుకనే, 13 ఏళ్ల వాళ్ళుగా కనపడాలి అని అడిగే వాళ్ళు.

పెట్టుబడి దురాశా, తల్లిదండ్రుల అవసరాలూ ఈ చట్టవ్యతిరేక వ్యాపారానికి అనుకూలించాయి. ఇందుకు వైద్యాధికారులు సహకరించారు. ఉన్న వయస్సు కన్నా ఎక్కువ వేశారు. దాన్ని బట్టి 13 ఏళ్లకి లోపు వాళ్ళు కూడా ఫాక్టరీల్లో ఉన్నా, రికార్డు ప్రకారం వాళ్ళు 13 ఏళ్ల పైబడ్డ వాళ్లకిందే లెక్క. బెత్నాల్ గ్రీన్ జిల్లాలో సోమ, మంగళ వారాల్లో సంత జరిగేది. అక్కడ 9 ఏళ్ల నుండి అంతకు పైబడ్డ బాల బాలికల్ని సిల్క్ ఉత్పత్తిదారులు నియమించేవారు. వారానికి 1 షిల్లింగు 8 పెన్నీలు (ఇది తల్లిదండ్రులకు) 2 పెన్నీలు చాకిరి చేసే పిల్లవాళ్ళకి టీ కోసం. ఇంగ్లండ్‌లో కూడా స్త్రీలు శరణాలయాల (workhouses) నుండి తమ పిల్లల్ని తీసుకొచ్చి చిమ్నీలు తుడిచే పనికి పెట్టేవాళ్ళు. ఆ పని చేయించకూడదని చట్టం నిషేధించింది. అయినా అదే పని చెయ్యడానికి వారానికి 2 షి. 6 పెన్నీలకు పనిలో పెట్టేవాళ్ళు. యంత్రాలున్నప్పటికీ, ఆ పనికి బ్రిటన్‌లో అమ్మిన పిల్లల సంఖ్య 2000 దాటింది.

## కార్మికుల పిల్లల శారీరక క్షీణత – మరణాలు

ఫాక్టరీల్లో పనిచేసే స్త్రీలూ, పిల్లలూ శారీరకంగా ఎలా క్షీణిస్తారో ఇదివరకే మార్క్స్ వివరించి వున్నాడు. ఇప్పుడు పనివాళ్ళ పిల్లలు, పుట్టిన తర్వాత కొద్ది సంవత్సరాల కాలంలో కాలం చేసే వారనేందుకు గణాంకాలు ఇస్తాడు. ఇంగ్లండ్ లో 16 జిల్లాల్లో ఏడాది లోపు పిల్లల్లో లక్షమందికి సగటున 9 వేలమంది చనిపోయారు. 24 జిల్లాల్లో 10–11 వేలమధ్య 39 జిల్లాల్లో 11–12 వేల మధ్య, 48 జిల్లాల్లో 12–13 వేల మధ్య, 22 జిల్లాల్లో 20 వేల పైన, 25 జిల్లాల్లో 21 వేలపైన, 17 జిల్లాల్లో 22 వేల పైన, 11 జిల్లాల్లో 23 వేల పైన, 3 జిల్లాల్లో 24 వేల పైన, 3 జిల్లాల్లో 25 వేల పైన, విస్ బీచ్ లో 26 వేలు, మాంచెస్టర్ లో 26,125 మంది చనిపోయారు.

ఈ మరణాలకు స్థానిక కారణాలూ ఉంటాయి, నిజమే. వాటిని పక్కన పెడితే, తల్లుల ఇళ్ళకు దూరంగా పోయి పనిచెయ్యడం ముఖ్య కారణం. అయితే, అలా పనులకు పోయినందువల్ల పిల్లలకు ఆలనా పాలనా తగినంత ఉండదు:

- పక్కన తల్లి లేక పోవడం
- సరైన పోషకాహారం లేకపోవడం
- మంచిది కాని ఆహారం ఇవ్వడం
- నల్లమందు వేసి నిద్రబుచ్చడం

ఈ చావులకు ప్రధాన కారణం అని 1861 లో ఒక విచారణ సంఘం చెప్పింది.

వ్యవసాయంలోకి పారిశ్రామిక విధానాలు ప్రవేశించాయి. వ్యవసాయదారుడికి పనివాళ్ళని చూసి పంపించే మేస్త్రీ దగ్గర పనివాళ్ళు – పెళ్ళైన స్త్రీలూ, బాలబాలికలూ – ముఠాగా ఉంటారు. ఈ ముఠాలు కొన్నిసార్లు వాళ్ళ ఊళ్ళనించి మైళ్ళకు మైళ్ళు పోతారు. వాళ్ళు రోజూ ఉదయం సాయంత్రం రోడ్లమీద కనబడతారు. స్త్రీలు కురచ లంగాలు, తగిన కోట్లూ, బూట్లూ ధరించి ఉంటారు. కొన్నిసార్లు ట్రౌజర్లేసుకుని బలంగా, ఆరోగ్యంగా కనబడతారు. అయితే వీళ్ళు ఒక అనైతికతకి అలవాటు పడ్డవాళ్ళు. తీరికలేని, స్వేచ్ఛా జీవితం మీద మోజు పడతారు. ఇళ్ళ దగ్గర వాళ్ళకోసం దురదృష్టవంతులైన పిల్లలు బెంగ పెట్టుకుంటారనీ, ఫలితంగా ప్రాణాంతక ఫలితాలు ఉంటాయనీ పట్టించుకోరు. నిద్రపుచ్చడానికి మత్తు పదార్థాలు ఇవ్వబడ్డ పిల్లలు 'చిన్న ముసలి వాళ్ళు' (little old men) గా కుంచించుకు పోతారు, 'చిన్న కోతులలాగా' అయిపోతారు. వారి మరణాలు పెరుగుతాయి.

## మేధోపరమైన శూన్యత ఏర్పడుతుంది

పెట్టుబడి ఎదిగీ ఎదగని పిల్లలను అదనపు విలువ సృష్టించే యంత్రాలుగా మారుస్తుంది. తద్వారా వాళ్ళ మనో వికాస సామర్థ్యాన్ని నాశనం చెయ్యక పోయినా, మనస్సుని బీడు పెడుతుంది. ఈ వినాశం ఎంతగా ఎక్కువయిందంటే, పార్లమెంటే వాళ్ళ చదువు గురించి ఒక నిబంధన విధించింది. ఫాక్టరీ చట్టాలకు అనుగుణంగా విద్య ఉంటేనే 14 ఏళ్ల లోపు వాళ్ళని

నియమించవచ్చు, లేకుంటే నియమించరాదు అనేదే ఆ నిబంధన. అయితే అమలు జరిపే యంత్రాంగాన్ని పెట్టలేదు. కాబట్టి అమలు కాకుండా దీన్నించి తప్పించుకోడానికి ప్రయోగించని ఎత్తులూ, జిత్తులూ లేవు.

ఉపాధ్యాయుడు వారం వారం పిల్లలు చదువుకున్నారనే పత్రం ఇస్తే చాలు, వాళ్ళని పనిలో పెట్టుకోవచ్చు. ఆ ఉపాధ్యాయుల్లో కొందరికి సరిగా చదువు రాదు. అందువల్ల సర్టిఫికెట్ల మీద క్రాస్ గుర్తులతో సంతకం చేసిన ఉదంతాలు 1844 చట్టానికి ముందు కొల్లలు కొల్లలుగా ఉండేవి. చిన్న స్కూలు గది 75 మంది పిల్లలతో క్రిక్కిరిసి ఉంది అని ఒక నివేదిక చెప్పింది. చాలీ చాలని ఫర్నిచర్, బోధనా సామాగ్రీ. అన్ని వయసుల పిల్లలూ ఒకే చోట. చదువు చెప్పే అర్హత లేని ఉపాధ్యాయులు. సంతకం రాక అడ్డగీతలు పెట్టే కొందరు టీచర్లు. అసలు ఆ వాతావరణమే అనారోగ్యకరం. ఇలాంటి పరిస్థితుల్లో పిల్లలకి చదువు రాదు. అయినా అక్షరాస్యులుగా పత్రాలైతే వస్తాయి. ఇదీ తతంగం.

### పురుష కార్మికుల ప్రతిఘటనకి అడ్డుకట్ట

కార్ఖానా ఉత్పత్తి దశలో పెట్టుబడిదారుల నిరంకుశ విధానాలను కార్మికులు ప్రతిఘటించేవారు. యంత్రలోచ్చాక, స్త్రీలూ, పిల్లలూ యంత్రాలతో పనిచెయ్యడం మొదలయ్యాక, పురుష కార్మికుల ప్రత్యేకత లేకుండా పోయింది. పనివాళ్ళ సంఖ్య బాగా పెరిగింది. కార్మికుల కొరత లేదు. కనుక ఎదురుతిరిగి, నిరంకుశత్వాన్ని నిరోధించే శక్తికి ఆటంకం ఏర్పడ్డది.

## B. పనిదినం పొడిగింపు

### యంత్రాలూ – నిరంతరాయ చలనమూ

1. యంత్రాలలో శ్రమ పరికరాలు వాటికవే కదులుతుంటాయి, పనివానితో సంబంధం లేకుండా వాటంతటవే పనిచేస్తాయి. అంటే అవి ఆటోమాటిక్ అవుతాయి. వాటికవి అంతరాయాలు కలిగించవు. అయితే వీటి దగ్గరుండే శ్రామికుల వల్ల కలగవచ్చు. వాళ్ళ దేహబహీనతలో, సంకల్పాలో ఆటంకాలు కలిగించవచ్చు. అలా కలిగించక పోతే, యంత్రాలు ఆగవు, శాశ్వత చలనంలో ఉంటాయి. కనుక మనిషి వల్ల కలిగే ఈ ఆటంకాల్ని, ఈ ప్రతిఘటనని కనిష్ట స్థాయికి తగ్గించడానికి పెట్టుబడి ప్రయత్నిస్తుంది. యంత్ర శ్రమ తేలిక అనిపించడం ఈ ప్రతిఘటనని తగ్గిస్తుంది. అలాగే అణకువ, విధేయత ఉన్న స్త్రీల, పిల్లల నియామకం వల్ల మరికొంత ప్రతిఘటన తగ్గుతుంది.

2. యంత్రాలకయిన పెట్టుబడి ఖర్చుత్వరగా తిరిగి రావాలి. యంత్రాల ఉత్పాదకత, అవి ఉత్పాదితానికి బదిలీ చేసే విలువకి, విలోమానుపాతంలో ఉంటుందని మనకి తెలుసు. ఎంత ఎక్కువ విలువని బదిలీ చేస్తే అంత తక్కువ ఉత్పాదకత ఉన్నట్లు; ఎంత తక్కువ విలువని బదిలీ చేస్తే అంత ఎక్కువ ఉత్పాదకత ఉన్నట్లు.

   యంత్రం జీవితకాలం ఎంత ఎక్కువ ఉంటే, బదిలీ అయ్యే విలువ అంత ఎక్కువ ఉత్పాదితాలకు విస్తరిస్తుంది. అందువల్ల విడి సరుక్కి కలిసే విలువ తగ్గుతుంది.

3. మెరుగైన యంత్రాలు రావడం వల్ల అప్పటికున్న పాత యంత్రాలకు కాలం చెల్లుతుంది. అందువల్ల యంత్రాల్ని తక్కువకాలంలో ఎక్కువగా వాడతారు.

యంత్రం అరుగుదల పనికాలానికి కచ్చితమైన అనుపాతంలో ఉండదు. ఒక వేళ ఉన్నా, రోజుకి 16 గంటల చొప్పున 7½ సంవత్సరాలు పనిచేసే యంత్రం, రోజుకి 8 గంటల చొప్పున 15 సంవత్సరాలు పనిచేస్తే అంతే కాలం పనిచేసినట్లు. రెండు సందర్భాల్లోనూ ఒకే మొత్తంలో విలువని బదిలీ చేస్తుంది. ఏ ఒక్క సందర్భంలోనూ రెండో సందర్భంలో కన్న ఎక్కువ విలువని బదిలీ చెయ్యదు. అయితే మొదటి సందర్భంలో యంత్రం విలువ రెండో సందర్భంలో కంటే రెట్టింపు వేగంతో పునరుత్పత్తవుతుంది. కనుక పెట్టుబడిదారుడు ఈ యంత్రం వాడినందువల్ల 7½ సంవత్సరాల కాలంలోనే, రెండో సందర్భంలో 15 ఏళ్లలో పొందినంత అదనపు విలువని ఆర్జిస్తాడు.

## యంత్రం అరుగుదల రెండు రకాలు

ఒకటి వాడకం వల్ల, నాణేలు చలామణీ వల్ల అరిగినట్లు. రెండోది వాడక పోవడం వల్ల, ఒరలో ఉంచిన కత్తి తుప్పెక్కినట్లు. మొదటిది యంత్రం వాడకానికి అనులోమంగా ఉంటుంది. రెండోది కొంతవరకూ దాని వాడకానికి విలోమానుపాతంలో ఉంటుంది.

యంత్రం తన మారకం విలువను రెండు కారణాల వల్ల కోల్పోతుంది:

a) అదే రకం యంత్రాలు చౌకగా తయారవడం వల్ల

b) దానికన్నా మెరుగైన యంత్రం పోటీకి రావడం వల్ల

రెండు సందర్భాలలోనూ దాని విలువ అందులో వాస్తవంగా ఉన్న శ్రమ చేత నిర్ణయం అవదు. దాన్ని కానీ, మెరుగైన దాన్ని కానీ పునరుత్పత్తి చేయడానికి అవసరమయ్యే శ్రమ చేత నిర్ణయమవుతుంది. అందువల్ల దాని విలువ ఎంతో కొంత పోతుంది. దాని మొత్తం విలువ పునరుత్పత్తికి ఎంత తక్కువ కాలంపడితే, ఈ నైతిక తరుగుదల అంత తక్కువ ఉంటుంది; పనిదినం ఎంత పొడవైనదైతే, ఆ పునరుత్పత్తికి పట్టే కాలం అంత తక్కువగా ఉంటుంది. ఒక పరిశ్రమలో కొత్తగా యంత్రాన్ని పెట్టినప్పుడు, దాన్ని చౌకగా పునరుత్పత్తి చేసే పద్ధతులు ఒకదాని వెంట మరొకటి వస్తాయి; అలాగే మెరుగుదలలు కూడా వస్తాయి. ఆ మెరుగుదలలు విడిభాగాలను ప్రభావితం చేస్తాయి; అంత మాత్రమే కాదు, మొత్తం యంత్ర నిర్మాణాన్నే ప్రభావితం చేస్తాయి. అందువల్ల యంత్రాలొచ్చిన తొలిరోజుల్లో పనిదినం పొడిగించడాన్ని ఇది బాగా ప్రోత్సహించింది. యంత్రాలు పూర్తిగా అరగక పోయినా, వాటికన్నా మంచి యంత్రాలు వస్తే, పాతవి తొలిగించబడతాయి. మెరుగైన యంత్రాలు త్వరత్వరగా వస్తాయి. ఎంత త్వరగా అంటే ఒక్కోసారి అవి పూర్తిగా తయారయ్యేలోపే ఇంకా మెరుగైనవి వచ్చేవి. అందువల్ల చేస్తున్నవాటిని చేస్తున్న చోటే ఆపాల్సి వచ్చేది.

4. పనిదినం పొడవు తెలిసి, అన్ని ఇతర అంశాలూ అలాగే ఉంటే, రెట్టింపు పనివాళ్ళని దోపిడీ చెయ్యడానికి యంత్రాలలో పెట్టిన స్థిర పెట్టుబడి భాగాన్ని రెట్టింపు చెయ్యాలి; అంతేకాదు, ముడి పదార్థాలకీ, అనుబంధ పదార్థాలకీ పెట్టే భాగాన్ని కూడా రెండింతలు

చెయ్యాలి. అయితే మరొకపక్క, పనిదినాన్ని పెంచినందువల్ల పెద్ద స్థాయిలో ఉత్పత్తి జరుగుతుంది. యంత్రాలకూ, భవనాలకూ పెట్టిన పెట్టుబడిని పెంచాల్సిన అవసరం ఉండదు. అందువల్ల అదనపు విలువ పెరుగుతుంది, కాని దాన్ని రాబట్టడానికి పెట్టే పెట్టుబడి తగ్గుతుంది. పనిదినం పెరిగినప్పుడల్లా జరిగేది ఇదే; అయితే ప్రస్తుతం పరిశీలిస్తున్న సందర్భంలో మార్పు ప్రస్ఫుటంగా ఉంటుంది. ఎందుకంటే, శ్రమ సాధనాలుగా ఉన్న పెట్టుబడి హెచ్చు మోతాదులో ఉన్నందువల్ల.

ఫ్యాక్టరీ వ్యవస్థ అభివృద్ధి చెందేకొద్దీ నిరంతరం పెరిగే పెట్టుబడిలోని ఒకభాగం ఏరూపం తీసుకుంటుందంటే: ఒక పక్క, దాని విలువ నిరంతర స్వయం విస్తరణ చెందుతుంది, మరొకవైపు సజీవ శ్రమ స్పర్శ లేనప్పుడల్లా తన ఉపయోగపు విలువనీ, మారకం విలువనీ కోల్పోతుంది. పత్తి వ్యాపారంలో అగ్రగణ్యుడైన ఆష్ వర్త్ ప్రొఫెసర్ సీనియర్‌తో అన్న మాటలు: ఒక శ్రామికుడు పలుగుని కిందబడేసి ఉంచినంత సేపూ 18 పెన్నీల పెట్టుబడిని నిరుపయోగంగా ఉంచినట్లు. పనివాళ్ళలో ఒక్కడు మిల్లువదిలి వెళ్ళిపోతే, అతను లక్ష పౌన్ల పెట్టుబడిని నిరుపయోగ పరిచినట్లు. ఊరకే ఊహించండి! లక్ష పౌండ్ల పెట్టుబడిని ఒక్క క్షణం ఊరకే ఉంచడం!

ఆష్ వర్త్ నుంచి పై ఉపదేశం పొందాక, సీనియర్ నిరంతరం పనిదినం పెంపు కోరుకోదగినది అన్నాడు.

5. యంత్రాలు పనిదినాన్ని పెంచడానికి మరొక కారణం: తాత్కాలికంగా వచ్చే అధిక అదనపు విలువని సొంతం చేసుకోవడానికి పెట్టుబడిదారుడు త్వరపడాల్సి ఉంటుంది. యంత్రాలు సాపేక్ష అదనపు విలువని ఉత్పత్తిచేస్తాయి.

ఒకటి, శ్రమ శక్తి విలువని తగ్గించడం ద్వారా, రెండు, పరోక్షంగా శ్రమశక్తి పునరుత్పత్తిలో చేరే సరుకుల్ని చౌక పరచడం ద్వారా. అంతే కాదు. ఒక పరిశ్రమలో అక్కడక్కడా యంత్రాల్ని పెట్టినప్పుడు, ఆ యజమానులు ఉపయోగించుకునే శ్రమ మరింత ఫలవంతంగా ఉంటుంది. ఉత్పత్తయిన వస్తువు సామాజిక విలువని వ్యష్టి విలువ కన్నా పెంచడం ద్వారా. ఆవిధంగా ఒకరోజు శ్రమశక్తి విలువని ఒక రోజు ఉత్పాదితం విలువలో తక్కువ భాగంతో భర్తీ చేసేందుకు పెట్టుబడి దారుడికి అవకాశం ఇవ్వడం ద్వారా. యంత్రాల వినియోగం ఒకరకంగా మోనోపోలీ గా ఉన్న ఈ పరివర్తనా కాలంలో లాభాలు అసాధారణ స్థాయిలో ఉంటాయి. ఆకాలాన్ని పెట్టుబడిదారుడు సంపూర్ణంగా వినియోగించుకునే ప్రయత్నం చేస్తాడు. అందుకు పనిదినాన్ని ఎంత వీలైతే అంత పొడిగిస్తాడు. ఆ లాభ పరిమాణం మరింత లాభంకోసం తపనని పెంచుతుంది.

6. ఒక ప్రత్యేక పరిశ్రమలో యంత్రాల వినియోగం సర్వ సాధారణం అయినప్పుడు, ఉత్పాదితం సామాజిక విలువ, దాని వ్యష్టి విలువకి పడిపోతుంది. ఉదాహరణకి, కొద్దిమంది యంత్రాలతో ఉత్పత్తి చేస్తుండగా ఎక్కువ మంది పనిముట్లతో చేస్తున్న పరిస్థితి ఇది. యంత్రంతో తయారయిన వస్తువు ధర తక్కువగానూ, పనిముట్టుతో తయారయిన వస్తువు ధర ఎక్కువగానూ ఉంటాయి. మొదటిది 8 రూపాయలుంటే, రెండోది 10 రూపాయ లుండవచ్చు. పనిముట్లతో చేసిన వస్తువులే ఎక్కువ సంఖ్యలో ఉన్నంతకాలం ఆ ధరే

డబ్బులో సామాజిక విలువ. యంత్రంతో తయారైనవి తక్కువ సంఖ్యలో వుంటాయి. అలా తయారయిన వస్తువు ధర 8 రూపాయలు. ఇది కొద్దిమంది పెట్టుబడిదారులకు పడే విలువ. ఇదే వ్యష్టి విలువ (individual value). ఈ ఉత్పత్తి దారులు కూడా సామాజిక విలువకే అమ్మగలరు. అప్పుడు వాళ్లకి పనిముట్లతో చేస్తున్న ఉత్పత్తిదారులకంటే ఎక్కువ అదనపు విలువ వస్తుంది. అయితే ఆ పరిశ్రమలో అందరూ యంత్రాలు పెడితే, అప్పుడు సామాజిక ధర వ్యష్టి విలువకి పడిపోతుంది. రెండూ ఒకటే అవుతాయి. అంటే 8 రూపాయలకు దిగుతుంది.

**అదనపు విలువ వచ్చేది యంత్రాలు తొలిగించిన శ్రమ శక్తి నుండి కాదు**
**యంత్రాలతో పనిచేసేటప్పుడు వాస్తవంగా ఖర్చు పెట్టిన శ్రమ శక్తి నుండి**
**అనే నియమం తిరుగు లేనిదని రుజువవుతుంది**
**అదనపు విలువ అస్థిర పెట్టుబడి నుండి మాత్రమే ఏర్పడుతుంది**

## అదనపు విలువ మొత్తం రెండు అంశాల మీద ఆధారపడుతుంది:

ఒకటి అదనపు విలువ రేటు. రెండు పనివాళ్ళ సంఖ్య.

**అదనపు విలువ రేటు × పనివాళ్ళ సంఖ్య = అదనపు విలువ మొత్తం**

పనిదినం నిడివి తెలిస్తే, ఒకరోజులో అదనపు శ్రమ కాలానికీ, అవసర శ్రమకాలానికీ ఉండే నిష్పత్తి అదనపు విలువ రేటుని నిర్ణయిస్తుంది. నియమితులయ్యే శ్రామికుల సంఖ్య స్థిర పెట్టుబడికీ, అస్థిర పెట్టుబడికీ ఉండే నిష్పత్తిని బట్టి ఉంటుంది.

ఇప్పుడు యంత్రాల వాడకం వల్ల ఉత్పాదకత పెరుగుతుంది. ఫలితంగా అవసర శ్రమని తగ్గించి అదనపు శ్రమని పెంచవచ్చు. ఎంత పెంచినప్పటికీ, పెట్టుబడి నియమించే శ్రామికుల సంఖ్యని తగ్గించడం ద్వారా మాత్రమే ఈ ఫలితం వస్తుంది. మునుపు శ్రమ శక్తి కొనడానికి వాడిన అస్థిర పెట్టుబడిని, ఇప్పుడు యంత్రాల్లోకి, అంటే స్థిర పెట్టుబడిలోకి మారుస్తుంది. స్థిర పెట్టుబడి అదనపు విలువని ఏర్పరచదు. ఉదాహరణకు, 24 మంది కార్మికులనుండి పొందే అదనపు విలువని ఇద్దరి నుంచి లాగడం అయ్యేపనికాదు. పనిదినం 12 గంటలు. ఒక్కొక్కరు 1 గంట అదనపు శ్రమను ఇస్తే, ఈ 24 మంది కలిసి 24 గంటల అదనపు శ్రమను ఇస్తారు. ఈ 24 గంటల శ్రమ ఇద్దరి పూర్తి శ్రమ (12×2).

<u>**వైరుధ్యం**</u> అదనపు విలువ ఉత్పత్తికి యంత్రాలు పెట్టడంలో అంతర్గతమైన ఒక వైరుధ్యం ఉంది. పెట్టుబడి ఏర్పరిచే అదనపు విలువకు సంబంధించిన రెండు అంశాల్లో ఒక అంశం అదనపు విలువ రేటు. రెండోది పనివాళ్ళ సంఖ్య. ఒక అంశం అయిన అదనపు విలువ రేటు పెంచాలంటే, రెండో అంశం అయిన శ్రామికుల సంఖ్యని తగ్గించాల్సిందే.

## ఈ వైరుధ్యం ఎప్పుడు బయట పడుతుంది?

ఒకానొక పరిశ్రమలో యంత్రంతో ఉత్పత్తయిన సరుకుల విలువ అదే రకం సరుకులన్నిటి విలువనీ క్రమబద్ధం చెయ్యగానే ఈ వైరుధ్యం బయట పడుతుంది; ఈ వాస్తవం

తెలియకపోయినా, పెట్టుబడి దారుణ్ణి పనిదినాన్ని అంతకంతకూ పెంచేందుకు ప్రేరేపించేది, ఈ వైరుధ్యమే. ఎందుకంటే దోచుకోబడే కార్మికుల సంఖ్య తగ్గుదలని, సాపేక్ష అదనపు విలువని పెంచడం ద్వారామాత్రమే కాకుండా, పరమ అదనపు శ్రమని పెంచడం ద్వారా కూడా భర్తీ చేసుకోడానికి.

యంత్రాల వాడకం పెట్టుబడిదారులకు, ఒకవైపున పనిదినాన్ని అతిగా పెంచేందుకు బలమైన, కొత్తకొత్త ప్రేరణలను సమకూరుస్తుంది. ఈ పోకడకి ఏర్పడే అన్ని వ్యతిరేకతల్నీ విచ్ఛిన్నం చేసే విధంగా **శ్రమ పద్ధతుల్నీ, సామాజిక శ్రమ వ్యవస్థ స్వభావాన్నీ** తీవ్రంగా మారుస్తుంది. మరొక వైపు మునుపు అందుబాటులో లేని వాళ్ళని (స్త్రీలనీ, పిల్లలనీ) శ్రామిక వర్గానికి చేర్చడం ద్వారా కొంతా, పనిలో నించి తొలిగించి విడుదల చెయ్యడం ద్వారా కొంతా, అదనపు శ్రామిక జనాభాను సృష్టిస్తుంది. యంత్రాన్ని సరుకుల్ని ఉత్పత్తి సాధనంగానే కాకుండా, అక్కరలేని /మిగులు జనాభాని (redundant population) ఏర్పరచే సాధనంగా కూడా రికార్డో గమనించాడనీ, అది ఆయన ప్రతిభా విశేషాల్లో ఒకటనీ మార్క్స్ ఫుట్ నోట్ లో ప్రశంసించాడు. ఈ అదనపు జనాభా శ్రామికులని పెట్టుబడి ఆజ్ఞలకు తల ఒగ్గి పడి ఉండేట్లు ఒత్తిడి పెడుతుంది. ఆ విధంగా ఆధునిక పరిశ్రమ చరిత్రలో చెప్పుకోతగ్గ విషయం అయిన యంత్రాలు పనిదినానికి సంబంధిన అన్ని నైతిక, సహజ సిద్ధ ఆంక్షల్నీ తుడిచి వేస్తాయి. అందువల్ల కూడా ఒక ఆర్థిక వైపరీత్యం (economic paradox) ఏర్పడుతుంది. ఏమంటే, శ్రమ కాలాన్ని తగ్గించే అత్యంత శక్తివంతమైన సాధనమే, శ్రామికుని కాలంలో, అతని కుటుంబం కాలంలో ప్రతి క్షణాన్ని పెట్టుబడి దారుడు తన పెట్టుబడిని విస్తరించుకునేందుకు అతనికి తిరుగులేని సాధనం అవుతుంది.

### C. శ్రమతీవ్రత పెంపు

పెట్టుబడి చేతిలో ఉండే యంత్రాలు పనిదినాన్ని మితిమీరి పెంచుతాయి. ఈ చర్యకి సమాజం నుంచి ప్రతిచర్య వస్తుంది. చట్టం జోక్యం అవసరమవుతుంది. పనిగంటల్ని చట్టం నిర్ణయిస్తుంది.

పనిగంటలు తగ్గాయి కాబట్టి, పెట్టుబడిదారులకు అదనపువిలువ మునుపటికంటే తగ్గుతుంది. ఆ నష్టాన్ని భర్తీ చెయ్యడానికి శ్రమని తీవ్రతరం చేస్తారు. అప్పటినుండీ, శ్రమ తీవ్రత ప్రాధాన్యత సంతరించుకుంటుంది. శ్రమ తీవ్రత స్థిరంగా ఉన్నప్పుడు, పని గంటలు పెరిగితే వచ్చేది పరమ అదనపు విలువ అని విశ్లేషణలో తేలింది.

ఇప్పుడిక ఎక్కువ కాలం చేసే శ్రమ స్థానంలో ఎక్కువ తీవ్రతతో చేసే శ్రమని గురించి, దాని స్థాయిని గురించీ చూద్దాం.

యంత్రాలతో పనిచెయ్యడం అలవాటు అయ్యే కొద్దీ శ్రమ వేగమూ, తీవ్రతా సహజంగానే పెరుగుతాయి. ఆ విధంగా ఇంగ్లండ్ ఫాక్టరీల్లో 50 ఏళ్లపాటు పనిగంటలూ, పని తీవ్రతా చెట్టపట్టా లేసుకుని పెరిగాయి. ఒక స్థాయి దాటి రెండూ పెరగడం వీలవదు. అక్కడనుండీ, ఒకటి పెరగాలంటే, రెండోది తగ్గాల్సి ఉంటుంది. పనిగంటలు పెరగాలంటే, శ్రమ తీవ్రత తగ్గాల్సి ఉంటుంది. శ్రమ తీవ్రత పెరగాలంటే, పనిగంటలు తగ్గాల్సి ఉంటుంది. అంటే పనిదినం

పోటీగింపూ, పనితీవ్రత పెంపూ ఒకదానికొకటి విరుద్ధంగా ఉండే పరిస్థితి ఏర్పడుతుందన్నమాట. పని దినం పెంపుని వ్యతిరేకిస్తూ కార్మికులు చేసే తిరుగుబాటు కారణంగా తప్పని పరిస్థితుల్లో పార్లమెంటు మామూలు పనిదినాన్ని నిర్ణయించింది. దాంతో పనిదినం పెంచి అదనపు విలువ పెంచుకునే పద్ధతికి పూర్తిగా అడ్డుకట్ట పడింది. ఆ క్షణం నుంచీ, పెట్టుబడి యంత్రాల్ని మరింత మెరుగు పరిచేందుకు వేగంగా అడుగులు వేసింది. సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తికి సర్వశక్తులూ ఒడ్డింది.

## సాపేక్ష అదనపు విలువకి మరో దారి

పనిగంటలు నిర్ణయమయ్యాక, సాపేక్ష అదనపు విలువ స్వభావంలో మార్పు వచ్చింది. సాధారణంగా పనివాని ఉత్పాదక శక్తి పెంపువల్ల మాత్రమే సాపేక్ష అదనపు విలువ వస్తుంది. ఉత్పాదక శక్తి పెరిగితే, అంతే శ్రమ ఎక్కువ మోతాదులో సరుకుల్ని ఉత్పత్తి చేస్తుంది. అంతే శ్రమ కాలం ఎక్కువ సరుకులకు వ్యాపిస్తుంది. ఒక్కొక్క సరుకులో మునుపటి కన్నా తక్కువ శ్రమ ఉంటుంది. ఫలితంగా ఒక్కొక్క సరుకు విలువ పడిపోతుంది.

ఇప్పటిదాకా సాపేక్ష అదనపు విలువ ఏర్పడ్డ పద్ధతి ఇది. ఇప్పుడు పద్ధతి మారుతుంది. ఉత్పాదక శక్తి పెంపుకు తోడు, పనితీవ్రత పెంపు కూడా సాపేక్ష అదనపు విలువను ఇస్తుంది. ఎలాగంటే, మునుపు శ్రామికులు కొంత సమయంలో ఎంత ఉత్పత్తి చేస్తారో, అంతే సమయంలో తీవ్రంగా పనిచేసి ఎక్కువ ఉత్పత్తి చేస్తారు. పని తీవ్రత వల్ల అదనపు విలువ పెరుగుతుంది. మునుపు 12 గంటల్లో ఎంత శ్రమ జరిగేదో, ఇప్పుడు 10 గంటల్లో అంతే జరుగుతుంది. అంతే మొత్తంలో సరుకులు ఉత్పత్తవుతాయి. శ్రమ తీవ్రత మరింత పెరిగే కొద్దీ, అంతకు మించికూడా ఉత్పత్తవుతాయి.

గంట శ్రమ సాంద్రత 12 గంటల పనిదినంలో కంటే, 10 గంటల పనిదినంలో ఎక్కువ ఉంటుంది. సాంద్రత ఎక్కువ వున్న ఒక పని గంటలో ఉత్పత్తయ్యే విలువ సాంద్రత తక్కువ వున్న $1^{1}/3$ పనిగంటలలో ఉత్పత్తయ్యే విలువ ఎంతో అంతేగానీ, అంతకుమించి గానీ ఉంటుంది. కనుక పనిగంటలు తగ్గినా, పని తీవ్రత పెరిగి అదనపు విలువ అంతే వస్తుంది. పని తీవ్రత స్థాయిని బట్టి ఎక్కువ కూడా రావచ్చు.

## శ్రమ తీవ్రతని పెంచే మార్గాలు

శ్రమశక్తి సమర్థత దాన్ని వెచ్చించే కాలానికి విలోమ నిష్పత్తిలో ఉంటుంది. అంటే ఎక్కువ సేపు పనిచేసేకొద్దీ, సామర్థ్యం తగ్గుతుంటుంది అని. కొన్ని పరిమితుల్లో పనిచేసే కాలం తగ్గినందువల్ల కలిగే నష్టాన్ని శ్రమశక్తి బిగువుని పెంచి భర్తీ చెయ్యవచ్చు. పైగా జరిగిన పనిని బట్టి చెల్లించే పద్ధతి, పనివాడు నిజంగా ఎక్కువ శక్తిని వెచ్చించేట్లు చేస్తుంది.

యంత్రాలు వాడని పరిశ్రమలలో, వాడినా అతి తక్కువగా వాడిన కుండలపరిశ్రమ వంటి వాటిలో పనిగంటల తగ్గింపు శ్రమ క్రమ బద్ధతనీ, ఏకరూపతనీ, నిరంతరాయతనీ, శక్తినీ బాగా పెంచింది. అయితే అసలైన ఫ్యాక్టరీలలో పనిగంటల తగ్గింపు ఇదే ఫలితాన్నిచ్చిందా అనేది సందేహం. ఎందుకంటే, అక్కడ శ్రామికుడు నిరంతరాయమైన, ఏకరూప చలనం ఉండే

యంత్రాలతోనే పనిచేస్తాడు, అందువల్ల అతని పని, కచ్చితమైన క్రమ శిక్షణని ఏర్పరచింది. 1844 లో పనిగంటలు 12 గంటలనుంచి తగ్గించడం గురించి చర్చ వచ్చింది. యజమానులు ఫాక్టరీలు బాగా నిర్వహించబడుతున్నాయనీ, కార్మికుల శ్రద్ధ పెరిగినందువల్ల ఏదో మంచి ఫలితం వస్తుందని ఆశించడం అసంగతం అని దాదాపు ఏకగ్రీవంగా ఉద్ఘాటించారు. అయితే వాళ్ళ మాటలు నిజం కాదని ప్రయోగాలవల్ల రుజువయింది. ఉదాహరణకి, నేత విభాగంలో పని దినాన్ని 12 నుంచి 11 గంటలకు తగ్గించినప్పుడు, 12 గంటల్లో కన్నా ఎక్కువ ఉత్పత్తయింది. ఈ పెంపుదల కార్మికులు శ్రద్ధగా పనిచేసి, కాలాన్ని పొదుపు చేసిన దాని ఫలితం. కార్మికులకి మునుపు వచ్చినంత జీతమే వచ్చింది. ఒక గంట కాళీ సమయం దొరికింది. యజమానులకు మునుపటంత ఉత్పత్తి వచ్చింది. బొగ్గు, గాస్ వంటివి ఒక గంట ఖర్చు కాకుండా మిగిలాయి. పనివాళ్ళు చెప్పిన మాట : మరింత ఉత్సాహంతో పనిచేస్తాము. రాత్రిపూట ఒక గంట ముందు ఇంటికి పోతామని మా మనసులో ఎప్పుడూ మెదులుతూ ఉంటుంది. అయితే ఆ ఉత్సాహం తాత్కాలికమే. ఆ తగ్గింపు తప్పని సరి అయిన వెంటనే, పెట్టుబడిదారుని చేతిలో యంత్రాలు మరింత శ్రమని పిండే సాధనాలవుతాయి.

**ఈ పిండడం రెండు విధాలుగా జరుగుతుంది:**

1. యంత్రాల వేగం పెంచడం
2. ఒక్కొక శ్రామికుడు పనిచెయ్యాల్సిన యంత్రాల సంఖ్య పెంచడం

అందుకు యంత్రాల్లో మెరుగుదలలు అవసరం. ఎందుకంటే అవి లేకుండా పనివానిమీద ఒత్తిడి పెంచడం సాధ్యం కాదు. పనిగంటలు తగ్గాయి కాబట్టి, ఉత్పత్తి ఖర్చు మీద నిఘాపెట్టాల్సి ఉండడం మరొక కారణం.

ఆవిరి యంత్రంలో వచ్చిన మెరుగుదలలు ముసలకం (piston) వేగాన్ని పెంచాయి. అంతే బొగ్గుతోనో, అంతకన్నా తక్కువతోనో అదే ఇంజన్ తో మరిన్ని యంత్రాలు నడిచాయి. అందించే యంత్రాంగంలో (transmitting mechanism) మెరుగుదలలు రాపిడిని (friction) తగ్గించాయి. యంత్ర దండాల (shafts) వ్యాసాన్నీ, బరువునీ తగ్గించాయి. పాత యంత్రాలకీ, కొత్తవాటికీ కొట్టొచ్చినట్లు కనబడే తేడా ఇది. యంత్రాల సైజు తగ్గిస్తూనే, వాటి సామర్థ్యాన్నీ, వేగాన్నీ పెంచాయి. ఆధునిక మరమగ్గం ఇందుకు ఉదాహరణ. అలాగే సైజుని పెంచుతూ, అందులోని పనిముట్ల సంఖ్యనీ, విస్తృతినీ పెంచాయి. పైకి కనిపించని, సూక్ష్మమైన మార్పులద్వారా ఆ భాగాల వేగాన్ని పెంచాయి. నూలు వడికే యంత్రాలు ఇందుకు ఉదాహరణ.

## 12 గంటల పనిదినం

ఇంగ్లండ్ లో 1832లో పనిదినం 12 గంటలకు తగ్గించబడింది. 1836 లో ఒక మాన్యుఫాక్చరర్ ఇలా అన్నాడు: 30,40 ఏళ్ళనాటితో పోలిస్తే, ఇప్పుడు ఫాక్టరీలలో జరిగే శ్రమ ఎంతో ఎక్కువ. కారణం బాగా పెరిగిన యంత్రాల వేగం వల్ల, మరింత శ్రద్ధా, చర్యా అవసరం కావడమే. 1844 లో లార్డ్ ఆష్లే హౌస్ ఆఫ్ కామన్స్ సభలో యంత్రాలు మనుషుల శ్రమన్ని అపారంగా పెంచాయి అన్నాడు. అందుకు రుజువులు చూపాడు:

- 40 నంబరు నూలు వడికే ఒక జత యంత్ర కదుళ్ళను చూచే పనివాడు 1825 లో 12 గంటల పనిదినంలో 8 మైళ్ళు నడవాల్సి వచ్చేది. అదే పనివాడు 1832 లో 20 మైళ్ళు నడవాల్సి వచ్చింది.
- 1825 లో వడుకు పనివాడు ఒక్కొక్క యంత్రం మీదా 820 కండెల చొప్పున రెండు యంత్రాలమీద 1640 కండెలు (stretches) పెట్టేవాడు. 1832 లో ఒక్కొక్క యంత్రం మీదా 2200 కండెల చొప్పున రెండు యంత్రాలమీద 4400 కండెలు పెట్టేవాడు.
- 1838 లో వారంలో వడికే నూలు చిట్టెములు (hanks) సంఖ్య 18వేలు. 1843లో 21 వేలకు పెరిగింది.
- 1819 లో మరమగ్గాల నేతలో నిముషానికి 60 కండె విసుర్లు ఉండేవి. 1842 లో అవి 140 కి పెరిగాయి.
- నాసిరకం దూదిని కూడా వాడుతున్నారు. అందువల్ల శ్రమ ఎక్కువవుతుంది.
- నూలు చిక్కుదీసే చోటకూడా పని పెరిగింది. మునుపు ఇద్దరు చేసిన పనిని ఇప్పుడు ఒకడే చేస్తున్నాడు.

ఇవన్నీ శ్రమ పెరుగుదలని సూచిస్తాయి. నడవాల్సిన దూరం ఎక్కువ కావడం వల్ల, ఉత్పత్తయ్యే వస్తువు బాగా పెరిగినందువల్ల, పనివాళ్ళ నిష్పత్తి మునుపటి కంటే తగ్గినందువల్ల పని పెరుగుతున్నది.

12 గంటల చట్టం ఫలితంగా 1844 కల్లా పని తీవ్రత అమితమయింది. అప్పుడు ఇంగ్లిష్ మాన్యుఫాక్చరర్లు ఇక శ్రమ తీవ్రతను పెంచడం సాధ్యం కాదన్నారు. కనుక ఇంతకన్నా పనిగంటలు తగ్గిస్తే ఉత్పత్తి తగ్గుతుందన్నారు. యజమానులమీద నిరంతరం నిఘా పెట్టే ఇన్స్పెక్టర్ హొూమర్ సైతం వాళ్ళు చెప్పింది సరైనదే అనుకున్నాడు. కాబట్టి పనిగంటల్ని 12 కన్నా తగ్గిస్తే, ఉత్పత్తి పడిపోతుందని నిర్ధారించాడు.

అయితే వాళ్ళలా చెప్పినా, 1847 లో 10 గంటల పని చట్టం వచ్చింది. శ్రమ తీవ్రతని ఇంకా పెంచడం సాధ్యమేనని తేలింది. అప్పుడు నూలు, ఉన్ని, పట్టు, నార మిల్లుల్లో పది గంటల పని అమల్లోకి వచ్చింది. త్రాసిల్ యంత్రం మీద కదుళ్ళ వేగం నిముషానికి 500 భ్రమణాలూ, 1000 భ్రమణాలూ పెరిగాయి. 1848-1852 నడుమ ఆవిరి యంత్రం మెరుగైంది. ఇప్పటి ఆవిరి యంత్రం నుంచి, మునుపటి యంత్రం నుంచి కంటే 50 శాతం ఎక్కువ పని జరుగుతున్నది - అని హొూమర్ ఉత్తరానికి జవాబులో జేమ్స్ నాస్మిత్ అనే ఇంజనీర్ రాశాడు. అతనిలా అభిప్రాయపడ్డాడు:

ప్రతి రకం యంత్రాల్లోనూ గొప్ప మెరుగుదలలు వచ్చాయి. అవి ఉత్పాదక శక్తిని ఎంతగానో పెంచాయి. ఈ మెరుగుదలలను ప్రేరేపించింది పనిగంటల తగ్గింపే. ఇందుకు సందేహం లేదు. పనివాని అధిక శ్రమా, యంత్రాల మెరుగుదలా కలిసి ఉత్పాదక శక్తిని పెంచాయి. 10 గంటల పనిదినంలోనే, మునుపు 12 గంటల్లో అయినంత ఉత్పత్తి అవుతున్నది.

అధిక శ్రమ తీవ్రత లాభాల్నీ, పారిశ్రామిక వృద్ధి రేటునీ పెంచింది. యజమానుల సంపద అతీతంగా పెరిగింది. 1838–1850 కాలంలో 32 శాతమూ, 1850–1856 కాలంలో 86 శాతమూ పెరిగింది. 1848–1856 కాలంలో 10 గంటల పని ప్రభావం వల్ల పరిశ్రమల అభివృద్ధి గొప్పగానే ఉంది. అయితే దాన్ని 1856–1862 కాలంలో జరిగిన అభివృద్ధి ఎంతగానో మించిపోయింది.

## సిల్కు మిల్లుల విషయం:

| సంవత్సరం | కదుళ్ళ సంఖ్య | మగ్గాల సంఖ్య | పనివాళ్ళు |
|---|---|---|---|
| 1856 | 1,093,799 | 9,260 | 56,131 |
| 1862 | 1,388,544 | 10,709 | 52,428 |

ఈ అంకెలని బట్టి చూస్తే, కదుళ్ళూ, మగ్గాలూ పెరిగాయి. అయినా పనివాళ్ళు తగ్గారు.

## ఉన్నిబట్టల మిల్లుల విషయం:

| సంవత్సరం | మగ్గాల సంఖ్య | పనివాళ్ళు | 14 ఏళ్ల లోపు పిల్లలు |
|---|---|---|---|
| 1856 | 38,956 | 87, 794 | 11,228 |
| 1862 | 43,048 | 86,063 | 13,178 |

ఈ అంకెలని బట్టి చూస్తే, మగ్గాలు పెరిగాయి. అయినా పనివాళ్ళు తగ్గారు. పిల్లలు పెరిగారు.

## ఇందుకు పరోక్ష రుజువు పనివాళ్ళ నిరసనలే, ప్రతిఘటనలే

1863 ఏప్రిల్ 27న కామన్స్ సభలోమాట్లాడుతూ ఫెర్రండ్ తాను16 జిల్లాల ప్రతినిధుల పక్షాన మాట్లాడుతున్నా నన్నాడు. యంత్రాల్లో వస్తున్న మెరుగుదలల మూలంగా ఫాక్టరీలలో పనిభారం పెరుగుతున్నదని తనతో చెప్పారన్నాడు. మునుపు ఇద్దరు సహాయకులతో ఒక పనివాడు రెండు మగ్గాలు నడిపే వాడు. ఇప్పుడు సహాయకులు లేకుండా, ఒక్కడే మూడు మగ్గాలు నడుపుతున్నాడు. నాలుగు మగ్గాలు నడపడం కూడా అరుదేమీ కాదు.

పై వాస్తవాలని బట్టి మునుపటి 12 గంటల పని ఇప్పటి 10 గంటలలో ఇమడ్చబడిందని, అంటే అప్పటి 12 గంటల పని ఇప్పుడు 10 గంటల్లోనే అయిపోతున్నదని. ఈ ఉత్పాదకత పెరగడానికి కారణం శ్రమ తీవ్రత పెరుగుదలే. అయితే శ్రమ తీవ్రత పెరగడం అనేది శ్రామికుని ఆరోగ్యానికీ, సరిగా పనిచెయ్యడానికీ ఆటంకం కలిగిస్తుంది.

గత కొద్ది సంవత్సరాల కాలంలో, అనేక నూలు, సిల్కు, ఉన్ని మిల్లుల్లో యంత్రాల వేగం విపరీతంగా పెంచారు. వాటిని సరిగా చూసేందుకు పని వాళ్ళు అలసట పుట్టించే ఉద్విగ్న స్థితిలో ఉండడం అవసరం. ఊపిరితిత్తుల వ్యాధితో చనిపోయే వారి సంఖ్య ఎక్కువవడానికి కారణం ఇదే నని Dr. గ్రీన్ హౌ చెప్పింది సరైనదే.

### ఇక తర్వాత అడుగు మరొకసారి పనిగంటలు తగ్గించడమే

పని గంటల పొడిగింపు ఇక లేకుండా నిషేధించాక, పెట్టుబడిదారుడు తనకు కలిగే నష్టాన్ని శ్రమ తీవ్రతని పద్ధతి ప్రకారం పెంచడం ద్వారా పూడ్చుకోవాలనీ, యంత్రాలలో వచ్చే మెరుగుదలల్ని పని వాళ్ళ శక్తి సామర్థ్యాల్ని పూర్తిగా వినియోగించుకునే సాధనాలుగా మార్చుకోవాలనీ అనుకుంటాడు. ఈ ధోరణి మళ్ళీ పనిగంటల తగ్గింపు తప్పని స్థితికి, పరిస్థితుల్ని తోసుకుపోతుంది. ఇందుకు ఏమీ సందేహం లేదు. ఇందుకు రుజువుగా ఫుట్ నోట్ లో:

**ఇప్పుడు, అంటే 1867 లో లాంక్ షైర్ ఫాక్టరీల్లో 8 గంటల పనిదినం కోసం కార్మికుల ఆందోళన ఆరంభమైంది**

అని చెబుతాడు.

మరొక పక్క, 10 గంటల పనిరోజు ప్రభావం వల్ల, 1848 నించీ ఇప్పటిదాకా (1867) ఇంగ్లండ్ పరిశ్రమలో ఊపుగా వచ్చిన పురోగతి, పనిరోజు 12 గంటలుగా ఉన్న 1837-1847 కాలంలో వచ్చిన పురోగతిని ఎంతో మించింది. ఎంతగా అంటే, అంతకు ముందు ఫాక్టరీలు ప్రవేశించిన అర్ధ శతాబ్దంలో - అంటే పనిరోజుకి అసలు పరిమితి లేని కాలంలో - వచ్చిన పురోగతికంటే 1837-1847 కాలంలో వచ్చిన పురోగతిని ఎంతగానో అధిగమించింది.

# విభాగం 4
# ఫాక్టరీ (కర్మాగారం)

ఫాక్టరీలో యంత్రవ్యవస్థ ఉంటుంది. అది స్త్రీల శ్రమనీ, పిల్లల శ్రమనీ స్వాధీనం చేసుకుంటుంది. తద్వారా దోపిడీ చెయ్యడానికి కావలసిన కార్మికుల సంఖ్యని పెంచుతుంది. శ్రామికుడికి ఉండే విడి సమయాన్ని, అంటే సొంత పనులకు వాడుకునే కాలాన్ని కూడా లాక్కుంటుంది – పనిదినాన్ని పొడిగించడం ద్వారా. యంత్రాల మెరుగుదల శ్రమశక్తిని అంతకంతకూ ఎక్కువ దోచుకునేందుకు సాధనంగా పనిచేస్తుంది. తక్కువ కాలంలో ఎక్కువ ఉత్పత్తి చేయించే సాధనం అవుతుంది – శ్రమని తీవ్రతరం చేస్తుంది.

ఇప్పటికే ఈ విషయాలు తెలుసుకున్నాం. ఇక ఇప్పుడు మొత్తంగా ఫ్యాక్టరీని చూద్దాం.

## కార్మికుల మధ్య అసమానతలు

యంత్రాలు లేకుండానే నడిచే కార్ఖానా ఉత్పత్తి, పనివాడి వ్యక్తిగత సామర్ధ్యం మీదా, పనిముట్టుని వాడే అతని నేర్పు మీదా ఆధారపడి వుంటుంది. అందువల్ల కార్మికుల మధ్య అసమానతలు వుంటాయి. ఆ అసమానతల కారణంగా కార్మికుల్లో అంతస్తుల పద్ధతి (heirarchy) ఏర్పడుతుంది.

శ్రామికుని చేతిలోని పనిముట్టు యంత్రంలోకి చేరింది. ఇక ముడి సరుకుని యంత్రమే మలుస్తుంది. కనుక అతను అంతదాకా చేసిన పని ఇక అతనిది కాదు. అతను చేయాల్సిందల్లా, కేవలం యంత్రం చేసే పనిని పర్యవేక్షించడం మాత్రమే. అంతకుముందు శ్రామికుడు పని చేసినంత కాలం మాత్రమే పనిముట్టు పనిచేస్తుంది. అతను పని ఆపితే పనిముట్టు పనిచెయ్యదు. అతని నేర్పుకీ, శ్రమ తీవ్రతకీ అనుగుణంగా పనిచేస్తుంది. అంటే పనిముట్టు శ్రామికుని శక్తితో ముడిబడి వుంది. అయితే, యంత్రానికి పనివాని సామర్ధ్యంతోగానీ, నేర్పుతో గానీ పనివుండదు. కనుక ఒక పనివాడి బదులు, మరొకరిని పెట్టి నడపడానికి వీలుంది. అది చాలా తేలిక కూడా.

మునుపు పనిముట్టు శ్రామికుని చేతిలో ఉండేది. దాన్ని వాడడం అతనికి చేతకావాలి. అంటే కొంత నైపుణ్యం కావాలి. అయితే ఇప్పుడు పనిముట్టు అతని చేతిలో నించి యంత్రంలో చేరింది. పనిముట్టుతో పాటే దాన్ని వాడే శ్రామికుని నైపుణ్యం కూడా యంత్రానిదయింది. కార్ఖానా ఉత్పత్తిలో సాంకేతిక పునాది అయిన శ్రమ విభజన తుడిచి పెట్టుకు పోయింది. కార్ఖానా ఉత్పత్తికి లక్షణం నిపుణ కార్మికుల దొంతర. ఇప్పుడు ఆ పునాదే పోయింది. ఇక ఇప్పటి ఆటోమాటిక్ ఫాక్టరీలో అటువంటి నిపుణ కార్మికుల దొంతర అవసరం ఉండదు. కనుక అదీ పోతుంది. దాని స్థానంలో, ఆటోమాటిక్ ఫాక్టరీలో, యంత్రాలను చూసే వాళ్ళు చేసే ప్రతి పనినీ ఒకే ఒక స్థాయికి తెచ్చే పోకడ ఉంటుంది. అంటే రకరకాల పనులు ఉండవు. భిన్నమైన నిపుణ పనులు ఉండవు. విభాగ శ్రామికుల్లో ఏర్పడ్డ తేడాలు పోతాయి. వాటి స్థానంలో వయో భేదాలూ, స్త్రీ పురుష భేదాలూ ఉంటాయి.

**కార్ఖానా ఉత్పత్తిలో ఉండే బృందం ఫాక్టరీలో ఉండదు.** ప్రత్యేక యంత్రాలదగ్గర, ఫాక్టరీలో వివిధ శాఖల మధ్య పనివాళ్ళ పంపిణీగా కనబడుతుంది. ప్రతి శాఖలోనూ ఒకేచోట ఉండే ఒకే రకమైన పలు యంత్రాల దగ్గర పనిచేస్తారు. బృందాలుగా సంఘటితమై ఉండరు. కనుక వాళ్ళ సహకారం సామాన్యసహకారమే. దాని స్థానంలో మేస్త్రీ, అతని కింద సహాయకులూ ఉంటారు. వాళ్ళమధ్య సంబంధం ఉంటుంది. ముఖ్యమైన విభజన:

1. యంత్రాల దగ్గర పనిచేసే వాళ్ళు. వీళ్ళలో ఇంజన్ ని చూసుకునే వాళ్ళు కూడా ఉంటారు.
2. పనివాళ్ళకి సహాయకులు. వీళ్ళంతా పిల్లలు. కొందరు యంత్రాలకి పని జరగాల్సిన పదార్థాలని అందిస్తుంటారు.
3. అన్ని యంత్రాల్నీ చూసుకుంటూ, ఎప్పటి కప్పుడు అవసరమైనప్పుడల్లా వాటిని రిపేర్ చేసే ఇంజనీర్లూ, మేకానిక్కులూ, జాయనర్లూ. వీళ్ళు కొద్దిమందే ఉంటారు. అయితే వీళ్ళు పై స్థాయి పనివాళ్ళు. కొందరు శాస్త్ర విద్య చదివిన వాళ్ళు. మిగతా వాళ్ళు ఏదో ఒక శాఖలో ప్రవీణులయినవాళ్ళు. వీళ్ళు ఫాక్టరీ పనివాళ్ళకి భిన్నమైన వాళ్ళు. వాళ్ళతో కలపబడిన వాళ్ళు మాత్రమే. ఈ శ్రమ విభజన కేవలం సాంకేతికమైనది మాత్రమే. యంత్రం దగ్గర పనిచెయ్యాలంటే, శ్రామికుడు యంత్రం యొక్క నిరంతరాయమైన, ఆటోమాటిక్ కదలికలకు తగినట్లుగా తన కదలికల్ని మలుచుకోవాలి. అందుకతను చిన్నప్పటి నుంచే అలవాటు పడాల్సి ఉంటుంది. తర్ఫీదు పొందాల్సి ఉంటుంది.

యంత్రాల దగ్గర చేసేపని యువకులు త్వరగా నేర్చుకుంటారు. కనుక వాటితో పనిచెయ్యడానికి ప్రత్యేకశిక్షణ పొందిన శ్రామికులు అవసరం లేదు. ఒక ప్రత్యేక వ్యక్తే , ఒక యంత్రం వద్ద పనిచెయ్యాలి అనేదేమీ ఉండదు. కాబట్టి పనివాళ్ళని ఒక యంత్రం దగ్గరనుండి, మరొక యంత్రం దగ్గరకి మార్చవచ్చు. ఇక సహాయకుల పని విషయానికొస్తే, అది చాలా సులువైనది. ఆపని కొంతవరకూ యంత్రాలతోనే చేయించవచ్చు. విసుగు పుట్టించే మొద్దుపని చేసే వాళ్ళని ఎప్పటికప్పుడు మార్చవచ్చు.

**సాంకేతిక దృష్టితో చూస్తే, పాత శ్రమ విభజనని యంత్రాలు తొలిగించినట్లే.** అయితే అది ఫాక్టరీని చుట్టుకునే వుంది. కార్ఖానాఉత్పత్తి నుంచి సాంప్రదాయక అలవాటుగా అందింది. ఆ తర్వాత అది శ్రమ శక్తిని దోపిడీ చెయ్యడానికి పెట్టుబడికి పెద్ద సాధనంగా తీర్చి దిద్దింది. ఇంతకు ముందు జీవితాంతమూ ఒకే ప్రత్యేక పనిముట్టుతో పనిచేసే నైపుణ్యం, ఇప్పుడు ఒకే యంత్రం దగ్గర జీవితాంతం పనిచేసే నైపుణ్యం అవుతుంది.

శిక్షణ కయ్యే ఖర్చులు తగ్గుతాయి. ఆ విధంగా అతని పునరుత్పత్తి ఖర్చులు గణనీయంగా తగ్గుతాయి. దానికి తోడు, పనివాడు విధిలేక ఫాక్టరీ మీదా, పెట్టుబడిదారుడి మీదా ఆధారపడడం పూర్తవుతుంది. అన్ని చోట్లలాగే, ఇక్కడకూడా మనం సామాజిక ఉత్పత్తి ప్రక్రియ అభివృద్ధి వల్ల పెరిగే ఉత్పాదకతకీ, పెట్టుబడిదారీ దోపిడీ వల్ల పెరిగే ఉత్పాదకతకీ తేడా గమనించాలి.

1. చేతి వృత్తుల్లోనూ, కార్ఖానా ఉత్పత్తిలోనూ పనివాడు పనిముట్టుని వాడతాడు. ఫాక్టరీలో యంత్రమే పనివాణ్ణి వాడుతుంది.

2. మొదటి దాంట్లో శ్రమ సాధనం (పనిముట్టు) కదలిక పనివాడి నుండి మొదలవుతుంది. రెండో దాంట్లో పనివాడు యంత్రం కదలికలను అనుసరించి పోవాలి.

3. కార్ఖానా ఉత్పత్తిలో పనివాళ్ళు సజీవ యంత్రాంగంలో భాగాలు. ఫాక్టరీలో ఉండేది నిర్జీవ యంత్రాంగం, దానికి శ్రామికుడు తోక అవుతాడు.

## సిసిఫస్ శ్రమ లాంటిది

పనివాడు చేసేది పొద్దాకులూ ఒకేరకం పని. చేసిచేసి విసుగొస్తుంది. అంతులేని రొడ్డకొట్టుడు పని. సిసిఫస్ శ్రమ లాంటిది. (సిసిఫస్ ఒక రాజు. మరణదేవుణ్ణి మోసం చేసి శాపానికి గురవుతాడు. ఒక పెద్ద బండని కొండపైకి నెట్టుకు పోవాలి. అయితే తీరా శిఖరం చేర్చాక, ఆ బండ తిరిగి కిందికి దొర్లుతుంది. మరల పైదాకా తోసినా కింద పడుతూనే ఉంటుంది) అది ఎన్నటికీ ముగిసే పని కాదు. అలాగే ఈ పనిభారం కూడా, అలిసి పోయిన పనివాడి మీద పదేపదే తెరిపివ్వకుండా పడుతూనే ఉంటుంది.

ఇక్కడ మొలినారీ అనే ఫ్రెంచ్ స్వేచ్ఛావాణిజ్య వాది అభిప్రాయం ఫుట్ నోట్ గా ఉంది:

యంత్ర గమనాన్ని 15 గంటలపాటు గమనించే పనివాడు, ఆ 15 గంటలూ శరీర శ్రమ చేస్తే ఎంతగా అలసిపోతాడో అంతకన్నా ఎక్కువగా ఆలసిపోతాడు. ఈ నిఘా శ్రమ ఎక్కువసేపు ఉండకపోతే, అది మనస్సుకి ఎక్సరసైజ్ గా ఉపయోగకరమైంది కావచ్చు. అయితే అదే నిఘాశ్రమ మితిమించి చేస్తే, దీర్ఘకాలంలో మనస్సునీ, శరీరాన్నీ ధ్వంసం చేస్తుంది. నాడీ వ్యవస్థకి అత్యధికమైన అలసట కలిగిస్తుంది. కండరాల కదలికల్ని పరిమితం చేస్తుంది. శారీరక చర్యలోనూ, బౌద్ధిక చర్యలోనూ స్వేచ్ఛని అణువణువూ హరించివేస్తుంది.

పని సులువు గావడంకూడా ఒక తరహా చిత్రహింస అవుతుంది. ఎందుకంటే యంత్రం కార్మికుడికి శ్రమ నుంచి స్వేచ్ఛ ప్రసాదించదు. సరికదా, అతనికి పనిపట్ల ఉన్న ఉత్సాహాన్నీ, ఆసక్తినీ హరించి వేస్తుంది.

పెట్టుబడిదారీ ఉత్పత్తి, శ్రమ ప్రక్రియ మాత్రమే కాదు, అదనపు విలువని ఉత్పత్తిచేసే ప్రక్రియ కూడా. అందువల్ల అన్ని పెట్టుబడిదారీ ఉత్పత్తులకీ ఒక ఉమ్మడి లక్షణం ఉంటుంది :

**శ్రమ సాధనాలని వినియోగించేది శ్రామికుడు కాదు**

**శ్రమ సాధనాలే శ్రామికుణ్ణి వినియోగిస్తాయి**

ఈ తలక్రిందులు పద్ధతి సాంకేతికంగానూ, ప్రస్ఫుటంగానూ మొదటగా వాస్తవం అయ్యేది ఫాక్టరీ వ్యవస్థ లోనే. దానికదే నడిచే యంత్రంగా (automaton) మారడం ద్వారా, శ్రమ ప్రక్రియలో శ్రమ సాధనం కార్మికుణ్ణి పెట్టుబడిగా – అంటే మృత శ్రమ రూపంలో– ఎదుర్కుంటుంది. మృతశ్రమ సజీవ శ్రమ మీద పెత్తనం చెలాయిస్తుంది, సజీవ శ్రమని పూర్తిగా, ఏమాత్రం మిగల్చకుండా పీల్చివేస్తుంది. ఉత్పత్తికి సంబంధించిన బౌద్ధిక శక్తులు, శారీరక శ్రమ నుండి వేరవడమూ, ఆ బౌద్ధిక శక్తులు శ్రమమీద పెట్టుబడి ఆధిపత్యశక్తి గా మారడమూ అనేది యంత్రాల పునాదిమీద లేచిన ఆధునిక పరిశ్రమలో సంపూర్ణ మవుతుంది.

విజ్ఞాన శాస్త్రం ముందు, భారీ స్థాయి భౌతిక శక్తుల ముందు, ఫాక్టరీ యంత్రాంగం రూపంలో ఉన్న శ్రమ రాశి ముందు, ప్రతి ఒక్క పనివాని ప్రత్యేక నైపుణ్యమూ వెలవెల బోతుంది, అత్యల్ప అంశంగా అదృశ్య మవుతుంది. లెక్కకు రాదు. ఆ శక్తులన్నీ, ఫాక్టరీ యంత్రాంగంతో కలిసి యజమాని శక్తి అవుతాయి. యజమాని మనస్సులో యంత్రాలూ, తన గుత్తాధి పత్యమూ ఏకమై ఉంటాయి. తన పనివాళ్ళతో పేచీ పడ్డప్పుడు తుస్కారంగా ఇలా వాదిస్తాడు:

వాళ్ళు చేసే పని తక్కువ రకం నిపుణ శ్రమ; అంతకన్నా సులువుగా నేర్చుకో గలిగిన పని మరొకటి లేదు; ఆ రకం శ్రమల్లో అంతకన్నా ఎక్కువ సంపాదించ గలిగిన శ్రమ లేదు; అతి తక్కువ స్థాయి ప్రవీణుడి దగ్గర కొద్దిపాటి శిక్షణతో కొద్ది కాలంలో, పుష్కలంగా నేర్చుకునే శ్రమ మరొకటి లేదు. పనివాడి శ్రమ కన్నా, మామూలు పనివాడు ఆరునెలల్లో నేర్చుకునే అతని నైపుణ్యం కన్నా, యజమాని యంత్రాలే ప్రముఖ పాత్ర నిర్వహిస్తాయి – అనే విషయాల్ని ఫాక్టరీ పనివాళ్ళు జాగ్రత్తగా గుర్తు పెట్టుకుకోవాలి – అంటాడు. తన యంత్రాన్ని కోల్పోయే ప్రమాదం వచ్చినప్పుడు మరోపాట పాడతాడు. ఆవిషయం మనకు ముందుముందు తెలుస్తుంది.

## క్రమశిక్షణ

పనివాడు యంత్రం కదలికలకి లోబడి పనిచెయ్యాల్సి నందువల్లా, శ్రామికులలో అన్ని వయసుల స్త్రీ పురుషులు ఉండడం వల్లా సైనిక బారక్ లో ఉండే క్రమశిక్షణ వంటిది తలెత్తుతుంది. మునుపటి తనిఖీ శ్రమ ఫాక్టరీలో పరిపూర్ణ వ్యవస్థగా వృద్ధి చెందుతుంది. పనివాళ్ళని పని చేసే వాళ్ళుగానూ, వాళ్ళు చేసేపనిని తనిఖీ చేసేవాళ్ళు గానూ వేరుచేస్తుంది. శ్రామిక సైన్యాన్ని ప్రైవేటు సైనికులుగానూ, సార్జంట్లుగానూ విభజిస్తుంది. వాళ్ళ పని శ్రామికులని పనిపట్ల లక్ష్యం లేకుండా చేసే అలవాట్లను వదులుకునేట్లు చెయ్యడం, స్వయం చాలక యంత్రాల క్రమబద్ధతతో వాళ్ళు మమేకమై ఉండేట్లు శిక్షణ ఇవ్వడం. ఫాక్టరీలో అవసరాలకు సరిపడే క్రమశిక్షణ నిబంధనావళి రూపొందించడం, అమలు చెయ్యడం అత్యంత కష్టమైన, దాదాపు అసాధ్యమైన పని (Herculean enterprise). అయినా ఆర్క్ రైట్ ఆపని చెయ్యగలిగాడు. క్రమశిక్షణ నెలకొల్పబడింది. బానిస మేస్త్రీ కొరడా స్థానంలోకి తనిఖీదారుని దండనల పుస్తకం వచ్చింది. శిక్షలన్నీ జరిమానాలు గానో, జీతంలో కోతలు గానో ఉంటాయి. వీటిని అమలుచేసేవాడు యజమానికి లాభదాయకంగా ఉండేట్లు చూస్తాడు. నియమాల్ని పాటించడం వల్ల కంటే, ఉల్లఘించడంవల్ల ఎక్కువ లాభం చేకూరేట్లు చూస్తాడు.

## ఫాక్టరీ వ్యవస్థలో కార్మిక వర్గ బానిసత్వం

ఇక్కడ ఎంగెల్స్ రాసిన ' ఇంగ్లండులో కార్మిక వర్గ పరిస్థితులు' నుండి ఫుట్ నోట్ ఉంది:

బూర్జువా వర్గం కార్మిక వర్గాన్ని బానిసత్వంలో ఉంచడం ఫాక్టరీ వ్యవస్థలో కొట్టొచ్చినట్లు కానొస్తుంది. అంత స్పష్టంగా ఇతరత్రా ఎక్కడా కానరాదు. అక్కడ స్వేచ్ఛ పూర్తిగా అంతరిస్తుంది– చట్టరీత్యానూ, వాస్తవంగానూ. పనివాడు పొద్దున్నే అయిదున్నర అయ్యేసరికి ఫాక్టరీలో ఉండాలి. కొన్ని నిముషాలు లేటయితే శిక్ష ఉంటుంది. 10 నిమిషాలు లేటయిందా, నాస్తా అయ్యేదాకా లోపలికి ప్రవేశం ఉండదు. రోజు కూలిలో నాలుగో వంతు పోతుంది. తిండీ, నిద్రా అన్నీ

చెప్పినప్పుడే, ఉత్తర్వుల మేరకే. ఫాక్టరీ గంట నిరంకుశమైనది. నిద్రపోతున్న వాణ్ణి లేపుతుంది, నాస్తా చేస్తున్నా, అన్నం తింటున్నా కేకేస్తుంది.

## ఇక మిల్లులో అతని పరిస్థితి ఎలా ఉంటుంది?

ఫాక్టరీలో యజమాని తన ఇష్టానుసారం నిబంధనలు పెడతాడు. ఉన్న వాటిని ఇచ్ఛవచ్చినట్లు మారుస్తాడు. ఎంతటి అర్థంలేని వాటిని చేర్చినా, కోర్టులు అనుకూలంగా ఉంటాయి. ఇలా చెబుతాయి: నీ అంతట నీవే స్వచ్ఛందంగా ఒడంబడిక చేసుకున్నావు. దాన్ని అమలు చేసి తీరవలసిందే. ఇక శ్రామికుడు 9 వ ఏట నించీ చనిపోయే దాకా, ఈ మానసిక శారీరక హింసని భరిస్తూ బతకాల్సిందే.

## రెండు కోర్టు తీర్పులు

1. 1866 చివర్లో షఫీల్డ్ లో జరిగింది. రెండేళ్ళు పనికి ఒప్పుకున్న ఒక శ్రామికుడు యజమానితో తగవు వచ్చి పని మానుకున్నాడు. అతని దగ్గర ఎట్టి పరిస్థితుల్లోనూ ఇక పనిచెయ్యనని చెప్పాడు. ఒప్పందాన్ని ఉల్లంఘించాడని రెండు నెలల జైలుశిక్ష పడింది.

ఒకవేళ యజమాని ఒప్పందాన్ని ఉల్లంఘిస్తే, అతనిమీద సివిల్ కేసు పెట్టవచ్చు. అంతవరకే. అతనికి నష్ట పరిహారం తాలూకూ డబ్బు పడుతుంది. ఏ ఇతర ఇబ్బందీ కలగదు. మన కార్మికుడు రెండు నెలలూ జైల్లో ఉండి, బయట కొచ్చాక, అతన్ని పనిలోకి రమ్మని యజమాని కోరితే రావాలి. రానంటే యజమాని మళ్ళీ కేసేస్తాడు. కార్మికుడు ఒప్పందం తప్పినందుకు శిక్ష అనుభావించాను గదా అంటాడు. అన్నా కోర్టు మళ్ళీ శిక్ష వేస్తుంది.

2. 1863 చివర్లో విల్ట్ షైర్లో జరిగింది. హారప్ అనే బట్టల ఉత్పత్తిదారుడు నేతగాళ్ళు లేటయ్యారని జీతంలో కోత పెట్టేవాడు. రెండు నిమిషాలు లేటయితే 6 పెన్నీలు, 3 నిమిషాలకు 1 షిల్లింగు, 10 నిమిషాలకు ఒక షిల్లింగు 6 పెన్నీలు. ఈ లెక్కన గంట ఆలస్యానికి 9 షిల్లింగులు. రోజుకి 4 పౌన్ల 10 షిల్లింగులు. వాళ్ళ వేతనాలు వారానికి 10-12 షిల్లింగులని ఎన్నడూ దాటలేదు.

పని మొదలు కావాల్సి నప్పుడు విజిల్ ఊదేందుకు ఒక పిల్లగాణ్ణి పెట్టాడు. తరచుగా పొద్దున్నే ఆరింటికి ముందే ఊదుతుండేవాడు. విజిల్ ఆగేలోపు అందరూ రావాలి. ఇక తలుపులు మూసేస్తారు. బయట ఉన్నవాళ్ళకు జుల్మానా విధిస్తారు. కర్మాగారం ఆవరణలో గడియారం లేదు. కనక అంతా హారప్ మాట ప్రకారం పోయే ఆ పిల్లవాడి దయ. పనివాళ్ళు సమ్మెకు దిగి గడియారం పెట్టి, జుల్మానాలు హేతుబద్ధం చేస్తేనే, పనుల్లోకి వస్తామని చెప్పారు. హారప్ 19మంది స్త్రీలనీ, బాలికల్నీ ఒప్పందాన్ని ఉల్లంఘించారని కోర్టుకి లాగాడు. కోర్టు ఒక్కొక్కరికి 6 పెన్నీల జుల్మానా వేసింది. దానికి తోడు 2 షిల్లింగుల 6 పెన్నీలు ఖర్చులకింద చెల్లించాలని తీర్పు చెప్పింది. కోపంతో జనం కోర్టు నించీ హారప్ వెంటబడి ఛీ కొట్టారు.

ఉత్పత్తిచేసిన వస్తువుల్లో లోపాలున్నాయంటూ యజమానులు వేతనాల్లో కోత పెట్టేవాళ్ళు. పనిచేసిన వాడికి వేతనం రాకపోవడం అటుంచి, అపరాధ నిబంధల వల్ల, అతనే యజమానికి బాకీ పడ్డ సందర్భాలూ కనబడతాయి. ఈ అలవాటు ఇంగ్లండ్ కుండల తయారీ జిల్లాల్లో

1866 లో సార్వత్రిక సమ్మెకు దారితీసింది. బేకర్ అనే ఫాక్టరీ ఇన్స్పెక్టర్ చెప్పిన విషయం – ఒక పత్తి మిల్లు యజమాని తాను నియమించిన పిల్లలకి డాక్టర్ సర్టిఫికేట్ కంటూ తలా 10 పెన్నీలు పట్టుకున్నాడు. అయితే అతను సర్టిఫికేట్ కోసం ఇచ్చింది 6 పెన్నీలే. పైగా చట్టం అనుమతించింది 3 పెన్నీలే. సాంప్రదాయం అయితే ఏమీ తీసుకోక పోవడం. వడకడం నేర్చుకోడానికీ, అందులో మెళకువలు తెలుసుకొడానికీ అంటూ మరొక యజమాని ఆ పేద బాలుర నించి తలా ఒక షిల్లింగు పని చేయించుకున్నట్లు తెలిసింది.

**ప్రమాదాలూ–మరణాలూ** క్రిక్కిరిసి ఉండే యంత్రాల మధ్య పనిలో అవయవాలకూ ప్రాణాలకూ ప్రమాదం పొంచి ఉంటుంది. గాయపడిన వాళ్ళ, మరణించిన వాళ్ళ జాబితాలు విడుదలవుతుంటాయి.

ఫాక్టరీ చట్టాలు యంత్రాల ప్రమాదాలనించి కల్పించిన రక్షణ మంచి ప్రభావమే చూపింది. అయితే 20 ఏళ్లుగా లేని కొత్త ప్రమాదావకాశాలు ఇప్పుడొచ్చాయి. వాటిలో ముఖ్యమైనది యంత్రాల అధిక వేగం. చక్రాలూ, రోలర్లూ, కదుర్లూ, కండెలూ అంతకంతకూ మరింత హెచ్చిన వేగంతో నడుస్తున్నాయి. కనుక తెగిన దారాన్ని తీసుకోవడానికి వేళ్ళు మరింత వేగంగానూ, నేర్పుతోనూ కదలాలి. ఏమాత్రం తటపటాయించినా, శ్రద్ధ తగ్గినా వేళ్ళు తెగిపోతాయి. పని తొందరగా చెయ్యాలనే ఆతృత వల్ల చాలా ప్రమాదాలు సంభవించాయి. యంత్రాలు ఆగకుండా నడవడం, దారాలూ, సరుకులూ ఉత్పత్తి అవడం యజమానులకు ముఖ్యం. ఒక్క నిమిషం ఆగితే, ఇంధనం వృధా అవుతుంది, అంతేకాదు ఉత్పత్తి తగ్గుతుంది. జరిగిన పని పరిమాణం మీదనే దృష్టి సారించే పర్యవేక్షకులు పనివాళ్ళని, యంత్రాలని ఆడించమని తొందర పెడతారు. యంత్రాలు ఆగకుండా ఆడుతుండడం పనివాళ్ళకు కూడా అంతే ముఖ్యం ఎందుకంటే, కొంతమందికి సరుకుల బరువుని బట్టో, ఉరువుల సంఖ్యను బట్టో వేతన చెల్లింపు జరుగుతుంది. కనుక ఇరువురికీ – యజమానికీ, పనివాళ్ళకీ – యంత్రాలు ఆగకుండా ఆడడం ముఖ్యం.

**దీని ఫలితం.** అనేక ఫాక్టరీల్లో కదులుతున్నపుడు యంత్రాలని శుభ్రం చెయ్యడం నిషేధించబడింది. అయినా, అవి కదులుతున్నప్పుడే వ్యర్థాల్ని తీసెయ్యడం, చక్రాల్నీ రోలర్లనీ తుడవడం అలవాటుగా సాగుతుంది. ఈ కారణంగా ఈ 6 నెలల్లో 906 ప్రమాదాలు జరిగాయి. ఈ పనికి చెల్లింపు ఉండదు. అందుకని పనివాళ్ళు వీలైనంత తొందరగా చెయ్య బోతుంటారు.– (1866 అక్టోబర్ 31 ఫాక్టరీ ఇన్స్పెక్టర్ల నివేదిక)

ఫాక్టరీ వ్యవస్థ ఉత్పత్తి సాధనాల పొదుపు నిర్బంధంగా పెంపొందేట్లు చేస్తుంది. శ్రామికుడు తన పనిలో తానుండగా, పెట్టుబడి చేతుల్లో పనివాడి జీవితానికి అవసరమైన దాన్నల్లా – గాలినీ, వెలుతురునీ, ప్రమాదాలు జరగకుండా రక్షణనీ – పద్ధతి ప్రకారం హరిస్తుంది. ఇక పనివాడికి సౌకర్యం కలిగించే సాధనాల హరణం గురించి వేరే చెప్పే పనే లేదు.

### ఫాక్టరీ ఇన్స్పెక్టర్ హార్నర్ ప్రశ్న: ఇద్దరిలో ఎవరిని పెట్టుకుంటావు?

యంత్ర ప్రమాదాలనుంచి పనివాళ్ళ రక్షణ కోసం ఫాక్టరీ చట్టంలో చేర్చిన క్లాజులకి వ్యతిరేకంగా ఇంగ్లిష్ మాన్యు ఫాక్చరర్లు ప్రచారోద్యమం పెట్టారు. మిల్లు ఓనర్లు పనివాళ్ళకి

జరిగే ప్రమాదాలంటే క్షమార్హం కాని విధంగా, చులకనగా మాట్లాడతారని విన్నట్లు హార్నర్ అధికార నివేదికలో రాశాడు. ఉదాహరణకి వేలు తెగిపోతే అదేదో అల్పమైనది అనడం తనకు తెలుసు అన్నాడు. పనివాని జీవనమూ, అతని భవిష్యత్తూ అతని వేళ్ళమీద ఎంతగానో ఆధారపడి ఉంటాయి. హార్నర్ ఎవరైనా యజమాని అలా అన్నప్పుడు ఒక ప్రశ్న వేసే వాడట: మీకొక పనివాడు అవసరం అనుకోండి. ఇద్దరు వచ్చారు. అన్నిట్లో సమానులే, కాని ఒకడికి బొటనవేలో, చూపుడు వేలో లేదు, పోయింది. ఇద్దరిలో ఎవరిని పెట్టుకుంటావు?

ఈ ప్రశ్నకి జవాబిచ్చేందుకు ఏమాత్రం సందేహించేవాళ్ళు కాదు. వేలు లేనివాణ్ణి వాళ్ళెందుకు పెట్టుకుంటారు?

## కర్మాగారాలు కొంచెం క్రౌర్యం తగ్గిన కారాగారాలు

అని ఫ్రెంచ్ ఊహాస్వర్గ సోషలిస్ట్ చార్లెస్ ఫోరియర్ (1772–1837) అనడంలో తప్పేమీ లేదు గదా!

## విభాగం 5
## కార్మికునికీ యంత్రానికీ మధ్య ఘర్షణ

### వర్గపోరాటం

పెట్టుబడి పుట్టిన నాడే పెట్టుబడి దారుడికీ వేతన శ్రామికుడికీ ఘర్షణ ఏర్పడింది. కార్ఖానా ఉత్పత్తి దశ మొత్తంలో – ఆరంభం నుంచీ అంతం దాకా – ఈ ఘర్షణ కొనసాగింది. ఇంగ్లిష్ చర్చి వ్యక్తి, ఆర్థిక రచయిత నతానియేల్ ఫోర్ స్టర్ (1726–1790) అన్నట్లు యజమానులూ, వాళ్ళ పనివాళ్ళూ ఎడతెగని యుద్ధంలో ఉన్నారు. యజమానుల లక్ష్యం: వాళ్ళ పని వీలైనంత చౌకగా చేయించుకోవడం; అందుకోసం వాళ్ళు ఏ ఎత్తుగడకైనా వెనకాడరు. పనివాళ్ళు తమ కోర్కెల్ని తీర్చమని యజమానుల్ని ఒత్తిడి చేస్తుంటారు. అదే ఘర్షణకి కారణం. ఇరు వర్గాల ప్రయోజనాలు పరస్పర విరుద్ధమైనవి. ఏ వర్గానికావర్గం తన ప్రయోజనాలు సాధించుకునే ప్రయత్నం చేస్తుంది. అదే వర్గపోరాటం.

### శ్రమ సాధనాల మీద పోరాటం

యంత్రాలు పెట్టినప్పటినుంచీ మాత్రమే, శ్రమ సాధనాలకు వ్యతిరేకంగా పోరాటం మొదలైంది. 17 వ శతాబ్దం మొత్తంలో, యూరప్ అంతటా రిబ్బన్ మగ్గం మీద తిరుగుబాట్లు జరిగాయి. ఇది రిబ్బన్లనీ, లేసులనీ చేసే యంత్రం. దీన్ని జర్మనీలో కనిపెట్టారు.

అది ఒకేసారి 4–6 శాల్తీలు చేస్తుంది. అయితే ఈ యంత్రం కార్మికుల పని పోగొట్టి, వాళ్ళని వీధుల్లోకి తోస్తుందని వెనిస్ నగర మేయర్ భయపడ్డాడు. దాన్ని కనిపెట్టిన వాణ్ణి గొంతు నులిమో, నీళ్ళలో ముంచో రహస్యంగా చంపించాడు. లేడెన్‌లో 1629 దాకా దీన్ని వాడలేదు; రిబ్బన్ నేతగాళ్ళు కొట్లాడినందు వల్ల, టౌన్ కౌన్సిల్ దాన్ని నిషేధించాల్సొచ్చింది. కోలోన్ లో 1676 చివర్లో నిషేధించారు. అదే సమయంలో ఇంగ్లండ్‌లో ప్రవేశిస్తుండగా, అక్కడ అల్లర్లు చెలరేగాయి. 1685 లో రాజశాసనం జర్మనీ అంతటా దాని వాడకాన్ని నిషేధించింది. హాంబర్గ్ లో సెనేట్ ఆజ్ఞ మేరకు యంత్రాన్ని బహిరంగంగా భస్మం చేశారు. 6 వ చార్లెస్ చక్రవర్తి 1719 లో 1685 శాసనం అమలు కాలాన్ని పొడిగించాడు. శాక్సనీ ఎలెక్టరేట్ లో 1765 దాకా దాన్ని వాడడానికి అనుమతి లేదు. ఈ యంత్రం యూరప్ ని పునాదులదాకా ఒక కుదుపు కుదిపింది. వాస్తవానికి ఈ యంత్రం కదురు యంత్రానికీ, మరమగ్గానికీ, ముందుది. 18 వ శతాబ్దంలో వచ్చిన పారిశ్రామిక విప్లవానికి కూడా ముందుది. ఏమీ అనుభవంలేని పిలగాడు సైతం ఆమగ్గాన్ని – దానిలో ఉండే కండెలతో సహా – ఆడించగలడు. ఒక కడ్డీని వెనక్కీ ముందుకీ అడిస్తుంటే చాలు. మెరుగుపడిన అదే యంత్రం ఒకేసారి 40–50 శాల్తీల్ని ఉత్పత్తి చేస్తుంది.

**రంపకోత యంత్రం.** 1630 ప్రాంతంలో డచ్ దేశస్తుడు లండన్ లో గాలి వల్ల కదిలే రంపకోత యంత్రాన్ని తయారుచేశాడు. అయితే అది ప్రజల ఆగ్రహానికి బలై పోయింది. 18 వ శతాబ్దం మొదట్లో సైతం జలచోదక కోత యంత్రాల్ని ప్రజలు వ్యతిరేకిస్తూనే ఉన్నారు.

పార్లమెంటు సపోర్టు ఉన్నప్పటికీ ఆ యంత్రాలు అతికష్టం మీద మాత్రమే, వ్యతిరేకతను తట్టుకొని రాగలిగాయి.

**గొర్రె బొచ్చు కత్తిరించే యంత్రం.** 1758 లో ఎవరెట్ అనే వ్యక్తి జల శక్తితో నడిచే గొర్రె బొచ్చు కత్తిరించే యంత్రాన్ని తయారుచేశాడు. అంతే, ఒక లక్షమంది పడి దాన్ని దగ్ధం చేశారు. ఎందుకంటే, దానిమూలంగా వాళ్ళకి పని పోయింది.

**ఉన్ని చిక్కుదీసే యంత్రం.** ఇంగ్లిష్ పారిశ్రామికవేత్త, ఆవిష్కర్త ఆర్క్ రైట్ (1732–1792) చిక్కు తీసే యంత్రాలని కనిపెట్టాడు. అప్పటికి ఆపని మీద బతుకుతున్న 50 వేలమంది ఆ యంత్రానికి వ్యతిరేకంగా పార్లమెంటుకి పిటిషన్ పెట్టారు.

**లడైట్ ఉద్యమం.** 19 వ శతాబ్దం తొలి 15 సంవత్సరాల్లో, మరమగ్గం వాడకాన్ని వ్యతిరేకిస్తూ లడైట్ ఉద్యమకారులు యంత్రాల్ని భారీ స్థాయిలో ధ్వంసం చేశారు. ఈ చర్య జకోబిన్ వ్యతిరేక ప్రభుత్వాలకు అత్యంత అభివృద్ధి నిరోధక చర్యలు తీసుకోడానికి, దమన కాండ చేపట్టడానికీ సాకుగా ఉపయోగపడింది. యంత్రాలకూ, వాటిని పెట్టుబడి వినియోగించడానికీ, ఉన్న తేడా ఏమిటో అప్పటికి వాళ్ళు గ్రహించ లేదు. ఆ తేడా తెలుసుకొని, కార్మికులు తమ దాడుల్ని ఉత్పత్తి సాధనాల మీద కాకుండా, వాటిని వినియోగించే విధానం మీద ఎక్కుబెట్టే సరికి కొంత సమయం పట్టింది. కొంత అనుభవం అవసరం అయింది.

## యంత్రాలకూ శ్రామికులకీ పోటీ

కార్ఖానా ఉత్పత్తి కాలంలో వేతనపోరాటాలు కార్ఖానా ఉత్పత్తికి వ్యతిరేకంగా ఎక్కుపెట్ట బడినవి కావు. కాని కొత్త కార్ఖానా పెట్టడానికి వ్యతిరేకత వచ్చేదే. అయితే అది కార్మికుల వైపునించి కాదు, వృత్తి సంఘాల వైపు నించి వచ్చేది. అందువల్ల ఆనాటి రచయితలు శ్రమ విభజనని పనివాళ్ళ కొరత తగ్గించేదిగా చూశారు. అంతేకాని పనిలో ఉన్న వాళ్ళని తొలిగించేదిగా చూడలేదు.

శ్రమ సాధనం యంత్రం రూపం పొందగానే, శ్రామికునికి పోటీదారు అవుతుంది. రికార్డో మాటల్లో: యంత్రాలూ శ్రామికులూ ఎడతెగని పోటీలో ఉన్నారు. అప్పటినుండీ, పెట్టుబడి స్వయం విస్తరణ, యంత్రాల మూలంగా బతుకుతెరువు పోయిన శ్రామికుల సంఖ్యకు అనులోమాను పాతంలో ఉంటుంది. పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థ ఈ వాస్తవం మీద ఆధారపడి ఉంటుంది: పనివాడు తన శ్రమ శక్తిని ఒక సరుకుగా అమ్ముతాడు అనేదే ఆ వాస్తవం. శ్రమ విభజన ఒక ప్రత్యేక పనిముట్టుని వాడడం నేర్పుతుంది, ఆ శ్రమ శక్తిని ప్రత్యేకపరుస్తుంది. ఎప్పుడైతే, పనిముట్టుని వాడడం యంత్రం వంతు అవుతుందో, అప్పుడే శ్రామికుని శ్రమ శక్తి ఉపయోగపు విలువతో పాటు మారకం విలువ కూడా అంతర్ధానం అవుతుంది; పనివాడు అమ్ముడుపోడు – చట్టం తీసేసిన నాణెం ఎలా చలామణీ అవదో, అలాగే.

పెట్టుబడి స్వయం విస్తరణకు వారితో అక్కర లేదు. అలా యంత్రాలవల్ల అక్కర లేకుండా పోయిన శ్రామికులు పాత చేతి వృత్తుల ఉత్పత్తికీ, యంత్రాల ఉత్పత్తికీ మధ్య అసమ పోటీలో దెబ్బతింటారు. లేదా, సులభంగా అందుబాటులో ఉండే పరిశ్రమ శాఖల్లోకి వరద కడతారు.

శ్రమ మార్కెట్ ని ముంచెత్తుతారు. మూగుతారు. ఫలితం: శ్రమ శక్తి ధర, దాని విలువకన్నా తగ్గిపోతుంది.

## పెట్టుబడి తరఫు వాదనలు

కార్మికులకి ఉరట కలిగించేందుకు పెట్టుబడిదారీ విధాన సమర్ధకులు రెండు విషయాలు చెబుతారు:

1. కార్మికుల బాధలు తాత్కాలికమే
2. ఒక ఉత్పత్తి రంగాన్ని యంత్రాలు ఆక్రమించేసరికి, చాలా సమయం పడుతుంది. అందువల్ల, దాని విధ్వంసకర ప్రభావం యొక్క విస్తృతీ, తీవ్రతా తగ్గుతూ పోతాయి.

ఈ రెండూ కార్మికులకి ఊరట అయినట్లు చెబుతారు. రెంటినీ పరిశీలిస్తే, మొదటిది రెండో దాన్ని తటస్థపరుస్తుంది - అని మనకు అర్ధమౌతుంది. యంత్రాలు ఒక పరిశ్రమని దశలవారీగా పట్టుకున్నప్పుడు, వాటితో పోటీ పడే పనివాళ్ళకి నిరంతరమైన, దీర్ఘకాలిక కష్టనష్టాల్ని కలిగిస్తాయి.

## ఇంగ్లాండ్ లో చేమగ్గం పనివాళ్ళ దుస్థితి

యంత్రాలు రావడం వేగంగా జరిగితే, దాని దుష్ప్రభావం ఉగ్రంగా ఉంటుంది. ఎక్కువమంది ప్రజలమీద ప్రభావం పడి, బాధలు పడతారు. ఇందుకు రుజువుగా ఇంగ్లండ్ లో చేమగ్గం పనివాళ్ళు నెమ్మదిగా అంతరించిన వైనాన్ని ఉదాహరిస్తాడు. ఇంతకన్నా భయంకరమైన విషాదం చరిత్రలో మరొకటి లేదు. ఇది పూర్తిగావడానికి కొన్ని దశాబ్దాలు పట్టింది. చివరకి 1838 లో ముగిసింది. చాలామంది ఆకలితో చనిపోయారు. చాలా కుటుంబాలు రోజుకి 2 ½ పెన్నీలతో దీర్ఘకాలం బతుకులీడ్చారు. ఇంగ్లండ్ పత్తి యంత్రాలు ఇండియా మీద తీవ్ర ప్రభావం చూపాయి. గవర్నర్ జనరల్ నివేదిక 1834-35 లో ఇలావుంది: వాణిజ్య చరిత్రలో దీనంతటి దీనస్థితి ఇంకొకటి లేదు. ఇక మిగిలిన వాళ్ళ సంగతి. యంత్రాలు కొత్త ఉత్పత్తి రంగాలను పట్టుకుంటాయి. కనుక తాత్కాలికమన్న అసౌకర్యం వాళ్లకి శాశ్వతం అవుతుంది. కాబట్టి, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం కార్మికునికి వ్యతిరేకంగా శ్రమ సాధనాలకీ, ఉత్పాదితానికీ ఇచ్చే స్వతంత్రంగానూ, విడిగానూ ఉండే స్వభావం యంత్రాల వల్ల పూర్తి శతృత్వంగా వృద్ధిచెందింది.

ఒక దేశ ఆదాయం అంటే రికార్డో దృష్టిలో భూస్వాముల, పెట్టుబడిదారుల ఆదాయం, అదే దేశ సంపద. ఆ ఆదాయం పెరగడానికి ఏదైతే కారణమో, అదే అంశం జనాభాన్ని అవసరానికి మించినదిగా (redundant) చేస్తుంది. శ్రామికుల పరిస్థితిని దిగజారుస్తుంది.

ఇక్కడే యంత్రాల్ని నిరంతరం మెరుగుపరచడంలో లక్ష్యం ఏమిటో స్కాటిష్ ప్రొఫెసర్, వర్తక సిద్ధాంత కర్త ఆంద్రూ ఉరే (1778-1857) మాటలు ఉటంకిస్తాడు: పూర్తిగా మనిషి శ్రమని రద్దు చెయ్యడం, లేదా మగ పెద్దవాళ్ళ స్థానంలో స్త్రీలనీ, పిల్లల్నీ నియమించో, నిపుణ శ్రామికుల స్థానంలో అనిపుణుల్ని నియమించో, శ్రమ ధరని తగ్గించడం.

## యంత్రాల అభివృద్ధీ – కార్మికుల తొలగింపూ

1860 తర్వాత 3 ఏళ్లలో యంత్రాలు ఉరుకులమీద అభివృద్ధి అయ్యాయి. దానికి అనుగుణంగా కార్మికులు తొలగింపబడ్డారు. ఉదాహరణలు:

1. ఒక మాంచెస్టర్ మాన్యుఫాక్చరర్ అ – మునుపు చిక్కుదీసే యంత్రాలు 75 ఉండేవి. ఇప్పుడు 12 ఉన్నాయి. వాటితో అంత పనీ చేస్తున్నాం. పనివాళ్ళు 14 మంది తక్కువ.వారానికి 10 పౌన్లు వేతనాలు మిగులుతున్నాయి. దూది వృథా కావడం 10 శాతం తగ్గింది.
2. ఒక స్పిన్నింగ్ మిల్ లో స్పీడు పెంచడం ద్వారానూ, కొన్ని స్వయం చాలక ప్రక్రియల్ని ప్రవేశపెట్టడం ద్వారానూ ఒక విభాగంలో నాలుగో వంతు మందిని తొలిగించారు. ఇంకో విభాగంలో సగం మందిని బయటకు పంపించారు.
3. రెండోసారి నూలు చిక్కుదీసే యంత్రాన్నొకదాన్ని తెచ్చి, పనివాళ్ళని చాలామందిని తగ్గించారు.
4. మరొక మిల్లులో యంత్రాల వల్ల మూడోవంతు పనివాళ్ళకు పని పోయింది. యజమానులకి మూడోవంతు ఖర్చు తగ్గింది.

## యంత్రాలలో మెరుగుదలల ఫలితం

ఇక్కడ యంత్రాలలో మెరుగుదలలు మొత్తం ఫలితాన్ని తెలిపే పట్టిక ఉంది. ఆఫలితం ఇది.

1861 – 1868 కాలంలో 338 దూది ఫాక్టరీలు పోయాయి. వేరే మాటల్లో చెబితే, ఆ యంత్రాలను మించి ఉత్పత్తిచేసే యంత్రాలు కొద్ది మంది పెట్టుబడిదారుల చేతుల్లో చేరాయి. మరమగ్గాలు 20,663 తగ్గిపోయాయి. అదే కాలంలో ఉత్పత్తి పెరిగింది. కనుక పాత యంత్రాలకంటే కొత్త యంత్రాలు ఎక్కువ ఫలితాన్నిచ్చాయి. కండెలు 16,12,541 పెరిగాయి. అయితే పనివాళ్ళు 50,505 మంది తగ్గారు. దూది సంక్షోభం వల్ల కార్మికులకు కలిగిన తాత్కాలిక కష్ట నష్టాలు అధికమయ్యాయి. యంత్రాల మెరుగుదల వల్ల, శాశ్వతం అయ్యాయి.

## యంత్రం శ్రామికునికి పోటీ దారు

శ్రామికుని మీద యంత్రం పైచేయి సాధించి, నిరంతరం అతడి అవసరం లేకుండా చేస్తూ ఉంటుంది. శ్రామికుడికి హాని చేసే శక్తి అవుతుంది. ఆవిధంగా యంత్రం అతనికి పోటీ దారు అవుతుంది. అలాగని పెట్టుబడి బహిరంగంగా ప్రకటిస్తుంది. దాన్ని ఉపయోగించుకుంటుంది కూడా. పెట్టుబడి నిరంకుశత్వాన్ని ఎదిరిస్తూ కార్మిక వర్గం చేసే తిరుగుబాట్లను అణచి వేసేందుకు యంత్రం శక్తివంతమైన ఆయుధం.

గాస్కెల్ ప్రకారం ఆవిరి ఇంజన్ మొదట్నించీ మానవ శక్తికి శత్రువే. కొత్తగా ఏర్పడ్డ ఫాక్టరీ వ్యవస్థలో పెరుగుతున్న కార్మికుల కోర్కెల్ని, అణగ తొక్కడానికి పెట్టుబడిదారుడికి వీలు

కలిగించిన శత్రువు. కార్మికుల తిరుగుబాట్లకు వ్యతిరేకంగా పెట్టుబడికి 1830 నుండీ కొత్తకొత్త యంత్రాలను కనిపెట్టారు. ఆ ఆవిష్కరణల గురించి చరిత్ర రాయవచ్చు. అలాంటి వాటిలో స్వయంచాలక కదురు (self-acting mule) ప్రధాన మయింది. ఎందుకంటే, ఆటోమాటిక్ వ్యవస్థలో కొత్త శకాన్ని తెరిచింది అదే. ఇందుకు రుజువుగా ఇక్కడ ఫుట్నోట్ పెట్టాడు మార్క్స్.

తన వర్క్ షాప్ లో సమ్మెల కారణంగా, యంత్రాలని నిర్మించేందుకు యంత్రాలు ఉపయోగించడంలో ఎంతో ముఖ్యమైన అనేక కొత్త పద్ధతుల్ని కనుగొన్నట్లు ఫెయిర్ బైర్న్ చెప్పాడు అనేదే ఆ ఫుట్ నోట్.

ఆవిరి సమ్మెటని కనిపెట్టిన నాస్మిత్ ఇంజనీర్ల దీర్ఘ సమ్మె మూలంగా 1851లో తాను యంత్రాలకు చేసిన మెరుగుదలల గురించి ఇలా చెప్పాడు : ఆధునిక మెరుగుదలల లక్షణం స్వయంచాలక పరికర యంత్రాలని ప్రవేశ పెట్టడమే. ఇక పనివాడు చెయ్యవలసిన దాన్ని పిల్లవాడు కూడా చెయ్యగలడు. అదేమంటే, యంత్రం చేసే సొగసైన పనిని పర్యవేక్షించడమే. తమ నిపుణత మీద ఆధారపడ్డ పనివాళ్ళని తొలిగించాను. మునుపు ఒక మెకానిక్‌కి నలుగురు పిల్లల్ని పెట్టాను. ఇప్పుడు పెద్ద వాళ్ళను 1500 నుంచి 750 కి తగ్గించాను. నాకు లాభాలు బాగా పెరిగాయి.

## కార్మికుల ప్రతిఘటనకు దెబ్బ

కాలికో ప్రింటింగ్ లో వాడిన యంత్రం గురించి ఉరే ఇలా అన్నాడు: పనివాళ్ళతో ఉన్న భారమైన ఒప్పందాల షరతుల నుంచి పెట్టుబడిదారులు విముక్తి కోసం సైన్స్ ని ఆశ్రయించారు. కొత్త కొత్త యంత్రాల రాకతో, మెరుగుదలలతో కార్మికుల కలిసికట్టు ప్రతిఘటన దెబ్బతిన్నది. వాళ్ళు లొంగి పోవలసి వచ్చింది. స్వయం చాలక కదురు గురించి చెబుతూ, పెట్టుబడి సైన్స్ ని తన సేవకు వినియోగించు కున్నప్పుడు, అది పెడసరి పనివాణ్ణి వాలుకి తెస్తుంది, అణకువ నేర్పుతుంది. ఈ మహత్తర సిద్ధాంతం అప్పటికే ఉన్నప్పటికీ, స్వయం చాలక కదురు యంత్రం ఆ సిద్ధాంతాన్ని ధృవపరిచింది. ఉరే పుస్తకం (The Philosophy of Manufactures) రాసి 30 ఏళ్లయింది. అప్పటికి ఫాక్టరీ వ్యవస్థ కొద్దిగానే అభివృద్ధి చెంది ఉంది. అయినప్పటికీ ఆ రచన ఫాక్టరీ తత్వాన్ని సరిగ్గా బయట పెడుతుంది. పై సిద్ధాంతాన్ని ప్రతిపాదించాక, ఉరే కోపం కట్టలు తెంచుకుంది. ఎందుకంటే, భౌతిక–యాంత్రిక శాస్త్రం పేదల్ని పెట్టుబడిదారుడు వేధించే సాధనంగా ఉన్నదని నిందిస్తున్నారు, అందుకని.

## కార్మికులకు ఆంద్రూ ఉరే హెచ్చరిక

యంత్రాలు త్వర త్వరగా అభివృద్ధి అవడం, కార్మికవర్గాలకి ప్రయోజనకరమో సుదీర్ఘంగా ఉపదేశించాక, వాళ్లకి ఒక హెచ్చరిక చేస్తాడు. ఏమంటే, కార్మికుల పట్టుదలవల్లా, సమ్మెలవల్లా

కనుక ముందు చూపులేకుండా ప్రవర్తిస్తే తమని తామే నష్టపరుచుకున్న వాళ్ళవుతారు – అంటూ హెచ్చరించాడు.

## విభాగం 6

## యంత్రాలు తొలిగించిన పనివాళ్ళ నష్ట పరిహారం గురించిన సిద్ధాంతం

యంత్రాలు పనివాళ్ళని తొలిగిస్తాయి - అనే వాస్తవాన్ని ఎవ్వరూ కాదనలేరు. అయితే దీన్ని ఒప్పుకుంటూనే బూర్జువా ఆర్థిక వేత్తలు - జేమ్స్ మిల్, మాక్ కులోచ్, టోరెన్స్, సీనియర్, జాన్ స్టువర్ట్ మిల్ వంటి వారు - ఇలాచెబుతారు:

పనివాళ్ళని తొలిగించే యంత్రాలు తప్పనిసరిగా కొంత పెట్టుబడిని విడుదల చేస్తాయి. అలా విడుదలైన పెట్టుబడి, తొలిగించ బడినంతమంది అదే తరహా పనివాళ్ళని నియమించడానికి సరిపోతుంది. అంటే, ఒక యంత్రం 100 మందిని తొలిగించింది అనుకుందాం. అప్పుడు వాళ్ళ వేతనాలు ఎంతో, అంత పెట్టుబడిని కూడా విడుదల చేస్తుంది. అది తిరిగి అలాంటి పనివాళ్ళని 100 మందిని పెట్టుకోడానికి సరిపోతుంది. రికార్డో కూడా మొదట ఈ అభిప్రాయంతోనే ఉన్నాడు. అయితే తర్వాత శాస్త్రీయ నిష్పక్షపాతంతో, సత్యసంధతతో ఆ అభిప్రాయాన్ని వదులుకున్నాడు. మార్క్స్ కూడా ఆ బూర్జువా ఆర్థిక వేత్తల అభిప్రాయాన్ని ఖండించాడు. తప్పని తేలుస్తాడు. ఎలాగో చూద్దాం.

ఒక తివాచీల ఫాక్టరీలో ఒక్కొక పనివాడికి 300 రూపాయలచొప్పున 100 మందిని నియమించడానికి పెట్టుబడిదారుడు 30,000 రూపాయల అస్థిరపెట్టుబడి పెట్టాలి. వాళ్ళలో 50 మందిని తొలిగించి, మిగిలిన 50 మంది చేతా 15,000 రూపాయలు ఖర్చయ్యే యంత్రాలతో పని చేయిస్తాడు అనుకుందాం. సులభంగా ఉండడం కోసం భవనాలూ, బొగ్గూ వగయిరాల్ని పక్కన బెడదాం. ఏడాదిలో ఖర్చయ్యే ముడి పదార్థం రెండు సందర్భాలలోనూ 30,000 రూపాయలు అనుకుందాం.

### ఈ మార్పువల్ల పెట్టుబడి ఏమైనా విడుదల అవుతుందా?

మార్పుకి ముందు మొత్తం పెట్టుబడి 60,000. అందులో స్థిర పెట్టుబడి 30,000, అస్థిర పెట్టుబడి 30,000. మార్పు తర్వాత స్థిర పెట్టుబడి 45,000 (30000 ముడి పదార్థం + 15000 యంత్రాలు), అస్థిర పెట్టుబడి 15,000. వెరసి 6,0000 రూపాయలు. మునుపు అస్థిర పెట్టుబడి మొత్తం పెట్టుబడిలో సగం. ఇప్పుడు నాలుగో వంతు. అంటే అప్పుడు అస్థిర భాగంగా ఉన్న మొత్తంలో కొంత భాగం (15,000 రూపాయలు) స్థిర భాగానికి చేరింది. అది ఇక శ్రమ శక్తి కొనుగోలుకి ఉపయోగపడదు. స్థిర పెట్టుబడిలో బందీ అయి ఉంటుంది.

### అస్థిర పెట్టుబడి స్థిర పెట్టుబడిలోకి మార్చబడింది

అన్ని ఇతర పరిస్థితులూ మారకుండా అలాగే ఉంటే, 60,000 రూపాయల పెట్టుబడి ఇకముందు కూడా 50మందిని మించి నియమించజాలదు. యంత్రాల్లో మెరుగుదల వచ్చినప్పుడల్లా ఇంకా తక్కువమందిని నియమిస్తుంది. ఒక వేళ కొత్త యంత్రం ఖరీదు, అది తొలిగించే శ్రమశక్తి ఖరీదు, పరికరాల ఖరీదు కంటే తక్కువ వుంటే, అంటే 15,000 రూపాయలు కాకుండా 10,000 రూపాయలు ఉంటే, 10,000 రూపాయల అస్థిర పెట్టుబడి, స్థిరపెట్టుబడిగా

మార్చబడి, బందీగా ఉండేది; 5,000 రూపాయలు విడుదలయి ఉండేది. వేతనాలు మారకుండా అలానే ఉంటే, ఆ 5,000 రూపాయలు, తొలిగించబడ్డ 50 మందిలో 16 మందిని నియమించడానికి సరిపోతుంది. అయితే 16 మందిని కూడా నియమించలేదు. కారణం: పెట్టుబడిగా వినియోగించడానికి ఈ 500 పౌన్లలో కొంత భాగం స్థిర పెట్టుబడిలోకి (ముడిసరుకులు, పరికరాలకోసం) మారాలి. మారగా, మిగిలినదానినే శ్రమ శక్తి కొనడానికి వినియోగించాలి.

కొత్త యంత్రాల తయారీకి ఎక్కువమంది మెకానిక్కులకి పనొస్తుంది. అయితే అది పనిపోయి వీధుల పాలైన తివాచీ పనివాళ్ళకి నష్టపరిహారం అని అనవచ్చునా? వాటి నిర్మాణంలో అవి తొలిగించిన వాళ్ళ కంటే తక్కువమందే నియమితులవుతారు. తొలిగించబడ్డ శ్రామికుల వేతనం 15,000 రూపాయలు. ఆ మొత్తం ఇప్పుడు యంత్రం రూపంలో ఈక్రింది అంశాలకి ప్రాతినిధ్యం వహిస్తుంది:

1. ఆ యంత్ర నిర్మాణంలో వినియోగించిన ఉత్పత్తి సాధనాల విలువ
2. నిర్మించిన మెకానిక్కుల వేతనం
3. యజమాని వాటాగా పోయే అదనపు విలువ.

పైగా ఆ యంత్రాలు అరిగిపోయే దాకా కొత్తవి పెట్టాల్సిన పనుండదు. కాబట్టి పెరిగిన మెకానిక్కుల్ని పనిలో ఉంచడం కోసం ఒక కార్పెట్ మాన్యుఫాక్చరర్ తర్వాత మరొకరు పనివాళ్ళ స్థానంలో యంత్రాలను పెట్టవలసి ఉంటుంది.

పెట్టుబడిదారీ విధాన సమర్ధకులు (apologists) చెప్పేది ఇదికాదు. వాళ్ళ దృష్టిలో ఉన్నది విడుదలైన శ్రామికుల జీవితావసరాలు.

పై సందర్భంలో యంత్రాలు 50 మందిని విడుదల చేసి, వాళ్ళని నియమించుకునేందుకు ఇతరులకు అవకాశం ఇస్తాయి. అదే సమయంలో పనివాళ్ళ వినిమయం (consumption) నుంచి 1500 పౌన్ల జీవితావసర సాధనాలని ఉపసంహరించి, విడుదల చేస్తాయి. ఇది తెలిసిందే, కొత్తదేమీ కాదు. ఆర్థిక పరిభాషలో దానర్థం: యంత్రాలు కార్మికుల జీవితావసరాలను విముక్తం చేస్తాయి అని. లేక జీవితావసరాలను కార్మికుణ్ణి నియమించే పెట్టుబడిలోకి మారుస్తాయి అని.

**ఈ సిద్ధాంతం అర్థం ఏమంటే:** 1500 పౌన్ల విలువచేసే జీవనాధార సాధనాలు తొలిగించబడ్డ 50 మంది శ్రమ చేత పెరుగుతూ వస్తున్న పెట్టుబడి. కనుక వాళ్లకి బలవంతపు సెలవు మొదలవగానే, ఈ పెట్టుబడి వినియోగంలో ఉండదు. అదే 50 మంది శ్రమా ఉత్పాదకంగా ఎక్కడ వినియోగామవుతుందో, అక్కడ మళ్ళీ కొత్తగా మదుపు పెట్టబడే దాకా విశ్రమించదు. అందువల్ల ఇప్పుడో, ఎప్పుడో ఆ పెట్టుబడీ కార్మికులూ మరల కలిసి తీరాలి. అప్పటికి నష్ట పరిహారం చెల్లింపు పూర్తి అవుతుంది. అందువల్ల యంత్రాలవల్ల తొలిగించ బడ్డ కార్మికుల బాధలు స్థిరంగా ఉండేవి కావు, తాత్కాలిక మైనవి. ఇదీ వాళ్ళ వాదన. ఆ 1500 పౌన్లూ పని వాళ్లకి సరుకులు, పెట్టుబడి కాదు.

**తొలిగించబడ్డ పనివాళ్ళకి సంబంధించి** – 1500 పౌన్ల విలువ చేసే జీవితావసర సాధనాలు ఎన్నడూ పెట్టుబడిగా లేవు. వాళ్ళు పెట్టుబడిగా ఎదుర్కున్నది దేన్నంటే, ఆ తర్వాత యంత్రాలమీద పెట్టిన 1500 పౌన్లని. మరీ జాగ్రత్తగా చూస్తే, ఈ మొత్తం (1500 పౌన్లు) తొలిగించ బడ్డ 50 మంది ఏడాదిలో ఉత్పత్తి చేసిన తివాచీల్లో ఒక భాగానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. అంటే, యజమాని నుంచి వాళ్ళ వేతనాల కింద వస్తురూపంలో కాక, డబ్బు రూపంలో అందిన భాగానికి ప్రతినిధి అన్నమాట. డబ్బు రూపంలో ఉన్న తివాచీలతో వాళ్ళు 1500 పౌన్ల విలువైన జీవితావసర వస్తువులు కొన్నారు. అందువల్ల ఆ 1500 పౌన్లూ వాళ్లకి సరుకులు, పెట్టుబడి కాదు. సరుకులకు సంబంధించి ఆ పనివాళ్ళు కొనుగోలు దారులు, వేతన శ్రామికులు కారు. యంత్రాలు వాళ్ళని కొనుగోలు సాధనం నుంచి విడుదల చేశాయి; ఈ పరిస్థితి వల్ల కొనుగోలుదారులుగా ఉన్నవాళ్ళు, కొనుగోలుదారులు కాకుండా పోయారు. ఆ కారణంగా సరుకులకు గిరాకీ తగ్గింది. ఈ తగ్గుదలని, మరొక చోట పెరుగుదల పూరించి తీరాలి. లేకుంటే, సరుకుల మార్కెట్ ధర పడిపోతుంది. ఇలాంటి స్థితి కొంతకాలం పాటు ఉంటే, ఇంకా కొనసాగితే, ఆసరుకుల ఉత్పత్తిలో ఉన్న శ్రామికులకు ఉద్వాసన మొదలవుతుంది. అంతకుముందు జీవితావసర వస్తువుల ఉత్పత్తిలో ఉన్న పెట్టుబడిలో కొంత భాగం మరొక రూపంలో పునరుత్పత్తి చెందవలసి వస్తుంది. ధరలు పడిపోతూ, పెట్టుబడి ఉన్న చోటు వదిలి వేరొకచోటికి పోతూ ఉన్నప్పుడు, జీవితావసర వస్తువుల ఉత్పత్తిలో ఉన్న శ్రామికుల వంతు వస్తుంది; వాళ్ళ వేతనాల్లో కొంత భాగం నుంచి విడుదల అవుతారు. అందువల్ల, జీవితావసర సాధనాల నుంచి యంత్రాలు పనివాణ్ణి విడుదల చేసినప్పుడు, ఆ సాధనాలు అదేసమయంలో ముందుముందు అతన్ని నియమించే పెట్టుబడిలోకి మారతాయి అని నిరూపించే బదులు, పెట్టుబడి దారీ విధాన వకాల్తాదారులు, తాము స్థిరపరుచుకున్న సరఫరా గిరాకీ సూత్రంతో (cut-and-dried law of supply and demand) ఏమి రుజువు చేస్తున్నారంటే: యంత్రాలు అవి ప్రవేశించిన శాఖల్లోని పనివాళ్ళనే కాక, యంత్రాలు లేని శాఖల్లో పనిచేసేవాళ్ళని కూడా బజార్లో పడేస్తాయి అని.

ఈ ఆర్థికవేత్తల వాదం వాస్తవాల్ని తారుమారు చేసింది. అసలు వాస్తవాలు ఇవే:

- యంత్రాల చేత తొలిగించబడ్డ పనివాళ్ళు శ్రమ మార్కెట్లో పడతారు. పెట్టుబడిదారులకు అందుబాటులో ఉన్న శ్రామికులతో కలుస్తారు. వాళ్ళ సంఖ్య పెంచుతారు.
- యంత్రాల వల్ల వచ్చే ఫలితాన్ని శ్రామికులకు వచ్చే నష్టపరిహారంగా సూచించారు. అయితే అందుకు విరుద్ధంగా, అది అత్యంత భయంకరమైన శిక్ష. అలాగని కాపిటల్ 7 వ భాగం (The Accumulation of Capital) లో తెలుస్తుంది.
- తొలిగించ బడ్డవాళ్ళు వేరే శాఖల్లో ప్రయత్నించవచ్చు, సందేహం లేదు. పని దొరికి, వాళ్ళకీ, జీవితావసరవస్తువులకీ మళ్ళీ బంధం పడవచ్చు. అలా పడేది ఎప్పుడంటే: మదుపు పెట్టడానికి చూస్తున్న కొత్త పెట్టుబడి మధ్య వర్తిత్వం వల్లనే, కాని మునుపు వాళ్ళని పెట్టుకున్న, ఆతర్వాత యంత్రాల్లోకి మార్చబడ్డ పెట్టుబడి మధ్యవర్తిత్వం వల్ల కాదు.

- ఒకవేళ వాళ్లకి పని దొరికినా వాళ్ళ పరిస్థితి ఎంతో దీనంగా, దయనీయంగా ఉంటుంది. శ్రమ విభజన వల్ల వికలులయి ఉన్నారు. పాత వృత్తికి బయట, వాళ్లకి విలువ ఉండదు. ఎంతగా నంటే, వాళ్లకి పరిశ్రమల్లోకి ప్రవేశమే దొరకదు – ఏవో కొన్ని తక్కువ తరహా పరిశ్రమలలో తప్ప. ఈ తక్కువ రకం పరిశ్రమలలో తక్కువ కూలి ఉంటుంది. దానికి తోడు, చేరే ప్రయత్నం చేసే వాళ్ళ సంఖ్య ఎక్కువగా ఉంటుంది.
- అదీ కాక ప్రతి పరిశ్రమ శాఖా, ప్రతి ఏడాదీ కొత్త వాళ్ళని ఆకర్షిస్తుంది. ఆ కొత్త వాళ్ళ దళం నుంచి ఖాళీలు నింపుతుంటారు. విస్తరణకి కావలసిన వాళ్ళని తీసుకుంటుంటారు. ఒక పరిశ్రమ శాఖలో పనివాళ్ళలో కొందరిని యంత్రాలు విడుదల చేసీ చెయ్యగానే, రిజర్వ్‌లో ఉన్న వాళ్ళు కూడా పనులున్న కొత్త దారులు పడతారు. ఇతర శాఖల్లో కుదురుతారు; ఈలోగా, పాత బాధితులు అంటే ముందే తొలిగించబడ్డ వాళ్ళు, ఈపరివర్తన దశలో పస్తులుంటారు, కొందరు చనిపోతారు.

పనివాణ్ణి జీవితావసర వస్తువులనుండి విడుదల చేయడంలో యంత్రాల బాధ్యత లేదు. ఇది నిస్సందేహమైనది. అవి ఏ శాఖలో ప్రవేశిస్తే ఆ శాఖలో ఉత్పత్తి పెరుగుతుంది, చౌకబడుతుంది. మొదట మొదట వేరే శాఖల్లో ఉత్పత్తయ్యే జీవితావసర వస్తువుల మొత్తంలో, తేడా ఉండదు. అయితే యంత్రాలు ప్రవేశించాక తొలిగించబడ్డ వాళ్ల జీవితావసరాలు అంతకు ముందు కంటే ఎక్కువ కాకున్నా, అంతే అయినా సమాజంలో ఉంటాయి; వార్షికోత్పత్తిలో, కార్మికులు కానివాళ్ళు వృధా చేసే భాగం కాకనే ఉంటాయి.

## పెట్టుబడిదారీ సమర్ధకులు ఆధారపడ్డది ఈ పాయింట్ మీదే

పెట్టుబడిదారీ యంత్రాల వినియోగం నుండి విడదీయరాని వైరుధ్యాలూ, వైషమ్యాలూ ఉండవని వాళ్ళంటారు. ఎందుకంటే అవి స్వయంగా యంత్రాలవల్ల తలెత్తవు, పెట్టుబడిదారీ వినియోగం వల్ల మాత్రమే తలెత్తుతాయి. అందువల్ల యంత్రాలని యంత్రాలుగా ఒంటరిగా పరిగణిస్తే శ్రమ గంటల్ని తగ్గిస్తాయి. అయితే పెట్టుబడి సేవలో ఉంటే, పని గంటల్ని పెంచుతాయి; అవి యంత్రాలుగా శ్రమని సులువు పరుస్తాయి, కానీ పెట్టుబడి సేవలో అవే యంత్రాలు శ్రమని తీవ్రతరం చేస్తాయి; అవి యంత్రాలుగా ప్రకృతిశక్తుల మీద మానవ విజయం, పెట్టుబడి చేతిలో అవే యంత్రాలు ప్రకృతి శక్తులకి మానవుణ్ణి బానిస చేస్తాయి; అవి యంత్రాలుగా ఉత్పత్తిదారుల సంపదని పెంచుతాయి, కానీ పెట్టుబడి సేవలో అవే యంత్రాలు ఉత్పత్తిదారుల్ని దరిద్రులుగా చేస్తాయి. అందువల్లా, ఇతర కారణాల వల్లా, ఈ వైరుధ్యాలన్నీ వాస్తవం యొక్క బాహ్యరూపాలే కాని వాటికి వాస్తవంగా కానీ, సిద్ధాంత పరంగా కానీ మనుగడ లేదు అని, బూర్జువా ఆర్థిక వేత్త తొణుకూ బెణుకూ లేకుండా వక్కాణిస్తాడు. అంతే కాకుండా, తన ప్రత్యర్థి మూఢుడని చెబుతాడు. ఎంతటి మూఢుడంటే, యంత్రాల పెట్టుబడిదారీ వినియోగానికి వ్యతిరేకంగా కాకుండా, అసలు యంత్రాల వినియోగానికే వ్యతిరేకంగా వాదించేటంతటి మూఢుడని చెప్పకనే చెబుతాడు.

1. పెట్టుబడిదారీ విధానంలో యంత్రాల వినియోగం వల్ల తాత్కాలిక అసౌకర్యం కలుగుతుంది – అనే విషయాన్ని అతను తిరస్కరించడు. అయితే అతని ప్రకారం యంత్ర వినియోగం

పెట్టుబడి ద్వారా మాత్రమే సాధ్యం. అన్యథా అసాధ్యం. అతని దృష్టిలో యంత్రాలు కార్మికుణ్ణి వినియోగించుకోవడమూ, కార్మికుడు యంత్రాలని వినియోగించడమూ రెండూ ఒకటే. కాబట్టి యంత్రాల పెట్టుబడిదారీ వినియోగంలోని వాస్తవ స్థితిని ఎవరైనా బయట పెట్టారంటే, వాళ్ళు యంత్రాల వినియోగానికే వ్యతిరేకులంటూ ముద్ర వేస్తారు. సమాజాభివృద్ధికి శత్రువులంటూ నిందిస్తారు.

2. యంత్రాలు ప్రవేశించిన పరిశ్రమల్లో పనివాళ్ళు తొలిగించబడినప్పటికీ, అది ఇతర పరిశ్రమల్లో పనివాళ్ళ నియామకాన్ని పెంచవచ్చు. ఏమైనా ఈ ఫలితానికీ, నష్టపరిహార సిద్ధాంతం అనబడే దానికీ సంబంధం ఏమీ లేదు. ఒకేరకం వస్తువుని, చేత్తో చెయ్యవచ్చు, యంత్రంతో చెయ్యవచ్చు. రెంటిలో యంత్రంతో చేసిన వస్తువు చౌక. దీన్నుంచి ఒక **తిరుగులేని సూత్రాన్ని లాగగలం:**

మునుపు చేతివృత్తిలోనో, కార్ఖానాలోనో తయారైన ఉత్పాదితాల మొత్తమూ, ఇప్పుడు యంత్రాలతో తయారైన ఉత్పాదితాల మొత్తమూ సమాన మైతే, ఇప్పుడు ఖర్చయిన మొత్తం శ్రమ తగ్గినట్లు. శ్రమ సాధనాల మీద, యంత్రాల మీద, బొగ్గు వగయిరాలమీద వెచ్చించిన కొత్త శ్రమ, ఆ యంత్రాలవాడకం వల్ల తొలిగించబడ్డ శ్రమ కంటే తప్పకుండా తక్కువగా ఉండాలి; అలా కాకపోతే ఆయంత్ర ఉత్పాదితానికి చేత్తో చేసిన దానంత విలువయినా కనీసంగా ఉండి తీరుతుంది. ఎక్కువ విలువైనా ఉండవచ్చు. వాస్తవానికి తక్కువమందితో యంత్రం తయారుచేసిన మొత్తం వస్తువుల పరిమాణం, తొలిగించబడిన పనివాళ్ళు చేత్తో చేసిన మొత్తం వస్తువుల పరిమాణం ఎంతో అంతే ఉండదు, అంతకన్నా ఎంతో ఎక్కువ ఉంటుంది. 1 లక్ష గజాలు చేమగ్గాల మీద నేసిన నేతగాళ్ళకన్నా తక్కువమంది నేతగాళ్ళచేత మరమగ్గాలమీద 4 లక్షల గజాల బట్ట ఉత్పత్తయింది అనుకుందాం. నాలుగింతలయిన ఉత్పత్తిలో నాలుగింతల ముడి పదార్థం ఉంటుంది. అందువల్ల ముడి పదార్థం ఉత్పత్తి నాలుగు రెట్లు అవాలి. అయితే భవనాలు, యంత్రాలు, బొగ్గు వంటి శ్రమ సాధనాలకు సంబంధించి అలా ఉండదు. ఒక పరిశ్రమలో యంత్రాల వాడకం పెరిగేకొద్దీ, ఉత్పత్తి సాధనాలు సమకూర్చే పరిశ్రమల్లో ఉత్పత్తి పెరగాల్సి వస్తుంది. తద్వారా ఎంత మంది పనివాళ్ళు పెరుగుతారు అనేది పనిదినమూ, శ్రమ తీవ్రతా అలానే ఉంటే, పెట్టిన పెట్టుబడి అంగ నిర్మాణాన్నిబట్టి ఉంటుంది – అంటే, అస్థిర పెట్టుబడితో స్థిర పెట్టుబడికి ఉన్న నిష్పత్తిని బట్టి ఉంటుంది. ఈ నిష్పత్తి తిరిగి యంత్రాలు ఆయా శాఖల్ని ఏమేరకు పట్టుకున్నాయి, లేదా పట్టుకుంటున్నాయి అనే దాన్ని బట్టి ఉంటుంది. ఇంగ్లీష్ ఫ్యాక్టరీ వ్యవస్థ అభివృద్ధితో, బొగ్గు, లోహ గనుల్లో పనిచెయ్యాల్సిన గతిపట్టిన మనుషుల సంఖ్య ఎంతగానో పెరిగింది; అయితే ఇటీవల కొన్నేళ్లుగా ఆ పెరిగే వేగం కొంత తగ్గింది. ఎందువల్లంటే, గనిపనుల్లో కొత్త యంత్రాలు రావడం వల్ల.

## యంత్రాన్ని నిర్మించే కొత్త పనివాడు

యంత్రంతో పాటు దాన్ని నిర్మించే పనివాడు కొత్తగా రంగం మీదికొస్తాడు. యంత్రాల ఉత్పత్తిని కూడా యంత్రం తన పట్టులోకి తెచ్చుకుంది. రోజురోజుకీ పెరిగి పోతున్నది. ఇంగ్లాండ్ వేల్స్‌లో 1861 లో యంత్ర నిర్మాణ రంగలో 60,807 మంది పనిచేసేవాళ్ళు. ముడి పదార్థానికి

సంబంధించి వేగంగా పురోగమిస్తున్న నూలు పరిశ్రమ అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో పత్తి పంటకు ఊపు తెచ్చింది. దాంతో ఆఫ్రికా బానిస వ్యాపారం ఊపందుకుంది. సరిహద్దుల్లో ఉన్న బానిస దేశాలకు బానిసల పెంపకం ప్రధాన వ్యాపారమయింది. అమెరికాలో బానిసల లెక్క మొదటిసారి 1790 లో తీశారు. అప్పుడు 6,97,000 మంది ఉన్నారు. 1861 దాదాపు 40 లక్షల మందయ్యారు. మరోవైపు, ఇంగ్లండ్‌లో ఉన్ని ఫాక్టరీలు పెరిగినందువల్ల, పంట పొలాలు క్రమంగా గొర్రెల మేపే పచ్చిక బయళ్ళుగా మారాయి. దాంతో వ్యవసాయ కార్మికులు, అవసరానికి మించి ఉన్నారు. ఈ పరిస్థితి వాళ్ళని గుంపులు గుంపులుగా పట్టణాలకు తరిమివేసింది. ఐర్లాండ్ జనాభా పోయిన 20 ఏళ్లలో సగానికి పడిపోయింది. ఇప్పుడు (1867) కూడా తగ్గుతూనే ఉంది. అక్కడి భూస్వాముల, ఇంగ్లిష్ ఉన్ని ఉత్పత్తిదారుల అవసరాలకు సరిగ్గా సరిపోయేటట్లు కార్మికులు తగ్గుతున్నారు. నేతగానికి నూలు కావాలి. అదే అతనికి శ్రమ పదార్థం. ఆ దారం ఒకే దశలో తయారవదు. పత్తి పండించే దశ, విత్తనాలు తీసే దశ, ఏకే దశ, వడికే దశ వంటి కొన్ని దశలు గడిస్తేనే నేతగాడు నేసే శ్రమ  చెయ్యడానికి శ్రమ పదార్థం తయారవుతుంది.

శ్రమ పదార్థం (subject of labour) తయారయ్యే దశల్లో ఏ దశల్లో యంత్రాలు ప్రవేశిస్తే ఆ దశల్లో ఉత్పత్తి పెరుగుతుంది. దాంతో పాటే ఆ పదార్థాల్ని అందుకునే చేతివృత్తుల్లో, కార్ఖానాలలో  శ్రమకు గిరాకీ ఎక్కువవుతుంది. ఉదాహరణకు, యంత్రాలతో ఉత్పత్తయిన నూలు చౌక గానూ, సమృద్ధిగానూ చేమగ్గం వాళ్లకు సరఫరా అయింది. మొదట్లో అదనంగా డబ్బు వెచ్చించ కుండానే, పూర్తికాలం పనిచెయ్యగలిగారు.  తదనుగుణంగా వాళ్ళ ఆదాయాలు కూడా పెరిగాయి. అందువల్ల నూలు బట్టల వృత్తి లోకి ప్రవహించారు. జెన్నీ వల్లా, త్రాజిల్ వల్లా, మ్యూల్ వల్లా  వచ్చిన 8 లక్షలమంది నేతగాళ్ళు మరమగ్గం దెబ్బకి మునిగి పోయారు. అదే విధంగా యంత్రాలతో ఉత్పత్తయిన బట్ట సమృద్ధిగా లభించడం వల్ల దర్జీలూ, సూదితో కుట్టే స్త్రీలూ ఎక్కువమంది అవసరమయ్యారు. కనుక వాళ్ళ సంఖ్య కుట్టు యంత్రం వచ్చే దాకా పెరుగుతూనే  ఉంది.

## యంత్రాలూ – శ్రమ విభజనా

యంత్రాలు ముడిపదార్థాలనీ, మధ్యంతర ఉత్పాదితాల్నీ, శ్రమ సాధనాల్నీ  పెంచుతాయి. వాటి ఉత్పత్తిలో అవి అదే నిష్పత్తిలో ఎన్నో శాఖలుగా విడిపోతాయి. సామాజిక ఉత్పత్తి వైవిధ్యం పెరుగుతుంది. **సామాజిక శ్రమ విభజనని కార్ఖానా ఉత్పత్తి కన్నా, యంత్రోత్పత్తి ముందుకు తీసుకు పోతుంది.**  ఎందుకంటే, ఫాక్టరీ వ్యవస్థ తన పట్టులో పెట్టుకున్న పరిశ్రమల్లో ఉత్పాదకతని చాలా ఎక్కువ స్థాయిలో పెంచుతుంది.

## యంత్రాలూ – విలాస వస్తువుల ఉత్పత్తీ

యంత్రాల వల్ల కలిగే తక్షణ ఫలితం : అదనపు విలువ పెరగడం, అదనపువిలువని నింపుకున్న ఉత్పాదితాల మొత్తం పెరగడం. అంటే పెట్టుబడిదారుల ఆదాయం అధికమవుతుంది. పెట్టుబడిదారులూ, వాళ్ళ మీద ఆధారపడ్డవాళ్ళూ వాడే వస్తువులు ఎక్కువగా దొరికే కొద్దీ, సమాజంలో అలాంటి వాళ్ళ తరగతి పెరుగుతుంది;

దానికి తోడు, జీవితావసర వస్తువులు ఉత్పత్తి చెయ్యడానికి అవసరమయ్యే పనివాళ్ళ సంఖ్య సాపేక్షంగా తగ్గుతూ ఉంటుంది; అందువల్ల, సంపద పెరిగిన వాళ్ళకి విలాసాల కోసం కొత్తకొత్త కోర్కెలు పుట్టుకొస్తుంటాయి. ఆ కోర్కెల్ని తీర్చే సాధనాలను కూడా ఉత్పన్నం చేస్తాయి. ఆధునిక పరిశ్రమ కొత్తగా ప్రపంచ మార్కెట్లతో ఏర్పరచిన సంబంధాలు కూడా వీటికి వైవిధ్యం తెస్తాయి. అందువల్ల, విలాస వస్తువుల సంఖ్యా, వాటి ఉత్పత్తీ పెరుగుతాయి.

## రవాణా పరిశ్రమల్లో శ్రామికులకి గిరాకీ

దేశీయ విలాస వస్తువులకు మరిన్ని విదేశీ వస్తువులు వస్తాయి. అంతే కాక, పెద్ద మొత్తాల్లో విదేశీ ముడిసరుకులూ, మధ్యంతర ఉత్పాదితాలూ (intermediate products), దేశీయ పరిశ్రమల్లో ఉత్పత్తి సాధనాలుగా వాడ బడతాయి. అవి దేశ దేశాలకూ చేరాలి. కనుక రవాణా పరిశ్రమ శాఖోపశాఖలుగా చీలిపోతుంది. ఆయా శాఖల్లో శ్రామికులకి గిరాకీ పెరుగుతుంది. ఉత్పత్తి సాధనాల పెరుగుదలా, జీవితావసరసాధనాల పెరుగుదలా, వీటికి తోడు శ్రామికుల సంఖ్య సాపేక్ష తగ్గుదలా, కాలువలూ, దొరువులూ సొరంగాలూ తవ్వడానికీ, వంతెనల నిర్మాణం వంటి వాటిలో పనివాళ్ళ గిరాకీ పెంచుతాయి. అయితే ఇవి ఎప్పుడో భవిష్యత్తులో ఫలితాన్ని ఇస్తాయి. యంత్రాల ప్రత్యక్ష ఫలితంగా గానీ, యంత్రాల వల్ల ఏర్పడే సాధారణ పారిశ్రామిక మార్పుల వల్ల గానీ, పూర్తిగా కొత్త ఉత్పత్తి శాఖలు ఏర్పడి, నూతన శ్రమ రంగాల్ని ఏర్పరచవచ్చు. అయితే ఈ శాఖల స్థానం అత్యంత అభివృద్ధి సాధించిన దేశాల్లో సైతం ఏమాత్రమూ ముఖ్యమైంది కాదు. వాటిలో పనిదొరికే వాళ్ళ సంఖ్య, ఆపరిశ్రమలు మొరటు శారీరక శ్రమకు కల్పించే గిరాకీని బట్టి ఉంటుంది. 1861 ఇంగ్లండ్, వేల్స్ జనాభా లెక్కల ప్రకారం ఇటువంటి 5 ముఖ్యమైన పరిశ్రమల్లో ఉన్న మొత్తం పనివాళ్ళు 94,145 మంది మాత్రమే.

## పూర్వపు గృహ బానిసలు మళ్ళీ

ఆధునిక పరిశ్రమల్లో ఉత్పాదకత అసాధారణ స్థాయిలో ఉండడం వల్లా, అన్ని శాఖల్లో శ్రమ దోపిడీ విస్తృతీ, తీవ్రతా అధికం అవడం వల్లా – కార్మిక వర్గంలో అంతకంతకూ ఎక్కువ భాగాన్ని అనుత్పాదక పనుల్లో పెట్టడానికి వీలు కుదిరింది. ఆ కారణంగా పూర్వపు గృహబానిసలు పుట్టు కొస్తున్నారు. వాళ్ళలో పురుష సేవకులు, మహిళా సేవకులు, యజమానుల వెంబడి ఉండే బంట్లూ ఉంటారు. అంటే, అనుత్పాదక శ్రామికులు పెరుగుతారు. పూర్వపు గృహ బానిసలు మళ్ళీ పుట్టుకొస్తారు..1861 ఇంగ్లండ్, వేల్స్ జనాభా లెక్కల ప్రకారం వస్త్ర ఫాక్టరీలలోనూ, గనుల్లోనూ పనిచేస్తున్న వాళ్ళు మొత్తం – 12,08,442 వస్త్ర ఫాక్టరీలలోనూ, లోహ పరిశ్రమల్లోనూ పనిచేస్తున్న వాళ్ళు మొత్తం – 10,39,605; సేవకులు – 12,08,648. రెండు సందర్భాలలోనూ వీళ్ళ సంఖ్య గృహబానిసల సంఖ్య కన్నా తక్కువే. ఆహా! పెట్టుబడిదారీ విధానంలో యంత్రాల వినియోగం ఎంత అద్భుతమైనదో గదా!

## విభాగం 7

## ఫాక్టరీ వ్యవస్థలో పనివాళ్ళ గెంటివేతా – ఆకర్షణా నూలు బట్టల వాణిజ్యంలో సంక్షోభాలు

### శ్రామిక బానిసల సంఖ్య పెరగడం

యంత్రాలు చేతివృత్తులతోనూ, కార్ఖానాఉత్పత్తి తోనూ పోటీ పడతాయి. ఆ పోటీ, వాటిలో పనిచేసే వాళ్ళ మీద దుష్ఫలితాన్ని కలిగిస్తుంది – అని ఏస్థాయి రాజకీయ ఆర్థిక వేత్త అయినా ఒప్పుకుంటాడు. ఫాక్టరీ పనివాడి బానిసత్వం గురించి బాధ పడతాడు. అతను ఒక తురుపు ముక్కని వదులుతాడు. ఏమంటాడంటే: యంత్రాలు ప్రవేశించి అభివృద్ధయ్యాక దీర్ఘకాలంలో పనివాళ్ళ సంఖ్య తగ్గేకంటే, పెరుగుతుంది – అంటాడు. అయితే వాస్తవానికి, ఫాక్టరీ వ్యవస్థ మొదట్లో వీధుల్లోకి నెట్టిన వాళ్ళ కంటే, ఇప్పుడు మరింత మంది పనివాళ్ళని గెంటివేస్తున్నది. ఇబ్బంది పెడుతున్నది.

### ఫాక్టరీ వ్యవస్థలో ఉత్పత్తిసాధనాల పెరుగుదలా, కార్మికుల తగ్గుదలా

ఫాక్టరీ వ్యవస్థ అసాధారణంగా విస్తరించిన కొన్ని సందర్భాల్లో కార్మికుల సంఖ్య సాపేక్షంగానే కాక, నిరపేక్షంగా కూడా తగ్గేది నిజమే.

570 ఇంగ్లిష్ సిల్క్ ఫాక్టరీలకు సంబంధించి 1860 లోనూ, 1865 లోనూ వివరాలు:

| సంవత్సరం | మర మగ్గాల సంఖ్య | కదుర్ల సంఖ్య | ఆవిరి శక్తి -హార్స్ పవర్లలో | కార్మికుల సంఖ్య |
|---|---|---|---|---|
| 1860 | 85,622 | 6,819,146 | 27,439,+1,390 (నీరు) | 94,119 |
| 1865 | 95,163 | 7,025,031 | 28,925,+1,445 (నీరు) | 88,913 |

దీన్ని బట్టి 1860 – 1865 కాలంలో 9541 మగ్గాలూ 205,885 కదుర్లూ పెరిగాయి. కాని పనివాళ్ళు 2506 మంది తగ్గారు. అంటే మగ్గాలు 11 శాతమూ, కదుర్లు 3 శాతమూ పెరగ్గా, శ్రామికులు 5½ శాతం తగ్గారు. 1852 – 1862 కాలంలో ఉన్ని పరిశ్రమ గణనీయంగా విస్తరించింది. కాని పనివాళ్ళు ఏమాత్రం పెరగలేదు. అంత మందే ఉన్నారు. ఇది కొత్త యంత్రాలు ఏ విధంగా వెనకటి కాలాల్లో ఉన్న శ్రమని తొలిగించాయో తెలుపుతుంది.

### ఉత్పత్తిసాధనాల పెరుగుదలా, కార్మికుల పెరుగుదలా

కొన్ని సందర్భాల్లో పనివాళ్ళు పెరిగినట్లు పైకి అగపడుతుంది; అది అప్పటికే ఉన్న ఫాక్టరీల విస్తరణ వల్లకాదు, అనుబంధ పరిశ్రమల్ని క్రమంగా స్వాధీనం చేసుకున్నందు వల్ల. ఉదాహరణ: 1838 – 1856 కాలంలో నూలు బట్టల పరిశ్రమలో మర మగ్గాలు పెరిగాయి. పనివాళ్ళూ పెరిగారు. ఇందుకు కారణం కేవలం ఈ శాఖ విస్తరణే.

ఉన్న ఫాక్టరీల్లో చాలామందిని తొలిగించినా, అదే శాఖలో మరిన్ని కొత్త ఫాక్టరీలు పెడితే,

వాళ్ళందరినీ తిరిగి నియమించవచ్చు. కొత్తవారినీ కూడా పెట్టుకోవచ్చు. ఉదాహరణకి అప్పటికి 10 ఫాక్టరీలుండి, ఒక్కొక్క దాంట్లో 50 మంది చొప్పున పనివాళ్ళున్నారనుకుందాం. యంత్రాలు పెట్టినందువల్ల ఒక్కొక్క ఫాక్టరీకి 40 మంది సరిపోయారనీ 10 మందిని తొలిగించారనీ అనుకుందాం. మొత్తం 100 మంది తొలిగించబడ్డారు. అయితే అదే శాఖలో విస్తరణ వల్ల కొత్తగా 5 ఫాక్టరీలు వస్తే, వాటికి 200 మంది పనివాళ్ళు కావాలి. అప్పుడు తొలిగించబడ్డ 100 మందినీ నియమించడమే కాక, కొత్తవాళ్ళని మరొక 100 మందిని పెట్టుకోవాల్సి వస్తుంది.

ఉదాహరణకి, ఇలా అనుకుందాం:

A. పాత విధానంలో పెట్టిన పెట్టుబడి – 2,00,000 రూపాయలు. అందులో అయిదింట రెండు పాళ్ళు స్థిర పట్టుబడి అనీ, మూడు పాళ్ళు అస్థిర పెట్టుబడీ అనీ అనుకుందాం.

అప్పుడు స్థిర పెట్టుబడి – 80,000 రూపాయలు

అస్థిర పెట్టుబడి –1,20,000 రూపాయలు

ఒక్కొక్క పనివానికి 400 రూపాయల చొప్పున 300 మంది పనిచేస్తుంటారు.

B. ఇప్పుడు యంత్రాలతో ఉత్పత్తి వచ్చిందనుకుందాం.

మొత్తం పెట్టుబడి 2,00,000 రూపాయలే. ఇది మారక పోయినా, అంగ నిర్మాణం మారుతుంది. స్థిర పెరిగి, అస్థిర తగ్గుతుంది. అయిదింట 4 పాళ్ళు స్థిర పెట్టుబడి అనీ, ఒక పాలు అస్థిర పెట్టుబడి అనీ అనుకుందాం.

అప్పుడు స్థిర పెట్టుబడి – 1,60,000 రూపాయలు

అస్థిర పెట్టుబడి –40,000 రూపాయలు

ఒక్కొక్క పనివానికి 400 రూపాయల చొప్పున 100 మంది పనిచేస్తుంటారు.

200 మందికి పని పోతుంది. కారణం అంగనిర్మాణంలో వచ్చిన మార్పు.

C. ఇలాంటి పరిస్థితుల్లో వ్యాపారం విస్తరించి, మొత్తం పెట్టుబడి పెరిగి మూడింతలు అయిందనుకుందాం. అంగ నిర్మాణం అదే పాళ్ళలో(అంటే, అయిదింట 4 పాళ్ళు స్థిర పట్టుబడి అనీ, ఒక పాలు అస్థిర పెట్టుబడీ) ఉందనుకుందాం.

మొత్తం పెట్టుబడి – 6,00,000 రూపాయలు.

అప్పుడు స్థిర పెట్టుబడి – 4,80,000 రూపాయలు

అస్థిర పెట్టుబడి –1,20,000 రూపాయలు అవుతుంది.

ఒక్కొక్క పనివానికి 400 రూపాయల చొప్పున 300 మందకి పనివుంటుంది. యంత్రాలు పెట్టకముందున్నంత మందికి.

D. మొత్తం పెట్టుబడి – 8,00,000 రూపాయలు. అంగ నిర్మాణం అదే పాళ్ళలో ఉంటే,

స్థిర పెట్టుబడి - 6,40,000 రూపాయలు

అస్థిర పెట్టుబడి -1,60,000 రూపాయలు అవుతుంది.

ఒక్కొక్క పనివానికి 400 రూపాయల చొప్పున 400 మందకి పనివుంటుంది.

పనివాళ్ళ సంఖ్య 100 పెరిగింది. సాపేక్షంగా పెరిగింది - అంటే పెట్టిన పెట్టుబడికి తగినట్లుగా పెరిగింది.

అంగ నిర్మాణం పాతపద్ధతి A లో ఉన్నట్లుంటే (అంటే, అయిదింట 2 పాళ్ళు స్థిర పెట్టుబడీ, 3 పాళ్ళు అస్తిర పెట్టుబడీ ఉంటే 1200 మంది ఉండేవారు. అప్పుడు

స్థిర పెట్టుబడి - 3,20,000 రూపాయలు

అస్థిర పెట్టుబడి - 4,80,000 రూపాయలు అవుతుంది.

ఒక్కొక్క పనివానికి 400 రూపాయల చొప్పున 1200 మందికి పనివుంటుంది కొత్త పద్ధతిలో 400 మందే ఉన్నారు. దానిప్రకారం 800 మంది తగ్గారు. అందువల్ల పనివాళ్ళ సాపేక్ష తగ్గుదల, వాస్తవ పెరుగుదలకి పొసగుతుంది.

అయితే ఇప్పటికే ఒక వాస్తవం మనకు తెలుసు:

**యంత్రాలలో వచ్చే ప్రతి పురోగతి తోనూ, స్థిర పెట్టుబడి భాగం - యంత్రాలకూ, ముడిపదార్థాలు వగయిరాలకు వెచ్చించే భాగం - పెరుగుతుంది**

**అస్థిర భాగం - శ్రమ శక్తికి వెచ్చించే భాగం - తగ్గుతుంది**

ఇంకో విషయం కూడా మనం తెలుసుకున్నాం: ఏ ఇతర వ్యవస్థలోనూ, ఫాక్టరీ వ్యవస్థలో లాగా అభివృద్ధి నిరంతరాయంగా సాగదు. అందులోలాగా పెట్టుబడి అంగనిర్మాణం, నిరంతరం మారుతూ ఉండదు. ఈ మార్పులకి అడ్డంకులుంటాయి. విశ్రాంతి దశలుంటాయి. ఆ దశల్లో అప్పటికున్న సాంకేతిక పునాదిమీద ఫాక్టరీల పరిమాణాత్మక విస్తరణ మాత్రమే జరుగుతుంది. అటువంటి కాలాల్లో పనివాళ్ళు పెరుగుతారు. ఆవిధంగా 1835 లో యునైటెడ్ కింగ్‌డంలో నూలు, ఉన్ని, అల్లిక, నార, సిల్కు వస్త్ర ఫాక్టరీల్లో మొత్తం పనివాళ్ళు - 3,54,684. అయితే 1861 లో మరమగ్గాల పనివాళ్ళే 2,30,654 మంది ఉన్నారు.

ఒక అంశాన్ని పరిగణనలోకి తీసుకుంటే ఈ పెరుగుదల అంత ముఖ్యమైనదేమీ కాదు. ఆ అంశం : 1838 లో చేనేత కార్మికులు, కుటుంబ సభ్యులతో కలిపి 8,00,000 మంది ఉన్నారు; వీళ్ళలో ఆసియా లోనూ, ఐరోపాలోనూ తొలిగించబడ్డ వారు లేరు.

ఒక పరిశ్రమ శాఖలో పాత చేతివృత్తులనూ, కార్ఖానాఉత్పత్తినీ దెబ్బతీసి ఫాక్టరీ వ్యవస్థ విస్తరిస్తున్నంత కాలం, ఫలితం కచ్చితమే. వేగంగా కాల్చగల తుపాకులున్న సైన్యానికీ, విల్లంబులున్న వ్యక్తికీ ఘర్షణ జరిగితే, ఫలితం ఎంత కచ్చితమో ఇదే అంతే కచ్చితం. యంత్రాలు విజయం సాధించే ఈ తొలిదశ చాలా ముఖ్యమైనది. ఎందుకంటే: ఆ గెలుపు అసాధారణ లాభాలు చేకూరేందుకు సహకరిస్తుంది. అటువంటి లాభాలు పెట్టుబడి సంచయనాన్ని వేగిర

పరుస్తాయి. అంతేకాదు, కొత్తగా వస్తున్న పెట్టుబడిలో ఒక భాగాన్ని అనుకూలమైన ఆ శాఖలోకి ఆకర్షిస్తాయి. మొదట్లో యంత్రాలు వచ్చి, ఊపుగా కార్యకలాపాలు జరిగే ప్రతి శాఖలోనూ ప్రత్యేక ప్రయోజనాలు కలుగుతాయి.

ఫాక్టరీ వ్యవస్థ కొంత నిలదొక్కు కున్నాక, యంత్రాలతో ఉత్పత్తి సర్వ సాధారణం కాగానే, ప్రత్యేకించి దాని సాంకేతిక పునాది అయిన యంత్రాలు కూడా యంత్రాలచేత తయారవడం మొదలవగానే, బొగ్గు, ఇనుం గనుల పనులూ, లోహ పరిశ్రమలూ, రవాణా సాధనాలూ విపరీతంగా మార్పు చెందిన వెంటనే **ఈ ఉత్పత్తి విధానం** ఒక స్థితిస్థాపకస్వభావాన్ని, ఉరుకులు పరుగులతో విస్తరించే సామర్థ్యాన్ని, సంతరించు కుంటుంది; ఆ దుముకులకు ముడిపదార్థాల సరఫరా, ఉత్పాదితాల అమ్మకం తప్ప మరే అడ్డూ ఉండదు. ఒక పక్క యంత్రాల తక్షణ ఫలితం ముడిపదార్థాల సరఫరా పెరగడం. ఉదాహరణకి, పత్తి జిన్ను వల్ల దూది ఉత్పత్తి పెరిగినట్లు. మరొకపక్క యంత్రాలు ఉత్పత్తిచేసిన వస్తువులు చౌక గనకా, మెరుగైన రవాణా సాధనాలు అందుబాట్లోకి వచ్చాయి గనకా, అవి విదేశీ మార్కెట్లను జయించే ఆయుధాలవుతాయి.

## ముడిపదార్థాలు సరఫరా చేసేదేశాలు

ఇతర దేశాల్లో చేతివృత్తుల ఉత్పత్తుల్ని నాశనం చెయ్యడం ద్వారా, యంత్రాలు ఆ దేశాల్ని బలవంతంగా తనకు ముడిపదార్థాలు సరఫరా చేసే ప్రదేశాలుగా మారుస్తాయి. అలా ఈస్ట్ ఇండియా గ్రేట్ బ్రిటన్ కి సరఫరా కోసం ముడిపదార్థాల్ని – పత్తి, ఉన్ని, గోగు, జనుము, నీలిమందుల్ని – తప్పక ఉత్పత్తి చెయ్య వలసి వచ్చింది.

ఇండియానుండి గ్రేట్ బ్రిటన్‌కి **పత్తి ఎగుమతులు:**

1846 లో – 3,45,40,143 పౌన్లు 1860 లో 20,41,41,168 పౌన్లు. 1865 లో 44,59,47,600 పౌన్లు.

**ఉన్ని ఎగుమతులు:**

1846 లో – 45,70,581 పౌన్లు 1860 లో 2,02,14,173 పౌన్లు. 1865 లో 2,06,79,111 పౌన్లు.

కేప్ నుంచి గ్రేట్ బ్రిటన్ కి ఉన్ని ఎగుమతులు:

1846 లో – 29,58,457 పౌన్లు. 1860 లో 1,65,74,345 పౌన్లు. 1865 లో 2,99,20,623 పౌన్లు.

ఆస్ట్రేలియా నుంచి ఉన్ని ఎగుమతులు:

1846 లో – 2,17,89,346 పౌన్లు. 1860 లో 5,91,66,616 పౌన్లు. 1865 లో 10,97,34,261 పౌన్లు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలనుంచి పత్తి ఎగుమతులు::

1846 లో - 40,19,49,393 పౌన్లు. 1860 లో 1,11,58,90,608 పౌన్లు.

పై సమాచారాన్ని బట్టి ఆ 20 ఏళ్లలో గ్రేట్ బ్రిటన్ కి ముడి సరుకుల ఎగుమతులు ఎంతో వేగంగా పెరిగాయి.

ఆ దేశాలు ముడిపదార్థాలు పండించి సరఫరా చేసేవిగా ఉన్నాయి. గ్రేట్ బ్రిటన్ వాటిని పరిశ్రమల్లో వాడుకునే పారిశ్రామిక దేశంగా ఉండింది. ఆవిధంగా ఒక కొత్త అంతర్జాతీయ శ్రమ విభజన జరిగింది.

1846 లో ఆధునిక పరిశ్రమ నిరంతరం కార్మికుల్లో కొందరిని మిగులు పనివాళ్ళుగా, అంటే అవసరానికి మించి ఉన్నవాళ్ళుగా చేస్తుంది. తద్వారా ఆధునిక పరిశ్రమ వేళ్ళూనుకున్న అన్ని దేశాల్లో వలసలకూ, విదేశీ కాలనీలకూ ప్రోత్సాహం ఇచ్చింది. తత్ఫలితంగా ఆయా దేశాలు, మాతృదేశానికి ముడి పదార్థాల్ని ఉత్పత్తిచేసే జనావాసాలుగా (settlements) మార్చబడతాయి. ఉదాహరణకి, ఆస్ట్రేలియా ఉన్ని ఉత్పత్తిచేసే కాలనీగా మార్చబడింది.

ఒక కొత్త, అంతర్జాతీయ శ్రమ విభజన– ఆధునిక పరిశ్రమ ప్రధాన కేంద్రాల ప్రయోజనాలకి అనుకూలమైన అంతర్జాతీయ శ్రమ విభజన ఏర్పడింది. ప్రపంచంలో ఒకభాగాన్ని ప్రధానంగా వ్యవసాయోత్పత్తుల్ని , మరొక భాగానికి, అంటే పారిశ్రామిక దేశాలకు సరఫరా చేసే రంగంగా మార్చివేసింది.

## ఫాక్టరీ వ్యవస్థ ఉత్పత్తి అపరిమితం

ఫాక్టరీ వ్యవస్థకు విస్తరించే శక్తి అపరిమితంగా ఉంటుంది; ఆవ్యవస్థ ప్రపంచ మార్కెట్ల మీద ఆధారపడి నడుస్తుంది. కాబట్టి అది అతీతంగా, అపరిమితంగా ఉత్పత్తిచేస్తుంది. ఫలితంగా మార్కెట్లు సరుకులతో నిండి పోతాయి, పొంగి పొర్లి పోతాయి. సరుకులు తగినంతగా అమ్ముడవవు. మార్కెట్ కి వాటి అవసరం అంతగా ఉండదు. అందువల్ల ఉత్పత్తి కుంటుబడుతుంది.

దీన్ని బట్టి, ఆధునిక పరిశ్రమ ఈ దశల గుండా సాగుతూ ఉంటుంది:

- ఒక మోస్తరయిన ఉత్పత్తి కార్య కలాపం (moderate activity)
- వికాసం (prosperity)
- అమితోత్పత్తి (over-production)
- సంక్షోభం (crisis)
- స్తబ్దత (stagnation)

ఈ దశలు కలిసి ఒక పారిశ్రామిక వలయం (industrial cycle) అవుతుంది. ఈ వలయాలు ఒకటి పోతే మరొకటి వరసగా ఏర్పడుతూనే ఉంటాయి. యంత్ర వ్యవస్థ మరొక రీతిలో సాగదు. కాబట్టి, యంత్రాలు కార్మికుల నియామకాన్నీ, తత్ఫలితంగా వాళ్ళ పరిస్థితుల్నీ అనిశ్చితిలో పడేస్తాయి. నియమిత కాల వ్యవధుల్లో ఏర్పడే వలయాల మూలంగా ప్రతిసారీ అలాంటి అనిశ్చితి మళ్ళీ మళ్ళీ ఏర్పడుతూనే ఉంటుంది. అందువల్ల కార్మికుల అనిశ్చిత పరిస్థితి మామూలు స్థితి అవుతుంది.

## పెట్టుబడిదారుల మధ్య పోటీ

వికాస కాలంలో తప్ప, మార్కెట్లో పెద్ద వాటా కోసం పెట్టుబడిదారుల పోటీ తీవ్రంగా చెలరేగుతుంది. ఈ వాటా ఉత్పాదితాల చౌకదనానికి అనులోమానుపాతంలో ఉంటుంది. అంటే, ఉత్పాదితం ఎంత చౌక అయితే అంత ఎక్కువ వాటా ఉంటుంది. కనుక ఎవరికి వారు తమతమ సరుకులను చౌక పరిచే ప్రయత్నం చేస్తారు. కొత్త ఉత్పాదక పద్ధతులు అవలంబిస్తారు. శ్రమశక్తికి బదులు యంత్రాలు పెట్టడంలోనూ, పాత యంత్రాల స్థానంలో మెరుగైన యంత్రాలు పెట్టడంలోనూ ఒకరితో ఒకరు పోటీ పడతారు. చౌక పరచడానికి వేతనాలు తగ్గిస్తారు. ప్రతి పారిశ్రామిక వలయంలోనూ వేతనాల్ని శ్రమ శక్తి విలువకన్నా బలవంతంగా తక్కువ స్థాయికి దించుతారు. అందువల్ల ఫాక్టరీ పనివాళ్ళు పెరగడానికి, పెట్టే పెట్టుబడి మొత్తం అంతకు మించి వేగంగా పెరగడం తప్పనిసరి షరతు. ఈ పెరుగుదల పారిశ్రామిక వలయం యొక్క ఆటు పోట్లను బట్టి ఉంటుంది. అదీగాక, ఒకప్పుడు కొత్త వాళ్ళని పెట్టుకుంటూ, ఒకప్పుడు ఉన్నవాళ్ళలో కొందరిని తొలిగిస్తూ ఉండే సాంకేతికాభివృద్ధి, ఈ పెరుగుదలకి నిరంతరం అంతరాయం ఏర్పరుస్తుంది.

యంత్ర పరిశ్రమలోని ఈ గుణాత్మక మార్పు నిరంతరాయంగా పనివాళ్ళని తొలిగిస్తూ ఉంటుంది; లేదా కొత్తగా నియమితులయ్యే వాళ్లకు గేట్లు మూసేస్తుంది. కేవలం ఫాక్టరీల పరిమాణాత్మక విస్తరణ తొలిగించబడ్డ పాత పనివాళ్ళనే కాక, కొత్త వాళ్ళనికూడా ఇముడ్చుకుంటుంది. ఆ విధంగా పనివాళ్ళు ఎల్లవేళలా బయటకు పంపబడుతుంటారు, లోపలికి తీసుకోబడుతుంటారు. ఒక చోటు నుంచి వేరొక చోటికి తరమబడుతుంటారు. అదే సమయంలో పెట్టుకునే పనివాళ్ళ వయసులో, నైపుణ్యంలో, స్త్రీ పురుష నిష్పత్తిలో మార్పులు జరుగుతూ ఉంటాయి.

## ఇంగ్లిష్ వస్త్ర పరిశ్రమ గమనాన్ని పరిశీలిస్తే, ఫాక్టరీ పనివాళ్ళ పరిస్థితి వివరంగా తెలుస్తుంది

1770 - 1815 కాలంలో ఈ పరిశ్రమ 5 ఏళ్ళపాటు మాత్రమే స్తబ్ధంగా ఉండింది. ఆ 45 ఏళ్ల కాలంలోనూ ప్రపంచ మార్కెట్లమీదా, యంత్రాల మీదా ఇంగ్లిష్ పెట్టుబడిదారులకు గుత్తాధిపత్యం ఉండింది. 1815 - 1821 కాలంలో మాంద్యం (depression), 1822-1823 కాలంలో వికాసం (prosperity). 1824 లో కార్మిక వ్యతిరేక చట్టాల రద్దు. ప్రతిచోటా ఫాక్టరీల భారీ విస్తరణ. 1825 సంక్షోభం (crisis); 1826 విపరీతమైన కష్టాలు, ఫాక్టరీ పనివాళ్ళ మధ్య కొట్లాటలు. 1827 కొంచెం మెరుగుదల. 1828 మరమగ్గాల సంఖ్యలోనూ, ఎగుమతుల్లోనూ ఎంతో పెరుగుదల. 1829 ఎగుమతులు ప్రత్యేకించి ఇండియాకి అంతకుముందు సంవత్సరాల ఎగుమతులను మించి పోయాయి. 1830 మార్కెట్లలో సరుకులు మేటలు వేశాయి, అమిత కష్ట కాలం. 1831-1833 మాంద్యం.

ఇండియా చైనాలతో ఈస్ట్ ఇండియా కంపెనీకున్న వాణిజ్య గుత్తాధిపత్యం ఉపసంహరించాబడింది. 1834 ఫాక్టరీలూ, యంత్రాలూ పెద్దఎత్తున పెరిగాయి. కార్మికుల కొరత. బీదవాళ్ళ గురించిన కొత్త చట్టాల ఫలితంగా, ఫాక్టరీ జిల్లాలలోకి వ్యవసాయ కూలీల వలసలు పెరిగాయి. పల్లెటూళ్ళలో పిల్లలు లేకుండా పోయారు. శ్వేత బానిస వర్తకం. 1835

మహా వికాసం. ఆ కాలంలోనే చేనేత పనివాళ్ళు పస్తులతో పడున్నారు. 1836 మహావికాసం. 1837 – 1838 మాంద్యం, సంక్షోభం. 1839 పునరుజ్జీవనం (revival). 1840 మహా మాంద్యం. కొట్లాటలు. రంగం పైకి సైన్యం. 1841, 1842 ఫాక్టరీ పనివాళ్ళ దుర్భర దారిద్ర్యం. 1842 ధాన్యం చట్టాల రద్దు కోసం యజమానులు ఫాక్టరీలని మూసివేయడం. వేలాదిగా లాంక్ షైర్‌కీ, యార్క్ షైర్‌కీ ప్రవాహంలా వచ్చే పనివాళ్ళని సైన్యం వెనక్కి తరమడం. కార్మికుల నాయకుల్ని విచారణకు తీసుకురావడం.

1843 పెద్ద దీనావస్థ. 1844 పునరుజ్జీవనం. 1845 గొప్ప వికాసం. 1846 మొదట కొనసాగిన వికాసం, ఆతర్వాత వెనకంజ. ధాన్యం చట్టాల రద్దు. 1847 సంక్షోభం. వేతానాలు 10 శాతం, ఆపైనా తగ్గింపు.

1848 కొనసాగిన మాంద్యం. 1849 పునరుజ్జీవనం. 1850 వికాసం. 1851 ధరల తగ్గుదల, తక్కువ వేతనాలు, తరచూ సమ్మెలు. 1852 మెరుగుదల మొదలు, సమ్మెలు కొనసాగడం, విదేశీ శ్రామికులని తెస్తామని యజమానులు బెదిరించడం. 1853 ఎగుమతులు పెరగడం. 8 నెలల పాటు సమ్మె – ప్రెస్టన్ లో పెద్ద దైన్య స్థితి. 1854 వికాసం. మేటలు వేసిన మార్కెట్లు. 1855 అమెరికా సంయుక్తరాష్ట్రాల నించీ, కెనడా నించీ, ఈశాన్య మార్కెట్ల నించీ వ్యాపార వైఫల్యాల గురించి వార్తల ప్రవాహం. 1856 మహా వికాసం. 1857 సంక్షోభం. 1858 మెరుగుపడడం. 1859 మహా వికాసం. ఫ్యాక్టరీల పెరుగుదల. 1860 ఇంగ్లిష్ వస్త్ర పరిశ్రమకి మహర్దశ. ఇండియా,ఆస్ట్రేలియా తదితర దేశాల మార్కెట్లు ఇంగ్లిష్ బట్టలతో నిండిపోవడం. ఎంతగానంటే, 1863 లో సైతం అవన్నీ పూర్తిగా అమ్ముడవలేదు. ఫ్రెంచ్ వాణిజ్య ఒడంబడిక, ఫాక్టరీలు, యంత్రాలు అపారంగా పెరగడం. 1861 కొంతకాలం కొనసాగిన వికాసం, తిరిగి తిరోగమనం. అమెరికాలో అంతర్యుద్ధం. దూది కరువు. 1862 – 1863 పూర్తి పతనం.

## లోపం యజమానిదీ – బాధ్యత పనివాడిదీ

1882 అక్టోబర్లో 60.3 శాతం కదుర్లూ, 58 శాతం మగ్గాలూ ఆడలేదు. ఈ లెక్కలు మొత్తం వస్త్ర పరిశ్రమకు సంబంధించినవి. పూర్తి కాలం పనిచేసిన మిల్లులు చాలా తక్కువ. మిగతావి అడపాదడపా పనిచేస్తుండేవి. కార్మికుల వేతనాలు తగ్గి పోయాయి. ఎందుకంటే నాసిరకం దూది వాడకం వల్ల, బరువైన జిగురు వాడడం వల్ల ఒక పనివాడు చూడగల యంత్రాల సంఖ్యా, వాటి వేగమూ తగ్గాయి. యంత్రాల లోపాలవల్ల శ్రమ పెరిగింది. కూలి రేట్లు తగ్గాయి. ఆ పరిస్థితుల్లోకూడా యజమానులు ఉత్పత్తుల్లో లోపాలకు శ్రామికులని బాధ్యుని చేసి వేతనాల్లో కోతలు పెట్టేవారు. అయితే నిజానికి ఆలోపాలకు కారణం కార్మికుల లోపాలు కాదు. యజమాని ఇచ్చిన నాసిరకం దూదీ, సరిగాలేని యంత్రాలూ. వీటి వల్ల పనివాళ్ళ ఆరోగ్యం దెబ్బతినేది.

## కార్మికులకు జబ్బులు

నాసిరకం సూరత్ దూది బేళ్ళు తెరవగానే, భరించరానంత దుర్వాసన కొడుతుంది. ఆరోగ్యం దెబ్బతింటుంది. కలగలిపే గదుల్లో, ఏకే గదుల్లో, చిక్కుదీసే గదుల్లో ఒకటే దుమ్మూ, ధూళీ.

దగ్గొస్తుంది. ఊపిరి తీసుకోవడం కష్టం అవుతుంది. సూరత్ దూదిలో ఉండే మురికి వల్ల చర్మవ్యాదులు వ్యాప్తిచెందేవి. పింజ పొట్టిగా ఉన్నందువల్ల, జిగురు ఎక్కువగా వాడేవాళ్ళు. దుమ్ము మూలంగా శ్వాస నాళాల వాచేవి, గొంతు మంట సర్వసాధారణం. అడ్డ పోగులు తరచుగా తెగేవి. అప్పుడు పనివాడు పోగుని కండె బెజ్జం గుండా నోటితో లాగేవాడు. దాంతో అతనికి పొట్ట తిప్పేది, అజీర్తి చేసేది.

## కార్మికుల యాతన

కార్మికుల కష్టాలకు కారణాలు:

- మిల్లుల్లో యజమానులు, మిల్లుల వెలపల మున్సిపాలిటీలూ చేసే ప్రయోగాలు
- తగ్గే వేతనాలు
- పనులు లేకపోవడం
- అవసరాలు గడవక పోవడం

ఇవేకాదు. దూది కరువు మొదలవగానే పనులు పోయిన కొందరు అదృష్టహీనలయిన స్త్రీలు సమాజం వెలివేయబడ్డ వాళ్ళుగా ఉన్నారు. ఇప్పుడు వాణిజ్యం తిరిగి పుంజుకుంది, పని పుష్కలంగా లభిస్తుంది. అయినప్పటికీ వాళ్ళు అలానే బతుకుతున్నారు, ఇక ముందూ అలానే బతుకుతారేమో! ఈ ప్రాంతంలో గడిచిన పాతికేళ్లలో, ఇప్పుడు ఎక్కువమంది లేత వెలయాళ్ళు ఉన్నారు– ఫాక్టరీ నివేదికలు, 1865 అక్టోబర్ 31.

## 1770–1863 కాలంలో పారిశ్రామిక దశలు

1770 - 1815 కాలంలో అంటే 45 ఏళ్లలో సంక్షోభమూ, స్తబ్ధతా ఉన్నది కేవలం 5 ఏళ్ళుమాత్రమే; అయితే అది గుత్తాధిపత్య దశ. 1815 - 1863 కాలం 48 ఏళ్ళు. ఇది రెండో దశ. అందులో 20 ఏళ్ళు పునరుజీవనమూ, 28 ఏళ్ళు మాంద్యమూ, స్తబ్ధతా. 1815–1830 కాలంలో ఐరోపా ఖండం తోనూ, సంయుక్త రాష్ట్రాలతోనూ పోటీ మొదలైంది. 1833 తర్వాత మానవజాతి విధ్వంసంద్వారా - ఇండియా చేనేత పనివాళ్ళను పూర్తిగా తుడిచిపెట్టడం ద్వారా– ఆసియా మార్కెట్ల విస్తరణ బలవంతంగా జరిగింది. ధాన్యం చట్టాలు రద్దయిన తర్వాత 1846 –1863 కాలంలో 8 ఏళ్ళు ఒక మోస్తరు ఉత్పత్తి చర్యా, వికాసమూ, కాగా 9 ఏళ్ళు మాంద్యమూ, స్తబ్ధతా.

## వికాసంలో సైతం శ్రామికుల బాధలు

వికాస సమయాల్లో సైతం పురుష వయోజన కార్మికుల పరిస్థితి బాగాలేదు అనడానికి రుజువుగా 1863 లో ఫాక్టరీ కార్మికులు చేసిన ఒక విజ్ఞప్తి ఉంది. పనుల్లేక పడివున్న ఫాక్టరీ పనివాళ్ళకి పెద్ద ఎత్తున వలసపోవడం తప్పనిసరి. దీన్నెవరూ కాదనరు. కనుక, సరైన వలస వ్యవస్థ కోసం ఒక సంఘాన్ని ఏర్పాటు చేసేందుకు విజ్ఞప్తి చేశారు. దీన్నిబట్టి పనివాళ్ళ పరిస్థితిని అంచనా వెయ్యచ్చు.

## విభాగం 8
## కార్ఖానా ఉత్పత్తిలోనూ, చేతివృత్తుల్లోనూ, గృహపరిశ్రమల్లోనూ ఆధునిక పరిశ్రమ తెచ్చిన విప్లవాత్మక మార్పులు

అప్పటికున్న చేతివృత్తుల్లో, కార్ఖానా ఉత్పత్తిలో, గృహ పరిశ్రమల్లో ఆధునిక పరిశ్రమ పెను మార్పులు తెచ్చింది. ఈ విభాగం ఆ మార్పుల గురించే. చేతివృత్తుల పైన ఆధారపడ్డ సహకారాన్నీ, చేతివృత్తి లోని శ్రమవిభజనమీద ఆధారపడ్డ కార్ఖానా సహకారాన్నీ, యంత్రాలు నిర్మూలించాయి.

### 1. చేతి వృత్తుల పైన ఆధారపడ్డ సహకారం

పంట కోసే పనివాళ్ళ మధ్య సహకారం ఉంటుంది. ఇప్పుడు ఆ సహకారం స్థానాన్ని మొక్కలు కత్తిరించే యంత్రం తీసుకుంటుంది. అంటే, అంతకుముందు కోసే వాళ్ళ మధ్య ఉండే సహకారాన్ని లేకుండా చేస్తుంది.

### 2. శ్రమ విభజనమీద ఆధారపడ్డ సహకారం

శ్రమ విభజనమీద ఆధారపడ్డ సహకారాన్ని కూడా యంత్రం లేకుండా చేస్తుంది. దీనికి సూదులు చేసే యంత్రం మంచి ఉదాహరణ. ఆడం స్మిత్ ప్రకారం సూదుల ఉత్పత్తిలో 10 మంది తలా ఒక పని పంచుకొని సహకారంతో రోజుకి 48,000 సూదులు చేస్తారు. ఇది శ్రమ విభజన మీద ఆధారపడ్డ సహకారం. యంత్రం ఈ సహకారాన్ని నిర్మూలిస్తుంది. ఒక సూదులు చేసే యంత్రం 11 గంటల పనిదినంలో 1,45,000 సూదులు చేస్తుంది. ఒక స్త్రీ అలాంటి యంత్రాలు నాలుగు నడపగలదు. ఒక బాలిక అయినా ఆ పని చెయ్యగలదు. అంటే రోజుకి 6లక్షల సూదులు, వారానికి 30లక్షల సూదులు ఒక్కతే చేస్తుందన్నమాట. పనివాళ్ళు కొంతమంది ఉంటేనే గదా సహకారం ఉండేది. ఒక్కరే ఉంటారు, కనుక యంత్రం ఈ సహకారాన్ని నిర్మూలిస్తుంది.

### ఆధునిక పరిశ్రమ చిన్న స్థాయి పరిశ్రమల్ని దెబ్బ తీస్తుంది

స్వల్పకాలమే అయినా, అక్కడక్కడ ఒక పరిశ్రమ చిన్న స్థాయిలో యాంత్రిక చోదకశక్తితో నడవవచ్చు. అలా కోవెంట్రీ సిల్క్ నేతపరిశ్రమలో కుటీర ఫాక్టరీల ప్రయోగం జరిగింది. ఇంజన్ ఉన్న భవనం చుట్టూ మగ్గాలున్న కుటీరాలుంటాయి. ఆ మగ్గాలని షాఫ్టులతో ఇంజన్ కి కలిపారు. ఒక్కో కుటీరంలో రెండు నించీ ఆరుదాకా మగ్గాలుంటాయి. వీటికీ, అసలు ఫాక్టరీలకీ మధ్య ఘర్షణ 12 ఏళ్ళకి పైగా సాగింది. 300 కుటీర ఫాక్టరీలు సర్వనాశనం కావడంతో ఘర్షణ ముగిసింది.

1820 వ సంవత్సరంలో చేతివృత్తి, గ్రోసు కలాలు 7 పౌన్ల 4 షిల్లింగులకు సప్లై చేసింది. 1830 లో కార్ఖానా ఉత్పత్తి గ్రోసు 8 షిల్లింగులకు ఇచ్చింది. ఇవ్వాళ ఫాక్టరీవ్యవస్థ వ్యాపారులకి గ్రోసు 2 పెన్నీలకీ 6 పెన్నీలకీ మధ్య అమ్ముతున్నది. 1851లో బిర్మింగ్ హాం లో గిల్లాట్ అనే

పెట్టుబడిదారుడు భారీ స్థాయిలో ఉక్కు కలాల ఫాక్టరీ పెట్టాడు. అక్కడ ఏడాదికి 18,00,00,000 కలాలు తయారవుతాయి. 120 టన్నుల ఉక్కు వాడబడుతుంది. ఇప్పుడు దానిదే గుత్తాధిపత్యం. వందల కోట్ల కలాలు ఉత్పత్తి చేస్తుంది. 1861 జనాభా లెక్కలప్రకారం అందులో పనివాళ్ళు 1428 మంది. ఆడవాళ్ళు 1268 మంది. వాళ్ళలో 5 ఏళ్ల వయసు వాళ్ళు కూడా ఉన్నారు. ఆవిధంగా ఆధునిక పరిశ్రమ ఉత్పాదకతని పెంచి, వస్తువుల్ని చౌకబరుస్తుంది. పనివాళ్ళని తగ్గిస్తుంది. చౌక శ్రమని – స్త్రీలనీ, పిల్లల్నీ – నియమిస్తుంది. చిన్న స్థాయి పరిశ్రమల్ని దెబ్బ తీస్తుంది

## కుటీర పరిశ్రమలు: పాతవీ, కొత్తవీ–తేడాలు

ఈ ఆధునిక కుటీర పరిశ్రమ అనబడేదానికీ, పాత కుటీర పరిశ్రమకీ, పేరులో తప్ప మరే పోలికా లేదు. పాతవి స్వతంత్ర మైన చేతివృత్తులు. అయితే ఆ పాతతరహా కుటీర పరిశ్రమ ఇప్పుడు ఫాక్టరీకీ , కార్ఖానాకీ, గోడౌన్ కీ వెలపల ఉండే శాఖగా మారిపోతుంది. పెట్టుబడి ఫాక్టరీలలో, కార్ఖానాల్లో, గోడౌన్ లలో భారీ స్థాయిలో ఒకేచోట కేంద్రీకృతమైన పనివాళ్ళని ప్రత్యక్ష అదుపాజ్ఞలలో నడుపుతుంది. దానితో పాటుగా, మరొక శ్రామిక సైన్యాన్ని కుటీర పరిశ్రమల్లో పరోక్షంగా నడుపుతుంది. ఈ శ్రామిక సేన దేశ మంతటా పట్టణాల్లో చెల్లాచెదరై ఉంటుంది. ఇందుకు లండన్ డెర్రీ లోని మెసర్స్. టిల్లీ షర్ట్ ఫాక్టరీ ఇందుకొక ఉదాహరణ. ఇక్కడ అసలు ఫాక్టరీలో వెయ్యిమంది పనిచేస్తారు, 9 వేల మంది దేశం అంతటా వారివారి సొంత ఇళ్ళల్లో పనిచేస్తుంటారు. అసలు ఫాక్టరీల్లో కన్నా, ఆధునిక కార్ఖానా ఉత్పత్తిలో చౌక శ్రమ శక్తి, ఎదిగీ ఎదగని (immature) శ్రమ శక్తి నిర్లజ్జగా దోపిడీ చేయబడుతుంది.

బిర్మింగ్ హామ్ లోనూ, ఆ చుట్టుపక్కలా లోహ సామాన్ల (hardware) కార్ఖానాలున్నాయి. వాటిలో 30 వేలమంది బాలురూ, యువకులూ, 10 వేలమంది స్త్రీలూ భారమైన పనులు చేస్తున్నారు. ఇత్తడి ఫౌండరీలలో, గుండీ ఫాక్టరీల్లో, ఎనామిల్ పూతపూసే, తుప్పుపట్టకుండా జింక్ పూత పూసే, వార్నిష్ పూసే కార్ఖానాల్లో పనిచేస్తారు. తలకు మించిన పని చేయిస్తున్నందువల్ల పార్తాపత్రికలూ, పుస్తకాలూ అచ్చువేసే ఇళ్ళకి 'కబేళాలు' అనే పేరొచ్చింది. సిల్క్ నేసే మగ్గాలు చేత్తో తిప్పేచోట **పిల్లల చేత చచ్చేంత పని చేయిస్తారు.**

ఇక గుడ్డ పేలికల్ని వేరుచేసే పని అసహ్యమైనది, అవమానపరిచేది. హీనమైన కూలి వచ్చేది. ఈ పనిలో ఇంగ్లండ్‌దే అగ్రతాంబూలం. ఈ వాణిజ్యంలో ప్రపంచ కేంద్రం. అనేక దేశాలనుంచీ పేలికలు వస్తాయి. వీటిని రకాల వారీగా వేరుచేస్తారు. వాటిని ఎరువుల్లో వాడతారు. వాటితో బొంతలు కుడతారు. కాగితం తయారీలో వాడతారు.

ఈ పనివారికి మసూచి వ్యాధి సోకుతున్నది. వీరి ద్వారా ఇతరులకు వ్యాపిస్తున్నది. మసూచి ఒక్కటే కాదు ఇతర అంటువ్యాధులుకూడా. మితం లేని, కష్టమైన, అనుచితమైన పనికి ఉదాహరణ గనులలో పని. బంగాళా పెంకుల పని, ఇటుకబట్టీల పని. ఇటుకల్నీ, పెంకుల్నీ ఆరబెట్టే పని ఉదయం 4 గంటలనుంచీ రాత్రి 9 గంటలదాకా సాగుతుంది. నాలుగేళ్ల పిల్లలుకూడా ఈ పనిలో ఉంటారు. పని కష్టమైనది. ఎండ నీరసం కల్గిస్తుంది. మోస్లే లో ఒక

24 ఏళ్ల యువతి రోజుకి 2000 పెంకులు చేస్తుంది. ఆమెకు ఇద్దరు పిల్లలు మట్టి మోసుకొచ్చి ఇస్తారు. పెంకులను పేరుస్తారు. వాళ్ళు 10 టన్నుల మట్టి మోస్తారు. అదీ 30 అడుగుల లోతున్న బంకమట్టి గుంతల నించీ, జారే దారిగుండా పైకి తెస్తారు. అక్కడ నుంచీ 210 అడుగులు మోస్తారు. ఈ పనిచేసే పిల్లలు బూతులు మాట్లాడతారు. పోకిరీలవుతారు. అరాచకంగా తయారవుతారు. మగవాళ్ళతో కలిసి సారా కొట్లకు పోతారు. నైతికంగా పతనం చెందుతారు. విచ్చలవిడిగా ప్రవర్తిస్తారు. ఇందుకు కారణం ఈవ్యవస్థ చిన్నతనం నించీ అలాంటి పనిచేయించడమే.

## కార్మికుల ఆరోగ్యం మీద ప్రభావం

కార్మికుల ఆరోగ్యం మీద పనిగదుల దుష్ప్రభావం గురించి వేరే చెప్పక్కర్లేదు. భారమైన పనివల్లా, పారిశుధ్య లేమి వల్లా కార్మికుల జీవితం చిత్రహింసగా ఉంది. ఆయుష్షు తగ్గి ముందుగానే మరణిస్తున్నారు. రుజువుగా డాక్టర్ సైమన్ ఇచ్చిన పట్టికను చూడమంటాడు మార్క్స్.

## ఆధునిక గృహ పరిశ్రమ

ఆధునిక యంత్ర పరిశ్రమ నేపధ్యంలో ఆధునిక గృహ పరిశ్రమలో దారుణ పరిస్థితుల గురించి తెలుసుకోవాలంటే, యంత్రాలతో కాకుండా, సుత్తితో చేసే చీలల ఉత్పత్తిని చూడవలసిందే. ఇది ఇంగ్లండ్ లో కొన్ని మారుమూల గ్రామాల్లో సాగుతున్నది. అయితే లేస్ అల్లకంనుంచీ, చొప్ప/దంటుతో అల్లకం (straw-plaiting) పరిశ్రమల నుంచి ఉదాహరణలు చూస్తే ఇప్పటికి సరి పోతుంది. ఈ పనులు ఇంకా యంత్రాలతో జరగడం లేదు. ఫాక్టరీల్లోనూ, కార్ఖానాల్లోనూ తయారవుతున్న వాటితో పోటీ పడడం లేదు.

ఇంగ్లండ్ లేసు ఉత్పత్తిలో ఉన్న 1,50,000 మందిలో 10,000 మంది మాత్రమే 1861ఫాక్టరీ చట్టం కిందికి వస్తారు. మిగిలిన 1,40,000 మంది దాదాపుగా స్త్రీలే. ట్రూమన్ తయారుచేసిన పట్టికను బట్టి క్షయ రోగుల సంఖ్య 1852 నుండీ క్రమంగా పెరుగుతూ వచ్చింది. లేస్ ఉత్పత్తిలో యంత్రాల పనిని 1861 ఫాక్టరీ చట్టం కొంత పరిమితం చేసింది. కార్ఖానాల్లోనూ, గోడౌన్లలోనూ చేసే వాళ్ళు కాకుండా, ఇళ్ళ దగ్గర పనిచేసే పద్ధతి కూడా ఉంటుంది. వాళ్ళకి సంబంధించిన శాఖల్లో, రెండు విభాగా లున్నాయి:

1. తుది మెరుగులు దిద్దడం 2. సరి చెయ్యడం

మెరుగులు దిద్దే పనిలో కొన్ని ఉప విభాగాలు ఉంటాయి. ఈ పనులు యజమాను రాళ్ళ ఇళ్ళల్లో గానీ, పనివాళ్ళ ఇళ్ళలో గానీ జరుగుతాయి. యజమానురాళ్ళు కూడా పేదవాళ్ళే. వాళ్ళు కార్ఖానాదారుల నించో , గోడౌన్ల నుంచో ఆర్డర్లు తీసుకుంటారు. గదుల సైజుని బట్టి వీలైనంత మంది స్త్రీలనూ పిల్లలనూ నియమించుకుంటారు. పిల్లల సగటు వయస్సు ఆరేళ్ళు. అయిదేళ్ళ లోపు వాళ్ళు కూడా ఉంటారు. మామూలుగా ఉదయం 8 నుంచీ రాత్రి 8 గంటల దాకా పని. అయితే పని ఎక్కువగా ఉన్నప్పుడు ఉదయం 6 నుంచీ రాత్రి 10, 11, 12 గంటల దాకా చెయ్యాలి. తినేదానికి ఒక టైం అంటూ ఉండదు. అదీ మలినమైన గదుల్లో తినాలి.

గాస్ లైట్లు ఆక్సిజన్‌ని లాక్కుంటాయి. నాటింగ్ హామ్‌లో చిన్న చిన్న గదుల్లో ఒకరినొకరు రాసుకుంటూ పనిచేస్తుంటారు. వేళ్ళకు విశ్రాంతి ఇవ్వడంగానీ, వేగం తగ్గించడంగానీ ఎప్పుడో ఒకసారి అరుదుగా ఉండదు. ఏదైనా ప్రశ్న వచ్చినా కళ్ళెత్తి చూడరు. క్షణమైనా వృధా అవుతుందనే భయం. పనిమీదే ధ్యాసంతా. ఏకాగ్రతతో ఉంటారు.

పని గంటలు పొడిగించే కొద్దీ, వాళ్లకి చురుకు కలిగే దానికి యజమానురాలు బెత్తం ఆడిస్తుంది. పనయ్యేసరికి విసుగు, అలుపు పుట్టి నీరసంగా ఉంటారు. వాళ్ళు చేసే పని బానిసత్వం వంటిది. ఇక ఇళ్ళల్లో స్త్రీలూ, వాళ్ళ పిల్లలూ చేసే పని పరిస్థితులు ఇంతకన్నా అధ్వాన్నంగా ఉంటాయి.

హెర్ట్ ఫోర్డ్ షైర్ లో, ఎస్సెక్స్ లో చొప్ప అల్లకం, చొప్ప టోపీల తయారీ ఉంది. 1861 లో ఆ పనిలో 40,043 మంది ఉన్నారు. 3,815 మంది పురుషులు. మిగిలిన వాళ్ళు స్త్రీలు. 14,913 మంది 20 ఏళ్ల లోపువాళ్ళు. వాళ్ళలో 7,000 పిల్లలు. నాలుగేళ్ళే పని నేరుస్తారు. చదువంటూ ఉండదు. రాత్రి 10, 11, 12 అయ్యేదాకా పని. దంటు పోచలు తడిచేయ్యడానికి నోట్లో పెట్టుకుంటున్నందువల్ల నోళ్ళూ, వేళ్ళూ గాయపడతాయి. ఒక్కొక్కళ్ళ పనిచోటు 22 ఘనపుటడుగుల కన్నా తక్కువ. అటువంటి పరిస్థితుల్లో 12, 14 ఏళ్ళు వచ్చేదాకా బతుకు గడుపు తారు. వారి తండ్రులు ఆర్తాకలితో దీనస్థితిలో ఉంటారు. పిల్లలనించి వీలైనంత పొందాలనుకుంటారు. అంతకు మించి ఏమీలేదు. ఆ పిల్లలు పెరిగి పెద్దవగానే తల్లి దండ్రుల్ని వదిలి వెళ్ళిపోతారు. తల్లిదండ్రుల్ని ఏమాత్రం లెక్క చెయ్యరు, పట్టించుకోరు. ఇది సహజమయినదే. ఆవిధంగా పెరిగిన వాళ్లకు నైతికత అడుగంటి ఉంటుంది. అనేకమంది స్త్రీలకి అక్రమసంతానం ఉంది. చిన్న వయసు వాళ్లకు కూడా. చెప్పిన పరిశ్రమల్లో కూలి అతి తక్కువ. పని ఎక్కువ. విసిగించే ఒకే రకమైన పని. రోగాలు తెచ్చే అపరిశుభ్రత. ఆధునిక గృహపరిశ్రమల్లోనూ పనివాళ్ళ స్థితిగతులు దారుణంగా ఉంటాయి.

## ఆధునిక కార్ఖానా ఉత్పత్తీ, గృహపరిశ్రమా ఆధునిక యంత్ర పరిశ్రమగా మారడం

### ఫాక్టరీ చట్టాలు వర్తింపచెయ్యడం ద్వారా ఈ విప్లవాన్ని వేగవంతం చెయ్యడం

స్త్రీల, పిల్లల శ్రమని దుర్వినియోగం చేయడం వల్లా, పనిచెయ్యడానికి తగిన పరిస్థితుల్ని లేకుండా చెయ్యడం వల్లా, అమిత శ్రమ వల్లా, రాత్రిపని వల్లా, శ్రమ శక్తిని చౌకబరచడానికి అధిగమించరాని అవరోధాలు ఏర్పడతాయి. ఈపద్ధతులమీద ఆధారపడ్డప్పుడు, సరుకులు చౌక బరచడానికీ, పెట్టుబడిదారీ దోపిడీకీ ఆటంకాలు ఏర్పడతాయి. ఇందుకు చాలా సంవత్సరాల కాలం పడుతుంది. అయితే అటువంటి పరిస్థితులు ఏర్పడగానే, ఆధునిక కార్ఖానాలూ, గృహపరిశ్రమలూ ఆధునిక యంత్రపరిశ్రమలుగా పరివర్తన చెందే సమయం ఆసన్నమైనట్లు.

ఇందుకు ఉదాహరణ దుస్తుల ఉత్పత్తి. చొప్ప టోపీలు చేసేవారూ, మామూలు టోపీలు చేసే వాళ్ళూ, టైలర్లూ, గ్లవ్సనీ, షర్టులనీ, నెక్ టైలనీ తయారు చేసే వాళ్ళూ, బూట్లు కుట్టేవాళ్ళూ ఈ పరిశ్రమ కిందికొస్తారు. 1860 లో ఇంగ్లండ్‌లోనూ, వేల్స్‌లోనూ ఈ పరిశ్రమలో ఉన్న స్త్రీలు 5,86,299 మంది. వారిలో 1,15,242 మంది 20 ఏళ్ల లోపు వాళ్ళు. 1861 లో

10,24,277 మంది ఉన్నారు. వ్యవసాయంలోనూ, పశు పోషణలోనూ ఉన్నంతమంది ఉన్నారన్నమాట. కట్టుకునే బట్టల్లో కొంతభాగం కార్ఖానాల్లో ఉత్పత్తవుతుంది. అలాగే సన్నకారు చేతివృత్తుల్లోనూ కొంత తయారవుతుంది. వీళ్ళు తయారుచేసేది మునుపటిలాగా విడివిడి వినియోగదారుల కోసం కాదు, కార్ఖానాలకోసం, గోడౌన్ల కోసం. ఈ పని పెద్ద ఎత్తునే జరుగుతుంది. గృహ పరిశ్రమల్లో కూడా భారీగానే వీటి ఉత్పత్తి సాగుతుంది.

వీటికి ముడిపదార్థాల్ని యంత్ర పరిశ్రమ అందిస్తుంది. యంత్రాలూ, అభివృద్ధయిన వ్యవసాయమూ తొలిగించిన కార్మికుల నుంచి చౌక పనివాళ్ళు దొరుకుతారు. పెరిగే డిమాండ్ ని తీర్చడానికి రెడీగా ఉండే పనిలేని వాళ్ళు  పెట్టుబడికి అవసరం. ఈ అవసరమే ఈ తరహా ఉత్పత్తులకు ముఖ్య  కారణం. అదనపు విలువ ఎక్కువగా రావడానికీ, సరుకులు అంతకంతకూ చౌక పడడానికీ కారణాలు: వేతనాలు అతి కీతాగా ఉండడమూ, మనిషి శరీరం భరించగలిగినంత మేరకు పనిదినాన్ని పొడిగిస్తూ పోవడమూ. శ్రమ చౌకబడుతూ  ఉండడమే నిరంతరం మార్కెట్లు, ప్రత్యేకించి ఇంగ్లిష్ వలస మార్కెట్లు విస్తరిస్తుండడానికి కారణం. అయితే చివరకు కీలక సమయం (critical point) వచ్చింది. విస్తరిస్తున్న మార్కెట్లకూ, పెట్టుబడిదారులమధ్య సాగుతున్న పోటీకీ పాశవికంగా పనిచేయించుకునే పాత విధానపు ప్రాతిపదిక  సరిపోలేదు. యంత్రాలు పెట్టాల్సిన సమయం వచ్చింది. ఈ ఉత్పత్తి రంగంలోని – దుస్తుల తయారీ, దర్జీపనీ, బూట్ల తయారీ కుట్టుపనీ, టోపీల తయారీ వగయిరా – ఒకే స్థాయిలో దాడి చేసిన యంత్రం కుట్టు మిషన్. ఇది నిర్ణయాత్మకమైన యంత్రం, విప్లవకరమైన యంత్రం.

## శ్రమ జీవులమీద కుట్టు మిషన్ ప్రభావం

గృహపరిశ్రమలోని పనివాళ్ళలో అనేకమంది పేదల్లో కెల్లా పేదలు. వాళ్ళ వేతానాలతో పోలిస్తే, యంత్రాలతో పనిచేసే వాళ్ళ వేతనాలు ఎక్కువ. యంత్రంతో పోటీ పడే మెరుగైన చేతివృత్తి పనివాళ్ళ వేతనం తగ్గుతుంది. యంత్ర కార్మికులంతా బాలికలూ, యువతులూ. వాళ్ళు, యాంత్రిక శక్తి సహాయంతో, బరువుపనులకు పురుషులకుండే గుత్తాధిపత్యాన్ని నిర్మూలిస్తారు. మరీ ముసలి మహిళల్నీ, మరీ చిన్న పిల్లల్నీ బయటకు పంపుతారు. తిరుగులేని పోటీ, శరీరశ్రమ చేసే వాళ్ళలో బలహీనుల్ని తొక్కి వేస్తుంది. ఇంగ్లండ్ లో పస్తులతో చనిపోయిన వాళ్ళ సంఖ్య కుట్టు మిషన్ విస్తరణకి అనుగుణంగా గత పదేళ్ళలో పెరుగుతూ వచ్చింది. ఈ కొత్త మహిళా కార్మికులు పాత వ్యవస్థలో చేసినన్ని గంటలు చెయ్యరు గాని, ఎక్కువ గంటలే పనిచేస్తారు. కాబట్టి వాళ్ళ పని ఆరోగ్యకరమైనది కాదు. ఎక్కువమంది పనివాళ్ళున్న ఇరుకు గదుల్లో ఉండే కుట్టుమిషన్లు అనారోగ్యాన్ని అధికం చేస్తాయి.

ఎత్తు తక్కువ గదులు. 30. 40 మంది మిషన్లతో కుదుతుంటారు. భరించరాని సెగ ఉంటుంది. ఈ సెగకి  ఇస్త్రీ పెట్టెలని వేడిచేయ్యడం కోసం గాస్ స్టవ్ లు కొంత కారణం. ఉదయం 8 నించీ సాయంత్రం 6 గంటలవరకూ, తగుమాత్రం పని జరిగే చోట కూడా రోజుకి ముగ్గురో, నలుగురో స్పృహ కోల్పోతుంటారు – అని ఒక నివేదికలో లార్డ్ రాశాడు.

## సన్నకారు ఉత్పత్తిదారులు

యంత్రాలు ఒక వ్యవస్థగా ఏర్పడేదాకా, చేతివృత్తిదారులూ, గృహపరిశ్రమలు నడిపేవారూ కూడా యంత్రాలని కొద్ది సంఖ్యలో పెట్టి ఉత్పత్తి చేసే అవకాశం ఉంటుంది. పెట్టుబడి నిరంతరం పెరుగుతున్నందువల్ల, మార్కెట్లు సరుకులతో నిండిపోతాయి. ఇక తమ మిషన్లు అమ్ముకోవాలని చిన్న ఉత్పత్తిదారులకు అది హెచ్చరిక. అసలు కుట్టు మిషన్ల ఉత్పత్తే అమితంగా ఉన్నందువల్ల, వాటి ఉత్పత్తిదారులు అమ్ముకోలేక, అద్దెల కిస్తుంటారు. పోటీలో సన్నకారు ఉత్పత్తిదారులు అణిగి పోతారు.

యంత్రాల నిర్మాణంలో ఎప్పటికప్పుడు మార్పులొస్తుంటాయి. అంతకంతకూ చౌకపడుతుంటాయి. పాత యంత్రాల విలువ రోజురోజుకీ తరిగిపోతూ ఉంటుంది. కనుక వాటిని పెద్ద పెట్టుబడి దారులకు కారుచౌకగా అమ్ముకుంటారు. వాళ్ళు వాటిని లాభదాయకంగా వినియోగించుకో గలుగుతారు. చోదకశక్తిగా మనిషి స్థానంలో ఆవిరి యంత్రం రావడంతో వాళ్ళకి చివరిదెబ్బ తగిలింది.

## ఉత్పత్తిసాధనాల కేంద్రీకరణా – కార్మికుల సమీకరణా

ఒకపక్క, పెద్దపెద్ద కార్ఖానాల్లో పలు యంత్రాల కేంద్రీకరణ ఆవిరిశక్తి వాడకానికి దారితీసింది. దుస్తుల ఉత్పత్తిలోనే కాదు, ఇతర ఉత్పత్తుల్లోనూ కార్ఖానా ఉత్పత్తీ, చేతివృత్తి ఉత్పత్తీ, గృహపరిశ్రమ ఉత్పత్తీ, ఫాక్టరీ వ్యవస్థలోకి మారిపోతున్నాయి. స్త్రీలూ, యువతీ యువకులూ, పిల్లలూ పనిచేస్తున్న అన్ని పరిశ్రమలకూ విస్తరిస్తున్న ఫాక్టరీ చట్టాలు ఈ పారిశ్రామిక విప్లవానికి సహకరిస్తున్నాయి. పనిమొదలు, ముగింపు, విరామం – వీటి నియంత్రణ, ఒక వయసు లోపలి పిల్లల నియామకం నిషేధం, కారణంగా మరిన్ని యంత్రాలు పెట్టాల్సొచ్చింది. కండబలం బదులు ఆవిరియంత్రాల్ని వినియోగించవలసి వచ్చింది. మరొక పక్క, పనిగంటలు తగ్గినందువల్ల, ఏర్పడేనష్టాన్ని పూడ్చుకోడానికి బానలూ, బట్టీలూ వంటి ఉమ్మడిగా వాడుకునే ఉత్పత్తిసాధనాల విస్తరణ జరుగుతుంది. అంటే ఉత్పత్తిసాధనాల కేంద్రీకరణా, దానికి తగ్గట్లుగా, కార్మికుల సమీకరణా జరుగుతాయి..

## ఫాక్టరీ చట్టాలకు యజమానుల వ్యతిరేకత

యజమానులు ఫాక్టరీ చట్టాల్ని వ్యతిరేకిస్తూ ఒక అభ్యంతరం చెబుతారు. ఏమంటే ఇంతకు ముందు స్థాయిలో ఉత్పత్తి చెయ్యాలంటే పెట్టుబడి మరింత కావాలనేదే వాళ్ళ వాదం. అయితే పనిదినానికీ, పిల్లల నియామకానికీ పెట్టే పరిమితులు పాత తరహా ఉత్పత్తి సంస్థల్ని పూర్తిగా దెబ్బతీస్తాయి.

ఫాక్టరీ చట్టాల్ని వ్యతిరేకిస్తూ మట్టిపాత్రల కార్ఖానాదారులు పెట్టినంత గగ్గోలు మరెవ్వరూ పెట్టలేదు. అయినా 1864లో ఈ పరిశ్రమ ఫాక్టరీ చట్టం కిందికొచ్చింది.. ఈ చట్టం కారణంగా మెరుగైన పద్ధతి వచ్చింది. ఆరబెట్టడానికి ప్రత్యామ్నాయంగా ఒత్తిడి (pressure)పద్ధతి ఏర్పడింది. పచ్చిగా ఉన్న పాత్రల్ని ఆరబెట్టడానికి, కొత్తగా ఇనుప కుంపట్లు నిర్మించబడ్డాయి. ఈ రెండు

అంశాలూ ఈ పరిశ్రమలో ఎంతో ప్రాముఖ్యత కలవి. ఇవి తెచ్చినంత పురోగతితో పోటీ పడగలవి గత శతాబ్దంలోనే లేవు. ఇవి ఇంధనాన్ని ఆదా చేశాయి కూడా. పాత్రలు వేగంగా ఆరిపోయేట్లు చేశాయి.

మట్టిపాత్రల ఉత్పత్తి ధరలు పెరుగుతాయని చెప్పిన జోస్యాలు నిజం కాలేదు. అవి పెరగలేదు. కాని ఉత్పత్తి బాగా పెరిగింది. 1865 సంవత్సరం మొత్తంలో మునుపటి మూడేళ్ళ సగటు ఎగుమతి విలువని 1,38,628 పౌన్లు మించిపోయింది.

అగ్గిపుల్లల ఉత్పత్తిలో పిల్లలు అన్నం తినేటప్పుడు కూడా పుల్లల్ని కరిగిన భాస్వరంలో ముంచుతూ ఉండాల్సిందే, ముఖాలకి ఆవిర్లు కొడుతున్నా చెయ్యాల్సిందే – ఇది అనివార్యమైన అవసరం అనుకునేవాళ్లు. 1864 చట్టం ప్రకారం తినేటప్పుడు పని చేయించకూడదు. కాబట్టి సమయాన్ని పొదుపు చెయ్యాల్సి వచ్చింది. ఆ అవసరం వల్ల పుల్లల్ని భాస్వర ద్రవంలో ముంచే యంత్రం తయారయింది. ఇప్పుడిక పిల్లలకు ఆవిర్లు తగలనే తగలవు.

రకరకాల లేసుల్ని ఆరబెట్టేందుకు రకరకాల సమయాలు పడతాయనీ, అందువల్ల అన్నానికి ఒకే సమయం ఇవ్వడం వీలవదనీ యజమానులు వాదించారు. తగిన జాగ్రత్తలు తీసుకుంటే సాధ్యమేనని కమిషన్ సాక్ష్యాధారాలతో తేల్చింది. అమలుకు 18 నెలల వ్యవధి ఇచ్చింది. చట్టం అయ్యీ కాగానే, యజమానులు ఫాక్టరీ చట్టాలవల్ల తమకు ఇబ్బందులేవీ కలగలేదన్నారు. అదే కాలంలో ఇంకా ఎక్కువ కూడా ఉత్పత్తి చేస్తున్నాం అనికూడా చెప్పారు. వ్యాపారానికి ఆటంకాలని వ్యాపారులు చెప్పేవన్నీ మోసాలని ఫాక్టరీ ఇన్ స్పెక్టర్లు నిర్ధారించారు.

ఆ విధంగా కార్ఖానాఉత్పత్తి వ్యవస్థ ఫాక్టరీ వ్యవస్థలోకి మారడానికి అవసరమైన భౌతిక అంశాల్ని ఫాక్టరీ చట్టాలు పక్వానికి తెస్తుంటాయి. అయినప్పటికీ, అదే సమయంలో వాటి మూలంగా ఎక్కువ పెట్టుబడి పెట్టాల్సిన అవసరం అనివార్యం అవుతుంది. అంత పెట్టుబడి పెట్టలేని సన్నకారు యజమానులు క్షీణిస్తారు. పెట్టుబడి సాంద్రీకరణ వేగవంతం అవుతుంది.

# విభాగం 9

# ఫాక్టరీ చట్టాలూ – ఇంగ్లండ్‌లో వాటి సాధారణ విస్తరణా

# ఫాక్టరీ చట్టాల్లో పరిశుభ్రతకీ, విద్యకీ సంబంధించిన నిబంధనలూ ఇంగ్లండ్ లో వాటి సాధారణ విస్తరణా

## ఫాక్టరీ చట్టాల ఆవశ్యకతా – పెట్టుబడిదారుల వ్యతిరేకతా

ఫాక్టరీ చట్టాలు ఆధునిక పరిశ్రమ ఫలితంగా వచ్చాయి. క్రమంగా విస్తరించాయి. ఇంగ్లండ్ లో ఈ చట్టాలు ఎలా విస్తరించాయో చూసే ముందు, పనిగంటలకు సంబంధించిన అంశాల్ని కాకుండా, తక్కిన వాటిలో కొన్ని అంశాల్ని గమనిద్దాం.

చట్టాల్లో ఉన్న పదాల మూలంగా పెట్టుబడిదారుడు వాటినించి తేలిగ్గా తప్పించుకోగలడు. దాన్నలా ఉంచినా, పరిశుభ్రతకి సంబంధించిన నిబంధనలు అతి కొద్ది. అవి గోడలకి సున్నం వెయ్యడం, గాలీ వెలుతురూ ఉండేట్లు చూడడం వంటివి. యంత్ర ప్రమాదాల నుంచి రక్షణకు సంబంధించిన నిబంధనలు. తమ పనివాళ్ళ అవయవాల రక్షణకి కొన్ని సాధనాలు పెట్టాలి. వాటికి పెట్టుబడి దారులు పెట్టాల్సిన ఖర్చు స్వల్పం. అయినా ఆ మాత్రం ఖర్చు పెట్టడమే, వాళ్లకి ఇష్టం ఉండదు. యజమానులు ఈ నిబంధనల్ని తీవ్రంగా వ్యతిరేకించారు. అందువల్ల పార్లమెంటు చట్టాలు చెయ్యాల్సిన ఆవశ్యకత ఏర్పడింది.

ప్రతి పనివానికీ 500 ఘనపుటడుగుల స్థలం ఉండాలని డాక్టర్ల ఏకగ్రీవ అభిప్రాయం. అయితే అంత స్థలం ఉండాలని చట్టంలో పెడితే, ఒక్క దెబ్బతో సన్నకారు యజమానుల ఆస్తులు నేరుగా హరించబడతాయి. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానపు మూలానికే – అంటే శ్రమ శక్తిని స్వేచ్ఛగా కొనడం, వినియోగించడం ద్వారా జరిగే పెట్టుబడి స్వయం విస్తరణకే– దెబ్బపడుతుంది. కాబట్టి ఈ 500 ఘనపుటడుగుల స్థలానికి సంబంధించిన నిబంధన ప్రతిష్టంభనలో పడింది. అయినా పిల్లల్ని నియమించడానికి వాళ్ళకి ప్రాథమికవిద్య అందిచడం తప్పనిసరి షరతు.

## ఒకపూట చదువూ– ఒకపూట పనీ

చదువునీ, పనినీ కలపడమే ఈ నిబంధనల సార్ధకత. చదువు ఒక్కటే పనిగా ఉన్న విద్యార్థులు నేర్చుకున్నంత వీళ్ళూ నేర్చుకుంటున్నారనీ, తరచూ ఎక్కువ కూడా నేరుస్తున్నారనీ ఉపాధ్యాయులు చెప్పినట్లు ఇన్స్పెక్టర్లు రాశారు. సగం కాలం చదవడం, సగం కాలం పనిచేయడం. ఒకేమైన పని చెయ్యడం కన్నా ఒకపూట చదవడం, ఇంకోపూట పనిచెయ్యడం పిల్లవాడి స్వభావానికి అనువుగా ఉంటుంది. రాబర్ట్ ఓవెన్ చూపినట్లు ఇలా రెంటినీ కలిపి, భవిష్యత్ విద్యకి బీజం వేసింది ఫాక్టరీ వ్యవస్థే.

## కొత్త ప్రాతిపదికన శ్రమ విభజన

ఆధునిక ఫాక్టరీల్లోనూ, కార్ఖానా ఉత్పత్తిలోనూ నియమితులైన పిల్లలలో ఎక్కువమంది చిన్నతనం నించీ చిన్నచిన్న పనులే చేస్తూ దోపిడీకి గురవుతారు. వాళ్లకి భవిష్యత్తులో కనీసం అదే చోటనయినా ఉపయోగపడే ఏ ఒక్క పనీ నేర్పించరు. ఉదాహరణకి పాత ఇంగ్లిష్ అచ్చు పని వృత్తిలో నేర్చుకునే వాళ్ళు తేలిక పనినించి, కష్టమైన పనినేర్పి ప్రోత్సహించే పద్ధతి ఉండేది. పూర్తి ముద్రణ పని వచ్చేదాకా అక్కడే శిక్షణ జరిగేది. వాళ్ళకందరికీ చదవడం, రాయడం రావాలి. ఇది వారి వృత్తికి అవసరం. అయితే అచ్చు యంత్రం రాగానే ఇదంతా మారిపోయింది. ఇప్పుడు రెండు రకాల పనివాళ్ళని పెట్టుకుంటున్నది:

1. పెద్దవాళ్ళు – అక్షరాలు కూర్చిన చట్రాల్ని యంత్రంలో పెడతారు
2. 11–17 ఏళ్ల పిల్లలు యంత్రం అడుగున కాగితాలు పరుస్తారు, లేదా అచ్చయిన కాగితాల్ని దాన్నించి తీస్తారు

విసుగు పుట్టించే ఈపని లండన్లో 14,15,16 గంటలు ఏకబిగిన చేస్తారు. తరచూ 36 గంటలుకూడా చేస్తారు. మధ్యలో తినడానికీ, విశ్రాంతికీ రెండుగంటలు విరామం ఉంటుంది, అంతే. వాళ్ళలో చాలామందికి చదవడం రాదు. సాధారణంగా వాళ్ళు పూర్తిగా పశుప్రాయులు. వాళ్ళు చేసే పనికి అర్హత పొందడానికి ఎలాంటి బౌద్ధిక శిక్షణగానీ, నైపుణ్యంగానీ, విచక్షణాజ్ఞానం గానీ అక్కరలేదు. వేతనాలయితే, పిల్లలుగా ఉన్నంతకాలం కొంచెం ఎక్కువే. కాని వాళ్ళ ఎదుగుదలకి తగినట్లుగా వేతనాలు పెరగవు. ఎక్కువ వేతనం వచ్చే యంత్రనిర్వాహకుని స్థానం పొందడం అనేకమంది ఊహించనైనా లేరు. కారణం యంత్రానికి ఒక నిర్వాహకుడే ఉంటాడు. దాన్ని అంటిపెట్టుకొని ఉండే పిల్లగాళ్ళు ఇద్దరు, తరచుగా నలుగురు ఉంటారు. 17 ఏళ్ళు వచ్చీ రాగానే వాళ్ళని ముద్రణాలయాలనుంచి పంపించేస్తారు. వేరే చోట్ల ప్రయత్నించినా ప్రయోజనం కలగదు. వాళ్ళు నేరగాళ్ళలో చేరతారు. కారణం వాళ్ళ అజ్ఞానం.

## ఆధునిక పరిశ్రమ అప్పటికున్న ఏ ప్రక్రియా రూపాన్నీ, అంతిమ రూపం అనుకోదు

అందువల్ల దాని సాంకేతిక ప్రాతిపదిక విప్లవాత్మకమైనది. అంటే మార్పుని ఆహ్వానిస్తుంది. మునుపటి ఉత్పత్తి విధానాలన్నీ, సనాతన మైనవి. మార్పుని ఒప్పుకోవు. ఆధునిక పరిశ్రమ నిరంతరం మార్పుని కోరుతుంది, తెస్తుంది. సాంకేతిక ప్రాతిపదికలోనే కాదు, కార్మికుని చర్యల్లో కూడా, శ్రమ ప్రక్రియ యొక్క సామాజిక సంయోగాల్లో కూడా మార్పులు తెస్తుంది. తద్వారా అదే సమయంలో సామాజిక శ్రమ విభజనలో మార్పు తెస్తుంది. కార్మికుల్నీ, పెట్టుబడినీ ఒక ఉత్పత్తి శాఖ నుంచి మరొక ఉత్పత్తిశాఖకు పెద్ద ఎత్తున విరామం లేకుండా తరలిస్తూ ఉంటుంది. యంత్రాలద్వారా, రసాయన ప్రక్రియలద్వారా మార్పులు తెస్తుంది. పనివాని పరిస్థితిలో స్థిరత్వమూ, భద్రతా లేకుండా చేస్తుంది. అతని నుంచి శ్రమ సాధనాలను లాక్కొని, జీవనాధారాలు లేకుండా చేస్తుందని భయం, అతని పాక్షిక పనిని కూడా లేకుండా చేసి, అసలు తన అక్కరే లేకుండా చేస్తుందని భయం. ఎప్పుడు కావాలంటే అప్పుడు కార్మికులు పెట్టుబడికి అందుబాటులో ఉండేందుకు వీలుగా, పారిశ్రామిక రిజర్వ్ సైన్యం ఏర్పడడం గురించి తెలిసిందే.

ఇది ప్రతికూల పార్శ్వం (negative side)

అతను రకరకాల పనులూ చేయగలగాలి. పాక్షిక చర్య మాత్రమే జీవితాంతం చేస్తూ మనిషిలో ఒక ముక్కగా అయిపోయిన డిటైల్ కార్మికుడి స్థానంలో చాలా పనులు చేయగలిగిన శ్రామికుడు వస్తాడు. అతను ఉత్పత్తిలో ఏ మార్పునైనా ఎదుర్కోవడానికి రెడీగావున్న, సమగ్రాభివృద్ధి చెందినవాడై ఉంటాడు. అతను చేసే రకరకాల పనులు అతనికి సహజ శక్తులకీ, సముపార్జించుకున్న శక్తులకీ స్వేచ్ఛావకాశం కలిగించే పద్ధతులు మాత్రమే. అలాంటి పనివాళ్ళు ఆధునిక పరిశ్రమకి తప్పనిసరి. లేనట్లయితే, ఆ సమాజం అంతరించి తీరుతుంది.

## వృత్తి శిక్షణా పాఠశాలలు నెలకొల్పడం

ఈ విప్లవం కొసం ఇప్పటికే తొలి అడుగు పడింది. అదే వృత్తి శిక్షణా పాఠశాలలు నెలకొల్పడం. అక్కడ పనివాళ్ళ పిల్లలకు సాంకేతిక విషయాల్లో, కొంత అవగాహన కల్గిస్తారు. వివిధ శ్రమ సాధనాల్ని వాడడం నేర్పిస్తారు. అయితే, పనిని ప్రాథమిక విద్యతో కలపడం అనేది, ఈ ఫాక్టరీ చట్టం పెట్టుబడి నుండి లాగిన కొద్దిపాటి రాయితీ మాత్రమే. అయినప్పటికీ, కార్మికవర్గం అధికారం లోకి వచ్చాక (కచ్చితంగా వచ్చి తీరుతుంది) కార్మిక వర్గ పాఠశాలల్లో సరైన సాంకేతిక శిక్షణ తగినంత ఉంటుంది. ఆ శిక్షణ సిద్ధాంత పరమైనది గానూ, ఆచరణాత్మకమైనది గానూ ఉంటుంది. ఇందుకు సందేహం లేదు.

అలాగే అటువంటి అలజడుల తుది ఫలితం: పాత శ్రమ విభజన రద్దు. ఆ అలజడులు పెట్టుబడిదారీ ఉత్పత్తి రూపానికీ, ఆరూపానికి అనుగుణమైన కార్మికుల ఆర్థిక స్థాయికీ బద్ధవిరుద్ధంగా ఉంటాయి. ఇందుకూ సందేహం లేదు. అయితే, ఒకానొక ఉత్పత్తిరూపంలో అంతర్గతంగాఉన్న శతృపూరితవైరుధ్యాలు క్రమంగా అభివృద్ధి చెందుతాయి. వాటి చారిత్రక అభివృద్ధి ఒక్కటే పాత ఉత్పత్తి రూపం అంతరించి కొత్త ఉత్పత్తిరూపం అవతరించడానికి ఏకైక మార్గం.

**చేతివృత్తి విజ్ఞతకి పరాకాష్ట:** చెప్పులు కుట్టే వాణ్ణి కడదాకా చెప్పులు కుట్టేపనికే కట్టుబడి ఉండాలి అనేది. అపెలీస్ అనే గ్రీక్ పెయింటర్ తను వేసిన చిత్రాన్ని చెప్పులు కుట్టే మనిషి విమర్శించినప్పుడు అన్న మాటలవి. ఆ మాటలు ఇప్పుడు అర్థం లేనివి. ఎందుకంటే, గడియారాలు చెసే జేమ్స్ వాట్ ఆవిరి ఇంజన్ కనిపెట్టాడు. దారం తీసి కండె చుట్టే యంత్రాన్ని తయారు చేసిన ఆర్క్ రైట్ తలపని చెసే మంగలి. ఆవిరి ఓడని నిర్మించిన ఫుల్టన్ బంగారం పనిచేసే కంసాలి. అప్పటినించీ ఏపని చేసేవాడు జీవితాంతం ఆపనే చెయ్యాలి అనేది అర్థంపర్థం లేనిది అని తేలిపోయింది.

## ఫాక్టరీ చట్టాలూ – గృహ పరిశ్రమలూ

ఫాక్టరీ చట్టాలు మొదట ఫాక్టరీలకూ, కార్ఖానాలకూ మాత్రమే వర్తించేవి. గృహ పరిశ్రమల జోలికి పోలేదు. అయితే, తర్వాత్తర్వాత గృహ పరిశ్రమలకీ వర్తింపచెయ్యటం మొదలైంది. ఇక్కడకొచ్చేసరికి, తలిదండ్రుల అధికారం మీద నేరు దాడిగా చూశారు. పార్లమెంట్ చాలా కాలం గృహ పరిశ్రమలకు ఫాక్టరీ చట్టాలు వర్తింపచేసేందుకు వెనకంజ వేస్తున్నట్లు నటించింది.

అయితే, సాంప్రదాయ కుటుంబం యొక్క ఆర్థిక ప్రాతిపదికని, ఆధునిక పరిశ్రమ తలకిందు చేసింది. ఆవిధంగా వెనకటి కుటుంబ సంబంధాల్ని సడలించింది.

ఈ వాస్తవాన్ని పార్లమెంట్ ఇక గుర్తించక తప్పలేదు. పిల్లల హక్కుల్ని ప్రకటించాల్సి వచ్చింది. 1866 లో పిల్లల నియామకం గురించి కమిషన్ తుది నివేదక ఇచ్చింది. అందులో ఇలా ఉంది: బాలబాలికలకు ఇతరుల నుంచి కన్నా, తలిదండ్రులనుంచే రక్షణ అవసరం. బిడ్డల శ్రమని హద్దూ పద్దూ లేకుండా వాడుకోవడం ప్రత్యేకించి గృహశ్రమలో ఉంది. ఈ పద్ధతి కొన సాగుతుందంటే కారణం తలిదండ్రులు పిల్లలకు హానికలిగించే నిరంకుశమైన అధికారం చెలాయించడమే. పిల్లల్ని సంపాదించే యంత్రాలుగా తయారుచేసే నిరంకుశాధికారం తలిదండ్రులకు ఉండకూడదు– అని నివేదిక తేల్చి చెప్పింది.

ఏమైనప్పటికీ, పిల్లల శ్రమ విషయంలో పెట్టుబడిదారీ దోపిడీని సృష్టించింది మాత్రం తలిదండ్రుల అధికార దుర్వినియోగం కాదు. అందుకు విరుద్ధంగా పెట్టుబడిదారీ దోపిడీ పద్ధతే. పాత కుటుంబ సంబంధాలు అంతరించడం ఎంతో భయంకరమైనదిగానూ, అసహ్యకరమైనదిగానూ కనిపిస్తుంది. అయినప్పటికీ ఆధునిక పరిశ్రమ ఉత్పత్తి ప్రక్రియలో స్త్రీలకూ, యువజనులకూ, పిల్లలకూ కుటుంబానికి వెలపల ఒక ముఖ్యమైన పాత్ర కేటాయిస్తుంది. తద్వారా, కుటుంబం విషయంలోనూ, స్త్రీ పురుషులమధ్య సంబంధాల విషయంలోనూ ఇంకా ఉన్నత రూపానికి తగిన కొత్త ఆర్థిక ప్రాతిపదికని ఏర్పరుస్తుంది. పురాతనకాలపు రోమ్, గ్రీక్, ప్రాచ్య కుటుంబ రూపాల్ని పరమమైనవిగానూ, అంతిమమైనవిగానూ భావించడం ఎంతో అసంగతం. అలాగే టుటానిక్ క్రైస్తవ కుటుంబ రూపానికి ఆ లక్షణాన్ని ఆపాదించడం – అంటే ఆరూపం పరమమనీ, అంతిమమనీ అనుకోవడం – అంతే అసంగతం. పైపెచ్చు మొత్తంగా తీసుకుని చూస్తే, చారిత్రకాభివృద్ధిలో వరసగా ఉండేవి. అంతేకాదు,

శ్రామిక బృందం అనేది అన్నివయస్సుల స్త్రీలూ పురుషులూ కలిసి ఏర్పడుతుంటుంది. తగిన పరిస్థితులు వచ్చినప్పుడు అనివార్యంగా మానవాభివృద్ధికి వనరు అయి తీరాలి. అయితే, దాని పాశవిక పెట్టుబడిదారీ రూపంలో కార్మికుడు ఉన్నది పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియ కోసం, కాని ఉత్పత్తి ప్రక్రియ ఉన్నది కార్మికుని కోసంకాదు. అందువల్ల, అది అవినీతినీ, బానిసత్వాన్నీ వ్యాపింపచేసే వనరు అవుతుంది.

## ఫాక్టరీ చట్టాల్ని అన్ని రంగాలకీ వర్తింప చెయ్యడం

యంత్రాలు మొదట ప్రవేశించిన వడికే పరిశ్రమలకీ, నేసే పరిశ్రమలకీ మాత్రమే పెట్టిన చట్టాల్ని సామాజిక ఉత్పత్తి మొత్తానికీ వర్తింప చేయ్యాల్సిన అవసరం వచ్చింది. ఈ అవసరం ఆధునిక పరిశ్రమ చారిత్రకంగా అభివృద్ధి చెందిన విధానంనుంచే పుట్టుకొచ్చింది. ఆ నేపథ్యంలో, మునుపటి ఉత్పత్తి రూపాలు – చేతివృత్తి, కార్ఖానా, గృహ ఉత్పత్తి – పూర్తిగా మార్చబడ్డాయి. కార్ఖానాలు ఫాక్టరీ వ్యవస్థలోకి మారుతున్నాయి. చేతివృత్తులు కార్ఖానా ఉత్పత్తులవుతున్నాయి. అక్కడ అత్యంత అధిక స్థాయిలో పెట్టుబడిదారీ దోపిడీకి విశృంఖల స్వేచ్ఛ లభిస్తుంది.

## దీన్ని అవతలవైపుకి అనుకూలంగా తిప్పే పరిస్థితులు రెండున్నాయి:

1. పెట్టుబడి ఒక చోట శాసనాలకు లోనైతే, ఇతర చోట్ల ఆ నష్టాన్ని భర్తీ చెసుకునే ప్రయత్నం చేస్తుంది. మరింత దూకుడుగా.
2. పోటీలో షరతులకు సంబంధించి సమానత్వం ఉండాలని గగ్గోలు పెడుతుంది. అంటే, మొత్తం శ్రమదోపిడీ పైన సమానమైన, ఒకే విధమైన అదుపు ఉండాలి.

మెసర్స్ కూక్లీ అనే బ్రస్టెల్ కంపెనీ మేకులూ గొలుసులూ చేస్తుంది. యజమానులు ఫాక్టరీ చట్టాన్ని తామే వర్తింపచేశారు. అయితే తోటి కంపెనీలు అలా చెయ్యలేదు. వాటిలో పాత పద్ధతే ఉంది. అందువల్ల సాయంత్రం 6 గంటల తర్వాత ఈ కంపెనీ పనివాళ్ళని ఆ కంపెనీలు తన్నుకుపోతున్నాయి. తాము పూర్తిగా వాడుకోవాల్సిన పనివాళ్ళ శక్తిలో కొంత అవి హరించి వేస్తున్నాయి. కాబట్టి చట్టాల్ని అందరికీ సమానంగా వర్తింపచెయ్యాలి. ఇదీ వాళ్ళ వాదం.

లండన్ లో కాగితంపెట్టెలూ, సంచులూ చేసే సింప్సన్ పిల్లల నియామకం మీద కమిషన్ కి ఇలా చెప్పాడు: తన ఫాక్టరీ మూశాక కూడా, ఇతరులు పనిచేస్తూ తన ఆర్డర్లను తన్నుకు పోతున్నారేమోనని రాత్రుళ్ళు ప్రశాంతత లేకుండా పోయింది.

## పోటీ పరిస్థితులగురించి కమిషన్ అభిప్రాయం

కమిషన్ ఇలాచెప్పింది: చిన్న వాటిలో పనిగంటలకు పరిమితిలేనప్పుడు, పెద్దవాటిలో పరిమితిపెట్టడం అన్యాయమే. అలాచెయ్యడం వల్ల పోటీ పరిస్థితులు అందరికీ ఒకేరకంగా ఉండవు. పక్షపాతంతో కూడి ఉంటాయి. అంటే చిన్న కంపెనీలకు అనుకూలంగానూ, పెద్దవాటికి ప్రతికూలంగానూ ఉంటాయి. చివరి నివేదికలో 14 లక్షల మంది పిల్లల్నీ, స్త్రీలనీ చట్టం పరిధిలో పెట్టాలని ప్రతిపాదించింది. వీళ్ళలో సగం మంది చిన్న పరిశ్రమల్లోనూ, ఇంటి పనుల్లోనూ ([illegible]) ఉన్నారు. చట్టాన్ని వర్తింపజేస్తే, పనిగంటలు తగ్గుతాయి, క్రమబద్ధంగా ఉంటాయి. రాబోయే తరానికి చిన్నప్పుడే తలకు మించిన పని చేసి, శారీరకంగా దెబ్బతిని, క్షీణించకుండా రక్షణ కలుగుతుంది. కనీసం 13 ఏళ్ళు వచ్చే వరకూ పిల్లలకు చదువుకునే అవకాశం కలుగుతుంది. పరమ అజ్ఞానం అంతమౌతుంది. ఇదీ కమిషన్ అభిప్రాయం. అందువల్ల కమిషన్ చట్టాల వర్తింపుని ప్రతిపాదించింది.

**పార్లమెంటులో బిల్లులు.** కమిషన్ సిఫార్సులకి అనుగుణంగా బిల్లులు తయారు చేసినట్లు 1867 ఫిబ్రవరి 5 న టోరీ మంత్రి మండలి రాజు ఉపన్యాసంలో ప్రకటించింది. 1840 లోనే పిల్లల శ్రమగురించి కమిషన్ వచ్చింది. 1842 లో నివేదిక ఇచ్చింది. అది యజమానుల, తలిదండ్రుల దురాశ, స్వార్థం, క్రూరత్వం గురించీ, పిల్లల దైన్యం, పతనం, వినాశం గురించీ భయంకమైన చిత్రాన్ని చూపించింది అన్నాడు సీనియర్. అదంతా పాతకాలం పరిస్థితి అనుకునే అవకాశం ఉంది. కాని ఇప్పుడు కూడా అటువంటి భయంకర కృత్యాలు అంత తీవ్రంగానూ కొనసాగుతున్నాయి.

## 1862 నివేదికని పక్కకి నెట్టడం పార్లమెంట్ కి సాధ్యం కాలేదు

అయితే ఆనాడు 1842 కమిషన్ నివేదికని పట్టించుకోనట్లు, ఈనాడు 1862 కమిషన్ నివేదికని పక్కనబెట్టడం వీలుకాలేదు. కారణం పరిస్థితులు మారిపోవడమే. 1864 లో కమిషన్ నివేదికల్లో ఒక భాగాన్ని మాత్రమే విడుదల చేసింది. చేసిందో లేదో వెంటనే, మట్టి పాత్రలు, అగ్గిపుల్లలు, అలంకరణ కాగితాలు, తూటాలు, టోపీలు తయారుచేసే పనివాళ్ళకి జౌళి పరిశ్రమల్లో పనివాళ్ళకున్న చట్టాలనే వర్తింపచేశారు. 1866 లో కమిషన్ పని పూర్తయింది. ఆ నివేదికలో ఉన్నట్లు బిల్లులు పెట్టబోతున్నట్లు 1867 ఫిబ్రవరి 5న రాజు నోట మంత్రిమండలి ప్రకటించింది. 1867 ఆగష్టు 15న ఫాక్టరీ చట్టాల విస్తరణ చట్టమూ, 21 న వర్క్ షాపుల నియంత్రణ చట్టమూ పార్లమెంటు ఆమోదం పొందాయి. మొదటిది పెద్దపరిశ్రమలకూ, రెండోది చిన్న పరిశ్రమలకూ వర్తిస్తాయి.

**చట్టాల అమలే పెద్ద సమస్య.** పెద్ద సంస్థలకు వర్తించే మొదటి చట్టం అనేక కుటిల మినహాయింపుల వల్లనూ, పిరికితనంతో యజమానులతో కుదుర్చుకున్న రాజీల వల్లనూ వెనకడుకు వేసింది. ఇక రెండో చట్టం వర్క్ షాపుల నియంత్రణ చట్టంలోని వివరాలు సరిగా లేవు. పోతే దాన్ని అమలు చేసే అధికారం మునిసిపల్, స్థానిక అధికారులది. వాళ్ళు ఆ చట్టాన్ని బుట్టదాఖలు చేశారు. వాళ్ళ కిచ్చిన అధికారాన్ని 1871లో పార్లమెంటు ఫాక్టరీ ఇన్స్పెక్టర్లకు దఖలు పరిచింది. లక్ష వర్క్ షాపుల్నీ, 300 ఇటుక బట్టీల్నీ ఇన్స్పెక్టర్ల అధికారం కిందికి తెచ్చింది. కాని అప్పటికే సిబ్బంది సరిపడా లేరు. ఆ ఉన్నవాళ్ళకి 8 మంది సహాయకులను మాత్రమే ఇచ్చి పార్లమెంటు జాగ్రత్తపడింది. 1867 నాటి చట్టాల్లో కొట్టొచ్చినట్టు కనబడేదేమంటే: ఒకవైపు, పెట్టుబడిదారీ దోపిడీ అకృత్యాలకు వ్యతిరేకంగా అసాధారణమైన స్థాయిలో చర్యలు సూత్ర రీత్యా తీసుకోవాల్సిన ఆవశ్యకత పాలక వర్గాల పార్లమెంటుపైన పడింది. మరొకవైపు, చర్యల అమలులో సంకోచమూ, విముఖతా, ద్రోహబుద్ధీ ప్రదర్శించింది. ఫలితంగా చట్టాలు వస్తాయి, కాని వాటిని సక్రమంగా అమలుచేసే ఉద్దేశ్యం ఉండదు. తనిఖీ సిబ్బంది తగినంత మంది లేనందువల్ల ఫాక్టరీ చట్టం ఇప్పటికీ ఇంగ్లిష్ వర్క్ షాపుల్లో చాలా వరకూ అమలు కావడం లేదు అన్నాడు ఎంగెల్స్.

**గని పరిశ్రమ** తక్కిన వాటి వంటిది కాదు. ఇక్కడ భూస్వామి ప్రయోజనాలూ, పెట్టుబడిదారుడి ప్రయోజనాలూ చెట్టాపట్టాలేసుకొని ఉంటాయి. ఇదే మిగిలిన వాటినుండి ఈ పరిశ్రమని వేరు పరిచే లక్షణం. పార్లమెంటు 1842 గని తవ్వకం చట్టం తెచ్చింది. భూగర్భ పనులకు స్త్రీలనీ, పదేళ్ళ లోపు పిల్లలనీ పెట్టుకోకూడదు.

ఈ ఒక్క నిబంధనతోనే చట్టం సరిపెట్టుకుంది. 1860 గనుల తనిఖీ చట్టం ప్రకారం కొన్ని గంటలపాటు బడికి వెళితే తప్ప 10-12 ఏళ్ల పిల్లల్ని పనిలో పెట్టుకోకూడదు. అయితే తనిఖీ అధికారులు అతి తక్కువ మంది ఉన్నందువల్లా, వాళ్ళకున్న అధికారాలు అత్యంత అల్పంగా ఉన్నందువల్లా, ఆ చట్టం వుండికూడా లేనట్లే అనిపించింది. 1872 చట్టం లోపభూయిష్ట మైనది. అయినా గనుల్లో పనిచేసే పిల్లల పనిగంటల్ని నియంత్రించిన మొదటి చట్టం అదే.

జరిగే ప్రమాదాలకు యజమానుల్ని కొంతవరకూ బాధ్యులని చేసిన చట్టం కూడా అదే.

**చట్టాలను వ్యవసాయానికి వర్తింపచేసే ప్రయత్నాలు.** ఫాక్టరీ చట్టాలను సవరించి వ్యవసాయానికి కూడా అమలు చెయ్యాలని పలు పయత్నాలు జరిగాయి. కాని అవన్నీ పూర్తిగా విఫలమయ్యాయి. అయినా ఆ సూత్రాల్ని సర్వత్రా అన్వయింపచెయ్యాలి అనే ధోరణి మాత్రం ఉంది. ఈ వాస్తవాన్ని మన దృష్టికి తేవడం తన ఉద్దేశం అంటాడు మార్క్స్.

## ఫాక్టరీ చట్టాల్ని అన్ని పరిశ్రమలకీ విస్తరింపచెయ్యడం వల్ల ఫలితాలు

కార్మికవర్గ రక్షణ – శరీర పరంగానూ, మానసిక పరంగానూ – అనివార్యం అయింది. అయితే మరొకపక్క, వాటి విస్తరణ విడి విడిగా ఉన్న అనేక చిన్న పరిశ్రమలు, కొన్ని పెద్దస్థాయి పరిశ్రమలుగా మారడాన్ని వేగిర పరుస్తుంది; అందువల్ల అది పెట్టుబడి కేంద్రీకరణనీ, ఫాక్టరీ వ్యవస్థ యొక్క ప్రత్యేక ప్రాధాన్యతనీ వేగవంతం చేస్తుంది. పెట్టుబడి ఆధిపత్యాన్ని కొంత దాచి ఉంచుతున్న ప్రాచీన రూపాల్నీ, పరివర్తన చెందుతున్న రూపాల్నీ, ధ్వంసం చేస్తుంది. ధ్వంసంచేసి వాటి స్థానంలో ప్రత్యక్షమైన, బాహాటమైన పెట్టుబడి అధికారాన్ని స్థాపిస్తుంది; అయితే అలా చెయ్యడం ద్వారా అది (చట్టాల విస్తరణ) ఈ అధికారానికి సూటి వ్యతిరేకతని కూడా సర్వ సాధారణం చేస్తుంది. ప్రతి విడి వర్క్ షాప్ లోనూ ఏకరూపతనీ, క్రమబద్ధతనీ, నియమబద్ధతనీ, పొదుపునీ అమలు పరుస్తుంది; అదే సమయంలో, పనిదినాన్ని పరిమితపరచడం వల్లా, క్రమబద్ధం చెయ్యడం వల్లా, సాంకేతిక మెరుగుదలకు పెద్ద ప్రేరణ కలిగిస్తుంది. ఆ ప్రేరణ ద్వారా అది మొత్తంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి యొక్క అరాచకత్వాన్నీ, ఉపద్రవాల్నీ, శ్రమ తీవ్రతనీ, కార్మికునితో యంత్రాల పోటీనీ పెంచుతుంది. చిన్నచిన్న పరిశ్రమల్నీ, గృహపరిశ్రమల్నీ ధ్వంసం చెయ్యడంద్వారా 'అక్కరలేని జనాభా'కి ఆఖరి ఆశ్రయాన్ని (last resort) సైతం లేకుండా ధ్వంసం చేస్తుంది. దాంతో మొత్తం సమాజ యంత్రాంగానికి మిగిలివున్న ఏకైక రక్షణ మార్గాన్ని (safty valve) లేకుండా చేస్తుంది. భౌతిక పరిస్థితుల్నీ, సామాజిక స్థాయిలో ఉత్పత్తి ప్రక్రియల కలయికనీ, పరిపక్వం చేస్తుంది. తద్వారా పెట్టుబడిదారీ ఉత్పత్తి రూపంలో ఉన్న వైరుధ్యాల్నీ, వైషమ్యాల్నీ పక్వానికి తెస్తుంది. అలా పక్వానికి తెచ్చి, తద్వారా నూతన సమాజం రూపొందించే అంశాలతో పాటు, పాత సమాజాన్ని బద్దలుకొట్టే శక్తుల్ని కూడా సమకూరుస్తుంది.

# విభాగం 10
## ఆధునిక పరిశ్రమా – వ్యవసాయమూ

ఆధునిక పరిశ్రమ వ్యవసాయంలోనూ, వ్యవసాయ ఉత్పత్తిదారుల సంబంధాలలోనూ తెచ్చిన విప్లవంగురించి తర్వాత పరిశోధించ బడుతుంది– అంటాడు మార్క్స్. అయితే ఆవిప్లవం వల్ల అప్పుడు రాబోయే ఫలితాల్లో కొన్నింటిని ఊహించి సూచనప్రాయంగా మాత్రమే ఇక్కడ చెబుతాడు. వాటిని తర్వాత వివరిస్తాడు. ఆ ఫలితాలు ఇవే.

1. ఫాక్టరీ కార్మికులకి యంత్రాలు భౌతికంగా హాని కలిగిస్తాయి. వ్యవసాయంలో చాలావరకూ అటువంటిది ఉండదు. అయితే అవి పనివాళ్ళని తొలిగించి, వాళ్ళ స్థానాన్ని ఆక్రమిస్తాయి. ఈ చర్య ఫాక్టరీల్లోకంటే, వ్యవసాయంలో తీవ్రంగా ఉంటుంది. ఉదాహరణకి, కేంబ్రిడ్జ్ కౌంటీలోనూ, సఫోక్ కౌంటీలోనూ పోయిన 20 ఏళ్ళలో (1868 వరకూ) సాగులో కొచ్చిన భూమి విస్తీర్ణం చాలా ఎక్కువ. అదే కాలంలో గ్రామీణ జనాభా తగ్గిపోయింది – సాపేక్షంగానే కాదు, నిరపేక్షంగా కూడా.

2. పై చర్యకి శ్రామికుల ప్రతిఘటన తక్కువగా ఉంటుంది. అంటే, ఫాక్టరీల్లో ఉన్నంత ఉండదు. (దీన్ని గురించి తర్వాత అంటాడు)

3. ఆధునిక పరిశ్రమ వ్యవసాయరంగం మీద మిగతా రంగాల మీద కంటే ఎక్కువ విప్లవకర ప్రభావం చూపుతుంది. ఫలితంగా, పాత సమాజానికి రక్షా కవచం అయిన రైతుని నాశనం చేస్తుంది. రైతు స్థానంలో వేతన శ్రామికుణ్ణి పెడుతుంది. ఆ విధంగా సామాజిక మార్పులు రావాలన్న కాంక్ష గ్రామాల్లో కూడా పట్టణాల్లో ఉన్నంత స్థాయికి చేరుతుంది. వర్గ శత్రువైరుధ్యాలు కూడా అదే స్థాయిని అందుకుంటాయి.

4. హేతు విరుద్ధమైన, పాతకాలపు వ్యవసాయ పద్ధతులు పోయి, వాటి స్థానంలో శాస్త్రీయ పద్ధతులు వస్తాయి. కార్ఖానా ఉత్పత్తి పసిదశలో, దాన్నీ, వ్యవసాయాన్నీ కలిపివుంచిన పాత బంధాన్ని పెట్టుబడిదారీ ఉత్పత్తి పూర్తిగా తెంచివేస్తుంది. అయితే అదేసమయంలో, రాబోయే కాలంలో వాటి ఉన్నతమైన కలయికకి తగిన భౌతిక పరిస్థితుల్ని ఏర్పరుస్తుంది. అంటే, తాత్కాలికంగా విడిపోయి ఉన్నప్పుడు అదీ, ఇదీ రెండూ పొందిన మరింత పరిపూర్ణమైన రూపాల ప్రాతిపదిక మీద ఆరెంటి ఐక్యతకీ భౌతిక పరిస్థితుల్ని ఏర్పరుస్తుంది.

5. పెట్టుబడి దారీ ఉత్పత్తి పెద్దపెద్ద కేంద్రాలకు జనాలను చేరుస్తుంది. పట్టణ జనాభా ప్రాబల్యాన్ని అంతకంతకూ పెంచుతుంది. పెంచి, తద్వారా ఒకపక్క, సమాజపు చారిత్రకచోదక శక్తిని కేంద్రీకరిస్తుంది. మరొకపక్క, నేలకీ, మనిషికీ ఉండే పదార్థ ప్రసరణని చెదరగొడుతుంది,

చిందరవందర చేస్తుంది. అంటే, మనిషి తిండీ, గుడ్డా రూపంలో వాడుకునే నేలలో ఉండే మూలకాల్ని తిరిగి నేలకు చేరనివ్వదు. ఆ విధంగా, అది స్థిరమైన భూసారానికి అవసరమైన పరిస్థితుల్ని అతిక్రమిస్తుంది. ఈ చర్యద్వారా ఏక కాలంలో అది పట్టణ కార్మికుని ఆరోగ్యాన్నీ, పల్లె పనివాని మేధోజీవితాన్ని తీవ్రంగా దెబ్బతీస్తుంది. అయితే, పదార్థ ప్రసరణ నిర్వహణకు సహజంగా వృద్ధి చెందిన పరిస్థితుల్ని తలక్రిందులు చెస్తూనే, అది సామాజిక ఉత్పత్తిని నియంత్రించే నియమంగా, ఒక వ్యవస్థగా దాన్ని మానవజాతి పూర్తి అభివృద్ధికి సరిపడే రూపంలో తిరిగి ఏర్పరచవలసిన అవసరాన్ని కలగజేస్తుంది. కార్ఖానా ఉత్పత్తిలో లాగానే, వ్యవసాయంలోనూ పెట్టుబడి ఆధిపత్యంలో ఉత్పత్తి పరివర్తన అంటేనే అదేసమయంలో ఉత్పత్తిదారుని బలి (martyrdom) కూడా. శ్రమ సాధనం శ్రామికుణ్ణి బానిసని చెయ్యడానికీ, దోపిడీ చెయ్యడానికీ, పేదవాణ్ణి చెయ్యడానికీ ఉపయోగపడే సాధనం అవుతుంది; శ్రమ ప్రక్రియల సమ్మేళనమూ, వ్యవస్థా కార్మికుని వైయక్తిక జీవ శక్తినీ (vitality), స్వేచ్ఛాస్వాతంత్ర్యాల్నీ అణగదొక్కే వ్యవస్థగా మార్పుచెందుతుంది.

గ్రామీణ శ్రామికులు ఎక్కడెక్కడో చెల్లా చెదరై ఉందడం వల్ల వాళ్ళ ప్రతిఘటనా శక్తి విడిపోయి, తగ్గిపోతుంది .

అదే సమయంలో, పట్టణ కార్మికులు కేంద్రీకృతమై ఉన్నందువల్ల, వాళ్ళ ప్రతిఘటనా శక్తి పెరుగుతుంది. పట్టణ పరిశ్రమల్లో లాగానే, ఆధునిక వ్యవసాయంలో కూడా పెరిగిన ఉత్పదకతా, శ్రమ పరిమాణమూ శ్రమ శక్తిని వృధాచెయ్యడం వల్లా, వ్యాధిగ్రస్తం చెయ్యడం వల్లా వస్తాయి.

## పెట్టుబడిదారీ వ్యవసాయంలో పురోభివృద్ధి అంటే కార్మికుణ్ణి దోపిడీ చెయ్యడంలో వృద్ధి మాత్రమే

భూసారాన్నీ దోచుకోవడంలో వృద్ధి. భూమి సారాన్ని నిర్ణీత కాలం పాటు పెంచడంలోని ప్రగతి, ఆసారానికి ఉన్న శాశ్వత మూలాధారాల్ని నాశనం చెయ్యడంలో ప్రగతి మాత్రమే. అమెరికా లాగా, ఏదేశమైనా దాని అభివృద్ధిని ఆధునిక పరిశ్రమ పునాదిమీద మొదలుపెట్టే కొద్దీ, ఈ విధ్వంస ప్రక్రియ త్వరత్వరగా సాగుతుంది. కాబట్టి పెట్టుబడిదారీ ఉత్పత్తి సాంకేతికతనీ, సమాజ ఉత్పత్తి ప్రక్రియల సమ్మేళన స్థాయినీ అభివృద్ధి చేస్తుంది – అయితే సకల సంపదకూ వనరులైన భూమినీ కార్మికుణ్ణీ కొల్లగొట్టడం ద్వారా మాత్రమే.

# భాగం 5

## పరమ అదనపు విలువ ఉత్పత్తీ
## సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తీ

# అధ్యాయం 16
# పరమ అదనపు విలువా - సాపేక్ష అదనపు విలువా

'సాపేక్ష అదనపు విలువ భావన' అనే 12వ అధ్యాయంలో పరమ అదనపు విలువనీ, సాపేక్ష అదనపు విలువనీ నిర్వచిస్తాడు మార్క్స్. పనిదినాన్ని పొడిగించడం ద్వారా ఏర్పడే అదనపువిలువ - పరమ అదనపు విలువ. అవసర శ్రమకాలాన్ని తగ్గించడం ద్వారా ఉత్పత్తయ్యే అదనపువిలువ - సాపేక్ష అదనపు విలువ. అక్కడ రెంటినీ ఉదహరణలతో వివరిస్తాడు.

## ఉత్పాదక శ్రమ

పెట్టుబడి దారుడికోసం అదనపు విలువని ఉత్పత్తి చేసే శ్రమ ఉత్పాదక శ్రమ. అదనపు విలువని ఉత్పత్తి చేసే శ్రామికుడు మాత్రమే ఉత్పాదక శ్రామికుడు. పెట్టుబడిదారీ విధానంలో ఇదే ఉత్పాదక శ్రామికుడికి నిర్వచనం.

'శ్రమప్రక్రియా - అదనపువిలువ ఉత్పత్తి ప్రక్రియా' అనే 7 వ అధ్యాయంలో ఉత్పాదక శ్రమ గురించి క్లుప్తంగా ఉంటుంది. ఇక్కడ (16 వ అధ్యాయంలో) వివరంగా ఉంటుంది.

ఉత్పాదక శ్రమ గురించి Theories of Surplus Value ఒకటో సంపుటంలో Theories of Productive and Unproductive Labour పేరుతో 150 పేజీల చాప్టర్ వుంది. అందులో మరింత స్పష్టంగా, మరింత వివరంగా ఉంటుంది.

**పెట్టుబడిదారీ విధానంలో ఉత్పాదక శ్రమ అంటే, అదనపు విలువని ఉత్పత్తిచేసే శ్రమే**

## అదనపు విలువని ఉత్పత్తిచేసే మార్గాలు రెండు

### 1. పనిదినం పొడిగింపు - పరమ అదనపు విలువ

పనిదినం రెండు భాగాలుగా ఉంటుంది: 1.అవసర శ్రమకాలం 2.అదనపు శ్రమ కాలం. మొదటి భాగంలో ఉత్పత్తయ్యే విలువ శ్రామికుని వేతనం విలువ. ఆ తర్వాత రెండో భాగంలో ఉత్పత్తయ్యే విలువే అదనపువిలువ.

ఉదాహరణకి, వేతన పునరుత్పత్తికి 5 గంటలు పట్టిందనుకుందాం. అప్పుడు పనిదినం 8 గంటలయితే అదనపు విలువ ఉత్పత్తి చేసే కాలం 3 గంటలు. పనిదినం 10 గంటలయితే అదనపు విలువ ఉత్పత్తి చేసే కాలం 5 గంటలు. ఇలా పనిదినం పొడిగింపు ద్వారా ఏర్పడే అదనపు విలువే పరమ అదనపు విలువ. ఇది పెట్టుబడిదారీ వ్యవస్థకు సాధారణ పునాది. సాపేక్ష అదనపువిలువ ఉత్పత్తికి ఆరంభ బిందువు కూడా.

### 2. అవసర శ్రమ కాలం తగ్గింపు - సాపేక్ష అదనపువిలువ

పనిదినం 8 గంటలే ఉంటుంది. నిడివి పెరగదు. అయినా అదనపు శ్రమకాలం పొడుగవుతుంది.ఎలా? అవసర శ్రమ కాలం తగ్గడం వల్ల. ఇంతకుముందు 5 గంటలుగా ఉన్న అవసర శ్రమ కాలం ఒక గంట తగ్గి, 4 గంటలయితే, 3 గంటలుగా ఉన్న అదనపు శ్రమకాలం ఒక గంట పెరిగి 4 గంటలవుతుంది. అదనపు శ్రమని పొడిగించడానికి అవసర

శ్రమ కుదించబడుతుంది. వేతనానికి సమానమైనది తక్కువ కాలంలో ఉత్పత్తయ్యే పద్ధతులు అవలంబించడం ద్వారా. అలా ఏర్పడేది సాపేక్ష అదనపువిలువ.

### పెట్టుబడికి శ్రమ లొంగుబాటు

పెట్టుబడిదారీ ఉత్పత్తిలో పెట్టుబడికి శ్రమ లొంగుబాటు ఉంటుంది. లొంగుబాటు రెండు విధాలు:

1. లాంఛనప్రాయమైన లొంగుబాటు 2. నిజమైన లొంగుబాటు

మొదట పెట్టుబడి అప్పటికున్న శ్రమ ప్రక్రియని – అంటే, టెక్నిక్స్‌నీ, మార్కెట్లనీ ఉత్పత్తిసాధనాల్నీ, శ్రామికుల్నీ – తన వశం లోకి లాక్కుంటుంది. మొత్తం శ్రమ ప్రక్రియ అంతకు ముందు లాగే కొనసాగుతుంది. ఉన్న మార్కెట్లనే వాడుకుంటూ పెట్టుబడి సంచయనం జరుగుతుంది. పెట్టుబడిదారులు అలా శ్రమ ప్రక్రియల్ని పట్టులోకి తెచ్చుకున్నప్పుడు లాంఛన ప్రాయమైన లొంగుబాటు సంభవిస్తుంది. నిజమైన లొంగుబాటులో పెట్టుబడికి అనుకూలంగా శ్రమ ప్రక్రియ మార్చబడుతుంది. ఉదాహరణ: వేతనానికి చేత్తో నెయ్యడం లాంఛనప్రాయమైన లొంగుబాటు. ఆ తర్వాత యంత్రం ద్వారా నెయ్యడం నిజమైన లొంగుబాటు.

### లాంఛనప్రాయమైన లొంగుబాటు

పరమ అదనపు విలువ మీద ఆధారపడ్డ రూపాన్ని నేను పెట్టుబడికి శ్రమ లాంఛనప్రాయంగా లోబడడం అంటాను. ఎందుకంటే వెనకటి ఉత్పత్తి విధానాలకంటే ఇది లాంఛనప్రాయంగా మాత్రమే భిన్నమైంది; ఆ వెనకటి విధానాల పునాదుల మీద ప్రయత్నం లేకుండానే పైకి లేస్తుంది. ఇప్పటికింకా ఉత్పత్తి విధానంలో మార్పు మాత్రం లేదు. సాంకేతికత పరంగా చూస్తే, శ్రమ ప్రక్రియ వెనకటిలాగే సాగుతుంది – ఇప్పుడు శ్రమ పెట్టుబడి అధీనంలో ఉంది. ఉత్పత్తి ప్రక్రియలో రెండు ఘట్టాలు ఏర్పడతాయి:

**ఆధిపత్యం, లొంగివుండడం అనే ఆర్థిక సంబంధం.** శ్రమ శక్తి వినియోగాన్ని పెట్టుబడిదారుడు పర్యవేక్షించడం, నిర్దేశించడం.

లాంఛనప్రాయమైన లొంగుబాటు కార్ఖానా ఉత్పత్తి కాలానికి లాక్షణికమైనది. నిజమైన లొంగుబాటు ఫాక్టరీకి లాక్షణికమైనది.

### సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తి

ఒకపక్క, పరమ అదనపు విలువ ఉత్పత్తికి లాంఛనప్రాయమైన లొంగుబాటు సరిపోతుంది. అంటే ఉదాహరణకి, మునుపు తమకోసం పనిచేసిన చేతివృత్తిచేసేవాళ్ళు గానీ, ఒక యజమాని దగ్గర అప్రెంటిస్‌లుగా పనిచేసిన వాళ్ళు గానీ పెట్టుబడిదారుడి నియంత్రణకింద వేతనశ్రామికులు అవాలి. అందువల్ల మరొకపక్క, సాపేక్ష అదనపు విలువని ఉత్పత్తిచేసే పద్ధతులు, అదేసమయంలో ఎలా పరమ అదనపు విలువని ఉత్పత్తిచేసే పద్ధతులో గమనించాం. ఆంతకుమించి, పనిదినాన్ని ఎక్కువ పొడిగించడం ఆధునిక పరిశ్రమ ప్రత్యేక ఫలితం అని తేలిపోయింది.

ఈ విధానం ఒక ఉత్పత్తిశాఖ నంతటినీ పట్టుకుంటే, అప్పుడు ఆప్రత్యేక పెట్టుబడిదారీ విధానం సాపేక్ష అదనపు విలువని ఉత్పత్తిచేసే సాధనంగా ఉండదు; అన్ని ముఖ్యమైన శాఖలనీ

జయిస్తే, అది సాపేక్ష అదనపు విలువని ఉత్పత్తిచేసే సాధనంగా ఇక ఉండనే వుండదు. అదప్పుడు మామూలు, సామాజికంగా ప్రబలమైన ఉత్పత్తి విధానం అవుతుంది. అప్పటికి పెట్టుబడి పట్టులోకి రానివి కొత్తగా పట్టు లోకి వస్తేనో, పట్టులోనే వున్న పరిశ్రమల్లో ఉత్పత్తి పద్ధతుల్లో మార్పులు వస్తేనో, మరలా సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తికి అవకాశం కలుగుతుంది.

## పరమ అదనపు విలువ–సాపేక్ష అదనపు విలువల ఐక్యత

ఒక రకంగా చూస్తే, రెంటికీ తేడా లేదేమో అనిపిస్తుంది. సాపేక్ష అదనపు విలువ పరమమైనదే, ఎందుకంటే, అది పనిదినాన్ని అవసర శ్రమకాలాన్ని దాటి బలవంతంగా పొడిగిస్తుంది. పరమ అదనపు విలువ సాపేక్షమైనదే, ఎందుకంటే, అవసర శ్రమ కాలాన్ని పనిదినంలో ఒక భాగానికి పరిమితమై ఉండడానికి తగినట్లు చేస్తుంది – శ్రమ ఉత్పాదకత పెంపుని తప్పనిసరి చేస్తుంది.

## అదనపు విలువ మారంగానే తేడా తెలుస్తుంది

అదనపువిలువ స్వభావాన్ని గుర్తుంచుకుంటే, ఈ ఐక్యత అంతర్ధానమవుతుంది. పెట్టుబడిదారీ విధానం సర్వ సాధారణమై నప్పుడు, అదనపు విలువ రేటుని పెంచే సమస్య ఏర్పడినప్పుడల్లా పరమ–సాపేక్ష అదనపు విలువల మధ్య తేడా తెలుస్తుంది.

శ్రమ శక్తికి దాని విలువ చెల్లించినట్లు భావిద్దాం. అలా అనుకుంటే, మనకొక ప్రత్యామ్నాయం వస్తుంది: శ్రమ ఉత్పాదకతా, శ్రమ తీవ్రతా నిర్ణయమై ఉంటే, పనిదినాన్ని పెంచడం ద్వారా మాత్రమే అదనపువిలువని పెంచగలం. మరొకపక్క, పనిదినం నిడివి నిర్ణీతమైనప్పుడు, పనిదినంలో భాగాలైన అవసర, అదనపు శ్రమకాలాల సాపేక్ష పరిమాణాల్లో మార్పుల ద్వారా మాత్రమే అదనపు విలువ రేటుని పెంచగలుగుతాం. వేతనాలు శ్రమశక్తి విలువకన్నా తగ్గకుండా ఉండి, అదనపు విలువ పెరగాలంటే

1. ఉత్పాదకతన్నా పెరగాలి లేదా
2. శ్రమ తీవ్రతన్నా పెరగాలి.

12 వ చాప్టర్లో మార్క్స్ వాదన ఇదే.

## ఉత్పాదకతకీ, దోపిడీకీ సంబంధం

శ్రామికుడు రోజంతా తనకోసమే పనిచేసుకున్నంత కాలమూ, ఇతరుల కోసం చెయ్యడానికి టైం ఉండదు. శ్రమ ఉత్పాదకత ఒక స్థాయికి చేరాకనే, అతనికి కాళీ టైం ఉంటుంది. కాళీ టైం లేకుంటే, అదనపు శ్రమ ఉండదు. అందువల్ల, పెట్టుబడిదారులూ, బానిస యజమానులూ, భూస్వాములూ ఉండరు. ఒక్క ముక్కలో పెద్ద ఆస్థిపరవర్గం ఉండదు. ఇంగ్లిష్ ఆర్థిక రచయిత రావిన్ స్టాన్ 1789–1831) అన్నట్లు: ప్రతిమనిషి శ్రమా, తన ఆహార ఉత్పత్తికే సరిపోయే పనయితే అసలు ఆస్థే ఉండేది కాదు. కాబట్టి అదనపు విలువకి ఒక సహజ ప్రాతిపదిక ఉంది. తనకు అవసరమైన శ్రమ భారాన్ని మరొకని మీద వెయ్యకుండా నిరోధించేది ఏదీ లేదు. మనిషి మరొక మనిషిని తినకుండా సహజంగా అడ్డుకో గలిగింది లేనట్లుగానే. జంతు స్థాయినుంచి ఎదిగి, శ్రమ కొంతమేర సామాజికమయ్యాకనే ఒకరి అదనపు శ్రమ వేరొకరి ఉనికికి షరతు అయింది.

## ఉత్పాదకతా, దోపిడీ తోడుగా పరిణామం చెందాయి

నాగరికత తొలినాళ్ళలో శ్రమ సాధించిన ఉత్పాదకత అతిస్వల్పం. దాంతోపాటే నాటి కోరికలూ తక్కువే. వాటిని తీర్చే సాధనాల అభివృద్ధితోపాటు, కోరికలూ పెరుగుతాయి. అంతేగాక, అప్పట్లో ఇతరుల శ్రమ మీద బతికే వాళ్ళు, ప్రత్యక్ష ఉత్పత్తిదారులతో పోలిస్తే సమాజంలో అత్యంత అల్ప భాగం మాత్రమే. ఉత్పాదకత పెరిగేకొద్దీ, ఆ కొద్దిభాగం సాపేక్షంగానూ పెరుగుతుంది, పరమంగానూ పెరుగుతుంది.

## పెట్టుబడికి పునాదిగా ఉపకరించేది శ్రమ ఉత్పాదకత

పెట్టుబడికి పునాదిగానూ, ఆరంభ బిందువు గానూ ఉపకరించే శ్రమ ఉత్పాదకత ప్రకృతి బహుకృతి కాదు, వేల శతాబ్దాల చరిత్ర బహుమతి. భౌతిక పరిస్థితులు శ్రమ ఉత్పాదకతకిని కట్టివేస్తాయి. అవి మనిషి శరీరానికీ, చుట్టూ ఉన్న ప్రకృతికి చెందినవి. బాహ్య భౌతిక పరిస్థితులు రెండు పెద్ద ఆర్థిక తరతులుగా ఉంటాయి: జీవనాధార సాధనాలకు చెందిన ప్రకృతి సంపద. సారవంతమైన నేల, చేపలతో నిండివున్న నీళ్ళూ మొదలైనవి. శ్రమ సాధనాలకు చెందిన ప్రకృతి సంపద – జలపాతాలూ, నౌకా యానానికి తగిన నదులూ, కొయ్యలూ, లోహాలూ, బొగ్గూ వగయిరా. నాగరికత తొలికాలంలో అభివృద్ధికి ఊపు కలిగించేవి, మొదటి తరగతివి. అభివృద్ధి పై స్థాయిలో ఉన్నప్పుడు ఊపు కలిగించేవి, రెండో తరగతివి. ఇండియాలోనూ, నల్ల సముద్ర తీర ప్రాంతాల్లోనూ జీవనాధార సాధనాలు ఎక్కువ. ప్రాచీనకాలపు ఎథెన్స్ లోనూ, కోరింథ్‌లోనూ సహజ శ్రమసాధనాలు ఎక్కువ. తప్పక తీర్చాల్సిన అవసరాలు తక్కువగా ఉండి, భూసారం ఎక్కువగానూ, వాతావరణం అనుకూలంగానూ ఉంటే, శ్రామికుని పోషణకి పట్టే శ్రమ కాలం తక్కువగా ఉంటుంది. తనకోసం చెయ్యాల్సిన శ్రమ పైన, ఇతరులకు చెయ్యగలిగిన శ్రమ చాలా ఎక్కువ వుంటుంది. డిడొరస్ ఏనాడో ఈజిప్షియన్ల గురించి ఇలా చెప్పాడు:

పిల్లలపెంపకానికి వాళ్ళకి అయ్యే ఖర్చూ, శ్రమా నమ్మశక్యం కానంత తక్కువ. చేతికొచ్చిన పదార్థాన్ని వండి పెడతారు. తేగలూ, చిత్తడి నేలల్లో దొరికే దుంపలూ,వంటి వాటిని అలాగే పెడతారు, కొన్నిటిని ఉడికించీ, కొన్నిటిని కాల్చీ పెడతారు. ఎక్కువమంది పిల్లలు చెప్పులూ, బట్టలూ లేకుండానే తిరుగుతారు. కారణం వాతావరణం హాయిగా ఉండడమే. అందువల్ల ఒక్కో పిల్లాడికి పెద్దయ్యే దాకా అయ్యే ఖర్చు అతికొద్ది. 20 డ్రాక్మా (Drachma) లకు మించదు. శ్రామికుల అవసర శ్రమకాలం ఎంత తక్కువగా ఉంటే, అంత ఎక్కువ అదనపు శ్రమ చెయ్యగలుగుతారు. ఫలితంగా, జనాభా శ్రమలో ఎక్కువభాగం ఇతరత్రా ఉపయోగించుకోడానికి వీలుగా ఉంది. అందువల్లనే అక్కడ అంతంత భారీ నిర్మాణాలు సాధ్యమయ్యాయి.

## పరమ అదనపు విలువకూ – సాపేక్ష అదనపు విలువకూ ఉన్న ఇంకో తేడా

పెట్టుబడిదారీ విధానం ఉందనీ, అన్ని ఇతరపరిస్థితుల్లో మార్పులేదనీ, పనిదినం పొడవు నిర్ణయమై ఉందనీ అనుకుందాం. అప్పుడు అదనపు విలువ పరిమాణం, శ్రమ భౌతిక పరిస్థితుల్ని బట్టి, మరీ ముఖ్యంగా నేల సారాన్ని బట్టి మారుతుంది. అనుకూలమైన ప్రకృతి పరిస్థితులు అదనపు శ్రమకి, ఫలితంగా అదనపు విలువకీ, అదనపు ఉత్పాదితానికీ అవకాశాన్ని మాత్రమే ఇస్తాయి, కాని వాటిని వాస్తవం చెయ్యలేవు. ప్రకృతి పరిస్థితుల్లో తేడా వల్ల వచ్చే ఫలితం: ఒకే

శ్రమ పరిమాణం, వెర్వేరు దేశాల్లో తీర్చే అవసరాలు వెర్వేరుగా ఉంటాయి. జోసెఫ్ మాసీ 1750 లోనే రాసినట్లు **ఏ రెండు దేశాల్లోనూ ఒకే శ్రమ పరిమాణం జీవితావసరాల్ని ఒకే సంఖ్యలో, ఒకే పరిమాణంలో చేకూర్చదు.** మనుషుల కోరికలు వాళ్ళుండే వాతావరణాన్ని బట్టి ఎక్కువో, తక్కువో ఉంటాయి. చలి ప్రదేశాల్లో వాళ్ళకి వేడి ప్రాంతాల్లో ఉండేవాళ్ళ కంటే ఎక్కువ బట్టలు కావాలి. అంటే ఎక్కువ శ్రమ అవసరం. అంతేకాదు, అక్కడ సేద్యానికి ఎక్కువ శ్రమ పడుతుంది. ఫలితంగా ఇతర అంశాలన్నీ ఒకేరకంగా ఉన్నప్పుడు, అవసర శ్రమ కాలం భిన్నంగా ఉంటుంది. ఈ పరిస్థితులు సహజ హద్దులుగా మాత్రమే అదనపువిలువని ప్రభావితం చేస్తాయి. అంటే, ఇతరులకోసం చేసే శ్రమ మొదలయ్యే బిందువుని నిర్ణయిస్తాయి. పరిశ్రమ పురోగమించే కొద్దీ, ఈ సహజహద్దులు వెనక్కి నడుస్తాయి.

## శ్రమ ఉత్పాదకత పెట్టుబడి ఉత్పాదకతగా కనిపిస్తుంది

లాభం అనేది శ్రమ నుంచి స్వతస్సిద్ధంగా వస్తుంది అనే అభిప్రాయాన్ని తోసిపుచ్చుతాడు మార్క్స్. పశ్చిమ ఐరోపా సమాజంలో శ్రామికుడు అదనపు శ్రమ చెల్లించి మాత్రమే, తన జీవనోపాధి కోసం పనిచేసే హక్కు కొనుక్కుంటాడు. అటువంటి సమాజంలో అదనపు ఉత్పాదితాన్ని సమకూర్చడం మనిషి శ్రమకున్న స్వతస్సిద్ధ లక్షణం అనే అభిప్రాయం వేళ్ళూనడం సులభమే. అందువల్లే, **సమస్త శ్రమా అదనాన్ని వదలవలసిందే అన్నాడు ప్రౌధన్.** అయితే ఆసియా ద్వీప సముదాయపు తూర్పు దీవుల్లో నివసించే వ్యక్తిని ఉదాహరణగా చూడండి. అక్కడ అడవుల్లో సగ్గుబియ్యం చెట్లు తెగ పెరుగుతాయి. చెట్టుకి బెజ్జం వేసి, దాని మూలుగు పండి ఉంటే, ఆ బోదెని చాలా ముక్కలు చేస్తారు. మూలుగుని బయటకు లాగి నీళ్ళు కలిపి వడగడతారు. అది ఇక సగ్గుబియ్యంగా ఉపయోగపడుతుంది. ఒక చెట్టు నించి మామూలుగా 300 పౌన్లు వస్తుంది. ఎప్పుడయినా 500–600 పౌన్లు కూడా వస్తుంది. అక్కడి ప్రజలు అడవుల్లోకి పోయి తమ ఆహారాన్ని చెట్లు కొట్టి తెచ్చుకుంటారు – పొయిలో కట్టెలకోసం చెట్లు కొట్టి నట్లే.

ఈ పద్ధతిలో ఆహారం సంపాదించుకునే వానికి అన్ని అవసరాలూ తీరడానికి వారానికి 12 గంటలు పని చేస్తే చాలు అనుకుందాం. అతనికి ఎంతో తీరిక సమయం ఉంటుంది. అది అతనికి ప్రకృతిచ్చే ప్రత్యక్ష బహుమతి. అతను ఆ సమయాన్ని తనకోసం ఉత్పాదకంగా వాడడానికి ముందు, కొన్ని చారిత్రక ఘటనల పరంపర అవసరమవుతుంది; **ఇతరులకు అదనపు శ్రమగా ఖర్చుచెయ్యడానికి ముందు నిర్బంధం అవసరం.** పెట్టుబడిదారీ ఉత్పత్తి వస్తే, ఒక రోజు ఉత్పాదితాన్ని సొంతం చేసుకోవడానికి ఒక నిజాయతీ పరుడు వారంలో 6 రోజులు పని చెయ్యాల్సి వుంటుంది. అతనెందుకు 6 రోజులు పని చెయ్యాలో లేదా 5 రోజులు ఇతరుల కోసం ఎందుకు పనిచెయ్యాలో, ప్రకృతి వివరించదు. అతని అవసర శ్రమ కాలం వారానికి ఒక రోజుగా ఎందుకున్నదో మాత్రం వివరిస్తుంది. కాని ఏ సందర్భంలోనూ అతని అదనపు ఉత్పాదితం మనిషి శ్రమలో నిగూఢంగా ఉన్న లక్షణం నుండి ఏర్పడదు. ఆవిధంగా, చారిత్రకంగా అభివృద్ధి చెందిన సామాజిక శ్రమ ఉత్పాదకతతో పాటు, శ్రమ సహజ ఉత్పాదకత కూడా, ఆ శ్రమ ఏ పెట్టుబడితో కలిసిపోయిందో, ఆ పెట్టుబడి యొక్క ఉత్పాదకతగా అగపడుతుంది.

# అధ్యాయం -17
# శ్రమశక్తి ధర పరిమాణంలోనూ అదనపువిలువ పరిమాణంలోనూ మార్పులు

ఈ అధ్యాయం అంతటా రెండు పరిస్థితులు ఉన్నట్లు భావించి ముందుకుపోతాడు మార్క్స్. అవి:

1. సరుకులు వాటి విలువలకే అమ్ముడవుతాయి
2. శ్రమశక్తి ధర అరుదుగా దాని విలువ కన్నా ఎక్కువవుతుంది, కాని ఎన్నడూ తగ్గదు

ఆ విధంగా అనుకుంటే, అదనపు విలువ పరిమాణమూ, శ్రమ శక్తి ధరా మూడు అంశాలమీద ఆధారపడి ఉంటాయి – అని ఇప్పటికే తెలుసుకున్నాం. ఆ అంశాలు:

- పనిదినం పొడవు
- శ్రమ తీవ్రత
- శ్రమ ఉత్పాదకత

కాబట్టి, వేర్వేరు పరిస్థితులు ఉంటాయి.

వీటిలో, ఏ రెండు అంశాలైనా స్థిరంగా ఉండి, మిగిలిన మూడో అంశం మారవచ్చు.

A. పనిదినం పొడవూ, శ్రమ తీవ్రతా – స్థిరంగా ఉండి, మూడో అంశం శ్రమ ఉత్పాదకత మారవచ్చు.

B. పనిదినం పొడవూ, శ్రమ ఉత్పాదకతా స్థిరంగా ఉండి, శ్రమ తీవ్రత మారవచ్చు.

C. శ్రమ ఉత్పాదకతా, శ్రమ తీవ్రతా స్థిరంగా ఉండి, పనిదినం పొడవు మారవచ్చు.

ఒక అంశం మాత్రమే స్థిరంగా ఉండి, మిగిలిన రెండు అంశాలూ మారవచ్చు. మొత్తం మూడు అంశాలూ ఏక కాలంలో మారవచ్చు.

పై మూడు అంశాల్లో వచ్చే మార్పులకి అనుగుణంగా అదనపు విలువ పరిమాణం మారుతుంది. ఈ మార్పుల్ని తేల్చవచ్చు.

**A. పనిదినం పొడవూ, శ్రమ తీవ్రతా – స్థిరంగా ఉండి, మూడో అంశం శ్రమ ఉత్పాదకత మారుతున్నప్పుడు**

ముందే అనుకున్న వాటిని (assumptions) బట్టి శ్రమ శక్తి విలువా, అదనపువిలువ పరిమాణమూ మూడు నియమాల చేత నిర్ణయమవుతాయి. ఆ నియమాలు:

**మొదటి నియమం. ఒక నిర్ణీత నిడివి ఉన్న పనిరోజు ఎల్లప్పుడూ ఒకే మొత్తం విలువని ఉత్పత్తి చేస్తుంది.** శ్రమ ఉత్పాదకతా, దాంతో వచ్చే ఉత్పాదితమూ, ఒక్కొక విడి సరుకు ధర ఎంతగా మారినా సరే, విలువ మొత్తం ఏమాత్రం మారదు. 12 గంటల పనిదినంలో ఉత్పత్తయ్యే విలువ స్థిరంగా ఉండే పరిమాణం. ఉదాహరణకి, 12 గంటల పనిదినంలో 50

వస్తువులు తయారయ్యేవనీ, వాటి విలువ 1000 రూపాయలనీ అనుకుందాం. ఇప్పుడు ఉత్పాదకత పెరిగి అదే కాలంలో 100 ఉరువులో, 200లో, 400లో ఉత్పత్తి అవచ్చు, అదే కాలంలో ఎన్ని ఉత్పత్తయినా, వాటన్నిటి విలువ మొత్తం 1000 రూపాయలే, అది మారదు. ఒక్కొక్క ఉరువు విలువ మారుతుంది. 50 ఉరువులు తయారైనప్పుడు ఒక్కోదాని విలువ 20 రూపాయలు. 100 తయారయితే 10 రూపాయలు. 200 అయితే 5 రూపాయలు, 400 అయితే 2.50 రూపాయలు.

రెండో నియమం. **అదనపువిలువా, శ్రమ శక్తి విలువా-వ్యతిరేక దిశల్లో మారతాయి.** అంటే, ఒకటి పెరిగితే రెండోది తగ్గుతుంది. 12 గంటల పని దినంలో 1000 రూపాయల విలువ ఉత్పత్తయిందనీ, ఇందులో శ్రమ శక్తి విలువా అదనపు విలువా సమానం – చెరొక 500 రూపాయలనీ అనుకుందాం. ఇప్పుడు ఒకటి 600 రూపాయల కావాలంటే, రెండోది 400 రూపాయలకి తగ్గి తీరాలి. కారణం,మొత్తం విలువ 1000 రూపాయలు. అదనపు విలువ 500 నుండి 600 కి పెరగాలంటే శ్రమ శక్తి విలువ 500 నుంచి 400 కి తగ్గి తీరాలి.

మూడో నియమం. **అదనపు విలువలో మార్పు శ్రమ శక్తి విలువలో మార్పుని బట్టి ఉంటుంది.** కాని శ్రమ శక్తి విలువలో మార్పుకి, అదనపు విలువలో మార్పు కారణం కాదు. శ్రమ శక్తి విలువ తగ్గితే, అదనపు విలువ పెరుగుతుంది, అది పెరిగితే ఇది తగ్గుతుంది. ఇక్కడ శ్రమ శక్తి విలువ అంటే శ్రామికుల మామూలు జీవనాధార సాధనాల విలువ. ఇది స్థిరంగా ఉన్నట్లు లెక్క.

శ్రమ శక్తి విలువని నిర్ణయించేది నిర్ణీత పరిమాణం గల జీవితావసరాల విలువ. వాటి పరిమాణం మారకుండానే, వాటి విలువ తగ్గాలి. అలా అయితేనే శ్రమశక్తి విలువ తగ్గకుండానే, అదనపు విలువ పెరుగుతుంది. మరి, జీవితావసరాల పరిమాణం తగ్గకుండానే, వాటి విలువ ఎలా తగ్గుతుంది? శ్రమ ఉత్పాదకత పెరిగితే, ఆ జీవితావసరాల విలువ తగ్గుతుంది, కాని వాటి పరిమాణం తగ్గదు.

### కార్మికుడికీ, పెట్టుబడిదారుడికీ ఇద్దరికీ ప్రయోజనం

అయితే, శ్రమ శక్తి ధరలోనూ, అదనపువిలువలోనూ ఏమార్పూ లేకపోయినా, ఉత్పాదకత పెరుగుదల వల్ల, కార్మికుడూ, పెట్టుబడిదారుడూ ఇద్దరూ కూడా మరింత ఎక్కువ పరిమాణంలో ఈ జీవితావసరాలను స్వాయత్తం చేసుకోవడం సాధ్యమే.

శ్రమ శక్తి విలువ 500 రూపాయలు, అవసర శ్రమకాలం 6 గంటలు, అదనపు విలువ 500 రూపాయలు, అదనపు శ్రమకాలం 6 గంటలు – అయినప్పుడు అవసర, అదనపు శ్రమల నిష్పత్తి మారకుండా ఉంటే, అదనపు విలువ పరిమాణంలోగానీ, శ్రమశక్తి ధర పరిమాణంలో గానీ మార్పు ఉండదు.

దాని ఫలితం ఒక్కటే : ఆ రెంటిలో అదీ ఇదీ మునుపటికన్నా రెట్టింపు ఉపయోగపు విలువలకు ప్రాతినిధ్యం వహిస్తాయి; ఈ ఉపయోగపు విలువలు మునుపటికంటే రెండింతలు చౌకవుతాయి. ఈ విధంగా, శ్రమశక్తి ధర తగ్గుతూ పోతున్నా, శ్రామికుని జీవితావసరాల రాశి

పెరుగుతూ ఉండడం సాధ్యమే. అటువంటి సందర్భంలో సైతం శ్రమశక్తి విలువలో పతనం, అదనపు విలువలో దానికనుణమైన పెంపుని తెస్తుంది. కార్మికుడికి ఈ ప్రయోజనం పరిమితంగా ఉంటుంది: అతని పరిస్థితిని కొంచెం మెరుగుపరుస్తుంది, అంతే. కాని కార్మికుడికీ పెట్టుబడిదారుడికీ మధ్య ఉండే అఖాతాన్ని తగ్గించదు. తగ్గించకపోగా పెంచే అవకాశమే ఉంది. ఆ విధంగా కార్మికుని స్థాయికీ, పెట్టుబడి దారుడి స్థాయికీ మధ్య ఉండే అఖాతం అంతకంతకూ అధికం అవుతుంది.

## ఇంగ్లీష్ ఆర్థికవేత్త రికార్డో (1772-1823) ఈనియమాల్ని సూత్రీకరించాడు

పైన చెప్పిన మూడు నియమాల్నీ మొట్టమొదట కచ్చితంగా సూత్రీకరించిన వాడు రికార్డో. అయితే ఇక్కడ రెండు పొరపాట్లు చేశాడు.

మొదటి పొరపాటు. ఇవి వర్తించే ప్రత్యేక పరిస్థితుల్ని, పెట్టుబడిదారీ ఉత్పత్తికి సర్వ సాధారణమైన పరిస్థితులుగా పరిగణించాడు. ఆయన పనిదినం పొడవులో మార్పుల్ని గానీ, శ్రమ తీవ్రతలో మార్పుల్ని గానీ పరిశీలించలేదు. అందువల్ల ఆయన ప్రకారం మారే అంశం ఒక్కటే, అదే శ్రమ ఉత్పాదకత. మిగిలినవి మారవు. ఇదొక పొరపాటు.

రెండో పొరపాటు. అదనపువిలువని ఒకమొత్తంగా చూడలేదు. లాభం, కౌలు వంటి అదనపు విలువ భాగాలను, దాని ప్రత్యేక రూపాల్ని దేనికదిగా చూశాడు. మొదటి పొరపాటు కన్నా ఇది ఆయన విశ్లేషణని ఎక్కువ లోప భూయిష్టం చేసింది. 'అదనపు విలువ సిద్ధాంతాలు' పుస్తకం మొదట్లోనే ఈవిషయంలో అందరూ అదే పొరపాటు చేశారంటాడు: ఆర్థిక వేత్తలందరూ అదనపు విలువని దానికదిగా, స్వచ్ఛమైన రూపంలో పరిశీలించకుండా, దాని ప్రత్యేకరూపాలైన లాభంగానూ, కౌలుగానూ పరిశీలించి పొరపాటు చేశారు - Theories of Surplus Value Vol 1.p.40. ఈ పొరపాటు ఫలితం: రికార్డో అదనపువిలువ రేటు నియమాల్నీ, లాభంరేటు నియమాల్నీ కలిపి గందరగోళపరుస్తాడు.

## రికార్డో గందరగోళం

లాభం రేటు పెట్టిన మొత్తం పెట్టుబడితో అదనపువిలువ నిష్పత్తి. అదనపు విలువ రేటు మొత్తం పెట్టుబడిలో ఒక భాగమైన అస్థిర పెట్టుబడితో అదనపువిలువ నిష్పత్తి. ఉదాహరణకి, మొత్తం పెట్టుబడి (C) 50,000 రూపాయలు, అందులో స్థిరభాగం(c) 40,000 అస్థిరభాగం(v) 10,000, అదనపు విలువ (s) 10,000 అనీ అనుకుందాం. అప్పుడు, అదనపు విలువ రేటు = అదనపు విలువ/అస్థిర పెట్టుబడి = 10,000/10,000 = 100%

లాభం రేటు = S/C = అదనపు విలువ/మొత్తం పెట్టుబడి = 10,000/50,000 =20%

లాభం రేటు అదనపు విలువ రేటుని ఏవిధంగానూ ప్రభావితం చెయ్యని పరిస్థితులమీద ఆధారపడి ఉండవచ్చు. ఒకే అదనపువిలువ రేటు ఉన్నా, ఎన్నో లాభం రేట్లు ఉండవచ్చుననీ, వేర్వేరు అదనపు విలువ రేట్లు ఒకే లాభం రేటుని వ్యక్తం చెయ్యవచ్చనీ 3 వ సంపుటంలో చూపిస్తాను-అంటాడు మార్క్స్.

### B. పనిదినమూ, శ్రమ ఉత్పాదకతా స్థిరంగా ఉండి, శ్రమ తీవ్రత మారుతూ ఉన్నప్పుడు

మామూలు శ్రమ తీవ్రతతో గంటకి 20 కొబ్బరికాయలు వలిస్తే, ఎక్కువ శ్రమ తీవ్రతతో 30 లేక 40 వలవ వచ్చు. అంతే కాలంలో, అంటే పనికాలం పెరగకుండానే ఎక్కువ సరుకులు ఉత్పత్తవుతాయి. ఉత్పాదకత పెరిగినా అదే ఫలితం వస్తుంది. ఏది పెరిగినా ఉత్పత్తయ్యే ఉరువులు పెరుగుతాయి.

### మరి రెంటికీ తేడా ఏమిటి?

శ్రమ తీవ్రత పెరిగినా, ఒక్కొక్క సరుకు విలువ మారదు. కాని ఉత్పాదకత పెరిగి నప్పుడు ఒక్కొక్క సరుకు విలువ తగ్గుతుంది. ఉత్పాదకత తగ్గి నప్పుడు ఒక్కొక్క సరుకు విలువ పెరుగుతుంది. శ్రమ తీవ్రత పెరిగిన సందర్భంలో ఒక్కొక్క సరుకు విలువ అలానే ఉంటుంది, ఎందుకంటే, అంతకు ముందు ఎంత శ్రమ పట్టిందో, ఇప్పుడూ అంతే శ్రమ పడుతుంది. కనుక ఉరువుల సంఖ్య పెరుగుతుంది, కాని ఒక విడి ఉరువు ధరలో మార్పు రాదు. అంటే, 30 ఉరువులు బదులు 40 ఉరువులు ఉత్పత్తవుతాయి. వాటి మొత్తం ధర అప్పుడు 300 రూపాయలు ఉంటే, ఇప్పుడు 400 రూపాయలు ఉంటుంది. వాటి సంఖ్యతోపాటే ధర మొత్తమూ పెరుగుతుంది. ఉత్పాదకత పెరిగిన సందర్భంలో మునుపటి 30 ఉరువుల విలువ 300 రూపాయలు 40 ఉరువులకు పరచబడుతుంది. కనుక మునుపు 10 రూపాయలు గావున్న ఒక్కొక్క ఉరువు ధర తగ్గి, ఇప్పుడు $7\frac{1}{2}$ రూపాయలు అవుతుంది.

### ఉత్పాదకతా – శ్రమ తీవ్రతా

ఉత్పాదకతా శ్రమ తీవ్రతా రెండూ అదనపు విలువని పెంచే సాధనాలే. కార్మికులు వాడే వస్తువులు తయారు చేసేచోట్ల, శ్రమ ఉత్పాదకత పెరిగితేనే, సాపేక్ష అదనపు విలువ ఏర్పడుతుంది. వాళ్ళు వాడని వస్తువులు చేసేచోట్ల, శ్రమ ఉత్పాదకత పెరిగినా శ్రమ శక్తి విలువ మారదు. సాపేక్ష అదనపు విలువ ఏర్పడదు. ఇందుకు భిన్నంగా ఎక్కువ శ్రమ తీవ్రత ఎల్లప్పుడూ మరింత అదనపు విలువని ఇస్తుంది.

శ్రమ తీవ్రత అన్ని పరిశ్రమ శాఖల్లోనూ సమంగా, ఏకకాలంలోపెరిగితే, ఈ ఎక్కువ తీవ్రతే సమాజంలో మామూలు స్థాయి తీవ్రత అవుతుంది. కాబట్టి అదిక లెక్కలో ఉండదు. అయినా, అప్పుడు కూడా వేర్వేరు దేశాల్లో శ్రమ తీవ్రత వేర్వేరుగా ఉంటుంది. విలువ నియమపు అంతర్జాతీయ వర్తింపుని సవరిస్తుంది. ఒక దేశంలో శ్రమ తీవ్రత ఎక్కువవుంటే, అక్కడ పనిదినం తక్కువ తీవ్రత ఉన్న దేశం పనిదినంతో పోలిస్తే, ఎక్కువ డబ్బుకి ప్రతినిధిగా ఉంటుంది.

### C. శ్రమ ఉత్పాదకతా, శ్రమ తీవ్రతా స్థిరంగా ఉండి, పనిదినం పొడవు మారితే...

పనిదినం నిడివి రెండు విధాలుగా మారవచ్చు. అది పెరగావచ్చు, తగ్గావచ్చు. మనకున్న దత్తాంశాల నుండి, మనం ముందుగా అనుకున్న వాటి పరిధిలో మూడు నియమాలొస్తాయి.

1. పనిదినంలో దాని పొడవుకి అనుగుణంగా ఎక్కువో తక్కువో విలువని ఉత్పత్తి చేస్తుంది. 10 గంటల పనిదినం కంటే 12 గంటల పనిదినం ఎక్కువ విలువని ఉత్పత్తి చేస్తుంది.

8 గంటల పనిదినం తక్కువ విలువని ఉత్పత్తి చేస్తుంది. ఆవిధంగా విలువ పరిమాణం అస్థిరంగా ఉంటుంది.

2. అదనపు విలువ పరిమాణానికీ, శ్రమ శక్తి విలువ పరిమాణానికీ మధ్య సంబంధంలో మార్పులు రావచ్చు. ఆ మార్పుల్లో ఏదయినా అదనపు శ్రమ యొక్క పరమ పరిమాణంలో మార్పు నుంచి వస్తుంది. దాని పర్యవసానంగా అదనపు విలువ పరిమాణంలో మార్పు నుంచి మాత్రమే వస్తుంది.

3. అదనపు శ్రమ పొడిగింపు, శ్రమ శక్తి అరుగుదలమీద ప్రభావం నెరుపుతుంది. ఆ ప్రభావానికి ప్రతిచర్య ఫలితంగా మాత్రమే శ్రమ శక్తి పరమ విలువ మారగలదు. అందువల్ల, ఈ పరమ విలువలో ఏ మార్పయినా అదనపు విలువ పరిమాణంలో మార్పుకి ఫలితమే కాని, అందుకు కారణం ఎన్నటికీ కాదు. పనిదినం పొడవు తగ్గనూవచ్చు పెరగనూ వచ్చు. తగ్గిన సందర్భాన్ని ముందు చూస్తాడు.

**పనిదినం తగ్గింపు** పైన 1 లో చెప్పిన పరిస్థితుల్లో, పనిదినం తగ్గింపు శ్రమశక్తి విలువనీ, దాంతో పాటు అవసర శ్రమ కాలాన్నీ మార్చకుండా అలానే ఉంచుతుంది. అవసర శ్రమ కాలం పరమ పరిమాణంతో పాటు, దాని సాపేక్ష పరిమాణం కూడా పడిపోతుంది. అంటే, మారకుండా అలాగే వున్న శ్రమ శక్తి విలువతో పోలిస్తే, సాపేక్షంగా అదనపు విలువ పరిమాణం పడిపోతుంది. పెట్టుబడి దారుడి వాటా తగ్గుతుంది. ఆపరిస్థితిలో, శ్రమ శక్తి ధరని తగ్గించడం ద్వారా మాత్రమే, పెట్టుబడి దారుడు తనకు హాని జరగకుండా చూసుకోగలడు.

శ్రమ తీవ్రతా, ఉత్పాదకతా స్థిరంగా ఉన్నప్పుడు, శ్రమ శక్తి విలువని తగ్గించకుండా పనిదినాన్ని తగ్గిస్తే, అదనపు విలువ తగ్గుతుంది. గంట వేతనం పెరుగుతుంది. అయితే ఇలాంటి పరిస్థితి రావడం చాలా అరుదు. వాస్తవం ఇందుకు భిన్నంగా ఉంటుంది : ఉత్పాదక శక్తిలోనూ, తీవ్రతలోనూ మార్పు పనిదినం కుదింపుకి ముందుగానీ, అది జరిగీ జరగగానే గానీ వస్తుంది. ఇక్కడ ఫుట్ నోట్ : నష్టాన్ని భర్తీచేసే పరిస్థితులు ఉన్నాయి. 10 గంటల పనిదినం అమలు మూలంగా అవి వెలుగులోకి వచ్చాయి. అంటే, పెట్టుబడి దారీ విధానం, లాభాన్ని తగ్గించే ప్రభావాల్ని తటస్థీకరించే మార్గాలు కనుక్కుంటుంది.

**పనిదినం పొడిగింపు.** అవసర శ్రమ కాలం 6 గంటలు లేక శ్రమశక్తి విలువ 500 రూపాయలు, అదనపు విలువకూడా అంతే అనుకుందాం. అంటే, పనిదినం 12 గంటలు. ఉత్పత్తయ్యే విలువ 1000 రూపాయలు. ఇప్పుడు శ్రమ శక్తి ధర అలానే వుండి, పనిదినం 2 గంటలు పెరిగితే అదనపు విలువ సాపేక్షంగానూ, నిరపేక్షంగానూ కూడా పెరుగుతుంది. శ్రమ శక్తి విలువలో నిరపేక్ష మార్పు లేకున్నా, అది సాపేక్షంగా, (అంటే అదనపు విలువతో పోలిస్తే) తగ్గుతుంది.

1 లో ఉన్నాయనుకున్న పరిస్థితుల్లో శ్రమ శక్తి విలువ పరమ పరిమాణంలో మార్పు లేనిదే, దాని సాపేక్ష పరిమాణంలో మార్పు రాదు. అయితే అందుకు వ్యతిరేకంగా ఇక్కడ శ్రమ శక్తి విలువ సాపేక్ష పరిమాణంలో మార్పు, పరమ అదనపు విలువ పరిమాణంలో మార్పు

వల్ల వస్తుంది. ఒక రోజు శ్రమ ఉత్పత్తిచేసే విలువ, పనిరోజు పొడవుతో పాటు పెరుగుతుంది. కాబట్టి, అదనపు విలువా శ్రమశక్తి విలువా రెండూ కూడా ఏకకాలంలో పెరగవచ్చు – సమంగానో, అసమంగానో.

**ఇలా ఏకకాలంలో రెండూ పెరగడం రెండు సందర్భాల్లో మాత్రమే సాధ్యం:**

1. పనిదినం పొడవు వాస్తవంగా పెరిగినప్పుడు
2. పనిదినం పెంపు లేకపోయినా, శ్రమ తీవ్రత పెరిగినప్పుడు

పనిదినం పొడవు పెరిగితే, శ్రమ శక్తి ధర నామకా మారకపోయినా, లేదూ ఒకవేళ పెరిగినా, శ్రమ శక్తి విలువ కన్నా తగ్గవచ్చు.

ఇక్కడ ఒక్క విషయం గుర్తుకు తెచ్చుకోవాలి. ఎమంటే: ఒక రోజు శ్రమ శక్తి విలువ ఎలా లెక్కింప బడుతుంది? దాని సాధారణ సగటు కాల పరిమాణాన్ని బట్టి. రోజుకి కొంత శ్రమ శక్తి అరిగిపోతుంది. పనిదినం పెరిగితే, అరుగుదలా పెరుగుతుంది. ఈ నష్టాన్ని వేతనపెంపు పరిహరించవచ్చు. అయితే ఇది ఒక స్థాయి వరకే వీలవుతుంది. అది దాటితే అరుగుదల గుణ శ్రేణిలో (geometrical progression) పెరుగుతుంది. అప్పుడు శ్రమశక్తి మామూలుగా పునరుత్పత్తి కావడానికీ, శ్రమ చెయ్యడానికీ తగిన ప్రతి పరిస్థితీ అణచివేయ బడుతుంది. శ్రమ శక్తి ధరా, దోపిడీ స్థాయీ ఇక కొలవ తగిన పరిమాణాలుగా (commensurable quantities ) ఉండవు.

**D. ఏకకాలంలో పొడవులోనూ, ఉత్పాదకతలోనూ, తీవ్రతలోనూ మార్పులు**

మూడు అంశాలూ ఒకేసారి మారుతుంటే, అనేక కలయికలు సాధ్యమవుతాయి అనేది స్పష్టమే. రెండు అంశాలు మారుతూ, మూడోది స్థిరంగా ఉండవచ్చు, లేదా ఒకేసారి మూడూ మారనూ వచ్చు. ఆమారేవి ఒకే దిశలో, ఒకే స్థాయిలో మారవచ్చు. లేదా వేర్వేరు స్థాయిల్లో మారవచ్చు, విరుద్ధ దిశల్లో నయినా మారవచ్చు; ఫలితంగా ఆయా మార్పులు ఒకదాన్నొకటి పూర్తిగానో, పాక్షికంగానో పరిహరించవచ్చు. అయినప్పటికీ, A,B,C లలో ఫలితాల దృష్ట్యా సాధ్యమయ్యే ప్రతి సందర్భాన్నీ విశ్లేషించడం సులభమే. ఒక్కొక్క సారి ఒక్కొక్క అంశాన్ని అస్థిరమైనదిగానూ, మిగిలిన రెంటినీ స్థిరమైనవి గానూ తాత్కాలింగా భావించి, ఏకలయిక ఫలితాన్నైనా కనుక్కోవచ్చు. అందువల్ల, ప్రతి సందర్భాన్నీ పరిశీలించాల్సిన పనేమీ లేదు. అయితే రెండు ముఖ్యమైన సందర్భాల్ని గమనించాలి.

**1. పనిదినం పొడవు పెరుగుతుండగా, తగ్గిపోతున్న శ్రమ ఉత్పాదకత**

శ్రమ శక్తి విలువని నిర్ణయించే వస్తువుల్ని ఉత్పత్తి చేసే పరిశ్రమల్లో శ్రమ ఉత్పాదకత తగ్గింది అనుకుందాం.

ఉదాహరణకి, భూసారం తగ్గి, ఆకారణంగా దాని ఉత్పత్తుల ధర పెరిగితే, శ్రమ ఉత్పాదకత తగ్గుతుంది. అప్పుడు భూమి ఉత్పత్తుల ధర పెరుగుతుంది. 12 గంటల పనిదినంలో ఉత్పత్తయ్యే విలువ 1200 రూపాయలనీ, అందులో సగం 600 శ్రమశక్తి విలువ అనీ, మరోసగం 600 అదనపువిలువ అనీ అనుకుందాం. ఆ పరిస్థితుల్లో, భూమి ఉత్పత్తుల విలువ

పెరిగి, శ్రమశక్తి ధర 600 నుంచి 800 కు పెరిగిందనుకుందాం. అంటే అవసర శ్రమకాలం 6 గంటల నుంచి 8 గంటలకు పెరుగుతుంది. పనిదినం పొడవు మారకుండా ఉంటే, అదనపు శ్రమ కాలం 6 నించి 4 గంటలకు పడిపోతుంది. అదనపు విలువ 600 నించి 400 కు దిగుతుంది. పనిదినం పొడవు 2 గంటలు (12 నించి 14 గంటలకు) పెరిగితే, అదనశ్రమ కాలం మారకుండా 6 గంటలు అలాగే ఉంటుంది. అదనపు విలువ 600 అలాగే ఉంటుంది. అయితే, శ్రమ శక్తి విలువతో పోల్చిచూస్తే, అదనపు విలువ తగ్గుతుంది. పనిదినాన్ని 4 గంటలు (12 నించి 16 గంటలకి) పెంచితే, అదనపు విలువ, శ్రమశక్తి విలువల, అవసర శ్రమ అదనపు శ్రమల దామాషా పరిమాణాలు, మారవు. కాని పరమ అదనపు విలువ పరమ పరిమాణం 600నించి 800కు, అదనపు శ్రమ పరమ పరిమాణం 6 నించి 8 గంటలకు పెరుగుతుంది. అంటే 33 $^{1}/3$ శాతం పెంపు. అందువల్ల ఉత్పాదకత తగ్గి , అదే సమయంలో పనిదినం పొడవు పెరిగితే, అదనపు విలువ యొక్క పరమ పరిమాణం మారకుండా ఉండవచ్చు, అదేసమయంలో దాని సాపేక్ష పరిమాణం పెరుగుతుంది; దాని పరమ పరిమాణం పెరిగి, అదేసమయంలో సాపేక్ష పరిమాణం మారకుండా ఉండవచ్చు; పనిదినం నిడివి తగినంత పెరిగినట్లయితే, పరమ పరిమాణమూ, సాపేక్ష పరిమాణమూ రెండూ కూడా పెరగవచ్చు.

### చరిత్ర నుంచి ఉదాహరణ

ఇందుకు మార్క్స్ చరిత్ర నుంచి ఒక ఉదాహరణ ఇస్తాడు. 1799–1815 కాలంలో ఇంగ్లండ్ లో ఆహార పదార్థాల వంటి నిత్య జీవితావసరాల ధరలు పెరిగాయి. నామక వేతనాలు కూడా పెరిగాయి. అయితే జీవితావసర వస్తువుల ధరలు పెరిగినంతగా పెరగలేదు. అంటే, అంతకు ముందు వచ్చినన్ని సరుకులు ఇప్పుడు రావు. దీన్ని బట్టి, నామక వేతనాలుపెరిగాయి, నిజవేతనాలు తగ్గాయి. లాభాలు మాత్రం తగ్గలేదు. అయితే, రికార్డో, వెస్ట్ – ఇద్దరూ లాభాలు తగ్గాయని అనుకున్నారు. అందుకు కారణం – వాళ్ళుశ్రమ తీవ్రతనీ, పనిదినం పొడవునీ పట్టించుకోలేదు. లెక్కలోకి తీసుకోకుండా వదిలిపెట్టారు.

పై వాస్తవాన్ని బట్టి, రికార్డో, వెస్ట్ ఇద్దరూ వ్యవసాయంలో శ్రమ ఉత్పాదకత తగ్గడం వల్ల అదనపువిలువ రేటు తగ్గినట్లు తేల్చారు. వాస్తవంలో లేకపోయినా, వాళ్ళ ఊహలో మాత్రమే ఉన్న ఒక విషయాన్ని వేతనాల, లాభాల, కౌలుల పరిశోధనకు ఆరంభ బిందువు చేసుకున్నారు. అయితే నిజానికి ఆకాలంలో అదనపు విలువ శ్రమ తీవ్రతా, పనిదినం పొడవూ పెరిగినందువల్ల పెరిగింది – పరమంగానూ, సాపేక్షంగానూ కూడా. అది యజమానులు పనిగంటల్ని ఏ దారుణ మేరకైనా పెంచుకునే హక్కు స్థిరపడి ఉన్న కాలం; ఇక్కడ పెట్టుబడి పోగుబడి వేగవంతం అవడమూ, అక్కడేమో దుర్భర దారిద్ర్యం పెరగడమూ ఆ కాలపు ప్రత్యేక లక్షణం. మాల్థూస్ రికార్డో, వెస్ట్‌లు పనిదినం పెంపునీ, శ్రమ తీవ్రతనీ లెక్కలోకి తీసుకోలేదని మార్క్స్ విమర్శ పెట్టాడు.

### 2. శ్రమ తీవ్రతా, ఉత్పాదకతా పెరుగుతుండగా, పనిదినం పొడవు తగ్గడం

శ్రమ ఉత్పాదకత పెరిగినా, తీవ్రత పెరిగినా ఒకే ఫలితం వస్తుంది. నిర్ణీత కాలంలో ఉత్పత్తయ్యే వస్తువుల మొత్తం పెరుగుతుంది. కనుక అవిరెండూ అవసర శ్రమకాలాన్ని తగ్గిస్తాయి.

కుదించడానికి వీలయ్యే ఈ అవసర(శ్రమకాలం, పనిదినం యొక్క కనీస పరిమితిని నిర్ణయిస్తుంది.

**శ్రమ పొదుపు.** శ్రమ పొదుపులో రెండు అంశాలుంటాయి: ఉత్పత్తి సాధనాల పొదుపు. శ్రమ వృథా కాకుండా చూడడం ద్వారా పొదుపు. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఒకవైపు ప్రతి వ్యష్టి వ్యాపారంలోనూ పొదుపుని బలవంతంగా అమలు చేస్తుంది; చేస్తూనే మరొకవైపు దాని అరాచక పోటీ వ్యవస్థ చేత శ్రమ శక్తినీ, సమాజపు ఉత్పత్తిసాధనాల్నీ అత్యంత దారుణంగా దుర్వ్యయం చేస్తుంది. అసలు అవసరం లేకపోయినా, ప్రస్తుతం తప్పని సరి అయిన అనేక పనుల్ని కల్పించే విషయం గురించి ప్రత్యేకించి ప్రస్తావించక్కర్లేదు. శ్రమ ఉత్పాదకతా, తీవ్రతా ఫలానింతని ఉంటే, వస్తువుల ఉత్పత్తికి సమాజం ఖర్చు చెయ్యాల్సిన టైం తగ్గుతుంది. ఆ కారణంగా, వ్యక్తులకు బౌద్ధికంగానూ, సామాజికంగానూ అభివృద్ధి చెందేందుకు ఎక్కువ సమయం దొరుకుతుంది. సమాజంలో పనిచేసే శక్తి గల వాళ్ళందరికి మొత్తం పనిని అంతకంతకూ సమానంగా పంచడమూ, ఒక ప్రత్యేక వర్గం తన శ్రమ భారాన్ని సమాజం లోని మరొక పొర భుజాల మీదకు నెట్టే అధికారాన్ని అంతకంతకూ తొలిగించడమూ జరిగే కొద్దీ ఆ టైం పెరుగుతుంది. ఈ దిశలో, పనిదినం తగ్గింపుకి, శ్రమ సాధారణీకరణే తుది హద్దుని ఏర్పరుస్తుంది. పెట్టుబడిదారీ సమాజంలో ఒక వర్గానికి జీవితకాలాన్ని యావత్తూ శ్రమకాలంలోకి మార్చడం ద్వారా, మరొక వర్గానికి విరామ కాలం దొరుకుతుంది.

## అధ్యాయం 18
# అదనపు విలువ రేటు కనుక్కోడానికి వివిధ ఫార్ములాలు

అదనపు విలువ రేటు కనుక్కోడానికి సూత్రాలు రెండు రకాలు: I. మార్క్స్ రూపొందించినవి. II. మార్క్స్‌కి ముందు సాంప్రదాయ అర్థశాస్త్రజ్ఞులు రూపొందించినవి.

$$\text{I.}\quad \frac{\text{అదనపు విలువ}}{\text{అస్థిరపెట్టుబడి}}\left(\frac{s}{v}\right) = \frac{\text{అదనపు విలువ}}{\text{శ్రమ శక్తి విలువ}} = \frac{\text{అదనపు శ్రమ}}{\text{అవసర శ్రమ}}$$

మొదటి రెండు సూత్రాలూ విలువల నిష్పత్తికి ప్రతినిధులుగా ఉంటాయి. మూడోది ఆవిలువలు ఉత్పత్తయిన కాలవ్యవధి నిష్పత్తికి ప్రతినిధిగా ఉంటుంది. ఈ మూడూ ఒకదానికొకటి అనుబంధంగా ఉంటాయి. ఇవి కచ్చితమైనవి, సరైనవి. సాంప్రదాయ అర్థశాస్త్రంలో ఆ సూత్రాల్ని ఉద్దేశ పూర్వకంగా కాకపోయినా, గణనీయంగానే రూపొందించిన విషయం మనకు తెలుస్తుంది. అక్కడ ఈక్రింది 'ఉత్పన్న సూత్రాలు' (derivative formulae) ఎదురవుతాయి. అవి:

$$\text{II.}\quad \frac{\text{అదనపు శ్రమ}}{\text{పనిదినం}} = \frac{\text{అదనపు విలువ}}{\text{ఉత్పాదితం విలువ}} = \frac{\text{అదనపు ఉత్పాదితం}}{\text{మొత్తం ఉత్పాదితం}}$$

ఒకటే నిష్పత్తి ఇక్కడ ఒకసారి శ్రమ కాలాల నిష్పత్తిగానూ, ఇంకోసారి ఆ శ్రమ కాలాలు రూపొందిన విలువల నిష్పత్తిగానూ, ఆ విలువలు ఉన్న ఉత్పాదితాల నిష్పత్తిగానూ మార్చిమార్చి వ్యక్తమవుతాయి. ఉత్పాదితం విలువ అంటే, ఒక రోజులో కొత్తగా ఉత్పత్తయిన విలువ మాత్రమే; ఉత్పాదితం విలువలోని స్థిర భాగం ఇందులో ఉండదు.

ఇక్కడ రెండురకాల సూత్రాలున్నాయి.

I లో సూత్రాలు సరైనవి. శ్రమ దోపిడీ స్థాయిని, అంటే అదనపు విలువ రేటుని సరిగా, కచ్చితంగా చెబుతాయి

II లో సూత్రాలు శ్రమ దోపిడీ స్థాయిని, అంటే అదనపు విలువ రేటుని తప్పుగా చెబుతాయి.

మొదటి రకం సూత్రాల ప్రకారం చూద్దాం. పనిదినం 12 గంటలని అనుకుందాం. మిగిలిన అంశాలన్నీ గత సందర్భాల్లో అనుకున్నట్లే ఉంటే, వాస్తవ శ్రమ దోపిడీ ఈ దామాషాల్లో ఉంటుంది:

$$\frac{\text{6 గంటల అదనపు శ్రమ}}{\text{6 గంటల అవసర శ్రమ}} = \frac{\text{3 షిల్లింగుల అదనపు విలువ}}{\text{3 షిల్లింగుల అస్థిరపెట్టుబడి}} = 100\%$$

రెండవ రకం సూత్రాల ప్రకారం చూస్తే, ఇందుకు భిన్నంగా ఉంటుంది:

$$\frac{6 \text{ గంటల అదనపు శ్రమ}}{12 \text{ గంటలపనిదినం}} = \frac{3 \text{ షిల్లింగుల అదనపు విలువ}}{6 \text{ షిల్లింగుల ఉత్పాదితం}} = 50\%$$

ఈ ఉత్పన్న సూత్రాలు (derivative formulae) వాస్తవానికి ఏమి వ్యక్తం చేస్తాయంటే :

పనిదినం, లేక పనిదినంలో ఉత్పత్తయిన విలువ పెట్టుబడిదారుడికీ, కార్మికుడికీ ఏ దామాషాలో విభజితమవుతుందో ఆ దామాషాని వ్యక్తం చేస్తాయి. ఆ సూత్రాల్ని పెట్టుబడి స్వయం విస్తరణ స్థాయికి ప్రత్యక్ష వ్యక్తీకరణలుగా పరిగణిస్తే, ఒక తప్పుడు సూత్రమే సరైనదిగా తేలుతుంది. ఆ తప్పుడు సూత్రం ఇదే: అదనపు విలువ 100 శాతాన్ని ఎన్నడూ మించదు.

అదనపు శ్రమ అనేది పనిదినంలో, లేక ఉత్పత్తయిన విలువలో ఒక భాగం మాత్రమే. కాబట్టి అదనపు శ్రమ ఎల్లప్పుడూ పనిదినానికంటే, తక్కువగా ఉండి తీరాలి. అదనపు విలువ, ఉత్పత్తయిన మొత్తం విలువ కంటే, తక్కువగా ఉండి తీరాలి. ఏమైనా, ఈ నిష్పత్తి 100:100 అవాలంటే, అదనపు శ్రమా, పనిదినమూ రెండూ సమం కావాల్సి ఉంటుంది. అప్పుడు మొత్తం పనిదినాన్ని అదనపు శ్రమ ఆవరించుకోవాలంటే, అవసరశ్రమ సున్న అవుతుంది. అలా అవసర శ్రమ అదృశ్యం అయితే, అదనపు శ్రమకూడా అదృశ్యం అవుతుంది.ఎందుకంటే: అదనపు శ్రమ అనేది అవసర శ్రమ యొక్క ఒక ప్రమేయం (function).

$$\frac{\text{అదనపు శ్రమ}}{\text{పనిదినం}} \quad \text{లేక} \quad \frac{\text{అదనపు విలువ}}{\text{ఉత్పత్తయిన విలువ}}$$

ఈ నిష్పత్తి ఎప్పటికీ 100/100 అనే హద్దుని అందుకోలేదు. ఇక 100+ X/100 ని అసలు చేరనే చేరదు.

అయితే అదనపు విలువ రేటు, శ్రమ దోపిడీ వాస్తవస్థాయి అటువంటిది కాదు. అంటే, అది 100 శాతాన్ని దాటగలదు. ఉదాహరణగా ఎల్.డి.లేవెర్న్ అంచనా తీసుకుందాం. ఇంగ్లండ్‌లో వ్యవసాయ కార్మికుడు ఉత్పత్తైన మొత్తంలో, లేదా దానివిలువలో నాల్గింట ఒకవంతు (1/4) పొందుతాడు. పెట్టుబడిదారీ వ్యవసాయదారు నాల్గింట మూడొంతులు (3/4) పొందుతాడు. ఆ దోచుకున్న మొత్తాన్ని తర్వాత పెట్టుబడిదారుడూ, భూస్వామీ మొదలైనవాళ్ళు ఏ దామాషాలో పంచుకూంటారనే సమస్యని ప్రస్తుతం పక్కనబెడదాం. దీని ప్రకారం ఆ వ్యవసాయ కార్మికుడి అదనపు శ్రమకీ అవసరశ్రమకీ నిష్పత్తి 3:1. అంటే దోపిడీ రేటు 300% అన్నమాట.

12 గంటల పనిదినంలో ఉత్పత్తయిన విలువ 3000 రూపాయలు, కార్మికుని కూలి 500 అయితే, అదనపు విలువ 2500. అప్పుడు అదనపు విలువ రేటు = 2500/500 X 100 = 500. దీన్నిబట్టి అదనపు విలువ రేటు 100 శాతాన్ని మించవచ్చు. ఎంతైనా కావచ్చు.

పనిదినాన్ని స్థిర పరిమాణంగా చూసే ఇష్టమైన పద్ధతి, రెండో రకం ఫార్ములాల వాడకం వల్ల స్థిరపడింది. ఎందువల్లంటే ఆ ఫార్ములాల్లో అదనపుశ్రమ ఎప్పుడూ ఒక నిర్ణీత నిడివి ఉన్న పనిదినంతో పోల్చబడుతుంది. ఉత్పత్తయిన విలువ పునర్విభజనని మాత్రమే దృష్టిలో పెట్టుకున్నప్పుడు సైతం అదే జరుగుతుంది. ఇంతకు ముందే ఒక నిర్ణీత విలువలో రూపొందిన

(realised) పనిదినం తప్పనిసరిగా ఒక నిర్ణీత నిడివి గలదై తీరాలి. అప్పుడు అదనపు విలువ ఉత్పత్తయిన మొత్తం విలువతో పోల్చబడుతుంది. రెండు సందర్భాలలోనూ వచ్చే ఫలితం ఒకటే.

అదనపు విలువనీ, శ్రమ శక్తి విలువనీ ఉత్పత్తయిన విలువలో భాగాలుగా సూచించే అలవాటు, పెట్టుబడి లాక్షణీకరించే లావాదేవీని కప్పిపుచ్చుతుంది. సజీవ శ్రమశక్తితో పెట్టుబడి మారకాన్ని కప్పిపుచ్చుతుంది. అది కప్పిపుచ్చే లావాదేవీ: సజీవ శ్రమ శక్తితో అస్థిర పెట్టుబడి మారడమూ, దానిఫలితంగా కార్మికుడు ఉత్పాదితం నుంచి బహిష్కృతుడవడమూ.

ఈ అలవాటు ఆవిర్భవించింది పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలోనే. దీని (ఈ అలవాటు) అంతరార్థాన్ని ఇకమీదట బహిర్గతం చేస్తాను అంటాడు మార్క్స్. దీనివల్ల వాస్తవంగా ఉన్నది ఉన్నట్లు కాకుండా, కార్మికునికీ పెట్టుబడిదారుడికీ లేని బూటకపు సహచర్యం ఉన్నట్లు పైకి కనపడుతుంది; ఈ బూటకపు సహచర్యం ఏమంటే: ఉత్పాదితం తయారీలో ఇరువురూ సమకూర్చిన అంశాలకు అనుగుణమైన దామాషాలో ఉత్పాదితాన్ని పంచుకుంటారు. **ఇది వాస్తవం కాదు, బూటకం**

అదీ కాక, రెండో రకం సూత్రాల్ని మొదటి రకం సూత్రాల్లోకి ఎప్పుడైనా మార్చవచ్చు. ఉదాహరణకి, ఈసూత్రాన్ని తీసుకుందాం:

$$\frac{\text{6 గంటల అదనపు శ్రమ}}{\text{12 గంటలపనిదినం}}$$

దీనిప్రకారం అవసర శ్రమ ఎంత? మొత్తం పనిదినం – అదనపు శ్రమకాలం = 12–6 = 6 గంటలు. ఫలితంగా ఈక్రింది సూత్రం వస్తుంది:

$$\frac{\text{6 గంటల అదనపు శ్రమ}}{\text{6 గంటల అవసర శ్రమ}} = \frac{100}{100}$$

ఇది మొదటి రకంలో ఉన్న సూత్రం. ఇక్కడ రెండో రకం సూత్రం మొదటిరకం సూత్రంలోకి మార్చబడింది.

మూడో ఫార్ములా ఒకటుంది. ఇది మార్క్స్ అప్పుడప్పుడూ సూచించిందే. అదే ఇది:

$$\text{III.}\ \frac{\text{అదనపు విలువ}}{\text{శ్రమ శక్తి విలువ}} = \frac{\text{అదనపు శ్రమ}}{\text{అవసర శ్రమ}} = \frac{\text{చెల్లించబడని శ్రమ}}{\text{చెల్లించబడిన శ్రమ}} \left\{\frac{\text{Unpaid labour}}{\text{paid labour}}\right\}$$

పై పరిశోధనల తర్వాత కూడా,

$$\frac{\text{చెల్లించబడని శ్రమ}}{\text{చెల్లించబడిన శ్రమ}}$$

అనే సూత్రాన్ని బట్టి పెట్టుబడిదారుడు శ్రమశక్తికి కాక, శ్రమకే చెల్లిస్తున్నాడు అని నిర్ధారించడం ఎంతమాత్రమూ సాధ్యపడదు. ఈ సూత్రం:

$$\frac{\text{అదనపు శ్రమ}}{\text{అవసర శ్రమ}}$$

అనే సూత్రాన్ని సులభపరిచే వ్యక్తీకరణ మాత్రమే.

## చెల్లించబడని శ్రమ

పెట్టుబడిదారుడు శ్రమశక్తి విలువ చెల్లిస్తాడు. మారకంలో సజీవశ్రమశక్తిని వాడుకునే అధికారం పొందుతాడు. దాన్ని ***ధ్వంసం చెయ్యకుండా వినియోగించునే హక్కు*** (usufruct) అతనికి లభిస్తుంది. ఆహక్కు రెండు భాగాలకు వ్యాపిస్తుంది. ఒక దాంట్లో శ్రామికుడు తన శ్రమశక్తి విలువకి సమానమైన విలువని, అంటే దాని సమానకాన్ని, ఉత్పత్తి చెస్తాడు. మార్కెట్లో ముందుగా శ్రమ శక్తికి చెల్లించిన విలువను తిరిగి పెట్టుబడిదారుడు తీసుకుంటాడు. అప్పటికి ఇచ్చిందీ తీసుకున్నదీ సరిపోయింది. చెల్లుబోయింది.

ఇక రెండో భాగం అదనపు శ్రమ భాగం. అందులో శ్రమశక్తిని వినియోగించుకునే హక్కు, పెట్టుబడి దారుడి కొరకు విలువని ఉత్పత్తిచేస్తుంది. దానికి పెట్టుబడి దారుడుకి సమానకం ఏమీ ఖర్చు కాదు. ఈ శ్రమ శక్తి వ్యయం అతనికి ఉచితంగా వస్తుంది. అదనపు శ్రమని చెల్లించబడని శ్రమ అనడం ఈ అర్థంలోనే. ఒక సరుకు విలువ ఆ సరుకులో ఇమిడివున్న చెల్లించబడిన శ్రమ మొత్తానికీ, చెల్లించబడని శ్రమ మొత్తానికీ సమానం – Theories of Surplus Value vol.2. p30

## చెల్లించబడని శ్రమ మీద హక్కు పెట్టుబడిదారుడిదే

అందువల్ల ఆడం స్మిత్ అన్నట్లు అది శ్రమ మీద అధికారం మాత్రమే కాదు, అది ప్రధానంగా చెల్లించబడని శ్రమ మీద అధికారం కూడా. అదనపు విలువ తర్వాత దాని ప్రత్యేక రూపాల్లో (లాభం, వడ్డీ, కౌలు) ఏరూపం తీసుకున్నా సరే, అది (అదనపు విలువ) సారాంశంలో 'చెల్లించబడని శ్రమ' యొక్క పదార్థీకరణే. కాబట్టి పెట్టుబడి స్వయం విస్తరణ రహస్యం బయటపడుతుంది: ఒక నిర్దిష్ట పరిమాణమున్న చెల్లించబడని ఇతరుల శ్రమని వాడుకునే హక్కు పెట్టుబడి దారుడికి ఉండడం.

*ఈ విషయాన్ని మార్క్స్ అప్పుడప్పుడు చెబుతుంటాడు. ఎందుకంటే, దీన్ని గ్రహింపచెయ్యడం కీలకమైనది. లేకుంటే అదనపు విలువ పెట్టుబడిదారుడిది కాదు, కార్మికుడిది. పెట్టుబడి దారుడు అక్రమంగా లాక్కుంటున్నట్లు కనిపిస్తుంది. కాని నిజానికి మారకం విలువ చెల్లించిన వానికే, సరుకు వాడుకునే హక్కు ఉంటుంది.*

# భాగం 6

## వేతనాలు

అధ్యాయం 19 శ్రమశక్తి విలువ/ధర వేతనంగా మారడం

అధ్యాయం 20 కాలం వేతనాలు

అధ్యాయం 21 శాల్తీ వేతనాలు

అధ్యాయం 22 వేతనాల్లో జాతీయ వ్యత్యాసాలు

# అధ్యాయం 19

# శ్రమశక్తి విలువ/ధర వేతనంగా మారడం

శ్రమ శక్తి అనే కాటగరీ ఆరో అధ్యాయం (శ్రమశక్తి అమ్మకమూ, కొనుగోలూ) లో వస్తుంది. అక్కడ శ్రమ శక్తి నిర్వచనం ఉంటుంది. దాని విలువలో ఏఏ అంశాలు ఉంటాయో వివరణ ఉంటుంది. ఆ శ్రమ శక్తి విలువ కన్నా, అది ఉత్పత్తి చేసే విలువ ఎక్కువ అని ఉంటుంది.

**సరుకు శ్రమ కాదు, శ్రమ శక్తి** – అని ఈ 19 వ అధ్యాయంలో తేలుతుంది. బూర్జువా సమాజపు ఉపరితలం మీద వేతనం అనేది శ్రమ ధర అయినట్లు కనిపిస్తుంది. అంటే కొంత శ్రమకి చెల్లించబడిన కొంత డబ్బు అనిపిస్తుంది. ఆవిధంగా ప్రజలు శ్రమ విలువ అనీ, డబ్బులో దాన్ని శ్రమ 'సహజ ధర' లేక 'అవసర ధర' అనీ మాట్లాడుతుంటారు. మరొకపక్క, సహజధరకు పైకీ కిందికీ ఊగిసలాడే మార్కెట్ ధరల గురించి చెబుతుంటారు. శ్రమని ధర ఉన్న సరుకుగా ఎవరైనా అనుకోవచ్చు. కాని, వాస్తవానికి శ్రామికుడు అమ్మేది శ్రమ శక్తిని, శ్రమని కాదు. అయినా అమ్ముతున్నది శ్రమనే అనిపిస్తుంది.

### సరుకు కాని శ్రమ సరుకు అని ఎందుకు అనిపిస్తుంది?

1. చేసిన శ్రమని బట్టి చెల్లింపు ఉంటుంది. చేసిన శ్రమ ఎంత అనేది, చేసిన టైమ్‌ని బట్టో, సరుకుల పరిమాణాన్ని బట్టో లెక్కకొస్తుంది. పరిస్థితుల్ని బట్టి పనిదినం పొడవు 8,10,12 గంటలుగా ఉంటుంది. పనిదినం ఇన్ని గంటలు అని కార్మికుడికి తెలుసు. కూలీ ఎంతో కూడా తెలుసు. దాన్నిబట్టి గంట శ్రమకి ఇంత అని లెక్కించుకుంటాడు. 10 గంటలు పనిచేస్తే రు.400 తీసుకునే వాడికి గంట శ్రమ విలువ రు.40 అనుకోవడం సహజమే. చేసిన శ్రమ పరిమాణాన్ని బట్టి అతని వేతనం ఉంటుంది. కనుక తను అమ్ముతున్నది 'శ్రమని' అనుకుంటాడు.
2. శ్రమ చేశాకనే వేతనం వస్తుంది. మార్కెట్లో తన శ్రమశక్తిని అమ్ముకున్నాక, ఇతర సరుకులు అమ్మిన వాళ్ళు పోయినట్లు, ఇంటికి వెళ్ళడం కుదరదు. పనిస్థలానికి వెళ్ళి, అక్కడ స్వయంగా ఉండి ఒప్పుకున్నన్ని గంటలపాటు శ్రమ చేస్తాడు. అందువల్ల తన వేతన ఒప్పందంలో, తాను అమ్ముతున్నది శ్రమనే అనుకోవడం సహజమే. ఆవిధంగా చెల్లించే రూపం బట్టి మాత్రమే కాదు, అమ్మిన సరుకుని ఇచ్చే తీరుని బట్టి కూడా పనివాళ్ళు అమ్ముతున్నది శ్రమ శక్తిని కాకుండా, సరిగ్గా శ్రమనే అనిపిస్తుంది. అమ్మిన శ్రామికుడూ, కొన్న పెట్టుబడిదారుడూ మారకం అయిన సరుకు శ్రమ అనే అనుకుంటారు.

**నాటి ఆర్థికవేత్తలు కూడా శ్రమే సరుకు అనుకున్నారు.** " తాను తన కార్మికుల శ్రమను కొంటున్నాననీ, డబ్బు చెల్లిస్తున్నాననీ అనుకునే పారిశ్రామికుని ఆనాటి అవగాహనను పారిశ్రామిక ఆచరణ నుండి సాంప్రదాయిక అర్థశాస్త్రం స్వీకరించింది"[1] ఆర్థికవేత్తలు విషయాన్ని లోతుగా పరిశీలించకుండా అప్పటికి వాడుకలో ఉన్న శ్రమవిలువ అనే పదాన్ని అదే అర్థంలో తీసుకున్నారు. ఆ ప్రకారం విశ్లేషణ కొనసాగించారు. వాళ్ళకి చిక్కేర్పడింది.

## శ్రమ సరుకయితే, శ్రమవిలువ ఎలా నిర్ణయమవుతుంది?

వాళ్ళు ఈపనికి పూనుకోలేదు. ఒకవేళ పూనుకున్నా, ఇది నిర్ణయమయ్యేది కాదు. ఎందుకో చూద్దాం.

**1. అన్ని విలువలకూ కొలమానం శ్రమ.** అయినప్పుడు శ్రమ విలువని కూడా శ్రమలోనే చెప్పాలి. దీని ప్రకారం అయితే :

1 గంట శ్రమ = 1 గంట శ్రమ అనాలి

**ఒకగంట శ్రమ ఒక గంట శ్రమకి సమానం అని చెబితే అర్థం ఉండదు.** అది పునరుక్తి, పైగా అర్థరహిత వ్యక్తీకరణ. ఎందుకంటే, వస్తువులకు విలువని ఏర్పరచేది స్వయంగా విలువని కలిగి ఉండదు. శ్రమ విలువ అనేది తార్కికంగా అసాధ్యమైన విషయం. ఏ సరుకు కైనా విలువ ఉంటుంది. విలువ లేనిది ఏదీ సరుకు కాదు. పైన తేల్చినట్లు, శ్రమకి విలువ ఉండదు. కనుక శ్రమ సరుకు కాజాలదు.

**2. శ్రమ సరుకుగా మార్కెట్లో అమ్మబడాలంటే, అమ్మకానికి ముందే అది సిద్ధమై ఉండాలి**

మార్కెట్ కొచ్చే ఇతరసరుకులన్నీ ముందే ఉత్పత్తయినవి. శ్రమ ఉత్పత్తి కాకముందే మార్కెట్ కొస్తుంది. తనకన్నా ముందు ఈ విషయాన్ని గమనించిన పేరుతెలియని వ్యక్తిని కోట్ చేస్తాడు: "శ్రమని సరుకు అన్నారంటే, అది మొదట ఉత్పత్తిచేయ్యబడి, మార్కెట్లో ఉన్న సరుకులతో మారకంకోసం మార్కెట్ కి తేబడిన సరుకు వంటిది కాదు; మార్కెట్లోకి తేబడినప్పుడే సృజించబడినది, లేదు అది సృజించబడకముందే మార్కెట్ కి తేబడింది."[2]

ఈ వైరుధ్యాలని కాసేపు అలావుంచుదాం.

**3. శ్రమ సరుకయితే అదనపు విలువ ఉండదు.** శ్రమ గనక సరుకుగా మారకం అయ్యే పనయితే, దాని విలువ అది ఉత్పత్తిచేసిన విలువే. కార్మికులు తమ శ్రమకి, వాళ్ళు సృజించిన విలువకి చెల్లింపు పొందితే, అదనపు విలువ ఉండదు. పెట్టుబడిదారీ విధానమే రద్దవుతుంది. అదనపు విలువ ఉండాలంటే కార్మికులు శ్రమ విలువకన్నా తక్కువ పొందాలి. అలా శ్రమ విలువకన్నా తక్కువ పొందితే, సమాన విలువలే మారతాయి అనే విలువ నియమమే భంగం అవుతుంది. కార్మికుడు అమ్ముతున్న సరుకు శ్రమ అనుకుంటే, పెట్టుబడిదారీ విధానాన్ని వివరించలేము. అంటే అదనపు విలువ ఎలా ఉత్పత్తి అవుతుందో చెప్పలేము. కాబట్టి శ్రమ సరుకు కాదు.

**4. మారకంలో గతశ్రమకి మరింత సజీవ శ్రమ వస్తుంది అనుకున్నవాళ్ళున్నారు.** తక్కువ పరిమాణంగల గత శ్రమ = ఎక్కువ పరిమాణంగల ప్రస్తుత శ్రమ – అని వాళ్ళ అభిప్రాయం.

పెట్టుబడిదారుడు ఇచ్చేది డబ్బు, అంటే చెయ్యబడిన శ్రమ. కార్మికుడు ఇచ్చేది చెయ్యబోయే శ్రమ. మారకం అవుతున్న శ్రమల రూపాల్లో తేడా ఉంది. ఇచ్చే శ్రమ రూపం వేరు, పుచ్చుకునే శ్రమ రూపం వేరు. ఒకటి సజీవ శ్రమ, రెండోది వస్తురూపంలో ఉన్న శ్రమ. వస్తువులో ఇంకివున్న శ్రమ. ఈ రూప భేదాన్ని బట్టి, మారకంలో మృతశ్రమకి మరింత సజీవ శ్రమ వస్తుంది అన్నారు. అప్పటికే పూర్తయిన శ్రమకీ, తదుపరి చెయ్యబోయే శ్రమకీ మారక ఒప్పందంలో పెట్టుబడిదారుడు కార్మికుడికన్నా ఎక్కువ పొందుతాడు – అంటాడు స్విస్ ఆర్థికవేత్త

సిస్మాండీ (1773-1842). అలా అనుకున్నందువల్ల ఒరిగిందేమీ లేదనీ, రూపంలో ఉన్న తేడా, తక్కువ శ్రమ ఎక్కువ శ్రమతో మారుతుందనే అసమాన మారకాన్ని వివరించజాలదనీ అంటాడు మార్క్స్. రూపం మారినంతమాత్రాన పరిమాణం మారదు. శ్రమ ఒక వస్తువులో ఇంకినంతమాత్రాన అది అకస్మాత్తుగా మరింత శ్రమ అవదు. అంతకుముందు ఎంతో, ఇప్పుడూ అంతే ఉంటుంది - కాకపోతే వేరే రూపంలో. ఐస్ ముక్కల్ని కరిగించినంత మాత్రాన వాటిలో ఉన్న నీటి పరిమాణం మారనట్లే.

**5. పోతే, ఒక సరుకు విలువ పరిమాణాన్ని నిర్ణయించేది ఆసరుకులో వాస్తవంగా రూపొందిన శ్రమ కాదు; దాని ఉత్పత్తికి సామాజికంగా అవసరమైన సజీవశ్రమ.** దీని దృష్ట్యా చూస్తే ఇది మరీ అసంబద్ధం అవుతుంది.

ఉదాహరణకి, 6 గంటల శ్రమ ఇమిడి వున్న వస్తువు, నూతన ఆవిష్కరణ వల్ల 3 గంటలలోనే తయారయిందనుకుందాం. అప్పుడు ఆవస్తువు విలువ సగం అవుతుంది. దాని విలువే కాదు, ఆరకం వస్తువుల విలువ - అంతకు ముందే తయారయినవున్న వాటి విలువ కూడా- సగానికి పడిపోతుంది. మునుపు 6 గంటలు అవసరమున్న సామాజిక శ్రమ ఇప్పుడు 3 గంటలకు తగ్గుతుంది. ఒక సరుకు విలువ పరిమాణం నిర్ణయమయ్యేది ఆసరుకులో వాస్తవంగా ఇమిడివున్న శ్రమ పరిమాణం చేతకాదు, సామాజికంగా అవసరమైన శ్రమ పరిమాణం చేత.

## శ్రమ విలువ అనేది ఒక ఊహాత్మక వ్యక్తీకరణ

డబ్బువాడితో మార్కెట్లో ఎదురుపడేది నిజానికి శ్రమ కాదు, శ్రామికుడు. అతను డబ్బువాడికి అమ్మేది శ్రమశక్తిని. అతని శ్రమ వాస్తవంగా మొదలయ్యాకాగానే, అది అప్పటికే అతనిది కాకుండా పోతుంది; అందువల్ల అతను దాన్ని ఇకపై అమ్మలేడు. శ్రమ అనేది విలువ సారమూ, కొలమానమూ, కాని శ్రమ స్వతస్సిద్ధంగా విలువని కలిగి ఉండదు. స్వయంగా దానికి విలువ ఉండదు. ఇంగ్లిష్ సోషలిస్ట్ రచయిత హాడ్జ్ స్కిన్ (1787-1869) అన్నట్లు *"ఏకైక విలువ ప్రమాణం..సకలసంపద సృష్టికర్త అయిన శ్రమ సరుకు కాదు."*

శ్రమ విలువ అనే వ్యక్తీకరణలో విలువ భావం పూర్తిగా రూపు మాసిపోతుంది; అంతే కాదు, ఆ భావమే తల్లకిందౌతుంది. భూమి విలువ అనేది ఎంత ఊహాత్మకమో శ్రమ విలువ అనేదీ, అంతే ఊహాత్మకం.

ఏమైనప్పటికీ, ఈ ఊహాత్మక వ్యక్తీకరణలు ఉత్పత్తి సంబంధాలనుండే తలెత్తుతాయి. అవి సారభూతమైన సంబంధాల గోచర రూపాల కాటగరీలు.

***వస్తువులు కనబడడంలో తరచుగా తలకిందుల రూపంలో***

***ఉంటాయని ప్రతి సైన్స్ కీ తెలుసు- ఒక్క రాజకీయ అర్థశాస్త్రానికి తప్ప***

అంటే కనబడే దానికీ, దానికి ఆధారమైన అంతర్లీన శక్తులకీ వ్యత్యాసం ఉంటుందని అన్ని సైన్సులు భావిస్తాయి. ఆ అంతర్లీన శక్తులేవో కనుక్కునే యత్నం చేస్తాయి. అర్థశాస్త్రం అలాకాదు వాస్తవాన్ని కాకుండా కనబడేదాన్నే సరైనదిగా భావిస్తుంది. ఇక్కడున్న ఫుట్ నోట్ తార్కికంగా సాధ్యం కాని ఆ రూపాల్ని కూడా చర్చించాల్సిన ఆవశ్యకతని నొక్కి చెబుతుంది. ప్రౌఢన్ తార్కికంగా అసాధ్యమైన శ్రమ విలువ అనే దాని వెనక దాగివున్న వాస్తవాన్ని గుర్తించలేదు. శ్రమ విలువ

అనే వ్యక్తీకరణని కేవలం అలంకారిక వ్యక్తీకరణ, అన్నాడు. అంటే, నిజ ప్రపంచంలో దేనినీ సూచించనిది అని. అలా అనడం, వివరించబూనడం విశ్లేషణలో అసమర్ధతని చాటుతుంది అంటాడు మార్క్స్.

## శ్రమ విలువ– సాంప్రదాయ అర్థశాస్త్రం

సాంప్రదాయ అర్ధశాస్త్రం రోజువారీ జీవితం నించి శ్రమ ధర అనే కాటగరీని ఏ విమర్శా లేకుండానే అరువు తెచ్చుకున్నది. ఈ శ్రమ ధర ఎలా నిర్ణయమవుతుంది? అనే ప్రశ్న వేసుకుంది. సరఫరా గిరాకీల్లో మార్పులు, మార్కెట్ ధరల్లో హెచ్చుతగ్గుల్ని తప్ప మరేమీ వివరించ లేవు అని గ్రహించింది. సరఫరా గిరాకీలు సమంగా ఉంటే, ధరల ఊగిసలాట ఆగిపోతుంది. అప్పుడుండే ధర సహజధర. దీన్ని ఫిజియోక్రట్లు అవసర ధర అన్నారు. ఆడం స్మిత్ శ్రమ సహజ ధర అన్నాడు. అది డబ్బులో వ్యక్తమైన శ్రమ విలువ.

## ఈ సహజ ధర ఎలా నిర్ణయమవుతుంది? అనేదే సమస్య

ఇతర సరుకుల ధరల లాగే, శ్రమ విలువ, శ్రమ ఉత్పత్తి ఖర్చు చేత నిర్ణయమవుతుంది. స్వయంగా శ్రమ ఉత్పత్తి ఖర్చు గురించిన అన్వేషణ, వలయంలో పడి గిరగిరా తిరిగిందే గాని ముందుకు పోలేదు. ఉన్న చోటనే ఉండి పోయింది. అర్ధశాస్త్రంలో ఈ మూల ప్రశ్న స్థానాన్ని మరొక ప్రశ్న అక్రమించింది:

## శ్రామికుని ఉత్పత్తి ఖర్చు ఎంత?

"అన్ని విలువలకూ కొలమానం శ్రమ అయితే , నిజంగా మనం శ్రమ విలువని శ్రమలో మాత్రమే వ్యక్తం చెయ్యగలం. కానీ ఒక గంట శ్రమ ఒక గంట శ్రమకు సమానమని మాత్రమే తెలిస్తే, దాన్ని గురించి మనకు బొత్తిగా ఏమీ తెలియదన్నమాట. ఇది మనల్ని వెంట్రుక వాసి కూడా గమ్యం దగ్గరికి తీసుకు పోదు; మనం ప్రదక్షిణం చేస్తూనే వుంటాం.

కనుక సాంప్రదాయ **అర్థశాస్త్రం మరొకదారి ప్రయత్నించింది.** అది ఇలా అన్నది: సరుకు విలువ సరుకు ఉత్పత్తి ఖర్చుకు సమానం. మరి శ్రమ వుత్పత్తి ఖర్చు యెంత? యీప్రశ్నకు జవాబు చెప్పడానికి అర్ధ శాస్త్రజ్ఞులు తర్క శాస్త్రాన్ని కొంత విరూపం చేయాలి. శ్రమ యొక్క వుత్పత్తి ఖర్చుని పరిశీలించడానికి బదులు – దురదృష్ట వశాత్తూ ఇది నిర్ధరించబడజాలదు – వాళ్ళు కార్మికుని వుత్పత్తి ఖర్చుని పరిశీలించడానికి పూనుకుంటారు. దీనిని నిర్ధరించవచ్చు"[3]

కార్మికునికి పండ్రెండు గంటల శ్రమ విలువ 600 రూపాయలు. పెట్టుబడిదారుడికి అది 1200 రూపాయలు. అందులో 600 రూపాయలు అతను కార్మికునికి వేతనంగా చెల్లించి, 600 రూపాయలు సొంతానికి జేబులో వేసుకుంటాడు.

"అవిధంగా శ్రమకు ఒకటికాక రెండు విలువలు ఉంటాయి, పైగా చాలా భిన్నమైన విలువలు.... కార్మికుడు పండ్రెండు గంటల శ్రమకు గాను, దానికి సామానమైన విలువగా కార్మికుడు 6 గంటల ఉత్పాదితాన్ని పొందుతాడు. కనుక శ్రమకు రెండు విలువలైనా ఉండాలి, ఒకటి మరొకదానికి రెట్టింపుగా ఉంటూ; లేదా పండ్రెండు ఆరుకు సమానం కావాలి! ఉభయ సందర్భాలలోనూ మనకు లభించేది వట్టి చెత్త.

"శ్రమ కొనుగోలు, అమ్మకాల గురించీ, శ్రమ విలువను గురించీ మనం మాట్లాడినంతసేపూ, యెంత గింజుకున్నా మనం ఈ అంతర్వైరుధ్యం నుండి బయటపడలేం. అర్థ శాస్త్రజ్ఞులకు కూడా యిదే జరిగింది. సాంప్రదాయ అర్థశాస్త్రపు చివరి శిశువైన రికార్డో ధోరణి ప్రధానంగా యీ అంతర్వైరుధ్యం పరిష్కార సాధ్యం కాక పోయినందువల్లనే ముక్క చెక్కలైంది. యీ పద్మవ్యూహం నుండి బయటకి దారి కనుక్కున్నవాడు కార్ల్ మార్క్స్."[4]

కార్మికుడు అమ్మే సరుకు, పెట్టుబడిదారుడు కొనే సరుకు, శ్రమకాదు శ్రమశక్తి అని నిరూపించడం ద్వారా మార్క్స్ సమస్యని పరిష్కరించాడు. "అత్యుత్తమ అర్థశాస్త్రజ్ఞులు శ్రమ విలువ వద్ద బయలుదేరినంతకాలం యే యిబ్బంది మూలంగా దు:ఖభాజనులైనారో, అది మనం శ్రమ శక్తి వద్ద బయలుదేరిన వెంటనే అదృశ్యమవుతుంది."[5]

**అర్థశాస్త్రజ్ఞుల పొరపాటు.** అర్థశాస్త్రజ్ఞులు శ్రమ  వుత్పత్తి ఖర్చుగా భావించింది శ్రమ యొక్క వుత్పత్తి ఖర్చుకాక ప్రాణంగల కార్మికుని వుత్పత్తి ఖర్చే. **వాళ్ళు శ్రమ విలువ అన్నది నిజానికి శ్రామికునిలో ఉండే శ్రమ శక్తి విలువనే.** శ్రమ శక్తి అనేది శ్రమ కాదు. రెండూ భిన్నమైనవి. ఒక యంత్రం అదిచేసే పనినుండి ఎలా భిన్నమైనదో, శ్రమ శక్తికూడా అలాగే, శ్రమ నుండి భిన్నమైనది.

శ్రమ మార్కెట్ ధరకీ, శ్రమవిలువ అనబడే దానికీ ఉండే తేడానీ, శ్రమ విలువకి లాభం రేటుతోనూ, శ్రమతో ఉత్పత్తయిన సరుకుల విలువలకూ ఉన్న సంబంధాన్నీ– అలాంటి వాటిని అధ్యయనం చెయ్యడంలో అర్థశాస్త్రజ్ఞులు తలమునకలైనారు. వాళ్ళు ఏనాడూ తమ విశ్లేషణా క్రమం శ్రమ మార్కెట్ ధరల నించి వాళ్ళు ఊహించిన శ్రమవిలువ దాకా మాత్రమే కాక, ఈ శ్రమ విలువ శ్రమశక్తి విలువగా అయ్యేదాకా సాగినట్లు వాళ్ళు తెలుసుకోలేదు. సాంప్రదాయ అర్థశాస్త్రం తన విశ్లేషణ ఫలితాల్ని గ్రహించలేక పోయింది; అది విమర్శ చెయ్యకుండానే శ్రమ విలువ, శ్రమ సహజ ధర వగైరా కాటగరీల్ని పరిశీలనలో ఉన్న విలువ సంబంధాన్ని వ్యక్తీకరించడానికి సరిపోయే  కాటగరీలుగా అంగీకరించింది. ఆవిధంగా అది పరిష్కారసాధ్యం కాని గందరగోళంలోకీ, వైరుధ్యంలోకీ కూరుకుపొయింది. వాటిని గురించి ముందుముందు చూస్తాం.  పైపై రూపాలను ఆరాధించే అశాస్త్రీయ ఆర్థిక వేత్తల  డొల్లతనానికి అది కార్యకలాపాల ఆధారాన్ని చేకూరుస్తుంది.

ఇప్పుడు శ్రమ శక్తి విలువ, శ్రమ శక్తి ధర అనేవి ఈ మారిన పరిస్థితిలో వేతనాలుగా ఎలా కనిపిస్తాయో చూద్దాం. రోజువారీ శ్రమ శక్తి విలువని లెక్కించే పద్ధతి తెలిసిందే. మామూలు పనిదినం 12 గంటలనీ, రోజు శ్రమ శక్తి విలువ 600 రూపాయలనీ అనుకుందాం. ఈ 600 రూపాయలూ 6 గంటల శ్రమ వల్ల ఏర్పడిన విలువకు డబ్బురూపం. కార్మికుడు 600 రూపాయలు పొందితే, అతను 12 గంటలపాటు చర్యలో ఉంచిన శ్రమశక్తి విలువని తీసుకున్నాడన్నమాట. ఇప్పుడు రోజు శ్రమశక్తి విలువని, రోజు శ్రమ విలువలోనే చెబితే, ఇదిగో ఈఫార్ములా వస్తుంది: 12 గంటల శ్రమ విలువ 600 రూపాయలు.

ఆవిధంగా శ్రమ శక్తి విలువ, శ్రమ విలువని (డబ్బులో చెబితే దాని అవసర ధరని) నిర్ణయిస్తుంది. మరొకపక్క, శ్రమ శక్తి ధర  దాని విలువకి భిన్నంగా ఉంటే, అదే తరహాలో శ్రమ ధర కూడా శ్రమ విలువ అనబడే దానికి (so-called value) భిన్నంగా ఉంటుంది.

శ్రమ విలువ అనేది శ్రమ శక్తి విలువకి హేతువిరుద్ధమైన వ్యక్తీకరణ మాత్రమే కనుక దాన్ని బట్టి, శ్రమ విలువ ఎప్పుడైనా సరే, అది ఉత్పత్తిచేసే విలువకన్నా తక్కువగా ఉండాలి. కారణం: పెట్టుబడిదారుడు ఎప్పుడూ శ్రమ శక్తి సొంత విలువ పునరుత్పత్తికి అవసరమయ్యే కాలం కంటే ఎక్కువ కాలం పనిచేయిస్తాడు. పై ఉదాహరణలో, 12 గంటలు చర్య జరిపే శ్రమ శక్తి విలువ 600 రూపాయలు. దాని పునరుత్పత్తికి 6 గంటల శ్రమ పడుతుంది. మరొకపక్క, ఆ శ్రమశక్తి ఉత్పత్తిచేసే విలువ 1200 రూపాయలు - కారణం శ్రమ శక్తి చర్య 12 గంటలు. కనుక, శ్రమ శక్తి ఉత్పత్తిచేసే విలువ ఎంతనేది ఆ శ్రమ శక్తి విలువని బట్టి ఉండదు. అది చలనంలో ఉండే కాలం పొడవుని బట్టి ఉంటుంది. ఆవిధంగా తొలిచూపుకి అసంబద్ధం అనిపించే ఫలితం- 1200 రూపాయల విలువని ఉత్పత్తిచేసే శ్రమ విలువ 600 రూపాయలు - అనేది వస్తుంది

ఒక ఉత్పాదితం మారకం విలువ అందులో ఇమిడివున్న శ్రమ కాలానికి సమానమైతే, ఒక పనిదినం మారకం విలువ ఆరోజు ఉత్పత్తయ్యే ఉత్పాదితం మొత్తానికీ సమానం అవుతుంది. అంటే వేతనం శ్రమ ఉత్పాదితానికి సమానం అయి తీరాలి. అయితే వాస్తవం అందుకు విరుద్ధంగా ఉంది.

మరికొంత పరిశీలిద్దాం. 600 రూపాయలతో పనిదినంలో 6 గంటలకు అంటే కొంత భాగానికి మాత్రమే చెల్లింపు ఉన్నప్పటికీ, చెల్లింపు లేని 6 గంటలతో సహా మొత్తం 12 గంటలకు చెల్లింపు ఉన్నట్లు కనబడుతుంది. ఆవిధంగా శ్రమదినంలోని అవసర శ్రమ భాగం, అదనపు శ్రమ భాగం, చెల్లించబడిన శ్రమ, చెల్లించబడని శ్రమ అనే విభజన ఆనవాలు లేకుండా పోతుంది. శ్రమంతా చెల్లించబడిన శ్రమ లాగే కనబడుతుంది. కార్వేలో శ్రామికుడు తనకోసం చేసే శ్రమా, అతని యజమాని కోసం చేసే నిర్బంధ శ్రమా, స్థలకాలాల్లో వేరైనవిగా స్పష్టాతిస్పష్టంగా ఉంటుంది. బానిస శ్రమలో తనకోసం తాను చేసే శ్రమ భాగం సైతం యజమానికోసం చేసే శ్రమగా కనిపిస్తుంది. బానిస శ్రమ మొత్తం చెల్లించబడని శ్రమగా కనబడుతుంది. ఇందుకు భిన్నంగా, వేతన శ్రమలో అదనపు శ్రమ లేక చెల్లించబడని శ్రమ సైతం చెల్లించ బడినట్లు అగపడుతుంది. అక్కడ ఆస్తి సంబంధం బానిసశ్రమ తనకోసం చేసే శ్రమని దాస్తుంది. ఇక్కడ డబ్బు సంబంధం వేతన శ్రామికుని యొక్క ఫలితం పొందని శ్రమని కప్పిపుచ్చుతుంది.

దీన్ని బట్టి, శ్రమ శక్తి విలువ లేక ధర వేతన రూపంలోకి లేదా శ్రమ విలువ /శ్రమ ధర లోకి పరివర్తన చెందడానికి ఉన్న ప్రాధాన్యతని అర్థం చేసుకోవచ్చు. ఈ ఇంద్రియా గోచర రూపం వాస్తవ సంబంధాన్ని కప్పిపుచ్చుతుంది, కనిపించకుండా చేస్తుంది. నిజానికి దానికి వ్యతిరేకమైన సంబంధం ఉన్నట్లు చూపిస్తుంది.

**వేతన రూపం ఈక్రింది వాటికి ఆధారం అవుతుంది:**

1. ధర్మానికి సంబంధించి శ్రామికుడికీ, పెట్టుబడిదారుడికీ ఉండే భావాలకీ
2. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి సంబంధించి, వివరణ దొరకని సకలవిషయాలకీ
3. స్వేచ్ఛకి సంబంధించి పెట్టుబడిదారీ విధానానికున్న భ్రమలకీ
4. అశాస్త్రీయ అర్థశాస్త్రజ్ఞులు పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించడానికి చెప్పే అన్ని మాయమాటలకీ, చేసే వాదనలకీ ఈ రూపమే ఆధారం.

**వేతన రూపం అవసరం ఏమిటి?** వేతనం గుట్టు గ్రహించదానికి చాలా కాలం పట్టింది. కాని దాని అవసరం ఏమిటో, అది ఉండడానికి కారణం ఏమిటో (raison d'etre) తెలుసుసుకోవడం కన్నా సులువైనది వేరొకటి లేదు. శ్రమకీ, పెట్టుబడికీ మారకం మొదట అన్ని ఇతర సరుకుల అమ్మకం కొనుగోలుల లాగే మనసుకి తోస్తుంది. ఇందులో న్యాయవేత్త చైతన్యం, మహా అయితే, ఒక పాదార్థిక భేదాన్ని గుర్తిస్తుంది. ఆ భేదం సమానత్వ ఫార్ములా ద్వారా వ్యక్తమయ్యే భేదం. ఆ ఫార్ములా :

నీవు ఇవ్వడానికి, నేను ఇస్తా, నీవు ఉత్పత్తి చెయ్యడానికి నేను ఇస్తా; నీవు ఇవ్వడానికి నేను ఉత్పత్తి చేస్తా; నీవు ఉత్పత్తి చెయ్యడానికి నేను ఉత్పత్తి చేస్తా.

ఇక పోతే, మారకం విలువా, ఉపయోగపు విలువా అనేవి సరిపోల్చతగని పరిమాణాలు. అందువల్ల, శ్రమ విలువ, శ్రమధర అనే వ్యక్తీకరణలు పత్తి విలువ, పత్తి ధర లాగే అనిపిస్తాయి. వీటికన్నా అవేమీ హేతువిరుద్ధమైన వ్యక్తీకరణలుగా అనిపించవు. పైపెచ్చు, శ్రామికుడు శ్రమ ఇచ్చిన తర్వాతనే వేతనం ముదుతుంది. అంతిమంగా, శ్రామికుడు పెట్టుబడిదారుడికి సరఫరా చేసేది వాస్తవానికి అతని శ్రమశక్తిని కాదు, శ్రమశక్తి చర్యని; బట్టలు కుట్టడం, బూట్లు చెయ్యడం, దారం వడకడం వంటి ఏదో ఒక నిర్దిష్ట, ప్రయోజనకర శ్రమని. ఇదే శ్రమ, మరొకపక్క, విలువని సృజించే అంశం. ఆవిధంగా అది అన్ని ఇతర సరుకులకూ భిన్నమైన ఒక ధర్మాన్ని కలిగి ఉంటుంది. **ఈ విషయం మామూలు బుర్రలకు ఎక్కదు.**

12 గంటల శ్రమకి 6 గంటలలో ఉత్పత్తయ్యే విలువని (600 రూపాయలు) మాత్రమే తీసుకునే కార్మికుడి వైపునించి చూద్దాం. వాస్తవానికి అతనికి 12 గంటల శ్రమ 600 రూపాయలు కొనే సాధనం. అతని శ్రమ శక్తి విలువ మారవచ్చు. అతని జీవితావసరాల విలువ 600 నించి 800 రూపాయలకు పెరగవచ్చు. అలాగే, 600 నించి 400లకు తగ్గవచ్చు.లేక,అతని శ్రమ శక్తి విలువ మారకుండా అలాగే ఉన్నా, సరఫరా గిరాకీల సంబంధాల్లో మార్పులు వచ్చి, శ్రమ శక్తి విలువ 600 నించి 800 రూపాయలకు పెరగవచ్చు. 600 నించి 400 లకు తగ్గవచ్చు. అయితే అతను ఎప్పుడూ 12 గంటల శ్రమని ఇస్తాడు. అందువల్ల తను పొందే సమానకంలో వచ్చే ప్రతి మార్పు అతనికి ఎలా కనబడుతుందంటే: తన 12 గంటల శ్రమ విలువ లేక ధరలో వచ్చిన మార్పుగా కనబడుతుంది. ఈ పరిస్థితి పనిదినాన్ని స్థిర పరిమాణంగా భావించిన స్మిత్ ని తప్పుదోవ పట్టించింది. ఆ తప్పుదోవ ఇది: జీవితావసరాల విలువ మారినప్పటికీ, శ్రమ విలువ స్థిరంగానే ఉంటుంది; అందువల్ల, అదే పనిదినం శ్రామికుడికి ఎక్కువ డబ్బులోనో, తక్కువ డబ్బులోనో ప్రాతినిధ్యం వహించవచ్చు. ఇది స్మిత్ పొరపాటు.

ఇంకో వైపు, పెట్టుబడిదారుణ్ణి చూద్దాం. వీలైనంత తక్కువ డబ్బుకి, వీలైనంత ఎక్కువ శ్రమ పొందాలి అనుకుంటాడు. కాబట్టి ఆచరణలో అతనికి ఆసక్తి కలిగించేది ఒకే ఒక విషయం: శ్రమ శక్తి విలువకీ, శ్రమ శక్తి సృజించే విలువకీ ఉండే తేడా. అయితే అతను కొనే అన్ని సరుకుల్నీ వీలైనంత చౌకగా కొనే ప్రయత్నం చేస్తాడు. అందువల్ల అతను మోసం వల్లా, తక్కువకి కొని, ఎక్కువకి అమ్మడం వల్లా తన లాభం వస్తుందని అనుకుంటాడు. నిజంగా శ్రమ విలువ అనేది అస్థిత్వంలో ఉనట్లయితే, ఆ శ్రమ విలువని అతను నిజంగా చెల్లించి ఉంటే,

అదనపువిలువ ఉండేది కాదనీ, పెట్టుబడి అనేదే మనుగడలో ఉండేది కాదనీ, అతని డబ్బు పెట్టుబడిలోకి పరివర్తనచెంది ఉండేదే కాదనీ, అతను ఎప్పటికీ తెలుసుకోలేడు.

పైగా చెల్లింపు శ్రమ శక్తికి కాదు, దాని చర్యకి (శ్రమకి) అని రుజువు చేసే అంశాల్ని వేతనాల వాస్తవ చలనం చూపెడుతుంది. ఈ అంశాలన్నిటినీ రెండు గ్రూపులు చెయ్యవచ్చు:

1. పనిదినం నిడివితో పాటు, మారే వేతనాలు

ఒక యంత్రాన్ని ఒక రోజుకు వాడుకునే దానికన్నా వారం వాడుకుంటే అద్దె ఎక్కువ పడుతుంది. కనక చెలిస్తున్నది యంత్రం విలువని కాదు, దాని పని విలువని అని ఎవరైనా నిర్ధారించ వచ్చు.

2. ఒకే రకంపనిచేసే వేర్వేరు కార్మికుల వేతనాల్లో వ్యష్టి పరమైన తేడా

ఈ వ్యష్టి తేడా బానిసత్వంలో స్పష్టంగా, ఏ డొంకతిరుగుడు లేకుండా చూడగలం. మోసపోము. ఎందుకంటే, అక్కడ శ్రమ శక్తే అమ్మబడుతుంది. బానిస వ్యవస్థలో మాత్రమే సగటుని మించిన శ్రమశక్తి వల్ల కలిగే అనుకూలతా, సగటుకి తక్కువ శ్రమశక్తి వల్ల ప్రతికూలతా బానిస యజమాని మీద ప్రభావం చూపుతాయి; వేతన శ్రమ వ్యవస్థలో అవి శ్రామికుడి మీదనే ప్రభావం చూపుతాయి. ఎందువల్లనంటే, ఒక సందర్భంలో తన శ్రమ శక్తిని తానే అమ్ముకుంటాడు, మరో సందర్భంలో అతని శ్రమ శక్తిని మూడో మనిషి అమ్ముతాడు.

## 'శ్రమ శక్తి విలువ' సారం కాగా, 'శ్రమ విలువ' ఆ సారం కనబడే రూపం

శ్రమ విలువ/ శ్రమ ధర అనేవి నేరుగా, ప్రస్తుత కాలంలో ఉన్న ఆలోచనకు అనుగుణంగా అగపడతాయి. శ్రమ శక్తి విలువ/ శ్రమ శక్తి ధర అనేవి అలా కనబడే విషయాలు కావు. వాటిని ముందుగా సైన్స్ కనుక్కోవాల్సి ఉంటుంది. ఆపని మార్క్స్ చేశాడు. సాంప్రదాయ అర్థశాస్త్రం విషయాల వాస్తవ సంబంధాన్ని దాదాపు స్పృశించింది. కాని ఆ సంబంధాన్ని చైతన్యవంతంగా రూపొందించ లేక పోయింది. అది బూర్జువా చర్మాన్ని అంటిపెట్టుకొని ఉన్నంత కాలమూ ఆ సంబంధాన్ని రూపొందించజాలదు.

### References


1. వేతన శ్రమా పెట్టుబడీ -సం.ర 1.పే.83-84.
2. Observations on Certain Verbal Disputes, 1821.
3. వేతన శ్రమా - పెట్టుబడీ 1891 నాటి కూర్పుకు ఎంగెల్స్ రాసిన ప్రవేశిక - సం.ర 1 పే.85
4. వేతన శ్రమా - పెట్టుబడీ 1891 నాటి కూర్పుకు ఎంగెల్స్ రాసిన ప్రవేశిక - సం.ర 1 పే.87.
5. వేతన శ్రమా - పెట్టుబడీ 1891 నాటి కూర్పుకు ఎంగెల్స్ రాసిన ప్రవేశిక - సం.ర 1 పే.89.

# అధ్యాయం 20
# కాలం వేతనాలు (Time-Wages)

వేతనాలు చాలా రూపాల్లో ఉంటాయి. వాటిలో మౌలికమైన రెండు రూపాల గురించి ఈ చాప్టర్ చర్చించింది:

1. కాలాన్ని బట్టి వేతనాలు
2. చేసిన వస్తువుల పరిమాణాన్ని బట్టి వేతనాలు

శ్రమ శక్తి ఎంతో కొంత కాలానికి పరిమితమై మాత్రమే అమ్మాలి. మొత్తం అమ్మితే అది బానిస వ్యవస్థ అవుతుంది. దీన్నిబట్టి, రూపం ఏదైనా, శ్రమ శక్తిని అమ్మిన కాలానికి కొలత ఉండాలి. కాలం వేతనాల్లో ఈ కొలత నేరుగా ఉంటుంది. శాల్తీ వేతనాల్లో పరోక్షంగా ఉంటుంది. శ్రమ శక్తి అమ్మకం ఫలానింత కాలానికి అని – రోజుకనో, వారానికనో ఇలా – ఉంటుంది. కాబట్టి 'కాలం వేతనాలు' .

## కాలం వేతనాల గురించి కొన్ని విషయాలు:

శ్రామికుడు రోజు శ్రమకో, వారం శ్రమకో, పొందే డబ్బు మొత్తం నామక వేతనం (nominal wages).

ఈ నామక వేతనంనుంచి 'శ్రమ ధర' వస్తుంది. శ్రమ ధర అనేది శ్రమ విలువ నుండి రాబట్టింది కాదు. అంటే దాని విలువని డబ్బులో చెప్పినందువల్ల వచ్చింది కాదు. ఎందుకంటే, శ్రమ విలువ అనేది ఉండనే ఉండదు.

## శ్రమ ధర అనేది ఏమిటి? దాన్ని లెక్కించేది ఎలా?

శ్రమ ధర అనేది, శ్రమ శక్తి ధర యొక్క పరివర్తిత రూపం. దాన్ని చుట్టుతిరుగుడు పద్ధతిలో లెక్కించాలి. రోజు సగటు శ్రమశక్తి ధరని, రోజులో చేసిన సగటు పనిగంటల సంఖ్య చేత భాగిస్తే వచ్చేదే సగటు శ్రమ ధర. ఉదాహరణకి, రోజు శ్రమ శక్తి విలువ 300 రూపాయలు, అంటే 6 గంటల ఉత్పాదితం ధర అనీ, పనిదినం 12 గంటలనీ అనుకుందాం. అప్పుడు ఒక పని గంట ధర 300/12 రూపాయలు, అంటే 25 రూపాయలు అవుతుంది. ఆ విధంగా లెక్కించిన గంట పనిధర శ్రమధరకి కొలత యూనిట్‌గా ఉపకరిస్తుంది. దీన్ని బట్టి వచ్చే విషయాలు:

### 1. శ్రమ ధర తగ్గుతూ ఉన్నా, వేతనాలు అలాగే స్థిరంగా ఉండవచ్చు

ఉదాహరణకి, మామూలు పనిదినం 10 గంటలూ, రోజు శ్రమశక్తి ధర 300 రూపాయలూ అయితే, ఒక పనిగంట ధర 30 రూపాయలు. పనిదినం 12 గంటలకు పెరిగితే, పనిగంట ధర 25 రూపాయలకు తగ్గుతుంది. అదే 15 గంటలయితే, 20 రూపాయలకు పడిపోతుంది. గంట శ్రమ ధర తగ్గినప్పటికీ, వేతనం తగ్గదు. కారణం అది అలాగే ఉండే స్థాయిలో పనిగంటలు

పెరగడమే.

2. ఇందుకు విరుద్ధంగా, శ్రమ ధర స్థిరంగా ఉన్నా, ఒకవేళ తగ్గుతూ ఉన్నా రోజువారీ/వారం వారీ వేతనాలు పెరగవచ్చు. ఉదాహరణకి, పనిదినం 10 గంటలూ, రోజు శ్రమ శక్తి విలువ 300 రూపాయలూ అయితే, ఒక పనిగంట ధర 30 రూపాయలు. వ్యాపారం పెరిగినందువల్ల, శ్రామికుడు 12 గంటలు పనిచేస్తే, శ్రమ ధర అలాగే ఉంటే, ఇప్పుడు అతని రోజు వేతనం 360 రూపాయలకు పెరుగుతుంది– శ్రమ ధరలో ఏమాత్రం మార్పు లేకుండానే. శ్రమ విస్తృతి మారకపోయినా, శ్రమ తీవ్రత పెరిగినా గూడా అదే ఫలితం వస్తుంది. కాబట్టి నామ వేతనాల పెరుగుదలని మార్పులేని శ్రమధర అయినా, పడిపోతున్న శ్రమ ధర అయినా అనుసరించవచ్చు. శ్రామిక కుటుంబ పెద్ద చేసే శ్రమమొత్తానికి, కుటుంబ సభ్యుల శ్రమ కూడా కలిసి శ్రమ మొత్తం పెరిగినప్పుడు కూడా శ్రామికుని కుటుంబ ఆదాయానికి ఇదే సూత్రం వర్తిస్తుంది. అందువల్ల, నామ వేతనాలు తగ్గించకుండానే, శ్రమ ధరని తగ్గించే పద్ధతులు ఉన్నాయి. బడా పారిశ్రామిక వేత్తలకు శ్రమ ధర యొక్క నామక పరిమాణాన్ని మార్చడమే కాక, శ్రమ ధరని ఎలా పెంచాలో, ఎలా తగ్గించాలోకూడా తెలుసు.

## గంట వేతనమూ – పనిదినం పొడవూ

దిన వేతనం శ్రమ శక్తి విలువ చేత నిర్ణయమవుతుంది. శ్రమ ధర దిన వేతనం నుండి రాబట్టబడుతుంది. జీవితావసర వస్తువుల విలువ 300 రూపాయలు అయితే వేతనం 300. వేతనాన్ని బట్టి శ్రమ ధర ఎంతో లెక్కించాలి. వేతనానికి పనిగంటలతో నిమిత్తం ఉండదు. శ్రమ ధర లెక్కలో పనిగంటల సంఖ్య ఒక కారణాంకం (factor). అలా అయినప్పుడు, రోజు వేతనాన్ని పనిదినం పొడవుచేత భాగిస్తే, శ్రమ ధర వస్తుంది. అయితే, ఉపరితలం మీద రోజు వేతనం లెక్కకు ఆధారం శ్రమధరే కాని శ్రమ శక్తి విలువ కాదు.

## ఒక సాధారణ నియమం ఏమంటే:

రోజువారీ/వారం వారీ శ్రమ స్థిరంగా ఉంటే, అప్పుడు వేతనాలు శ్రమ ధరని బట్టి ఉంటాయి. ఆ శ్రమ ధరే శ్రమశక్తి విలువని బట్టి గానీ, లేదా దాని ధరకీ విలువకీ మధ్య ఉండే వ్యత్యాసాన్ని బట్టిగానీ మారుతూ ఉంటుంది. మరొకపక్క, శ్రమ శక్తి ధర ఫలానింతని ఉంటే, వేతనాలు శ్రమ పరిమాణాన్ని బట్టి ఉంటాయి.

పనిగంటలు తగ్గితే వేతనం తగ్గుతుంది. కాలం వేతనాల కొలమానం ఒక పని గంట ధర. ఇది ఒక రోజు శ్రమశక్తి విలువని సగటు పనిదినంలో ఉన్న గంటల సంఖ్యచేత భాగిస్తే వచ్చేది. కాలం వేతనం పనిగంటల్ని బట్టి వచ్చేది. గంట శ్రమ ధర 25 రూపాయలయితే 8 గంటలకు 200 వస్తుంది. 6 గంటలయితే 150 వస్తుంది. పనిదినం 12 గంటలనీ, శ్రమ శక్తి విలువ 300 రూపాయలనీ (అంటే, 6 గంటల ఉత్పాదితం విలువ) అనుకుందాం. అప్పుడు, పని గంట ధర 25 రూపాయలు. గంటలో ఉత్పత్తయ్యే విలువ 50 రూపాయలు. ఇప్పుడు, శ్రామికుడు 12 గంటల కంటే తక్కువ కాలం 6 గంటలో 8 గంటలో నియమితుడయితే ఆ గంటల్ని బట్టి అతనికి రోజుకి 150రూపాయలో, 200రూపాయలో వస్తాయి. అతను

బతకడానికి అది సరిపోదు.

మన పరికల్పన (hypothesis) ప్రకారం శ్రామికుడు రోజు వేతనాన్ని ఉత్పత్తి చెయ్యడానికి 6 గంటలు పనిచెయ్యాలి. ప్రతి గంటలో సగం మాత్రమే తనకోసం, మిగతా సగం పెట్టుబడిదారుడికోసం పనిచేస్తాడు. కాబట్టి అతను 12 గంటల కన్నా తక్కువ పనిచేస్తే, 6 గంటల ఉత్పాదితం విలువ పొందడు. పోయిన అధ్యాయాల్లో అతిపని (over-work) వల్ల వినాశకరమైన పర్యవసానాల్ని తెలుసుకున్నాం. ఇక్కడ చాలీ చాలని అరకొర నియామకం వల్ల శ్రామికుల బాధల కారణాల్ని తెలుసుకుంటాం. ఒక గంట వేతనం నిర్ణయమయ్యాక, పెట్టుబడి దారుడు ఒక రోజుకో, వారానికో వేతనం చెల్లించాల్సిన పని ఉండదు. అతను ఎన్నిగంటల పని చేయించుకో దలిస్తే, అన్ని గంటలకు మాత్రమే చెల్లించాలి.

## ఈ యూనిట్‌ని నిర్ణయించే విధానం

రోజు శ్రమ శక్తి ధరని పనిరోజు లో ఉండే గంటల సంఖ్యబెట్టి భాగిస్తే వస్తుంది. ఆ యూనిట్ ఈ నిష్పత్తి చేత నిర్ణయమవుతుంది. కనుక, పనిదినం అంటే ఫలానిన్ని గంటలు అని ఉండదు. చెల్లించబడిన శ్రమకీ, చెల్లించబడని శ్రమకీ సంబంధం పోతుంది. శ్రామికుడికి జీవితావసరాలకి అవసరమైన శ్రమకాలాన్ని అనుమతించకుండా, పెట్టుబడిదారుడు అతని శ్రమ నుండి కొంత అదనపు శ్రమని పిండుకుంటాడు. తన అనుకూలతని బట్టీ, ప్రయోజనాన్ని బట్టీ, తన ఇష్టాన్ని బట్టీ ఒకప్పుడు అత్యంత అధికమైన పనిపెడతాడు. మరొకప్పుడు తక్కువ పని ఇస్తాడు, లేక అసలు పనే పెట్టకపోవచ్చు. అతను ఉద్యోగ క్రమాన్ని ధ్వంసం చేస్తాడు. మామూలు శ్రమధర చెల్లిస్తున్నాను అనే వంకతో పనిదినాన్ని అసాధారణంగా పెంచగలడు – ఈ రకమైన గంటల లెక్కన వేతనం నిర్ణయించాలని పెట్టుబడిదారులు చేసిన ప్రయత్నాన్ని లండన్ నిర్మాణరంగ కార్మికులు ప్రతిఘటించారు. 1860 లో ఆ కార్మికులు సహేతుకమైన విప్లవం చేశారు. పనిదినాన్ని చట్టబద్ధంగా పరిమితం చెయ్యడం ఈ మోసాన్ని అంతం చేస్తుంది. అయితే యంత్రాల పోటీ వల్లా, కార్మికుల నైపుణ్యంలో మార్పులవల్లా, పాక్షికమైన, లేదా సాధారణమైన సంక్షోభాలవల్లా ఉద్యోగాలు తగ్గడాన్ని అది నివారించ జాలదు.

## ఎక్కువ పనిగంటలూ – ఓవర్ టైం వేతనమూ

రోజు వేతనం పెరుగుతున్నా, శ్రమధర మారకుండా అలాగే ఉంటూ గూడా, మామూలు స్థాయికన్నా తగ్గవచ్చు. ఇలా ఎప్పుడు జరుగుతుంది? ఒక గంట శ్రమకి లెక్కించిన శ్రమధర స్థిరంగా ఉండి, పనిదినం మామూలు కన్నా, పెరిగినప్పుడల్లా ఇదే జరుగుతుంది. పనిదినం పరిమితి లేని శాఖల్లో కాలం వేతనం సాధారణ నియమంగా ఉన్నప్పుడు మామూలు పనిదినానికి ఏదో ఒక పాయింట్ దగ్గర పరిమితి (10 లేక 12 గంటలు) దానికదే ఏర్పడుతుంది. ఆపరిమితి దాటితే ఓవర్ టైం. అప్పుడు చేసే పనికి మామూలు పనికంటే అదనంగా ఇవ్వాలి. అయితే అది మామూలు ధరతో పోలిస్తే తరచుగా బహు కొద్ది. ఉదాహరణకి, లేసు ఉత్పత్తిలో ఓవర్ టైంకి చెల్లించే రేటు చాలా తక్కువ – గంటకి ½ పెన్నీ ¾ పెన్నీ నించి 2 పెన్నీల లోపు. శ్రామికులు ఎక్కువ పనిచేసినందువల్ల కోల్పోయే ఆరోగ్యానికీ, సత్తువకీ అది చాలదు.

అలా సంపాదించిన కొద్ది డబ్బు తరచుగా అదనపు ఆహారానికి ఖర్చుచెయ్యాల్సి వచ్చేది.

ఇక్కడ వాస్తవ పనిదినం మామూలు పనిదినం గానూ, ఓవర్ టైం గానూ విభజితమైంది. మామూలు పనిదినం 10 గంటలు. ఓవర్ టైం 2 గంటలు అయితే, వాస్తవ పనిదినం 10+2=12 గంటలు. అంటే, వాస్తవ పనిదినంలో మామూలు పనిదినం ఒక భాగంగా ఉంటుంది. మొత్తం సంవత్సరంలో వాస్తవ పనిదినం మామూలు పనిదినం కంటే ఎక్కువగా వుంటుంది. ఉదాహరణకి, కాగితాలకు రంగేసే పరిశ్రమ ఫాక్టరీ చట్టం కిందికి రాక ముందు, రోజు పని 10½ గంటలు. అది దాటితే ఓవర్ టైం. సాయంత్రం నాలుగున్నర కల్లా రోజుపని పూర్తిచెయ్యడానికి తిండికోసం కూడా పని ఆపకుండా పనిచేసేవాళ్ళు. అప్పటినించీ ఓవర్ టైం చేసే వాళ్ళు. సాయంత్రం 6 గంటలకి ముందు పని ఆపడం అరుదు. వాస్తవానికి, ఏడాది పొడుగునా ఓవర్ టైం చేస్తూనే ఉండేవాళ్ళు. మామూలు పనిదినంలో కంటే అది దాటాక వచ్చే శ్రమధర ఎక్కువ. కాబట్టి సరిపడా వేతనం పొందాలంటే ఓవర్ టైం చెయ్యాలనే ఒత్తిడి అతనిమీద ఉంటుంది. ఉదాహరణకి, స్కాట్ లాండ్‌లో బ్లీచింగ్ పనులు 1862లో ఫాక్టరీ చట్టం కిందికి వచ్చాయి. అంతకు ముందు ఓవర్ టైం పద్ధతి నడిచేది. మామూలు పనిదినం 10 గంటలు. దానికి రోజుకి 1 షిల్లింగు 2 పెన్నీలు. ఒవర్ టైం కి గంటకి 3 పెన్నీలు. రోజుకి మూడు, నాలుగు గంటల ఓవర్ టైం ఉండేది.

**ఈ విధానం ఫలితం ఇదే:** ఓవర్ టైం చెయ్యకుండా ఉంటే, వారానికి 8 షిల్లింగులు మించి రాదు. ఒవర్ టైం లేకుండా సరైన వేతనం పొందలేరు. కాబట్టి ఓవర్ టైం చేస్తారు. పైగా గంటపని ధర ఎక్కువ గనక చెయ్యకుండా ఉండలేరు. లండన్ లో బుక్ బైండింగ్ పనిలో 14,15 ఏళ్ళ ఆడపిల్లలు చాలామంది ఉన్నారు. ఫలానిన్ని గంటలు పనిచెయ్యాలి అనే ఒప్పందం ఉంటుంది. అయినాగాని, ప్రతినెలా చివరివారంలో రాత్రి 10,11,12 గంటలదాకానో, మర్నాడు ఒంటి గంట దాకానో పనిచేస్తారు – పెద్ద వాళ్ళైన మగవాళ్ళతో కలిసి. యజమానులు వాళ్ళని అదనపు వేతనంతోనూ, రాత్రి తిండి తోనూ ఊరిస్తారు.

**పనిదినానికి చట్ట పరిమితి.** పనిదినానికి సంబంధించిన చట్టపరమైన పరిమితి పెట్టుబడిదారులకు పై సదుపాయాలను లేకుండా చేస్తుంది. లండన్ నిర్మాణ కార్మికులు పరిస్థితిని సరిగ్గా గ్రహించారు. 1860 సమ్మె, లాక్ ఔట్ కాలంలో గంటల్ని బట్టి వేతనం పద్ధతిని ఒప్పుకునేందుకు రెండు షరతులు పెట్టారు:

1. గంట పనిధరతో పాటు, 9,10 గంటల మామూలు పనిదినాన్ని నిర్ణయించాలి. 10 గంటల పనిదినంలో గంట శ్రమధర 9 గంటల పనిదినంలో కంటే ఎక్కువ ఉండాలి.

2. మామూలు పనిదినం దాటితే, పై గంటల్ని ఓవర్ టైం గా పరిగణించి, గంట గంటకీ ఎక్కువ ఇవ్వాలి. అంటే మొదటి గంట కంటే రెండో గంటకి ఎక్కువ, రెండో గంట కంటే మూడో గంటకి ఎక్కువ అలా పెంచుతూ పోవాలి.

**మామూలు పనిగంటలు పెరిగితే, వేతనాలు తగ్గుతాయి.** మామూలు పనిదినం పొడవు పెరిగేకొద్దీ వేతనాలు తగ్గుతాయి. ఈ వాస్తవం తెలిసిందే. రెడ్ గ్రేవ్ అనే ఫాక్టరీ ఇన్స్పెక్టర్

1839-1859 మధ్య 20 సంవత్సరాల్లో 10 గంటల పనిదినం ఉన్న ఫాక్టరీల్లో వేతనాలు పెరిగాయనీ, 14,15 గంటలున్న ఫాక్టరీల్లో వేతనాలు తగ్గాయనీ తేల్చి చెప్పాడు.

**శ్రమధర స్థిరంగా వుంటే, రోజువారీ వేతనం ఖర్చయిన శ్రమపరిమాణాన్ని బట్టి ఉంటుంది.** ఈ సూత్రాన్ని బట్టి:

శ్రమధర ఎంత తక్కువగా ఉంటే, ఎంతో కొంత తక్కువ సగటు వేతనం పొందడానికి కూడా, ఎక్కువ శ్రమ పరిమాణం ఉండాలి. శ్రమధర తక్కువగా ఉండడం అనేది శ్రమకాలాన్ని పొడిగించడానికి ప్రేరణగా ఉంటుంది.

ఉదాహరణకి, ఇంగ్లండ్‌లో చేత్తో చీలలు చేసే వాళ్ళ శ్రమధర చాలా తక్కువగా ఉండేది. కొద్దిదైన వారం వేతనం సరిచేసుకోడానికి 15 గంటలపాటు పనిచేయాల్సి వచ్చేది.వేతనం 11 పెన్నీల కొసం, లేక ఒక షిల్లింగు కొసం రోజుకి 15 గంటలు కఠోరంగా పనిచేయాల్సి వచ్చేది. అది కాక పనిముట్ల అరుగుదల, కొలిమి ఖర్చు, వృధాపోయే ఇనుం - అన్నీ కలిపి 2 ½ పెన్నీలో 3 పెన్నీలో పోయేవి. స్త్రీలకు అదేపనికి వారానికి 5 షిల్లింగులు మాత్రమే.

**మరొకపక్క, పనికాలం పొడిగింపు అనేది శ్రమ ధరని పడిపోయేట్లు చేస్తుంది.** దాంతో పాటు రోజు/వారం వేతనం తగ్గేట్లు చేస్తుంది. శ్రమ ధర = రోజు శ్రమశక్తి విలువ/రోజు పనిగంటల సంఖ్య అనే సూత్రం ప్రకారం పరిహారం లేకుండా, పని దినం నిడివి పెరిగితే, శ్రమధర తగ్గుతుంది. కాలక్రమంలో పనిదినాన్ని పొడిగించేందుకు పెట్టుబడిదారుడికి వీలుకల్పించే పరిస్థితులే, పెరిగిన గంటల మొత్తం ధర తగ్గేదాకా, రోజు వేతనం లేక వారం వేతనం తగ్గేదాకా శ్రమ ధరని మొదట నామకా తగ్గించడానికి అనుమతిస్తుంది. చివరకి ఒత్తిడి పెడుతుంది. ఇక్కడ రెండు పరిస్థితులు చెబితే సరిపోతుంది:

1. ఒకటో పరిస్థితి. ఒక మనిషి ఒకటిన్నర మనిషి చేసేపని గానీ, ఇద్దరు మనుషులు చేసే పనిగానీ చేస్తే, శ్రమ సరఫరా పెరుగుతుంది. మార్కెట్లో శ్రమశక్తి సరఫరా ఉన్నదున్నట్లే, స్థిరంగా ఉన్నప్పటికీ. ఆవిధంగా కార్మికుల మధ్య సృజించబడిన ఈ పోటీ, శ్రమ ధరని తగ్గించేందుకు పెట్టుబడిదారుడికి వీలు కలిగిస్తుంది. మరొకపక్క, పడిపోతున్న శ్రమ ధర పనిదినాన్ని పొడిగించేందుకు పెట్టుబడిదారుడికి అవకాశం ఇస్తుంది. ఉదాహరణకి, ఒక కార్మికుడు ఎక్కువ గంటలు పనిచేయ్యడానికి నిరాకరిస్తే, త్వరలో ఎంతకాలమైనా చేసే మనిషిని పెట్టుకొని, ఇతన్ని పనినించి నెట్టెయ్యడం జరుగుతుంది. ఒకడు ఇద్దరి పని చేస్తే, లాభాలు పెరుగుతాయి. శ్రమ అదనంగా సరఫరా కావడం వల్ల శ్రమధర తగ్గడమే ఇందుకు కారణం.

2. రెండో పరిస్థితి. మార్కెట్లో ఉత్పత్తుల సరఫరా అధికంగా ఉంటుంది. ఈ పరిస్థితిలో, అతికీతా వేతనాలతో పనిచేయించే పెట్టుబడిదారులు తమ పోటీదారులతో నెగ్గుతారు. చెల్లించబడని శ్రమమీద పట్టు, పెట్టుబడిదారుల మధ్య పోటీకి కారణం అవుతుంది. ఒక సరుకు ధరలో శ్రమధర ఒక భాగంగా ఉంటుంది. శ్రమ ధరలో చెల్లించబడని శ్రమధర భాగాన్ని లెక్కించక్కర్లేదు. దాన్ని కొనుగోలుదారుడికి ఇవ్వవచ్చు. పోటీకి దారితీసే తొలి అడుగు ఇదే. రెండో అడుగు: అసాధారణంగా వచ్చే ఎక్కువ అదనపు విలువలో కనీసం కొంత భాగాన్ని అమ్మకం ధరనించి మినహాయించేట్లు చెయ్యడం రెండో అడుగు.

పోటీ గురించి విశ్లేషణ మన సబ్జెక్ట్ లోని ఈ భాగానికి సంబంధించింది కాదు. కాబట్టి

సూచనప్రాయంగా చెప్పానంటాడు మార్క్స్. అయినా ఒక క్షణం పెట్టుబడి దారుణ్ణి మాట్లాడనిద్దాం అంటాడు. బెర్మింగ్ హాంలో యజమానుల మధ్య పోటీ ఎక్కువగా ఉంది. ఎంత ఎక్కువగా అంటే, ఇతరత్రా అయితే వాళ్ళు చెయ్యడానికి సిగ్గుపడే పనులు యజమానులుగా చెయ్యాల్సి వస్తున్నది; అయినా అందువల్ల వాళ్ళకు ఎక్కువ డబ్బు రావడం లేదు, కొనే జనమే ప్రయోజనం పొందుతున్నారు.

**తక్కువకి అమ్మేవాళ్ళ గురించి.** లండన్ లో రెండు రకాల రొట్టె ఉత్పత్తిదారులున్నారు:

1. పూర్తి ధరకి అమ్మేవాళ్ళు
2. మామూలు ధరకన్నా తక్కువకి అమ్మేవాళ్ళు.

పార్లమెంటరీ విచారణ కమిటీ ముందు పూర్తిధరకి అమ్మేవాళ్ళు, తక్కువకి అమ్మే పోటీదారుల్ని దుయ్య బట్టారు. జనాన్ని మోసం చెయ్యడం ద్వారానూ, 12 గంటల వేతనానికి 18 గంటల పని లాగడం ద్వారానూ వాళ్ళు కొనసాగుతున్నారు. చెల్లించబడని శ్రమే, పోటీ సాగడానికి వనరు. ఈ నాటికీ అదే వనరు. రాత్రిపూట పనిని తొలిగించడానికి అడ్డంకి, మాస్టర్ బేకర్ల మధ్య పోటీయే. రొట్టెని తక్కువకి అమ్మేవాడు పిండి ధరను బట్టి అతనికి పడ్డ ధర కంటే తక్కువకి అమ్మాలంటే, అతను ఆ నష్టాన్ని కార్మికులనుండి ఎక్కువ శ్రమని రాబట్టడం ద్వారా భర్తీ చేసుకోవాల్సిందే. తన శ్రామికులనుండి 12 గంటల పని మాత్రమే పొందేవాణ్ణి, 18 లేక 20 గంటల పని చేయించే పక్కవాడు అమ్మకం ధర తగ్గించి దెబ్బకొడతాడు. తమ ఎక్కువ పనికి వేతనం చెల్లించాలని పనివాళ్ళు పట్టుబడితే, అప్పుడు పరిస్థితి సరై, చక్కబడుతుంది. ఈ తక్కువకి అమ్మేవాళ్ళు పెట్టుకునే పనివాళ్ళలో ఎక్కువమంది విదేశీయులూ, యువకులూ. వాళ్ళకి తక్కువ వేతనాన్నైనా ఒప్పుకోక తప్పదు.

## కాలం వేతనాల గురించి పెట్టుబడిదారుడి వక్రమైన అభిప్రాయం

తమ దోపిడీ చేసే హక్కుని హరిస్తున్నారని పెట్టుబడిదారులు ఫిర్యాదులు చేస్తుంటారు. ఆ ఫిర్యాదులు ఈ అధ్యాయానికి సరియైన ముగింపునిస్తాయి. ఆ ముగింపు ఇదే : ఉపరితలం మీద ప్రతిదీ, భిన్నంగా కనబడుతుంది. బాధతో చేసే ఈ ఫిర్యాదులు, ఉత్పత్తిసంబంధాలు పెట్టుబడిదారుడి మనసులో ఎలా ప్రతిబింబిస్తాయో తెలియజేస్తాయి. మామూలు శ్రమ ధరలో చెల్లించబడని శ్రమ కూడా కొంత ఉంటుందని అతనికి తెలియదు. ఈ చెల్లించబడని శ్రమే అతని లాభానికి మూలం అని కూడా అతను ఎరగడు. అతని దృష్టిలో అదనపు శ్రమ కాలం అనే భావాభివర్గమే ఉండదు. ఎందుకంటే, అది మామూలు పనిదినంలో కలిసే ఉంటుందనీ, ఆ పని దినానికి తాను వేతనం చెల్లిస్తున్నాననీ, అనుకుంటాడు. అయితే ఓవర్ టైం అనేది అతని బుర్రలో ఉంటుంది. మామూలు శ్రమధరకి అనుగుణమైన పరిమితి దాటి పనిదినం పొడిగింపు గురించి అతనికి తెలుసు. తక్కువకి అమ్మే తన పోటీ దారుతో ముఖాముఖిలో ఈ ఓవర్ టైంకి ఎక్కువ చెల్లించాలని డిమాండ్ కూడా చేస్తాడు. ఈ అదనపు వేతనంలో సైతం, ఒక పనిగంటలో ఉన్నట్లే, చెల్లించబడని శ్రమ ఉంటుందని అతనికి తెలియదు. ఉదాహరణకి, 12 గంటల పనిదినంలో ఒక గంట ధర అరగంట ఉత్పాదితం విలువ అయిన 3 పెన్నీలయితే, ఓవర్ టైం ధర గంటకి 4 పెన్నీలు, లేదా ఒక ఉత్పాదితం విలువలో 2/3 వంతు. పెట్టుబడిదారుడు మొదటి సందర్భంలో సగం ఉత్పాదితాన్ని, రెండో సందర్భంలో 1/3 వంతునీ, ఏమీ చెల్లించకుండానే, స్వాధీనం చేసుకుంటాడు. 303

# అధ్యాయం 21
# శాల్తీ వేతనాలు

వేతనం అనేది శ్రమశక్తి విలువకి మారిన రూపం. అలాగే శాల్తీ వేతనం మారిన కాలం వేతన రూపమే. ఈవిధానంలో శ్రామికుని నుంచి పెట్టుబడిదారుడు కొన్నది సజీవ శ్రమని కాదనీ, ఉత్పాదితంలో అప్పటికే రూపొందిన శ్రమ అనీ అనిపిస్తుంది. ఈ శ్రమ ధర, కాలం వేతనాలకు భిన్నంగా నిర్ణయమయ్యేట్లు కనిపిస్తుంది. కాలం వేతనాలు రోజు శ్రమశక్తి విలువ/ పనిదినంలో గంటల సంఖ్య అనే భిన్నాన్ని బట్టి నిర్ణయమవుతుంది. శాల్తీ వేతనం నిర్ణయమయ్యేది దీన్ని బట్టికాదు, శ్రామికుని శ్రమ చేసే శక్తిని బట్టి అనిపిస్తుంది. అదే శ్రమ కొన్నిపరిస్థితుల్లో శాల్తీ వేతనం గానూ, మరికొన్ని పరిస్థితుల్లో కాలం వేతనంగానూ చెల్లించబడుతుంది:

1. లండన్ కంపోజిటర్లు శాల్తీల ప్రకారం పనిచేస్తారు, కాలంపని మినహాయింపుగా ఉంటుంది. అదేపనిని గ్రామాల్లో రోజుని బట్టి చేస్తారు. ఓడలు నిర్మించే కార్మికులు లండన్లో పనిని బట్టీ చేస్తారు, శాల్తీని బట్టీ చేస్తారు. ఇతర ప్రాంతల్లో రోజుని బట్టి చేస్తారు.
2. ఒకే జీనుల షాపులో, ఫ్రెంచ్ వాళ్ళకి శాల్తీ వేతనాలూ, ఇంగ్లిష్ వాళ్ళకి కాలం వేతనాలు చెల్లిస్తారు.
3. శాల్తీ వేతనాలు ప్రబలంగా ఉన్న ఫ్యాక్టరీల్లో, కొన్ని రకాల పనులకి శాల్తీ వేతన రూపం కుదరదు. వాటికి కాలం వేతనం ఇస్తారు.

అదే శ్రమ కొన్నిపరిస్థితుల్లో శాల్తీ వేతనం గానూ, మరికొన్ని పరిస్థితుల్లో కాలం వేతనంగానూ చెల్లించ బడుతుంది. ఒకే పరిశ్రమ శాఖల్లో పక్కపక్కనే రెండు రూపాలూ ఏక కాలంలో ఉండడమూ కద్దు. ఈ రెండు రకాల వేతనాలూ శ్రమ శక్తి ధర చెల్లించే రెండు భిన్న రూపాలు మాత్రమే. వేతన రూపాల్లో మార్పు, వాటి సారభూత స్వభావాన్ని మార్చదు. వాటిలో ఒకటి, రెండో దాని కంటే పెట్టుబడిదారీ విధానం అభివృద్ధికి అనుకూలంగా ఉండవచ్చు. ఉన్నా, సారాన్ని మార్చజాలదు.

## శాల్తీ వేతనాల పరిమాణాన్ని తేల్చే విధానం

పనిదినం 12 గంటలు, అందులో 6 గంటలు చెల్లించబడిన శ్రమ, 6 గంటలు చెల్లించబడని శ్రమ అనుకుందాం. ఉత్పాదితం విలువ 600 రూపాయలు అయితే, గంట శ్రమ ఉత్పాదితం విలువ 50 రూపాయలు అవుతుంది. ఒక కార్మికుడు 12 గంటల్లో 24 శాల్తీలు చేస్తే, వాటిలో ఉన్న స్థిర పెట్టుబడిని తీసేశాక, వాటి విలువ 600 రూపాయలు, ఒక్కొక్క దాని విలువ 25 రూపాయలు. అందులో శ్రామికుడికి శాల్తీకి 12 ½ రూపాయలు. ఆవిధంగా అతను 12 గంటల్లో 300 రూపాయలు పొందుతాడు. ప్రతిగంట పనిలోనూ కొంత యజమానికి. కాలం వేతనాల్లో మాదిరిగానే, ఇక్కడ కూడా శ్రామికుడు 6 గంటలు తనకోసం, పెట్టుబడిదారుడికోసం 6 గంటలు పనిచేస్తాడు అనుకున్నా, ప్రతి గంటలోనూ అరగంట తనకోసం, అరగంట పెట్టుబడిదారుడికోసం పనిచేస్తాడు అనుకున్నా, ఒకటే. తేడా ఉండదు.

అలాగే శాల్తీ వేతనాల్లో, ప్రతి శాల్తీలో సగం శ్రమ చెల్లించబడిందనీ, సగం చెల్లించబడలేదనీ అన్నా, 12 శాల్తీల ధర శ్రమశక్తి విలువకి మాత్రమే సమానకం, కాగా మిగిలిన 12 శాల్తీల ధరా అదనపువిలువ అన్నా ఒకటే, తేడా ఉండదు.

## శాల్తీ వేతన రూపం హేతువిరుద్ధమైనట్లే, కాలం వేతన రూపం కూడా హేతువిరుద్ధమైనదే

మన ఉదాహరణలో 2 శాల్తీల విలువ 50 రూపాయలు. అందులో శ్రామికుడు పొందేది 25 రూపాయలు. శాల్తీ వేతనాలు వాస్తవానికి ఏ ఇతర విలువ సంబంధాన్నీ వ్యక్తం చెయ్యవు. కాబట్టి విషయం, ఒక శాల్తీ విలువని దానిలో ఉన్న శ్రమ కాలంతో కొలవడం అన్నది కాదు. అందుకు భిన్నంగా శ్రామికుడు ఉత్పత్తిచేసిన శాల్తీల సంఖ్యని బట్టి అతడు వెచ్చించిన శ్రమ కాలాన్ని కొలవడం. కాలం వేతనాల్లో కాలవ్యవధిని బట్టి శ్రమని వెంటనే కొలవచ్చు. శాల్తీ వేతనాల విషయం అలాకాదు. ఒక నిర్ణీత కాల వ్యవధిలో ఎంత పరిమాణం ఉన్న ఉత్పాదితాల్లో ఆ శ్రమ చేరింది - అనే దాన్ని బట్టి కొలవబడుతుంది. శ్రమ కాలం ధర అంతిమంగా ఈ సమీకరణ ద్వారా నిర్ణయమవుతుంది:

ఒకరోజు శ్రమ విలువ = ఒక రోజు శ్రమ శక్తి విలువ.

కాబట్టి, శాల్తీ వేతనం అనేది కాలం వేతనం యొక్క మారిన రూపమే.

## శాల్తీ వేతనాల ప్రత్యేక లక్షణాలు

**ఇక్కడ శ్రమ నాణ్యతని పనే అదుపుచేస్తుంది.** శాల్తీ ధర సరిగ్గా రావాలంటే పని సగటు పరిపూర్ణత కలదై ఉండాలి. ఈ దృష్టితో చూస్తే, శాల్తీ వేతనాలు వేతనాల తగ్గింపుకీ, పెట్టుబడిదారీ మోసానికీ వనరులుగా ఉంటాయి. శాల్తీ వేతనాలు శ్రమ తీవ్రతకి కచ్చితమైన కొలమానాన్ని సమకూరుస్తాయి. ఒక సరుకుల మొత్తంలో ఉన్న శ్రమ కాలం ఫలానింత అని అనుభవపూర్వకంగా ముందుగానే నిర్ణయమై ఉంటుంది. అదే సామాజికంగా అవసరమైన శ్రమకాలంగా లెక్కకొస్తుంది. దాని ప్రకారమే చెల్లింపు ఉంటుంది. అందువల్ల, లండన్ లో పెద్ద దర్జీ షాపుల్లో వైస్ట్ కోటుని గంట అనీ, అరగంట అనీ అనేవాళ్ళు. గంట అంటే 6 పెన్నీలు. అనుభవరీత్యా, ఒక గంట సగటు ఉత్పాదితం ఎంతో తెలుసు. కొత్త ఫాషన్లూ, రిపేర్లూ వచ్చినప్పుడు దానికెంత టైం పట్టేదీ అనుభవం ఉండదు. కాబట్టి ఆ కొత్తపనికి గంటా, అరగంటా, కాక మరొకటా అనే దగ్గర వాదం ఏర్పడుతుంది. ఆ కొత్తపనికి కూడా కాలక్రమంలో అలవాటయి ఫలానింత అని స్థిరపడుతుంది. అప్పటిదాకా వాదం కొన సాగుతూనే ఉంటుంది.

**స్లోగా పనిచేసేవాళ్ళు డిస్మిస్ అవుతారు.** లండన్ ఫర్నిచర్ మొదలైన వర్క్ షాపుల్లో, పనివాడికి సగటు శక్తి లేకపోతే, ఆకారణంగా అతను కనీసపని చెయ్యలేకపోతే, అతను డిస్మిస్ అవుతాడు. ఉదాహరణకి, నూలు వడికే వాడికి కొంత దూది ఇస్తారు. ఆ దూదికి బదులు దాన్ని నిర్ణీత కాలంలో వడికి నూలు ఇవ్వాలి. ఆనూలుకి నిర్ణీత నాణ్యత ఉండాలి. అప్పుడు అతనికి పౌనుకి ఇంతని చెల్లిస్తారు. అతని పనిలో అనుకున్న నాణ్యత లోపిస్తే జుల్మానా వేస్తారు. ఆ నూలు కనీస పరిమాణానికంటే తగ్గితే ఆ పనివాణ్ణి డిస్మిస్ చేస్తారు. అతని స్థానంలో సామర్థ్యం ఉన్న వాణ్ణి పెట్టుకుంటారు. (Ure, l.c., p. 317 )

**పర్యవేక్షణ అవసరం తగ్గుతుంది.** పని నాణ్యతనీ, తీవ్రతనీ వేతన రూపం అదుపుచేస్తుంది. కాబట్టి పర్యవేక్షించే పని చాలాభాగం అవసరం ఉండదు. శాల్తీ వేతనం, అందువల్ల, ఆధునిక గృహ శ్రమకి ప్రాతిపదిక అవుతుంది. దాంతోపాటే, దొంతర్ల వారీగా నిర్వహించబడే దోపిడీకి, అణచివేతకీ పునాది అవుతుంది. ఈ రెండో దానికి రెండు మౌలిక రూపాలుంటాయి:

**పరాన్నభుక్కులకి అవకాశం.** ఒకపక్క, శ్రామికుడికీ, పెట్టుబడిదారుడికీ మధ్య పరాన్నభుక్కులకి – అంటే, కార్మికుల శ్రమని పెట్టుబడి దారులకు బాడుగకిచ్చే వాళ్ళకి – అవకాశం లభిస్తుంది. ఈ మధ్య మనుషులకి (middle men) పెట్టుబడిదారుడు వాళ్ళకిచ్చే శ్రమధరకీ, వాళ్ళు శ్రామికులకి చేర్చే ధరకీ, మధ్య ఉండే తేడాయే వాళ్ళ లాభం. ఇంగ్లండ్‌లో ఈ వ్యవస్థని చెమట పట్టించే విధానం (sweating system) అంటారు. వేతనం ఎక్కువమంది చేతుల గుండా వస్తే, లాభంలో వాళ్ళ వాటాలు వాళ్ళు తీసుకుంటారు. అసలు పనిచేసే చివరివాడు తక్కువ పొందుతాడు.

**శ్రామికుడిచేత శ్రామికుడు దోపిడీ చెయ్యబడడం.** మరొకపక్క, ఒక శాల్తీకి ఇంత చొప్పున ఇస్తానని పెట్టుబడిదారుడు పనిపెద్దతో ఒప్పందం కుదుర్చుకునే అవకాశం శాల్తీ వేతనం వల్ల కలుగుతుంది. ఆ పనిపెద్ద (head labourer) పనివాళ్ళని పెట్టుకొని పనిచేయించి, డబ్బిచ్చే బాధ్యత తీసుకుంటాడు. ఇక్కడ శ్రామికుడిచేత శ్రామికుడు దోపిడీ చెయ్యబడడం ద్వారా పెట్టుబడి దారుడు శ్రామికుణ్ణి దోపిడీ చెయ్యడం అమలుజరుగుతుంది.

**శ్రమ తీవ్రత పెంచే పోకడా – పనిగంటలు పెంచే పోకడా.** శాల్తీ వేతనంలో శ్రామికుడి సొంత ప్రయోజనం తన శ్రమశక్తిని ఎంత వీలయితే అంత తీవ్రతతో వ్యయించేట్లు చేస్తుంది. ఇది పెట్టుబడి దారుడు మామూలు శ్రమ తీవ్రత స్థాయిని సులువుగా పెంచే వీలు కలిగిస్తుంది. శాల్తీ పనివాళ్ళు చట్టబద్ధ పనిదినాన్ని వాళ్ళ ప్రయోజనం కోసం వాళ్ళే పొడిగిస్తారు. ఎందుకంటే, అలా పొడిగిస్తే వాళ్ళకి రోజుకి లేక వారానికి ఎక్కువ వేతనం ముడుతుంది. శాల్తీ వేతనం స్థిరంగా ఉన్నా, క్రమంగా ఇది కాలం వేతనంలో వివరించిన ప్రతిచర్య వంటి దానినే తెచ్చిపెడుతుంది. ఎక్కువ గంటలు పనిచేసినందువల్ల, రోజు వేతనం పెరుగుతుంది. అదే సమయంలో ఉరువుకి వేతనం తగ్గే ప్రభావం ఉంటుంది. అసలు రోజు వేతనమే తగ్గవచ్చు. కాలం వేతనాల్లో ఒకే రకం పనికి ఒకే వేతనం ఉంటుంది. శాల్తీ వేతనాల్లో తేడాలుంటాయి. ఎందుకంటే, అందరూ ఒకే పరిమాణంలో సరుకులు తయారు చెయ్యలేరు. ఒకరు కనీస పరిమాణంలో, మరొకరు సగటు పరిమాణంలో, ఇంకొకరు సగటును మించి సరఫరా చేయ్యవచ్చు. ఒక్కొక్కరి శక్తిని బట్టీ, నైపుణ్యాన్ని బట్టీ ఉత్పాదితాల పరిమాణంలో తేడాలుంటాయి. వాటికి తగినట్లు రోజు వేతనంలో తేడాలుంటాయి.

- అయితే ఈ పరిస్థితి పెట్టుబడికీ వేతనశ్రమకీ ఉండే సాధారణ సంబంధాల్ని మార్చదు. ఈ వ్యక్తుల మధ్య ఉండే ఈ తేడాలు వర్క్ షాప్ ని ఏక మొత్తంగా చూసినప్పుడు సమతూకం ఏర్పడుతుంది. నిర్దిష్ట కాలంలో సగటు ఉత్పాదితం సరఫరా అవుతుంది. ఒక పరిశ్రమలో చెల్లించే వేతనాలు సగటు వేతనాలు అవుతాయి.
- రెండో విషయం. వేతనాలకీ అదనపు విలువకీ ఉండే నిష్పత్తి మారదు. అలాగే ఉంటుంది.

కారణం, ఒక విడి కార్మికుడు ఇచ్చే అదనపుశ్రమ మొత్తం అతను పొందే వేతనానికి అనుగుణంగా ఉండడమే.

- శాల్తీ వేతనాలు వ్యక్తి ప్రత్యేకతకి అవకాశం ఇస్తాయి. దాంతో ఒకపక్క, శ్రామికుల్లో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సొంత అదుపు అనే భావన అభివృద్ధిచెందుతుంది. మరొకపక్క, అదే కార్మికుల్లో ఒకరితో ఒకరికి పోటీ పెరుగుతుంది. అందువల్ల, శాల్తీ వేతనాలకు విడికార్మికుల వేతానాల్ని సగటుని మించి పెంచుతూనే, అసలు ఈ సగటునే తగ్గించే పోకడ ఉంటుంది

అయితే, శాల్తీధర రేటు దీర్ఘకాలం స్థిరంగా ఉండి, దాన్ని తగ్గించడం ఇబ్బందికరమైనదయితే, యజమానులు అలాంటి అసాధారణ పరిస్థితుల్లో కొన్నిసార్లు తప్పనిసరిగా కాలం వేతనాల్లోకి తిరిగి మారుస్తారు. కొవెంటరీలో రిబ్బన్ నేతగాళ్ళు 1860 లో చేసిన పెద్దసమ్మె ఇందుకు ఉదాహరణ.

అసలు వేతన పద్ధతిలోనే వేతనాన్ని తగ్గిస్తూగూడా, పనిదినాన్ని పొడిగించడం, శ్రమ తీవ్రతని పెంచడం అనే ధోరణి ఉంటుంది. గంటవారీ పద్ధతికి ఒక ప్రధాన మద్దతు. శాల్తీ పద్ధతి అనేది అంతిమంగా ఇంతకు ముందు అధ్యాయంలో వివరించిన గంటవారీ పద్ధతికి ఒక ప్రధాన సపోర్ట్. ఫుట్ నోట్: కొన్ని వర్క్ షాపుల్లో అవసరమైన వాళ్ళకంటే ఎక్కువమందిని పెట్టుకోవడం తెలిసిందే. అనేక సందర్భాల్లో భవిష్యత్తులో పని వస్తుందని ఆశించి పనివాళ్ళని నియమిస్తారు. ఆపని ఎప్పటికీ రాకపోవచ్చు. ఇచ్చేది శాల్తీ వేతనం గనక యజమానులకి పొయేదేమీ లేదు. పనికాలం నష్టమైతే, అది పని దొరకని నిరుద్యోగులమీద పడుతుంది – H. Gregoir (1865)

ఇంతదాకా పరిశీలించిన దాన్ని బట్టి, శాల్తీ వేతనం పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి అతికినట్లు సరిపొతుంది.

చారిత్రక రుజువులు. 14 వ శతాబ్దపు ఫ్రెంచ్, ఇంగ్లిష్ కార్మిక చట్టాల్లో కాలం వేతనంతో పాటే శాల్తీ వేతనం అధికారికంగా ఉంది. కాబట్టి శాల్తీ వేతన పద్ధతి కొత్తదేమీ కాదు. అయినప్పటికీ, అది గొప్ప గెలుపు సాధించింది మాత్రం కార్ఖానా యుగంలోనే. ఆధునిక పరిశ్రమ కాలంలో, మరీ ముఖ్యంగా 1797 నుంచీ 1815 వరకూ పనిదినం పొడిగింపుకీ, వేతన తగ్గింపుకీ మీట (lever) గా ఉపకరించింది. ఆ కాలంలో వేతనాల ఎగుడుదిగుడుల గురించిన సమాచారం బ్లూ బుక్స్ లో లభిస్తుంది: జకోబిన్ వ్యతిరేక యుద్ధం ప్రారంభమైనప్పటి నుండీ శ్రమశక్తి ధర నిరంతరాయంగా ఎలా తగ్గించబడిదో వీటిలో సాక్ష్యాధారాలు ఉన్నాయి. ఉదాహరణకి, నేత పరిశ్రమలో శాల్తీ వేతనాలు ఎంతో పడ్డాయి. ఎంతగానంటే, పనిదినాన్ని బాగా పెంచినా గూడా, రోజుకి వచ్చే వేతనం అంతకుముందుకన్నా తక్కువగానే ఉంది. నేతగాని సంపాదన మునుపటి కంటే ఇప్పుడు చాలా తక్కువ; ఒకప్పుడు మామూలు కార్మికుని మీద అతనికున్న గొప్ప ఆధిక్యత ఇప్పుడు దాదాపు అంతరించింది. నిజానికి మామూలు శ్రామికునికీ, నిపుణ శ్రామికునికీ వేతనంలో ఏ కాలంలోనైన ఉన్న తేడా కంటే ఇప్పుడు ఎంతో తక్కువ వుంది – Remarks on the Commercial Policy of Great Britain, London, 1815, p. 48.

## వ్యవసాయంలో శాల్తీవేతనాల ప్రభావాలు

వ్యవసాయ కార్మికులకి శాల్తీవేతనాల ద్వారా పెరిగిన శ్రమ తీవ్రతవల్లా, విస్తృతి వల్లా చాలా తక్కువ ప్రయోజనం కలిగింది - అని భూస్వాముల పక్షాన, రైతుల పక్షాన రాసిన పుస్తకంలో ఉన్న ఈ భాగం తెలుపుతుంది: వ్యవసాయంలో చాలా ఎక్కువ భాగం రోజుకూలికి, లేక శాల్తీ పనికి, పెట్టుకున్న పనివాళ్ళతోనే జరుగుతుంది. వాళ్ళ వారంవేతనం ఇంచుమించు 12 షిల్లింగులు. ఒకవేళ శాల్తీ శ్రామికుడు ఎక్కువ ప్రేరణ వల్ల వారానికి ఒకటి రెండు షిల్లింగులు ఎక్కువ సంపాదిస్తాడు అనుకుందాం. అయినప్పటికీ, మొత్తం ఆదాయాన్ని లెక్కగడితే, ఆ సంవత్సరంలో అతను అదనంగా పొందేదానికంటే, (పని లేని కాలం కొంత ఉంటుంది, కనక దాని మూలంగా) పోగొట్టుకునేదే ఎక్కువ. సాధారణంగా ఈ శ్రామికుల వేతనాలు జీవితవసార వస్తువుల ధరకు తగిన నిష్పత్తిలో ఉంటాయి; ఇద్దరు పిల్లలున్న కుటుంబాన్ని చర్చి సహాయం లేకుండానే పోషించగల నిష్పత్తిలో ఉంటాయి.

**ఫాక్టరీ చట్టాల ప్రభావాలు.** ఫాక్టరీ చట్టాల కింద ఉన్న వర్క్ షాపుల్లో, శాల్తీ వేతనాలు సాధారణ నియమంగా ఉంటాయి. ఎందుకంటే, అక్కడ మాత్రమే పెట్టుబడి శ్రమని తీవ్రపరచడం ద్వారా పనిదినపు సామర్థ్యాన్ని పెంచగలుగుతుంది. ఫాక్టరీల్లో అయిదింట నాలుగొంతుల (4/5) మంది పనివాళ్ళు శాల్తీ వేతనాలవాళ్ళే.

**శాల్తీ వేతనాలూ - ఉత్పాదకతలో మార్పులూ.** ఇక్కడ లెక్క స్పష్టమే. శ్రమ ఉత్పాదకత మారితే, అదే ఉత్పాదితం భిన్నమైన శ్రమ కాలానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. అంటే మునుపు పట్టిని శ్రమ కంటే ఇప్పుడు పట్టే శ్రమలో తేడా ఉంటుంది. కనుక శాల్తీ ధర కూడా మారుతుంది. ఒక నిర్ణీత పనికాలానికి శాల్తీ వేతనం అనేది డబ్బు వ్యక్తీకరణ కావడమే కారణం. మన ఉదాహరణలో 12 గంటల్లో 24 శాల్తీలు ఉత్పత్తయ్యాయి. వాటి విలువ 600 రూపాయలు. రోజు శ్రమశక్తి విలువ 300 రూపాయలు. దీన్ని బట్టి, గంట శ్రమ ధర 25 రూపాయలు. ఒక శాల్తీకి వేతనం 12 ½ రూపాయలు. ఒక శాల్తీ అరగంట శ్రమని పీల్చుకుంటుంది. అదే శ్రమ దినం ఇప్పుడు ఉత్పాదకత రెట్టింపయినందువల్ల 24 కాకుండా 48 శాల్తీలు చేస్తే, ఒక శాల్తీకి వేతనం 12 ½ రూపాయలనుండి 6 1/4 రూపాయలకి పడిపోతుంది. కారణం ఒక శాల్తీ అరగంట శ్రమకి బదులు ఇప్పుడు పావుగంట శ్రమకే ప్రాతినిధ్యం వహిస్తుంది. 24 X 12 ½ రూపాయలు = 300 రూపాయలు. అదే విధంగా 48 x $6^1/4$ రూపాయలు = 300 రూపాయలు. శాల్తీ 12 ½ రూపాయల చొప్పున 24 శాల్తీలు 300 రూపాయలు. ఒక్కొక్కటి $6^1/4$ రూపాయలయితే 48 శాల్తీలు 300 రూపాయలు. దీన్నే ఇంకోవిధంగా చెబితే, ఒకేకాలంలో ఉత్పత్తయిన శాల్తీల సంఖ్య పెరిగే నిష్పత్తిలోనే శాల్తీ వేతనం తగ్గుతుంది. అంటే ఆ శాల్తీమీద ఖర్చయ్యే శ్రమకాలం తగ్గే నిష్పత్తిలోనే.

శాల్తీ వేతనంలో ఈ మార్పు పెట్టుబడి దారుడికీ, శ్రామికులకీ మధ్య ఎడతెగని పోరాటాలకు దారితీస్తుంది. పెట్టుబడిదారుడు శ్రమ ధరని వాస్తవంగా తగ్గించడానికి వంకగా ఉపయోగించు కోవడం వల్ల కావచ్చు, లేదా శ్రమ ఉత్పాదకత పెరుగుదల శ్రమ తీవ్రతని పెంచినందువల్ల కావచ్చు. లేక, శాల్తీ వేతనాల రూపాన్ని (అంటే, చెల్లింపు జరిగింది ఉత్పాదితానికే కాని తన

శ్రమశక్తికి కాదు అనే దాన్ని) శ్రామికుడు తీవ్రమైనదిగా భావిస్తాడు. అందువల్ల సరుకు అమ్మకం ధర అలాగే ఉండి, తన వేతనం తగ్గిస్తే తిరగబడతాడు. కార్మికులు ముడిపదార్థాల ధరల్నీ, తయారైన వస్తువుల ధరల్నీ జాగ్రత్తగా గమనిస్తారు, తమ యజమానికొచ్చే లాభాల్ని కచ్చితంగా అంచనాగడతారు.

### యంత్రాల వల్ల కలిగే ప్రయోజనాల్లో కార్మికులకి వాటా ఉండదు

కార్మిక సంఘాలు వేతనాల్ని నిలబెట్టుకోవడానికి మెరుగైన యంత్రాల వల్ల కలిగే ప్రయోజనాల్లో వాటా కోసం ప్రయత్నిస్తాయి. పెట్టుబడిదారుడు తిప్పికొడతాడు. అన్యాయంగా ఆక్రమించుకునే ప్రయత్నాన్ని పరిశ్రమ పురోగమనంపై పన్నుల విధింపు అంటూ ఆక్రోశిస్తాడు. శ్రమ ఉత్పాదకత ఏ మాత్రమూ శ్రామికునికి సంబంధించింది కాదు అని ప్రకటిస్తాడు. ఉదాహరణకి, 1861 అక్టోబర్ 26 లండన్ స్టాండర్డ్ పత్రికలో జాన్ బ్రైట్ అండ్ కంపెనీ సంబంధించిన కోర్ట్ విచారణ వార్త వచ్చింది. అది తివాచీ నేసేవాళ్ళ కార్మిక సంఘాల బెదిరింపులకు వ్యతిరేకంగా వేసిన దావా. బ్రైట్ భాగస్వాములు కొత్తయంత్రాల్ని ప్రవేశపెట్టారు. ఫలితంగా మునుపు 160 గజాల తివాచీ తయారయ్యే కాలంలోనే ఇప్పుడు 240 గజాల తివాచీ ఉత్పత్తవుతున్నది. యంత్రాల మెరుగుదల కోసం యజమాని పెట్టుబడివల్ల వచ్చిన లాభాల్లో వాటా కోరే హక్కు పనివాళ్ళకు ఉండదు. దాని ప్రకారం కంపెనీ వాళ్ళు గజానికి ఇస్తున్న 1½ పెన్నీ కాకుండా, తగ్గించి 1 పెన్నీయే ఇస్తామని ప్రతిపాదించారు. పనివాళ్ళు అంతే శ్రమతో మునుపు ఎంత సంపాదించారో అంతే సంపాదిస్తారు.

## అధ్యాయం 22
# వేతనాల్లో జాతీయ వ్యత్యాసాలు

వేతనాలు అన్నిదేశాల్లో ఒకే పరిమాణంలో ఉండవు. దేశానికీ దేశానికీ తేడా ఉంటుంది. శ్రమశక్తి విలువని నిర్ణయించే అంశాల్లో ఉండే తేడాలే ఇందుకు కారణం. భిన్నదేశాల వేతనాల్ని పోల్చేటప్పుడు శ్రమశక్తి విలువ మొత్తంలో మార్పుల్ని నిర్ణయించే అన్ని అంశాల్నీ పరిగణనలోకి తీసుకోవాలి. ఆ అంశాలు:

1. జీవితావసరాల ధరా, విస్తృతీ.
2. శ్రామికుల శిక్షణ కయ్యే ఖర్చు
3. స్త్రీల శ్రమ, పిల్లల శ్రమ పోషించే పాత్ర
4. శ్రమ ఉత్పాదకత
5. శ్రమ తీవ్రత

ఏదో పైపైన పోల్చాలన్నా, వేర్వేరు దేశాల్లో, ఒకేరకం వృత్తుల్లో సగటు దిన వేతనాన్ని ముందుగా ఒకేరకమైన పనిదినంగా కుదించడం తప్పనిసరి. అలా దిన వేతనాల్ని ఒకేరకానికి కుదించిన తర్వాత, కాలం వేతనాన్ని శాల్తీ వేతానాల్లోకి మార్చాలి. ఎందుకంటే, శ్రమ ఉత్పాదకతకీ, శ్రమ తీవ్రతకీ రెండింటికీ శాల్తీ వేతనం మాత్రమే కొలమానంగా ఉండగలదు.

### శ్రమ తీవ్రతా, శ్రమ ఉత్పాదకతా

ఏ దేశంలోనైనా సగటు శ్రమతీవ్రత ఎంతోకొంత ఉంటుంది. అంతకు తగ్గితే ఒకసరుకు ఉత్పత్తికి అవసరమైన శ్రమకాలం కన్నా ఎక్కువ కాలం పడుతుంది. అందువల్ల, అది మామూలు నాణ్యత ఉన్న శ్రమగా పరిగణించబడదు. వేర్వేరు దేశాలు. సగటు శ్రమతీవ్రత అన్ని దేశాల్లో ఒకటిగా ఉండదు. దేశానికీ దేశానికీ తేడా ఉంటుంది. ఒకదేశంలో ఎక్కువ, మరొకదేశంలో తక్కువ ఉంటుంది. ఈ దేశాల సగటులు ఒక కొలమానాన్ని ఏర్పరుస్తాయి. ఆ కొలమానం ప్రమాణం (unit of measure) ప్రపంచ శ్రమ యొక్క సగటు ప్రమాణం. అందువల్ల ఎక్కువ తీవ్రత గల దేశశ్రమ, తక్కువ తీవ్రత గల దేశశ్రమతో పోలిస్తే, అది అదే కాలంలో ఎక్కువ విలువని ఉత్పత్తిచేస్తుంది. ఆవిలువ ఎక్కువ డబ్బులో వ్యక్తమవుతుంది.

### అంతర్జాతీయ విలువలు

అయితే విలువ నియమం అంతర్జాతీయస్థాయిలో వర్తించేటప్పుడు మరికొంత మారుతుంది. ఎందువల్లంటే, ప్రపంచ మార్కెట్లో ఎక్కువ ఉత్పాదకత ఉన్న దేశశ్రమ ఎక్కువ తీవ్రత ఉన్న శ్రమగా కూడా లెక్కకొస్తుంది – పోటీ మూలంగా ఆదేశపు సరుకుల ధరని వాటి విలువ స్థాయికి తగ్గించనంతవరకూ మాత్రమే. ఒక దేశంలో పెట్టుబడిదారీ ఉత్పత్తి అభివృద్ధయిన నిష్పత్తిలోనే, ఆదేశ జాతీయ శ్రమ తీవ్రతా, శ్రమ ఉత్పాదకతా అంతర్జాతీయ స్థాయిని మించి పెరుగుతాయి. వేర్వేరు దేశాల్లో ఒకే కాలంలో ఉత్పత్తయిన ఒకేరకమైన సరుకులు భిన్నమైన

అంతర్జాతీయ విలువలు కలిగి ఉంటాయి. ఆ విలువలు వేర్వేరు ధరల్లో – అంటే, అసమానమైన అంతర్జాతీయ విలువల్ని బట్టి మారే డబ్బు మొత్తాల్లో – వ్యక్తమవుతాయి. అందువల్ల, డబ్బు యొక్క సాపేక్ష విలువ పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఎక్కువ అభివృద్ధి చెందిన దేశంలో, తక్కువ అభివృద్ధి చెందిన దేశంలో కంటే తక్కువ ఉంటుంది. దీన్నిబట్టి, నామక వేతనం – డబ్బులో వ్యక్తమయ్యే శ్రమ శక్తికి సమానకం – కూడా రెండో దేశంలో కంటే మొదటి దేశంలోనే ఎక్కువ ఉంటుంది. అయితే, ఇది నిజ వేతనానికి – శ్రామికుడి అందుబాటులో ఉన్న జీవనాధార సాధనాలకి – కూడా వర్తిస్తుందని రుజువు అయినట్లు కానేకాదు.

## నామక వేతనాలూ – నిజ వేతనాలూ

నామక వేతనాలకీ, నిజ వేతనాలకీ తేడా ఉంటుంది. కార్మికుడు పెట్టుబడిదారుడికి అమ్మే శ్రమశక్తికి గాను పొందే డబ్బు నామక వేతనం. ఆ డబ్బుతో అతను కొనగల వస్తువుల మొత్తం నిజ వేతనం. నిజమైన వేతనం స్థాయి నామక వేతనం పరిమాణం మీదా, శ్రామికుని జీవితావసరవస్తువుల ధరలమీదా ఆధారపడుతుంది. నామక వేతనం మారకుండా ఉన్నప్పటికీ, జీవితావసర వస్తువుల ధరలు పెరిగితే నిజమైన వేతనాలు తగ్గుతాయి. వాస్తవంలో నామక వేతనాలు పెరిగినప్పటికీ, జీవితావసర వస్తువుల ధరలు పెరిగితే, నిజమైన వేతనాలు పడిపోతాయి.

## పెట్టుబడిదారీ అభివృద్ధీ – వేతన వ్యత్యాసాలూ

భిన్న దేశాల్లో డబ్బు విలువలో ఉండే సాపేక్ష వ్యత్యాసాలు ఎలావున్నా, ఒక విషయం తరచుగా తెలుస్తుంది: వేతనం పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఎక్కువ అభివృద్ధి చెందిన దేశంలో, తక్కువ అభివృద్ధి చెందిన దేశంలో కంటే ఎక్కువ వుంటుంది; కాగా, సాపేక్ష శ్రమ ధర – అంటే, అదనపు విలువతోనూ, ఉత్పాదితం విలువతోనూ పోల్చిన శ్రమధర – మొదటి దేశంలో కంటే రెండో దేశంలో ఎక్కువ ఉంటుంది. స్మిత్ కి వ్యతిరేకంగా చేసిన వాదనలో జేంస్ ఆండర్ సన్ ఇలా అన్నాడు:

నేలనించి వచ్చే ఉత్పత్తుల ధర, ప్రత్యేకించి ధాన్యం ధర చౌకగా ఉండే పేద దేశాల్లో శ్రమధర సాధారణంగా తక్కువగా ఉన్నట్లు పైకి కనిపించే ఉంటుంది. కాని వాస్తవానికి శ్రమధర చాలావరకూ రెండో దేశాల్లో కంటే మొదటి దేశంలోనే ఎక్కువ ఉంటాయి. ఎందుకంటే, నిజమైన శ్రమ ధర అనేది రోజుకి శ్రామికునికి ఇచ్చే వేతనం కాదు – వేతనం పైకి కనిపించే శ్రమ ధర రూపం అయినప్పటికీ. నిజమైన ధర అంటే, వాస్తవంగా చేసిన కొంత పరిమాణం గల శ్రమకి యజమానికి ఎంత ఖర్చయిందో అంత. అదే నిజమైన ధర. ఈ దృష్టితో చూస్తే, ప్రతి సందర్భంలోనూ సంపన్న దేశాల్లో కంటే, పేద దేశాల్లో శ్రమ చౌక – ధాన్యం ధరా, ఇతర జీవితవసరాల ధరలూ మొదటి (సంపన్న) దేశాల్లో కంటే, రెండో (పేద) దేశాల్లో సాధారణంగా తక్కువగా ఉన్నప్పటికీ…రోజుని బట్టి లెక్కిస్తే, ఇంగ్లండ్ లో కంటే స్కాట్ లాండ్ లో శ్రమ చౌక. శాల్తీని బట్టి చూస్తే ఇంగ్లండ్ లో చౌక. (James Anderson, Observations on the Means of Exciting a Spirit of National Industry,? &tc., Edin. 1777, pp. 350, 351)

ఇందుకు భిన్నంగా, వేతనాలు తక్కువగా ఉండడం అనేది తిరిగి శ్రమని ప్రియం చేస్తుంది. – ఇంగ్లండ్‌లో కంటే శ్రమ ఐర్లండ్‌లో ప్రియం. ఎందుకంటే, వేతనాలు అంత తక్కువ ఉంటాయి గనక (N. 2079 in Royal Commission on Railways, Minutes, 1867.)

1833 లో J.W. కొవెల్ నూలు వర్తకాన్ని శ్రద్ధగా పరిశోధించి ఒక నిర్ధారణకొచ్చాడు: ఇంగ్లండ్ వేతనాల్నీ ఐరోపా ఖండ వేతనాల్నీ పోల్చిచూస్తే, ఇంగ్లండ్‌లో ఐరోపా ఖండంలో కంటే వేతనాలు పెట్టుబడిదారుడికి తక్కువ – శ్రామికుడికి ఎక్కువే అయినప్పటికీ. అలెగ్జాండర్ రెడ్ గ్రేవ్ అనే ఫాక్టరీ ఇన్స్పెక్టర్ 1866 అక్టోబర్ 31 నివేదికలో ఈ క్రింది విషయాన్ని రుజువుచేశాడు:

తక్కువ వేతనాలు ఎక్కువ పనికాలం ఉన్నప్పటికీ ఐరోపా దేశాల శ్రమ, ఉత్పాదితంతో పోల్చిచూస్తే, ఇంగ్లిష్ శ్రమకంటే ప్రియం. ఓల్డెంబెర్గ్ లో ఒక నూలు మిల్లు ఇంగ్లిష్ మేనేజర్ ఇలా చెప్పాడు: అక్కడ పనికాలం ఉదయం 5.30 నుంచీ రాత్రి 8 గంటలదాకా. శనివారం కూడా అంతే. వాళ్ళు ఇంగ్లిష్ పర్యవేక్షకులకింద పనిచేసినప్పుడు ఇంగ్లిష్ వాళ్ళు 10 గంటల్లో ఉత్పత్తి చేసినంత చేసేవాళ్ళు కాదు. అయితే జర్మన్ పర్యవేక్షకుల కింద ఉన్నప్పుడు ఇంకా తక్కువ ఉత్పత్తి చేసేవాళ్ళు. వేతనాలు ఇంగ్లండ్ లోకంటే బాగా తక్కువ. ఎక్కువ సందర్భాల్లో 50 శాతమే, అంటే సగానికి సగమే. అయితే యంత్రాలతో కార్మికుల నిష్పత్తి ఎక్కువ. కొన్ని శాఖల్లో అది 5:3

రష్యా నూలు ఫాక్టరీల గురించి రెడ్ గ్రేవ్ పూర్తి వివరాలు ఇచ్చాడు. ఇటీవల వరకూ అక్కడ పనిచేసిన ఒక ఇంగ్లిష్ మేనేజర్ ఆసమాచారాన్ని ఆయనకు ఇచ్చాడు. రష్యా నేల అన్ని దురాగతాలకూ ఆలవాలం. ఇంగ్లిష్ ఫాక్టరీల ప్రారంభ కాలంలో జరిగిన ఘోరాలన్నీ పూర్తిస్థాయిలో తాండవమాడాయి. స్థానిక రష్యా పెట్టుబడిదారుడికి ఫాక్టరీ వ్యాపారం చేతకాదు. అందువల్ల మేనేజర్లు ఇంగ్లిష్ వాళ్ళు. రాత్రింబవళ్ళు అతి పని సాగించినా, కార్మికులకు సిగ్గుపడేటంత కీతా వేతనాలు ఇచ్చినా, రష్యా మాన్యుఫాక్చర్ విదేశీ పోటీని నిషేధించడం ద్వారా మాత్రమే బతికి బట్టగట్టగలిగింది. ఇందుకు రుజువుగా మార్చ్ రెడ్ గ్రేవ్ ఇచ్చిన పట్టికని ఇచ్చాడు. అందులో ఐరోపా దేశాల్లో ఒక్కొక ఫాక్టరీలో ఉన్న సగటు కదుళ్ళ సంఖ్యా, ఒక్కొక కార్మికుడు నిర్వహించే సగటు కదుళ్ళ సంఖ్యా ఉన్నాయి.

| దేశం | ఒక ఫాక్టరీలో ఉన్న సగటు కదుర్ల సంఖ్య |
|---|---|
| ఇంగ్లండ్ | 12,600 |
| ఫ్రాన్స్ | 1,500 |
| ప్రష్యా | 1,500 |
| బెల్జియం | 4,000 |
| శాక్సనీ | 4,500 |
| ఆస్ట్రియా | 7,000 |
| స్విజర్లండ్ | 8,000 |

కదుళ్ళను బట్టి నియమితులైన కార్మికుల సగటు సంఖ్య

| దేశం | ఒక కార్మికుడు పనిచేసే కదుళ్ళ సంఖ్య |
|---|---|
| ఫ్రాన్స్ | 14 |
| రష్యా | 28 |
| ప్రష్యా | 37 |
| బవేరియా | 46 |
| ఆస్ట్రియా | 49 |
| బెల్జియం | 50 |
| శాక్సనీ | 50 |
| స్విజర్లండ్ | 55 |
| జర్మనీ చిన్నరాజ్యాలు | 55 |
| గ్రేట్ బ్రిటన్ | 74 |

ఈ పోలిక బ్రిటన్‌కి మరింత ప్రతికూలమమైనదే. కారణం, అక్కడ అనేక ఫాక్టరీలు పవర్‌తో నడుస్తాయి. వాటిలో నెయ్యడమూ, వడకడమూ జమిలిగా జరుగుతాయి.(కాని పై పట్టికలో నేతగాళ్ళను తీసివెయ్యలేదు). పైగా ఇతరదేశాల ఫాక్టరీలు ప్రధానంగా నూలు వడికే ఫాక్టరీలు; వడికే ఫాక్టరీల్ని అటువంటి వాటితోనే పోల్చడానికి వీలుంటే, మాజిల్లాలో చాలా వడికే ఫాక్టరీల్లో ఒక కార్మికుడు ఇద్దరు సహాయకులతో 2,200 కదుర్లను నిర్వహిస్తాడు. 400 మైళ్ళ పొడవుండే, 220 పౌన్ల నూలు వడుకుతాడు.

తూర్పు ఐరోపాలో ఆసియాలో లాగే, ఇంగ్లిష్ కంపెనీలు రైల్వే నిర్మాణాన్ని చేపట్టాయి. అందుకు స్థానిక శ్రామికులతో పాటు ఇంగ్లిష్ కార్మికుల్ని కూడా పెట్టుకున్నాయి. ఇది తెలిసిన సంగతే. ఆచరణలో అవసరంవల్ల, ఆ విధంగా వాళ్ళు శ్రమ తీవ్రతలో ఉన్న జాతీయ భేదాన్ని లెక్కలోకి తీసుకోవలసివచ్చింది. అయితే, దానివల్ల వాళ్ళకి నష్టమేమీ రాలేదు. వాళ్ళ అనుభవం చెప్పేదేమంటే : వేతనాల స్థాయి సగటు శ్రమ తీవ్రతకి ఇంచుమించు అనుగుణంగా ఉన్నాగాని, సాపేక్ష శ్రమ ధర (అంటే, ఉత్పాదితంతో సంబంధంలో శ్రమధర) సాధారణంగా విలోమదిశలో మారుతుంది.

# భాగం 7

## పెట్టుబడి సంచయనం

## అధ్యాయం 23
# సామాన్య పునరుత్పత్తి (Simple Reproduction)

### ఉత్ప త్తీ – పునరుత్పత్తీ

సమాజం వస్తువుల్ని ఉత్పత్తి చేస్తుంది. వాటిని వాడుకుంటుంది. అవి క్రమంగా అయిపోతాయి. సమాజానికి మళ్ళీ వాటి అవసరం ఉంటుంది. అవి మళ్ళీ ఉత్పత్తి కావాల్సి ఉంటుంది. అవి కూడా మళ్ళీ అయిపోతాయి. కాబట్టి ఉత్పత్తి నిరంతరం జరుగుతుండాలి. ప్రతి ఉత్పత్తి ప్రక్రియా, అదేసమయంలో పునరుత్పత్తి ప్రక్రియ కూడా. ఉత్పత్తి కుండే షరతులే పునరుత్పత్తికి కూడా వర్తిసాయి. తన ఉత్పత్తుల్లో కొంతభాగాన్ని ఉత్పత్తిసాధనాలుగా నిరంతరం మార్చకుండా, ఏ సమాజమూ ఉత్పత్తిని కొనసాగించ లేదు, పునరుత్పత్తి చెయ్యజాలదు.

**ఉత్పత్తి పెట్టుబడిదారీ రూపంలో ఉంటే, పునరుత్పత్తి కూడా పెట్టుబడిదారీ రూపంలో ఉంటుంది.** పెట్టుబడిదారీ రూపం అంటే: పెట్టుబడిదారుడు ఉత్పత్తిని అదనపువిలువ ఉత్పత్తిచేసే సాధనంగా ఉపయోగిస్తాడు. ఇక్కడ పునరుత్పత్తికూడా పెట్టుబడిదారుడి ప్రయోజనాల కోసమే జరుగుతుంది. శ్రమ ప్రక్రియ పెట్టుబడి స్వయం విస్తరణ సాధనంగా ఉంటుంది, పెట్టుబడిదారుడి లక్ష్యం ఉపయోగపు విలువల ఉత్పత్తి కానేకాదు. ఒకదఫా లావాదేవీలో పొందే లాభమూ కాదు. విరామం లేకుండా లాభాలు చేసుకోవడం. అతని డబ్బు ఎడతెరిపి లేకుండా పెట్టుబడిగా వ్యవహరిస్తుంది. కనుకనే అతనికి పెట్టుబడిదారుడు అనే ఆర్థిక వేషం పడుతుంది.

### సరళ పునరుత్పత్తి

పెట్టుబడిదారుడి ఆదాయం అదనపువిలువ. అది అతని వినియోగానికే సరిపోతూ ఉంటే – అంటే వచ్చింది వచ్చినట్లు ఖర్చయి పోతుంటే – అది సరళ పునరుత్పత్తి.

### వేతనం కార్మికుని ఉత్పాదితంలో ఒక భాగం

ఒక నిర్దిష్ట కాలానికి శ్రమశక్తిని కొనడమే ఉత్పత్తి ప్రక్రియకి నాంది. ఆ కాలం ముగిసినప్పుడల్లా మళ్ళీ కొనుగోలు జరగాలి. ఈ కొనడం నిరంతరం పునరావృతం అవుతుండాలి. అయితే తన శ్రమ శక్తిని ఖర్చుచేసేదాకా, దానివిలువా అదనపువిలువా సరుకుల్లో సిద్ధించేదాకా, శ్రామికునికి చెల్లింపు జరగదు. అందువల్ల, అతను పెట్టుబడిదారుడి సొంత ఖర్చులకు వినియోగించే నిధిని మాత్రమే కాకుండా, తనకు వేతనం చెల్లించే నిధిని, అంటే అస్థిరపెట్టుబడిని కూడా ఉత్పత్తి చేసి ఉంటాడు. ఈ నిధిని పునరుత్పత్తి చేస్తున్నంత కాలమే అతనికి పని ఉంటుంది. అందువల్లనే – వేతనం ఉత్పాదితంలో వాటా – అంటూ 18 వ శతాబ్దపు ఆర్థికవేత్తలు సూత్రీకరించారు.

### వేతన రూపంలో కార్మికుడికి వెనక్కి వచ్చేది ఏమిటి?

నిరంతరం అతను పునరుత్పత్తి చేస్తున్న ఉత్పాదితంలో ఒక భాగం మాత్రమే. పెట్టుబడి దారుడు కార్మికునికి డబ్బు రూపంలో చెల్లిస్తాడు, నిజమే. ఈవారం లేక ఈ సంవత్సరం కార్మికుడికి చెల్లిస్తున్నది, అతని గతవారం శ్రమని లేక గత ఏడాది శ్రమని.

## అస్థిర పెట్టుబడి, పెట్టుబడిదారుడు పెట్టే అడ్వాన్స్ అనేది ఒక భ్రమ

ఈ భ్రమ (illusion) డబ్బు జోక్యంవల్ల కలుగుతుంది. అదీ ఒక విడి పెట్టుబడిదారుణ్ణీ, ఒక విడి శ్రామికుణ్ణీ తీసుకున్నప్పుడే. ఒక పెట్టుబడిదారుణ్ణీ, ఒక కార్మికుణ్ణీ కాకుండా పెట్టుబడిదారీ వర్గాన్నీ ఒక మొత్తంగా, కార్మిక వర్గాన్నీ ఒక మొత్తంగా తీసుకుంటే, డబ్బు జొక్యం వల్ల ఏర్పడ్డ భ్రమ వైదొలగిపోతుంది. నిరంతరం డబ్బు రూపంలో కార్మిక వర్గం సరుకుల్ని తయారు చేయగా, పెట్టుబడిదారీ వర్గం వాటిని స్వాయత్తం చేసుకుంటుంది. అలా స్వాధీనం చేసుకున్న సరుకుల్లో ఒక భాగాన్ని కార్మిక వర్గానికి ఆజ్ఞాపత్రాలు (order notes) జారీ చేస్తుంది. అంటే, కార్మికుల నుంచి పెట్టుబడిదారులు స్వాధీనం చేసుకున్న ఉత్పాదితంలో ఒక భాగాన్ని కొనుక్కు నేందుకు వాళ్ళకి అనుమతిస్తుంది. కార్మికులు ఆ నోట్లని నిరంతరం పెట్టుబడిదారులకి వెనక్కిస్తూ, ఆవిధంగా తమ సొంత ఉత్పాదితంలో తమ భాగాన్ని పొందుతారు. ఈ లావాదేవీ ఉత్పాదితం యొక్క సరుకు రూపంలోనూ, సరుకు యొక్క డబ్బు రూపం లోనూ మరుగుపరచబడుతుంది. ఈ లావాదేవీ స్వభావం శ్రామికుని ఉత్పాదితాన్ని నిరంతరం పెట్టుబడిదారుడు స్వాధీనం చేసుకొవడమే. పైకి ఈ లావాదేవీ వక్రీకృత రూపంలో, ముసుగు కప్పిన రూపంలో కనబడుతుంది. ఎలాగంటే,

ఒకటి: దోపిడీ కనబడదు

రెండు: పెట్టుబడిదారుడు శ్రామికుడికి వేతనం అడ్వాన్స్ చేస్తున్నట్లు కనబడుతుంది

వేతనం గురించిన వాస్తవం: వేతనం అనేది పెట్టుబడిదారుడు కార్మికునికి ఇచ్చేది కాదు, అది కార్మికులే ఉత్పత్తి చేసినది. అస్థిర పెట్టుబడి కార్మికుని చేరుతున్నదనే దొక భ్రమ.

## వేతనాల్ని పెట్టుబడి దారుడు అడ్వాన్స్ చెయ్యకపోతే, ఎక్కడనుండి వస్తాయి?

కార్మికుడు గతంలో చేసిన శ్రమనుంచి. ఈ రెండో స్టెప్ కోసం ఉత్పత్తి ప్రక్రియని నిరంతర ప్రక్రియగా చూడాలి. అయితే, ఇదంతా వాస్తవాన్ని మార్చలేదు. ఆవాస్తవం: పెట్టుబడిదారుడు కార్మికునికి అడ్వాన్స్ చేసేది, ఉత్పాదితంలో సిద్ధించిన కార్మికుని సొంత శ్రమనే. ఇక్కడ ఒక ఫుట్ నోట్: ప్రపంచంలో నాలుగోవంతు కార్మికుల విషయంలో మాత్రమే, శ్రమకి వేతనాలు పెట్టుబడిదారుల చేత అడ్వాన్స్ చెయ్యబడుతున్నాయి– ఇంగ్లిష్ ఆర్థికవేత్త రిచర్డ్ జోన్స్ (1780–1855) - Textbook of Lectures on the Pol. Econ. of Nations. Hertford, 1852, p. 36

ఏమైనప్పటికీ, ప్రక్రియ కొనసాగింపే, సరళ పునరుత్పత్తే అస్థిర పెట్టుబడినిమాత్రమే కాక, మొత్తం పెట్టుబడిని ప్రభావితంచేసే కొన్ని ఇతర మార్పుల్ని కూడా తెస్తుంది.

10,000 రూపాయల పెట్టుబడి ఏటా 2,000 రూపాయల అదనపువిలువ తెస్తే, అదంతా సొంతానికి ఖర్చయితే, 5 సంవత్సరాల చివరకి అతను ఖర్చుచేసే అదనపు విలువ 5 X 2,000 = 10,000. అంతా ఖర్చుబెడితే మొదట పెట్టిన పెట్టుబడి అయిపోయినట్లే. సగమే ఖర్చుపెట్టుకుంటే 10 ఏళ్ళలో అయిపోతుంది. పెట్టుబడిదారుడు తాను 'ఇతరుల చెల్లించబడని శ్రమ ఉత్పాదితాన్ని' ఖర్చుచేసుకుంటున్నాననీ, తన మొదటి పెట్టుబడి చెక్కుచెదరకుండా ఉన్నదనీ అనుకుంటాడు. అతను **అనుకోవడాన్ని బట్టి వాస్తవాలు మారవు.** కొన్నేళ్ళ తర్వాత

అతని పెట్టుబడి అతను లాగిన అదనపు విలువ మొత్తానికి సమం అవుతుంది. ఒకవ్యక్తి ఆస్తి విలువకి సరిపడే అప్పు చేస్తే, అతని ఆస్తి ఆ అప్పుల మొత్తమే తప్ప ఏమీ కాదు. పెట్టుబడిదారుడి విషయమూ అంతే. పాత పెట్టుబడిలో ఇక అణుమాత్రం కూడా మిగిలి ఉండదు.

సరళ పునరుత్పత్తి మాత్రమే జరిగితే, అది కాస్త వెనకా ముందుగా ప్రతి పెట్టుబడినీ 'సంచయన మైన పెట్టుబడి' (accumulated capital) గా, లేక 'పెట్టుబడిగా మార్చబడ్డ అదనపు విలువ' గా మార్చి తీరుతుంది. ఒకవేళ మొదటి పెట్టుబడి అతని సొంత శ్రమతో కూడినదైనా, అది కాస్తవెనకా ముందుగా 'సమానకం ఇవ్వకుండా స్వాధీనం చేసుకున్న విలువ' అవుతుంది. అంటే, డబ్బులోనో, వస్తువుల్లోనో రూపొందిన 'చెల్లించబడని ఇతరుల శ్రమ' అవుతుంది.

## ఉత్పత్తిదారుల్ని ఉత్పత్తిసాధనాలనుంచి వేరుపరచడం – అనే ప్రక్రియ పునరుత్పత్తి కావడం

4–6 అధ్యాయాల్లో చూచినట్లు, డబ్బు పెట్టుబడిలోకి మారాలంటే సరుకుల ఉత్పత్తీ, చలామణీ మాత్రమే సరిపోవు. ఒకవైపు డబ్బున్నవాడు, మరొకవైపు విలువని ఉత్పత్తిచేసే పదార్థం ఉన్నవాడు; ఒక వైపు ఉత్పత్తి సాధనాలూ, జీవితావసర సాధనాలు ఉన్న వాడు, మరొకపక్క శ్రమశక్తి తప్ప మరేమీ లేనివాడు; వీరిరువురూ కొనేవాడుగా, అమ్మేవాడుగా ఎదురుపడాలి. అందువల్ల, శ్రమ దాని ఉత్పాదితం నుండి వేరుపడడం, శ్రమకి అవసరమైన భౌతిక పరిస్థితుల నుంచి, శ్రమశక్తి వేరుపడడం అనేది పెట్టుబడిదారీ ఉత్పత్తికి నిజమైన ప్రాతిపదిక, దాని ప్రారంభ స్థానం. అయితే, అదే ప్రక్రియ పదే పదే జరుగుతున్నందువల్ల పెట్టుబడిదారీ ఉత్పత్తి యొక్క ప్రత్యేక ఫలితం అవుతుంది.

పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియ **పెట్టుబడిదారుణ్ణి సంపన్నుణ్ణి చేస్తుంది. కాని కార్మికుణ్ణి అలానే– ఉన్నవాణ్ణి ఉన్నచోటే– ఉంచుతుంది.** వేతన శ్రామికుడిగా ఉత్పత్తి చేస్తుంది. కార్మికుణ్ణి వేతన శ్రామికుడిగా నిరంతరం పునరుత్పత్తి చెయ్యడం, అతన్ని శాశ్వతీకరించడం అనేది పెట్టుబడిదారీ ఉత్పత్తికి అనివార్య షరతు.

## శ్రమ పరాయీకరణ

కార్మికుడు తన శ్రమశక్తిని అమ్మడం వల్ల, అతను ప్రక్రియలోకి రాకముందే అతని సొంత శ్రమ అతనినుండి పరాయీకరణ చెందింది. అది పెట్టుబడిదారుడి స్వాధీనం అయింది. పెట్టుబడిలో భాగంగా ఇమిడి పోయింది. ఆ కారణం చేత, అది ఉత్పాదితంలో చేరే సమయంలో అతనికి చెందదు. ఉత్పత్తి ప్రక్రియ, పెట్టుబడి దారుడు శ్రమశక్తిని వినియోగించుకునే ప్రక్రియ కూడా. అయినందువల్ల, శ్రామికుని ఉత్పాదితం సరుకు అవుతుంది. అంతేకాదు, అది పెట్టుబడిలోకి, విలువని సృజించే శక్తిని పీల్చే విలువలోకి పరివర్తన చెందుతుంది. మనిషిని కొనే జీవనాధార సాధనాల్లోకి, ఉత్పత్తిదారుల్ని శాసించగలిగే ఉత్పత్తి సాధనాల్లోకి, మారుతుంది.

## ఉత్పాదక వినియోగమూ – వైయక్తిక వినియోగమూ

శ్రామికుడి వినియోగం రెండు విధాలుగా ఉంటుంది:

1. ఉత్పాదక వినియోగం
2. వైయక్తిక వినియోగం.

ఉత్పత్తిచేసేటప్పుడు, తనశ్రమతో ఉత్పత్తిసాధనాల్ని వినియోగించి, వాటిని ఎక్కువ విలువ ఉండే – పెట్టుబడిదారుడు అడ్వాన్స్ చేసిన విలువకన్నా ఎక్కువ విలువ ఉండే – ఉత్పాదితాలుగా మారుస్తాడు. కార్మికుని ఉత్పాదక వినియోగం అంటే ఇదే. అదేసమయంలో శ్రమశక్తిని పెట్టుబడిదారుడు వినియోగించడం కూడా అదే.

మరొకపక్క, కార్మికుడు తన శ్రమశక్తిని అమ్మగా వచ్చిన డబ్బుని జీవితావసర సాధనాల్లోకి మార్చుకుంటాడు. ఇది అతని వైయక్తిక వినియోగం. అందువల్ల కార్మికుని ఉత్పాదక వినియోగమూ, వైయక్తిక వినియోగమూ పూర్తిగా భిన్నమైనవి. ఉత్పాదక వినియోగంలో, కార్మికుడు పెట్టుబడికి చోదకశక్తిగా పనిచేస్తాడు; అప్పుడతను పెట్టుబడిదారుడికి చెందుతాడు. వైయక్తిక వినియోగంలో అతను అతనికే చెందుతాడు. ఉత్పత్తిప్రక్రియకి బయట తనకు కావలసిన పనులు చేసుకుంటాడు. మొదటిదాని ఫలితంగా పెట్టుబడిదారుడు బతుకుతాడు; రెండోదాని ఫలితంగా శ్రామికుడు బతుకుతాడు. ఆవిరి యంత్రానికి బొగ్గేసి, నీరు పోసినట్లు, చక్రానికి నూనె పెట్టినట్లు తన శ్రమశక్తిని నిలుపుకోడానికి కావలసిన వాటిని తానే సమకూర్చు కుంటాడు. ఒక పెట్టుబడి దారుణ్ణీ, ఒక కార్మికుణ్ణీ కాకుండా పెట్టుబడిదారీ వర్గాన్నీ, కార్మిక వర్గాన్నీ; విడి ఉత్పత్తి ప్రక్రియగా కాకుండా, పూర్తి జోరందుకున్న వాస్తవ సామాజిక స్థాయిలో చూచినప్పుడు, ఇదే విషయం వేరే రూపం తీసుకుంటుంది. తన పెట్టుబడిలో ఒక భాగాన్ని శ్రమశక్తిలోకి మార్చడం ద్వారా, పెట్టుబడిదారుడు తన మొత్తం పెట్టుబడిని పెంచుకుంటాడు. ఒకే రాయితో రెండు పిట్టల్ని కొడతాడు. కార్మికుడి నుండి పొందే దాన్నుండీ లాభిస్తాడు, అలాగే కార్మికుడికి ఇచ్చేదాన్నుండీ లాభిస్తాడు. శ్రమశక్తికి బదులు ఇచ్చిన పెట్టుబడి జీవితావసరాలుగా మారుతుంది. వాటి వినియోగం వల్ల, కార్మికుల కండరాలూ, ఎముకలూ, మెదళ్ళూ పునరుత్పత్తి అవుతాయి. కొత్త కార్మికులు ఉద్భవిస్తారు. అందువల్ల, కచ్చితంగా అవసరమైన మేరకు కార్మికుల వైయక్తిక వినియోగం, దోపిడీ చెయ్యడానికి పెట్టుబడిదారుడికి అందుబాటులో తాజా శ్రమని పునరుత్పత్తి చెయ్యడమే. అది పెట్టుబడిదారుడికి అత్యంత అనివార్యమైన ఉత్పత్తి సాధనాన్ని అంటే, కార్మికుణ్ణి ఉత్పత్తీ, పునరుత్పత్తీ చెయ్యడమే. **పెట్టుబడిదారుడి జాగ్రత్త అంతా కార్మికుని వైయక్తిక వినియోగాన్ని వీలైనంత తక్కువఅంటే అత్యవసరమైన, స్థాయికి తగ్గించడమే.** నిజానికి శ్రామికుడి వైయక్తిక వినియోగం అతనికి సంబంధించి అనుత్పాదకమైనది. ఎందుకంటే, అది అవసరమైన వ్యక్తిని తప్ప మరి దేన్నీ ఉత్పత్తిచెయ్యదు గనక; అయితే పెట్టుబడిదారుడికీ, రాజ్యానికీ అది ఉత్పాదకమైనదే, కారణం: అది పెట్టుబడిదారుడికీ, రాజ్యానికీ సంపద సృజించే శక్తిని ఉత్పత్తి చేస్తుంది. శ్రామికుణ్ణి నియమించిన వానికీ, రాజ్యానికీ ఆ శ్రామికుడు ఉత్పాదక శ్రామికుడే, కాని తన విషయంలో ఉత్పాదకుడు కాడు. – (Malthus -Definitions, &c., p. 30.)

### శామికవర్గం పెట్టుబడికి ఒక ఉపాంగంగా ఉంటుంది

అందువల్ల శ్రామికవర్గం శ్రమ ప్రక్రియలో ప్రత్యక్షంగా నిమగ్నమై లేని సమయాల్లో కూడా పెట్టుబడికి ఒక ఉపాంగంలాగా, అనుబంధమైన అంశంగా (appendage) ఉంటుంది. మామూలు శ్రమసాధనాల్లాగే. దాని వినియోగం కొన్ని పరిమితుల్లో ఉత్పత్తి ప్రక్రియలో ఒక అంశంగా (factor) మాత్రమే ఉంటుంది. ఆ పునరుత్పత్తి ప్రక్రియ 'చైతన్యంగల ఈ సాధనాలు'

(అంటే కార్మికులు), తనను నిస్సహాయ స్థితిలోకి నెట్టకుండా చూసుకుంటుంది. ఆ పునరుత్పత్తి ప్రక్రియని నట్టేట్లో ముంచి మధ్యలో వెళ్ళిపోకుండా జాగ్రత్త పడుతుంది. ఎలాగంటే వాళ్ళు చేసిన ఉత్పాదితాన్ని చేశాక వీలైనంత తక్కువ సమయంలో వాళ్ళ వైపు నుంచి పెట్టుబడి వైపుకు చేరుస్తుంది. వైయక్తిక వినియోగం, ఒకపక్క: వాళ్ళ పోషణకీ, పునరుత్పత్తికీ సాధనాల్ని సమకూరుస్తుంది. మరొకపక్క: జీవితావసర వస్తువులు అయిపోయేట్లు చెయ్యడం ద్వారా శ్రమ మార్కెట్లోకి శ్రామికుడు నిరంతరం వచ్చేట్లు చేస్తుంది. రోమన్ బానిస సంకెళ్ళతో బంధించబడ్డాడు. వేతన శ్రామికుడు కానరాని బంధనాలతో తన యజమానికి కట్టివేయబడుతున్నాడు. యజమానుల్ని మార్చుకునే అవకాశం ఉన్నందువల్లా, కార్మికుని అంగీకారంతో జరిగే కాంట్రాక్ట్ అనే చట్టపరమైన కల్పన (fictio juris) వల్లా, స్వేచ్ఛ ఉన్నట్లు కనబడుతుంది.

### పెట్టుబడిదారుడికి ఇది అవసరం అనేదానికి రుజువు:

వలసనిషేధ చట్టం. పాతరోజుల్లో స్వతంత్ర శ్రమమీద తన యాజమాన్య హక్కుల్ని నెలకొల్పాల్సిన అవసరం వచ్చినప్పుడల్లా, పెట్టుబడి శాసనాలు చేయించేది. ఉదాహరణకి, ఇంగ్లండ్‌లో 1815దాకా యంత్రనిర్మాణ పరిశ్రమలో మెకానిక్‌లు వలసపోతే తీవ్రమైన దండనలూ, భారీ జరిమానాలూ ఉండేవి. అలా శాసనాలతో, వాళ్ళు వలసపోకుండా చూసేవాళ్ళు.

### శ్రామికులకి నైపుణ్యం కూడడం వల్ల లాభించేది పెట్టుబడిదారులే

కార్మికవర్గ పునరుత్పత్తి వల్ల ఒకతరాన్నించి మరొకతరానికి నైపుణ్యం అందుతుంది, కూడుతుంది. ఏమాత్రం పెట్టుబడి లేకుండానే ఇది జరుగుతుంది. అయితే దీనివల్ల ప్రయోజనం పొందేది మాత్రం పెట్టుబడిదారులే, కార్మికులు కాదు. పెట్టుబడిదారుడు అలాంటి నిపుణ కార్మికులు ఉండడం తన ఉత్పత్తికి ఒక అంశంగా పరిగణిస్తాడు. తన అస్థిర పెట్టుబడియొక్క వాస్తవ మనుగడగా చూస్తాడు. ఏ మేరకు అలా చూస్తాడనే విషయం, సంక్షోభం వల్ల ఆ నిపుణ వర్గాన్ని కోల్పోయే ప్రమాదం ఏర్పడీ ఏర్పడగానే, తెలుస్తుంది.

### ఇందుకు సంబంధించి ఒక ఉదంతం:

అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో అంతర్యుద్ధం వల్లా, దానివెంట వచ్చిన పత్తి కరువు వల్లా, లంకాషైర్ నగరంలో అనేకమంది నూలు పనివాళ్ళు తొలిగించబడ్డ విషయం తెలిసిందే. వాళ్ళు వలస ప్రాంతాలకో, అమెరికాసం యుక్త రాష్ట్రాలకో వలసపోవడానికి ప్రభుత్వ సహాయం కోసమూ, స్వచ్ఛంద ప్రజా విరాళాల కోసమూ ఇతరులు అభ్యర్థించడమేకాక, అసలు కార్మిక వర్గమే స్వయంగా విజ్ఞప్తులు చేసింది. 1863 మార్చ్ 24 న ది టైంస్ పత్రికలో ఎడ్మండ్ పాటర్ రాసిన ఉత్తరం పడింది. ఆయన మాంచెస్టర్ చాంబర్ ఆఫ్ కామర్స్‌కి మాజీ అధ్యక్షుడు. ఆ లేఖని House of Commons లో 'ఉత్పాదకుల ప్రణాళిక' అన్నారు. అలా అనడం సరైనదే. పత్తి పనివాళ్ళ సరఫరా అతిగా ఉన్నదని పనిలేని కార్మికునికి చెప్పవచ్చు. వాళ్లలో మూడో వంతు తగ్గించాలి. అలా తగ్గిస్తే మిగిలిన రెండొంతుల మందికీ సరైన డిమాండ్ ఉంటుంది. ప్రజాభిప్రాయం వలసలకి అనుకూలంగా ఉంది....యజమాని శ్రమ సరఫరా తగ్గడాన్ని ఇష్టపడడు. అది తప్పనీ, సరికాదనీ అతను అనుకుంటాడు– బహుశా న్యాయంగానే...కాని, వలసలకి

సహకరించేందుకు ప్రజాధనాన్ని ఖర్చు చెయ్యాల్సివస్తే, అతనికి ఆవిషయం గురించి మాట్లాడే హక్కు, అసమ్మతి తెలిపే హక్కు ఉంటుంది. పత్తి వర్తకం చాలా ప్రయోజనకరమైనది– అంటాడు పాటర్. ఐర్లండ్ నుంచీ, వ్యావసాయక జిల్లాలనుండి అదనపు జనాభాని ఆకర్షించింది. 1860 లో మొత్తం ఇంగ్లిష్ ఎగుమతుల్లో పదమూడింట అయిదొంతులు (5/13) పత్తి వర్తకానివే. అంత పెద్ద వర్తకం అది. కొన్ని సంవత్సరాలు గడిస్తే మళ్ళీ మార్కెట్, ప్రత్యేకించి ఇండియా మార్కెట్ విస్తరించి, పౌను పత్తి 6 పెన్నీలకే సమృద్ధిగా లభిస్తుంది అంటాడు. తర్వాత ఇలా కొనసాగిస్తాడు:

కొంత కాలానికి ఒకటి రెండు మూడేళ్ళకి సరిపోయేటంత పత్తి పండవచ్చు. అప్పుడు నాప్రశ్న: ఈ వ్యాపారం అట్టిపెట్టుకో తగిందేనా? ఈ యంత్రాంగాన్ని (జీవమున్న శ్రమ యంత్రాలు అని ఆయన భావం) అలాగే ఉంచుకోవడం తగినదేనా? దాన్ని వదులుకోవడం అత్యంత అవివేకం కాదా? అవివేకమనే నేను అనుకుంటున్నాను. పనివాళ్ళు లంకాషైర్ ఆస్తి కారనీ, యజమానుల ఆస్తీ కారనీ ఒప్పుకుంటాను. అయితే లంకాషైర్ కీ, యజమానులకీ బలం వాళ్ళే. ఒకతరం దాకా భర్తీ చెయ్యలేని మానసిక, సుశిక్షిత శక్తి వాళ్ళు. వాళ్ళు వాడి పనిచేసే యంత్రాలనైతే, 12 నెలల్లో లాభదాయకంగా, ఇంకా మెరుగైన వాటితో భర్తీ చెయ్యవచ్చు.

### శ్రమించే శక్తిని వలసపోవడానికి ఒప్పుకుంటే, పెట్టుబడిదారుడి పరిస్థితేమిటి?

పనివాళ్ళు వలస పోవడానికి ఇష్టపడుతున్నారు. వాళ్ళు అలా కోరుకోవడం సహజమే.... తగ్గించండి. శ్రమించే శక్తి ఖర్చు వేతనాల్లో అయిదోవంతు అంటే 50 లక్షలు తగ్గించి, నూలు పరిశ్రమని కుదించి వేయండి. అలా చేస్తే, వీళ్ళ మీద ఆధారపడే చిన్న దుకాణదారులసంగతేమిటి? ఇళ్ళ అద్దెల సంగతేమిటి?....

ఇంకొంచెం ముందుకుపోయి సన్నకారు రైతు మీద, కాస్త మెరుగైన గృహయజమాని మీద..భూకామందు మీదా దీని ప్రభావాల్ని గమనించండి. ఒక దేశంలోని తయారీ కార్మికుల్లో అత్యుత్తమమైన భాగాన్ని ఎగుమతిచేసి, ఆదేశపు అత్యుత్తమ ఉత్పాదక పెట్టుబడిలో, సంపదలో కొంత భాగం విలువని ధ్వంసం చెయ్యడం కన్నా, అన్ని వర్గాలకూ ఆత్మహత్యా సదృశమైన సలహా ఏమైనా ఉందేమో చెప్పండి.– అని అడుగుతున్నాడు.

**పాటర్ ప్రతిపాదన:** ప్రత్యేక న్యాయ శాసనాలద్వారా రుణం మంజూరు చెయ్యాలి. రుణం పొందే వాళ్ళ మనోస్థైర్యాన్ని కలిగించేందుకు, ఏదో ఒక వృత్తినో, పనినో కల్పించేందుకు అయిదారు మిలియన్ పౌన్ల రుణం, రెండుమూడేళ్లకు విస్తరించేట్లు పత్తి పండించే జిల్లాల్లో Boards of Guardians కి అనుబంధంగా ప్రత్యేక అధికారులచేత నిర్వహించబడే రుణం ఇవ్వాలి. అత్యుత్తమ శ్రామికుల్ని వదులుకోవడం కన్నా, భూకామందులకీ, యజమానులకీ హీన స్థితి ఇంకొకటి ఉంటుందా? ఇంగ్లండ్‌లో పేదవాళ్ళకి సహాయం చేసే చట్టాన్ని (Poor Law) అమలు పరిచే అధికారులే Board of guardians. 1835 నుంచీ 1930 దాకా వీళ్ళు పని చేశారు. 1834 నుంచీ, పేదవాళ్ళకు workhouses లో వసతీ, భోజనం ఉండేవి. అందుకు బదులుగా వాళ్ళు పనిచెయ్యాలి.

### పాటర్‌కి The Times పత్రిక ఇలా జవాబిచ్చింది:

నూలు యజమానులకున్న అపూర్వమైన, అత్యున్నతమైన ప్రాధాన్యతతో అతను ప్రభావితుడయ్యాడు. ఎంతగానంటే, ఈ వర్గాన్ని భద్రంగా ఉంచడానికీ, వాళ్ల వృత్తిని శాశ్వతం చెయ్యడానికీ 5 లక్షల మంది కార్మికుల్నీ, వాళ్ళమీద ఆధారపడ్డ 7 లక్షల మందినీ, వాళ్ళకి ఇష్టం లేకపోయినా ఒక భారీ నైతిక శ్రమ గృహంలో నిర్బంధించి ఉంచాలని అనుకుంటున్నాడు. ఈ వర్తకం అట్టిపెట్టుకోదగిందేనా? అని అడుగుతున్నాడు. మా జవాబు: తప్పనిసరిగా ఉంచుకోదగినదే. నీతీ, నిజాయతీ గల అన్ని మార్గాలద్వారా అట్టిపెట్టుకోదగిందే. పాటర్ చెప్పినట్లుగా, పనివాళ్ళ పునరుత్పత్తికి కొంత కాలం అవసరం కావచ్చు. కాని యంత్ర పనివాళ్ళూ పెట్టుబడిదారులూ అందుబాటులో ఉంటే చాలు ఇక మనకు ఏనాడూ అవసరపడనంత ఎక్కువమంది నిపుణుల్ని తయారు చేసుకోడానికి పొదుపరులైన, కష్టపడి పనిచేసే బలాఢ్యులు కావలసినంతమంది దొరుకుతారు. ఒకటి, రెండు, మూడు సంవత్సరాల్లో వర్తకం ఎత్తుకుంటుందని పాటర్ చెప్తున్నాడు. కార్మికుల్ని వలసపోయేందుకు ప్రోత్సహించవద్దు అంటున్నాడు. పనివాళ్ళు వలస పోవాలనుకోవడం సహజమే అంటున్నాడు. అయితే వాళ్ళ అభీష్టం అదే అయినా, ఒకప్పటికి నూలు యజమానులు కార్మికుల్ని నియమించుకుంటారని నిరీక్షిస్తూ, ఈ 5 లక్షల కార్మికుల్నీ, వాళ్ళ ఆశ్రితులు 7 లక్షల మందినీ నూలు జిల్లాల్లోనే అట్టిపెట్టుకోవాలి అనేది ఆయన ఉద్దేశం. దీని అనివార్య పర్యవసానంగా, వాళ్ళ అసంతృప్తిని బలప్రయోగంతో అణచిపెట్టాలి, దానధర్మాలతో వాళ్ళని పోషించాలి – అనికూడా ఆయన అనుకొని తీరాలి. ఇనుము, బొగ్గు, పత్తి మొదలైన వాటితో ఎట్లా వ్యవహరిస్తామో, శ్రమశక్తితో కూడా వ్యవహరించే వాళ్ళ బారినుండి శ్రమ శక్తిని రక్షించడానికి ఈ దీవుల్లోని మహత్తర ప్రజాభిప్రాయం కృషి చెయ్యాల్సిన సమయం ఆసన్నమయింది.

ఈ 'టైంస్' వ్యాసం ఒక చమత్కార నీతి బోధగానే ఉండిపోయింది. వాస్తవంలో పాటర్ అభిప్రాయమే ప్రజాభిప్రాయం అయింది. కార్మికుల వలస నిరోధించబడింది. వాళ్ళు శ్రమ గృహంలో, నూలు జిల్లాల్లో బందీలయ్యారు. అంతకుముందు లాగే లంకాషైర్ నూలు ఉత్పత్తిదారులకు బలం చేకూర్చే వారయ్యారు.

వలస పోయేవాళ్లకి 'ఫార్థింగ్' (పెన్నీలో నాలుగోవంతు) అయినా సహాయం చెయ్యడానికి పార్లమెంట్ ఒప్పుకోలేదు. కాగా మునిసిపల్ కార్పొరేషన్లకి అధికారాలిస్తూ కొన్ని చట్టాలు చేసింది. అవి కార్మికుల్ని అర్థాకలితో ఉంచేందుకు అనువైనవే. అంటే మామూలు వేతనాల కంటే తక్కువకి వాళ్లని దోపిడీ చెయ్యడానికి ఉపకరించేవే. ఇందుకు భిన్నంగా మూడేళ్ళ తర్వాత పశు వ్యాధి వ్యాపించినప్పుడు అదే పార్లమెంట్ సాంప్రదాయాల్ని తోసిపుచ్చి, మిలియనీర్లైన భూస్వాములకు మిలియన్ల పౌన్లు నష్టపరిహారం ఇచ్చేందుకు అంగీకరించింది. వాళ్ళ రైతులు మాంసం ధర పెరిగినందువల్ల ఏమాత్రం నష్టం లేకుండానే బయటపడ్డారు.

### సమాజం వర్గాలుగా విడిపోతుంది

పెట్టుబడిదారీ పునరుత్పత్తి పెట్టుబడిదారీ సంబంధాన్ని కూడా ఉత్పత్తి చేస్తుంది, పునరుత్పత్తీ చేస్తుంది. అంటే, ఒకపక్క పెట్టుబడిదారుణ్ణీ, మరొక పక్క వేతనశ్రామికుణ్ణీ అన్నమాట. ఈ

విషయాన్ని మార్క్స్ 'వేతన శ్రమా పెట్టుబడీ' అనే రచనలో అంతకు ముందేచెప్పాడు: "పెట్టుబడి ఉండాలంటే, వేతన శ్రమ ఉండాలి; వేతనశ్రమ ఉండాలంటే పెట్టుబడి ఉండాలి. అవి ఒకదాని ఉనికికి మరొకటి అవసరం. ఒకదానికొకటి షరతుగా ఉంటాయి" అంటే ఒకటి ఉంటేనే రెండోది ఉంటుంది. పెట్టుబడి పెరగాలంటే అది శ్రమశక్తితో మారకం కావాలి. వేతన శ్రమకు ప్రాణం పోయడం ద్వారా మాత్రమే పెట్టుబడి వృద్ధి కాగలదు. కార్మికుడి శ్రమశక్తి పెట్టుబడిని పెంచడం ద్వారా మాత్రమే పెట్టుబడితో మారకం కాగలదు. తాను దేనికి బానిసో ఆశక్తిని బలోపేతం చెయ్యడం ద్వారా మాత్రమే పెట్టుబడితో మారకం అవగలదు. కాబట్టి, పెట్టుబడి పెరుగుదల అంటే కార్మికవర్గ పెరుగుదలే.

## అధ్యాయం 24

# అదనపువిలువ పెట్టుబడిలోకి మారడం

# విస్తృతస్థాయి పునరుత్పత్తి

## సరుకుల ఉత్పత్తికి లక్షణాలైన ఆస్తి నియమాలు, పెట్టుబడిదారీ స్వాధీన నియమాలుగా మారడం

### పెట్టుబడి సంచయనం (Accumulation of Capital):

పెట్టుబడి నుండి అదనపువిలువ ఎలా వస్తుందో ఇప్పటిదాకా పరిశీలించాం. ఇప్పుడిక అదనపు విలువనుంచి పెట్టుబడి ఎలా తలెత్తుతుందో చూడాల్సి ఉంది. అదనపు విలువని పెట్టుబడిగా నియోగించి, దాన్ని పెట్టుబడిలోకి తిరిగి మార్చడాన్నే పెట్టుబడి సంచయనం అంటారు. రాబర్ట్ మాల్థస్ ఇచ్చిన నిర్వచనాన్ని కోట్ చేస్తాడు మార్క్స్: పెట్టుబడి సంచయనం అంటే ఆదాయంలో కొంత భాగాన్ని పెట్టుబడిగా నియోగించడమే, పెట్టుబడిలోకి మార్చడమే.

ఈ లావాదేవీని ముందుగా ఒక విడి పెట్టుబడిదారుడి వైపునుంచి చూద్దాం. ఒక నూలు ఉత్పత్తి చేసే పెట్టుబడిదారుడు 1,00,000 రూపాయలు పెట్టుబడి పెట్టాడనీ, అందులో అయిదింట నాలుగొంతులు, 80,000 రూపాయలు యంత్రాలూ, దూదీ వగయిరాలకూ, ఒక వంతు, 20,000 రూపాయలు వేతనాలకూ వెచ్చించాడని అనుకుందాం. ఏటా 1,20,000 రూపాయల విలువ చేసే 24,00,000 పౌన్ల నూలు ఉత్పత్తి చేశాడని అనుకుందాం. అదనపు విలువ రేటు 100 శాతం అయితే, అదనపువిలువ మొత్తం ఉత్పాదితంలో ఆరోభాగం, అంటే, 40,000 పౌన్ల నూలులో ఉంటుంది. దాన్ని అమ్మితే వచ్చే 20,000 రూపాయల్లో సిద్ధిస్తుంది.

20,000 రూపాయలు 20,000 రూపాయలే. ఈ మొత్తంలో అదనపు విలువ జాడ ఏమాత్రం చూడలేం, వాసన పట్టలేం. ఒక నిశ్చిత విలువ అదనపు విలువ అని తెలిసినప్పుడు, అది దాని ఓనర్‌కి ఎలా వచ్చిందో మనకు తెలుసు; అయితే అంతమాత్రాన, అది విలువ స్వభావాన్ని గానీ, డబ్బు స్వభావాన్నిగానీ మార్చదు. ఈ 20,000 రూపాయల అదనపు విలువని పెట్టుబడిలోకి మార్చడానికి, ఇంతకు ముందు లాగే దాన్ని 5 భాగాలు చేసి నాలుగు భాగాల్ని, అంటే 16,000 రూపాయల్ని దూదీ, యంత్రాలూ వగయిరాలకూ, ఒక భాగాన్ని అంటే 4,000 రూపాయల్ని వడికే కార్మికుల్ని కొత్తగా కొనడానికీ అడ్వాన్స్ చెయ్యాలి. అదనపు విలువ రేటు 100 శాతం కనుక 4,000 రూపాయల కొత్త పెట్టుబడి 4,000 రూపాయల అదనపు విలువని ఇస్తుంది. మొదట అడ్వాన్స్ చేసిన పెట్టుబడి విలువ డబ్బు రూపంలో ఉంటుంది. ఇందుకు భిన్నంగా అదనపువిలువ ఆరంభం నుండీ మొత్తం ఉత్పాదితంలో ఒక నిశ్చిత భాగం విలువ. ఈ మొత్తం ఉత్పాదితం అమ్ముడయి, డబ్బులోకి మారితే, పెట్టుబడి విలువ మొదటిరూపాన్ని తిరిగి పొందుతుంది. ఆ క్షణం నుండీ పెట్టుబడి విలువా, అదనపువిలువా రెండూ కూడా డబ్బు మొత్తాలే. అవి మళ్ళీ పెట్టుబడిలోకి మారడం, అచ్చం అదేవిధంగా జరుగుతుంది. దాన్నీ దీన్నీ రెంటినీ పెట్టుబడిదారుడు సరుకులు కొనడానికి వెచ్చిస్తాడు. ఆ కొనుగోలు వల్ల అతను తిరిగి

సరుకులు తయారు చేసే స్థితికొస్తాడు. ఈసారి ఉత్పత్తి ఎక్కువ స్థాయిలో చెయ్యగలుగుతాడు. అయితే ఆ సరుకులు కొనాలంటే, అవి మార్కెట్లో రెడీగా ఉండాలి.

## మార్కెట్ లావాదేవీలు

తన నూలుని మార్కెట్‌కి తెస్తాడు. అలాగే ఇతరులు ఎవరి వార్షిక ఉత్పత్తుల్ని వాళ్ళు తెస్తారు. కనకనే అతని నూలు చలామణీ అవుతుంది, ఇతర సరుకులతో మారుతుంది. అయితే మార్కెట్‌కి వచ్చే ముందు ఈ సరుకులు సాధారణ వార్షిక ఉత్పాదితంలో భాగం. అంటే, అన్నిరకాల సరుకుల రాశిలో ఒక భాగం. ఆ రాశి – ఆ సంవత్సర కాలంలో సరుకుల్లోకి మార్చబడిన విడివిడి పెట్టుబడుల మొత్తం – అంటే, సమాజ పెట్టుబడి అంతా. ఆ మొత్తం సరుకుల్లో ప్రతిపెట్టుబడిదారుడి చేతిలోనూ కొంత భాగం ఉంటుంది.

మార్కెట్ లావాదేవీలు ఆసరుకుల మారకాన్ని ప్రభావితం చేస్తాయి. అక్కడ సరుకులు ఒకదానితో మరొకటి మారకం అవుతాయి, చేతులు మారతాయి. అంత మాత్రమే. ఈ లావాదేవీలు ఉత్పాదితం విలువని పెంచలేవు, ఉత్పత్తయిన సరుకుల స్వభావాన్ని మార్చనూలేవు. అందువల్ల, మొత్తం వార్షిక ఉత్పాదితాన్ని వినియోగించడం అనేది ఆ వార్షిక ఉత్పాదితం కూర్పు (composition) ని బట్టి ఉంటుంది, కాని ఏవిధంగానూ దాని చలామణీని బట్టి కాదు.

## అదనపు విలువమొత్తాన్ని సొంతానికి వాడుకుంటే

సంవత్సరంలో ఖర్చయిన పెట్టుబడి అంశాలు ముందు భర్తీ చెయ్యాలి. వీటిని తీసేస్తే అదనపు ఉత్పాదితం మిగులుతుంది. అందులో అదనపు విలువ ఉంటుంది. ఈ అదనపు ఉత్పాదితంలో ఉండే వస్తువులు ఏవి? పెట్టుబడిదారీ వర్గపు అవసరాల్నీ, కోర్కెల్నీ తీర్చే వస్తువులు మాత్రమే ఉంటాయా? అలా అయితే అదనపు విలువ గిన్నెలో చివరకి ఏమీ మిగలదు. మడ్డితో సహా అంతా అయిపోతుంది. అప్పుడిక సామాన్య పునరుత్పత్తి మాత్రమే జరుగుతుంది. సంచయనం చెయ్యాలంటే అదనపు విలువలో కొంత భాగాన్ని పెట్టుబడిలోకి మార్చాలి. అందుకు కొత్త శ్రమ అవసరం. ఇప్పటికే ఉన్న కార్మికుల మీద చేస్తున్న దోపిడీ తీవ్రతగానీ, విస్తృతిగానీ పెరగకపోతే, అప్పుడు కొత్త శ్రమశక్తిని వెదుక్కోవాలి. ఇందుకు పెట్టుబడిదారీ ఉత్పత్తి యంత్రాంగం ముందుగానే మార్గం ఏర్పరిచి ఉంచింది – కార్మికవర్గాన్ని వేతనాలమీద ఆధారపడేదిగా మార్చడం ద్వారా. మామూలు వేతనాలు ఆ వర్గం పోషణకే కాక, దాని వ్యాప్తికి కూడా సరిపోతాయి. అన్ని వయస్సుల శ్రామికుల్ని కార్మికవర్గం ఏటేటా సరఫరా చేస్తుంటుంది. ఇక పెట్టుబడి పని ఏమంటే: కొత్త శ్రమశక్తిని కొత్త ఉత్పత్తి సాధనాలతో అనుసంధానం చెయ్యడమే. చేస్తే, అదనపువిలువ పెట్టుబడిలోకి మారడం పూర్తయినట్లే. నిర్దిష్ట దృక్పథంతో చూస్తే, సంచయనం అనేది క్రమంగా అంతకంతకూ పెరిగే స్థాయిలో జరిగే పెట్టుబడి పునరుత్పత్తి. వలయాకారంలో సాగే సామాన్య పునరుత్పత్తి, దాని రూపం మార్చుకుంటుంది. స్విస్ ఆర్థికవేత్త సీస్మాండీ (1773–1842) మాటల్లో, సర్పిలాకారంలోకి మారుతుంది.

ఒకసారి మన ఉదాహరణ దగ్గరికి పోదాం. 1,00,000 రూపాయల తొలిపెట్టుబడి 20,000 రూపాయల అదనపు విలువని తెచ్చింది. ఈ అదనపువిలువ పెట్టుబడిలోకి మార్చబడింది. ఈ 20,000 కొత్త పెట్టుబడి 4,000రూపాయల అదనపు విలువనిచ్చింది.

ఈ 4,000రూపాయల అదనపువిలువ కూడా పెట్టుబడిలోకి – రెండో కొత్త పెట్టుబడిలోకి – మార్చబడింది. ఇది దాని వంతుగా 800 రూపాయల అదనపువిలువని ఉత్పత్తి చేస్తుంది. ఆ విధంగా సాగిపోతూనే ఉంటుంది.

## ఆస్తికి మూలం

నిజ ప్రపంచంలో పెట్టుబడిదారులు, వచ్చిన అదనపువిలువని అంతా పెట్టుబడిలోకి మార్చజాలరు. అందులోనే తమ పోషణకి ఖర్చు పెట్టుకోవాలి. అందుకే పెట్టుబడి దారుడు అదనపువిలువలో సొంతానికి వాడుకునే భాగాన్ని పరిగణించకుండా పక్కన పెడదాం. అలాగే, ప్రస్తుతానికి ఈ కొత్తపెట్టుబడి, మొదటి పెట్టుబడితో కలుస్తుందో లేక దాన్నుండి విడిగా స్వతంత్రంగా వ్యవహరిస్తుందో పట్టించుకోము; దాన్ని అదే పెట్టుబడిదారుడు నియోగిస్తాడో, మరొకరికి ఇస్తాడో పట్టించుకోము. ఈ కొత్త పెట్టుబడి పక్కనే మొదటి పెట్టుబడి ఉత్పత్తి కొనసాగిస్తుందనీ, అదనపువిలువని ఉత్పత్తి చేస్తూనే ఉంటుందనీ, ఇది సంచయనమయిన పెట్టుబడి విషయం లోనూ, అది సృజించిన కొత్త పెట్టుబడి విషయంలోనూ వాస్తవమనీ మరచిపోకూడదు.

## మొదటి అడ్వాన్స్ చేసిన పెట్టుబడి 1,00,000 రూపాయలు యజమానికి ఎలా వచ్చాయి?

వాళ్ళ శ్రమ వల్లా, వాళ్ళ పూర్వీకుల శ్రమ వల్లా, అని రాజకీయ ఆర్థికవేత్తలు ఏకగ్రీవంగా జవాబిస్తారు. అయితే 20,000 రూపాయల కొత్త పెట్టుబడి విషయం వేరు. అదెలా ఏర్పడిందో మనకు స్పష్టంగా తెలుసు. చెల్లింపులేని శ్రమ వల్ల ఏర్పడింది. దాని విలువలో చెల్లింపు లేని శ్రమ కానిది అణుమాత్రమైనా లేదు. కొత్త శ్రమశక్తిని ఇముడ్చుకున్న ఉత్పత్తి సాధనాలూ, శ్రామికులు పోషణకు కావలసిన జీవితావసరాలూ, అదనపు ఉత్పాదితంలో భాగాలే. కార్మికవర్గం నుండి ఏటా బలవంతంగా రాబట్టే కప్పంలో భాగాలే. పెట్టుబడిదారులు ఆ కప్పంలో కొంతభాగంతో కొత్త శ్రమశక్తిని దాని విలువకే కొంటాడు. సమానకానికి సమానకమే మారకం అయింది. అయినాగాని, ఈ లావాదేవీ తతంగం అంతా పూర్వం ప్రతి విజేతా, పరాజితులనుండి కొల్లగొట్టిన డబ్బుతోనే, వాళ్లనుండి వర్తకపు సరుకులుకొనే వ్యవహారం వంటిదే.

## పెట్టుబడి నుండి పెట్టుబడిని సృజించడం

పెట్టుబడిదారీ వర్గానికీ, కార్మికవర్గానికీ మధ్య లావాదేవీగా చూస్తే, అదనపు శ్రామికులు గత శ్రామికులకు చెల్లించని శ్రమచేత నియోగించబడ్డారు అనే విషయం వల్ల కలిగే తేడా ఏమీ ఉండదు. పెట్టుబడిదారుడు అదనపు పెట్టుబడిని, ఉత్పత్తి చేసిన వాళ్ళని తొలిగించే యంత్రం లోకి అయినా మార్చవచ్చు. అది వాళ్ళ స్థానంలో కొద్దిమంది పిల్లల్ని నియమించవచ్చు. ప్రతి సందర్భంలోనూ శ్రామికవర్గం ఒక ఏడాది అదనపుశ్రమ చేత ఏర్పడిన పెట్టుబడి, ఆ పై ఏడాది కొత్త శ్రామికుల్ని నియమించే పెట్టుబడిని సృజిస్తుంది. పెట్టుబడినుండి పెట్టుబడిని సృజించడం అంటే ఇదే.

## తనశ్రమ లేని ఉత్పాదితాన్ని పెట్టుబడిదారుడు ఎలా సొంతం చేసుకుంటాడు?

సొంత పెట్టుబడి.మన ఉదాహరణలో మొదటి అదనపు పెట్టుబడి 20,000 రూపాయలు.

దీన్ని సంచయనం చెయ్యాలంటే, ముందుగా అతనిదగ్గర 1,00,000 రూపాయలు సొంత పెట్టుబడి ఉండి ఉండాలి. అది అతని శ్రమ వల్ల ఏర్పడినదై ఉండాలి. అతనిదై, అతను అడ్వాన్స్ చేసేదై ఉండాలి. అయితే, ఇందుకు భిన్నంగా, 4,000 రూపాయలు రెండో అదనపు పెట్టుబడికి 20,000 రూపాయల సంచయనమయిన పెట్టుబడి ఉంటే చాలు.

అందులో 4,000 రూపాయలు పెట్టుబడి లోకి మార్చబడిన అదనపు విలువ. అప్పటినుండి, చెల్లించబడని సజీవశ్రమని అంతకంతకూ ఎక్కువ స్థాయిలో స్వాధీనం చేసుకోగలుగుతాడు. అందుకు కారణం: **చెల్లింపులేని గత శ్రమ మీద పెట్టుబడిదారుడికి యాజమాన్యం ఉండడమే.**

**మొదటి అదనపు పెట్టుబడి** అదనపు విలువలో భాగం. ఆ అదనపు విలువ తొలి పెట్టుబడిలో ఒక భాగంతో కొన్న శ్రమశక్తి ఫలితం. ఆ శ్రమశక్తి కొనుగోలు సరుకుల మారక నియమాలకు అనుగుణమైనదే. అది చట్టరీత్యా, కార్మికుని వైపునించి, తన శక్తి సామర్థ్యాన్ని స్వేచ్ఛగా వదులుకోవడమే; పెట్టుబడిదారుడి వైపునించి, తన సొంతమైన విలువని స్వేచ్ఛగా వదులుకోవడమే.

**రెండో అదనపు పెట్టుబడికి** సంబంధించి, అది మొదటి అదనపు పెట్టుబడి యొక్క ఫలితం మాత్రమే. అందువల్ల అది పై పరిస్థితుల పర్యవసానమే; ప్రతి విడి లావాదేవీ, సరుకుల మారక నియామాలకు అనుగుణంగా ఉంటుంది. అంటే, శ్రమశక్తిని కొనే పెట్టుబడిదారుడు పూర్తివిలువ చెల్లిస్తాడనీ, అమ్ముకునే కార్మికుడు పూర్తి విలువ పొందుతాడనీ అనుకుంటాం. ఇదంతా నిజమైన మేరకు, సరుకుల ఉత్పత్తీ, చలామణీల మీద ఆధారపడ్డ స్వాధీననియమాలు లేక వ్యక్తిగత ఆస్తి నియమాలు, వాటి స్వీయ అంతర్గతమైన, అనివార్యమైన గతితర్కం ద్వారా వాటికి వ్యతిరేకమైనవిగా మారిపోతాయి – అన్నది స్పష్టమే.

**ఇక్కడ ఒక గతితర్కం ఉంది.** ఎందుకంటే, ప్రతిదీ సరుకుల మారక నియమాల్ని పాటిస్తుంది. అయినాగాని సరుకుని పాలించే నియమాలకు వ్యతిరేకమైన ఫలితం వస్తుంది.

**ఆస్తి నియమాలు తిరగబడడం.** సమానకాల మారకంతో మొదలు పెట్టాం. ఇప్పుడది తిరగబడింది – కేవలం అలా అగపడే మారకం మాత్రమే – అనేటంతగా తిరగబడింది. ఎందువల్లంటే,

1. శ్రమ శక్తితో మారకమైన పెట్టుబడి, సమానకం చెల్లించకుండా సొంతం చేసుకున్న ఇతరుల శ్రమ ఉత్పాదితంలో మాత్రమే ఒక భాగం కావడం.
2. ఈ పెట్టుబడి దాని ఉత్పత్తిదారుడైన కార్మికుని చేత భర్తీ చెయ్యబడాలి. అంతేకాదు, దానితో పాటు అదనపు విలువ కూడా కలిపి భర్తీ చెయ్యబడాలి.

పెట్టుబడిదారుడికీ, కార్మికుడికీ మధ్య మారకసంబంధం, చలామణీ ప్రక్రియకు మాత్రమే చెందిన బాహ్యరూపం (semblance) అవుతుంది. ఆ లావాదేవీ సారానికి పరాయిదైన రూపం అవుతుంది. అసలు సారాన్ని మరుగు పరుస్తుంది. శ్రమ శక్తి యొక్క నిరంతర అమ్మకమూ, కొనుగోలూ అనేది ఇప్పుడు కేవలం రూపం మాత్రమే; నిజంగా జరిగేది ఏమంటే:

పెట్టుబడిదారుడు గతంలో పాదార్థీకృతమైన, చెల్లింపులేని, ఇతరుల శ్రమని మళ్ళీమళ్ళీ

స్వాధీనం చేసుకుంటుంటాడు, దాన్ని మరింత ఎక్కువ సజీవ శ్రమకు మారకం చేస్తుంటాడు.

## శ్రమ నుండి ఆస్తిని వేరు చెయ్యడం

ఆస్తి హక్కు మొదట మనిషి సొంత శ్రమ మీద ఆధారపడి ఉన్నట్లు అనిపించింది. కనీసం అటువంటి ఊహ అవసరం. ఎందుకంటే, సమాన హక్కులున్న సరుకు యజమానులు మాత్రమే ఒకరికొకరు ఎదురవగలరు. ఒక మనిషి ఇతరుల సరుకుల్ని పొందాలంటే, తన సరుకుల్ని పరాధీనం చెయ్యడం ఒక్కటే మార్గం; ఆ సరుకులు శ్రమచేత మాత్రమే భర్తీ అవుతాయి. ఏమైనప్పటికీ, ఇప్పుడు పెట్టుబడిదారుడికి సంబంధించి, ఆస్తి అనేది చెల్లించబడని శ్రమని, లేక శ్రమ ఉత్పాదితాన్ని, స్వాధీనం చేసుకునే హక్కు. శ్రామికునికి సంబంధించి, తన సొంత ఉత్పాదితాన్ని సొంతం చేసుకోవడం అసంభవం. శ్రమ నుండి ఆస్తిని వేరు చెయ్యడం వాటి ఐక్యతలో ఏర్పడ్డ నియమం యొక్క అనివార్య పర్యవసానమే.

## పెట్టుబడిదారీ స్వాధీన విధానం, మారక సూత్రాల్ని ఉల్లఘించదు

అందువల్ల, పెట్టుబడిదారీ స్వాధీనవిధానం సరుకుల ఉత్పత్తి మూల సూత్రాలనించి ఎంత దూరం పోయినప్పటికీ, ఈ సూత్రాల్ని ఉల్లఘించినందువల్లకాక, అందుకు భిన్నంగా, వాటిని వర్తింపచేసినందువల్లనే ఆ విధానం తలెత్తింది. పెట్టుబడిదారీ సంచయనానికి అత్యున్నత స్థాయి అయిన వరస దశల్ని క్లుప్తంగా సమీక్షించడం ద్వారా దీన్ని మరొక మారు స్పష్టపరుచుకుందాం.

కొంత విలువ మొదట మారక నియమాలకి పూర్తి అనుగుణంగా పెట్టుబడిలోకి మారడం గమనించాం. ఒప్పందంలో ఉన్న ఒక పార్టీ తన శ్రమశక్తిని అమ్ముతాడు. రెండో పార్టీ కొంటాడు. అమ్మినవాడు తన సరుకు విలువని పొందుతాడు. దాంతో అతని సరుకు ఉపయోగపు విలువ అయిన శ్రమ పరాధీనం అవుతుంది. ఉత్పత్తి సాధనాలు అప్పటికే శ్రమశక్తిని కొన్నవాడికి చెంది ఉంటాయి. అవి **అతనికే చెందిన శ్రమ** సహాయంతో కొత్త ఉత్పాదితంలోకి మార్చబడతాయి. **ఆ కొత్త ఉత్పాదితం కూడా చట్టరీత్యా అతనిదే, పెట్టుబడిదారుడిదే.**

ఆ ఉత్పాదితం విలువలో ఉండే అంశాలు:

1. వినియోగమైన ఉత్పత్తి సాధనాల విలువ.
2. శ్రమశక్తి విలువకు సమానమైన విలువ
3. అదనపు విలువ

కార్మికుడు తన శ్రమశక్తి మారకం విలువను తీసుకున్నాడు. దాని ఉపయోగపువిలువను పరాధీనం చేశాడు. ప్రతి అమ్మకంలోనూ కొనుగోలు లోనూ జరిగేది ఇదే. ఈ ప్రత్యేకమైన సరుకు (శ్రమశక్తి) ఏ ఇతర సరుకుకూ లేని, అసాధారణ ఉపయోగపు విలువని (శ్రమని) సరఫరా చేస్తుందనే వాస్తవం – అది విలువని సృజిస్తుందనే వాస్తవం – సరుకు ఉత్పత్తికి సంబంధించిన సాధారణ నియమాన్ని ఏ మాత్రం మార్చదు.

అందువల్ల వేతనాలకు అడ్వాన్స్ చేసిన విలువ పరిమాణం, ఉత్పాదితంలో కనబడడమే కాకుండా, అదనపు విలువలో పెరిగి కనబడినట్లయితే, అది కార్మికుణ్ణి మోసగించడం వల్ల

కాదు –(ఎందుకంటే, అతని సరుకు విలువని అతను వాస్తవంగా పొందాడు); అది కేవలం ఆ సరుకుని కొన్నవాడు వినియోగించుకున్నందువల్ల మాత్రమే.

**వినియోగం అనేది మారకరంగం బయట జరిగే విషయం.** కాబట్టి ఇది సరుకుల మారకనియమాల ఉల్లంఘన కాదు. సమానత్వం విషయంలో మారక నియమానికి కావలసిన సమానత్వం ఒక్క విషయంలోనే: మారకంలో ఉన్న సరుకుల విలువల సమానత్వం మాత్రమే. వాటి ఉపయోగపువిలువల మధ్య మాత్రం వ్యత్యాసం ఉండాలి. మారకానికి సరుకుల వినియోగంతో ఎటువంటి సంబంధమూ ఉండదు. కారణం: వినియోగం మారక లావాదేవీ ముగిశాక మాత్రమే మొదలవుతుంది. అందువల్ల **సరుకుల మారక నియమాలు భంగం కావు.** ఆ విధంగా సరుకు ఉత్పత్తి నియమాలకీ, వాటినుంచి వచ్చిన ఆస్తి హక్కుకీ సరిగ్గా అనుగుణంగా మొదటి డబ్బు పెట్టుబడిలోకి మారడం వీలయింది.

### అయినప్పటికీ, దాని ఫలితాలు:

1. ఉత్పాదితం పెట్టుబడిదారుడికి చెందుతుంది, కార్మికుడికి చెందదు
2. దాని (ఉత్పాదితం) విలువలో అడ్వాన్స్ చేసిన పెట్టుబడి విలువతో పాటు, అదనపు విలువ ఉంటుంది. అదనపువిలువ ఉత్పత్తికి కార్మికుడికి శ్రమ ఖర్చవుతుంది, కాని పెట్టుబడిదారుడికి ఏ ఖర్చూ ఉండదు. అయినా ఆ అదనపు విలువ పెట్టుబడిదారుడికి చట్టబద్ధమైన ఆస్తి అవుతుంది.
3. కార్మికుడు తన శ్రమశక్తిని ఉంచుకుంటాడు, కొనేవాడు దొరికితే కొత్తగా అమ్ముకో గలుగుతాడు.

ఈ మొదటి చర్య నియమిత కాల వ్యవధుల్లో పునరావృతం అవుతుండడమే సామాన్య పునరుత్పత్తి. ప్రతిసారీ తాజాగా పెట్టుబడిలోకి మారుతుంది. ఆ విధంగా నియమం భంగం కాదు; అందుకు భిన్నంగా, అది నిరంతరాయంగా కొనసాగేట్లు చేస్తుంది. సామాన్య పునరుత్పత్తి స్థానంలో విస్తృతపునరుత్పత్తి, సంచయనం జరిగినా, ఈ విషయంలో తేడా ఏమీ ఉండదు. సామాన్య పునరుత్పత్తిలో పెట్టుబడిదారుడు అదనపు విలువనంతా దుబారా చేస్తాడు. విస్తృత పునరుత్పత్తిలో కొంత అదనపువిలువని సొంతానికి వాడుకొని, మిగిలినదాన్ని పెట్టుబడిలోకి మారుస్తాడు. తన బూర్జువా స్వభావాన్ని బయటపెట్టుకుంటాడు.

### అదనపువిలువ పెట్టుబడిదారుడి ఆస్తి

అదనపువిలువ అతని (పెట్టుబడిదారుడి) ఆస్తి. అది ఏనాడూ మరెవ్వరికీ చెంది ఉండలేదు. అతను దాన్ని ఉత్పత్తికి అడ్వాన్స్ చేస్తే, ఆ అడ్వాన్సులు అతని సొంత నిధుల నుండి వచ్చినవే. ఈ సందర్భంలో నిధులు, అతని కార్మికుల చెల్లించబడని శ్రమ నుండి ఏర్పడ్డాయి అనే వాస్తవం ఏ తేడానీ చూపించదు. A అనే కార్మికుడికి చెల్లించని శ్రమనుండి B అనే కార్మికుడికి చెల్లిస్తే, అప్పుడు:

1. మొదటి సంగతి–తనసరుకు న్యాయమైన విలువలో పావు పెన్నీ అయినా తగ్గకుండానే, అదనపు విలువ సమకూర్చాడు

2. రెండో సంగతి. ఈ లావాదేవీతో B కి ఎట్టి సంబంధమూ ఉండదు. పెట్టుబడిదారుణ్ణి తన శ్రమశక్తి విలువ చెల్లించమని అతను అడగవచ్చు. ఆ హక్కు అతనికి ఉంటుంది.

**ఇద్దరూ లాభపడతారు.** కార్మికుడు– తన శ్రమ ఫలాల్ని పనిచేయక ముందే (అతని శ్రమ ఫలాలని ఇవ్వక ముందే అని చదువుకోవాలి) అడ్వాన్స్‌గా పొందినందువల్ల (చెల్లించబడని ఇతరుల శ్రమ అని చదవాలి); యజమాని: అతని కార్మికుడు చేసే శ్రమ, వేతనం కన్నా ఎక్కువ విలువ కలది అయినందువల్ల (అతని వేతనం విలువ కన్నా అతనిశ్రమ ఎక్కువ విలువని ఉత్పత్తి చేసింది అని చదవాలి) లాభపడతాడు.

పెట్టుబడిదారీ పునరుత్పత్తిని పునరావృతుల నిరంతరాయ ప్రవాహంగానూ, వ్యష్టి పెట్టుబడిదారుని వ్యష్టి కార్మికుని స్థానాల్లో పరస్పరం ఎదుర్కునే మొత్తం పెట్టుబడిదారీ వర్గాన్నీ, మొత్తం కార్మికవర్గాన్నీ చూస్తే, విషయం భిన్నంగా ఉంటుంది. అలా చూస్తున్నప్పుడు సరుకు ఉత్పత్తికి పూర్తిగా పరాయివైన కొలబద్దల్ని వర్తింపచెయ్యాలి. సరుకు ఉత్పత్తిలో కొనేవాడూ, అమ్మే వాడూ మాత్రమే పరస్పరం స్వతంత్రంగా ఒకరికొకరు ఎదురుపడతారు. ఒప్పందకాలం ముగియగానే వాళ్ల మధ్య సంబంధాలు నిలిచిపోతాయి. ఆ లావాదేవీ మళ్ళీ జరిగితే, అదిమరొక కొత్త ఒప్పందం ఫలితంగా జరుగుతుంది. ఆ ఒప్పందానికి అంతకు ముందు దానితోగానీ, ఆ తర్వాత దానితోగానీ ఏ సంబంధం ఉండదు. అది కేవలం అదే కొనుగోలుదారుడూ, అమ్మకందారుడూ యాదృచ్ఛికంగా కలిసినందువల్ల మాత్రమే.

అందువల్ల సరుకు ఉత్పత్తిగానీ, దాని అనుబంధ ప్రక్రియల్లో ఏదైనా గానీ, దాని సొంత నియమాలను బట్టి తీర్పు చెప్పాల్సివస్తే, ప్రతి మారక చర్యనీ దానికదిగా, దాని ముందు వెనక చర్యలతో సంబంధం లేకుండా చూడాలి. కొనుగోలూ, అమ్మకమూ ప్రత్యేక వ్యక్తుల మధ్య మాత్రమే జరుగుతున్నందువల్ల, ఇక్కడ మొత్తం సామాజిక వర్గాల సంబంధాల్ని చూడడం అంగీకరించదగింది కాదు. ఇవ్వాళ వ్యవహరిస్తున్న పెట్టుబడి గత సంచయనాల వరస ఎంతపొడవైనదైనా, అది తన మొదటి స్వచ్ఛతను కాపాడుకుంటూనే ఉంటుంది. మారక నియమాల్ని ప్రతి ఒక్క విడి చర్యలో పాటించినంత కాలమూ, స్వాధీనవిధానాన్ని పూర్తిగా విప్లవీకరించవచ్చు – సరుకు ఉత్పత్తికి అనుగుణమైన ఆస్తిహక్కుల్ని ఏవిధంగానూ భంగపరచకుండానే. ఉత్పత్తిదారుడికి ఉత్పాదితం చెంది ఉన్న తొలిదశలో, ఇవే హక్కులు అమల్లో ఉంటాయి. అప్పుడు ఉత్పత్తి దారుడు సమానకానికి సమానకాన్ని మారకం చేస్తూనే, తన సొంత శ్రమ ద్వారా మాత్రమే సంపన్నుడు కాగలుగుతాడు. ఆ దశలో ఇవే హక్కులు వర్తిస్తాయి. పెట్టుబడిదారీ ఉత్పత్తి కాలంలో కూడా అవే అమలవుతాయి. ఆ కాలంలో చెల్లింపు చెయ్యని ఇతరుల శ్రమని అవిశ్రాంతంగా స్వాధీనం చేసుకునేస్థితిలో ఎవరుంటే, సామాజిక సంపద నిరంతరం పెరిగే స్థాయిలో వాళ్ళ ఆస్తి అవుతుంది. శ్రామికుడు తానే తన శ్రమశక్తిని స్వేచ్ఛగా అమ్ముకునే క్షణం నుంచీ ఈ ఫలితం అనివార్యం అవుతుంది. అయితే ఆ క్షణం నుంచే సరుకు ఉత్పత్తి సర్వసాధారణమవుతుంది; ఇక అప్పటినించీ మాత్రమే మొదటి నించీ ప్రతిసరుకూ అమ్మడం కోసమే ఉత్పత్తి చెయ్యబడుతుంది, సంపదంతా చలామణీ రంగం గుండా నడుస్తుంది. ఎప్పుడైతే, ఎక్కడైతే వేతన శ్రమ ప్రాతిపదికగా ఉంటుందో, అప్పుడు అక్కడ సరుకు

ఉత్పత్తి మొత్తం సమాజం మీద పడుతుంది. అప్పుడు, అక్కడ మాత్రమే అది గుప్తంగా ఉన్న తన సకల శక్తి సామర్థ్యాల్ని ప్రదర్శిస్తుంది. సరుకు ఉత్పత్తి తన అంతర్గత నియమాల్ని బట్టి పెట్టుబడిదారీ ఉత్పత్తిలోకి అభివృద్ధి అయిన మేరకు సరుకు ఆస్తి నియమాలు పెట్టుబడిదారీ స్వాధీన నియమాల్లోకి మారతాయి.

## పునరుత్పత్తిలో పెట్టుబడి అనేది సంచయనమయిన అదనపువిలువే

సామాన్య పునరుత్పత్తిలో సైతం పెట్టుబడి అంతా దాని మూల వనరు ఏదయినా, సంచయనమైన పెట్టుబడి లోకి, పెట్టుబడీకరించబడిన అదనపువిలువలోకి పరివర్తన చెందుతుంది. అయితే ఉత్పత్తి ప్రవాహంలో మొదట అడ్వాన్స్ చేసిన పెట్టుబడి, నేరుగా సంచయనమైన పెట్టుబడితో, అంటే పెట్టుబడిలోకి మారిన అదనపు విలువతో పోలిస్తే అదృశ్య పరిమాణం అవుతుంది – అది సంచయనకర్త చేతిలో వ్యవహరించినా, ఇతరుల చేతుల్లో వ్యవహరించినా. కాబట్టి రాజకీయ అర్ధశాస్త్రం సాధారణ పెట్టుబడిని సంచయనమయిన సంపద (మార్చబడ్డ అదనపువిలువ లేక ఆదాయం) అంటుంది. అంటే అదనపు విలువ ఉత్పత్తి కోసం తిరిగి ఉత్పత్తిలో నియోగించబడినది. పెట్టుబడి దారుణ్ణి అదనపువిలువ ఓనర్ అంటుంది. ఇది ఉన్న పెట్టుబడి అంతా సంచయనం చేయబడ్డ/ పెట్టుబడీకరించబడ్డ వడ్డీ అనడం వంటిదే . ఎందుకంటే, వడ్డీ అదనపువిలువలో ఒక భాగం మాత్రమే.

# అధ్యాయం 25
# పెట్టుబడి సంచయనపు సాధారణ సూత్రం

## పెట్టుబడి అంతర్నిర్మాణం

పెట్టుబడికి రెండు రూపాలు ఉంటాయి. ఒకటి విలువ రూపం, రెండు భౌతిక రూపం. అందువల్ల, పెట్టుబడి అంతర్నిర్మాణాన్ని రెండు కోణాల్లో చూడాలి.

**విలువ కోణంలో పెట్టుబడి:** ఉత్పత్తిలో పనిచేసే పెట్టుబడి విలువ, ఉత్పత్తిసాధనాల విలువలోకీ (స్థిర పెట్టుబడిలోకీ), శ్రమశక్తి విలువలోకీ (అస్థిర పెట్టుబడిలోకీ) విభజితమవుతుంది. ఈ రెండు విలువలకీ మధ్య ఉండే నిష్పత్తి చేత అంతర్నిర్మాణం నిర్ణయమవుతుంది. అంటే స్థిర అస్థిర భాగాల కుండే నిష్పతిని బట్టి అన్నమాట.

ఉదాహరణకి, ఉత్పత్తిసాధనాల విలువ 1,00,000 రూపాయలు, వేతనాలు 50,000 రూపాయలు అయితేవాటి నిష్పత్తి 2:1 అవుతుంది.

**భౌతిక కోణంలో పెట్టుబడి:** భవనాలూ, యంత్రాలూ, ముడిపదార్థాలూ, ఇంధనం మొదలైన ఉత్పత్తిసాధనాల నిర్దిష్ట రాశికీ, నియమించబడిన శ్రామికుల సంఖ్యకీ మధ్య నిష్పత్తి, ఉత్పత్తి యొక్క సాంకేతికస్థాయి అభివృద్ధి మీదా, ఒక్కొక పరిశ్రమ ప్రత్యేకతల మీదా ఆధారపడి ఉంటుంది.

మొదటిది *విలువ అంతర్నిర్మాణం* (value composition of capital), రెండోది *సాంకేతిక అంతర్నిర్మాణం* (technical composition of capital).

## సాంకేతిక అంతర్ని నిర్మాణం పెరుగుదల

పెట్టుబడిదారీ విధానం అభివృద్ధితో పాటు, ఉత్పత్తిసాధనాలకి ఖర్చుపెట్టే పెట్టుబడి పెరుగుతుంది – మెరుగైన యంత్రాల్ని, ఉత్పత్తి పద్ధతుల్ని ప్రవేశపెట్టడం వల్ల. ఒక్కొక కార్మికుడు వాడే ముడిపదార్థాల పరిమాణమూ, యంత్రాల పరిమాణమూ పెరిగేకొద్దీ, పెట్టుబడి యొక్క సాంకేతిక అంతర్నిర్మాణం పెరుగుతుంటుంది.

పెట్టుబడి సాంకేతిక అంతర్నినిర్మాణానికీ, విలువ అంతర్నిర్మాణానికీ పరస్పర సంబంధం ఉంది. పెట్టుబడి సాంకేతిక అంతర్నినిర్మాణంలో వచ్చే ప్రతిమార్పూ, దాని విలువ అంతర్నినిర్మాణంలో మార్పుకి దారితీస్తుంది.

## సజీవ అంతర్నిర్మాణం

విలువ అంతర్నిర్మాణమూ, సాంకేతిక అంతర్నిర్మాణమూ అనే రెండు భావనలనీ వివరించాక, సజీవ అంతర్నిర్మాణం అనే మరొక భావనని ప్రవేశ పెట్టాడు. విలువ అంతర్నిర్మాణం సాంకేతిక అంతర్నిర్మాణం చేత నిర్ణయించబడిన మేరకు మాత్రమే అది *సజీవ అంతర్నిర్మాణం* (organic composition of capital) అవుతుంది.

విలువ అంతర్నిర్మాణం, సాంకేతిక అంతర్నిర్మాణం చేతనే కాకుండా, శ్రమ శక్తి విలువచేతా, ముడిపదార్థాల విలువచేతా కూడా ప్రభావితమవుతుంది. సాంకేతిక అంతర్నిర్మాణం, ఏమార్పూ లేకుండా అలాగే ఉన్నా, వేతనాల్లోనూ, ముడిపదార్థాల ధరల్లోనూ వచ్చే హెచ్చు తగ్గుల వల్ల విలువ అంతర్నిర్మాణం మారవచ్చు. వీటితో సజీవ అంతర్నిర్మాణానికి సంబంధం ఉండదు. సజీవ అంతర్నిర్మాణమూ, విలువ అంతర్నిర్మాణమూ – అదైనా ఇదైనా, స్థిర పెట్టుబడికీ అస్థిర పెట్టుబడికీ మధ్య నిష్పత్తే.

## అయినా పైన వివరించిన తేడా వల్ల రెండూ భిన్నమైనవి

'కాపిటల్' లో ఏ విశేషణమూ లేకుండా పెట్టుబడి అంతర్నిర్మాణం అన్నప్పుడల్లా సజీవ అంతర్నిర్మాణం అనే అర్థం. మూడో సంపుటం 8 వ అధ్యాయంలో ఇలాంటి చర్చ ఉంది: పెట్టుబడి అంతర్నిర్మాణం అంటే పెట్టుబడి యొక్క రెండు భాగాలైన అస్థిరపెట్టుబడికీ, స్థిర పెట్టుబడికీ మధ్య నిష్పత్తి. ఈ శీర్షిక కింద రెండు నిష్పత్తులు పరిశీలనలోకి వస్తాయి. మొదటిది సాంకేతిక ప్రాతిపదిక మీద ఆధారపడుతుంది. అది ఉత్పాదక శక్తుల ఒకనొక అభివృద్ధి దశలో ఫలానింత అని నిర్ణయమై ఉంటుంది. ఒక నిర్దిష్ట పరిమాణంగల ఉత్పాదితాల్ని తయారు చెయ్యడానికి ఒక నిర్దిష్ట పరిమాణంలో ఉత్పత్తిసాధనాలు – యంత్రాలూ, ముడి పదార్థాలూ వగైరా– కావాలి. వాటిని చలనంలో పెట్టడానికి సరిపోయే శ్రమశక్తి కావాలి. అంటే, తగినంతమంది కార్మికులు అవసరం.

శ్రామికుల సంఖ్యకీ ఉత్పత్తిసాధనాల పరిమాణానికీ అనుగుణ్యత ఉండాలి. అందువల్ల ఒక నిర్దిష్ట పరిమాణపు సజీవశ్రమకీ, ఉత్పత్తి సాధనాల్లో నిర్దిష్ట పరిమాణంలో రూపొందివున్న శ్రమకీ అనుగుణ్యత ఉండాలి. ఈ నిష్పత్తి వేర్వేరు ఉత్పత్తి రంగాల్లో బాగా తేడాగా ఉంటుంది. ఒకే పరిశ్రమలో సైతం వేర్వేరు శాఖల్లో భిన్నంగా ఉంటుంది. ఒకవేళ వేర్వేరు పరిశ్రమ శాఖల్లో అది పూర్తిగానో, దాదాపుగానో ఒకటే అయినా కావచ్చు. కాని అది యాదృచ్ఛికంగా జరిగేది మాత్రమే. ఈ నిష్పత్తి, పెట్టుబడి సాంకేతిక అంతర్నిర్మాణాన్ని ఏర్పరుస్తుంది; పెట్టుబడి సజీవ అంతర్నిర్మాణానికి నిజమైన పునాది ఇదే. అయినప్పటికీ, ఈ మొదటి నిష్పత్తి వేర్వేరు పరిశ్రమల్లో ఒకేవిధంగా ఉండవచ్చు.

ఉదాహరణకి, రాగితోనూ, ఇనుంతోనూ చేసే ఒక పనికి ఒకే నిష్పత్తిలో శ్రమశక్తీ, ఉత్పత్తి సాధనాలూ అవసరం కావచ్చు. అయితే రాగి ఇనుం కన్నా ఖరీదైనది, కనుక స్థిర అస్థిర పెట్టుబడుల విలువ సంబంధం తేడాగా ఉంటుంది. అందువల్ల రెండు పెట్టుబడుల విలువ అంతర్నిర్మాణం కూడా తేడాపడుతుంది. సాంకేతిక అంతర్నిర్మాణానికీ, విలువ అంతర్నిర్మాణానికీ తేడా పరిశ్రమ ప్రతి శాఖ లోనూ వ్యక్తమవుతుంది – పెట్టుబడి రెండు భాగాల సాంకేతిక అంతర్నిర్మాణం స్థిరంగా ఉన్నా, వాటి విలువ సంబంధం మారవచ్చు.

## విభాగం 1
## పెట్టుబడి అంతనిర్మాణం మారకుండా ఉంటే, సంచయనం వల్ల కార్మికులకోసం పెరిగే గిరాకీ

పెట్టుబడి అంతర్నిర్మాణం అంటే స్థిర పెట్టుబడికీ, అస్థిర పెట్టుబడికీ మధ్య నిష్పత్తి. **పెట్టుబడి స్థిరంగా ఉన్నా ఈ నిష్పత్తి మారవచ్చు.** ఉదాహరణకి, మొత్తం పెట్టుబడి లక్ష రూపాయలు. అందులో 50,000 స్థిర, 50,000 అస్థిర అయితే వాటి నిష్పత్తి 1:1. మొదటిది 80,000, రెండోది 20,000 అయితే నిష్పత్తిమారి 4:1 అవుతుంది. మొదటిది 60,000 రెండోది 40,000 అయితే 3:2. పెట్టుబడి పెరగక పోయినా, మూడు సందర్భాల్లో అంతర్నిర్మాణం వేరుగా ఉంది.

**పెట్టుబడి పెరిగినా, అంతర్నిర్మాణం అలాగే ఉండవచ్చు.** పెట్టుబడి లక్ష రూపాయలలో 80,000 స్థిర, 20,000 అస్థిర అయితే, వాటి నిష్పత్తి 4:1 పెట్టుబడి పెరిగి 1,20,000 అయిందనుకుందాం. అందులో స్థిర 96,000 అస్థిర 24,000 అయితే, వాటి నిష్పత్తి మారదు. 4:1 గానే ఉంటుంది. పెట్టుబడి మళ్ళీ 1,50,000కి పెరిగి, అందులో స్థిర 1,20,000 అస్థిర 30,000 అయితే, నిష్పత్తి 4:1 గానే ఉంటుంది. దీన్ని బట్టి, పెట్టుబడి పరిమాణంలో మార్పు రాకున్నా, అంతర్నిర్మాణం మారవచ్చు. పెట్టుబడి మొత్తంలో మార్పువచ్చినా, అంతర్నిర్మాణం స్థిరంగా ఉండవచ్చు, ఈ విభాగంలో అంతర్నిర్మాణం స్థిరంగా ఉన్నట్లు భావిస్తాడు.

### అంతర్నిర్మాణం స్థిరంగా ఉండి, పెట్టుబడి పెరుగుతూ ఉంటే, కార్మికుల మీద పడే ప్రభావం

అదనపువిలువలో కొంతభాగం ప్రతి ఏడూ మూల పెట్టుబడికి కలుస్తుంటుంది. అలా పెట్టుబడి ఏడాదికేడాదికీ పెరుగుతుంటుంది. ఉత్పత్తి సాధనాల రాశి పెరుగుతుంది. దానికి తగ్గట్లు శ్రమ రాశి పెరుగుతుంది – పెట్టుబడి పెరుగుదల అనుపాతంలోనే, వేగంలోనే. అదనపు పెట్టుబడికి కూడా అదనపువిలువ వస్తుంది. ఇందులో కొంతభాగం తిరిగి పెట్టుబడికి కలుస్తుంది. ఈ అదనపు పెట్టుబడిలో కూడా కొంత అస్థిర భాగం ఉంటుంది. అది కొత్త కార్మికుల్ని నియమిస్తుంది. ఆవిధంగా సంచయనం కార్మికుల్ని పెంచుతుంది.

### పెట్టుబడి సంచయనం కార్మికవర్గ పెరుగుదలే

మొత్తం పెట్టుబడి 1,00,000 అయినప్పుడు, స్థిర 80,000 అస్థిర 20,000 అయితే వాటి నిష్పత్తి 4:1. అది అలానే ఉండి, పెట్టుబడి 1,50,000కి పెరిగితే అందులో స్థిర 1,20,000 అస్థిర 30,000. మొదటి సందర్భంలో ఆ మొత్తం అస్థిర 200 మందిని నియమిస్తే, రెండో సందర్భంలో 300 మందిని పెట్టుకుంటుంది. అంటే, కార్మికుల సంఖ్య పెరిగింది. సంచయనం జరిగి పెట్టుబడి పెరిగితే, కార్మికులు కూడా మరింతమంది అవుతారు. పెట్టుబడి సంచయనం అనేది 'అదే సమయంలో కార్మికవర్గ పెరుగుదల కూడా' అని ఫ్రెంచ్ కూర్పులో రాశాడు. పెట్టుబడి సంచయనమూ, కార్మికవర్గ పెరుగుదలా ఒకే ప్రక్రియ యొక్క రెండు అంశాలు.

## వేతనాల పెరుగుదల

కొత్త మార్కెట్లు రావడం వల్లా, కొత్తకోర్కెలు తీర్చడానికి పెట్టుబడికి కొత్త ఉత్పత్తిరంగాలు ఏర్పడడం వల్లా, సంచయన స్థాయి ఆకస్మికంగా విస్తరించవచ్చు. కేవలం అదనపు విలువ పెట్టుబడి గానూ, ఆదాయంగానూ విభజనలో మార్పులవల్ల పెట్టుబడి సంచయన అవసరాలు శ్రామికుల పెరుగుదల సంఖ్యని మించిపోవచ్చు; శ్రమ గిరాకీ శ్రమ సరఫరాని మించవచ్చు. అందువల్ల, వేతనాలు పెరగవచ్చు. దీనిగురించి ఇంగ్లండ్‌లో 15 వ శతాబ్దం మొత్తంలోనూ, 18 వ శతాబ్దం తొలి అర్ధభాగం లోనూ పెట్టుబడిదారుల విలాపాలు వినిపించాయి.

## కార్మికుల విధేయత మంచిదని ఆర్థిక వేత్తల అభిప్రాయం

పెట్టుబడిదారుల సంపద కేవలం సరుకులమీద అధికారం మాత్రమే కాదు, శ్రమ మీద ఆధిపత్యం కూడా – అని వాళ్ళు గ్రహించారు. కార్మికవర్గం పెట్టుబడిదారులకు విధేయంగా లొంగి ఉండే పరిస్థితిని, మంచిదిగా భావించారు. దీనికి సంబంధించి వాళ్ళ అభిప్రాయాలు:

1696 లోనే ఇంగ్లిష్ విద్యావేత్త, సంఘ సంస్కర్త జాన్ బెల్లర్స్ (1654–1725) ఇలా అన్నాడు: ఒకనికి లక్ష ఎకరాల భూమి ఉండచ్చు, లక్ష పౌండ్ల డబ్బూ ఉండవచ్చు. లక్ష పశువులూ ఉండవచ్చు. ఇవన్నీ ఉండి కూడా, శ్రామికుడు లేకపోతే అంతటి భాగ్యవంతుడు, శ్రామికుడు కాక మరేమవుతాడు. శ్రామికులు మనుషుల్ని సంపన్నుల్ని చేస్తారు. కనుక ఎక్కువమంది శ్రామికులుంటే, ఎక్కువమంది సంపన్నులుంటారు. పేదల శ్రమ సంపన్నులకు పెన్నిధి.

అలాగే 18 వ శతాబ్దం మొదట్లో ఆంగ్లో–డచ్ ఆర్థికవేత్త బెర్నార్డ్ డి మాండవిల్లీ (1670–1733) : ఆస్తి కూడిన చోట పేదవాళ్ళు లేకుండా జీవించడం కంటే డబ్బు లేకుండా బతకడమే సులభం. ఎందుకంటే, వాళ్ళు లేకుంటే పనులు ఎవరు చేస్తారు? వాళ్ళని పస్తులు ఉండకుండా ఉంచడం ఎంత అవసరమో, వాళ్ళకి దాచుకోడానికేమీ మిగలకుండా చూడడమూ అంతే అవసరం. ఎక్కడన్నా ఎవరన్నా నిమ్న వర్గానికి చెందిన వ్యక్తి అతీతంగా శ్రమచేసి, కడుపు కట్టుకొని పుట్టి పెరిగిన స్థితిని మించి పైకొస్తే, అతన్ని ఎవరూ అడ్డుకోకూడదు. పైపెచ్చు, సమాజంలో ప్రతి వ్యక్తికీ, ప్రతి కుటుంబానికీ పొదుపు చేసుకోవడం అత్యంత వివేకవంతమైన విషయం, సందేహం లేదు. అయితే పేదల్లో సింహభాగం, ఎప్పుడోకాని, సోమరులుగా ఉండకూడదనీ, అయినాగానీ వచ్చిందంతా ఖర్చు చేయాలనీ, ధనిక దేశాల కోరిక. రోజువారీ శ్రమతో బతికే వాళ్ళని పనిచేయించేది, వాళ్ళ అవసరాలు తప్ప వేరేమీ కాదు. ఆ కోరికలని తగ్గించడం వివేకవంతమైన చర్యే, అయినాగానీ వాటిని నివారించడం అవివేకమవుతుంది. శ్రామికుణ్ణి కష్టపడి పనిచేసేట్టు చేసేది ఒక్కటే: అతనికి డబ్బు ఒక మోస్తరు పరిమాణంలో మాత్రమే ఉండడం. ఎందుకంటే, మరీ తక్కువ డబ్బు ఉంటే, అతను నిరుత్సాహపడవచ్చు, నిరాశచెందవచ్చు. మరీ ఎక్కువ డబ్బు ఉంటే, పెంకివాడుగా, సోమరిపోతుగా తయారవుతాడు. ఈ చెప్పినదాన్ని బట్టి, బానిసలు ఉండని స్వేచ్ఛారాజ్యంలో కష్టపడే పేదల సమూహం లేకుంటే, ఏ భోగమూ ఉండదు. ఏ దేశ ఉత్పాదితానికైనా విలువ ఉండదు. పనిచేయని వాళ్ళతో నిండివున్న సమాజాన్ని ఆనందంగా ఉంచాలంటే, భారీ సంఖ్యలో ప్రజల్ని అజ్ఞానం లోనూ, పేదరికంలోనూ ఉంచాలి – అన్నాడు.

## శ్రమ మీద పెట్టుబడి పెత్తనం

మన భూమిలో వచ్చే సహజ ఉత్పాదితం మన పూర్తి పోషణకి అయితే సరిపోదు. గత శ్రమ ఫలితం ఉంటేనేగాని, మనకి కట్టుకోడానికి బట్టలు, ఉండడానికి ఇల్లు, తినేందుకు తిండీ ఉండవు. అందుకు సమాజంలో కనీసం ఒక భాగాన్నైనా విరామంలేకుండా నియోగించాల్సి ఉంటుంది. కష్టపడి పనిచేయక పోయినా, ఉత్పత్తిమీద కొందరు అదుపు కలిగి ఉంటారు. కేవలం నాగరికత వల్లా, వ్యవస్థ వల్లా వాళ్లకి పనినించి మినహాయింపు లభిస్తుంది. కష్టంచేయడం ద్వారా మాత్రమే కాక, అనేక ఇతర మార్గాల ద్వారా కూడా ఆస్తిని ఆర్జించవచ్చు అని గుర్తించిన పౌరసంస్థలు సృజించిన ప్రత్యేక జీవులు వాళ్ళు... స్వతంత్ర సంపద ఉన్నవాళ్లు... ఇతరులని మించి వాళ్లకున్న అనుకూలతకి కారణం వాళ్ళ ఉన్నత సామర్థ్యాలు కాదు, పూర్తిగా ఇతరుల శ్రమే. సమాజంలో సంపన్నుల్ని, శ్రమచేసే భాగం నించి వేరుపరిచేది భూమి కలిగి ఉండడమో, డబ్బుకలిగి ఉండడమో కాదు, శ్రమ మీద పెత్తనం కలిగి ఉండడం. ఇది ఆస్తిపరులకి, వాళ్ళకోసం శ్రమించే వాళ్ళమీద చాలినంత పలుకుబడినీ, పెత్తనాన్నీ ఇస్తుంది. అటువంటి శ్రామికుల్ని హీనస్థితిలోనో, బానిసస్థితిలోనో ఉంచదు. ఆధారపడడం అనే స్థితి కష్టం అయినదిగా కాకుండా, ఉదారమైనదిగా ఉంటుంది. మానవ స్వభావమూ, దాని చరిత్రా ఎరిగిన వాళ్ళు, తమ సొంత సౌకర్యం కోసం అవసరమైనదిగా దాన్ని అనుమతిస్తారు. 18 వ శతాబ్దంలో స్మిత్ శిష్యుల్లో ప్రాధాన్యత గల ఈ విషయాన్ని గ్రహించినవాడు ఫ్రెడరిక్ ఈడెన్ (1766–1809) ఒక్కడే.

## పెట్టుబడి మీద శ్రమ ఆధారపడడం

ఇప్పటిదాకా సంచయనానికి సంబంధించి ఊహించిన పరిస్థితులు కార్మికులకు అత్యంత అనుకూలంగా ఉన్నాయి. పెట్టుబడి మీద వాళ్ళు ఆధారపడడం అనే సంబంధం ఈడెన్ మాటల్లో 'సులువైనదిగానూ, ఉదారమైనదిగానూ' ఉంటుంది. పెట్టుబడి పెరిగే కొద్దీ, ఈ సంబంధం (ఆధారపడే సంబంధం) తీవ్రం అయ్యే బదులు మరింత విస్తృతం మాత్రమే అవుతుంది. అంటే, పెట్టుబడి దోపిడీ, ఆధిపత్యం పరిధీ విస్తరిస్తాయి – పెట్టుబడి పరిమాణాలను బట్టీ, దాని పట్టులోపడ్డ ప్రజల సంఖ్యను బట్టీ. **కార్మికుల ఉత్పాదితంలో పెద్ద భాగం సదా పెరుగుతూ, అదనపు పెట్టుబడిలోకి మారుతూ ఉంటుంది.** వాళ్ళ సుఖాల పరిధిని పెంచుకోడానికి చెల్లింపు సాధనం రూపంలో తిరిగి వాళ్ళకి వస్తుంది; బట్టలు, ఫర్నిచర్ వగైరాల నిధికి మరికొంత చేరుస్తుంది. చిన్న మొత్తాలు దగ్గర ఉంచుకో గలిగేట్లు చేస్తోంది. ఇవి అమరినంత మాత్రాన, ఒక బానిసని దోపిడీ నుండి ఎంతమాత్రం విముక్తి చేయ్యగలవో, వేతన కార్మికుణ్ణి కూడా అంతే విముక్తి చేయగలవు.

## బంగారు సంకెళ్లు

పెట్టుబడి సంచయనం కారణంగా వేతనాల్లో పెరుగుదలకి నిజమైన అర్థం: వేతన శ్రామికుడు తన్నుతాను బంధించుకున్న బంగారు సంకెళ్ళ పొడవుకీ, బరువుల బిగువుకీ కొంత సడలింపు కలిగిందని మాత్రమే. శ్రామికుడు సరఫరా చెయ్యాల్సిన చెల్లింపులేని శ్రమ పరిమాణం కొంత తగ్గింది అని మాత్రమే. ఎంతతగ్గినా, ఈ తగ్గడం ఈ వ్యవస్థకు అపాయాన్ని కలిగించే స్థాయిని

– అంటే  రద్దు చేసే స్థాయిని – తాకదు. సంచయన పురోగమనంతో శ్రమధర జోక్యం చేసుకోదు గనక, శ్రమధర పెరుగుతూ ఉండగలదు. పెట్టుబడిదారీ ఉత్పత్తి **ప్రక్రియ  యంత్రాంగం** తాత్కాలికంగా కలిగిన అడ్డంకుల్ని తొలిగిస్తుంది. పెట్టుబడి అవసరాలకు అనుగుణమైన స్థాయికి తిరిగి శ్రమధర పడిపోతుంది.

## వేతనాల పెరుగుదలకు ప్రతిచర్య

వేతనాలు వాటి స్వభావ రీత్యానే, శ్రామికుని వైపునించి ఎల్లప్పుడూ  కొంత  చెల్లింపులేని శ్రమని సూచిస్తాయి.

అయితే, ఈ తగ్గుదల పెట్టుబడిని పోషించే అదనపుశ్రమ, మామూలు పరిమాణంలో సరఫరా కాని స్థితి ఎప్పుడు ఏర్పడుతుందో, అప్పుడు ప్రతిచర్య ప్రవేశం చేస్తుంది: ఆదాయంలో మునుపటి కన్నా చిన్న భాగం పెట్టుబడిగా మార్చబడుతుంది. సంచయనం వెనకడుగు వేస్తుంది, వేతనాల పెరుగుదలకు నిరోధం ఏర్పడుతుంది.  అందువల్ల వేతనాల పెరుగుదల ఒక పరిమితిలో ఉంటుంది.

ఆ పరిమితి  పెట్టుబడిదారీ వ్యవస్థ పునాదులు చెక్కు చెదరకుండా ఉంచుతుంది.  అంతే కాకుండా, దాని పునరుత్పత్తిని పురోగమన స్థాయిలో సాగేట్లు చూస్తుంది. మతంలో మనిషి తన మెదడు సృష్టించిన వాటిచేత నియంత్రంచబడతాడు; అలాగే పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానంలో తన చేతులే చేసిన ఉత్పాదితాల చేత తనే నియంత్రించబడతాడు.

ఇక్కడొక ఫుట్ నోట్  ఉంది: పెట్టుబడే, శ్రమ సృష్టి అనే మన తొలి విచారణ దగ్గరకి తిరిగి వెళితే, .....తన సొంత ఉత్పాదితమైన పెట్టుబడికి యజమానిగా ఉండకుండా, దాని ఆధిపత్యంలో ఉండడం ఏమిటో అర్థంకానిదనిపిస్తుంది. వాస్తవంలో ఇలా ఉండడం గురించి వివాదం లేదు. ఇక్కడొక ప్రశ్న తలెత్తుతుంది: పెట్టుబడి సృష్టికర్త అయిన కార్మికుడు తాను సృజించిన పెట్టుబడికి యజమానిగా ఉండకుండా దానికి బానిస ఎలా అయ్యాడు?  అని వాన్  తునెన్ అడిగాడు. ఈ ప్రశ్న వెయ్యడం అతని ప్రతిభే. అతని  జవాబే పిల్లతరహాగా ఉంటుంది. – అంటాడు మార్క్స్.

## విభాగం 2

## అస్థిర పెట్టుబడి సాపేక్షంగా క్షీణించడం

### వేతనాల పెరుగుదలకి కారణం ఏమిటి?

కారణం సామాజిక సంపద విస్తృతి కాదు, అప్పటికే పనిచేస్తున్న పెట్టుబడి పరిమాణమూ కాదు. మరేమిటి? సంచయనం యొక్క నిరంతర వృద్ధీ, ఆ వృద్ధి వేగం స్థాయీ మాత్రమే. ఆర్థికవేత్తల అభిప్రాయం కూడా అదే. ఇంతదాకా మనం ఈ ప్రక్రియ యొక్క ఒక దశని– సాంకేతిక అంతర్నిర్మాణం స్థిరంగా ఉన్న దశని – మాత్రమే పరిశీలించాం. ఆ దశలో పెట్టుబడి పెరుగుతుంది. శ్రమకి గిరాకీ పెరిగి, వేతనాలు పెరుగుతాయి. అయితే ఈ ప్రక్రియ ఈ దశను దాటి ముందుకుపోతుంది.

### విలువ అంతర్నిర్మాణం పెరుగుతుంది

సంచయన క్రమంవిషయంలో ఇంతవరకూ శ్రమ ఉత్పాదకశక్తి, స్థిరంగా ఉన్నదని అనుకున్నాం. అంటే, మునుపు ఎంత మొత్తం శ్రమసాధనాలకి, ఎంత మొత్తం శ్రమశక్తి వినియోగ మయిందో, ఇప్పుడు కూడా అంతే మొత్తం వినియోగ మవుతున్నదని. ఉదాహరణకి, 10 కుర్చీలకు పట్టే శ్రమసాధనాల్ని వినియోగించుకోవడానికి అప్పుడు ఒకరోజు శ్రమపడితే, ఇప్పుడూ ఒక రోజు శ్రమే పడుతుంది. ఒకరోజు శ్రమ అప్పుడైనా, ఇప్పుడైనా 10 కుర్చీల్నే చేస్తుంది.

స్థిర, అస్థిర భాగాల నిష్పత్తి కూడా స్థిరంగా ఉందని అనుకున్నాం. అయితే సంచయన క్రమంలో ఒకప్పటికి శ్రమ ఉత్పాదకశక్తి పెరుగుతుంది. సంచయనానికి అత్యంత శక్తివంతమైన సాధనం (lever) అవుతుంది. స్మిత్ ఇలా చెప్పాడు: వేతనాలు పెరగడానికీ, నిల్వలు పెరగడానికీ, ఏది కారణమో ఉత్పాదక శక్తుల్ని పెంచడానికి కూడా అదే కారణం అవుతుంది. వెనకటికంటే తక్కువ శ్రమ పరిమాణం, ఎక్కువ పరిమాణంలో పనిచేసేట్లు చేస్తుంది. ఉదాహరణకి, మునుపు 10 కుర్చీలకు పట్టే శ్రమసాధనాల్ని వినియోగించుకోవడానికి అప్పుడు ఒక రోజు శ్రమ పడితే, ఇప్పుడు రోజుశ్రమకన్నా తక్కువ పడుతుంది. ఒకరోజు శ్రమతో మునుపటికన్నా మరిన్ని కుర్చీలు తయారవుతాయి.

**ఈ ఫలితం ఎలా వస్తుంది?** అనే ప్రశ్నతో కాపిటల్ ఫ్రెంచ్ కూర్పులో ఈ పేరా మొదలవుతుంది.

శ్రమ ఉత్పాదక శక్తి పెరిగినందువల్ల.

### శ్రమ ఉత్పాదకత మీద ప్రభావం చూపే అంశాలు

1. భూమి సారం వంటి ప్రకృతిసిద్ధ పరిస్థితులు
2. శ్రామికుల నిపుణత
3. యాంత్రీకరణ, శ్రమ విభజన, ఉత్పత్తికి సంబంధించిన ఇతర సహకార అంశాలు ఇచ్చే తోడ్పాటు.

శ్రమ ఉత్పాదకత పెరగడం అనేది, సాంకేతిక అంతర్నిర్మాణం పెరుగుదలలో బయట పడుతుంది. శ్రమ ఉత్పాదకత పెరిగితే దాంతో పాటు, శ్రామికుడు వినియోగించే ఉత్పతి

సాధనాల రాశి పెరుగుతుంది. అయితే **ఆ ఉత్పత్తిసాధనాలు ద్వంద్వపాత్ర పోషిస్తాయి.** కొన్నిటి పెరుగుదల, ఉత్పాదకత పెరుగుదల ఫలితం. మరి కొన్నిటి పెరుగుదల ఉత్పాదకత పెరుగుదలకి షరతు. ఉదాహరణకి మాన్యుఫాక్చర్లో శ్రమ విభజనవల్లా, యంత్రాల వాడకంవల్లా, మరింత ముడిపదార్థం మీద పని జరుగుతుంది. అందువల్ల ఎక్కువ ముడిపదార్థం, ఉపపదార్థాలూ శ్రమ ప్రక్రియలో చేరతాయి. అది పెరిగిన ఉత్పాదకత ఫలితం. మరొక పక్క యంత్రాల రాశి, బరువులు మోసే, బళ్ళు లాగే పనులు చేసే జంతువులు రసాయన ఎరువులు, మురుగు నీటి గొట్టాలు వగయిరా ఉత్పాదకత పెరగడానికి షరతు. అలాగే భవనాలు, కొలుములు, రవాణా సాధనాలు వగైరా కూడా షరతులే. షరతైనా, పర్యవసానమైనా ఉత్పత్తి సాధనాలలో ఇమిడి ఉన్న శ్రమశక్తితో, ఉత్పత్తి సాధనాలు పెరిగే విస్తృతిని పోలిస్తే, అది పెరుగుతున్న శ్రమ ఉత్పాదకతకి వ్యక్తీకరణగా ఉంటుంది. అందువల్ల, శ్రమ ఉత్పాదకత పెరుగుదల, ఉత్పత్తి సాధనాల రాశితో పోలిస్తే, శ్రమరాశి తగ్గుదలగా కనిపిస్తుంది.

**కార్మిక వర్గానికి మరిన్ని కష్టాలు.** ఫ్రెంచ్ కూర్పులో ఈ వాక్యాన్ని కలిపాడు:

పెట్టుబడి వృద్ధి, శ్రమని ఏ మేరకు మరింత ఉత్పాదకం చేస్తుందో, ఆమేరకు అది శ్రమ గిరాకీని తగ్గిస్తుంది. అంటే, మెరుగుపడ్డ శ్రమకి, గిరాకీ తక్కువవుతుంది. పెరిగే ఉత్పాదకతకి ప్రతిస్పందన హేతు విరుద్ధంగా ఉంటుంది: అందరికీ మరింత సంపద చేర్చే బదులు, పెరిగిన ఉత్పాదకత నిరుద్యోగితకీ, వేతన తగ్గుదలకీ దోహదం చేస్తుంది. కార్మిక వర్గానికి మరిన్ని కష్టాలు తెచ్చి పెడుతుంది.

సాంకేతిక అంతర్నిర్మాణంలో వచ్చిన ఈ మార్పు – ఉత్పత్తి సాధనాల రాశి పెరుగుదల – ఆ సాధనాలని పెంచే శ్రమశక్తి రాశితో పోలిస్తే, అది తిరిగి దాని విలువ అంతర్నిర్మాణంలో ప్రతిబింబిస్తుంది – స్థిర పెట్టుబడి భాగం పెరుదలగానూ, అస్థిరపెట్టుబడి తగ్గుదలగానూ. ఉదాహరణకి, మొదట్లో పెట్టుబడిలో 50 శాతం ఉత్పత్తి సాధనాలకీ, 50 శాతం శ్రమ శక్తికీ పెట్టి ఉండవచ్చు. తర్వాత శ్రమశక్తి ఉత్పాదకత పెరిగి, 80 శాతం ఉత్పత్తి సాధనాలకీ, 20 శాతం శ్రమ శక్తికీ వెచ్చించాల్సి రావచ్చు.

**అస్థిర పెట్టుబడి పెరుగుదలతో పోలిస్తే, స్థిర పెట్టుబడి పెరుగుదల ఎక్కువ** అనే సూత్రం అడుగడుగునా నిర్ధారణ అవుతుంది – వేర్వేరు ఆర్థిక యుగాల్లో గానీ, ఒకే యుగంలోని వేర్వేరు దేశాల్లో గానీ, సరుకుల ధరల విశ్లేషణ ద్వారా ఇది రుజువవుతుంది. ధరలో రెండు భాగాలుంటాయి. **ఒకటి,** వ్యయమైన ఉత్పత్తి సాధనాల విలువకి ప్రతినిది. **రెండోది** చెల్లించిన వేతనాలకు ప్రతినిధి. వినియోగమైన స్థిర భాగం సంచయన పురోగమనానికి అనులోమానుపాతంలో ఉంటుంది; శ్రమకి చెల్లించే అస్థిర భాగం సంచయన పురోగమనానికి విలోమానుపాతంలో ఉంటుంది. అంటే సంచయనంతో పాటు స్థిరభాగం పెరుగుతూ ఉంటే, అస్థిరభాగం తగ్గుతూ ఉంటుంది. స్థిర పెట్టుబడితో పోలిస్తే, అస్థిర భాగం తగ్గుదల లేక మారిన విలువ అంతర్నిర్మాణం, పెట్టుబడి భౌతికాంశాల అంతర్నిర్మాణంలో మార్పుని ఇంచుమించుగా మాత్రమే చూపుతుంది. అయితే సజీవ అంతర్నిర్మాణంలో పెరుగుదల సాంకేతిక అంతర్నిర్మాణంలో ఉన్నంత ఎక్కువగా ఉండదు.

ఉదాహరణకి, నూలు వడికే పరిశ్రమలో ప్రస్తుతం మొత్తం పెట్టుబడిలో ఎనిమిదింట ఏడొంతులు (7/8) ఉత్పత్తి సాధనాలమీద, ఒకవంతు (1/8) వేతనాలమీదా ఉంటుంది. అయితే 18 వ శతాబ్దం మొదట్లో సగం (1/2) స్థిరగానూ, సగం అస్థిరగానూ ఉండేది. మరొకపక్క, వడికే శ్రమ ఉత్పత్తిలో వినియోగించే ముడిపదార్థాలు, శ్రమ సాధనాలు వగైరాల రాశి 18 వ శతాబ్దంలో కంటే ఇప్పుడు అనేక వందల రెట్లు ఎక్కువ.

సంచయన పురోగమనం అస్థిర భాగపు సాపేక్ష పరిమాణాన్ని తగ్గిస్తుంది. అయితే అలా చెయ్యడంలో అది ఏ విధంగానూ దాని పరమ పరిమాణం పెరిగే అవకాశాన్ని తొలగించదు. ఉదాహరణకి 60,000 రూపాయల పెట్టుబడిలో సగం స్థిర, సగం అస్థిర అనుకుందాం. 30,000 స్థిర, 30,000 అస్థిర. తర్వాత అది 80 శాతం స్థిర, 20 శాతం అస్థిర అయిందనుకుందాం. అదే సమయంలో తొలి పెట్టుబడి 60,000 రూపాయలు, 1,80,000 కి పెరిగితే, దాని అస్థిర భాగం కూడా పెరుగుతుంది. మొదట్లో అది 30,000. ఇప్పుడు 36,000. అప్పట్లో 20 శాతం శ్రమ గిరాకీకి 20 శాతం పెట్టుబడి పెంపు సరిపోయేది. ఇప్పుడు ఈ రెండో పెంపు తొలి పెట్టుబడికి మూడింతలైతే కాని, సరిపోదు.

## సామాజిక ఉత్పాదక శక్తులూ – సంచయనమూ

పెట్టుబడిదారీ విధానానికి ముందు షరతు: విడి పెట్టుబడి దారుల అధీనంలో కొంత పెట్టుబడి పోగవడం. పెట్టుబడిదారీ విధానపు చారిత్రక ఫలితంగా కాకుండా, దాని చారిత్రక ప్రాతిపదికగా ఉన్నందువల్ల, దీన్ని ప్రాథమిక సంచయనం అంటాం. అదనపు విలువ నిరంతరం పెట్టుబడిగా మారుతుంటుంది. కనక పెట్టుబడి దినదినాభివృద్ధి చెందుతుంది. పెట్టుబడి సంచయనం వేగవంతం అవుతుంది. ప్రతి వ్యష్టి పెట్టుబడీ తక్కువో ఎక్కువో ఉత్పత్తి సాధనాల సాంద్రీకరణ, చిన్నదో పెద్దదో దానికి తగిన శ్రామిక సైన్యం మీద ఆధిపత్యంతో. ప్రతి సంచయనమూ కొత్త సంచయనానికి సాధనం అవుతుంది. పెట్టుబడిగా వ్యవహరిస్తున్న సంపద రాశి పెరిగేకొద్దీ, సంచయనం వ్యష్టి పెట్టుబడిదారుల చేతుల్లో సంపద సమీకరణం కావడాన్ని పెంచుతుంది. అలా పెంచడం ద్వారా భారీ స్థాయిలో ఉత్పత్తి ప్రాతిపదికనీ, పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతుల్నీ విస్తృతపరుస్తుంది. అనేక వ్యష్టి పెట్టుబడులు వృద్ధిచెందడం వల్ల సామాజిక పెట్టుబడి పెంపొందుతుంది. ఇతర పరిస్థితులన్నీ అలాగే ఉంటే, వ్యష్టి పెట్టుబడులూ, వాటితో పాటు ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణా పెరుగుతాయి.

## స్వతంత్ర పెట్టుబడులు ఏర్పడడం

అదేసమయంలో మూల పెట్టుబడులలోని కొన్ని భాగాలు విడిపోయి నూతన, స్వతంత్ర పెట్టుబడులుగా వ్యవహరిస్తాయి. ఈ విషయంలో ఇతర కారణాలకు తోడు, పెట్టుబడిదారీ కుటుంబాలలో ఆస్తి పంపకం అనేది పెద్దపాత్ర వహిస్తుంది. అందువల్ల, పెట్టుబడి సంచయనంతో పెట్టుబడి దారుల సంఖ్య ఎక్కువగానో, తక్కువగానో పెరుగుతుంటుంది.

## సంచయనంతో సమంగా పెరిగే కేంద్రీకరణకి రెండు లక్షణాలుంటాయి:

1. విడివిడి పెట్టుబడి దారుల చేతుల్లో పెరిగే సామాజిక ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణ, సామాజిక సంపద వృద్ధిస్థాయి చేత పరిమితం చెయ్యబడుతుంది.

2. ప్రతి ప్రత్యేక ఉత్పత్తి రంగంలోనూ ఉన్న సామాజిక పెట్టుబడి భాగం పరస్పరం పోటీపడే స్వతంత్ర సరుకు ఉత్పత్తి దారులైన అనేకమంది పెట్టుబడిదారుల మధ్య పంపిణీ అవుతుంది.

అందువల్ల సంచయనమూ, దాని వెంటనంటి ఉండే సాంద్రీకరణా, అనేక స్థానాల్లో చెల్లాచెదరై ఉంటాయి.

అంతే కాదు, కొత్త పెట్టుబడులు రావడం వల్లా, పాత పెట్టుబడుల ఉపవిభజన వల్లా, క్రియాత్మక పెట్టుబడి పెరుగుదలకి ఆటంకం ఏర్పడుతుంది. అందువల్ల సంచయనం ఒకపక్క ఉత్పత్తిసాధనాల సాంద్రీకరణ పెరుగుదలగానూ, శ్రమపైన పెట్టుబడి పెత్తనం పెంపుగానూ గోచరిస్తుంటే, మరోపక్క ఎన్నో పెట్టుబడులు ఒకదానినుండి మరొకదాని వికర్షణగా గోచరిస్తుంది.

### పెట్టుబడి దారుడి చేత పెట్టుబడిదారుడి ఆస్తి స్వాధీనంచేసుకోబడడం.

విడి పెట్టు బడుల వికర్షణకి, వాటి మధ్య గల ఆకర్షణ వ్యతిరేకంగా పనిచేస్తుంది. అంటే దీనర్థం సంచయనానికి సరిగ్గా సరిపోయే ఉత్పత్తిసాధనాల సామాన్య సాంద్రీకరణ అని కాదు, శ్రమ మీద పెట్టుబడి పెత్తనం సాంద్రీకరణ అనీ కాదు. అప్పటికే ఏర్పడి ఉన్న పెట్టుబడుల సమీకరణ; ఆపెట్టుబడుల స్వతంత్రత విధ్వంసం; పెట్టుబడి దారుడి చేత పెట్టుబడిదారుడి ఆస్తి స్వాధీనం చేసుకోబడడం. ఎన్నో చిన్న పెట్టుబడులు కొన్ని పెద్ద పెట్టుబడులుగా అవడం.

### అసలు కేంద్రీకరణ

అప్పటికే అందుబాటులో ఉన్న, పనిచేస్తున్న పెట్టుబడి పంపిణీలో మార్పు జరిగి ఉండాలి – అనే ఒక్క అంశంలోనే ఈ ప్రక్రియ సంచయన ప్రక్రియతో తేడా పడుతుంది; అందువల్ల, దాని క్రియారంగం సామాజిక సంపద పరమ పెరుగుదలకి, పరిమితం కాదు. పెట్టుబడి ఒక చేతిలో భారీ రాసిగా ఒకచోట పెరుగుతుంది, కారణం, మరొకచోట ఎందరో దాన్ని కోల్పోవడమే. అసలు కేంద్రీకరణ అంటే ఇదే. ఇది సంచయనానికీ, సమీకరణకీ భిన్నమైనది.

### పెట్టుబడి సాంద్రీకరణా, కేంద్రీకరణా

పెద్ద పెట్టుబడులు ఏర్పడే మార్గాలు రెండు:

1. పెట్టుబడి సాంద్రీకరణా – అదనపు విలువని కలపడం ద్వారా పెట్టుబడి పెరగడం. ఇది మొత్తం సామాజిక పెట్టుబడిని పెంచుతుంది.
2. పెట్టుబడి కేంద్రీకరణ – వ్యష్టి పెట్టుబడుల మొత్తాలు ఒకే పెద్ద పెట్టుబడిగా కలవడం. ఇది మొత్తం సామాజిక పెట్టుబడిని పెంచదు. దాన్ని పున:పంపిణీ చేస్తుంది, కొద్దిమంది చేతుల్లో సాంద్రీకరిస్తుంది.

పెట్టుబడుల కేంద్రీకరణ గురించిన నియమాలు ఇక్కడ వివరించడం వీలుకాదు. కొన్ని వాస్తవాలగురించి క్లుప్తంగా చెబితే సరిపోతుంది.

**కేంద్రీకరణకు సాధనాలు.** పెట్టుబడిదారీ ఉత్పత్తీ, సంచయనమూ అభివృద్ధి అయ్యేకొద్దీ కేంద్రీకరణకు దోహదం చేసే రెండు శక్తివంతమైన సాధనాలు కూడా అభివృద్ధి అవుతాయి – ఒకటి పోటీ, రెండు పరపతి.

**పోటీ సమరం.** సరుకుల్ని చౌకపరచడం ద్వారా పోటీ సమరం సాగుతుంది. ఇతరపరిస్థితులు స్థిరంగా ఉన్నప్పుడు, సరుకులు చౌక అవడం శ్రమ ఉత్పాదకతని బట్టి ఉంటుంది. శ్రమ ఉత్పాదకత, ఉత్పత్తి స్థాయి మీద ఆధారపడి ఉంటుంది. అందువల్ల చిన్న పెట్టుబడుల్ని, పెద్ద పెట్టుబడులు ఓడిస్తాయి. పైగా, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి అయ్యేకొద్దీ, ఒక వ్యాపారాన్ని మామూలుగా నడపడానికి అవసరమయ్యే కనీస పెట్టుబడి పెరుగుతుంటుంది – ఈ విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి.

అందువల్ల, ఆధునిక పరిశ్రమ చెదురుమదురుగానో, అసంపూర్ణంగానో పట్టుకున్న ఉత్పత్తి రంగాల్లోకి, చిన్న పెట్టుబడులు మూగుతాయి. ఇక్కడ పోటీ శత్రు పెట్టుబడుల సంఖ్యకి అనులోమంగానూ, వాటి పరిమాణానికి విలోమంగానూ చెలరేగుతుంది. ఇదెప్పుడూ ఎందరో చిన్న పెట్టుబడిదారుల వినాశనంతో ముగుస్తుంది. వాళ్ళ పెట్టుబడులు కొంతవరకూ విజేతల చేతుల్లోకి వెళతాయి. మిగిలిన కొంత మాయమై పోతుంది.

**పరపతి వ్యవస్థ.** దాన్నట్లా ఉంచి, పెట్టుబడి దారీ ఉత్పత్తిలో ఒక కొత్త శక్తి రంగం మీదికి వస్తుంది – అదే పరపతి వ్యవస్థ. తొలిదశల్లో అది సంచయనానికి సహకరించేదిగా తెలియకుండా పనిచెయ్యడం ప్రారంభిస్తుంది. సమాజంలో చెల్లాచెదరుగా ఉన్న చిన్నా, పెద్దా డబ్బు మొత్తాల వనరుల్ని కనబడని దారుల్లో లాగి వ్యష్టి పెట్టుబడిదారుడి చేతుల్లోకో, పెట్టుబడిదారుల ముఠాల చేతుల్లోకో చేర్చేదిగా ఉంటుంది. అయితే అది అనతికాలంలోనే పోటీ సమరంలో ఒక కొత్త, భయంకరమైన ఆయుధం అవుతుంది. చివరకి పెట్టుబడుల కేంద్రీకరణకి భారీ సామాజిక యంత్రాంగంగా మారుతుంది.

సంచయన పురోగమనం కేంద్రీకరణకి అనువైన భౌతికాంశాల్ని వృద్ధిచేస్తుంది. పెట్టుబడిదారీ ఉత్పత్తి విస్తరణ, ఒకపక్క సామాజిక అవసరాల్ని పెంచుతుంది. మరొకపక్క, భారీ పారిశ్రామిక సంస్థలకు అవసరమయ్యే సాంకేతిక సాధనాల్ని ఉత్పత్తిచేస్తుంది. వీటిని సాధించాలంటే అప్పటికే కేంద్రీకరణ జరిగి ఉండాలి. అందువల్ల విడివిడి పెట్టుబడుల్ని దగ్గరకులాగే ఆకర్షణశక్తీ, కేంద్రీకరణ ధోరణీ, ఇవ్వాళ గతంలో ఎన్నడూ లేనంత బలంగా ఉన్నాయి.

## కేంద్రీకరణ అంతిమ పరిమితి

ఎందరో వ్యకుల చేతుల్లో ఉన్న పెట్టుబడులు పోవడం మూలంగా భారీ రాశి ఒక్కరి చేతిలో పోగవుతుంది. ఏ పారిశ్రామిక శాఖలోనైనా, పెట్టిన విడివిడి పెట్టుబడులు అన్నీ కలిసి, ఒకే పెట్టుబడిగా ఏర్పడితే, కేంద్రీకరణ దాని అంతిమ పరిమితిని చేరుకున్నట్లు. ఒకానొక సమాజంలో కేంద్రీకరణ దాని అంతిమ పరిమితిని ఎప్పుడు చేరుతుందంటే, సామాజిక పెట్టుబడి అంతా ఒకే పెట్టుబడి దారుడి చేతుల్లోనో, ఒకే పెట్టుబడిదారీ సంస్థ చేతుల్లోనో ఏకమైనప్పుడు.

## కార్మికుల ఆకర్షణా, వికర్షణా

అందువల్ల, ఒక పక్క సంచయనక్రమంలో ఏర్పడ్డ అదనపు పెట్టుబడి, దాని పరిమాణానికి తగినంతమంది కంటే తక్కువమంది కార్మికుల్ని ఆకర్షిస్తుంటుంది. అంటే పనిలో చేర్చుకుంటుంది. మరొకపక్క, అంతర్నిర్మాణంలో అప్పుడప్పుడు కలిగే మార్పుతో పునరుత్పత్తయ్యే పాతపెట్టుబడి, అంతకు ముందు నియోగించిన శ్రామికుల్ని అంతకంతకూ వికర్షిస్తుంది. అంటే తొలిగిస్తుంది.

## విభాగం 3
## సాపేక్ష అదనపు జనాభా/పారిశ్రామిక రిజర్వ్ సైన్యం

### పరిమాణాత్మక మార్పు– గుణాత్మక మార్పు

పెట్టుబడి సంచయనం మొదట్లో కేవలం పరిమాణాత్మక విస్తరణగా మాత్రమే కనబడింది. అదనపు విలువ పెట్టుబడిలోకి మారుతూ ఉండడం వల్ల, పెట్టుబడి పరిమాణంలో మార్పువస్తుంది, పెరుగుతుంది. అంతర్నిర్మాణం (స్థిర, అస్థిర భాగాల నిష్పత్తి) మారకుండానే పరిమాణంలో మార్పు వస్తుంది. ఇది కేవలం పరిమాణాత్మక మార్పు మాత్రమే. అయినప్పటికీ, పెట్టుబడి అంతర్నిర్మాణంలో గుణాత్మక మార్పు కూడా వస్తుంది – అంటే దాని అస్థిర భాగం నష్టపోవడం మూలంగా, స్థిర భాగం నిరంతరం పెరుగుతుంది.

### అంతర్నిర్మాణం మారడం

పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానం అభివృద్ధి అయ్యేకొద్దీ శ్రమఉత్పాదకత పెరుగుతుంది. ఫలితంగా పెట్టుబడి అంతర్నిర్మాణంలో మార్పువస్తుంది. ఆమార్పు పెట్టుబడి సంచయనం పురోగమనమనానికి గానీ, సామాజిక సంపద వృద్ధికిగానీ సరిపడేస్థాయిలో మాత్రమే ఉండదు. అంతకన్నా వేగంగా ఉంటుంది. కారణం: కేవలం సంచయనం – మొత్తం సామాజిక పెట్టుబడిలో పరమ పెరుగుదల – ఆ మొత్తం పెట్టుబడిలో భాగాలైన వ్యష్టి పెట్టుబడుల కేంద్రీకరణ అనుసరిస్తుంది. అదనపు పెట్టుబడి యొక్క సాంకేతిక అంతర్నిర్మాణంలో మార్పు, మూల పెట్టుబడి యొక్క సాంకేతిక అంతర్నిర్మాణంలో అలాటి మార్పునే తెస్తుంది. అందువల్ల, సంచయనం పురోగమించే కొద్దీ స్థిర భాగంతో అస్థిర భాగం నిష్పత్తి మారుతుంటుంది. మొదట 1:1 అయితే, అది వరసగా 2:1, 3:1, 4:1, 5:1, 7:1 అలా అవుతుంది. అందువల్ల పెట్టుబడి పెరిగేకొద్దీ, దాని మొత్తం విలువలో సగానికి(1/2) బదులుగా 1/3, 1/4, 1/5, 1/6, 1/8 అలా శ్రమశక్తిలోకి మారుతుంది. మరొకపక్క 2/3, 3/4, 4/5, 5/6, 7/8 ఉత్పత్తి సాధనాల్లోకి మారుతుంది.

**శ్రమ గిరాకీ నిర్ణయమయ్యేది** మొత్తం పెట్టుబడివల్ల కాదు, ఒక్క అస్థిర భాగం వల్ల మాత్రమే. కాబట్టి, మొత్తం పెట్టుబడి పెరుగుదలతో శ్రమ గిరాకీ, ఇంతకుముందు ఊహించినట్లు దానికి అనుగుణంగా పెరగడానికి బదులు క్రమానుగతంగా పడిపోతుంది. మొత్తం పెట్టుబడి పరిమాణానికి సాపేక్షంగా ఈ పరిమాణం పెరిగేకొద్దీ, ఎక్కువ స్థాయిలో పడిపోతుంది. మొత్తం పెట్టుబడి వృద్ధితో అందులో ఇమిడివున్న అస్థిర భాగం కూడా పెరుగుతుంది; కాని ఆ పెరుగుదల నిష్పత్తి నిరంతరం తగ్గుతూనే ఉంటుంది. ఒక నిశ్చిత సాంకేతిక ప్రాతిపదికమీద, సామాన్య విస్తరణగా సంచయనం సాగే మధ్యంతర విరామ కాలాలు కుదించబడతాయి. అదనంగా కార్మికుల్ని పెట్టుకోవాలన్నా, పనిలో ఉన్నవాళ్ళని నిలుపుకోవాలన్నా, మొత్తం పెట్టుబడి సంచయనం వేగంగా పెరిగినంత మాత్రాన సరిపోదు. సంచయనం పెరుగుదలా కేంద్రీకరణా పెట్టుబడి అంతర్నిర్మాణంలో మార్పులకి వనరౌతాయి. అంటే, స్థిర భాగంతో పోలిస్తే, అస్థిరభాగం వేగంగా తగ్గడానికి ఆధారమౌతాయి. ఇదంతా ఎలా కనబడుతుందంటే: శ్రామిక జనాభా వృద్ధి పెట్టుబడి వృద్ధిని అధిగమించించినట్లు అగపడుతుంది. **వేతనాలు తక్కువ ఉండదానికి కారణం**

**ఎక్కువమంది ఉండడమే అనిపిస్తుంది.** అయితే వాస్తవానికి సాపేక్ష అదనపు కార్మిక జనాభాని ఉత్పత్తి చేసేది పెట్టుబడి దారీ సంచయనమే; దాని శక్తికీ, విస్తృతికీ అనులోమ నిష్పత్తిలో ఉత్పత్తిచేస్తుంది. సాపేక్ష అదనపు జనాభా అంటే: పెట్టుబడి స్వయం విస్తరణకి సరిపోయే జనాభా కన్నా అదనంగా ఉన్న జనాభా.

**పెట్టుబడికి సరిగ్గా కావలసిన దాన్ని, పెట్టుబడే ఉత్పత్తి చేసుకుంటున్నది.** సామాజిక పెట్టుబడిని మొత్తంగా చూస్తే, దాని సంచయన చలనం కొన్ని సందర్భాల్లో నియమిత కాలాల్లో మార్పులు తెస్తుంది. ఇతర సందర్భాల్లో ఏకకాలంలో భిన్న ఉత్పత్తి రంగాలకు, దాని వివిధ దశల్ని పంపిణీ చేస్తుంది. కొన్ని రంగాల్లో పరమ పరిమాణంలో మార్పులేకుండానే, పెట్టుబడి అంతర్నిర్మాణంలో మార్పు వస్తుంది; ఇంకొన్ని రంగాల్లో పెట్టుబడి పరమ వృద్ధి, దాని అస్థిర భాగం తగ్గుదలతో ముడిబడి ఉంటుంది. వేరే మాటల్లో, అది పీల్చుకునే శ్రమ శక్తి తగ్గుదలతో ముడిబడి ఉంటుంది; మరి కొన్ని రంగల్లో అప్పటికున్న సాంకేతిక ప్రాతిపదిక మీద కొంతకాలం పెట్టుబడి వృద్ధి అవుతూ, ఆ వృద్ధికి తగినట్లు అదనపు శ్రమశక్తిని తీసుకుంటుంది; కొన్ని ఇతర సందర్భాల్లో అంతర్నిర్మాణం మార్పు చెంది అస్థిర భాగం తగ్గుతుంది; అన్ని రంగాల్లోనూ అస్థిరభాగం పెరుగుదల, అందువల్ల కార్మికుల సంఖ్యలో పెరుగుదల, తీవ్రమైన హెచ్చుతగ్గులతోనూ, తాత్కాలిక అదనపు జనాభా ఏర్పడడంతోనూ ఎల్లప్పుడూ ముడిబడి ఉంటుంది. అయితే ఆ సంబంధం అప్పటికే పనిలో వున్న కార్మికుల్ని వికర్షించే విస్పష్ట రూపమైనా తీసుకోవచ్చు; లేదా అంత స్పష్టమైనది కాకపోయినా అంటే వాస్తమైన రూపమైనా – మామూలు మార్గాలద్వారా అదనపు కార్మికుల్ని అతి కష్టం మీద మాత్రమే ఇముడ్చుకోగల రూపమైనా – తీసుకోవచ్చు. దీనికి సంబంధించిన ఫుట్‌నోట్:

| శాఖ /పరిశ్రమ | 1851 | 1861 | తేడా |
|---|---|---|---|
| *వ్యవసాయం | 2,011,447 | 1,924,110 | -87,337 |
| **మేలైన ఉన్ని పరిశ్రమ | 102,714 | 79,242 | -23,472 |
| సిల్కు నేత | 111,940 | 101,678 | -10,262 |
| ***కాలికో ప్రింటింగ్ | 12,098 | 12,556 | +458 |
| టోపీల తయారీ | 15,957 | 13,814 | -2,143 |
| స్ట్రా టోపీల తయారీ | 20,393 | 18,176 | -2,167 |
| ****మైనం వస్తువుల తయారీ | 4,949 | 4,686 | -263 |
| దువ్వెనల తయారీ | 2,038 | 1,478 | -560 |
| *****రంప కోత | 30,552 | 31,647 | +1,095 |
| ******చీలల తయారీ | 26,940 | 26,130 | -810 |
| తగరం, రాగి గనుల్లో | 31,360 | 32,041 | +681 |
| కాటన్ వడకడం, నెయ్యడం | 371,777 | 456,646 | +84869 |
| బొగ్గు గనుల్లో | 183,389 | 246,613 | +63224 |

* వ్యవసాయంలో ఉన్న వాళ్ళు, అంటే భూస్వాములు, రైతులు, తోటమాలులు, గొర్ల కాపరులు మొదలైనవాళ్ళు

** మేలైన ఉన్ని పరిశ్రమ (worsted manufacture)

*** ఈ పరిశ్రమ భారీస్థాయిలో వృద్ధిచెందినా గాని, కార్మికులు స్వల్పంగా మాత్రమే పెరిగారు. దానర్థం: పెరిగిన ఉత్పత్తికి దామాషా ప్రకారం ఉండాల్సినంతమందికంటే తక్కువ మంది కార్మికులు ఉన్నారు అని.

**** ఈ తగ్గుదలకి ఒక కారణం వెలుతురు కోసం కొవ్వొత్తులతో పాటు గాస్ వాడకం పెరగడం.

***** కోత మిషన్లు విస్తరించినందువల్ల ఈ రంగంలో కార్మికుల నియామకం కొద్దిగా పెరిగింది.

****** యంత్రాల పోటీ మూలంగా కార్మికులు తగ్గారు.

పై సమాచారాన్ని బట్టి ఏ కొన్నింటిలోనో తప్ప, అన్నింటిలోనూ కార్మికుల సంఖ్య తగ్గినట్లు తేలుతుంది. కార్మికుల సంఖ్య పెరిగిన పరిశ్రమలు: 1. కాలికో ప్రింటింగ్ 2. రంప కోత 3. తగరం, రాగి గనులు 4. కాటన్ వడకడం, నెయ్యడం 5. బొగ్గు గనులు **1851 తర్వాత యంత్రాల్ని సమర్థవంతంగా వాడలేని శాఖల్లో శ్రామికుల పెరుగుదల అత్యధికం**

పెట్టుబడి అంతర్నిర్మాణమూ, దాని సాంకేతిక రూపమూ మారే వేగం పెరుగుతుంది. ఈ మార్పులకి గురయ్యే ఉత్పత్తిరంగాలు సంఖ్య రీత్యా పెరుగుతాయి. ఒకప్పుడు ఏకకాలంలో పెరిగితే, మరొకప్పుడు మార్చి మార్చి పెరుగుతాయి. అందువల్ల, శ్రామిక జనాభా తాను ఉత్పత్తిచేసే సంచయనంతో పాటుగా, తన్నుతాను సాపేక్షంగా అనావశ్యకం చేసుకుని, సాపేక్ష అదనపు జానాభాలోకి మార్చే సాధనాన్ని కూడా ఉత్పత్తి చేస్తుంది. అలా ఎల్లప్పుడూ అంతకంతకూ పెరుగుతూ పోయేట్లు చేస్తుంది.

**ఇది పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి ప్రత్యేకమైన జనాభా సిద్ధాంతం.** వాస్తవానికి ప్రతి ప్రత్యేక చారిత్రక ఉత్పత్తి విధానానికీ దానికి సంబంధించిన ప్రత్యేక జనాభా నియమాలు ఉంటాయి. అవి ఆ ఉత్పత్తి విధానంలో మాత్రమే చెల్లుబాటు అవుతాయి. అదనపు శ్రామిక జనాభా సంచయనం మూలంగా ఏర్పడుతుంది. ఇదే అదనపు జనాభా విపర్యయంగా (conversely) పెట్టుబడి సంచయనానికి కీలక సాధనం అవుతుంది. అసలు, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఉనికికే షరతు అవుతుంది. అవసరమైనప్పుడు పెట్టుకొని, అది తీరగానే నెట్టివేసేందుకు వీలయిన / వాడుకొని వదిలేసే (disposable) నిల్వ కార్మిక సైన్యంగా ఉంటుంది. పెట్టుబడికి చెంది, దాని అధీనంలో ఉంటుంది. పెట్టుబడే తన సొంత ఖర్చుతో దాన్ని పెంచి పోషిస్తున్నట్లు అగపడుతుంది. జనాభా పెరుగుదల పరిమితులతో నిమిత్తం లేకుండానే, అది పెట్టుబడి స్వయం విస్తరణ అవసరాలకు, దోపిడీ కొరకు మనుషుల గుంపుని సిద్ధం చేస్తుంది. పెట్టుబడి ఆకస్మికంగా విస్తరించే అవకాశం ఉంది. అప్పుడు పెట్టుబడికి నిల్వ ఉన్న నిరుద్యోగ సైన్యంతో అవసరం వస్తుంది. అలాంటి రెండు సందర్భాలు:

**1. కొన్ని ప్రత్యేక శాఖల్లో అదనపు పెట్టుబడి వేగంగా విస్తరించడం:** అప్పటికే ఉన్న కొన్ని శాఖల్లో మార్కెట్ విస్తరిస్తుంది. వాటిలోకి అదనపు పెట్టుబడి చొచ్చుకు పోతుంది. ఉత్పత్తి ప్రక్రియలో యంత్రాలూ, రవాణా సాధనాలూ వగైరా సాంకేతిక పరిస్థితుల వల్ల కూడా పెట్టుబడి

విస్తరిస్తుంది. ఇప్పుడు అదనపు ఉత్పాదితం రాసులు అమిత వేగంగా అదనపు ఉత్పత్తి సాధనాల్లోకి మార్చబడతాయి. సంచయనంతో సామాజిక సంపద రాశి పొంగి పొర్లుతుంటుంది. అది అదనపు పెట్టుబడిలోకి మారగలదు. కనుక అది ఊపుగా, పద్ధతి లేకుండా పాత ఉత్పత్తి శాఖల్లోకి చొచ్చుకుపోతుంది. ఆ శాఖల మార్కెట్ అకస్మాత్తుగా విస్తరిస్తుంది. అంతే కాదు, పాతవి వృద్ధి చెందినందువల్ల రైల్వేలు మొదలైన కొత్త రంగాలు అవసరమవుతాయి, అందువల్ల కొత్తకొత్త రంగాలు వస్తాయి. అటువంటప్పుడు, పాత రంగాలకు నష్టం వాటిల్లకుండా, కొత్త రంగాలకు అనేకమంది కార్మికులు వచ్చే అవకాశం ఉండాలి.

ఆ కార్మికుల్ని అందుబాటులో ఉంచేదీ, సరఫరా చేసేదీ ఈ అదనపు జనాభాయే.

**2. పారిశ్రామిక వలయంలో వికాసదశ, సంక్షోభదశ ఉండడం.** ఆధునిక పరిశ్రమ, ఒకే స్థాయిలో నడవదు. ఒడుదుడుకులుంటాయి.

### పారిశ్రామిక వలయం

పదేళ్ళు పట్టే ఒక పారిశ్రామిక వలయం 4 దశలగుండా సాగుతుంది:

1. సగటు కార్యకలాపం. (average activity)
2. అత్యధిక ఉత్పత్తి (production at high pressure)
3. సంక్షోభం (crisis).
4. స్తబ్ధత/ మాంద్యం (stagnation)

పదేళ్ళు పట్టే ఈ వలయం నిరంతరం ఏర్పడుతూ, ఎక్కువగానో తక్కువగానో నియామకం పొందుతూ, తిరిగి ఏర్పడే, పారిశ్రామిక నిల్వ సైన్యం మీద ఆధారపడి ఉంటుంది. పారిశ్రామిక వలయంలోని వివిధ దశలు వాటి వంతుకవి అదనపు జనాభాని పనిలో పెట్టుకుంటాయి. అదనపు జనాభాని పునరుత్పత్తిచేసే అత్యంత శక్తివంతమైన సాధనాలు అవుతాయి.

**ఆధునిక పరిశ్రమకి మాత్రమే ప్రత్యేకమైన లక్షణం ఇది.** మానవ చరిత్రలో ఇంతకుముందు ఏ దశలోనూ జరగలేదు. అది పెట్టుబడిదారీ ఉత్పత్తి పసిదశలో సైతం అసాధ్యమే. అప్పట్లోనూ పెట్టుబడి అంతర్నిర్మాణం మారుతుండేదే గాని అతి నెమ్మదిగా మాత్రమే మారుతుండేది. అందువల్ల పెట్టుబడి సంచయనంతో పాటుగా, దానికి అనుగుణంగా, శ్రమకి గిరాకీ మొత్తం మీద అంతే వేగంతో నడిచింది. మరింత ఆధునిక కాలాల్లో ఆ సంచయన పురోగమనంతో పోలిస్తే, నెమ్మదిగా పురోగమించింది. అయినా దాని పురోగమనానికి కార్మిక జనాభా సహజ పరిమితి అవరోధం అయింది. ఆ పరిమితులు బలాత్కార సాధనాల వల్ల మాత్రమే తొలిగిపోయాయి – అని ముందుముందు తెలుసుకుంటాము.

ఉత్పత్తిస్థాయి పెరుగుతూ, ఆగుతూ విస్తరించడం – ఆకస్మికంగా క్షీణించడానికి ముందు ఉండే అంశం. క్షీణత తిరిగి విస్తరణని ప్రేరేపిస్తుంది. అయితే వాడి వదిలేసే శ్రామికులు లేనిదే, విస్తరణ సాధ్యపడదు. ఆధునిక పరిశ్రమ చలనం అంతా శ్రామిక జనాభాలో ఒక భాగాన్ని నిరుద్యోగులుగానో, చిరుద్యోగులుగానో సదా మార్చివేయడం మీద ఆధారపడి ఉంటుంది.

**అర్థశాస్త్రజ్ఞుల డొల్లతనం.** రాజకీయ అర్థశాస్త్రం రుణ విస్తరణని ఉత్పత్తి విస్తరణకి కారణంగానూ, రుణ క్షీణతని ఉత్పత్తి క్షీణతకి కారణంగానూ, భావించింది. వాస్తవానికి రుణం పెరగడం తరగడం అనేది పారిశ్రామిక వలయంలో వచ్చే మార్పులకి కేవలం లక్షణం (symptom) మాత్రమే. ఆ లక్షణాన్నే కారణంగా (cause) భావించి, అప్పటి అర్థశాస్త్రం దాని డొల్లతనాన్ని బయటపెట్టుకుంది.

**వ్యాపార వలయం ఆరంభం.** వ్యాపార వలయం ఆరంభం కావడానికి అవసరమైన ప్రక్రియల్ని ఫ్రెంచ్ కూర్పులో ప్రస్తావించాడు: యంత్రపరిశ్రమ జాతీయ ఉత్పత్తిమీద ప్రబలమైన ప్రభావం నెరిపేటంతగా వేళ్ళూనుకున్న తర్వాత మాత్రమే; విదేశీ వాణిజ్యం దేశీయ వర్తకం కంటే ముఖ్యమైనది అయిన తర్వాత మాత్రమే; ప్రపంచ మార్కెట్ నూతన ప్రపంచంలోనూ, ఆసియా, ఆస్ట్రేలియా ఖండాలలోని (పశ్చిమార్ధగోళంలోని ఎక్కువ దేశాలు) విస్తృత భాగాల్ని వరసగా ఆక్రమించిన తర్వాత మాత్రమే; అంతిమంగా తగినన్ని పారిశ్రామిక దేశాలు రంగంలోకి దిగిన తర్వాత మాత్రమే; ఇదంతా జరిగాకనే వాటికవి పునరావృతమయ్యే వలయాలు మొదలయ్యాయి. వాటి వరస దశలు సంవత్సరాలపాటు సాగుతాయి. తుది దశ సాధారణ సంక్షోభం. ఆ దశ ఒక వలయానికి ముగింపు, మరొక వలయానికి మొదలు. ఇప్పటివరకూ, వలయ కాలం పది, పదకొండేళ్ళు. అలాగని, అంతే కాలాన్ని స్థిరమైనదిగా భావించడానికి వీలు లేదు. అందుకు భిన్నంగా, మనం తేల్చిన పెట్టుబడిదారీ ఉత్పత్తి నియమాల్ని బట్టి, వలయాల కాలాలు మారుతూ ఉంటాయనీ, క్రమంగా వాటి పొడవు తగ్గుతూ పోతుందనీ నిర్ధారించాల్సి ఉంటుంది.

## వలయాన్ని గురించీ, అదనపు జనాభా గురించీ ఆర్థిక వేత్తల అభిప్రాయాలు

వలయాలు అవే దశలగుండా నడవడమూ, నిరుద్యోగ సైన్యం ఏర్పడడమూ స్థిరంగా కొనసాగుతున్నాక, అర్థశాస్త్రం సైతం సాపేక్ష అదనపు జనాభా ఉత్పత్తిని ఆధునిక పరిశ్రమకి, పెట్టుబడి స్వయం వృద్ధికి అవసరమైన షరతుగా గమనించింది. కొన్ని సంక్షోభాలు సంభవించినప్పుడు, లక్షలకు లక్షలమంది అదనపు శ్రామికుల్ని వలస పంపి ఆ దేశం వదిలించుకునే యత్నం చేస్తే, పర్యవసానం ఎలా ఉంటుంది? మళ్ళీ శ్రామికులు కావలసి వచ్చినప్పుడు కార్మికుల కొరత ఉంటుంది. పునరుత్పత్తి ఎంత వేగంగా జరిగినా, కార్మికుల కొరత భర్తీ చెయ్యడానికి కనీసం ఒక తరం కాలం పడుతుంది. కార్ఖానా యజమానుల లాభాలు, గిరాకీ చురుకుగా ఉన్న కాలాన్ని లాభదాయకంగా ఉపయోగించుకోవడం మీద ఆధారపడి ఉంటాయి. గిరాకీ మందగించిన కాలంలో వచ్చిన నష్టాన్ని ఆవిధంగా భర్తీ చేసుకుంటారు.

**ఈ శక్తి వాళ్ళకి ఎలా సమకూరుతుంది?** యంత్రాలమీదా, శ్రామికులమీదా వాళ్ళకుండే ఆధిపత్యం వల్ల సమకూరుతుంది. వాళ్ళు ఉత్పత్తిని పెంచాలి అనుకున్నప్పుడు వాళ్ళకి కార్మికులు రెడీ గా ఉండాలి. కావాల్సొచ్చినప్పుడు వాళ్ళ కార్యకలాపాల్ని హెచ్చించుకో గలగాలి. అలాగే మార్కెట్ పరిస్థితికి తగినట్లు తగ్గించుకోగలగాలి. లేకపోయినట్లయితే, వాళ్ళు దేశ సంపదకి గట్టి పునాది వేసే పోటీ పందెంలో ఆధిక్యతని నిలబెట్టుకోలేరు. మాల్థూస్ సైతం ఆధునిక పరిశ్రమకి అదనపు జనాభా అవసరం అని గుర్తించాడు. అయితే ఆయన తన సంకుచిత

భావాలకు తగ్గట్లుగా, దాన్ని కార్మికులు సాపేక్షంగా అనావశ్యకం అవడం వల్ల కాకుండా, శ్రామిక జనాభా పరమ పెరుగుదల వల్ల అంటూ వివరించాడు.

**నిరుద్యోగ నిల్వ సైన్యం పెట్టుబడి కాంక్ష.** సహజ జనాభా పెరుగుదలతో పాటు పెట్టుబడిదారీ ఉత్పత్తి అవసరమైనప్పుడు వాడుకొని, లేనప్పుడు అవతల పడెయ్యడానికి వీలుగా ఉండే శ్రమశక్తిని సమకూరుస్తుంది. అయితే, పెట్టుబడిదారీ ఉత్పత్తి అంత మాత్రాన తృప్తిపడదు. తన కార్యకలాపాల్ని అపరిమితంగా నిర్వహించడానికి ఈ సహజ పరిమితులతో నిమిత్తం లేకుండా పారిశ్రామిక నిల్వ సైన్యం రెడీగా ఉండాలని కాంక్షిస్తుంది. వాణిజ్య వలయం అధిక జనాభాని ఆశిస్తుంది, అలాగే దాన్ని ఏర్పరుస్తుంది కూడా.

## వేతనాలు పెరగడమూ – తగ్గడమూ

ఇంతదాకా అస్థిర పెట్టుబడి పెరిగితే, కచ్చితంగా అదే అనుపాతంలో కార్మికుల సంఖ్య పెరుగుతుందనీ; తగ్గితే తగ్గుతుందనీ అనుకున్నాం. దీనిప్రకారం 10,000 పౌన్ల అస్థిర పెట్టుబడి 100 మందిని నియమిస్తే, అస్థిర 20,000 లకు పెరిగితే కార్మికుల సంఖ్య 200 కి పెరుగుతుంది. అందుకు భిన్నంగా 5,000 కి తగ్గితే కార్మికుల సంఖ్య 50 కి తగ్గుతుంది. అలాగే కార్మికుల సంఖ్యపెరిగితే జరిగే శ్రమ పరిమాణం పెరుగుతుంది, అది తగ్గితే ఇదీ తగ్గుతుంది.

ఇక్కడ మూడు అంశాలూ సంబంధంలో ఉన్నాయి :

1. పెట్టిన అస్థిర పెట్టుబడి మొత్తం
2. నియమితులైన కార్మికుల సంఖ్య
3. జరిగే శ్రమ పరిమాణం

ఇప్పటిదాకా అనుకున్న దాని ప్రకారం ఈమూడు అంశాల బంధం చాలా బలమైంది; ఒకటి పెరిగితే మిగతా రెండూ పెరుగుతాయి, ఒకటి తగ్గితే మిగతావీ తగ్గుతాయి. కాని అలా జరగక పోవచ్చుకూడా. అంటే, పెట్టిన అస్థిరపెట్టుబడి మొత్తమూ, నియమించిన శ్రామికుల సంఖ్యా, జరిగిన శ్రమ మొత్తమూ కచ్చితమైన అనుపాతంలో ఉండాలి అనేదేమీ లేదు. సంచయనం పురోగమించే కొద్దీ వాటిమధ్య బంధం బలహీనపడుతుంది.

అస్థిరపెట్టుబడి పెరుగుతున్నా, కార్మికుల సంఖ్య మారకుండా అంతే ఉండవచ్చు; ఒకవేళ పడిపోయినా పడిపోవచ్చు. ఒక విడి కార్మికుడు మరింత శ్రమ ఇచ్చినప్పుడు, అందువల్ల అతని వేతనం పెరుగుతుంది – శ్రమ శక్తి ధర అంతే ఉన్నప్పటికీ లేక ఒకవేళ తగ్గినప్పటికీ. శ్రమ రాశి పెరుగుదలతో పోలిస్తే శ్రమ శక్తి ధర నెమ్మదిగా పెరుగుతున్నప్పుడు జరిగేది ఇదే. ఈ సందర్భంలో అస్థిర పెట్టుబడి పెరుగుదల, మరింత శ్రమకి సూచిక అవుతుంది, కాని మరింత మంది శ్రామికులకి సూచిక అవదు.

**పెట్టుబడిదారుడి ఉద్దేశం.** శ్రమశక్తి ధర అంతే ఉన్నప్పుడు, ఎక్కువమంది శ్రామికుల నుండి కంటే, తక్కువమంది నుండే నిర్దిష్ట పరిమాణంలో శ్రమని లాగడం ప్రతి పెట్టుబడిదారుడి ఉద్దేశ్యం. కార్మికులు ఎక్కువ మంది ఉన్నప్పుడు పనిలో పెట్టిన శ్రమ రాసి ఏ అనుపాతంలో

పెరుగుతుందో, అదే అనుపాతంలో స్థిర పెట్టుబడిని పెంచాల్సివస్తుంది. ఉన్నవాళ్ళతోనే మరింత శ్రమచేయిస్తే ఉత్పత్తి సాధనాల్ని పెంచే అవసరం ఉండదు. అందువల్ల పెట్టుబడిదారుడు ఎక్కువమందినుండి కాకుండా, తక్కువమంది నుండే అదే పరిమాణంలో శ్రమని లాగాలనుకుంటాడు. ఉత్పత్తి స్థాయిమరింత విస్తరించేకొద్దీ, అతని ఉద్దేశ్యం బలపడుతుంది. పెట్టుబడి సంచయనంతో పాటుగా ఈ ఉద్దేశానికుండే శక్తి అంతకంతకూ అధికమవుతుంది.

**శ్రమ ఉత్పాదక శక్తి అభివృద్ధి.** సంచయనానికి కారణమూ, ఫలితమూ కూడా అయిన పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి, శ్రమ ఉత్పాదక శక్తి అభివృద్ధి, అంతే అస్థిర పెట్టుబడితో మరింత శ్రమని వినియోగించుకోగలిగే అవకాశం పెట్టుబడి దారుడికి ఇస్తుంది – ప్రతి వ్యష్టి శ్రమశక్తినీ మరింత (విస్తృతమైన లేక తీవ్రమైన) దోపిడీ ద్వారా.

**తక్కువ ధర ఉన్న శ్రామికుల్ని పెట్టడం.** అంతే పెట్టుబడితో మరింత శ్రమ శక్తిని కొనగలడని తెలుసుకున్నాం. ఇదెలా సాధ్యం?

నిపుణ శ్రామికుల స్థానంలో తక్కువ నిపుణుల్నీ, పురుషుల స్థానంలో స్త్రీలనీ, వయోజనుల స్థానంలో పిల్లల్ని నియోగించడం ద్వారా ఇది సాధ్యపడుతుంది. అందువల్ల సంచయన పురోగమనంతో, ఒకపక్క మరింత అస్థిరపెట్టుబడి మరింతమంది కార్మికుల్ని నియమించకుండానే, మరింత శ్రమని చలనంలో పెడుతుంది. మరొకపక్క, అదే పరిమాణంగల అస్థిరపెట్టుబడి అంతే శ్రమశక్తి రాశితో వెనకటికన్న ఎక్కువ శ్రమని పనిలో పెడుతుంది. అంతిమంగా, ఉన్నతస్థాయి శ్రమశక్తుల్ని తొలిగించి, నిమ్నస్థాయి వాళ్ళని మరింతమందిని నియమిస్తుంది.

**సాపేక్ష అదనపు జనాభా వేగంగా పెరగడం.** కాబట్టి సాపేక్ష అదనపు జనాభా ఉత్పత్తి – అంటే శ్రామికుల్ని విడుదలచెయ్యడం అనే ప్రక్రియ – సాంకేతిక విప్లవం కంటే ఇంకా మరింత వేగంగా నడుస్తుంది. సంచయన పురోగమనం వల్ల వేగవంతం అవుతుంది. దానికి అనుగుణంగా వచ్చే అస్థిర పెట్టుబడి స్థిర పెట్టుబడితో తగ్గుదల కంటే, సాపేక్ష అదనపు జనాభా వేగంగా పెరుగుతుంది. ఉత్పత్తిసాధనాల విస్తృతీ, సామర్థ్యమూ పెరిగేకొద్దీ, అవి తక్కువ స్థాయిలో కార్మికుల్ని నియమించే సాధనాలు అవుతాయి. ఈ పరిస్థితి శ్రమ ఉత్పాదకత పెరిగే అనుపాతంలోనే, పెట్టుబడి శ్రమ సరఫరాని, దాని గిరాకీని మించి పెంచుతుంది. పెట్టుబడి చేసే శ్రమ సరఫరా అంటే అర్థం ఏమిటి? యంత్రాలవల్ల పని కోల్పోయిన కార్మికుల సరఫరా.

**రిజర్వ్ సైన్యం బలగం పెరుగుతుంది.** పనుల్లో ఉన్న వాళ్ళు చేసే అధిక శ్రమ రిజర్వ్ సైన్యాన్ని పెంచుతుంది. అందుకు విపర్యయంగా రిజర్వ్ సైన్యం పని దొరికిన కార్మికులతో పోటీపడి వాళ్ళ మీద తీవ్రమైన వత్తిడి తెస్తుంది. వాళ్ళని ఎక్కువ పనిచెయ్యడానికి ఒప్పుకునేటట్లూ, పెట్టుబడి ఆజ్ఞలకి తల ఒగ్గి, లొంగి ఉండేట్లూ బలవంతపెడుతుంది.

కార్మిక వర్గంలో ఒకభాగం అధికశ్రమ మూలంగా, మరొకభాగం నిర్బంధం వల్లా, ఖాళీగా ఉండాల్సి వస్తుంది. దీనికి విపర్యయమైనది అనగా ఒక భాగం అధిక శ్రమ చెయ్యడం వల్ల వ్యష్టి పెట్టుబడిదారుల్ని సంపన్నుల్ని చేస్తుంది. అదే సమయంలో సామాజిక సంచ య న పురోగమనానికి అనుగుణమైన స్థాయిలో పారిశ్రామిక రిజర్వ్ సైన్యం ఉత్పత్తిని వేగవంతం

చేస్తుంది.

## అనుత్పాదక శ్రామికుల్ని ఉత్పాదక కార్మికులుగా మార్చవలసిన పరిస్థితి

సాపేక్ష అదనపు జనాభా ఏర్పడడం ఎంత ముఖ్యమైన అంశమో, ఇంగ్లండ్‌ని చూస్తే తెలుస్తుంది. శ్రమని పొదుపు చెయ్యడానికి ఆ దేశానికున్న సాంకేతిక సాధనాలు బ్రహ్మాండమైనవి. అయినప్పటికీ, రేప్పొద్దున శ్రమమొత్తం హేతుబద్ధమైన మొత్తానికి తగ్గితే, కార్మిక వర్గంలో వివిధ తరగతుల కార్మికులు వయోలింగ భేదాలకి అనుగుణంగా సర్దుబాటు అయితే, అప్పుడు అందుబాటులో ఉండే కార్మిక జనాభా ప్రస్తుత స్థాయిలో దేశ ఉత్పత్తిని సాగించడానికి సరిపోదు. ఇప్పుడు అనుత్పాదక శ్రామికులుగా ఉన్న వాళ్ళలో మెజారిటీ కార్మికుల్ని ఉత్పాదక కార్మికులుగా మార్చవలసి వస్తుంది.

**వేతనాల హెచ్చుతగ్గుల్ని నిర్ణయించే అంశం.** మొత్తంగా చూసినప్పుడు, వేతనాల సాధారణ చలనం (పెరగడం, తగ్గడం) పూర్తిగా పారిశ్రామిక రిజర్వ్ సైన్యం యొక్క విస్తరణ, క్షీణతల చేత నియంత్రితమవుతుంది. ఈహెచ్చుతగ్గులు తిరిగి పారిశ్రామిక వలయంలో నిర్ణీత కాల వ్యవధుల్లో వచ్చే మార్పులకి అనుగుణంగా ఉంటాయి. కాబట్టి ఆ హెచ్చుతగ్గులు కార్మిక జనాభా సంఖ్యలో వచ్చే మార్పుల చేత నిర్ణయించబడవు; కార్మిక వర్గంలో పనిలోవున్న భాగంగానూ, రిజర్వ్ సైన్యంగానూ విభజితమయ్యే వివిధ అనుపాతాల చేత నిర్ణయమవుతాయి. అదనపు జనాభా పెరుగుదలని, తరుగుదలని బట్టి, ఒకప్పుడు పనిలో ఇముడ్చుకునే మేరనూ, మరొకప్పుడు తొలిగించే మేరనూ బట్టి. ఆమేరకు వేతనాల హెచ్చుతగ్గులు నిర్ణయమవుతాయి.

అంటే, వేతనాలు నిర్ణయమయ్యేది, జనాభా సంఖ్యని బట్టికాదు, ఆ జనాభా అంతర్నిర్మాణాన్ని బట్టి. మొత్తం జనాభాలో పనుల్లో ఉన్న జనాభాకీ, రిజర్వ్ జనాభాకీ మధ్య నిష్పత్తిని బట్టి.

**వాణిజ్య వలయాల ప్రభావం.** ఆధునిక పరిశ్రమలో పదేళ్ళ వలయాలూ, నిర్ణీత కాలవ్యవధుల్లో సాగే దశలూ ఉంటాయి. ఆ దశలు సంచయనం పురోగమించేకొద్దీ ఒక దశ వెంట మరొకదశ ఒక క్రమం లేకుండానూ, త్వరత్వరగానూ అనుసరిస్తాయి. ఈ ఊగిసలాటల మూలంగా సంక్లిష్టమవుతాయి. ఆధునిక పరిశ్రమకి తగిన నియమం ఏదంటే: మార్చిమార్చి వచ్చే విస్తరణా, క్షీణతల చేత శ్రమ సరఫరా, గిరాకీలు నిర్ణయమవుతాయి. అంటే, ఆ క్షణంలో పెట్టుబడి విస్తరణ అవసరాల్ని బట్టి, శ్రమ మార్కెట్ కొన్నిసార్లు పెట్టుబడి విస్తరిస్తున్నప్పుడు సాపేక్షంగా కొరవగా ఉన్నట్లూ, ఇంకొన్ని సందర్భాల్లో పెట్టుబడి క్షీణిస్తున్నప్పుడు, శ్రమ మార్కెట్ సాపేక్షంగా నిండి పొర్లుతున్నట్లూ అగపడుతుంది. ఈనియమం స్థానంలో పెట్టుబడి చలనం, జనాభా చలనం మీద ఆధారపడి ఉన్నది అనే నియమాన్ని పెట్టడం పూర్తిగా అర్థంపర్థం లేనిది. దీన్ని మార్క్స్ 'ముచ్చటైన నియమం' (beautiful law) అంటాడు వ్యంగ్యంగా.

**ఆర్థికవేత్తల పిడివాదం.** అయినప్పటికీ ఆర్థికవేత్తల పిడివాదం ఇదే. వాళ్ళ ప్రకారం పెట్టుబడి సంచయనం వల్ల వేతనాలు పెరుగుతాయి. ఎక్కువ వేతనాలు శ్రామిక జనాభా వేగంగా పెరిగేట్లు ప్రేరేపిస్తాయి. శ్రమ మార్కెట్ సరఫరా అతి అయ్యే దాకా అలా సాగుతుంది. అందువల్ల శ్రమ సరఫరాతో పోలిస్తే, పెట్టుబడి తక్కువ అవుతుంది. అప్పుడిక వేతనాలు పడిపోతాయి. నాణెంలో

బొరుసు కనబడుతుంది. వేతనాలు కార్మిక జనాభా మొత్తం మీద ఆధారపడవు. కార్మిక జనాభా అంతర్నిర్మాణం మీద ఆధారపడతాయి. దీనర్థం: వేతనాలు పెట్టుబడి వృద్ధి అవసరాలకి అనుగుణంగా నియంత్రించబడతాయి. ఇది పెట్టుబడిని స్వతంత్ర శక్తిని చేస్తుంది. ఇందుకు భిన్నంగా వేతనాలు కార్మిక జనాభా పరమ పరిమాణం మీద ఆధారపడ్డట్లయితే, అప్పుడు పెట్టుబడి సంచయనం జనాభా పెరుగుదల మీద ఆధారపడాల్సి ఉండేది. ఈ నియమం వాస్తవాల్ని ఏమాత్రం వివరించదు/విశదపరచదు. పెట్టుబడి సంచయనం జనాభా వృద్ధిమీద ఆధారపడి ఉండేది కాదు.

వేతనాలు పడిపోయిన కారణంగా శ్రామిక జనాభా కొద్దికొద్దిగా తగ్గిపోతుంది. అందువల్ల పెట్టుబడి మరలా వాళ్ళకి సాపేక్షంగా ఎక్కువవుతుంది. లేదా, ఇతరులు వివరించినట్లు వేతనాల తగ్గుదలా, దాన్ననుసరించే శ్రామిక దోపిడీ పెరుగుదలా, తిరిగి సంచయనాన్ని పెంచుతుంది. అదే సమయంలో తక్కువ వేతనాలు కార్మిక జనాభా పెరక్కుండా నిరోధిస్తుంది. అప్పుడు మళ్ళీ శ్రమకి గిరాకీ కన్నా సరఫరా తగ్గుతుంది. దాంతో మరల వేతనాలు పెరుగుతాయి. అలా సాగిపోతుంది. అభివృద్ధి చెందిన పెట్టుబడి ఉత్పత్తికి ఇది ఎంత సొగసైన చలన విధానం! రుజువు చూపకుండా ఇలాంటి నియమం చెయ్యడం ఎంతో అసంబద్ధమైనది.

**అందుకొక ఉదాహరణ.** 1849–1859 కాలంలో ఇంగ్లిష్ వ్యవసాయ జిల్లాల్లో ధాన్యం ధరలు పడిపోతున్నా వేతనాలు  కొంచెమే అయినా పెరిగాయి. విల్ట్ షైర్ లో వారం వేతనాలు 7 షిల్లింగులనించి 8 కి పెరిగాయి. డోర్సెట్ షైర్ లో 7, 8 నించి 9 కి పెరిగాయి. ఇందుకు కారణం యుద్ధ అవసరాలకూ, రైల్ రోడ్లూ, ఫాక్టరీలూ, గనులూ విస్తరించడానికీ వ్యవసాయ అదనపు జనాభా భారీగా వలసపోవడమే. వేతనాలు ఎంత తక్కువగా ఉంటే, వాటిలో వచ్చే స్వల్ప పెరుగుదల వ్యక్తమయ్యే నిష్పత్తి అంత ఎక్కువగా ఉంటుంది. ఉదాహరణకి, వారం వేతనం 20 షిల్లింగులయి ఉండి అది 22 కి పెరిగితే, ఆపెరుగుదల 10 శాతం. అది 7 షిల్లింగులయి ఉండి 9 కి పెరిగితే, పెరుగుదల 28 4/7 శాతం. ఇది వినసొంపుగానే ఉంటుంది. ప్రతిచోటా రైతులు గగ్గోలు పెడుతున్నారు. లండన్ 'ఎకానమిస్ట్' ఈ పస్తుల వేతనాల్ని గురించి సాధారణమైన, గణనీయమైన పురోగమనం జరిగిందని వాగింది. అప్పుడు రైతులు ఏం చేశారు? పిడివాది అయిన ఆర్థికవేత్త చెప్పినట్లు ఈ గొప్ప వేతనాల ఫలితంగా వ్యవసాయ కార్మికులు బాగా పెరిగి, వేతనాలు మళ్ళీ తగ్గే దాకా వేచి ఉన్నారా? లేదు. వెంటనే మరిన్ని యంత్రాల్ని తెచ్చిపెట్టారు. ఒక్క క్షణంలో రైతులు ఆనందించే స్థాయిలో శ్రామికులు మళ్ళీ ఎక్కువై పోయారు. అక్కడ ఇప్పుడు వ్యవసాయంలో మునుపటికంటే ఎక్కువ పెట్టుబడి మరింత ఉత్పాదక రూపంలో పెట్టబడింది. దీంతో శ్రమకి గిరాకీ పడిపోయింది – సాపేక్షంగానే కాదు, నిరపేక్షంగా కూడా.

పైన చెప్పిన ఆర్థిక ఊహ వేతనాల చలనాన్ని నియంత్రించే నియమాల్నీ, వేర్వేరు ఉత్పత్తి రంగాల్లోకి శ్రామిక జనాభాని పంపిణీ చేసే నియమాల్నీ గందరగోళ పరుస్తుంది. ఉదాహరణకి, ఏదైనా ఉత్పత్తిరంగంలో పరిస్థితులు అనుకూలించి, సంచయనం క్రియాశీలంగా ఉండవచ్చు.

ఆ రంగంలో లాభాలు సగటు లాభాలకంటే ఎక్కువ ఉంటాయి. అప్పుడు ఆ రంగం అదనపు పెట్టుబడిని ఆకర్షిస్తుంది. అందువల్ల శ్రమకి గిరాకీ పెరుగుతుంది, వేతనాలు పెరుగుతాయి. ఎక్కువ వేతనాలు ఎక్కువమంది కార్మికుల్ని ఆ రంగంలోకి లాగుతాయి. అయితే ఆ రంగంలో శ్రమశక్తి మితిమీరేదాకానే అలా జరుగుతుంది. శ్రమశక్తి అతిగా ఆరంగంలోకి వస్తే వేతనాలు తగ్గి సగటు స్థాయికో, ఇంకా దిగువకో పడిపోతాయి. అప్పుడిక ఆ రంగంలోకి వలసరావడం నిలిచిపోతుంది. దాన్ని వదిలివెళ్ళడం మొదలవుతుంది.

**శ్రమ సరఫరా.** స్తంభన ఉన్నప్పుడూ, సగటు వికాసం ఉన్నప్పుడూ పారిశ్రామిక రిజర్వ్ సైన్యం, క్రియాశీల శ్రామిక సైన్యాన్ని దిగలాగే భారంగా ఉంటుంది. అధికోత్పత్తి కాలంలోనూ, ఆకస్మిక అభివృద్ధి సమయాల్లోనూ ఈ పారిశ్రామిక రిజర్వ్ సైన్యం అదుపులో అణిగిమణిగి ఉంటుంది. అందువల్ల శ్రమ సరఫరా–గిరాకీ నియమానికి సాపేక్ష అదనపు జనాభా అనేది కీలు (pivot)గా పనిచేస్తుంది. అది పెట్టుబడి ఆధిపత్యానికీ, దోపిడీ చర్యకీ పూర్తి అనుకూలంగా ఈ నియమం వర్తించే కార్యరంగాన్ని పరిమితం చేస్తుంది.

**శ్రమ గిరాకీ.** పెట్టుబడిదారీ ఆర్థికవేత్తల అసాధారణ ప్రతిభ ప్రదర్శించిన విషయానికి తిరిగి వెనక్కి రావాల్సిన సమయం ఆసన్నమయింది. కొత్త యంత్రాలు ప్రవేశపెట్టడం ద్వారానో, పాత యంత్రాల్ని విస్తృతపరచడం ద్వారానో అస్థిర పెట్టుబడిలో కొంత భాగం స్థిర పెట్టుబడిలోకి మార్చబడితే, అది పెట్టుబడిని స్థిరపరిచి, అదే చర్య ద్వారా శ్రామికుల్ని విడుదల చేస్తుంది. ఆర్థికవేత్తలు ఈ చర్యని దానికి సరిగ్గా వ్యతిరేకంగా వివరిస్తారు – కార్మికుల కోసం పెట్టుబడిని విడుదల చేస్తుందని కపట వివరణ ఇచ్చారు. ఇప్పుడు ఈ పండితుల సిగ్గుమాలిన తనాన్ని ఎవరైనా పూర్తిగా అర్థంచేసుకోగలుగుతారు.

### విడుదల చేయబడినవాళ్ళు:

1. యంత్రాలచేత బయటకు గెంటబడిన కార్మికులు
2. భవిష్యత్తులో ఆ కార్మికులకి బదులుగా వచ్చే, రాబోయే తరం వాళ్ళు
3. పాత ప్రాతిపదిక మీదనే వ్యాపారం విస్తరణ వల్ల క్రమంతప్పకుండా ఇముడ్చుకోబడగల అదనపు కార్మికులు.

వీళ్ళంతా ఇప్పుడు విడుదల చెయ్యబడ్డారు. కార్యాచరణకోసం ఎదురుచూసే ప్రతి కొద్ది పెట్టుబడి కూడా వాళ్ళని అవకాశంగా తీసుకుంటుంది. పెట్టబోయే అదనపుపెట్టుబడి శ్రమకి గిరాకీని పెంచాలి. కాని, పెట్టుబడి పెరిగినా, దానికి అనుగుణంగా శ్రమకి గిరాకీ పెరగకుండా ఉండే విధంగా వ్యవహారాల్ని పెట్టుబడిదారీ ఉత్పత్తి యంత్రాంగం నిర్వహిస్తుంది. కార్యకలాపాల్ని బహు చాకచక్యంగా చక్కబెట్టుకొస్తుంది.

**శ్రమ సరఫరా గిరాకీలకి ఉన్న సంబంధం.** పెట్టుబడి పెరుగుదలతో శ్రమ గిరాకీ అనుగుణంగా ఉండదు; శ్రమ సరఫరా శ్రామికవర్గ పెరుగుదలకి అనుగుణంగా ఉండదు. ఇది రెండు స్వతంత్ర శక్తులు ఒకదానిమీద ఒకటి పనిచేసే సందర్భం కాదు. అదెప్పుడూ ఒకవైపే

మొగ్గు చూపుతుంది. పెట్టుబడి రెండు వైపులా ఏకకాలంలో పనిచేస్తుంది.

ఒకవైపు, సంచయనం శ్రమకి గిరాకీ పెంచుతుంది, మరొకవైపు, శ్రామికుల సరఫరాని పెంచుతుంది – వాళ్లని విడుదలచెయ్యడం ద్వారా. అదే సమయంలో నిరుద్యోగుల ఒత్తిడి, పనుల్లో ఉన్నవాళ్ళని మరింత శ్రమచేసేట్టు చేస్తుంది. అందువల్ల ఒక మేరకు, శ్రమ సరఫరాని, శ్రామికుల సరఫరాతో సంబంధం లేకుండా, స్వతంత్రంగా ఉండేట్టు చేస్తుంది. ఈ ప్రాతిపదిక మీద ఆధారపడిన శ్రమ సరఫరా–గిరాకీ సూత్రం యొక్క కార్యాచరణ పెట్టుబడి నిరంకుశత్వాన్ని సంపూర్తి చేస్తుంది.

**సరఫరా–గిరాకీ సూత్రం.** కార్మికులు ఎక్కువ పని చేసేకొద్దీ, ఇతరులకోసం ఎక్కువ సంపద ఉత్పత్తి చేసేకొద్దీ, వాళ్ళ శ్రమ ఉత్పాదకత పెరిగేకొద్దీ అదే మోతాదులో పెట్టుబడి స్వయం విస్తరణ సాధనంగా వాళ్ళ చర్య సైతం అంతకంతకూ ఎలా అపాయకరమైనది అవుతుందో ఆ రహస్యాన్ని కార్మికులు గ్రహించగానే; తమలో తమకున్న పోటీ స్థాయి పూర్తిగా సాపేక్ష అదనపు జనాభా ఒత్తిడిని బట్టి ఉంటుందని కనుక్కోగానే; పెట్టుబడిదారీ ఉత్పత్తి సహజ నియమం తమ వర్గం మీద కలిగించే వినాశకర ప్రభావాల్ని రూపుమాపడానికో, తగ్గించడానికో కార్మిక సంఘాల ద్వారా ఉద్యోగులకూ, నిరుద్యోగులకూ సహకారం కోసం ప్రయత్నం చెయ్యగానే; పెట్టుబడీ దాన్ని కీర్తించే అర్ధశాస్త్రమూ శాశ్వతమైనదీ, పరమ పవిత్రమైనదీ అయిన సరఫరా గిరాకీ సూత్రం అతిక్రమణకు గురయిందని గావు కేకలు పెడతాయి. ఉద్యోగుల, నిరుద్యోగుల కలయిక ప్రతిదీ ఈ నియమాన్ని సరిగా పనిచేయకుండా భంగం కలిగిస్తుంది. అయితే మరోపక్క, ప్రతికూల పరిస్థితులు (ఉదాహరణకు వలసదేశాల్లో) పారిశ్రామిక రిజర్వ్ సైన్యం ఏర్పడడాన్నీ, దానితో పాటుగా పెట్టుబడిదారీ వర్గంమీద శ్రామికవర్గం ఆధారపడడాన్నీ అడ్డగించినట్లయితే, వెంటనే పెట్టుబడీ, దాని శాస్త్రమూ సరఫరా–గిరాకీ పవిత్ర సూత్రం మీద తిరుగుబాటు చేస్తాయి. దానికి అననుకూలమైన చర్యని బలప్రయోగ సాధనాల ద్వారానూ, రాజ్య జోక్యం ద్వారానూ నిరోధించే యత్నం చేస్తాయి.

## విభాగం4
## సాపేక్ష అదనపు జనాభా రూపాలు

**పెట్టుబడి సంచయనం** మూలంగా కొందరు కార్మికులు అనవసరం అవుతారు. వాళ్ళని పనుల్లోంచి తొలిగిస్తారు. అలాంటి వాళ్ళందరూ సాపేక్ష అదనపు జనాభాగా తయారవుతారు. ఈ జనాభా సాధ్యమైన ప్రతిరూపంలోనూ ఉంటుంది. పాక్షికంగానో పూర్తిగానో నిరుద్యోగి అయిన ప్రతి కార్మికుడూ దీని కిందికి వస్తాడు. వర్తక వలయంలోని సంక్షోభ దశలో తీవ్రరూపంలోనూ, మాంద్య దశలో దీర్ఘకాల వ్యాధి రూపంలోనో ఉండే, ఈ రకం నిరుద్యోగాన్ని ఇక్కడ లెక్కలోకి తీసుకోడు మార్క్స్. ఎందుకంటే చర్చ దీని గురించి కాదు. దీన్ని పక్కన పెట్టినా అదనపు జనాభా ఎల్లప్పుడూ ముఖ్యంగా మూడు రూపాల్లో ఉంటుంది:

A. ఉద్యోగాలు వస్తూ పోతూ ఉండే (floating) అదనపు జనాభా

B. అంతర్గత (latent) అదనపు జనాభా

C. స్తబ్ధ (stagnant) అదనపు జనాభా

**A. వస్తూ పోతూ ఉండే అదనపు జనాభా:** ఆధునిక కర్మాగారాల్లో కార్మికులు ఒకప్పుడు ఎక్కువయ్యారని తొలిగించబడతారు. మరొకప్పుడు అంతకన్నా ఎక్కువ మంది నియమించబడ్డా, అలా మొత్తం మీద నియమితులైన పనివాళ్ళ సంఖ్య, ఉత్పత్తి స్థాయితో పోలిస్తే, నిరంతరం తగ్గే నిష్పత్తిలోనే అయినా పెరుగుతుంది. ఇక్కడ అదనపు జనాభా అస్థిర రూపంలో ఉంటుంది.

యంత్రాలు ప్రవేశించిన పెద్ద కర్మాగారాల్లో, ఆధునిక శ్రమవిభజన వచ్చిన పెద్ద కర్మాగారాల్లో పెద్దసంఖ్యలో పిల్లలు నియమితులవుతారు. అయితే యవ్వనవంతులు అయ్యేవరకే. ఆతర్వాత వాళ్ళలో చాలా కొద్దిమందిని మాత్రమే పనుల్లో ఉంచుతారు. ఎక్కువమందిని తొలగిస్తారు. ఇలాంటి కార్మికులు వస్తూ పోతూ ఉండే అదనపు జనాభాలో ఒక అంశం అవుతారు. ఆ పారిశ్రామిక శాఖల విస్తరణను బట్టి పెరుగుతుంటారు.

వాళ్ళలో కొందరు వలస పోతారు – వాస్తవానికి వలసపోయే పెట్టుబడితో పాటు వీళ్ళూ వలసపోతారు. దీని పర్యవసానాల్లో ఒకటి: పురుష జనాభా కన్న, మహిళా జనాభా వేగంగా పెరుగుతుంది. ఇంగ్లండే ఇందుకు రుజువు.

### పెట్టుబడి చలనంలోఉండే వైరుధ్యాలు

1. కార్మికుల సంఖ్య పెరిగినా, అది సంచయన అవసరాల్ని తీర్చ లేదు. అయినా ఎప్పుడు చూసినా దాని అవసరాలకు మించే ఉంటుంది. ఇది పెట్టుబడి చలనంలోనే అంతర్గతంగా ఉండే వైరుధ్యం. అది ఎక్కువమంది తరుణ వయస్కుల్నీ, కొద్దిమంది వయోజనుల్నీ

నియమించాలని ఉద్దేశ పడుతుంది.

2. కార్మికులకొరత ఉన్నా, పనిలేని వాళ్ళు అనేకమంది ఉంటారు.

దీనికంటే నగ్నమైన వైరుధ్యం ఏమంటే: ఒకపక్క కార్మికుల కొరత అనే ఫిర్యాదు ఉంటుంది, వేరొక పక్క శ్రమ విభజన మూలంగా ఒక ప్రత్యేక శాఖకు బందీలుగా ఉన్న కారణంగా, అదే సమయంలో అనేక వేలమంది పనులు లేకుండా ఉంటారు.

ఈ రెండో వైరుధ్యానికి చరిత్రనించి ఉదాహరణ: లండన్‌లో 1866వ సంవత్సరం రెండో 6 నెలల్లో 80 నించి 90 వేలమందిని పనుల్లోంచి తీసేశారు. ఒక ఫాక్టరీ నివేదికలో ఇలా ఉంది – ఎప్పుడు అవసరం అయితే అప్పుడు, గిరాకీ సరఫరాని ఏర్పరుస్తుంది – అనేది పూర్తి నిజం కాదు అనిపిస్తుంది. శ్రమ విషయంలో అలా ఎప్పుడూ జరగలేదు. ఎందుకంటే నిరుడు కార్మికుల కొరతవల్ల ఎన్నో యంత్రాలు ఆడకుండా పడి ఉన్నాయి – (Rep. of Insp. of Fact., 31st Oct., 1866, p. 81.)

**మొదటి వైరుధ్యాన్ని ఉధృతం చేసేవి:**

1. యువ కార్మికుల అధిక శ్రమ
2. తక్కువ ఆయుః ప్రమాణం
3. ముందుగానే ముసలివాళ్ళవడం

పెట్టుబడి శ్రమశక్తిని చాలా ఉధృతంగా వాడుకుంటుంది. అందువల్ల సగం జీవితం అయ్యేటప్పటికి జీవితం అంతా అయిపోయినట్లే ఉంటుంది. అతనిక అవసరం లేని వాళ్ళలో (supernumeraries) చేరతాడు. లేదా ఉన్నతస్థాయినించి నిమ్నస్థాయికి దిగజారతాడు. ఆధునిక పరిశ్రమల్లోని శ్రామికులే అత్యంత తక్కువ కాలం బతుకుతున్నారు – అని డాక్టర్ లీ చెప్పాడు. మాంచెస్టర్ లో పై మధ్యతరగతి వాళ్ళ చనిపోయే సగటు వయస్సు 38, అదే శ్రామికులకి 17. లివర్ పూల్ లో మొదటివాళ్ళకి 35, రెండోవాళ్ళకి 15. దీన్నిబట్టి కార్మికులకన్నా ఉన్నత మధ్యతరగతి జీవించే కాలం రెండింతల కన్నా ఎక్కువగా కనిపిస్తుంది. తక్కువ వయసులో చనిపోతున్న పరిస్థితుల దృష్ట్యా, కార్మికులసంఖ్య వేగంగా పెరగాల్సిన అవసరం ఉంటుంది. (ఈ నియమం ఇతర వర్గాలకు వర్తించదు). ఈ సామాజిక అవసరం ముందే పెళ్ళిళ్ళు చేసుకోవడం, పిల్లల్ని కని దోపిడీకి అవకాశం కలిగించడం ద్వారా నెరవేరుతుంది.

## B. అంతర్గత అదనపు జనాభా

పెట్టుబడిదారీ ఉత్పత్తి, వ్యవసాయాన్ని ఏ మేరకు తన స్వాధీనంలోకి తెచ్చుకుంటుందో, ఆ మేరకు పెట్టుబడి పెరిగినా, వ్యవసాయ కార్మికులకి గిరాకీ తగ్గుతుంది. వాళ్లలో కొందరు పల్లెలు వదిలి, పట్టణాల బాట పడతారు. తయారీ రంగ కార్మికులుగా మారతారు. 1861 జనాభా లెక్కల ప్రకారం 781 పట్టణాల్లో 1,09,60,998 మంది నివాసమున్నారు. అప్పుడు గ్రామీణ ప్రాంతాల్లో 91,05,226 మంది ఉన్నారు. 1851 లో 580 పట్టణాల్లో ఉన్న వాళ్ళు చుట్టుపక్కల గ్రామాల జనాభాకి సమానం. ఆ తర్వాత పదేళ్ళలో గ్రామాల జనం 5 లక్షలు పెరిగారు. అయితే పట్టణాల్లో 15 లక్షలమందికి పైగా పెరిగారు. ఈ తేడాకి కారణం గ్రామాలనించి పట్టణాలకి వలస పోవడం. అందువల్ల మొత్తం జనాభా పెరుగుదలలో 75

శాతం పట్టణాల్లోనే కనిపిస్తుంది. సాపేక్ష అదనపు జనాభాకి ఉండే ఈ వనరు నిరంతరం ప్రవహిస్తూనే ఉంటుంది. ఈ ప్రవాహం ఎప్పుడూ ఉండాలంటే, గ్రామాల్లోనే అప్పటికే అంతర్గత అదనపు జనాభా ఉండాలి. అటువంటి జనాభా బయటకి వెళ్ళే దారులు అసాధారణంగా విశాలమైనప్పుడు మాత్రమే ఆ జనాభా విస్తృతి మనకు బోధపడుతుంది.

**వ్యవసాయంలో వేతనాలు తక్కువవడం** మరొక పర్యవసానం. అందువల్ల, వ్యవసాయ కార్మికుడు కనీస వేతనం మాత్రమే పొందే స్థాయికి దిగుతాడు. ఒక కాలు ఎప్పుడూ కటిక దరిద్రం రొంపిలోనే ఉంటుంది.

## C. స్తబ్ధ సాపేక్ష అదనపు జనాభా

వీళ్ళకి నికరంగా ఒక ఉద్యోగమంటూ ఉండదు. సాధారణంగా ఎక్కువ వయసున్న వాళ్ళూ, తక్కువ నైపుణ్యం ఉన్న వాళ్ళూ, లేదా ప్రస్తుతం అవసరం లేని నైపుణ్యాలున్న వాళ్ళూ, క్రమరహితమైన ఉద్యోగాల్లో ఉంటారు. ఒక్కొక్కప్పుడు పనిలేకుండా ఉంటారు. లేక పార్ట్ టైం పనులు చేస్తుంటారు. అందువల్ల వాళ్ళని ఎప్పుడుబడితే అప్పుడు పెట్టుకొని పనికాగానే తొలిగించే వీలుంటుంది. ఈ భాగం, అటువంటి కార్మికుల నిల్వ. వాళ్ళజీవిత పరిస్థితులు కార్మికవర్గపు సాదా సగటు స్థాయికి, దిగువన ఉంటాయి. కాబట్టి ఇది ప్రత్యేక దోపిడీ శాఖలకు, విశాల ప్రాతిపదికని ఏర్పరుస్తుంది. దీని ప్రత్యేక లక్షణాలు: గరిష్ట పని గంటలూ, కనిష్ట వేతనాలూ. ఆధునిక పరిశ్రమలోనూ, వ్యవసాయంలోనూ అవసరంలేని అదనంగా వున్న శ్రామికులూ, కార్ఖానాల వల్ల దెబ్బతిన్న చేతి వృత్తులలోనూ, యంత్రాలవల్ల దెబ్బతిన్న శాఖలలోనూ పనులు పోయిన కార్మికులు, ఈ తరగతిలోకి నిరంతరాయంగా చేరుతూ ఉంటారు. సంచయన శక్తీ, విస్తృతీ పెరిగే కొద్దీ ఈ తరగతి పెరుగుతుంది.

### అట్టడుగు భాగం

సాపేక్ష అదనపు జనాభాలో అట్టడుగు భాగం కటిక దరిద్రంలో ఉంటుంది. పనిపాటా చెయ్యకుండా తిరిగేవాళ్ళనీ, నేరగాళ్ళనీ, వ్యభిచారుల్నీ ఒక్కముక్కలో ప్రమాదకర కార్మిక వర్గాన్ని (lumpen proletariat) మినహాయిస్తే, ఈ తరగతిలో మూడు రకాల వాళ్ళుంటారు:

1. శ్రమచెయ్యగల శక్తి కలవాళ్ళు. ఇంగ్లిష్ కటిక దరిద్రులగురించిన గణాంకాల్ని పైపైన చూసినా చాలు, ప్రతిసంక్షోభంలోనూ వీళ్ళ సంఖ్య పెరుగుతుందనీ, ప్రతి పునర్వికాసంలోనూ వీళ్ళ సంఖ్య తగ్గుతుందని తెలుస్తుంది.
2. అనాధలూ, కటిక దరిద్రుల పిల్లలూ. వీళ్ళు ఈ రిజర్వ్ సైన్యంలో సభ్యులుగా ఉంటారు. మంచి వికాస కాలంలో (ఉదాహరణకి 1860) వేగంగా క్రియాశీల శ్రామిక సైన్యంలో నమోదవుతారు.
3. నైతికంగా చెడినవాళ్ళూ, పనిచెయ్యలేని వాళ్ళూ, ముఖ్యంగా శ్రమవిభజన వల్ల మారే పరిస్థితులకి తగినట్లు తయారయ్యే సమర్ధత లేనివాళ్ళూ, పనిచేసే వయస్సు దాటినవాళ్ళూ, ప్రమాదకర యంత్రాలవల్ల గనుల్లో రసాయన పరిశ్రమల్లో వికలాంగులైనవాళ్ళూ, రోగపీడితులూ, వితంతువులూ ఈతరగతిలో ఉంటారు. అటువంటి యంత్రాలూ పరిశ్రమలూ పెరిగేకొద్దీ, వీళ్ళ సంఖ్య పెరుగుతుంది. ఈ తరగతి పెద్దదవుతుంది.

**కటిక పేదరికం** అనేది క్రియాశాల కార్మిక సేనకి వైద్యశాలగానూ, పారిశ్రామిక రిజర్వ్ సైన్యం మెడకి గుదిబండగానూ ఉంటుంది. సాపేక్ష అదనపు జనాభా ఉత్పత్తిలోనే, పరమ పేదరికం ఉత్పత్తి కలిసి ఉంటుంది. పెట్టుబడిదారీ ఉత్పత్తికీ, సంపద అభివృద్ధికీ, అదనపు జనాభాతో పాటు పరమ పేదరికం కూడా అవసరమైన షరతు. అయితే ఆ కటిక దరిద్రుల్లో ఎక్కువమందిని తన భుజాలమీదనించి కార్మికవర్గం భుజాల మీదికి, దిగువ మధ్యతరగతి వర్గం భుజాల మీదికి ఎలా నెట్టాలో పెట్టుబడికి చక్కగా తెలుసు.

## పెట్టుబడి సంచయనపు పరమ సాధారణ సూత్రం

సామాజిక సంపదా, క్రియాశీల పెట్టుబడీ, ఆపెట్టుబడి శక్తీ, విస్తృతీ, ఆ కారణంగా కార్మికవర్గ పరమ పరిమాణమూ, దాని శ్రమ ఉత్పాదకతా ఎంతగా పెరిగితే, పారిశ్రామిక రిజర్వ్ సైన్యం అంతగా పెరుగుతుంది. ఏ అంశాలయితే పెట్టుబడి విస్తరించే శక్తిని పెంచుతాయో, అవే అంశాలు పెట్టుబడికి అందుబాటులో ఉండే శ్రమ శక్తిని కూడా పెంపొందిస్తాయి.

సంపద యొక్క స్థితిజ శక్తితోపాటు పారిశ్రామిక రిజర్వ్ సైన్యపు సాపేక్ష రాశి కూడా పెరుగుతుంది. అయితే ఈ రిజర్వ్ సైన్యం క్రియాశీల శ్రామిక సైన్యానికి, అనుపాతంలో ఎంత ఎక్కువగా ఉంటే, మొత్తం అదనపు జనాభా రాశి అంత ఎక్కువగా ఉంటుంది. ఈ అదనపు జనాభా దైన్యస్థితి, వాళ్ళ యాతనకి విలోమానుపాతంలో ఉంటుంది. అంతిమంగా, కార్మికవర్గంలోని నికృష్ట శ్రేణులూ (lazarus layers), ఎంత విస్తృతమవుతాయో, పరమ పేదరికం కూడా అంత అధికమవుతుంది. ఇదే పెట్టుబడి సంచయనపు పరమ సాధారణ సూత్రం. అన్ని ఇతర సూత్రాలమాదిరిగానే ఇది కూడా ఆచరణలో అనేక పరిస్థితులచేత సవరించబడుతుంది. అయితే ఇక్కడ ఆ పరిస్థితుల పరిశీలనతో మనకేమీ పనిలేదు.

## అర్థిక విజ్ఞానం బోధ – ఆబోధలోని పొరపాటు

పెట్టుబడి అవసరాలకు తగ్గట్లు కార్మికుల సంఖ్యని సవరించుకోవాలని, కార్మికులకి అర్థిక విజ్ఞానం బోధచేస్తుంది. ఆబోధలోని పొరపాటు ఏమిటో ఇప్పుడు బట్టబయలవుతుంది. పెట్టుబడిదారీ ఉత్పత్తికీ, సంచయనానికీ సంబంధించిన యంత్రాంగమే నిరంతరం ఈ సర్దుబాటు చేస్తూ ఉంటుంది. ఈ సర్దుబాటు చెయ్యడంలో మొదటి అంశం పారిశ్రామిక రిజర్వ్ సైన్యాన్ని ఏర్పరచడం. ఇక చివరి అంశాలు: క్రియాశీల శ్రామిక సైన్యంలో నిరంతరం పెరిగే శ్రేణి యొక్క దైన్య పరిస్థితీ, కటిక దారిద్ర్యం అనే గుదిబండా.

సామాజిక శ్రమ ఉత్పాదకత పురోగమనం మూలంగా నిరంతరం పెరిగే ఉత్పత్తిసాధనాల్ని, తక్కువ మానవ శ్రమ చలనంలో పెడుతుంది. ఉత్పత్తి సాధనాల్ని కార్మికుడు ఉపయోగించే బదులు, ఉత్పత్తి సాధనాలే కార్మికుణ్ణి ఉపయోగించే పెట్టుబడిదారీ సమాజంలో, ఈ సూత్రం పూర్తిగా తిరగబడి ఈవిధంగా వ్యక్తం అవుతుంది: శ్రమ ఉత్పాదకత హెచ్చే కొద్దీ, వినియోగించే శ్రమసాధనాల మీద ఒత్తిడి మరింత ఎక్కువగా ఉంటుంది. కాబట్టి వాళ్ళ మనుగడకి షరతు – మరొకరి సంపద పెంచడం కోసం వాళ్ళ సొంత శ్రమని అమ్మడం – మరింత అనిశ్చయమైనది అవుతుంది.

ఉత్పత్తి సాధనాలూ, శ్రమ ఉత్పాదకతా, ఉత్పాదక జనాభాకంటే వేగంగా పెరుగుతాయి. ఈ వాస్తవం పెట్టుబడిదారీ విధానంలో ఇలా విలోమ రూపంలో వ్యక్తమవుతుంది: పెట్టుబడి

ఈ పెరుగుదలని వినియోగించుకోగలిగిన పరిస్థితులకంటే, శ్రామిక జనాభా ఎల్లప్పుడూ వేగంగా పెరుగుతూనే ఉంటుంది.

సాపేక్ష అదనపు విలువని విశ్లేషించిన 4 వ భాగంలో ఈ క్రింది విషయాలు చూశాం:

1. పెట్టుబడిదారీ వ్యవస్థలో శ్రమ ఉత్పాదకతని హెచ్చించే పద్ధతులు అన్నీ, వ్యష్టి కార్మికునికి నష్టం కలిగించే రీతిలో ఏర్పడ్డవే.
2. ఉత్పత్తి అభివృద్ధికి వాడే సాధనాలన్నీ ఉత్పత్తిదారుల (కార్మికుల) మీద ఆధిపత్యం చెలాయించే సాధనాలుగానూ, దోపిడీ సాధనాలుగానూ మారిపోతాయి.
3. కార్మికుణ్ణి మనిషిలో ఒక భాగంగా మార్చి, వికలాంగుణ్ణి చేస్తాయి. యంత్రానికి ఒక ఉపాంగంగా (appendage) ఉండేట్లు దిగజారుస్తాయి. అతని పనిలో ఉండే ఉల్లాసాన్ని ఏమాత్రం లేకుండా చేసి దాన్ని అసహ్యకరమైన, ద్వేషార్హమైన కఠిన శ్రమగా మారుస్తాయి.
4. సైన్స్ ఒక స్వతంత్ర శక్తిగా, ఏ నిష్పత్తిలో శ్రమ ప్రక్రియలోకి చొచ్చుకొని పోతుందో, అదే నిష్పత్తిలో శ్రమప్రక్రియకి చెందిన అతని మేధో సంపత్తిని, అతన్నుండి ఆ సాధనాలు దూరం చేస్తాయి.
5. అవి శ్రామికుడు పనిచేసే పరిస్థితుల్ని వక్రీకరిస్తాయి. శ్రమ ప్రక్రియలో అతన్ని గర్హనీయమైన, నీచమైన నిరంకుశత్వానికి గురిచేస్తాయి.
6. అతని జీవిత కాలాన్నంతా శ్రమ చేసే కాలంగా మారుస్తాయి, అతని భార్యా బిడ్డల్ని, పెట్టుబడి అనే జగన్నాధ రధచక్రాల కిందికి తోసివేస్తాయి.

## సంచయనం వృద్ధీ - కార్మికుని దీన స్థితీ

అదనపు విలువని ఉత్పత్తి చేసే అన్ని పద్ధతులూ, అదే సమయంలో సంచయనం చేసే పద్ధతులు కూడా. సంచయనంలో ప్రతి విస్తరణా, ఆ పద్ధతుల అభివృద్ధికి తిరిగి సాధనాలు అవుతాయి. కాబట్టి పెట్టుబడి సంచయనం జరిగే అనుపాతంలోనే కార్మికుని స్థితి, మరింత దారుణం కాకతప్పదు - అతని వేతనం ఎక్కువైనా, తక్కువైనా జరిగేది మాత్రం అదే. చివరగా, పారిశ్రామిక నిల్వ సైన్యాన్ని సంచయనపు విస్తృతితో, శక్తితో సమతుల్యం చేసే ఈ సూత్రం కార్మికుణ్ణి పెట్టుబడికి కట్టి పడేస్తుంది. తాపడం చేస్తుంది. ఎంత బిగువుగా నంటే, ప్రొమీథస్ (Prometheus) ని బండకు తాపడం చేసిన దానికంటే బిగువుగా. పెట్టుబడి సంచయనానికి తగినట్లు దీనస్థితిని స్థాపిస్తుంది. ఒక ధ్రువాన సంపద సంచయనం అంటే రెండో ధ్రువాన - కార్మిక వర్గం వైపున - అదేసమయంలో దైన్యమూ, కఠిన శ్రమ వల్ల కలిగే వేదనా, బానిసత్వమూ, అజ్ఞానమూ, పాశవికతా, మనోహీనతా సంచయనం అవడమే.

## ఇది పెట్టుబడిదారీ సంచయనం యొక్క విరుద్ధ స్వభావం

రోజురోజుకీ ఒక విషయం స్పష్టం అవుతున్నది: బూర్జువా ఉత్పత్తి సంబంధాలలో చలనాలు సరళంగానూ, ఒకేరకంగానూ ఉండవు; ద్వంద్వస్వభావం కలిగి ఉంటాయి. సంపద ఉత్పత్తయ్యే ఏ బూర్జువా సంబంధాల్లో ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందుతాయో, వాటిలోనే అణచివేతను ఉత్పత్తిచేసే శక్తి కూడా ఉంటుంది. ఆ సంబంధాలు బూర్జువా ఆస్తిని, అంటే బూర్జువా వర్గపు సంపదని ఉత్పత్తి చేస్తాయి. ఎలా? నిరంతరాయంగా పెరిగే కార్మికవర్గాన్ని ఉత్పత్తి చేయడం ద్వారానూ, బూర్జువా వర్గంలోని వ్యష్టి సభ్యుల సంపదని ధ్వంసం చెయ్యడం ద్వారానూ. Poverty of philosophy p.138 (Foreign Languages Book House, Moscow)

# భాగం 8

## ఆదిమ సంచయనం అనేది

## (So-called Primitive accumulation)

# అధ్యాయం 26
# ఆదిమసంచయన రహస్యం

ఈ 26వ అధ్యాయం మొదటి వాక్యంలో ఇప్పటిదాకా చూసిన 1–25 అధ్యాయాల సారాంశం ఉంటుంది:

1. డబ్బు పెట్టుబడిగా ఎలా మార్పు చెందింది?
2. పెట్టుబడి ద్వారా అదనపు విలువ ఎలా ఏర్పడింది?
3. అదనపు విలువ నుండి తిరిగి మరింత పెట్టుబడి ఎలా ఉత్పత్తయింది?

మొదటి విషయాన్ని రెండో భాగం వివరిస్తుంది. పెట్టుబడి అదనపు విలువని ఎలా ఉత్పత్తిచేస్తుందో 3–6 భాగాల్లో ఉంటుంది. ఇక 7 వ భాగం అదనపు విలువ మళ్ళీ మరింత పెట్టుబడిలోకి ఎలా మారుతుందో తేల్చి చెబుతుంది. ఈ 8 వ భాగం పెట్టుబడి దారీ విధానానికి అవసరమైన అంశాల ఆవిర్భావాన్ని పరిశీలిస్తుంది.

ఉదాహరణకి ఉత్పత్తి సాధనాలూ, స్వేచ్ఛా శ్రామికులూ మార్కెట్లో లభ్యమైన తీరుని వివరిస్తుంది.

ఈ అంశాలన్నిటిలోనూ కార్మికవర్గ సృష్టి అత్యంత మౌలిక మైనది. పెట్టుబడి సంచయనం అనేది కేవలం వస్తువులు పోగుపడడమే కాదు, అంతకంతకూ పెరిగే ఒక సామాజిక సంబంధం యొక్క పునరుత్పత్తీ, విస్తరణా కూడా. పెట్టుబడిదారుడి చేతిలో పెట్టుబడి పరిమాణం పెరుగుతుంది; అంతే కాదు, దోపిడీ చేయ్యదగిన జనాభా పెరుగుతుంది; నిరుద్యోగ నిల్వ సైన్యం నుండి ఈ జనాభా సరఫరా అవుతుంది. ఈ సంపుటం చివరి భాగం 'ప్రాథమిక సంచయనం' గురించి. ఇందులో పెట్టుబడిదారీ విధానానికి దారితీసే అంశాల గురించి ఉంటుంది. అవి పెట్టుబడిదారీ విధానానికి చెందినవి కావు. పెట్టుబడిదారీ విధానానికి ముందు చరిత్రకు చెందినవి. అయినా, అవి లేనిదే పెట్టుబడిదారీ విధానం ఏర్పడదు.

## తార్కిక వైరుధ్యం

పెట్టుబడి సంచయనానికి అదనపు విలువ ముందు షరతు. ఎందుకంటే అదనపు విలువ అసలు పెట్టుబడికి కలవడమే సంచయనం. కాబట్టి అదనపు విలువ ముందుగా ఉంటేనే, సంచయనం సాధ్యమవుతుంది. అయితే అదనపు విలువ ఉండాలంటే, ముందు పెట్టుబడిదారీ విధానం ఉనికిలో ఉండాలి. పెట్టుబడిదారీ ఉత్పత్తి ఉండాలంటే, సరుకు ఉత్పత్తి దారుల చేతుల్లో గణనీయమైన పరిమాణంలో పెట్టుబడీ, శ్రమశక్తీ ఉండాలి.

అదనపు విలువ ముందుగా ఉంటేనే గాని, పెట్టుబడి సంచయనం కుదరదు. పెట్టుబడి ముందుగా ఉంటేనే గాని అదనపు విలువ ఏర్పడదు. ఒకదానికొకటి ముందు షరతు. అదుంటేగాని, ఇదుండదు, ఇదుంటేనేగాని అదుండదు. తార్కిక వైరుధ్యం ఏర్పడింది. కాబట్టి

ఇదంతా ఏదో విషవలయంలో తిరుగుతున్నట్లు కనబడుతుంది. దీన్నించి బయట పడాలంటే పెట్టుబడిదారీ సంచయనాని కంటే ముందే ఆదిమ సంచయనం ఒకటి ఉంది అనుకోవాలి. స్మిత్ వెనకటి సంచయనం అన్నది దీన్నే. ఈసంచయనం పెట్టుబడి దారీ విధానపు ఫలితం కాదు, ఆ విధానానికి ఆరంభ స్థానం.

### మొదట్లో వ్యాపార సంస్థల్ని పెట్టడానికి పెట్టుబడి దారులకి డబ్బు ఎక్కడ నుండి వచ్చింది?

### పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు చెప్పే 'కట్టు కథ'

చాలాకాలం వెనక, రెండు తరహాల మనుషులు ఉండే వాళ్ళు; ఒకతరహా వాళ్ళు కష్ట పడేవాళ్ళు, తెలివైన వాళ్ళు, పైగా పొదుపరులు; రెండో తరహా వాళ్ళు సోమరిపోతులు, ఉన్నది ఖర్చు పెట్టే వాళ్ళు, అంతకు మించీ ఖర్చుచేసే వాళ్ళు. కొంతకాలానికి మొదటి తరహా వాళ్ళు సంపద పోగు చేసుకున్నారు. పనిచెయ్యడం ఏనాడో మానుకున్నా, కొద్దిమందికి సంపద ఇబ్బడి ముబ్బడిగా నిరంతరం పెరుగుతున్నది. రెండో తరహా వాళ్ళు ఇప్పటిదాకా శ్రమ చేస్తూనే ఉన్నా, అమ్ముకోడానికి సొంత శరీరమే తప్ప మరేమీ లేదు. ఉన్నది పోగొట్టుకొని, బతుకుదెరువు కోసం రెక్కల కష్టం తప్ప మరేమీ లేనివాళ్ళుగా మిగిలారు. ఇదీ పెట్టుబడిదారీ విధాన సమర్థకుల కట్టు కథ, కాకమ్మ కథ.

మార్క్స్ ఈ కథని తుత్తునియలు చేస్తాడు. ఈ కథని బట్టి కష్టపడేవాళ్ళు సంపన్నులు కావాలి. సోమరులు పేదలు అవాలి. కాని పెట్టుబడిదారీ విధానంలో దీనికి విరుద్ధంగా జరుగుతుంది. ఎప్పుడో పని మానేసిన వాళ్ళు సంపన్నులవుతుండగా, నిరంతరం కష్టం చేసే వాళ్ళు పేదలుగా ఉన్నారు. ఇదే వాళ్ళు చెప్పేకథ **పెట్టుబడిని సమర్థించే కట్టుకథ** అనడానికి నిదర్శనం.

## చరిత్ర చెప్పే యథార్థ గాథ

చరిత్రలో దురాక్రమణా, బానిసీకరణా, దారి దోపిడీ, హత్యా – ఒక్కముక్కలో, బలప్రయోగం పెద్ద పాత్ర పోషించింది. అయితే నైతికతా, శ్రమా – ఇవి రెండే ఎల్లప్పుడూ సంపదకు సాధనాలు – అని పెట్టుబడిదారీ అర్థశాస్త్రం చెబుతుంది, ప్రచారం చేస్తుంది. వాస్తవానికి ఆదిమ సంచయనానికి కారకాలు అర్థశాస్త్రం చెప్పే ధర్మబద్ధ పద్ధతులు కానే కావు. ఉత్పత్తిసాధనాలూ, జీవితావసర వస్తువులూ పెట్టుబడి కానట్లే, డబ్బూ సరుకులూ వాటికవి స్వతహాగా పెట్టుబడికావు. అవి పెట్టుబడిలోకి మార్చబడాలి. అయితే ఈ మార్పు నిర్దిష్ట పరిస్థితుల్లో మాత్రమే జరుగుతుంది. రెండు భిన్న రకాల సరుకులున్న ఓనర్లు ఒకరికొకరు ఎదురు పడాలి; డబ్బూ, ఉత్పత్తి సాధనాలూ, జీవితావసర వస్తువులూ ఉండి, ఇతరుల శ్రమశక్తిని కొని వాటి విలువని పెంచుకోడానికి ఆతృతతో ఉన్న ఓనర్లు ఒకవైపు; స్వేచ్ఛాయుత శ్రామికులు, శ్రమ అమ్మకం దార్లు మరోక వైపు. శ్రమ శక్తిని కొనేవాళ్ళు ఒకవైపు, అమ్మేవాళ్ళు మరొకవైపు.

## శ్రమ శక్తిని సరుకుగా అమ్ముకోవాల్సిన పరిస్థితులు

స్వేచ్ఛాయుత శ్రామికులకు రెండర్థాల్లో స్వేచ్ఛ ఉంటుంది. బానిసల లాగానో, ఫ్యూడల్ దాసుల లాగానో ఉత్పత్తిసాధనాల్లో వాళ్ళు భాగం కారు. సొంత రైతులవైనట్లుగా, ఉత్పత్తి

సాధనాలు వాళ్ళవికావు. కాబట్టి వాళ్ళు సొంత ఉత్పత్తిసాధనాల నుండి స్వేచ్ఛపొందిన వాళ్ళు. అవి లేనివాళ్ళు. మార్కెట్లో రెండు ధ్రువాలుగా – కొనేవాళ్ళూ, అమ్మేవాళ్ళూగా – విడిపోవడంతో, పెట్టుబడిదారీ ఉత్పత్తికి అవసరమైన మౌలిక పరిస్థితులు ఏర్పడ్డాయి. శ్రామికులు తమ శ్రమని సిద్ధింపచెయ్యడానికి కావలసిన సాధనాల నుండి పూర్తిగా వేరుపడాలి. వేరు పడకపోతే అసలు పెట్టుబడిదారీ ఉత్పత్తే మొదలు కాదు. పెట్టుబడిదారీ ఉత్పత్తి మొదలైందంటే, తన కాళ్ళ మీద నిలబడీ నిలబడంగానే, ఈ వేరుపడడాన్ని కొనసాగిస్తుంది. నిరంతరం పెరిగే స్థాయిలో దీన్ని పునరుత్పత్తి చేస్తుంది. ఈ ప్రక్రియ ఒక పక్క, ఉత్పత్తి సాధనాల్నీ, జీవితావసర వస్తువుల్నీ పెట్టుబడిలోకీ, మరొకపక్క ప్రత్యక్ష ఉత్పత్తిదారుల్ని వేతన శ్రామికుల్లోకీ మార్చి వేస్తుంది. కాబట్టి, ఆదిమ సంచయనం అనబడేది, ఉత్పత్తిదారుణ్ణి ఉత్పత్తి సాధనాలనుంచి వేరు పరిచే చారిత్రక క్రమం తప్ప ఇంకొకటి కాదు.

పెట్టుబడిదారీ సమాజపు ఆర్థిక చట్రం భూస్వామ్య సమాజపు ఆర్థిక చట్రం నుంచి పుట్టి పెరిగింది. భూస్వామ్య సమాజం విచ్ఛిన్నమవుతూ, పెట్టుబడిదారీ సమాజపు మౌలిక అంశాల్ని విడుదల చేసింది. ప్రత్యక్ష ఉత్పత్తిదారుడుగా ఉండడం ఆగితేనే, అతను తనను తాను అమ్ముకో గలుగుతాడు. శ్రమశక్తి అమ్మకందారుడుగా అవాలంటే, వృత్తిసంఘాల పట్టునుండి కూడా బయట పడాలి. అప్రెంటిస్‌లకూ, జర్నీమన్‌లకూ ఉన్న నియమాలనుండీ, శ్రమ నిబంధనల అవరోధాలనుండీ, విముక్తుడవాలి. కాబట్టి, ఉత్పత్తి దారుల్ని వేతన శ్రామికులుగా మార్చే చారిత్రక చలనం, ఒకపక్క భూస్వామ్య దోపిడీ నుండీ, గిల్డుల సంకెళ్ళ నుండీ విముక్తి లాగా అగపడుతుంది. బూర్జువా చరిత్రకారులకు ఈ పార్శ్వం మాత్రమే కనబడుతుంది. అయితే మరొకపక్క, విముక్తులైన వాళ్ళు తమ సొంత ఉత్పత్తి సాధనాలూ, పాత భూస్వామ్యం కల్పించిన హామీలూ కొల్లగొట్టబడిన తర్వాత మాత్రమే, తమను తాము అమ్ముకో గలిగారు.

### వాళ్ళ ఆస్తిహరణ చరిత్ర మానవ చరిత్రలో అగ్నిజ్వాలలతోనూ, రక్తధారలతోనూ రాయబడింది

### భూస్వాములమీదా, గిల్డ్ మేస్త్రుల మీదా పెట్టుబడి దారుల విజయం

పారిశ్రామిక పెట్టుబడిదారులు సరికొత్త సర్వాధికారులు, సంపద వనరుల ఆసాములైన చేతివృత్తుల గిల్డ్ మేస్త్రుల్నీ, ఫ్యూడల్ ప్రభువుల్నీ కూడా తొలిగించాల్సివచ్చింది. వాళ్ళు సామాజిక అధికారాన్ని గెలుపొందడం భూస్వాములమీదా, వాళ్ళకి మాత్రమే ఉండే విశిష్ట హక్కులమీదా, గిల్డులమీదా స్వేచ్ఛాయుతంగా ఉత్పత్తి అభివృద్ధి చెందేందుకూ, మనిషిని మనిషి యధేచ్ఛగా దోపిడీ చేసేందుకూ వీలులేకుండా ఆ గిల్డులు వేసిన సంకెళ్ళ (విధించిన నిబంధనల) మీదా వాళ్ళు విజయవంతంగా చేసిన యుద్ధ ఫలితంగా కనబడుతుంది. ఏమైనా, ప్రస్తుత కాలపు పరిశ్రమల వీరులు వాళ్ళకి ఏమాత్రం ప్రమేయంలేని ఘటనల్ని వాడుకొని పాతకాలపు కత్తుల వీరుల్ని తొలిగించ గలిగారు. ఒకప్పుడు విముక్తి పొందిన రోమన్ బానిస ఎంత నీచ పద్ధతులద్వారా తన పోషకునికే యజమానిగా ఎదిగాడో, అంత తుచ్ఛ విధానాల ద్వారా పారిశ్రామికాధిపతులూ పైకి లేచారు.

## పెట్టుబడిదారీ శకం ప్రారంభం

అటు వేతనకార్మికుడూ, ఇటు పెట్టుబడిదారుడూ ఏర్పడి, అభివృద్ధి అవడానికి ఆరంభ స్థానం కార్మికుని దాస్యం. దీని పురోగమనం ఈ దాస్యం మార్పులో ఉంది. భూస్వామ్య దోపిడి పెట్టుబడిదారీ దోపిడిగా పరివర్తన చెందడంలో ఉంది. ఈ గమనాన్ని గ్రహించడానికి మనం చరిత్రలో మరీ వెనక్కి పోనక్కర్లేదు. పెట్టుబడిదారీ విధాన మొదళ్ళు కొన్ని మధ్యధరాప్రాంత పట్టణాల్లో అక్కడక్కడా, చెదురుమదురుగా 14,15 శతాబ్దాల్లో కనిపిస్తాయి. అయితే పెట్టుబడిదారీ శకం మొదలైంది మాత్రం 16 వ శతాబ్దంలోనే. అది కనిపించిన చోటల్లా, అప్పటికే బానిసత్వం రద్దు అమలయి చాలా కాలం అయింది. మధ్యయుగాల అత్యున్నత వికాస ఫలితాలైన సర్వసత్తాక పట్టణాల మనుగడ ఎంతోకాలంగా క్షీణిస్తూ ఉంది. అంటే, **నూతన యుగారంభానికి, పెట్టుబడి దారీ శకం ప్రవేశించడానికి వేళ అయిందన్నమాట.** ఆదిమ సంచయన చరిత్రలో పెట్టుబడిదారీ వర్గం రూపొందే క్రమంలో అన్ని విప్లవాలూ లివర్లుగా పనిచేశాయి. అన్నిటినీ మించి, పెద్దపెద్ద ప్రజా రాసులు అకస్మాత్తుగానూ, బలవంతంగానూ జీవితావసర వస్తువులనుండి విడగొట్టబడి, బంధం లేని స్వేచ్ఛాకార్మికులుగా శ్రమమార్కెట్లోకి నెట్టబడిన తరుణాలు పెట్టుబడిదారీ యుగాన్ని ప్రారంభిస్తాయి. ఈమొత్తం ప్రక్రియకి ప్రాతిపదిక: వ్యవసాయ ఉత్పత్తిదారుడైన రైతు నించి, భూ ఆస్తిని లాక్కోవడమే. అతనిది కాకుండా చెయ్యడమే. ఈ ఆస్తిహరణం చరిత్ర వేర్వేరు దేశాల్లో వేర్వేరుగా ఉంటుంది. ఈ ప్రక్రియ దశల వరస క్రమమూ, పట్టే కాలమూ కూడా భిన్న భిన్నంగా ఉంటాయి. ఒక్క ఇంగ్లండ్‌లో మాత్రమే లాక్షణికరూపంలో ఇది జరిగింది. ఆ దేశాన్నే మనం ఉదాహరణగా తీసుకుందాం.

# అధ్యాయం 27
# వ్యవసాయ దారుల ఆస్తి హరణం

ఇంగ్లండ్‌లో 14 వ శతాబ్దం నాలుగో పాదంలో అర్ధబానిసత్వం (serfdom) అదృశ్యం అయిపోయింది. అప్పుడూ, ఆ తర్వాత 15 వ శతాబ్దంలో అంతకన్నా ఎక్కువగానూ ప్రజల్లో అధికసంఖ్యాకులు స్వతంత్ర రైతులు. వ్యవసాయ వేతన శ్రామికుల్లో, కొంత భాగం రైతులే. ఆ రైతులు కూడా ఖాళీగా ఉన్న కాలంలో పెద్ద ఎస్టేట్లలో కూలి పనికి పోయేవాళ్ళు. కొద్దిమంది మాత్రమే స్వతంత్ర వేతన కార్మికులు ఉండేవాళ్ళు. వీళ్ళు కూడా అదే సమయంలో వ్యవసాయ రైతులే. ఎందుకంటే, వేతనాలకు తోడు వాళ్ళకి 4 ఎకరాలకు కొంచెం మించి సాగుభూమి కేటాయించే వారు. ఉండడానికి గుడిసెలు కూడా ఇచ్చే వాళ్ళు. మిగతా రైతులతో కలిసి ఉమ్మడి భూమిని వాడుకునే హక్కు ఉండేది. అందులోనించి వాళ్ళకి కలపా, వంట కట్టెలూ, వాళ్ళ గొడ్లకి గడ్డీ లభించేవి. ఫ్యూడల్ దాసుడు, కప్పం గట్టే ఓనరే. అయినా తన ఇంటికి ఆనుకొని ఉన్న పొలానికి సొంతదారుడు, ఉమ్మడి భూమిలో భాగస్థుడు కూడా. ఈవిషయం గుర్తుంచుకోవాలి.

## భూస్వామ్య ఉత్పత్తి

అన్ని ఐరోపా దేశాల్లోనూ భూస్వామ్య ఉత్పత్తికి ఉన్న లక్షణం: భూమి సాధ్యమైనంత ఎక్కువమంది సామంతులకు పంపిణీ అయి ఉండేది. ఫ్యూడల్ ప్రభువు బలం, సార్వభౌముని బలం లాగానే, అతని కౌలు మక్తాని బట్టి కాకుండా, సామంతుల సంఖ్యని బట్టి ఉండేది. ఆసామంతుల సంఖ్య, సొంత దార్లైన రైతుల సంఖ్యమీద ఆధారపడి ఉండేది. వీళ్ళు సొంత పొలాల్లో తామే వ్యవసాయం చేసుకొని కొద్దిపాటి ఆదాయంతో తృప్తిగా బతికేవాళ్ళు. అప్పట్లో అలాంటి వాళ్ళు ఇప్పటికంటే ఎక్కువమంది ఉండేవాళ్ళు. 1,60,000 మందికి తగ్గకుండా ఉన్నారు. ఆదాయం సగటున ఏటా 60–70 పౌన్ల మధ్య ఉండేది. ఇతరుల భూమిని సాగు చేసే వాళ్ళకంటే, సొంత భూమిలో సేద్యం చేసినవాళ్ళ సంఖ్యే ఎక్కువ. 17వ శతాబ్దం చివరి మూడో భాగంలో సైతం అయిదింట నాలుగొంతుల మంది ఇలాంటి వ్యవసాయదారులే – అని ఇంగ్లిష్ చరిత్రకారుడు మేకాలే (1800–1859) తన 'ఇంగ్లండ్ చరిత్ర' లో రాశాడు. నార్మన్ ఆక్రమణ (1066) అనంతరం ఇంగ్లండ్ భూమి భారీ భాగాలుగా (బేరనీలుగా) పంపిణీ అయింది. వాటిలో కొన్ని పాత ఆంగ్లో శాక్సన్ ప్రభుఖండాలను 900 దాకా ఇముడ్చుకున్నాయి. అయినప్పటికీ చిన్న చిన్న సొంత రైతు కమతాలే ఫ్యూడల్ ఎస్టేట్ల మధ్య అంతటా చెల్లాచెదరుగా ఉండేవి. అటువంటి పరిస్థితులూ, 15 వ శతాబ్దానికి లాక్షణికమైన పట్టణ వికాసమూ కలిసి, ప్రజలకు సంపదని అనుమతించాయి. అయితే అవి పెట్టుబడిదారీ సంపదకి అవకాశం ఇవ్వలేదు.

## పెట్టుబడిదారీ ఉత్పత్తికి ప్రాతిపదిక – శ్రమ మార్కెట్

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి పునాది వేసిన విప్లవం నాంది 15 వ శతాబ్దం చివరి మూడో భాగంలోనూ, 16 వ శతాబ్దం తొలి పదేళ్ళ లోనూ జరిగింది. ఇళ్ళలో, కోటలో ఉపయోగం లేకుండా ఉన్న అనేకమంది పరిచారకుల్ని తొలిగించారు. వాళ్ళంతా శ్రమ మార్కెట్లో

పడాల్సివచ్చింది. భూమి మీద ప్రభువుకి ఎంత హక్కు ఉందో అంత హక్కు రైతుకీ ఉన్నప్పటికీ, పెద్ద ప్రభువులు భూమి మీద హక్కున్న రైతులని బలవంతంగా భూములనించి గెంటివేశారు. ఉమ్మడి భూముల్ని అక్రమంగా ఆక్రమించారు. ఇందుకు ప్రేరేపించిన పరిస్థితి: ఫ్లెమిష్ (ఫిన్ లాండ్ దేశపు) ఊలు ఉత్పత్తులు వేగంగా అభివృద్ధి చెందాయి. దానికి అనుగుణంగా ఇంగ్లండులో ఊలు ధర పెరిగింది. రైతులని తరిమి వెయ్యడానికి ఈ పరిస్థితి ప్రేరణ నిచ్చింది. పాత ప్రభువులు ఫ్యూడల్ యుద్ధాలలో నశించారు. కొత్త ప్రభువులకి డబ్బే అత్యంత శక్తివంతమైంది.

### పంటపొలాల్ని మేత బీళ్ళుగా మార్చడం

అందువల్ల సాగు భూమిని గొర్రెల మేత భూములుగా మార్చడం కొత్త ప్రభువుల నినాదం. రైతులుండే ఇళ్ళూ, శ్రామికులుండే గుడిసెలూ కూల్చివేయబడ్డాయి. లేదా శిధిలమయ్యేందుకు విడిచి పెట్టబడ్డాయి. ప్రభువుల భవనాలు తప్ప ఇతర ఇళ్ళు లేని పట్టణాలు దర్శనమిస్తున్నాయి. ఇంగ్లండ్‌లో ఇప్పటికంటే తక్కువ మంది జనం ఏనాడూ లేరేమో అనిపిస్తుంది – అని ఇంగ్లిష్ మతాధికారి విలియం హారిసన్ (1534–1593) అన్నాడు. ఇంగ్లిష్ ఆర్థికవేత్త విలియం థార్న్ టన్ (1813–1880) అన్నట్లు ఇంగ్లిష్ కార్మికవర్గం స్వర్ణయుగం నుండి నేరుగా ఇనుపయుగంలో పడింది.

### ఉమ్మడి భూముల ఆక్రమణా – జనక్షీణతా

ఆ కాలంలో (1489) ఉమ్మడి భూముల్ని విరివిగా ఆక్రమించారు. చుట్టూ కంచె వేసిన భూములు (enclosures) మరీ తరచుగా ఏర్పడ్డాయి. అందువల్ల సాగుభూమి పశువుల బీడుగా మార్చబడింది. అంతంత భూముల్ని సాగుచెయ్యడానికి చాలామంది మనుషులు కావాలి. బీళ్ళని కొద్దిమంది కాపరులు చూసుకోగలరు. వాటిని ఎంతకాలం పాటైనా ఇష్టమైనన్నాళ్ళు, జీవితాల పర్యంతమైనా కౌలుకివ్వచ్చు. ఇది జనం తగ్గిపోవడానికీ, చర్చిల ఆదాయమూ, పట్టణాల ఆదాయమూ తగ్గడానికీ కారణమైంది.

### ఫలించని ప్రభుత్వ చట్టాలూ – ప్రజల గోలా

ఇంగ్లిష్ తత్వవేత్త ఫ్రాన్సిస్ బేకన్ (1561–1626) అన్నట్లు రాజూ, పార్లమెంటూ ఆ పరిస్థితుల్లో విజ్ఞత చూపారు. జన క్షీణత కల్గించే భూ ఆక్రమణల్నీ, బీళ్ల ఆక్రమణల్నీ తొలిగించే పని పెట్టుకున్నారు. 1489 లో ఏడవ హెన్రీ చట్టం చేశాడు. 19 నిబంధన, 20 ఎకరాల భూమి ఉన్న వ్యవసాయ గృహాల్ని ధ్వంసం చెయ్యడాన్ని నిషేధించింది. ధాన్యం పండే భూమికీ, పశువుల గడ్డి భూమికీ ఒక నిష్పత్తిని నిర్ణయించింది. 1533లో కొందరికి 24 వేల గొర్రెలున్నాయని అంటూ, 2 వేలకంటే ఎక్కువ గొర్రెలు ఎవ్వరికీ ఉండకూడదు అని ఒక చట్టం వచ్చింది. అయితే ఏడవ హెన్రీ అనంతరం 150 ఏళ్ళ పాటు చేసిన చట్టాలూ, వ్యవసాయదారులు చేసిన ప్రయత్నాలూ నిష్ఫలమయినాయి.

### ప్రజల్ని వేతన జీవులుగా మార్చడం

అయితే పెట్టుబడిదారీ వ్యవస్థ ఆశించింది వేరు: ఇంచుమించు దాస్య స్థితిలో ఉన్న ప్రజలు. వాళ్ళు వేతన జీవులుగా మారడం, వాళ్ళ శ్రమసాధనాలు పెట్టుబడిలోకి మారడం. ఈ పరివర్తన

జరిగిన కాలంలో, శాసనాలు కూడా వ్యవసాయ వేతన శ్రామికుడి గుడిసెకి 4 ఎకరాల భూమి ఉంచే ప్రయత్నం చేశాయి. అతని ఇంట్లో ఎవరినైనా అద్దెకు పెట్టుకోవడాన్ని నిషేధించాయి. 1627 లో ఒకటవ జేంస్ హయాంలో రోజర్ క్రోకర్ 4 ఎకరాల నిబంధనని పాటించనందుకు అభిశంసించ బడ్డాడు. 1638 లో ఈ చట్టం అమలుకొసం ఒక రాయల్ కమిషన్ ఏర్పాటు చేయబడింది. క్రాంవెల్ కాలంలో (1653–1658) సైతం లండన్ కి నాలుగు మైళ్ల లోపల 4 ఎకరాల భూమి లేకుండా ఇల్లుకట్టడం నిషేధించబడింది. 18 వ శతాబ్దం మొదటి అర్ధభాగంలో కూడా పక్కనే ఒకటి రెండెకరాల భూమి లేని గుడిసెల మీద ఫిర్యాదులుండేవి. ఇవ్వాళ దాని పక్కన చిన్న తోట ఉన్నా, లేక గుడిసెకి దూరంగానైనా కొన్ని పావు ఎకరాల భూమి ఉన్నా అదృష్టవంతుడే. హంటర్ ఇలా అంటాడు: ఇక్కడ భూస్వాములూ, శ్రామికులూ ఒకరి సరసన ఒకరు పనిచేస్తారు. గుడిసెకుండే కొద్ది ఎకరాలు శ్రామికుల్ని ఎంతో స్వతంత్రుల్ని చేస్తాయి.

## మత సంస్కరణోద్యమం – చర్చి ఆస్తి ధ్వంసం

16 వ శతాబ్దంలో మత సంస్కరణోద్యమం (Reformation) జరిగింది. దాని మూలంగా చర్చి ఆస్తి ధ్వంసం అయింది. అది ప్రజల ఆస్తి హరణానికి పెద్ద ప్రేరణ ఇచ్చింది. ఆ ఉద్యమం జరిగిన కాలంలో కాథలిక్ చర్చి ఇంగ్లండ్ భూమిలో భారీ భాగానికి సొంతదారుగా ఉంది. ఆశ్రమాలూ, మఠాలూ వగయిరాల అణచివేత, వాటిలో నివాసమున్న వాళ్ళని కార్మికవర్గంలోకి నెట్టివేసింది. చర్చి ఎస్టేట్లు అత్యాశతో ఉన్న రాజాభిమానులకు ఉచితంగా ఇవ్వబడ్డాయి. లేకపోతే, వంశపారంపర్య కౌలు దార్లని మూకుమ్మడిగా తరిమి కొట్టి, వాళ్ళ కమతాలను ఏకం చేసిన వాళ్ళకి కారుచౌకగా కట్టబెట్టబడింది. చర్చికి లభించే టితీ పన్నులో చట్టరీత్యా పేద ప్రజలకి రావాల్సిన భాగం చెప్పాపెట్టకుండానే లాక్కోబడింది. ఇంగ్లండ్ అంతటా పర్యటించాక ఎలిజబెత్ అంతటా పేదవాళ్ళు ఉన్నారు అని వాపోయింది. అధికారికంగా పేదల సహాయార్థం పన్ను వేస్తూ 1601లో చట్టం తెచ్చింది. దాంతో ఇంగ్లిష్ జాతి బుక్కాపకీరుతనాన్ని గుర్తించక తప్పలేదు. మొదటి చార్లెస్ ఈ పన్నుని శాశ్వతం చేశాడు. ఇంగ్లిష్ ఆర్థికవేత్త ప్రొఫెసర్ రోజర్స్ (1823–1890) అన్నట్లు మతసంస్కరణోద్యమం ప్రజా బాహుళ్యాన్ని బుక్కా పకీర్లని చేసింది. 17వ శతాబ్దం చివరి దశాబ్దంలో సైతం స్వతంత్ర రైతువర్గం ఫ్యూడల్ రైతువర్గం కంటే ఎక్కువ. క్రాంవెల్ బలానికి వెన్నుదన్ను వాళ్ళే. వాళ్ళు 1750 కల్లా పత్తా లేకుండా పోయారు. అదేవిధంగా 18వ శతాబ్దం తుది దశాబ్దంలో వ్యవసాయ కార్మికుని ఉమ్మడిభూమి, ఆఖరి ఆనవాలైనా లేకుండా అదృశ్యమైంది. వ్యవసాయ విప్లవపు స్వచ్ఛ ఆర్థిక కారణాల్ని ఒక పక్కన పెడదాం. ప్రయోగించబడిన బలవంతపు సాధనాల్ని మాత్రమే చూద్దాం.

**బలవంతపు సాధనాలు.** స్టువర్ట్ వంశం 1660 లో తిరిగి అధికారం లోకొచ్చింది.. అప్పటిదాకా ఖండం అంతటా చట్టబద్ధత లేకుండా భూకామందులు భూములు ఆక్రమించేవారు. ఇక అప్పటినుండీ చట్టబద్ధ విధానాల ద్వారా ఆక్రమణలు సాగించారు. భూస్వాముల నుండి రైతులు భూమి పొందే హక్కుని (the feudal tenure of land) రద్దుచేశారు. అంటే రాజ్యం పట్ల వాళ్లకున్న బాధ్యతలన్నిటినీ వదిలించుకున్నారు. ఫలితంగా రాజ్యానికి కలిగిన నష్టాన్ని రైతులమీదా, ప్రజలమీదా పన్నులతో పరిహరించారు. ఫ్యూడల్ హక్కు మాత్రమే కలిగివున్న ఎస్టేట్ల మీద

ఆధునిక సొంత ఆస్తి హక్కుని వాళ్ళకి వాళ్ళే స్థాపించుకున్నారు. 1688 మహా విప్లవం (Glorious Revolution) మూడవ విలియంకి అధికారం కట్టబెట్టింది.. భూయజమానినీ, అదనపు విలువని స్వాధీన పరుచుకునే పెట్టుబడిదారుణ్ణి కూడా తెచ్చింది. అప్పటిదాకా ప్రభుత్వభూముల్ని కొద్ది స్థాయిలో అపహరించేవాళ్ళు. అప్పటినించీ భారీ స్థాయిలో ఈ అపహరణలు సాగించి కొత్త యుగాన్ని ఆవిష్కరించారు. ఆ ఎస్టేట్లని ఉచితంగా ఇచ్చేవాళ్ళు; లేక, కారుచౌకగా అమ్మేవాళ్ళు, ఆక్రమించి ఎస్టేట్లలో కలుపుకునే వాళ్ళు. చట్టం పట్ల ఏమాత్రం మట్టు మర్యాదలు లేకుండా ఇదంతా జరిగింది. మోసంతో సొంతం చేసుకున్న రాజమాన్యాలూ (crown lands), అపహరించబడిన చర్చి ఎస్టేట్లూ, రెండూ కలిసి ప్రస్తుత రాజుల సొంత భూములకు పునాది అయినాయి. ఈ చర్యకి బూర్జువా పెట్టుబడిదారులు అనుకూలంగా వ్యవహరించారు. వాళ్ళ ముఖ్య ఉద్దేశ్యాలు :

1. భూమిని స్వేచ్ఛా వర్తకానికి సరుకుగా చెయ్యడం
2. పెద్దపెద్ద వ్యవసాయ క్షేత్రాలలో ఆధునిక సేద్యాన్ని విస్తరింపచెయ్యడం
3. స్వతంత్ర వ్యవసాయ కార్మికులు అందుబాటులో ఉండేవిధంగా వాళ్ళ సరఫరా పెంచడం

దీనికి తోడు బడా బాంకర్లకీ, కొత్తగా ఏర్పడ్డ ద్రవ్యనిర్వాహకులకీ, రక్షణసుంకాల మీద ఆధారపడ్డ పెద్ద కార్ఖానా యజమానులకీ, కొత్త భూకామందుల వర్గం పొత్తుదారుగా ఉంది. ఇంగ్లాండ్ బూర్జువాలు వాళ్ల ప్రయోజనాలు వాళ్ళు చూసుకున్నారు. ఇది 1604 నించీ, 10వ చార్లెస్, 11వ చార్లెస్‌ల పాలనలో జరిగింది.

## ప్రజల ఆస్తిహరణ చట్టాలు

ఉమ్మడి ఆస్తి ఆక్రమణ సాగుభూమిని పశువుల బీళ్ళుగా మార్చడంతో కలిసి ఉంది. ఇది 15వ శతాబ్దంలో మొదలై 16వ శతాబ్దంలోకి చొచ్చుకుపోయింది. అయితే అప్పట్లో అది వ్యష్టి దౌర్జన్యం ద్వారా సాగింది. ఆ చర్యలకు వ్యతిరేకంగా శాసనాలు 150 ఏళ్ళపాటు పోరాడాయి, కాని ప్రయోజనం లేకపోయింది. చట్టాలు నిరర్థకమయ్యాయి. 18వ శతాబ్దంలో పురోగమనం ఏమంటే: ప్రజలభూములు కాజెయ్యడానికి చట్టాలే సాధనాలయ్యాయి. ఉమ్మడి భూముల ఆక్రమణ కోసం చట్టాలొచ్చాయి. ప్రజలభూముల్ని భూకామందులు తమకు తాము మంజూరు చేసుకున్నారు. వెనకటి స్వతంత్ర రైతులు అంతరించారు. వాళ్ళ స్థానంలో వార్షిక కౌలుకి సాగుచేసే సన్నకారు రైతులు వచ్చారు.

వాళ్ళు భూకామందుల ఇష్టానిష్టాల మీద ఆధారపడ్డారు. కాగా ప్రభుత్వ భూముల అపహరణకు తోడు ఉమ్మడి భూముల దోపిడీ కలిసి, సువిశాల వ్యవసాయ క్షేత్రాలూ, వర్తక క్షేత్రాలూ ఏర్పడడానికి తోడ్పడ్డాయి. వాటిని 18 వ శతాబ్దంలో పెట్టుబడిదారీ క్షేత్రాలనీ, వర్తక క్షేత్రాలనీ అనేవారు. అదేవిధంగా వ్యవసాయ శ్రామికుల్ని, తయారీ పరిశ్రమకి కావలసిన కార్మికులుగా, విడుదల చెయ్యడానికి దోహదం చేశాయి. అప్పట్లో ఉమ్మడి భూముల ఆక్రమణలకి వ్యతిరేకంగా వాదనలు నడిచాయి.

## ఆ నాటి పరిస్థితుల్ని తెలిపే కొన్ని వాస్తవాలు:

1. హర్ట్ ఫర్డ్ షైర్ కౌంటీ లోని పలు పారిష్‌లలో (చర్చిని చుట్టుకొని ఉన్న ప్రాంతాలు) సగటున 50 నుండి 150 ఎకరాల దాకా ఉన్న 24 క్షేత్రాలు 3 క్షేత్రాలుగా కలపబడ్డాయి- అని థామస్ రైట్ కోపంతో రాశాడు.
2. నార్థాంప్టన్ షైర్, లైసెష్టర్ షైర్ లలోనూ ఉమ్మడి భూములు భారీ స్థాయిలో కంచెభూములుగా ఆక్రమించబడ్డాయి. వాటిలో అత్యధికభాగం పశువుల గడ్డి బీళ్ళుగా మార్చబడ్డాయి. దీని ఫలితం ఏమిటంటే: అంతకుముందు 1500 ఎకరాలు సాగవుతుండే భూమి, ఇప్పుడు 50 ఎకరాలైనా సాగవడం లేదు. శిధిలమై పోయిన ఇళ్ళూ, గిడ్డంగులూ, గుర్రపుశాలలూ - ఇవే అప్పట్లో ప్రజలు నివశించారు అనడానికి ఆనవాళ్ళు. మునుపు 100 ఇళ్ళూ, కుటుంబాలూ ఉన్న కొన్ని గ్రామాల్లో, ఇప్పుడు ఎనిమిదో పదో మిగిలి ఉన్నాయి.

గతంలో 20, 30 మంది రైతుల చేతుల్లోనూ, ఇంకొక 20, 30 మంది చిన్న కౌలుదార్ల, సొంతదార్ల చేతుల్లోనూ ఉన్న భూమి ఇప్పుడు నలుగురైదుగురి చేతుల్లో ఉండడం మామూలైంది. అందువల్ల ఆ రైతులూ, కౌలుదార్లూ, వాళ్లమీద ఆధారపడి జీవించేవాళ్ళూ అందరూ జీవితావసరాలకు దూరమై పోయారు అని ఇంగ్లిష్ మతబోధకుడు స్టీఫెన్ అడింగ్ టన్ (1729-1796) చెప్పాడు Inquiry into the Reasons for or against Enclosing Open Fields, London, 1772.

ఈ ఆక్రమణలు పెద్ద భూముల్ని మరింత పెద్దవి చేస్తాయనీ, బీదల జీవనాధారాల్ని కొంత తగ్గిస్తాయనీ, వాళ్ళకి కష్టాలు కలిగిస్తాయనీ ఆక్రమణలకి అనుకూలురైన వాళ్ళు సైతం అంగీకరించారు. డాక్టర్ ప్రైస్ మాటలు విందాం: బహుశా కార్మికులు ఎక్కువమంది అవుతారు. మరింతమంది పనులకొసం రావడం వల్ల పట్టణాలూ, కార్ఖానాలూ పెరుగుతాయి. భూముల విలీనం పనిచేసే పద్ధతి సహజంగా ఇదే. ఎన్నో ఏళ్ళుగా ఈ రాజ్యంలో వాస్తవంగా సాగుతున్నదీ ఇదే. కంచె భూముల ప్రభావం ఏమిటో డాక్టర్ ప్రైస్ చెప్పాడు: మొత్తం మీద దిగువ స్థాయి మనుషుల స్థితిగతులు దాదాపు అన్ని విషయాల్లోనూ దిగజారిపోయాయి. కొద్ది భూమి అయినా ఉన్నవాళ్ళు, ఇప్పుడు దిన కూలీలు అయ్యారు. ఆపరిస్థితిలో వాళ్ళకి బతుకుదెరువు కష్టతరం అయింది. ఈడెన్ ప్రకారం కూడా 1765-1780 మధ్య కాలంలో వాళ్ళ వేతనాలు కనీస స్థాయికన్నా దిగువకి పడిపోవడం ప్రారంభం అయింది. పేదలకి ప్రభుత్వం ఇచ్చే సహాయాన్ని కలుపు కోవాల్సి వచ్చింది. వాళ్ళ వేతనాలు పరమ జీవితావసరాలకి మించవు.

## ప్రజలకి నష్టపరిహారం శూన్యం

19 వ శతాబ్దంలో ఉమ్మడి భూమితో వ్యవసాయ శ్రామికునికి ఒకప్పుడూ సంబంధం ఉన్నదన్న జ్ఞాపకమే లేకుండా పోయింది. ఇటీవలి కాలాన్ని పక్కనబెట్టినా, 1801-1830 మధ్య కాలంలో వ్యవసాయ ప్రజల నుండి 3,511,770 ఎకరాల భూమి అపహరించబడింది. అదంతా పార్లమెంటరీ పన్నాగాల ద్వారా భూస్వాముల పాలయింది. అయితే ఆ ప్రజలకి ఆ భూమికిగాను పరిహారంగా ఒక్క చిల్లిగవ్వయినా ముట్టిందా? అంటే ముట్టలేదు.

## ఎస్టేట్ల ప్రక్షాళన – ఆస్తిహరణపు ఆఖరిఘట్టం

వ్యవసాయ ప్రజల ఆస్తిహరణపు అంతిమ ప్రక్రియ 'ఎస్టేట్ల ప్రక్షాళన' – అంటే వాళ్ళని ఎస్టేట్లనుండి ఊడ్చి అవతల బడెయ్యడం. ఇంతదాకా చూసిన అన్ని పద్ధతులకీ ఇదే పరాకాష్ఠ. వెళ్ళగొట్టాల్సిన స్వతంత్ర రైతులు లేనిచోట గుడిసెల తొలిగింపు మొదలవుతుంది. ఇక సాగుచేసుకున్న భూమిమీద వాళ్ళకి ఉండడానికి కావలసిన చోటు ఉండదు. ఈ ప్రక్రియ స్కాట్లండ్ పీఠభూముల్లో క్రమపద్ధతిలో, భారీ స్థాయిలో జరిగింది. ఐర్లండ్‌లో అనేక గ్రామాల్ని ఒకే దెబ్బతో ఊడ్చి వేశారు. స్కాట్లండ్‌లో భూకామందులు జర్మన్ సంస్థానాలంత పెద్దపెద్ద ప్రాంతాల్ని ప్రక్షాళన చేసే వరకూ పోయారు. 18వ శతాబ్దంలో గెంటి వేయబడ్డ స్కాట్లండ్ కెల్టు తెగవాళ్ళని ఇతర దేశాలకు వెళ్ళనివ్వలేదు. వాళ్ళని గ్లాస్కో వంటి పారిశ్రామిక పట్టణాలకు బలవంతంగా తరమడం కోసమే ఈ నిషేధం. 1860లో దొంగ సాకులతో వాళ్ళని కెనడాకు పంపించారు. వాళ్ళలో కొందరు కొండల్లోకీ, పక్క ద్వీపాల్లోకీ పారిపోయారు. పోలీసులు వాళ్ళని తరిమారు. అయినా దెబ్బలాడి తప్పించుకున్నారు.

## సదర్లండ్ డచెస్ ప్రక్షాళనా పద్ధతి – కెల్టు తెగవాళ్లమీద సైన్యం దౌర్జన్యం

పోతే 19 వ శతాబ్దంలో పద్ధతికి సదర్లండ్ డచెస్ ప్రక్షాళనా పద్ధతిని ఉదాహరిస్తే సరిపోతుంది. ఆమెకి అర్థశాస్త్రం చక్కగా తెలుసు. వచ్చీ రాగానే తీవ్రమైన చికిత్స మొదలెట్టింది. మొత్తం దేశాన్ని గొర్రెల బీడు చెయ్యడానికి పూనుకుంది. అప్పటికే వెనకటి పద్ధతులవల్ల జనాభా 15,000 కి పడిపోయి ఉంది. 1814–1820 కాలంలో ఈ 15,000 మంది (సుమారు 3 వేల కుటుంబాలు) ఒక పద్ధతి ప్రకారం వేటాడబడి, వెళ్ళగొట్ట బడ్డారు. వాళ్ళ ఊళ్ళు ధ్వంసం చెయ్యబడ్డాయి. దహనం చెయ్యబడ్డాయి. పొలాలు పచ్చిక బీళ్ళుగా మార్చ బడ్డాయి. వాళ్లని ఖాళీ చేయించడంలో బ్రిటిష్ సైనికులు బలప్రయోగం చేశారు. కొట్లాడారు. ఖాళీ చెయ్యనన్న ఒక ముదుసలి మహిళని గుడిసెతో పాటు తగలబెట్టారు. ఎప్పటినుంచో ఆ తెగకి చెందిన 7,94,000 ఎకరాల భూమిని ఆ డచెస్ ఆక్రమించింది. వెళ్ళగొట్టబడ్డ వాళ్ళకి కుటుంబానికి 2 ఎకరాల చొప్పున 3000 కుటుంబాలకి సముద్రతీరంలో 6000 ఎకరాలు ఇచ్చింది. ఆ 6000 ఎకరాలూ ఇప్పటి వరకూ (1867 దాకా) సాగుచెయ్యకుండా వృధాగా పడి ఉంది. ఓనర్లకి పైసా ఆదాయం వచ్చింది లేదు. పోతే తన కుటుంబంకొసం శతాబ్దాల తరబడి రక్తమోడ్చిన ఆ తెగ ప్రజలకి ఆమె ఉదారంగా ఈ బీళ్ళని ఎకరా 2 షిల్లింగుల 6 పెన్నీలకు కౌలుకిచ్చి కరుణ చూపించింది. ఆ తెగనుండి కొల్లగొట్టిన మొత్తం భూమిని 29 పెద్దపెద్ద మేత బీళ్ళుగా విడగొట్టింది. ఒక్కొక్క పెద్ద బీడుకి ఒక్కొక్క కుటుంబం మాత్రమే ఉండేది. వాళ్ళలో ఎక్కువమంది దిగుమతయిన ఇంగ్లండ్ నుండి తెచ్చుకున్న వ్యవసాయ జీతగాళ్ళే. 1835 లో ఈ 15 వేల మంది గేలు తెగ వాళ్ళ స్థానంలో 1,31,000 గొర్రెలని పెట్టారు. సముద్ర ప్రాంతానికి నెట్టబడి, మిగిలి ఉన్న ఆదివాసులు చేపలు పట్టుకొని బతకాలని ప్రయత్నించారు. వాళ్ళు ఉభయచరులయ్యారు. సగం నేలమీదా, సగం నీటిమీదా బతికారు. రెంటిమీదా కలిసినా సగం బతుకు మాత్రమే బతికారు. వాళ్ళు ఇంకొంత పరిహారం కట్టాల్సొచ్చింది. వాళ్ళు పట్టే చేపల వాసన, తెగ పెద్దల ముక్కుపుటాల కెక్కింది. అందులో కూడా కొంత లాభం ఉందని పసిగట్టారు.

అంతే, ఆ సముద్రతీరాన్ని లండన్‌కి చెందిన బడా చేపలవ్యాపారులకి కౌలుకిచ్చారు. ఆ జనానికి ఆ ఆసరా అయినా లేకుండా పోయింది. దాంతో వాళ్ళు రెండో సారి వెళ్ళగొట్టబడ్డారు.

## గొర్రెల గడ్డి బీళ్ళని జింకల వనాలుగా మార్చడం

అయితే అంతిమంగా, కొన్ని గొర్రెల గడ్డి బీళ్ళు, జింకల వనాలుగా మార్చబడ్డాయి. ఇంగ్లండ్‌లో నిజమైన అడవులంటూ లేవనేది తెలిసిన సంగతే. పెద్దల పార్కుల్లో ఉండే జింకలు పెంపుడు పశువులు. అందువల్ల పెద్దల కోర్కెకి స్కాట్లండ్ ఆఖరి ఆశ్రయం అయింది. మిట్టభూముల్లో పుట్టగొడుగుల్లాగా అడవులు వెలుస్తున్నాయని 1848 లో రాబర్ట్ స్కాటిష్ జర్నలిస్ట్ రాబర్ట్ సోమర్స్ (1822–1891) రాశాడు. ఇంకా ఇలా అంటాడు: గేలుల భూముల్లో, గొర్రెల్ని పెట్టినప్పుడు, ఆ సన్నకారు రైతులు మరీ కరుకైన, నిస్సారమైన ప్రదేశాలకు తరమబడ్డారు. ఇప్పుడు గొర్రెల స్థానంలో జింకల్ని పెట్టారు. అవి మరొకమారు గేలుల్ని ఇంకా నిస్సారమైన ప్రాంతాల్లోకీ, కటిక దారిద్ర్యంలోకీ తరిమి వేశాయి. జింకల అడవులూ, జనమూ కలిసి ఉండడం వీలుకాదు. రెంటిలో ఏదో ఒకటి లొంగి పోక తప్పదు. పోయిన పాతికేళ్ళలో లాగే వచ్చే పాతికేళ్ళలో కూడా ఈ అడవుల సంఖ్యా, విస్తీర్ణమూ పెరిగినట్లయితే, గేలులు వాళ్ళ పుట్టినగడ్డ మీదే అంతరిస్తారు... ఈ మిట్టభూముల ఓనర్లలో కొందరికి ఆశ, కొందరికి క్రీడాభిలాష ..మరికొందరు కార్యవాదులకు లాభాపేక్ష. గొర్రెల వర్తకంలో కంటే ఇందులో లాభం ఎక్కువ. అందువల్ల జింకలకి విశాల ప్రదేశాలు లభించాయి, కాని మనుషులు అంతకంతకూ ఇరుకవుతున్న చోట్ల వేటాడబడుతున్నారు. ప్రజల్ని ఖాళీ చేయించడమూ, చెదరగొట్టడమూ ఒక నియమంగా, వ్యవసాయ అవసరంగా యజమానులు అమలుపరిచారు. అమెరికాలో, ఆస్ట్రేలియాలో బంజరు భూములనుండి చెట్లనీ చేమల్నీ ఎలా లేకుండా చేశారో అలాగే. ఈ మొత్తం చర్య చడీ చప్పుడూ లేకుండా నిశ్శబ్దంగా, వ్యాపార సరళిలో జరిగిపోతున్నది – Letters from the Highlands: or the Famine of 1847. London, 1848. చర్చి ఆస్తుల్ని అపహరించడమూ, రాజ్య భూముల్ని మోసపూరితంగా అన్యాక్రాంతం చెయ్యడమూ, ఉమ్మడి భూముల్ని ఆక్రమించడమూ, ఫ్యూడల్ ఆస్తినీ, తెగల ఆస్తినీ హరించడమూ, నిర్లక్ష్య భీభత్స పరిస్థితులు కల్పించి ఆ ఆస్తిని ఆధునిక వ్యక్తిగత ఆస్తిగా పరివర్తన చెయ్యడమూ – ఇవి ఆదిమసంచయనానికి ప్రయోగించిన పద్ధతుల్లో కొన్ని.

ఇవే పెట్టుబడిదారీ వ్యవసాయానికి భూముల్ని జయించాయి

ఇవే నేలని పెట్టుబడిలో భాగం చేశాయి

ఇవే పట్టణ పరిశ్రమలకి అవసరమైన స్వేచ్ఛాయుత, బహిష్కృత

కార్మికవర్గాన్ని సరఫరా చేశాయి

## అధ్యాయం 28

# పార్లమెంట్ కర్కశ చట్టాల ద్వారా వేతనాల తగ్గింపు

ఫ్యూడల్ సేవక బృందాల్ని తగ్గించినందువల్లా, ప్రజల్ని వెళ్ళగొట్టి భూముల్ని బలవంతంగా ఆక్రమించు కున్నందువల్లా, కార్మికవర్గం ఏర్పడింది. అయితే వాళ్ళు బయటకు నెట్టబడ్డంత వేగంగా అప్పుడప్పుడే పుట్టుకొస్తున్న పెట్టుబడిదారులు వాళ్ళందరినీ కార్ఖానాల్లో పెట్టుకునే పరిస్థితి లేదు. మరొకపక్క, అలవాటుపడ్డ జీవితం నుంచి హఠాత్తుగా గెంటబడ్డ వాళ్ళు అంత తొందరగా కొత్త పరిస్థితికి తగినట్లు మారలేక పోయారు. ఆ పరిస్థితుల్లో వాళ్ళు బిచ్చగాళ్ళుగా, దొంగలుగా, దిమ్మరులుగా తయారయ్యారు – కొంత ఇష్టపడీ, అత్యధిక సందర్భాలలో పరిస్థితుల ఒత్తిడి వల్లా, అలా అయ్యారు. కనుక 15 వ శతాబ్దం చివరా, 16 వ శతాబ్దం అంతా, పశ్చిమ ఐరోపా అంతటా దేశ దిమ్మరితనానికి వ్యతిరేకంగా చట్టాలు వచ్చాయి. నేటి కార్మిక వర్గ పూర్వీకులు దేశదిమ్మరులుగానూ, కటిక దరిద్రులుగానూ బలవంతంగా మార్చబడ్డందుకే శిక్షలు అనుభవించారు. చట్టం వాళ్ళని ఐచ్ఛిక నేరగాళ్ళుగా (కావాలని నేరంచేసేవాళ్ళుగా) పరిగణించింది. పాత పరిస్థితుల్లో పనిచేసే అవకాశం ఉందనీ, చెయ్యడం చెయ్యకపోవడం వాళ్ళ ఇష్టం మీద ఆధారపడి ఉంటుందని అనుకుంది. అయితే ఆ పాత పరిస్థితులు అప్పుడు లేవు. ఇంగ్లండ్ లో ఈ చట్టాలు 7వ హెన్రీ కాలంలో మొదలయ్యాయి.

### కర్కశ చట్టాలు

**8వ హెన్రీ:** 1530లో పనిచెయ్యలేని, ముసలివాళ్ళైన బిచ్చగాళ్ళు, బిచ్చగాళ్ల లైసెన్స్ పొందారు. మరొకపక్క సత్తా ఉన్న దిమ్మరులకు కొరడా దెబ్బలూ, జైలూ. వాళ్ళని బండి వెనక కట్టి, నెత్తురు కారేదాకా కొరడాలతో కొట్టాలి. వాళ్ళ సొంత ఊళ్ళకో, గడచిన మూడేళ్ళూ పనిచేసిన చోటుకో తిరిగివెళ్ళి పని చేసుకుంటాం అని ప్రమాణం చెయ్యాలి. రెండో సారి అరెస్టయితే, మళ్ళీ కొరడా దెబ్బలు కొట్టి సగం చెవి కత్తిరించాలి. మూడోసారి అరెస్టయితే, నలుగురి క్షేమానికి శత్రువుగానూ, కరుడు కట్టిన నేరగాడుగానూ తీర్మానించి ఉరితియ్యాలి.

**6వ ఎడ్వర్డ్:** వచ్చిన 1547 లోనే ఒక చట్టం తెచ్చాడు. దాని ప్రకారం పని చెయ్యనంటే, అతను సోమరిపోతు అని ఫిర్యాదు చేసినవానికి, అతను బానిసగా ఉండాలి. అతనికి తిండానికి బ్రెడ్డూ, నీళ్ళూ, పల్చని గంజీ, తీసేసిన మాంసమూ పెట్టాలి. ఎంత అసహ్యకరమైన పనినైనా సరే, కొరడా దెబ్బలు కొట్టీ, గొలుసులతో కట్టీ బలవంతంగా చేయించుకునే హక్కు ఉంటుంది. బానిస 15 రోజులపాటు పనిలోకి రాకపోతే, జీవితపర్యంత బానిసగా చేసి నుదుటి మీదనో వీపుమీదనో S గుర్తు వాత పెట్టాలి.

అతను మూడుసార్లు పారిపోతే తీవ్ర నేరగాడుగా, ద్రోహిగా నిర్ణయించి ఉరితియ్యాలి. అటువంటి వాళ్ళ గురించి తెలిస్తే, న్యాయాధికారులు వాళ్ళకోసం వేటాడి పట్టుకోవాలి. 3 రోజులపాటు దేశదిమ్మరి (vagabond)గా తిరుగుతుంటే, అతని పుట్టిన ఊరికి తీసికెళ్ళి ఎర్రగా కాలిన ఇనుంతో చాతీ మీద V అక్షరం వాత పెట్టాలి. సంకెళ్ళువేసి బజార్లలోనో,

మరొక పనిస్థలంలోనో పని చేయించాలి. బానిస మెడకో, చేతులకో కాళ్ళకో ఇనప కడియం వేసే హక్కు యజమానికి ఉంటుంది.

**ఎలిజబెత్** 1572**:** 14 ఏళ్ళ వయసు దాటి, లైసెన్స్ లేని బిచ్చగాళ్ళని తీవ్రంగా కొరడాతో కొట్టాలి. వాళ్ళని ఎవరైనా రెండేళ్ళ పాటు పనికి పెట్టుకుంటే సరే, లేకుంటే ఎడమ చెవిమీద వాత వెయ్యాలి. 18 ఏళ్ళు నిండి, రెండోసారి అదే తప్పు చేస్తే, ( లైసెన్స్ లేకపోతే) రెండేళ్ళపాటు పనికి పెట్టుకునే వాళ్ళు ఎవ్వరూ లేకపోతే, అలాంటి వాళ్ళని ఉరితియ్యాలి. ఇక మూడో సారి అదే తప్పు చేస్తే, ద్రోహులుగా నిర్ణయించి నిర్దాక్షిణ్యంగా ఉరి తియ్యడమే.

## ఆనాటి పరిస్థితి గురించి ఇంగ్లిష్ తత్వవేత్త థామస్ మోర్ (1478–1535)

ఇక్కడ ఫుట్ నోట్ ఉంది. ఆనాటి పరిస్థితి గురించి థామస్ మోర్ చెప్పిన విషయం అందులో ఉంది– ఒక దురాశా పరుడు వేలకువేల ఎకరాల భూముల్ని ఏకం చేసి చుట్టూ కంచె వేసుకోవచ్చు. కౌలు రైతుల్ని ఖాళీ చేయించవచ్చు. వాళ్ళకి వెళ్ళడానికి అలవాటైన చోట, తెలిసినచోట ఎక్కడా నీడ దొరకదు. ఇక ఇళ్ళూ వాకిళ్ళూ వదిలి తలిదండ్రులతో, భార్యా బిడ్డలతో దూరప్రాంతాలకు వెళ్ళక తప్పదు. వాళ్ళకుండే కొద్దిపాటి వస్తువుల్ని అకస్మాత్తుగా అమ్ముకోవాలి, కనక కారుచౌకగా అమ్మెయ్యాల్సి వస్తుంది. వచ్చిన ఆ కొద్ది డబ్బు ఒకచోటు నుంచి మరొకచోటుకి తిరగడంలో ఖర్చవుతుంది. ఇక వాళ్ళకి మిగిలేది అడుక్కోవడమూ, ఉరికంబం ఎక్కడమూ లేదా తిరుగుతూ బిచ్చమెత్తడం. పని చేస్తామన్నా ఇచ్చేవాళ్ళు లేక బిచ్చమెత్తుతారు. అయితే అప్పుడు కూడా పనిచెయ్యకుండా తిరుగుతున్న దేశ దిమ్మరులంటూ జైల్లో వేస్తారు.

**ఉరితీతలు.** థామస్ మోర్ తన 'ఊహాస్వర్గం' లో రాసినట్లు పని దొరకదు కనక, దొంగతనం చెయ్యక తప్పదు.

8 వ హెన్రీ పాలనాకాలంలో (1509–1547) 72,000 మంది చిన్నా పెద్దా దొంగలు ఉరితీయబడ్డారు (Holinshed, Description of England, Vol. 1, p.186.) ఎలిజబెత్ ఆనందమయ పాలనలో మూడు నాలుగు వందలమంది ఇలాంటి వాళ్ళని ఉరి తియ్యని సంవత్సరం ఒక్కటీ లేదు – అని ఇంగ్లిష్ మతాధిపతి, చరిత్రకారుడు జాన్ స్ట్రైప్ (1643–1737) రాశాడు. అతని ప్రకారం సామర్సెట్ షైర్ లో ఒక సంవత్సరంలో 40 మందికి ఉరి పడింది, 35 మందికి వాతలు పడ్డాయి. 37 మందికి కోరడా దెబ్బలు తగిలాయి. ఇతర కౌంటీల లోనూ పరిస్థితి మెరుగేమీ కాదు. కొన్ని చోట్లయితే ఇంకా అధ్వాన్నంగా ఉంది.

**1వ జెమ్స్** పాలనాకాలంలో(1603–1625) పని చెయ్యకుండా అడుక్కుంటూ తిరిగే వాళ్ళని, పనికిమాలిన పోకిరులుగా, దిమ్మరులుగా ప్రకటించి, బహిరంగంగా కోరడాతో కొట్టి 6 నెలలు జైల్లో పెట్టే అధికారం న్యాయాధికారులకు ఉంది. రెండోసారి అలా కనబడితే రెండేళ్లు జైల్లో పెట్టవచ్చు. జైల్లో ఉన్నప్పుడు ఎప్పుడు బడితే అప్పుడు ఎంతబడితే అంతగా న్యాయాధికారి ఇష్టానుసారం కొరడా ఆడించవచ్చు. బాగుపడని, ప్రమాదకారులైన పోకిరులకు (rogues) ఎడమ భుజం మీద R వాతపెట్టి కఠోర శ్రమ చేయించాలి. మూడోసారి అడుక్కుంటూ

కనపడ్డారా, దయా దాక్షిణ్యాలు చూపకుండా ఉరి వెయ్యాలి. ఈచట్టాలు 18 వ శతాబ్దం ఆరంభం వరకూ, ఆన్ రాణి వాటిని రద్దు చేసేదాకా అమల్లో ఉన్నాయి.

## కార్మికుల్ని క్రమశిక్షణలో పెట్టడం

ఆ విధంగా ముందుగా వ్యవసాయదారుల భూముల్ని బలవంతంగా ఆక్రమించారు. తర్వాత వాళ్ళ ఇళ్ళనుండి వెళ్ళగొట్టారు. చట్టాల ద్వారా దిమ్మరులుగా చేసి, కొరడా దెబ్బలు కొట్టి, వాత ముద్రలు వేసి, భయంకరమైన హింసపెట్టి, వేతన వ్యవస్థకి అవసరమైన క్రమశిక్షణ అలవరచుకునేట్లు చేశారు. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి, పెట్టుబడి రూపంలో శ్రమ పరిస్థితులు ఒక పక్కా, అమ్ముకోడానికి శ్రమశక్తి తప్ప మరేమీ లేని మనుషుల గుంపు మరొకపక్కా ఉన్నంత మాత్రాన సరిపోదు. వాళ్ళంతటవాళ్ళు స్వచ్ఛందంగా తమ శ్రమశక్తిని అమ్ముకోవాల్సిన పరిస్థితి ఉండడమూ చాలదు. చదువు వల్లా, సాంప్రదాయం వల్లా, అలవాటు వల్లా పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానపు పరిస్థితుల్ని స్వయం స్పష్టమైన ప్రకృతి నియమాలుగా భావించే కార్మిక వర్గం కావాలి. అటువంటి కార్మిక వర్గాన్ని అది అభివృద్ధిపరుస్తుంది. ఒకసారి పూర్తిగా అభివృద్ధి అయిందంటే, పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థ ప్రతి ప్రతిఘటననీ పటాపంచలు చేస్తుంది.

## పెట్టుబడి దారుడికి కార్మికుడి లొంగుబాటు

నిరంతరం ఏర్పడే సాపేక్ష అదనపు జనాభా వేతనాల్ని పెట్టుబడి అవసరాలకి అనుగుణమైన గాడిలో ఉంచుతుంది. ఆర్థిక సంబంధాల ఒత్తిడి, పెట్టుబడి దారుడికి కార్మికుడి లొంగుబాటుని పరిపూర్తి చేస్తుంది. ఆర్థిక పరిస్థితులకి బయట ప్రత్యక్ష బలప్రయోగం ఇంకా ఉంటుంది, అయితే అది మినహాయింపుగా మాత్రమే ఉంటుంది. అయితే పెట్టుబడి పుట్టినప్పుడు దీనికి భిన్నంగా ఉంది. వేతనాల్ని నియంత్రించడానికి అంటే, వేతనాల్ని అదనపు విలువకి తగిన పరిమితుల్లో ఉంచడానికి పనిదినాన్ని పొడిగించడానికీ, శ్రామికుణ్ణి మామూలు స్థాయి లొంగుబాటులో ఉంచడానికీ – బూర్జువావర్గం రాజ్యాధికారాన్ని వాంఛిస్తుంది, ఉపయోగిస్తుంది. ఇది ఆదిమ సంచయనం అనబడే దానిలో ఒక ప్రధానమైన అంశం.

వేతన శ్రామిక వర్గం14 వ శతాబ్దం రెండో సగంలో తలెత్తింది. అప్పుడూ, ఆ తదుపరి శతాబ్దంలోనూ జనాభాలో బహు కొద్ది భాగంగానే ఉంది. గ్రామీణ ప్రాంతాల్లో స్వతంత్ర రైతుల యాజమాన్యమూ, పట్టణాల్లో వృత్తిసంఘ వ్యవస్థా, దానికి గట్టి రక్షణ కల్పించాయి. గ్రామాల్లో యజమానులూ, పనివాళ్ళూ సామాజికంగా సన్నిహితంగా ఉండేవాళ్ళు. పెట్టుబడికి శ్రమ లొంగి ఉండడం కేవలం లాంచన ప్రాయమే – అంటే, ఉత్పత్తి విధానం ఇంకా పెట్టుబడిదారీ స్వభావాన్ని సంతరించుకోలేదు. స్థిరపెట్టుబడికంటే, అస్థిరపెట్టుబడి ఎంతో ఎక్కువ భాగం ఉండేది. అందువల్ల ప్రతి సంచయనంతోనూ, వేతన శ్రమకి గిరాకీ వేగంగా పెరిగుతుండేది. వేతన శ్రమ సరఫరా సైతం పెరుగుతుండేదే, కాని నెమ్మదిగా పెరుగుతుండేది.

## వేతన శ్రామికునికి వ్యతిరేకమైన శాసనాలు

మొదట శ్రామికుణ్ణి దోచడానికీ ఉద్దేశించబడి, తర్వాత్తర్వాత అతనికి వ్యతిరేకంగా ఉన్న వేతన శ్రమకు సంబంధించిన శాసనాలు ఇంగ్లండ్‌లో 1349 లో మూడో ఎడ్వర్డ్ చేసిన

'శ్రామిక చట్టం' తో మొదలయ్యాయి. ఫ్రాన్స్ లో 1350 లో జాన్ రాజు జారీ చేసిన శాసనం వంటిదే అది. ఇంగ్లిష్, ఫ్రెంచ్ శాసనాలు ఒకేరకంగా నడిచాయి. అవి ఒకే ఉద్దేశంతో ఉండేవి. పనిదినాన్ని నిర్బంధంగా పెంచే కార్మిక చట్టాల గురించి ఇక్కడ చెప్పడు మార్క్స్. వాటిని 10 వ చాప్టర్, 5 వ సెక్షన్లో వివరించాడు. చట్టం పట్టణానికీ, గ్రామానికీ అలాగే రోజు పనికీ, శాల్తీపనికీ వేతనాల్ని నిర్ణయించింది. వ్యవసాయ శ్రామికులు సంవత్సరానికి అద్దెకిచ్చుకోవాలి. పట్టణ శ్రామికులు బహిరంగ మార్కెట్లో అద్దెకి పోవాలి. శాసనం చెప్పినదానికంటే ఎక్కువ వేతనం ఇవ్వడం జైలో పెట్టేటంత నేరం, తీసుకోవడమూ నేరమే. రెండూ శిక్ష పడేవే. అయితే ఎక్కువేతనం ఇచ్చినవానికంటే పుచ్చుకున్నవానికి మరీ కఠిన శిక్ష పడుతుంది. ఎలిజబెత్ చేసిన చట్టం ప్రకారం ఎక్కువ వేతనం ఇచ్చినవానికి 10 రోజుల జైలయితే, పుచ్చుకున్నవానికి 21 రోజుల జైలు. 1360 నాటి చట్టం జరిమానాల్ని ఎక్కువచేసి, శిక్షల ద్వారా చట్టం చెప్పిన వేతనానికే అధిక శ్రమని గుంజుకునే అధికారాన్ని యజమానులకి ఇచ్చింది. బేల్దార్లూ, వడ్రంగులూ ఇరువురి ప్రయోజనాలకొసం కలిసి చేసుకున్న ఒప్పందాలూ ప్రమాణాలూ అన్నీ చెల్లకుండా పోయాయి. 1825 లో కార్మిక సంఘాలకు వ్యతిరేకంగా వున్న అన్ని చట్టాలూ రద్దయ్యాయి. మధ్యకాలంలో – 14 వ శతాబ్దం నుంచీ 1825 వరకూ శ్రామికులు ఏకమవడం ఘోరమైన నేరం.

## గరిష్ట వేతన చట్టాలు

రాజ్యం కార్మికుల గరిష్ట వేతనాన్ని నిర్దేశించింది, కాని కనీస వేతనాన్ని నిర్ణయించ లేదు. ఇది 1349 కార్మికుల చట్టం తత్వం ఏమిటో బహిరంగం చేస్తుంది. 16 వ శతాబ్దంలో కార్మికుల పరిస్థితి మరింత హీనమైపోయింది. డబ్బు వేతనం పెరిగింది. కాని, డబ్బువిలువ తగ్గిన నిష్పత్తిలో పెరగలేదు. సరుకుల ధరలు పెరిగిన దానికి అనుగుణంగా పెరగలేదు. అందువల్ల వాస్తవంగా చూస్తే, వేతనాలు పడిపోయాయి. వేతనాల్ని తక్కువగా ఉంచే చట్టాలూ, ఎవ్వరూ పనిలోకి తీసుకోని వాళ్ల చెవి కొయ్యడమూ, వాత వెయ్యడమూ – అనే చట్టాలతో పాటే అమల్లో ఉన్నాయి. ఎలిజబెత్ కొన్ని వేతనాల్ని నిర్ణయించడానికీ, కాలాన్ని బట్టి, సరుకుల ధరలని బట్టి మార్చడానికీ న్యాయాధికారులకి అధికారం ఇచ్చింది. **1 వ జేమ్స్** ఈ నిబంధనల్ని నేతగాళ్ళకూ, వడికే వాళ్ళకూ, సాధ్యమైన అన్ని రకాల కార్మికులకీ వర్తింప చేశాడు. **2 వ జార్జ్** కార్మిక సంఘటనలకు వ్యతిరేకంగా ఉన్న చట్టాల్ని, తయారీ పరిశ్రమకి కూడా విస్తరింప చేశాడు. కార్ఖానాదశ సమర్ధవంతంగా ఉన్నప్పుడు, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి చట్టబద్ధమైన వేతన నియంత్రణ అవసరం లేకుండా, ఆచరణీయం కాకుండా పోయింది. అయితే ఒకవేళ అవసరం కలిగేట్లయితే, తన ఆయుధాగారంలో ఆయుధాలు లేకుండా చెయ్య డానికి పాలకవర్గాలు ఇష్టపడలేదు. రెండో జార్జ్ జర్నీమన్ దర్జీలకి లండన్ చుట్టుపక్కల రోజుకూలి 2 షిల్లింగులా 7½ పెన్నీలకు మించరాదని చట్టం చేశాడు. **3 వ జార్జ్** సిల్క్ నేతగాళ్ళ వేతన నిర్ణయాన్ని న్యాయాధిపతులకి వదిలిపెట్టాడు. ఫలానింత కన్నా ఎక్కువ వేతానాలు ఉండకూడదని 400 ఏళ్లకు పైగా చట్టాలు వస్తూ వచ్చిన కామన్స్ సభలో విట్ బ్రెడ్ వ్యవసాయ కూలీలకి కనీస వేతనం ప్రతిపాదించాడు. పిట్ దాన్ని వ్యతిరేకించాడు. అయితే పేదల పరిస్థితి ఘోరంగా

ఉంది అని అంగీకరించాడు. చివరకి 1813లో వేతన నియంత్రణ చట్టాలు రద్దయ్యాయి. అవి అసంబద్ధంగా ఉన్నాయి. ఎందుకంటే, పెట్టుబడిదారుడు తనసొంత శాసనాలతో ఫాక్టరీని నియంత్రిస్తున్నాడు. బీదవాళ్ళ సహాయ పన్నులతో వ్యవసాయ కార్మికుల కనీస వేతనాన్ని పూర్తిచేయ గలుగుతున్నాడు.

## సమ్మెలకు లొంగి ఆ చట్టాలు రద్దయ్యాయి

యజమానికీ, శ్రామికునికీ మధ్య నోటీస్ ఇవ్వడం వంటి ఒప్పందాలకు సంబంధించి కార్మిక చట్టాల నిబంధనలు ఇప్పటికీ అమల్లోనే ఉన్నాయి. ఒప్పందాన్ని యజమాని భగ్నంచేస్తే, సివిల్ చర్య మాత్రమే తీసుకోవాలి. అదే కార్మికుడు భంగపరిస్తే, క్రిమినల్ చర్య తీసుకోవచ్చు. కార్మిక సంఘాలకు వ్యతిరేకమైన చట్టాలు 1825లో కార్మికవర్గం యొక్క భీకర భంగిమ ముందు కూలిపోయాయి. అయినా, పాక్షికంగా మాత్రమే కూలాయి. వాటిలో కొన్ని ముక్కలు 1859 లో మాత్రమే రద్దయ్యాయి. చివరగా 1871 జూన్ 29 పార్లమెంట్ చట్టం (హింస, బెదిరింపు, వేధింపులకు సంబంధించిన సవరణ) కార్మిక సంఘాల్ని గుర్తించింది. తద్వారా అటువంటి చట్టాల ఆఖరి అవశేషాల్ని సైతం రద్దుచేసినట్లు నటించింది. ఈ పార్లమెంటరీ ట్రిక్కు ద్వారా సమ్మెలో, లాక్ఔట్‌లో కార్మికులు ఉపయోగించే సాధనాల్ని కార్మికులకి లేకుండా చేసింది. అసాధారణ శిక్షా శాసనాలలో చేర్చింది. దాన్ని వ్యాఖ్యానించే హక్కు న్యాయమూర్తుల హెూదాలో యజమానులకి కట్టబెట్టింది. అంతకు రెండేళ్ళ ముందు అదే సభలో అదే గ్లాడ్ స్టన్ కార్మికవర్గానికి వ్యతిరేకంగా ఉన్న అన్ని అసాధారణ శిక్షా చట్టాల్ని రద్దుచేసే బిల్లు ప్రవేశపెట్టాడు. కాని దాన్ని రెండో పఠనం దాటి ముందుకు పోనివ్వలేదు. చివరకి ఆవిధంగా లిబరల్ పార్టీ టోరీలతో కుమ్మక్కయి తనను అధికారంలోకి తెచ్చిన కార్మికవర్గానికి వ్యతిరేకంగా తిరిగింది. ఈ ద్రోహచర్యతో తృప్తి పడకుండా, కుట్రలకు వ్యతిరేకంగా ఉన్న పాత చట్టాల్ని తవ్వి తీసి, వాటిని కార్మికుల సంఘటనలకు వర్తింపచేసే అధికారాన్ని పాలకవర్గాల సేవలో ఉండే ఇంగ్లీష్ జడ్జీలకి ఆ గొప్ప లిబరల్ పార్టీ అప్పగించింది. 500 సంవత్సరాలపాటు కార్మికులకి వ్యతిరేకంగా వ్యవహరించిన పార్లమెంట్, తనకు ఇష్టంలేకపోయినా, ప్రజల ఒత్తిడికీ, కార్మిక సంఘాలకూ, సమ్మెలకూ లొంగి మాత్రమే ఆ చట్టాల్ని వదిలివేసింది అని మనకు అనిపిస్తుంది.

## అధ్యాయం 29

# పెట్టుబడిదారీ వ్యవసాయదారుని పుట్టుక

వేతన కార్మికులు ఎలా ఏర్పడ్డారో పరిశీలించాం: బలవంతం మూలంగా ఏర్పడ్డారు. కఠోర క్రమశిక్షణ వాళ్ళని వేతన శ్రామికులుగా మార్చింది. రాజ్యం, సిగ్గులేకుండా చట్టాలు తెచ్చీ, పోలీసు పద్ధతులు ప్రయోగించీ, శ్రమ దోపిడీని హెచ్చించింది. తద్వారా పెట్టుబడి సంచయనాన్ని వేగవంతం చేసింది. వ్యవసాయ దారుల ఆస్తులు కొల్లగొట్టీ, వాళ్ళని గెంటివేసీ పెద్ద పెద్ద భూయజమానులు ఏర్పడ్డారు. అంతే.

### మరి వ్యవసాయపెట్టుబడి దారులు ఎలా ఏర్పడ్డారు?

పెట్టుబడిదారీ రైతు నెమ్మదిగా పరిణామం చెందాడు. అందుకు కొన్ని శతాబ్దాల కాలం పట్టింది. ఇంగ్లండ్‌లో పెట్టుబడిదారీ రైతు రూపొందిన క్రమం చూద్దాం:

**మొదటి రూపం:** బెయిలిఫ్. అతనూ ఒక అర్ధ బానిసే. రోమన్ విల్లికస్ (పొలంపర్యవేక్షకుడు) లాంటి వాడు.

**రెండో రూపం:** ఈ రైతుకి భూ యజమాని విత్తనాలూ, పశువులూ, వ్యవసాయ పరికరాలూ ఇస్తాడు. ఇతని పరిస్థితికీ, రైతు పరిస్థితికీ పెద్ద తేడా ఉండదు. కాకపోతే, ఇతను ఎక్కువ వేతన శ్రమని దోస్తాడు. అంతే. ఇటువంటి రైతు 14 వ శతాబ్దం రెండో సగంలో రూపొందాడు. బెయిలిఫ్‌ని తొలిగించి ఆ స్థానంలో చేరాడు.

**మూడో రూపం:** తర్వాత కొద్దికాలానికే, మెటాయర్ (అర్ధ రైతు) అవుతాడు. పంట పంచుకునే వాడు అవుతాడు. భూ యజమానితో పాటు అవసరమైన విత్తనాల్నీ, పరికరాల్నీ తనభాగం తనూ తెస్తాడు. ఒప్పందంలో అనుకున్న ప్రకారం, అతనితో పాటు పంటలో తనవంతు పంచుకుంటాడు. ఇంగ్లండ్‌లో ఈ రూపం త్వరగా అదృశ్యం అయింది. ఆస్థానంలో పెట్టుబడిదారీ రైతు వచ్చాడు.

**నాలుగో రూపం:** అసలు సిసలు పెట్టుబడిదారుడు (capitalist proper). ఇతను సొంత పెట్టుబడితో వేతన శ్రామికుల్ని పెట్టి లాభం పొందుతాడు. అదనపు విలువనించి వస్తురూపంలోనో, డబ్బురూపంలోనో భూయజమానికి కౌలు కడతాడు. 15 వ శతాబ్దంలో స్వతంత్ర రైతూ, తన సొంతం కోసమూ, వేతనం కోసమూ పనిచేసే వ్యవసాయ శ్రామికుడూ వాళ్ళ సొంత శ్రమతోనే ధనవంతులయినారు. అలా అయినంతకాలం, రైతు పరిస్థితులూ, అతని ఉత్పత్తి రంగమూ రెండూ ఒకేమాదిరి మధ్యస్థంగా ఉండేవి.

### వ్యవసాయ విప్లవమూ – దాని ప్రభావమూ

15 వ శతాబ్దం చివరి మూడో భాగంలో వ్యవసాయ విప్లవం ఆరంభం అయింది. దాదాపు 16 వ శతాబ్దం అంతా (చివరి దశాబ్దం తప్ప) కొనసాగింది. ఆ విప్లవం పెట్టుబడిదారీ

రైతుని వేగంగా సంపన్నుణ్ణి చేసింది. అంతే వేగంగా వ్యవసాయ ప్రజా సమూహాల్ని దరిద్రుల్ని చేసింది. అంటే, దాని ప్రభావం వల్ల శ్రామికులు ఎంతవేగంగా దరిద్రులయ్యారో, పెట్టుబడిదారీ రైతులు అంత వేగంగా ధనికులయ్యారు. పైకొస్తున్న పెట్టుబడిదారీ రైతుకి ఊపు నిచ్చిన అంశాలు:

1. ఉమ్మడి భూముల ఆక్రమణకు అసలు ఖర్చు లేకపోవడం
2. పశువుల మందని ఉచితంగా బాగా పెంచడానికి వీలు కలగడం
3. ఆ పశువులు భూమికి సమృద్ధిగా ఎరువుని సమకూర్చడం

వీటికి 16 వ శతాబ్దంలో మరొక ముఖ్యమైన అంశం తోడయింది. ఏమంటే, కౌలు కాలం ఒప్పందాలు 99 ఏళ్ళ దాకా ఉండేవి. ప్రియమైన లోహాల విలువ క్రమంగా తగ్గుతూ వచ్చింది. అంటే డబ్బు విలువ తగ్గసాగింది.

ఈ పరిస్థితి రైతులకి బంగారు పంట పండించింది. పైన చర్చించిన అంశాలతో పాటు, అది వేతనాల్ని తగ్గించింది. ఆ తగ్గినభాగం లాభాలకు కలిసింది. ధాన్యం, ఊలు, మాంసం – ఒక్కముక్కలో, అన్ని వ్యవసాయ ఉత్పత్తుల ధరలూ పెరగటంవల్ల, రైతు ప్రమేయం ఏమీ లేకుండానే, అతను పెట్టిన డబ్బు పెట్టుబడి పెరుగుతుంది. అదే సమయంలో, అతను ఇంకాకూడా పాత విలువలోనే కౌలు డబ్బు కడతాడు. డబ్బు విలువ వాస్తవంగా తగ్గినప్పటికీ, అతను మొదట అనుకున్నంత డబ్బే ఇస్తాడు. ఇది అతని లాభాన్ని పెంచుతుంది. ఆ విధంగా వాళ్ళు పెట్టుకునే కార్మికులూ, వాళ్ళు సాగుచేసుకునే పొలాల యజమానులూ నష్టపోతుండగా, వాళ్ళు మాత్రం లాభపడి, సంపన్నులైనారు. అందువల్ల అప్పటి పరిస్థితుల్లో, 16 వ శతాబ్దం చివరకి ఇంగ్లండ్‌లో ధనిక పెట్టుబడిదారీ వ్యవసాయదారుల వర్గం ఒకటి రూపొందిందంటే ఆశ్చర్యపోనక్కర లేదు.

## అధ్యాయం 30
# పరిశ్రమ మీద వ్యవసాయ విప్లవ ప్రభావం

### పారిశ్రామిక పెట్టుబడికి అంతర్గత మార్కెట్ ఏర్పడడం

భూముల ఆక్రమణకు ముందు, కొందరు స్వయం పోషక వ్యవసాయదారులు తమ ఉత్పత్తుల్ని వినియోగ వస్తువులుగా చేసి, వాటిని అమ్ముకునేవాళ్ళు. ఉదాహరణకి, కొందరు గొర్రెల్ని పెంచి, ఊలుని దారం వడికి, బట్ట నేసి అమ్ముకునే వాళ్ళు. వాళ్ల భూముల్ని ఆక్రమించి వాళ్లని వెళ్ళగొట్టిన తర్వాత పరిస్థితి మారింది.

### భూముల ఆక్రమణ పర్యవసానాలు:

1. వ్యవసాయదారులు కూలీలుగానూ, భూయజమానులు వ్యవసాయ పెట్టుబడిదారులు గానూ పరివర్తన చెందారు.
2. భూమితో పాటుగా ముడిపదార్థాలు కూడా వ్యవసాయ పెట్టుబడిదారుల ఆస్థిగా మారాయి.
3. స్వతంత్ర చేతివృత్తుల ఉత్పత్తి ధ్వంసం అయింది. ఈ చాప్టర్ దృష్టి ఈ అంశం మీదే కేంద్రీకృతమైంది.

**స్వయం పోషక వ్యవసాయదారులు తగ్గిపోవడం.** వ్యవసాయ ప్రజల భూముల్ని లాక్కొని వాళ్లని వెళ్ళగొట్టడం – అనే కార్యక్రమం అప్పుడప్పుడూ జరిగేది. అయితే మళ్ళీ మళ్ళీ జరుగుతుండేది. పట్టణ పరిశ్రమలకు కార్మికుల సరఫరా ఉండేది. వాళ్ళు వృత్తిసంఘాలతో ఏవిధమైన సంబంధమూ లేనివాళ్ళు. ఈ విషయం మనకు తెలిసిందే. స్వయం పోషక వ్యవసాయదారుల సంఖ్య తగ్గడం, పరిశ్రమల్లో కార్మికుల సంఖ్య పెరగడానికి అనుగుణంగా జరిగేది. అంతే కాదు. సాగు పద్ధతులు మెరుగయ్యాయి. సహకారం పెరిగింది. ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణ జరిగింది. మరొకపక్క, వ్యవసాయ కార్మికులమీద పని ఒత్తిడి తీవ్రతరం అయింది. అంతే కాకుండా, తమకోసం పనిచేసుకునే ఉత్పత్తిరంగం అంతకంతకూ కుంచించుకు పోయింది. అందువల్ల వ్యవసాయదారుల సంఖ్య తగ్గినప్పటికీ, వాళ్ళ కమతాల్లో ఉత్పత్తి పరిమాణం అంతకు ముందు ఎంతో అంతే గానీ, అంతకు మించిగానీ ఉండేది.

### జీవితావసర వస్తువులూ, ముడిపదార్థాలూ పెట్టుబడిలో భాగాలు కావడం

వ్యవసాయ ప్రజల్లో కొంత భాగం విడుదల కావడంవల్ల, వాళ్ళు అప్పటిదాకా వాడుకున్న జీవితావసర వస్తువులు కూడా విడుదల అవుతాయి. ఇప్పుడవి అస్థిర పెట్టుబడిలోని భౌతిక అంశాలు అవుతాయి. వెళ్లగొట్టబడ్డ వ్యవసాయదారుడు జీవితావసర వస్తువుల్ని తన కొత్త యజమాని అయిన పారిశ్రామిక పెట్టుబడి దారుడి నుండి వేతనాల రూపంలో కొనుక్కొవాల్సిందే. జీవితావసర వస్తువులకు వర్తించేదే, కుటుంబ వ్యవసాయం వల్ల ఉత్పత్తయ్యే పారిశ్రామిక ముడిసరుకులకూ వర్తిస్తుంది. ఉదాహరణకి, 2వ ఫ్రెడరిక్ కాలంలో వెస్ట్ ఫేలియా

వ్యవసాయదారుల్లో కొందరు జనుంతో దారం వడికే వాళ్ళు. వాళ్ల భూముల్ని లాక్కొని వాళ్లని తరిమివేశారు.

1. ఇప్పుడిక మిగిలిన వాళ్ళు పెద్ద వ్యవసాయదారుల కింద దినకూలీలుగా మారారు. అదే సమయంలో జనుముని వడికేవీ, బట్ట నేసేవీ పెద్దపెద్ద సంస్థలు ఏర్పడ్డాయి. విడుదలయిన మనుషులు వాటిలో ఇప్పుడు కూలికి పనిచేస్తున్నారు.
2. జనుము ఇంతకుముందు ఎలా ఉందో ఇప్పుడూ అలానే ఉంది. అందులో ఒక్క పోగు అయినా మారలేదు. కాని దాని శరీరంలో కొత్త సామాజిక ఆత్మ ఆకస్మికంగా వచ్చి చేరింది. ఇప్పుడది కార్ఖానా యజమాని స్థిర పెట్టుబడిలో భాగంగా ఉంది.
3. అంతకుముందు చిన్న ఉత్పత్తిదారులు తామూ, తమకుటుంబాలూ ఉత్పత్తిచేసిన ఆ జనుముని తామే వడికే వాళ్ళు. ఇప్పుడు అది ఒక పెట్టుబడిదారుడి చేతిలో కేంద్రీకృతమై ఉంది. అతను వడకడానికీ, నెయ్యడానికీ ఇతరుల్ని నియమిస్తాడు.
4. మునుపు వడకడానికి వ్యయమయిన అదనపు శ్రమ, చాలా వ్యవసాయ కుటుంబాలకు ఆదాయం అయ్యేది. ఇప్పుడు అది కొద్దిమంది పెట్టుబడిదారులకు మాత్రమే లాభం అవుతున్నది.
5. అప్పుడు దేశమంతటా చెల్లాచెదరుగా ఉన్న కదుళ్ళూ, మగ్గాలూ, ఇప్పుడు శ్రామికులతోటీ, ముడి పదార్థాలతో కలిసి కొన్ని భారీ శ్రామిక బారకాసుల్లో కేంద్రీకృతమయ్యాయి.
6. అప్పట్లో కదుళ్ళూ, మగ్గాలూ, ముడిపదార్థాలూ వడికే వాళ్ళకీ, నేసేవాళ్ళకీ స్వతంత్ర మనుగడ సాధనాలుగా ఉండేవి. ఇప్పుడవి వాళ్ళమీద పెత్తనం చేస్తూ, వాళ్ళనుండి అదనపు శ్రమని పీల్చే సాధనాలుగా మారాయి.

పెద్దపెద్ద కార్ఖానాల్నీ, వ్యవసాయ క్షేత్రాల్నీ చూసినప్పుడు, అవి అనేక చిన్న చిన్న ఉత్పత్తి కేంద్రాల్ని ఒక్కటిగా కూర్చడం వల్లనే, ఎందరో సన్నకారు స్వతంత్ర ఉత్పత్తిదారుల ఆస్తుల్ని ఆక్రమించడం వల్లనే, ఏర్పడ్డాయనే విషయం బోధపడదు.

**స్థానిక మార్కెట్ ఏర్పడడం.** వాస్తవానికి సన్నకారు వ్యవసాయదారుల్ని వేతన కార్మికులుగానూ, వాళ్ళ జీవితావసర సాధనాల్నీ, శ్రమ సాధనాల్నీ పెట్టుబడి భౌతిక అంశాలుగా మార్చిన సంఘటనలు, అదే సమయంలో వాటికి (జీవితావసర వస్తువులకీ, శ్రమ సాధనాలకీ) స్థానిక మార్కెట్‌ని కూడా సృష్టించాయి. గతంలో వ్యవసాయదారుని కుటుంబం జీవితావసర వస్తువుల్నీ, ముడిపదార్థాల్నీ ఉత్పత్తిచేసేది. వాటిలో ఎక్కువ భాగం ఆకుటుంబమే వినియోగించుకునేది. అవే ముడిపదార్థాలూ, అవే జీవితావసర వస్తువులూ ఇప్పుడు సరుకులయ్యాయి. వాటినిప్పుడు పెద్ద వ్యవసాయదారుడు మార్కెట్లో అమ్ముతాడు. కార్ఖానాల్లో అతనికి మార్కెట్ లభిస్తుంది. దారమూ, బట్టా, ముతక ఊలు బట్టలూ, వీటి ముడిపదార్థాలూ గతంలో ప్రతి రైతు కుటుంబానికీ అందుబాటులో ఉండేవి. ఆ కుటుంబమే తనసొంత వినియోగంకోసం దారం వడికి, బట్టనేసేది. ఇప్పుడు అవి కార్ఖానా ఉత్పత్తులుగా మారాయి. ఆ వెంటనే గ్రామీణ ప్రాంతాలు ఆ సరుకులకు మార్కెట్లుగా ఉపకరించాయి. అప్పట్లో సొంతానికి

పనిచేసే చిన్న ఉత్పత్తిదారులు ఎంతోమంది ఉండేవాళ్ళు. వాళ్ళ ఉత్పత్తులు కోనే వాళ్ళు చెల్లాచెదరుగా ఉండేవాళ్ళు. ఇప్పుడు వాళ్ళు పారిశ్రామిక పెట్టుబడి సమకూర్చిన ఒక భారీ మార్కెట్లో కేంద్రీకృతం అయినారు.

**గ్రామీణ గృహ పరిశ్రమ ధ్వంసం అవడం.** ఆ విధంగా స్వయంపోషక వ్యవసాయదారుల ఆస్థి హరణమూ, వాళ్లని ఉత్పత్తి సాధనాలనుండి వేరు పరచడమూ – వీటితో పాటే గ్రామీణ గృహ పరిశ్రమ విధ్వంసం అయింది. తయారీ పరిశ్రమా, వ్యవసాయమూ వేరై పోయాయి. ఒక దేశ గ్రామీణ గృహ పరిశ్రమ విధ్వంసం మాత్రమే, ఒక దేశ అంతర్గత మార్కెట్‌కి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం కాంక్షించే విస్తృతినీ, నిలకడనీ ఇవ్వగలుగుతుంది. అయితే అసలైన తయారీ పరిశ్రమ కాలంలో ఈ మార్పు పూర్తిగానూ, వేగంగానూ జరగలేదు. తయారీ పరిశ్రమ జాతీయ ఉత్పత్తి రంగాన్ని  పాక్షికంగా మాత్రమే జయిస్తుందనీ, దానికి పట్టణ చేతివృత్తులూ గ్రామీణ గృహ పరిశ్రమా, అంతిమ ప్రాతిపదికగా ఉంటాయనీ గుర్తుంచుకోవాలి.

**చిన్న గ్రామీణుల వర్గం ఏర్పడడం.** తయారీ పరిశ్రమ గనక ఒకరూపంలో వీటిని (పట్టణ చేతివృత్తుల్నీ,  గ్రామీణ గృహ పరిశ్రమనీ) కొన్ని శాఖల్లో, కొన్నిచోట్ల నాశనం చేస్తే, అవి మరలా మరొకచోట ఏర్పడతాయి.  కారణం ఒక దశ దాకా ముడిపదార్థాల తయారీ పరిశ్రమకి అవి అవసరం. కాబట్టి అది చిన్న గ్రామీణుల వర్గాన్ని ఏర్పాటు చేస్తుంది. వాళ్ళు సేద్యాన్ని అనుబంధ వృత్తిగా అనుసరిస్తూనే, పారిశ్రామిక శ్రమని ప్రధాన వృత్తిగా పెట్టుకుంటారు. తమ పారిశ్రామిక శ్రమ ఉత్పత్తుల్ని నేరుగానో, మధ్య వర్తకుల ద్వారానో కార్ఖానా దారులకు అమ్ముతారు. అటువంటి కొత్తవర్గాన్ని తయారుచేసుకుంటుంది. 15 వ శతాబ్దం చివరి మూడో భాగంలో గ్రామాల్లో పెట్టుబడి దారీ వ్యవసాయం చొచ్చుకొస్తున్నట్లూ, వ్యవసాయదారులు అంతకంతకూ అధికంగా నశించిపోతున్నట్లూ  ఫిర్యాదులు వస్తుండేవి. మరొకవైపు, వ్యవసాయదారులు కొద్ది సంఖ్యలోనే అయినా, ప్రతిసారీ హీనతర స్థితిలోనే అయినా, తిరిగి రావడాన్ని చరిత్రకారుడు గమనించాడు. అలా జగడానికి ప్రధాన కారణం: ఇంగ్లండ్ ఒక సమయంలో ప్రధానంగా ధాన్యం పండించేది, మరొక సమయంలో ప్రధానంగా పశుపోషణ చేసేది.  ఈ మార్పుల మూలంగా వ్యవసాయ విస్తీర్ణం హెచ్చుతగ్గులకు లోనౌతూ వచ్చింది.

**పెట్టుబడిదారీ వ్యవసాయానికి యంత్రాల రూపంలో నిలకడైన పునాదిని సమకూర్చేది భారీ స్థాయి పరిశ్రమ మాత్రమే.** మెజారిటీ వ్యవసాయ ప్రజల భూముల్ని ఆక్రమించి, వ్యవసాయం నించి దారం తియ్యడంలోనూ, బట్ట నెయ్యడంలోనూ వేళ్ళూనుకొని ఉన్న గ్రామీణ గృహ పరిశ్రమ వేరుపడడాన్ని పూర్తి చేసేదీ భారీ పరిశ్రమే. స్వదేశీ మార్కెట్ మొత్తాన్ని మొట్ట మొదటగా పారిశ్రామిక పెట్టుబడికి జయించి పెట్టేదీ భారీ పరిశ్రమే.

## అధ్యాయం 31
# పారిశ్రామిక పెట్టుబడిదారుడి పుట్టుక

వ్యవసాయ పెట్టుబడి దారుడి పుట్టుక నెమ్మదిగానూ, క్రమంగానూ జరిగిందని 29 వ చాప్టర్లో తెలుసుకున్నాం. అయితే పారిశ్రామిక పెట్టుబడిదారుడి పుట్టుక అలా జరగలేదు. అనేకమంది వృత్తిసంఘ మేస్త్రులూ, అంత కన్నా ఎక్కువమంది చిన్న చిన్న స్వతంత్ర చేతివృత్తుల వాళ్ళూ, వేతన శ్రామికులూ కూడా చిన్న పెట్టుబడి దారులుగా రూపొందారు. క్రమంగా వేతన శ్రమని దోచడం ద్వారా, దానికి అనుగుణమైన సంచయనాన్ని పెంచడంద్వారా పూర్తిస్థాయి పెట్టుబడి దారులు అయ్యారు. పెట్టుబడి దారీ ఉత్పత్తి పసిదశలో మధ్యయుగాల పట్టణాల్లో జరిగినట్లే, తరచుగా సంఘటనలు సంభవించాయి. ఆ పట్టణాల్లో పారిపోయి వచ్చిన అర్ధబానిసల్లో ఎవరు యజమాని అయినారు, ఎవరు సేవకుడయ్యారు అనేది ఎవరు ముందొచ్చారు, ఎవరు వెనకొచ్చారు అనేదాన్ని బట్టి నిర్ణయమయింది. ఈ పద్ధతి నెమ్మదిగా నత్తనడకన సాగింది.

### గొప్ప ఆవిష్కరణలు – ప్రపంచ మార్కెట్

అయితే 15 శతాబ్దం చివర గొప్ప ఆవిష్కరణలు వచ్చాయి. అవి పెద్ద ప్రపంచ మార్కెట్ ని ఏర్పరిచాయి. ఆ మార్కెట్ యొక్క వాణిజ్య అవసరాలకి ఆ నత్తనడక ఏమాత్రం సరిపోలేదు. అయితే మధ్యయుగాలు రెండు రూపాల పెట్టుబడిని అందించాయి:

1. వడ్డీ వ్యాపారి పెట్టుబడి
2. వర్తకుని పెట్టుబడి.

అవి రెండూ పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానానికి పూర్వమే పెట్టుబడిగా ఉన్నాయి.

### డబ్బు పెట్టుబడి పారిశ్రామిక పెట్టుబడిగా మారడానికి ఆటంకాలు

అయితే వాటి ద్వారా ఏర్పడ్డ డబ్బు పెట్టుబడి పారిశ్రామిక పెట్టుబడిగా మారకుండా గ్రామీణ ప్రాంతాలలో ఫ్యూడల్ వ్యవస్థా, పట్టణాల్లో వృత్తిసంఘవ్యవస్థా అడ్డుపడ్డాయి.

### వృత్తిసంఘాలు (guilds) ఎలా అడ్డుకున్నాయి?

వాటి గురించి కొంచెం తెలుసుకుందాం. 10,11 శతాబ్దాలలో పశ్చిమ ఐరోపా దేశాల్లో పట్టణాలు ఏర్పడసాగాయి. 14వ శతాబ్దానికల్లా ఐరోపా అంతటా పట్టణాలు దట్టంగా వ్యాపించాయి. 11–15 దశాబ్దాల ఐరోపా ప్రజల జీవనంలోని ముఖ్య మార్పులకు మధ్యయుగాల పట్టణాల వ్యాప్తితో సంబంధం ఉంది. ఆ పట్టణాలు ఇతరప్రాంతాలతోటీ, ఇతర దేశాలతోటీ వ్యాపారం సాగించాయి. క్రమంగా వర్తకం విస్తరించింది.

**వర్తకుల సంఘాలు.** వ్యాపారం లాభదాయకమే అయినా కష్టతరంగానూ, ప్రమాదకరంగానూ ఉండేది. ఇతరప్రాంతాలకు సరుకులు తీసుకుపోతుంటే, దోపిడీ దొంగల బెడద ఉండేది. కావలి వాళ్ళని పెట్టుకుని గుంపులుగా సరుకులతో వెళ్ళేవాళ్ళు. అదీ గాక భూస్వాముల ప్రాంతాలూ,

నదులూ దాటాలంటే వాళ్లకి 'టోల్' కట్టాలి. ఎందుచేతైనా బండి తిరగబడి, సరుకులు నేలమీద పడితే అవి ఆనేల సొంతదారుకి చెందేవి. సముద్రంలోమునిగిన పడవ ఒడ్డుకొస్తే సరుకులు అక్కడి భూస్వామికి దక్కేవి. వ్యాపారుల బళ్ళు లేపే దుమ్ముకి నష్టపరిహారం ఇవ్వాల్సి వచ్చేది. దొంగలనించీ, భూస్వాముల నుంచీ రక్షణకోసం సంఘాల్లో ఐక్యం అయ్యారు. ఆసంఘాలే గిల్డులు. వర్తకులు పెట్టుకున్నవి కనక 'వర్తకుల సంఘాలు'.

**వృత్తి సంఘాలు (craft guilds).** వర్తకుల సంఘాలు ఏర్పడ్డ అర్ధశతాబ్దం తర్వాత వృత్తిసంఘాలు వచ్చాయి. ఒక వృత్తిలో నేర్పున్న మేస్త్రీ ఒక వర్క్ షాప్ పెట్టుకుంటాడు. అతనే వృత్తిమేస్త్రీ. అలాంటి వాళ్ళు పెట్టుకున్న సంఘమే వృత్తి సంఘం

**వృత్తి మేస్త్రీ వర్క్ షాపు.** మధ్య యుగాల్లో చిన్న చిన్న వర్క్ షాపుల్లో సరుకులు ఉత్పత్తయ్యేవి. పనిస్థలం మేస్త్రీ ఇంటిలో ఒకచోటే. పని చేసేది చేతిపని ముట్లతోనే. అవన్నీ మేస్త్రీవే. ప్రధానమైన పనివాడు మేస్త్రీయే. అతనికి అక్కడ తయారయ్యే వస్తువులు చేసే నైపుణ్యం ఉంటుంది. ఇద్దరినో, ముగ్గురినో పని చేతైన వాళ్ళని(జర్నీమెన్) కొద్ది జీతం మీద పెట్టుకుంటాడు. పని నేర్చుకునే వాళ్ళని (అప్రెన్ టిస్) చేర్చుకుంటాడు. అప్రెంటిస్ లు నేర్చుకుంటూ సహాయ పనిని చేస్తారు. వాళ్లకి జీత భత్యాలుండవు. తిండీ, బట్టా, వసతీ మేస్త్రీ బాధ్యత. అతనూ తనపనివాళ్ళతో పాటు పనిచేస్తాడు. అతనే ప్రధాన శ్రామికుడు. పనిస్థలానికీ, పనిముట్లకీ అతనే అధిపతి. తన సొంత షాపులో స్వతంత్ర శ్రామికుడు. ముడి పదార్థాలు కొంటాడు. తయారయిన వస్తువులు అతనివే. ఇతరుల ఆర్డర్ల మీదనో, అమ్మకానికో వస్తువులు తయారుచేస్తాడు.

**చేతి పనిముట్లు.** తయారీ అంతా చేతితోనే, చేతి పనిముట్లతోనే. మేస్త్రీ, జర్నీమాన్ ఏ వస్తువు నైనా ఎవరికివారు మొత్తంగా చేసేవారు. ఉదాహరణకి ఒక నాగలి కర్రు చేయ్యాలి. ఎర్రగా కాలిన ఇనప ముక్కని కొలిమిలోనించి తీసేవాడు. డాకలు మీద పెట్టి కావలసిన షేప్ వచేట్లు సుత్తెతో కొట్టేవాడు. ఇదంతా పూర్తిగా తనే చేస్తాడు.

**సొంత వర్క్ షాప్.** కొన్ని సంవత్సరాలపాటు పని నేర్చుకున్నాక, అప్రెంటిస్ జర్నీమాన్ అవుతాడు. వేతనం పొందుతాడు. సరిపడా డబ్బు కూడబెట్టుకున్నాక, సొంత వర్క్ షాప్ తెరుచుకోవచ్చు. అందుకతను తనపనితనాన్ని నిరూపించే వస్తువు (masterpiece) తనసొంత డబ్బు పెట్టి తయారుచేసి 'గిల్డు' మెప్పు పొందాల్సి ఉంటుంది. పొందాక, జర్నీమాన్ లనీ, అప్రెంటిస్ లనీ నియమించి, సొంత వర్క్ షాప్ తెరుచుకోవచ్చు. ఎలిజబెత్ రాణీ చేసిన శాసనం ప్రకారం ఒక వృత్తి చెయ్యాలంటే ఏడేళ్ళు మేస్త్రీ దగ్గర పనిచెయ్యాలి.

**వృత్తి వృత్తికీ ఒక్కొక గిల్డు.** అలా ఒకే వృత్తి జరిగే వర్క్ షాపులు ఒక పట్టణంలో ఎన్నో కొన్ని ఉంటాయి. ప్రతి వర్క్ షాప్ ఒనరూ ఒక మేస్త్రే. ఒకే వృత్తిలో ఉండే వర్క్ షాప్ మేస్త్రీలు సంఘటితమై వాళ్ళ ఉమ్మడి ప్రయోజనాలకోసం పెట్టుకున్న సంఘమే, వృత్తిసంఘం. వృత్తి మేస్త్రీల ప్రయోజనాలు కాపాడడమే ఆసంఘాల లక్ష్యం. ప్రతి పట్టణంలోనూ నేతగాళ్ళ గిల్డూ, చెప్పులు కుట్టేవాళ్ళ గిల్డూ, కుండలు చేసే వాళ్ళ గిల్డూ ఇలా వృత్తి కొకటి చొప్పున గిల్డులు ఏర్పడ్డాయి. గిల్డ్ అంటే ఒకే వృత్తి చేసే వర్క్ షాప్ మేస్త్రీల సంఘం. వృత్తిసంఘ మేస్రీ – వృత్తి

సంఘంలో పూర్తి హక్కులగల సభ్యుడు; వృత్తి సంఘంలోని ఒక యజమాని. కాని దాని అధిపతి కాదు.[1]

**ప్రధానోద్దేశం పోటీ నుండి రక్షణ.** గిల్డు సభ్యుల మధ్య పోటీ లేకుండా చేసేందుకు గిల్డు నిబంధనలున్నాయి. కాని వర్తకులూ, ఇతరప్రాంతాల వృత్తిదారులూ గిల్డు సభ్యులు కారు. కనుక ఆ నిబంధనలకి నిబద్ధులు కారు. బయట వాళ్ళని కట్టడి చెయ్యాలంటే, చట్టపరమైన హక్కు అవసరం. అటువంటి చట్టాలు చేసే అధికారం ఉన్నది మున్సిపాలిటీలకే. అందువల్ల స్థానిక సంస్థలకి డబ్బు చెల్లించేవారు. అయితే 13వ శతాబ్దం మొదటినించీ స్వయం పాలన కావాలని డిమాండ్ చేశారు. 14 వ శతాబ్దం జరిగేటప్పుడు వృత్తి సంఘాలు వాటి అధికారుల్నీ, జూరర్లనీ నామినేట్ చేసే హక్కుని సాధించుకున్నాయి. వృత్తిని చేసుకోవడంలో గుత్తాధిపత్యాన్ని పొందాయి. గిల్డు మెంబర్లుకాని వాళ్ళని ఖాళీ చేయించి వెళ్లగొట్టే వాళ్ళు. ఇతర పట్టణాల వృత్తిదారులూ, గ్రామీణ వృత్తిదారులూ తమ పట్టణ మార్కెట్ లో సరుకులు అమ్మకుండా చూసేవాళ్ళు. దాంతోపాటు గిల్డులు భాగ్యవంతులైన వర్తకులతో పాటు మున్సిపల్ ప్రభుత్వ నిర్వహణలో భాగం సాధించాయి.

ఇతరులకు ప్రవేశం లేని మార్కెట్ మీద ఆధిపత్యం వహించే ఉత్పత్తిదారుడి లాభమే లక్ష్యం. ప్రతి గిల్డూ తన వృత్తిని తన సభ్యులు మాత్రమే చేసుకునే హక్కుతో ఉంటుంది. బయటవారెవ్వరినీ ఆవృత్తికి అనుమతించదు. ఈ గుత్తాధిపత్య స్వభావాన్ని ఇంగ్లండ్‌లో 'గిల్డా' (gilda) అనేవారు. "ఫ్యూడల్ పారిశ్రామిక వ్యవస్థలో కొత్తవాళ్ళకు ప్రవేశం లేని వృత్తి సంఘాలకు పారిశ్రామిక ఉత్పత్తులమీద గుత్తాధిపత్యం ఉండింది."[2] సంఘసభ్యులకు మాత్రమే ఆ వృత్తి చేసే హక్కుంటుంది. ఇతరులు ఆసరుకుల్ని ఉత్పత్తి చెయ్యకూడదు.

## గిల్డు నిబంధనలు

- తాను మేస్త్రీ అయిన వృత్తిలో తప్ప మరే యితర వృత్తిలోనూ జర్నీమాన్‌ని నియోగించకూడదు.

ఉదాహరణకి, వడ్రంగం మేస్త్రీ నగల వర్క్ షాప్ నడపడానికి వీలుండదు. వర్తకులు ఏ సరుకునీ ఉత్పత్తి చెయ్యలేరు. వాళ్ళు ఏ వృత్తి లోనూ మేస్త్రీలు కాకపోవడమే అందుకు కారణం. ఈనిబంధన ద్వారా వర్తక పెట్టుబడి పరిశ్రమల్లోకి చొచ్చుకు రాకుండా నిరోధించ గలిగారు. "వ్యాపారి ఏసరుకునైనా కొన గలడు. కాని శ్రమ శక్తిని ఒక సరుకుగా కొన జాలడు." ఎందుకంటే అతడు ఏచేతి వృత్తిలోనూ మేస్త్రీ కాడు. ఒకవేళ వ్యాపార పెట్టుబడి ఈ నియమాలను అతిక్రమిస్తే, వృత్తి సంఘాలు తిప్పికోట్టేవి. వర్తకుడు వృత్తిదారుల ఉత్పత్తుల బేరగాడు (dealer) గా సహనంతో మెలగడం వల్లనే అతను ఉండగలిగాడు. ఆవిధంగా "వర్తక పెట్టుబడీ, వడ్డీ పెట్టుబడీ పారిశ్రామిక పెట్టుబడిగా మారకుండా పట్టణాల్లోని గిల్డులు నిరోధించాయి."

- ఒక మేస్త్రీ ఫలానింతమంది జర్నీమన్ లనీ, అప్రెంటిస్‌లనీ మించి పెట్టుకోకూడదనే నియమం ఉంది. ఎంతమందినిబడితే అంతమందిని పెట్టుకునే స్వేచ్ఛ ఉండదు. అది అతని ఇష్టం కాదు. ఒక మేస్త్రీ నియోగించగల పనివాళ్ళ సంఖ్య చాలా తక్కువ. కొద్దిమంది పనివాళ్ళే ఉంటారు కాబట్టి మేస్త్రీ దగ్గర ఎక్కువగా డబ్బు కూడే అవకాశం లేదు. ఒకవేళ ఇంకొంత

మందిని పనివాళ్ళని పెట్టుకునేపాటి డబ్బు ఉన్నా, వృత్తిసంఘం (గిల్డు) అందుకు అనుమతించదు. ఆ విధంగా మేస్త్రీ ని పెట్టుబడిదారుడు అవకుండా గిల్డు నిబంధనలు అడ్డుకున్నాయి. ఇంగ్లండులో రాజునుండి పొందిన గుత్తాధిపత్యానికి గిల్డులు సంవత్సరానికింతని డబ్బుకట్టేవి. పొరుగు పట్టణాల వృత్తిదారులూ, గ్రామీణ వృత్తిదారులూ తమ మార్కెట్లో సరుకులు అమ్మకుండా కట్టుదిట్టం చేసేవారు. గిల్డు సభ్యులు పట్టణంలో గస్తీ తిరిగేవారు.

- పనివాళ్ళు ఒక మేస్త్రీ నించి మరొక మేస్త్రీ దగ్గరకు పోకూడదు. శ్రామికుడికి తన శ్రమ శక్తిని ఇచ్చవచ్చినట్లు అమ్ముకునే స్వేచ్ఛలేదు. అందుకు భిన్నంగా పెట్టుబడిదారీ రూపంలో పెట్టుబడికి ముందు తన శ్రమశక్తిని అమ్ముకోగల స్వేచ్ఛాయుత వేతన శ్రామికుడు కావాలి. బానిసగానో, అర్ధబానిసగానో, వేరొకరి అధీనుడిగానో వుండకూడదు. స్వేచ్ఛగా తన శ్రమశక్తిని ఎక్కడ మార్కెట్ ఉంటే, అక్కడకు పోయి అమ్ముకోవాలంటే, వృత్తిసంఘాల నించి తప్పించుకోవాలి. అప్రెంటిస్‌లకీ, జర్నీమెన్‌లకీ విధించిన నిబంధనలనుండి బయటపడాలి. గిల్డు చెప్పేదాకా జర్నీమాన్ సొంత వర్క్‌షాప్ తెరవజాలడు. అందువల్ల సొంత వర్క్‌షాప్ పెట్టుకోవడం అతని చేతుల్లో ఉండదు.

- ఒక వర్క్‌షాపులో ఫలానిన్ని పనిముట్లు మాత్రమే ఉండాలి అనే నియమం ఉండేది. అంతకు మించి ఉండకూడదు. ఉదాహరణకి, ఒక నేత మేస్త్రీ దగ్గర ఎన్ని మగ్గాలుండవచ్చో, ఎన్ని ఇతర పనిముట్లుండవచ్చో నిబంధన ఉంటుంది.

- కొత్త పనిముట్లను ప్రవేశపెట్టకూడదు. కొన్ని సార్లు విలువైన నూతన ఆవిష్కరణల్నిగిల్డు పెద్దలు ధ్వంసం చేసేవారు. తోటివారి కంటే వేగంగానూ, చౌకగానూ సరుకులు తయారుచేసే పద్ధతులూ, పరికరాలూ వాడకూడదు. అలా వాడి మరొకరికి హాని కలిగించగూడదు. సాంకేతిక పురోగమనం స్వామిద్రోహంగా పరిగణించబడేది. పారిశ్రామిక అమరికలో పరిస్థితుల స్థిరత్వం ఆనాటి ఆదర్శం. మధ్య యుగాల్లో కొందరు ఆవిష్కర్తలు వేధింపులకి గురయ్యారు. 1733లో ఫ్లైయింగ్ షటిల్ ని జాన్ కే కనిపెట్టాడు. గిల్డులు ఆయన్ని వేధించాయి. చివరకతను ఫ్రాన్స్ లో సెటిల్ అవాల్సి వచ్చింది. అక్కడ దాన్ని నేతగాళ్ళకి చూపించడానికి సైతం భయపడ్డాడు తమ గుత్తాధిపత్యం దెబ్బతింటుంది కనుక, పట్టణ గిల్డులు సాంకేతిక ప్రగతిని అడ్డుకునేవి. అధికారులు వీటి ఒత్తిడికి లొంగి నూతన ఆవిష్కరణల్ని నిలిపివేసిన సందర్భాలున్నాయి. 1397 లో కొలోన్ లో టైలర్లని 'పిన్ను తల' ఒత్తే మిషన్ వాడకుండా నిషేధం పెట్టారు. 1561లో నూరెంబెర్గ్ నగర కౌన్సిల్ మెరుగైన స్లైడ్ రెస్ట్ లేత్ కనుగొన్న హాన్స్ స్పైచీ అనే రాగిపని వాణ్ణి ఆటంక పరిచింది. మొదట అదే కౌన్సిల్ దాన్ని కనిపెట్టినందుకు అతనికి బహుమతిచ్చింది. ఆ తర్వాత వేధించసాగింది. దాన్ని అమ్మిన వాళ్ళని ఖైదు చేస్తానని బెదిరించింది. 1579లో డాన్జిగ్‌లో రిబ్బన్‌మగ్గం కనుగొన్న వానిని కౌన్సిల్ రహస్య ఆదేశంతో నీళ్ళలో ముంచారు. 1551లో బ్రిటిష్ పార్లమెంట్ ఊలు బట్ట తయారీలో వాడే చేతి గిగ్ మిల్లులు వాడడాన్ని నిషేధించింది. 1589లో విలియం లీ కనిపెట్టిన కుట్టు ఫ్రేం ని నేత గిల్డు వ్యతిరేకించింది. ఎంతగా అడ్డుకుందంటే, లీ బ్రిటన్ నుండి వెళ్లిపోవాల్సివచ్చింది. 1638లో బ్రిటన్లో రాజు రిబ్బన్ మగ్గాన్ని నిషేధించాడు.

ఆవిధంగా "గిల్డులచే నియంత్రించబడ్డ మధ్యయుగాల చేతివృత్తుల ఉత్పత్తి పెద్ద పెట్టుబడిదారుల ఉనికినీ, జీవితపర్యంత వేతన కార్మికుల మనుగడనీ నిరాకరించింది."[3]

## వృత్తి మేస్త్రీ వర్క్ షాప్‌కీ, పెట్టుబడి దారుడి కార్ఖానాకీ తేడాలు

ఉత్పత్తి విధానానికి సంబంధించి, కార్ఖానా దాని తొలి దశల్లో గిల్డుల చేతివృత్తుల నుండి ఒక్క అంశంలో తప్ప భిన్నమైనది కాదు. ఆ ఒక్క అంశం ఏమంటే: కార్ఖానా వ్యవస్థలో ఒకే పెట్టుబడి దారుడు ఎక్కువ మంది పనివాళ్ళను పెట్టుకోవచ్చు. వృత్తి సంఘాల కాలంలో అది కుదరదు.

ఉదాహరణకి, ఒక గిల్డు ముగ్గురు పనివాళ్ళని మించి నియమించరాదనే నియమం పెట్టిందనుకుందాం. 30 మందిని పెట్టుకోడానికి 10 వర్క్‌షాప్‌లు అవసరం. 10 మంది మేస్త్రీలు ఒక్కొక్కరు ముగ్గురేసి మందిని పెట్టుకోవాలి. అదే కార్ఖానా అయితే ఇంతమందే పనివాళ్ళు ఉండాలి అనే నియమం లేదు. కనుక, ఈ 30 మందే కాదు మరొక 300 మందినైనా ఒకే కార్ఖానాలో ఒకే వ్యక్తి నియమించుకోవచ్చు. తొలిదశలో **అక్కడా, ఇక్కడా చేతివృత్తి పనే.** కనుక, కార్ఖానాలో కేవలం కార్మికుల సంఖ్యకు పరిమితి లేకపోవడమే ప్రధానమైన తేడా.

మేస్త్రీ వర్క్ షాప్ లోనూ, పెట్టుబడిదారుడి కార్ఖానాలోనూ చేతిపనే. మొదటిదాంట్లో పని వాళ్ళు అతి కొద్దిమంది. రెండోదాంట్లో ఎంతమందైనా ఉండచ్చు. మధ్యయుగాల చేతివృత్తి మేస్త్రీ కున్న వర్క్ షాప్ పెద్దదయింది, అంతే.

## వర్క్ షాప్ లో శ్రమ విభజన లేదు–కార్ఖానాలో ఉంటుంది

వృత్తిసంఘాల కాలంలో వర్క్ షాపు లో శ్రమ విభజన ఉండేది కాదు. మేస్త్రీ, జర్నీమాన్, వస్తువుని ఆసాంతమూ ఎవరికి వారు చేసేవారు. పరిస్థితుల వల్ల శ్రమ విభజన జరిగితే, అప్పటికున్న గిల్డులు విడిపోయేవి. ఫలితంగా గిల్డుల సంఖ్య పెరిగేది. పారిస్‌లో 13వ శతాబ్దంలో 100కి కొంచెం మించి గిల్డులు ఉండేవి. అవి 14 శతాబ్దంలో 350కి చేరాయి. కమ్మరి సంఘం లోపల ఆయుధాలు చేసేవారూ, కవచాలు చేసేవారూ, కత్తులు చేసేవారూ ఎవరికీ వారు సొంత వృత్తిసంఘాలు పెట్టుకున్నారు. చర్మాల సంఘం నించి చెప్పులు చేసే వాళ్ళూ బెల్టులు చేసే వాళ్ళూ , సంచులు చేసేవాళ్ళూ విడిపోయి వేర్వేరు వృత్తి సంఘాలు ఏర్పరచుకున్నారు. మార్క్స్ అంటాడు: వృత్తి సంఘం నిర్వహణ వర్క్ షాపు లోపల శ్రమ విభజనని నిరాకరిస్తుంది. గిల్డు నిబంధలవల్ల, ఉత్పత్తి పరిమితంగా ఉండేదన్నది స్పష్టమే. అవసరాలు పెరిగాయి. గిల్డు హక్కులు ఉత్పత్తికి సంకెళ్ళు అయ్యాయి. బూర్జువా విప్లవం దీనికి ముగింపు పలికింది.[4]

వృత్తిసంఘాల కాలంలో వర్క్ షాపులో శ్రమ విభజన ఉండదు.

శ్రమ విభజన మీద ఆధారపడిన సహకారం కార్ఖానా ఉత్పత్తికి విశిష్ట రూపం. ఆ కాలమంతా అది (శ్రమ విభజన మీద ఆధారపడిన సహకారం) పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియ యొక్క లాక్షణిక రూపం.' వడ్డీల వల్లా, వర్తకం వల్లా ఏర్పడిన డబ్బు పెట్టుబడి పారిశ్రామిక పెట్టుబడి అవడానికి గ్రామాల్లో భూస్వామ్య రాజ్యాంగంచేతా, పట్టణాల్లో గిల్డులచేతా ఆటంకపరచబడింది'[5].

## గిల్డుల విచ్ఛిత్తి –పెట్టుబడిదారీ ఉత్పత్తి

పట్టణ జనాభా గణనీయంగా పెరిగింది. దాంతో ఎక్కువ సరుకులు అవసరమయ్యాయి. వృత్తి మేస్త్రీల వర్క్ షాపుల్లో, ఉత్పత్తి తక్కువ స్థాయిలో ఉంటుంది గదా! అందువల్ల గిరాకీకి సరిపడే సరఫరా చేయలేకపోయాయి. అవసరాల్ని తీర్చలేకపోయాయి. ఉత్పత్తి పెరగాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. పెరగడానికి గిల్డు నిబంధనలు ఆటంకమయ్యాయి. సంకెళ్ళు అయ్యాయి. కాబట్టి గిల్డునిబంధనలు నిలబడలేకపోయాయి. అమలు కావడం అసాధ్యం అయింది. ఇతర పట్టణాలలోనూ, గ్రామీణ ప్రాంతాల్లోనూ తయారైన వస్తువులు మార్కెట్లో ప్రవేశించాయి. కూడదు అనే నిబంధన నీరుగారి పోయింది. ఎక్కువమంది పనివాళ్ళు ఉత్పత్తిలో పాల్గొనాల్సి వచ్చింది - కొద్ది మందినే పెట్టుకోవాలి అనే గిల్డు నియమానికి కాలం చెల్లింది. పనివాళ్ళకి డిమాండు పెరిగినందువల్ల ఒక మేస్త్రీ నించి జర్నీమన్ మరోకరిదగ్గరకు పోకూడదు అనే నియమం పట్టు తప్పింది. ఎక్కువ మందితో పని చేయించాలంటే అస్థిర పెట్టుబడి పెరుగుతుంది. అందుకు అనుగుణంగా ఉత్పత్తి సాధనాలు పెరుగుతాయి. అంటే స్థిర పెట్టుబడి కూడా పెరుగుతుంది. పైగా వృత్తి మేస్త్రీలు చాలామంది అంతంత పెట్టుబడులు పెట్టలేరు. అందువల్ల వర్తక పెట్టుబడిని ఉత్పత్తి రంగంలోకి రాకుండా నిషేధించిన నిబంధనలూ చట్టాలూ నిర్వీర్యమై పోయాయి. వృత్తి మేస్త్రీ వర్క్‌షాప్ విధానానికి కాలం చెల్లింది. పెట్టుబడిదారుడి కార్ఖానా రావలిసిన అవసరం వచ్చింది.

**కార్ఖానా వెలసింది.** "ఫ్యూడల్ పారిశ్రామిక వ్యవస్థలో, కొత్తవాళ్ళకు ప్రవేశంలేని వృత్తిసంఘాలకు పారిశ్రామిక ఉత్పత్తి మీద గుత్తాధిపత్యం వుండింది. కొత్త మార్కెట్ల యొక్క పెరుగుతున్న అవసరాలను ఆ వ్యవస్థ యిక ఎంతమాత్రమూ తీర్చలేకపోయింది. దాని స్థానంలో కార్ఖానా వ్యవస్థ (manufacturing system) వచ్చింది. కార్ఖానాల ద్వారా ఉత్పత్తి సాగించే మధ్యతరగతి వచ్చి వృత్తిసంఘ మేస్త్రీలను పక్కకు నెట్టివేసింది"[6]

కార్ఖానాల్లో పనివాళ్ళు అందరూ ఒకే పని చెయ్యడం, సరుకుని ఆసాంతమూ చెయ్యడం అనే గిల్డు నియమం పోయింది. శ్రమ విభజన ప్రవేశించింది. "ప్రతి కార్ఖానా లోనూ శ్రమవిభజన ప్రవేశించడంతో వివిధ వృత్తి సంఘాల మధ్య వుండిన శ్రమ విభజన అంతరించింది."[7]

వృత్తిమేస్త్రీలు ఉత్పత్తిసాధనాల అభివృద్ధిని ఆటంక పరిచారు. పెట్టుబడి దారులు కొత్త ఆవిష్కరణల్ని ప్రోత్సహించారు. ప్రణాళికలో చెప్పినట్లు : ఉత్పత్తి సాధనాలలో నిరంతరం విప్లవం తేకుండా బూర్జువా వర్గం జీవించలేదు.[8] ఉత్పత్తి ఇబ్బడికిబ్బడయింది. సరుకుల డిమాండుకి తగ్గట్టు సరుకులు మార్కెట్ కొచ్చాయి. కనుక గిల్డుల ఆధిపత్యం పోయి, పెట్టుబడి దారీ ఉత్పత్తి విధానం మొదలయింది.

1794 లో కూడా లీడ్స్ పట్టణానికి చెందిన బట్ట ఉత్పత్తిదారులు పార్లమెంటుకి ప్రతినిధుల్ని పంపారు. ఏ వ్యాపారీ, తయారీ దారుడు గా ఉండరాదు అని చట్టం తేవాలని కోరారు. ఎన్ని ప్రయత్నాలు చేసినా పెట్టుబడిని నిలువరించలేక పోయారు. భూ ఆక్రమణవల్ల గ్రామీణ ప్రజలు పాక్షికంగా గ్రామాల్ని ఖాళీ చేసి పట్టణాలకు పారి పోవాల్సి వచ్చింది. ఫ్యూడల్ వ్యవస్థ క్రమంగా కరిగిపోసాగింది.

ఇక కొత్త కార్ఖానాలు ఓడరేవుల దగ్గరా, అప్పటి మునిసిపాలిటీల, వృత్తిసంఘాల నియంత్రణ లేని సుదూర లోతట్టు ప్రాంతాల్లోనూ నెలకొల్పారు. అందువల్ల గ్రామీణ ఫ్యూడల్ వ్యవస్థా, పట్టణ వృత్తిసంఘ వ్యవస్థా రెండూ, డబ్బు పెట్టుబడి పారిశ్రామిక పెట్టుబడిగా మారకుండా ఎంత ప్రయత్నించినా నిరోధించలేకపోయాయి. అందుకే ఇంగ్లండ్ లో ఈ కొత్త పారిశ్రామిక నారుమళ్ళతో కార్పొరేట్ పట్టణాలూ, అక్కడి వృత్తిసంఘాలూ తీవ్రంగా పోరాడాయి. అయినా పెట్టుబడిదారీ ఉత్పత్తి ముందుకు పోయింది.

## References


1. కమ్యూనిస్ట్ ప్రణాళిక సం.ర. 1.పేజి 46
2. కమ్యూనిస్ట్ ప్రణాళిక సం.ర. 1.పేజి 45 ఫుట్ నోట్ 3. 1888 నాటి ఇంగ్లిష్ కూర్పుకు ఎంగెల్స్ వివరణ.
3. Anti-Duhring p.183 soft 105 MECW vol 25p136
4. Anti-Duhring p. 116
5. Capital1.703
6. కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక- మార్క్సు ఎంగెల్స్ సంకలిత రచనలు1.46-47
7. కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక- మార్క్సు ఎంగెల్స్ సంకలిత రచనలు1.48
8. Capital1.457 Fn 1

## పెట్టుబడికి ఉషోదయం

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఉదయించినట్లు సూచించిన అంశాలు:

1. అమెరికాలో వెండీ, బంగారమూ ఉన్నట్లు కనుక్కోవడం
2. ఆదివాసీ ప్రజల్ని నిర్మూలించడం, బానిసలుగా చెయ్యడం, గనుల్లో సమాధి చెయ్యడం
3. తూర్పు ఇండియా దీవుల్ని జయించడం, కొల్లగొట్టడం ప్రారంభించడం.
4. వ్యాపారం కోసం నల్లవాళ్లని వేటాడే ప్రాంతంగా ఆఫ్రికాని మార్చడం

ఈ కార్యకలాపాలే ఆదిమ సంచయనాన్ని నడిపిన ప్రధాన శక్తులు.

### వాణిజ్య యుద్ధం

వీటి వెంట ఐరోపా రాజ్యాల మధ్య వాణిజ్య యుద్ధం వచ్చింది. ఆయుద్ధానికి ప్రపంచం అంతా రణస్థలం అయింది. స్పెయిన్ నుంచి స్వాతంత్ర్యం కొసం నెదర్ లాండ్స్ తిరుగుబాటు చెయ్యడంతో వాణిజ్య యుద్ధం మొదలయింది., ఇంగ్లండ్ దేశపు జకోబిన్ వ్యతిరేక యుద్ధంతో అది విపరీత ప్రమాణానికి చేరింది. చైనాకి వ్యతిరేకంగా జరుగుతున్న నల్లమందు యుద్ధాలూ వగయిరా రూపాల్లో ఇప్పటికీ (1867నాటికీ) వాణిజ్య యుద్ధం కొనసాగుతున్నది.

### ఆదిమ సంచయనాన్ని ప్రేరేపించిన అంశాలు

ఇప్పుడు అంతో ఇంతో కాలానుక్రమంలో ప్రత్యేకించి స్పెయిన్, పోర్చుగల్, హాలండ్, ఫ్రాన్స్, ఇంగ్లండ్ దేశాలకు వ్యాపిస్తాయి. ఇంగ్లండ్‌లో 17వ శతాబ్దం చివరలో ఆ ప్రేరక శక్తులన్నీ క్రమపద్ధతిలో కొన్ని పరిణామాలలో ఏకమౌతాయి. ఆ పరిణామాల్లో చేరే అంశాలు:

1. వలసలు 2. జాతీయ రుణం 3. ఆధునిక పన్నుల పద్ధతి 4. రక్షణ పద్ధతి.

ఇవి కొంతవరకు పాశవిక బలప్రయోగం మీద ఆధారపడతాయి – ఉదాహరణకి వలసవ్యవస్థ. అయితే అవన్నీ రాజ్యాధికారాన్ని – సమాజం యొక్క కేంద్రీకృత, వ్యవస్థీకృత శక్తిని ప్రయోగిస్తాయి. ఫ్యూడల్ ఉత్పత్తివిధానాన్ని పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలోకి వేగంగా మార్చేందుకూ, అందుకు పట్టే కాలాన్ని కుదించేందుకూ రాజ్య దౌర్జన్యాన్ని ప్రయోగిస్తాయి.

**కొత్త సమాజాన్ని గర్భంలో పెట్టుకొని ఉన్న**
**పాత సమాజానికి బలప్రయోగమే మంత్రసాని**
**బలప్రయోగం తనంత తానుగా ఒక ఆర్థిక శక్తి**

### వలస వ్యవస్థ

క్రైస్తవ వలస వ్యవస్థ గురించి ఆ మతాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేసిన హొవిట్ అభిప్రాయం: ప్రపంచంలో ప్రతిప్రాంతంలోనూ, వాళ్ళు లొంగదీసుకున్న ప్రజా సమూహాలమీద, క్రైస్తవ జాతి సాగించిన కిరాతక అకృత్యాలూ, అత్యాచారాలూ పోలిక లేనంతటివి. ఆజాతి ఎంత భయంకరమైనదయినా, చదువులేనిదైనా, కరుణ లేనిదైనా, సిగ్గు మాలిన దయినా, ఏ యుగంలోనూ, ఇంతటి ఘాతుకం చేసిన జాతి భూమ్మీద మరొకటి లేదు.

**హాలండ్** 17 శతాబ్దంలో అగ్ర పెట్టుబడిదారీ దేశంగా ఉంది. ఆదేశపు వలస పరిపాలనా చరిత్ర ద్రోహంతో, లంచంతో, ఊచకోతతో, నీచత్వంతో నిండిపోయింది. ఆ దేశం మనుషుల్ని దొంగిలించి జావాకి బానిసలుగా చేసిన పద్ధతి కన్నా లాక్షణిక మైనది మరొకటి లేదు. ఈ పనికోసం దొంగలకి శిక్షణ ఉండేది. దొంగా, దుబాసీ, అమ్మేవాడూ ఈ వ్యాపారంలో ముఖ్యమైన ఏజెంట్లు. స్థానిక ప్రభువులు ప్రధాన అమ్మకందార్లు. దొంగిలించబడ్డ యువతీయువకుల్ని పంపించే బానిస ఓడలు రెడీ అయ్యేదాకా సెలెబిస్ లో ఉన్న రహస్య నేలమాళిగల్లో పడేసేవాళ్ళు. ఒక నివేదికలో ఇలా ఉంది: మకస్సార్ అనే పట్టణం నిండా రహస్య బందిఖానాలు ఉన్నాయి. అవి ఒకదాన్ని మించి ఒకటిభయంకరమైనవి. కుటుంబాలనుండి వీడదీయబడి, దురాశకీ, నిరంకుశత్వానికీ బలిపశువులైన నిర్భాగ్యులతో క్రిక్కిరిసి ఉన్నాయి.

**డచ్ వాళ్ళు** మలక్కాను పొందడానికి  పోర్చుగీసు గవర్నర్ కి లంచం ఇచ్చారు. 1641లో ఆ గవర్నర్ వాళ్ళని పట్టణంలోకి జొరబడనిచ్చాడు. ప్రవేసిస్తూనే వాళ్ళు  ఇంటికి వెళ్ళి ఆయన్ని హతమార్చారు. అతను చేసిన ద్రోహానికి చెల్లించాల్సిన 21,875 పౌన్లని మిగుల్చుకున్నారు. వాళ్ళు ఎక్కడ కాలుబెడితే అక్కడల్లా విధ్వంసమే, జనక్షయమే. జావాలోని  బంజువాంగి అనే రాష్ట్రంలో 1750లో 80,000 మంది జనం ఉండేవాళ్ళు. 1811లో కేవలం 18,000 మంది మాత్రమే మిగిలి ఉన్నారు. ఎంతటి మధురమైన వర్తకమో!

**ఈస్ట్ ఇండియా కంపెనీ** ఇండియాలో రాజకీయ పరిపాలనాధికారం పొందిందని అందరికీ తెలుసు. దానికి తోడు తేయాకు వ్యాపారం పైన గుత్తాధిపత్యాన్నీ, అలాగే చైనా వ్యాపారం మొత్తం పైనా, ఐరోపా లోనికీ, వెలపలికీ జరిగే రవాణా పైనా గుత్తాధిపత్యాన్ని సాధించింది. ఇది అందరికీ తెలిసిందే. అయితే, అక్కడి తీరప్రాంత వర్తకమూ, ద్వీపాల మధ్య వ్యాపారమూ, దేశం లోని అంతర్గత వర్తకమూ కంపెనీ ఉన్నతోద్యోగుల గుత్తాధిపత్యం కింద ఉన్నాయి. ఉప్పు, నల్లమందు, తమలపాకులు వంటి సరుకులపైన ఉన్న గుత్తధికారాలే వాళ్ళకు  తరగని ధన గనులు. ఆ ఉద్యోగులే ధర నిర్ణయించి విచారంతో ఉన్న హిందువుల్ని ఎడాపెడా కొల్లగొట్టేవాళ్ళు. ఈ ప్రైవేట్ వ్యాపారంలో గవర్నర్ జనరల్ సైతం పాల్గొనేవాడు. ఆయనకి ఇష్టులైన వాళ్ళు అనుకూలమైన నిబంధనలతో కాంట్రాక్టులు పొందేవారు. ఆ నిబంధనలు ఎంత లాభసాటిగా ఉండేవంటే, వాళ్ళు శూన్యంలో సువర్ణం సృష్టించుకునే  వాళ్ళు. ఒక్క రోజులోనే గొప్ప ధన నిధులు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చేవి. ఒక్క షిల్లింగు అయినా పెట్టుబడి పెట్టకుండానే, ఆదిమ సంచయనం సాగిపోయింది. వారెన్ హేస్టింగ్స్ మీద విచారణలో ఇలాంటి ఘటనలు కుప్పలు తెప్పలుగా ఉన్నాయి. ఉదాహరణకి సల్లివాన్ అనే వ్యక్తి ఇండియాలో నల్లమందు జిల్లాలకు దూరంగా ఉండే ఒకచోటకి ప్రభుత్వ పని మీద పోతున్నాడు. అప్పుడు అతనికి నల్ల మందు కాంట్రాక్ట్ ఇవ్వబడింది. అతను ఆ కాంట్రాక్ట్ ని 40,000 పౌన్లకి బిన్ అనే వానికి అమ్ముకున్నాడు. ఆరోజే బిన్ దాన్ని తిరిగి 60,000 పౌన్లకి మరొకరికి అమ్మేశాడు. చివరలో కొని కాంట్రాక్ట్ ని నెరవేర్చినవాడు, తాను భారీ లాభం పొందానని ప్రకటించాడు. పార్లమెంట్ ముందుంచిన ఒక లిస్టు ప్రకారం, 1757-1766 కాలంలో ఈస్ట్ ఇండియా కంపెనీ దాని  ఉద్యోగులూ భారతీయులనుంచి బహుమానాల రూపంలో పొందిన మొత్తం

60 లక్షల పౌన్లు. 1769 – 1770 మధ్య ఇంగ్లిష్ వాళ్ళు మొత్తం ధాన్యాన్ని కోనేసి, విపరీతమైన ధరలకు తప్ప అమ్మేందుకు నిరాకరించారు, తద్వారా తీవ్రమైన కరువు సృష్టించారు. 1866లో 10 లక్షల మందికి పైగా హిందువులు ఒక్క ఒరిస్సాలోనే ఆకలితో చచ్చిపోయారు. అయినాగాని, పస్తులతో పడున్న జనానికి అవసరమైన వస్తువుల్ని అమ్మే ధరలతో ఖజానాని నింపే ప్రయత్నం జరిగింది.

## హాలండ్ వలసలూ – ప్రజల అణచివేతా

వలసవ్యవస్థ వ్యాపారాన్నీ, సముద్రయానాన్నీ పక్వదశకు తెచ్చింది. లూథర్ 'గుత్త సమాజాలు' (Societies Monopolia) పెట్టుబడి కేంద్రీకరణకి శక్తివంతమైన కీళ్ళు (levers) గా ఉన్నాయి. మొగ్గతొడుగుతున్న తయారీ పరిశ్రమలకి వలస ప్రాంతాలు మార్కెట్ ని సమకూర్చాయి. మార్కెట్ పైన గుత్తాధిపత్యం ద్వారా సంచయనాన్ని పెంచడానికి దోహదం చేశాయి. ఐరోపా బయట నగ్నదోపిడీ ద్వారా, బానిసీకరణ ద్వారా, హత్యల ద్వారా కొల్లగొట్టిన నిధులు మాతృదేశాలకు వెళ్ళాయి. అక్కడ అవి పెట్టుబడిగా మారాయి.

వలసవ్యవస్థ సంపూర్ణంగా వృద్ధిచెందిన తొలి దేశం హాలండ్. అక్కడ 1648 నాటికే వాణిజ్యం శిఖరాగ్రాన్ని చేరి ఉంది. ఈస్ట్ ఇండియా వర్తకమూ, ఈశాన్య ఐరోపాకీ, నైరుతీ ఐరోపాకీ మధ్య వాణిజ్యమూ పూర్తిగా దాని హస్తగతమై ఉన్నాయి. దాని చేపల పరిశ్రమలూ, నౌకలూ, కార్ఖానాలూ ప్రతి ఇతర దేశపు వనరుల్ని అధిగమించి ఉన్నాయి. దాని మొత్తం పెట్టుబడి, ఇతర ఐరోపా దేశాల పెట్టుబడులన్నీ కలిసినంత పెట్టుబడి కంటే బహుశా ఎక్కువ ముఖ్యమైనదిగా వుంది. ఇంత చెప్పిన గులిచ్ 1648 నాటికి హాలండ్ ప్రజలు ఐరోపాలోని అన్నిదేశాల ప్రజలందరికన్నా ఎక్కువ చాకిరి చేసేవారనీ, మరింత పేదవాళ్ళనీ, ఎక్కువ పాశవికంగా అణచివేతకి గురయ్యారనీ – వాస్తవాన్ని చెప్పడం మర్చిపోయినట్లుంది.

## వలసవ్యవస్థ ప్రబల పాత్ర

ఈ రోజుల్లో పారిశ్రామిక ఆధిక్యత ఉంటే వాణిజ్య ఆధిక్యత ఉన్నట్లు. అసలైన కార్ఖానా కాలంలో అలాకాదు, వాణిజ్యంలో ఆధిక్యతే పారిశ్రామిక రంగంలో ప్రాబల్యాన్ని కలగజేస్తుంది. అందువల్లనే, అప్పట్లో వలస వ్యవస్థ అత్యంత ప్రబల పాత్ర పోషించింది. వలస వ్యవస్థ ఒక విచిత్ర దేవత. మొదటమొదట ఐరోపా దేవుళ్ల సరసన పీఠం వేసింది. ఒక శుభముహూర్తాన ఆదేవుళ్ళనందర్నీ ఒక్కతొపుతో, ఒక్కతన్నుతో కుప్పగా కూలగొట్టింది. మానవ జాతి ఏకైక గమ్యమూ, లక్ష్యమూ అదనపువిలువని సృష్టించడమే – అని ప్రకటించింది.

## ప్రభుత్వ రుణ వ్యవస్థ

జాతీయ రుణం మూలాలు మధ్య యుగాల్లోనే జినోవాలో, వెనిస్‌లో కనబడ్డాయి. కార్ఖానా కాలంలో సాధారణంగా ఐరోపా అంతటినీ జాతీయ రుణం పట్టుకుంది. సముద్ర వర్తకంతోనూ, వాణిజ్య యుద్ధాలతోనూ కూడివున్న వలసవ్యవస్థ జాతీయ రుణ వ్యవస్థని బలవంతంగా పెంచే సాధనంగా పనిచేసింది. ఆవిధంగా రుణవ్యవస్థ మొదట హాలండ్ లో వేళ్ళూనింది. జాతీయ రుణాలు – అంటే, రాజ్యం యొక్క పరాయీ కరణ – ఆరాజ్యం నిరంకుశమైందైనా, రాజ్యాంగాన్ని

అనుసరించేదైనా లేక రిపబ్లిక్ వంటిదైనా పెట్టుబడిదారీ యుగానికి ఆరంభ ముద్ర వేశాయి. జాతీయ ఆదాయం అనే దానిలో ఆధునిక ప్రజల సమష్టి నిధుల్లో వాస్తవంగా ప్రవేశించే ఒకే ఒక భాగం ప్రజల జాతీయ రుణమే. కాబట్టి, ఒక జాతి ఎంత ఎక్కువ అప్పుల్లో ఉంటే, అది అంత భాగ్యవంతమైంది అవుతుంది – అనే ఆధునిక సూత్రం ఏర్పడింది. ప్రభుత్వ రుణం అనేది పెట్టుబడికి ఒక మత విశ్వాసం అయింది. జాతీయ రుణాలు పెరిగిపోవడంతో, జాతీయ రుణం పట్ల నమ్మకం లేకపోవడం అనేది క్షమార్హంకాని దైవనింద అయింది.

ప్రభుత్వ రుణం ఆదిమ సంచయనానికి అత్యంత శక్తివంతమైన మీటల్లో (levers) ఒకటి. అది ఏమాత్రం పెరగకుండా పడున్న (barren) డబ్బుకి పెరిగే శక్తి నిస్తుంది, పెట్టుబడిలోకి మారుస్తుంది. దాన్ని పరిశ్రమ లోనో, వడ్డీ వ్యాపారంలోనో పెడితే తప్పకుండా ఉండే చిక్కులూ, ప్రమాదాలూ ఉండవు. ప్రభుత్వానికి అప్పిచ్చే రుణదాతలు నిజానికి వాస్తవంగా ఇచ్చేదేమీ లేదు. ఎందుకంటే, అప్పుగా ఇచ్చిన మొత్తాన్ని బాండ్ల రూపంలో పొందుతారు. ఆ ప్రభుత్వ బాండ్లు వాళ్ళ చేతుల్లో అంతే మొత్తం రొక్కం ఎలా పనిచేస్తుందో అలాగే పనిచేస్తాయి.

1. రుణవ్యవస్థ ఆ విధంగా ఏటేటా ఒకమొత్తంలో డబ్బు తీసుకునే సోమరులు (lazy annuitants) ఏర్పడడానికి దోహదం చేసింది.

2. డబ్బు సర్దుబాటుచేసే ద్రవ్యనిర్వాహకుల (financiers) సంపదనీ, ప్రభుత్వానికీ, జాతికీ మధ్య లావాదేవీలు నడిపే దళారీల సంపదనీ పెంపు చేసింది.

3. అదేవిధంగా, పన్నులు కట్టే వ్యవసాయదారులకూ, వర్తకులకూ, ప్రైవేటు వస్తూత్పత్తి దారులకూ ప్రతి జాతీయ రుణంలోని గణనీయమైన భాగం ఆకాశం నుండి పడ్డ పెట్టుబడిలాగా సేవ చేసింది.

4. ఇవన్నీ కాక జాతీయ రుణం జాయింట్ స్టాక్ కంపెనీలు ఏర్పడడానికీ కారణం అయింది. చేతులు మారగల అన్నిరకాల వ్యాపారాల్నీ, ఒక్క మాటలో స్టాక్ ఎక్స్ఛేంజ్ జూదాన్నీ, ఆధునిక బాంక్‌స్వామ్యాన్నీ (bankocracy) సృజించింది. జాతీయ బిరుదులు అలకరించుకొని ఉన్న పెద్దపెద్ద బాంకులు, అవి పుట్టినప్పుడు కేవలం ప్రైవేట్ సాహస వ్యాపారస్తుల (specula-tors) సంఘాలు మాత్రమే. ఈ వ్యాపారులు ప్రభుత్వాల పక్క నిలబడ్డారు. ప్రభుత్వాలనుండి ప్రత్యేక హక్కులు పొందారు. వాటి మూలంగా రాజ్యానికి ముందుగా డబ్బిచ్చే స్థితిలో వున్నారు.

## బాంక్ ఆఫ్ ఇంగ్లండ్

ఈ బాంకుల పూర్తి అభివృద్ధి, బాంక్ ఆఫ్ ఇంగ్లండ్ ఏర్పడ్డ 1694 నుంచీ మొదలైంది. ఆ బాంక్ ప్రభుత్వానికి 8 శాతం వడ్డీకి అప్పివ్వడంతో ఆరంభించింది. అదేసమయంలో, బాంక్ నోట్ల రూపంలో దాన్ని తిరిగి ప్రజలకి అప్పు ఇవ్వడం ద్వారా, అదే పెట్టుబడి నుంచి డబ్బు ముద్రించే అధికారాన్ని పార్లమెంట్ ఆ బాంక్ కి ఇచ్చింది. ఈ బాంక్ నోట్లని గడువు రాకముందే బిల్లులు చెల్లించడానికీ, సరుకులకి బయానా ఇవ్వడానికీ, అమూల్య లోహాల్ని కొనేందుకు ఉపయోగించుకోడానికీ ఆ బాంక్‌కి అనుమతి వచ్చింది. ఆ బాంకే సృజించిన రుణద్రవ్యం (credit money) ఎక్కువ కాలం గడవకముందే, ఆ బాంక్ రాజ్యానికి అప్పుగా

ఇచ్చే నాణేలుగా రూపొందాయి. అలాగే ప్రభుత్వ రుణాలమీద రాజ్యం తరఫున వడ్డీ చెల్లించే నాణేలుగా రూపొందాయి. బాంకు ఈ చేత్తో ఇచ్చి, ఆ చేత్తో అంతకు మించి వెనక్కి పుచ్చుకున్నది. ఇదొక్కటే సరిపోలేదు. తీసుకునేటప్పుడు కూడా, బాంక్ తనిచ్చిన చివరి షిల్లింగు వరకూ జాతికి శాశ్వత రుణప్రదాతగా నిలిచింది. క్రమేణా, ఆ బాంక్ దేశంలోని లోహాల నిల్వలకు భాండాగారం అవడం అనివార్యమైంది. అలాగే అన్ని వాణిజ్య రుణాలకీ గురుత్వాకర్షణ కేంద్రం కావడమూ తప్పనిసరి అయింది. బాంక్ స్వాములూ, ద్రవ్య నిర్వాహకులూ, ఆస్తుల మీద వచ్చే ఆదాయంతో జీవించేవాళ్ళూ, బ్రోకర్లూ, క్లైంట్ల కోసం స్టాక్‌లు కొనడం అమ్మడం చేసే స్టాక్ బ్రోకర్లూ, మొదలైనవాళ్ళు హఠాత్తుగా విజృంభించారు.

ఆ విజృంభణ ప్రభావం సమకాలీనులమీద ఎలా ఉన్నదనేది అప్పటి రచనలు రుజువు చేశాయి.

**అంతర్జాతీయ రుణవ్యవస్థ.** జాతీయ రుణంతో పాటు అంతర్జాతీయ రుణవ్యవస్థ ఏర్పడింది. అది తరచుగా ఆ జాతినో ఈ జాతినో ఆదిమ సంచయనపు వనరుల్లో ఒకదాన్ని దాచిపెడుతుంది. ఆ విధంగా వెనిస్ చోర వ్యవస్థ దుష్ట చర్యలు హాలండ్ పెట్టుబడి సంపదకి రహస్య పునాదుల్లో ఒక పునాది అయ్యాయి. ఎందుకంటే, వెనిస్ క్షీణదశలో పడ్డప్పుడు భారీ మొత్తాల్లో డబ్బుని హాలండ్ కి అప్పుగా ఇచ్చింది. అటువంటి సంబంధమే హాలండ్‌కీ ఇంగ్లండ్‌కీ మధ్య కూడా ఉంది. 18 వ శతాబ్దం మొదటికే, హాలండ్ వస్తూత్పత్తిదారులు ఎంతో వెనకబడిపోయారు. వాణిజ్యంలోనూ, పరిశ్రమలోనూ తన ప్రాబల్యాన్ని కోల్పోయింది. అందువల్ల 1701-1776 కాలంలో హాలండ్ ముఖ్య వ్యాపార ధోరణుల్లో ఒకటి: పెట్టుబడిని అప్పుగా ఇవ్వడం, అదికూడా తనకు ప్రత్యర్థిగా ఉన్న ఇంగ్లండ్‌కి ఇవ్వడం. ఇప్పుడు ఇంగ్లండ్‌కీ, సంయుక్తరాష్ట్రాలకీ మధ్య అదే జరుగుతున్నది. ఎక్కడపుట్టిందో తెలియకుండా ఇవ్వాళ సంయుక్తరాష్ట్రాల్లో కనిపించే పెట్టుబడిలో అధికభాగం నిన్న ఇంగ్లండ్‌లో పెట్టుబడి రూపం పొందిన పిల్లల నెత్తురే.

**ఆధునిక పన్నుల వ్యవస్థ.** ప్రభుత్వ ఆదాయం జాతీయ రుణానికి మద్దతుగా ఉంటుంది. ఏటా వడ్డీ వగైరాలు చెల్లించాలి. అందుకు తగినంత ఆదాయం రావాలి. అందువల్ల ఆధునిక పన్నుల వ్యవస్థ జాతీయ రుణ వ్యవస్థకి అనివార్యమైన అంశం. ప్రభుత్వం అసాధారణ ఖర్చులు పెట్టుకోడానికి రుణాలు అవకాశం కలిగిస్తాయి; ఆ రుణాలు పన్నుకట్టే వాళ్ళకి అప్పటికప్పుడు భారం అనిపించవు. అయితే ఆ రుణాల ఫలితంగా తర్వాత కాలంలో పన్నులు పెరగడం తప్పనిసరి. మరొకపక్క, ఒకదాని తర్వాత ఒకటిగా అప్పులు చేస్తూ పోతున్నందువల్ల పన్నులు పెరుగుతుంటాయి. ఈ పన్నుల పెరుగుదల మూలంగా ప్రభుత్వం కొత్త అసాధారణ ఖర్చులకు కొత్త అప్పులు చెయ్యాల్సి వస్తుంది. **బతకడానికి అత్యంత అవసరమైన వస్తువుల మీద పన్నులు వెయ్యడం ఆధునిక ద్రవ్యాదాయ వ్యవస్థకి ఇరుసుగా ఉంటుంది.** ఆ విధంగా ద్రవ్యాదాయ వ్యవస్థ తనలో ధరల్ని ఆటోమాటిక్‌గా పెంచే బీజాన్ని ఇముడ్చుకొని ఉంటుంది. అధికపన్నులు పడడం, ఎప్పుడో జరిగే చెదుమదురు సంఘటన ఎంతమాత్రం కాదు. అది ఒక నియమం. అందువల్ల మొట్ట మొదట ఈ విధానం వచ్చిన హాలండ్‌లో గొప్ప దేశభక్తుడైన డేవిట్ దీన్ని అత్యుత్తమ విధానం అంటూ కీర్తించాడు. ఎందుకంటే: ఇది వేతన శ్రామికుణ్ణి విధేయుడుగానూ,

పొదుపరిగానూ, ఒళ్ళొంచి శ్రమచేసేవానిగానూ, అధిక శ్రమభారం వహించే వాని గానూ చేస్తుంది. ఆ ఉద్దేశ్యంతోనే ఆయన అంతగా ఆ వ్యవస్థని కొనియాడాడు. అయితే వేతన కార్మికుని మీద, దాని వినాశకరప్రభావం మనకిక్కడ అంత ముఖ్యం కాదు. ఇక్కడ పట్టించుకోవాల్సింది ఏమిటంటే, దాని (ఆ వ్యవస్థ) నుంచి వచ్చే ఫలితం అయిన బలవంతపు ఆస్తి హరణం – రైతుల, చేతివృత్తులవాళ్ళ ఆస్థి హరణం. ఒక్క ముక్కలో చెప్పాలంటే, దిగువమధ్యతగతి వాళ్ళందరి ఆస్తి హరణం. బూర్జువా ఆర్థికవేత్తలకు సైతం ఈ విషయంలో వేరే అభిప్రాయంలేదు. పన్నుల వ్యవస్థకున్న ఆస్తి హరణపు సామర్థ్యాన్ని, ఆ అధిక పన్నుల వ్యవస్థ అంతర్భాగాల్లో ఒకటైన సంరక్షణ వ్యవస్థ ఇంకా హైస్థాయికి తీసుకుపోతుంది.

**సంరక్షణ వ్యవస్థ.** సంరక్షణ వ్యవస్థ ఒక కృత్రిమ సాధనం:

1. తయారీ పారిశ్రామికుల్ని తయారుచెయ్యడానికీ
2. స్వతంత్ర శ్రామికుల ఆస్తుల్ని బలవంతంగా హరించడానికీ
3. జాతీయ ఉత్పత్తిసాధనాల్నీ, జీవనాధార సాధనాల్నీ పెట్టుబడిగా మార్చడానికీ

4. మధ్య యుగాల ఉత్పత్తి విధానం నుంచి ఆధునిక ఉత్పత్తి విధానంలోకి పరివర్తన చెందే కాలాన్ని బలవంతంగా కుదించడానికి, సంరక్షణ వ్యవస్థ ఒక కృత్రిమ సాధనంగా ఉండేది. ఈ కొత్త ఆవిష్కరణ మీద ప్రత్యేక హక్కు ఎవరిది? నాదంటే నాదని ఐరోపా రాజ్యాలు ఒకదానినొకటి చీల్చిచెండాడాయి. తమలోతాము తీవంగా ఘర్షణపడ్డాయి. ఒకసారి అదనపువిలువ ఉత్పత్తిదారుల సేవ మొదలుపెట్టాక, ఆ తర్వాతంతా రాజ్యాలు తమతమ దేశాల్లోని ప్రజల్నే పరోక్షంగా రక్షణ సుంకాలద్వారానూ, పరోక్షంగా ఎగుమతి బహుమతుల ద్వారానూ దోచుకున్నాయి. అలా దోచుకున్నా, అంతటితో తృప్తి చెందలేదు. తమ మీద ఆధారపడి ఉన్న దేశాల పరిశ్రమనంతా కూకటి వేళ్ళతో పెకలించివేశాయి – ఉదాహరణకి ఇంగ్లండ్ ఐరిష్ ఉన్ని పరిశ్రమని నాశనం చేసినవిధంగా.

ఫ్రెంచ్ రాజకీయవేత్త జీన్ బాప్టిస్ట్ కోల్బర్ట్ (1619–1683) ఉదాహరణని బట్టి, ఈ ప్రక్రియ ఐరొపా ఖండంలో చాలా కుదించబడింది. ఇక్కడ ఆదిమ పారిశ్రామిక పెట్టుబడి కొంతభాగం నేరుగా ప్రభుత్వ ఖజానా నుంచే వచ్చింది. ఫ్రెంచ్ రాజకీయవేత్త మిరాబూ (1749–1791) ఇలా అంటాడు: యుద్ధానికి ముందు శక్సనీ పారిశ్రామికంగా వెలగడానికి కారణం కోసం అంత దూరం పోనక్కరలేదు. రాజులు 18,00,00,000 అప్పులు చేశారు అనే వాస్తవాన్ని తెలుసుకుంటే సరిపోతుంది.

**అసలు తయారీ పరిశ్రమ కాలంలో ఏర్పడ్డ అంశాలు:**

1. వలసవ్యవస్థ,
2. ప్రభుత్వ రుణాలు
3. భారీ పన్నులు
4. రక్షణ సుంకాలు వగైరా.

ఇవి ఆధునిక పరిశ్రమ శిశువుగా ఉన్న కాలంలో బ్రహ్మాండంగా వృద్ధవుతాయి.

## ఆధునిక పరిశ్రమ ఆవిష్కరణా – అమాయకుల ఊచకోతా

ఆధునిక పరిశ్రమ అమాయకుల భారీ ఊచకోతతో ఆవిష్కృతమైంది. ప్రభుత్వ నావికాదళంలోకి బలవంతంగా చేర్చినట్లే, ఫాక్టరీల్లోకి కూడా చేర్చడానికి నియమించబడిన ముఠాలు, బలవంతంగా చేర్చేవి. 15వ శతాబ్దం ఆఖరి మూడోభాగం తనకాలం వరకూ వ్యవసాయ ప్రజానీకాన్ని భూమినించి వెళ్ళగొట్టిన దౌర్జన్యాల్నీ, భీభత్సాల్నీ ఈడెన్ పట్టించుకోలేదు. పెట్టుబడిదారీ వ్యవసాయాన్ని స్థాపించడానికీ, సాగుభూమికీ బీడుభూమికీ మధ్య తగిన నిష్పత్తిని నెలకొల్పడానికీ వాళ్ళని వెళ్ళగొట్టే ప్రక్రియ అవసరం. అందువల్ల ఈ ప్రక్రియ పట్ల ఈడెన్ సంతోషంతో ఉన్నాడు. కాని కార్ఖానా దోపిడీని ఫాక్టరీ దోపిడీగా మార్చడానికి పిల్లల్ని దొంగిలించడమూ, బాల బానిసత్వమూ అవసరం – అనే విషయంలో ఈడెన్ అదే ఆర్థిక దృష్టి చూప లేదు. ప్రజలు శ్రద్ధగా ఈ క్రింది విషయాన్ని పరిశీలించాల్సి ఉండవచ్చు అంటాడు. అదేమంటే: ఏ తయారీ పరిశ్రమ అయినా సజావుగా సాగడానికి అవసరమైనవి:

1. పేద పిల్లలకొసం గుడిసెల్నీ, సత్రాల్నీ గాలించడం.
2. ఆ పిల్లలచేత రాత్రిపూట ఎక్కువభాగం విశ్రాంతి లేకుండా వంతులవారీగా పనిచేయించడం
3. వేర్వేరు వయస్సుల్లో ఉన్న, వేర్వేరు మనస్తత్వాలు గల ఆడవాళ్ళనీ, మగవాళ్ళనీ ఒకచోట చేర్చడం (ఇది భ్రష్టత్వానికీ, వ్యభిచారానికీ దారి తీస్తుంది).

ఈ అంశాల్ని కోరుకునే ఏ కార్ఖానా అయినా వ్యక్తి అనందాన్నిగానీ, సమాజ సంతోషాన్ని గానీ పెంచుతుందా అనే విషయాన్ని ప్రజలే శ్రద్ధతో పరిశీలించాలి – అంటాడు ఈడెన్.

## బాలల బానిసత్వం – చిత్రహింస

డెర్బీషైర్, నాటింగ్‌హాం షైర్ కౌంటీల్లో, మరీ ప్రత్యేకించి లంకాషైర్ కౌంటీలో కొత్తగా కనుగొన్న యంత్రాల్ని వాగుల/నదుల ఒడ్డున నిర్మితమైన పెద్ద ఫాక్టరీల్లో ఉపయోగించారు. ఎందుకంటే అక్కడైతే జలచక్రాన్ని తిప్పేందుకు కావలసిన జలధార ఉంటుంది. పట్టణాలకు దూరంగా ఆ ప్రదేశాల్లో వేల సంఖ్యలో కార్మికులు అవసరమయ్యారు; అప్పటిదాకా జనం పలచగానూ, నిస్సారంగానూ ఉన్న లంకాషైర్ కి అప్పుడు అవసరమైంది జనాభా ఒక్కటే. పిల్లల చిని చిన్ని వేళ్ళకు, చురుకైన వేళ్ళకు గిరాకీ హెచ్చింది. అందువల్ల లండన్, బెర్మింగ్ హాం తదితర చోట్ల చర్చ్ ఆధ్వర్యంలో పేదలకు పనికల్పించి, పోషించే గృహాల (parish work-houses) నుంచి వాళ్ళని సేకరించే ఆచారం వెంటనే తలెత్తింది. వేలకు వేలమంది 7–14 ఏళ్ళ నిర్భాగ్య బాలలు ఉత్తరాదికి చేర్చబడ్డారు. యజమాని వాళ్ళని ఫాక్టరీ దగ్గర్లో ఉన్న అప్రెంటిస్ గృహంలో ఉంచి, బట్టలిచ్చి, తిండి పెట్టడం ఆచారం అయింది. పనులు చూడడానికి పర్యవేక్షకులు ఉండేవాళ్ళు. వాళ్ళ పనల్లా పిల్లలచేత సాధ్యమైనంత ఎక్కువ పనిచేయించడమే. ఎందుకంటే, వాళ్ళ వేతనం, వాళ్ళనుంచి గుంజుకున్న పని పరిమాణాన్ని బట్టి ఉంటుంది.

దాని పర్యవసానంగా క్రూరత్వం నెలకొన్నది....పారిశ్రామిక ప్రాంతాల్లో, ముఖ్యంగా లంకాషైర్ కౌంటీలో ఏపాపం చెయ్యని, ఏ తోడూలేని పిల్లలమీద అత్యంత హృదయవిదారకచర్యలు సాగాయి. ఆ పిల్లలు యజమానులకు అప్పగించబడ్డారు. ఆ యజమానులు హింసపెట్టి, పిల్లలచేత చచ్చేటట్లు పనిచేయించేవాళ్ళు. కొరడాలతో కొట్టే వాళ్ళు. సంకెళ్ళు వేసేవాళ్ళు హింసించే వాళ్ళు. అనేక సందర్భాల్లో పిల్లలు తిండిలేకపోయినా, పనిలో కొరడాదెబ్బలు తినేవాళ్ళు. కొన్ని సందర్భాల్లో బాధలు పడలేక ఆత్మహత్యలే శరణ్యం అయ్యేవి. ప్రజల చూపులకి దూరంగా ఉన్న సుందరమైన లోయలు – డెర్బీషైర్, నాటింగ్‌హాం షైర్, లంకాషైర్‌లు – ఇప్పుడు చిత్రహింసలకీ, హత్యలకీ ఆలవాలమైన ఏకాంత ప్రదేశాలయ్యాయి.

**రాత్రిపూట పని.** పరిశ్రమ యజమానుల లాభాలు అతీతమయ్యాయి. అయినా వాళ్ళ దాహం తీరలేదు. ఇంకా ఎక్కువైపోయింది. అందువల్ల, వాళ్ళు పరిమితిలేని లాభాలు తెచ్చిపెట్టే పద్ధతులు అవలంబించారు. రాత్రిపూట పని మొదలు పెట్టారు. ఒక జట్టు పగలంతా పనిచేసి అలసిపోయాక మరొకజట్టు చేత రాత్రంతా పనిచేయించే వాళ్ళు. పగటి జట్టు పడకలు వదలి పనికెళ్ళాక రాత్రి జట్టువాళ్ళు అవే పడకల మీద వాలేవాళ్ళు. అందువల్ల లంకాషైర్ లో పడకలు ఎప్పుడూ చల్ల బడేవి కావు.

## సంచయన పద్ధతులకు మెప్పు

కార్ఖానాల కాలంలో పెట్టుబడిదారీ ఉత్పత్తి అభివృద్ధితో ఐరొపాలో ప్రజాభిప్రాయం సిగ్గుకీ, మనస్సాక్షికీ సంబంధించిన ఆఖరి అవశేషాలను సైతం కోల్పోయింది. పెట్టుబడిదారీ సంచయనానికి సాధనంగా ఉపకరించిన ప్రతి అక్రమాన్ని గురించి జాతులు గొప్పగా చెప్పుకునేవి. ఉదాహరణకి అండర్సన్ రాసిన వాణిజ్య చరిత్ర చదవండి. 1713లో బ్రిటన్‌కీ స్పెయిన్‌కీ మధ్య జరిగిన ఉట్రెక్ట్ శాంతి సంధిలో ఆసియెంటో ఒప్పందం ఒక భాగం. దాని ప్రకారం, అప్పటిదాకా ఆఫ్రికాకూ, ఇంగ్లిష్ వెస్ట్ ఇండీస్‌కీ మధ్య జరిగిన నీగ్రో వ్యాపారాన్ని ఆఫ్రికాకూ, స్పానిష్ అమెరికాకూ మధ్య కూడా సాగించే హక్కుని స్పానియార్డుల నుండి ఇంగ్లండ్ సాధించింది. ఈ చర్య ఇంగ్లిష్ వాళ్ళ రాజనీతి విజయంగా ఇంగ్లండులో గొప్పగా చెప్పుకున్నారు. ఇంగ్లండ్ ఆ ఒప్పందం ద్వారా 1743 వరకూ స్పానిష్ అమెరికాకి ఏటా 4800 మంది నీగ్రోల్ని సరఫరా చేసే హక్కు పొందింది. అదే సమయంలో అది బ్రిటిష్ స్మగ్లింగ్ వ్యాపారం మీద అధికారికంగా ముసుగువేసింది. బానిస వ్యాపారంవల్ల లివర్ పూల్ తెగ బలిసిపోయింది. ఆదిమ సంచయనం విధానం ఇదే. లివర్ పూల్ 1730లో 15 ఓడలన్నీ, 1751లో 53 ఓడల్నీ, 1760లో 74 ఓడల్ని 1770లో 96 ఓడల్ని 1792లో 132 ఓడల్ని వినియోగించింది.

బాల బానిస వ్యవస్థని ఇంగ్లండ్‌లో వస్త్ర పరిశ్రమ ప్రవేశ పెట్టింది. కాగా అది సంయుక్త రాష్ట్రాల్లో పూర్వపు పితృస్వామిక బానిసత్వం వర్తక దోపిడీ వ్యవస్థగా మారడానికి ప్రోద్బలం కలిగించింది. వాస్తవానికి ఐరొపాలో ప్రచ్ఛన్నంగా ముసుగులో ఉన్న వేతన కార్మికుల బానిసత్వానికి, కొత్త ప్రపంచంలో (అమెరికాల్లో) స్వచ్ఛమైన, సరళమైన బానిసత్వం ఆధార పీఠంగా కావాల్సొచ్చింది. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం యొక్క స్వాభావిక శాశ్వత నియమాల్ని ఏర్పాటు చెయ్యడానికి చాలా పెద్ద ప్రయత్నం జరగాల్సి వచ్చింది.

శ్రామికులకీ, శ్రమ పరిస్థితులకీ మధ్య వేర్పాటు ప్రక్రియ పూర్తి చెయ్యడానికి, ఒక ధృవాన సామాజిక ఉత్పత్తి సాధనాల్నీ, జీవనాధార సాధనాల్నీ పెట్టుబడిలోకి మార్చడానికీ, వ్యతిరేక ధృవాన ప్రజారాశిని వేతన కార్మికులుగా, ఆధునిక సమాజపు ఉత్పాదితం అయిన స్వేచ్ఛాయుత శ్రామిక పేదలుగా మార్చడానికీ ఎంతో ప్రయత్నం జరగాల్సి వచ్చింది. మేరీ ఆగియర్ 1842 లో రాసినట్లు ప్రపంచంలోకి డబ్బు ఒక చెంపమీద నెత్తుటి మరకతో వస్తే, పెట్టుబడి నఖశిఖ పర్యంతం నెత్తురూ, చీమూ కార్చుకుంటూ ప్రవేశించింది.

పెట్టుబడి లాభాన్ని తిరస్కరించదు – మరీ హీన లాభాన్నైతే తప్ప. 10 శాతం లాభం వస్తుందంటే, పెట్టుబడి ఎక్కడికైనా పోతుంది. 20 శాతం లాభం ఉంటే, ఉవ్విళ్ళూరుతుంది, ఉబలాటపడుతుంది. 50 శాతం అంటే, సాహసం వస్తుంది. 100 శాతం అయితే, అన్ని మానవ నియమాల్నీ కాలరాయడానికి సన్నద్ధం అవుతుంది. 300 శాతం ఉన్నట్లయితే, ఎంతటి నేరానికైనా వెనుకాడదు. ఏ ప్రమాదానికైనా వెనుదీయదు. దాని సొంతదారుడికి ఉరి పడుతుంది అన్నా వెనుకంజ వెయ్యదు. ఒకవేళ ఘర్షణా, అల్లకల్లోలమూ లాభం తెచ్చే పనయితే, ఆ రెంటినే పెట్టుబడి ప్రోత్సహిస్తుంది. స్మగ్లింగూ, బానిస వ్యాపారమూ ఇక్కడ చెప్పిన పై విషయాల్ని బాగా రుజువు పరిచాయి.

## అధ్యాయం 32

# పెట్టుబడి సంచయనపు చారిత్రక ధోరణి

పెట్టుబడి ఆదిమ సంచయనం, అంటే దాని చారిత్రక పుట్టుక ఏమిగా తేలింది? అది బానిసలూ, ఫ్యూడల్ దాసులూ వేతన శ్రామికులుగా మారడంగా, అందువల్ల, కేవలం రూపం మారడంగా తేలింది.

ఈ రూపం మార్పు కాకుండా అది ఇంకా ఏమిటి? తక్షణ ఉత్పత్తిదారుల ఆస్తిని, బలవంతంగా ఆక్రమించే సాధనం. అంటే సొంత దారుని శ్రమవల్ల ఎర్పడ్డ ప్రైవేట్ ఆస్తిని రద్దుచేసే సాధనం.

ఆస్తి శ్రామికునిదా? శ్రామికుడు కానివానిదా? అనేది కీలకం. ప్రైవేట్ ఆస్తి సామాజిక, సమష్టి ఆస్తికి విరుద్ధం అయినదిగా ఎక్కడ ఉంటుంది? ఎక్కడైతే శ్రమసాధనాలూ, శ్రమ బాహ్య పరిస్థితులూ ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లో ఉంటాయో అక్కడ. అయితే ఈ ప్రైవేట్ వ్యక్తులు శ్రామికులా లేక శ్రామికులు కానివాళ్ళా అనేదాన్ని బట్టి ప్రైవేట్ ఆస్తి స్వభావం వేర్వేరుగా ఉంటుంది. అంటే, శ్రామికులదైతే దాని స్వభావం ఒకరకంగానూ, అదే శ్రామికులు కాని వాళ్ళదైతే దాని స్వభావం మరొక రకంగానూ ఉంటుంది. చూడగానే, ఈ రెండు కొసల నడుమ ఎన్నో ఛాయలు కనబడతాయి. అవి మధ్యంతర దశలకు అనుగుణమైనవి.

సన్నకారు పరిశ్రమ వ్యవసాయ కావచ్చు, వస్తూత్పత్తి కావచ్చు, అవి రెండూ కలిసినదైనా కావచ్చు. ఏదయినా సన్నకారు పరిశ్రమకి ప్రాతిపదిక: ఉత్పత్తి సాధనాలు శ్రామికుని ఆస్తిగా ఉండడం. సన్నకారు పరిశ్రమ సామాజిక ఉత్పత్తి అభివృద్ధికీ, శ్రామికుని స్వేచ్ఛాయుత వ్యక్తిత్వ వృద్ధికీ అవసరమైన షరతు.

ఈ సన్నకారు ఉత్పత్తి విధానం బానిస విధానంలోనూ, అర్ధబానిస విధానంలోనూ, ఇతర పరాధీన విధానాల్లో కూడా ఉండడం నిజమే. అయినా అది ఎక్కడ తన శక్తినంతా ప్రయోగించి విజృంభిస్తుందంటే: శ్రామికుడు తన ఉత్పత్తిసాధనాలకి, ప్రైవేట్ ఓనర్ గా ఉన్నప్పుడు మాత్రమే. అంటే, తాను దున్నుకునే భూమికి రైతు ఓనర్ అయినచోట; చేతివృత్తిదారుడు తాను ఉపయోగించే పనిముట్టుకు తానే ఓనర్ అయిన చోట. అటువంటి తావున మాత్రమే సన్నకారు ఉత్పత్తి తన లాక్షణిక రూపాన్ని పొందుతుంది.

### సన్నకారు ఉత్పత్తి విధానం

ఈ సన్నకారు ఉత్పత్తి విధానానికి ముందు షరతులు:

1. భూమి భాగాలుగా విభజించబడి పంపిణీ అయి ఉండాలి.
2. ఇతర ఉత్పత్తి సాధనాలన్నీ చెల్లాచెదురుగా ఉండాలి.

అలా ఉన్నప్పుడే సన్నకారు ఉత్పత్తి సాధ్యం అవుతుంది. అయితే అది కొన్ని అంశాల్ని యధేచ్ఛగా ముందుకుపోనివ్వదు.

### ఆ అంశాలు ఇవే:

1. సన్నకారు ఉత్పత్తి విధానం ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణని సాధ్యం కానివ్వదు.
2. అదే విధంగా సహకారాన్ని తిరస్కరిస్తుంది.
3. ప్రతి విడి ఉత్పత్తి ప్రక్రియలోనూ శ్రమ విభజనని మినహాయిస్తుంది.
4. ప్రకృతి శక్తుల్ని సమాజం చేతుల్లోకి తీసుకోడాన్నీ, వాటి ఉత్పాదక వినియోగాన్ని సమాజం అదుపులో ఉంచుకోడాన్నీ ఒప్పుకోదు.
5. సామాజిక ఉత్పత్తిశక్తులు స్వేచ్ఛగా అభివృద్ధి అవడాన్ని మినహాయిస్తుంది. అది సంకుచితమైన, అంతో ఇంతో ఆదిమ హద్దుల్లో నడిచే సమాజానికీ, ఉత్పత్తివ్యవస్థకీ సరిపడి ఉంటుంది. దాన్ని శాశ్వతంగా ఉంచడం సాధ్యపడదు.

## సన్నకారు ఉత్పత్తి విచ్ఛిత్తి

ఒకానొక అభివృద్ధి దశలో సన్నకారు ఉత్పత్తి తననే విచ్ఛిన్నం చేసే భౌతికసాధనాల్ని ముందుకు తెస్తుంది. ఆక్షణం నుంచీ సమాజ హృదయంలో నూతన శక్తులూ, మనోద్రేకాలూ ఏర్పడతాయి. అయితే పాత సామాజిక వ్యవస్థ వాటికి సంకెళ్ళు వేసి, అణచిపెట్టి ఉంచుతుంది. **ఆ వ్యవస్థ ధ్వంసం చేయబడి తీరాలి; ధ్వంసం చేయబడింది.**

సన్నకారు ఉత్పత్తి ధ్వంసం కావడం, వ్యక్తులపరంగానూ, చెల్లాచెదరుగానూ ఉన్న ఉత్పత్తిసాధనాలు సమాజపరంగా కేంద్రీకృతం అవడం, అనేకమంది మరగుజ్జు ఆస్తులు కొద్దిమంది భారీ ఆస్తిగా అవడం, భూముల నించీ, జీవనాధార సాధనాలనించీ, శ్రమ సాధనాల నుంచీ ప్రజారాసుల్ని తప్పించే ఆస్తి హరణం – ఈ భయంకరమైన, బాధాకరమైన ఆస్తిహరణం పెట్టుబడి చరిత్రకి నాంది.

## దోపిడీ మీద ఆధారపడ్డ ప్రైవేట్ ఆస్తి

ఆస్తిహరణం ఎన్నో బలాత్కార పద్ధతుల పరంపరతో కూడి ఉంది. వాటిలో మనం ఆదిమసంచయనంలో యుగకర్తలైన వాటిని మాత్రమే సమీక్షించాం. సొంతశ్రమతో సంపాదించుకున్న ప్రైవేట్ ఆస్తి స్థానాన్ని, వేతన శ్రమ దోపిడీ మీద ఆధారపడ్డ పెట్టుబడిదారీ ప్రైవేట్ ఆస్తి ఆక్రమిస్తుంది. ఈ పరివర్తన ప్రక్రియ పాత సమాజాన్ని తగినంత విచ్ఛిన్నం చేయగానే, శ్రామికులు వేతన కార్మికులుగా మారగానే, పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానం తన సొంత కాళ్ళ మీద తాను నిలబడగానే – అప్పుడు శ్రమ ఇంకా మరింతగా సామాజీకరణ చెందడమూ, భూమి వగయిరా ఉత్పత్తిసాధనాలు సామాజికంగా దోపిడీ చెయ్యబడే సాధనాలుగా, అందువల్ల సమష్టి ఉత్పత్తి సాధనాలుగా మారడమూ, అలాగే ప్రైవేట్ యజమానుల ఆస్తిహరణమూ కొత్తరూపం తీసుకుంటాయి.

## ఆస్తి హర్తల ఆస్తి హరణం

ఇప్పుడిక జరగాల్సింది తమకోసం తాము శ్రమచేసే వాళ్ళ ఆస్తిహరణం కాదు, అనేకమంది శ్రామికుల్ని దోచే పెట్టుబడిదారుడి ఆస్తిహరణం. ఇది పెట్టుబడిదారీ ఉత్పత్తి యొక్క అంతర్గత

సూత్రాల కార్యకలాపాల చేత, పెట్టుబడి కేంద్రీకరణచేత నిర్వహించబడుతుంది. ఒక పెట్టుబడిదారుడు ఎల్లప్పుడూ ఎంతోమంది పెట్టుబడి దారుల్ని దెబ్బ తీస్తుంటాడు, స్వాహా చేస్తుంటాడు. ఈ పరివర్తన ప్రక్రియలోని అవకాశాల్ని అన్నిటినీ లాక్కునే వాళ్ళ సంఖ్య, పెట్టుబడిదారీ కుబేరుల సంఖ్య నిరంతరం తగ్గుతూ ఉంటుంది. దీని పక్కనే దారిద్ర్యం, పీడన, బానిసత్వం, పతనం, దోపిడీ పెరుగుతుంటాయి; అయితే వీటితో పాటే కార్మికవర్గ తిరుగుబాటు కూడా ఎక్కువవుతుంటుంది. కార్మికవర్గం ఎల్లప్పుడూ సంఖ్యాత్మకంగా పెరుగుతూ ఉంటుంది. అంతకంతకూ ఎక్కువమంది అవుతుంటారు. ఈ వర్గం పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియ వల్లనే క్రమశిక్షణా, ఐక్యతా సాధించి వ్యవస్థీకృతమైన వర్గం అవుతుంది. పెట్టుబడి దారీ ఉత్పత్తి విధానంలో పుట్టి, ఆవిధానంతో పాటు వృద్ధిచెందిన పెట్టుబడి గుత్తాధిపత్యం ఆ ఉత్పత్తి విధానానికి సంకెల అవుతుంది. ఉత్పత్తిసాధనాల కేంద్రీకరణా, శ్రమ సామాజీకరణా చివరకి ఏ స్థాయికి చేరతాయంటే: అవి తమ పెట్టుబడిదారీ పై డిప్పతో/ కవచంతో (integument) పొసగని స్థితికి చేరతాయి. ఆ పై డిప్ప పగిలిపోతుంది. పెట్టుబడిదారీ ఆస్తికి చావుగంట మోగుతుంది. ఆస్తి హర్తల ఆస్తి హరించబడుతుంది.

The expropriators are expropriated

### అభావం అభావం చెందడం

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంతో పుట్టిన పెట్టుబడిదారీ స్వాధీన విధానం పెట్టుబడిదారీ వ్యక్తిగత ఆస్తిని ఏర్పరుస్తుంది. ఇది సొంతదారుని శ్రమ వల్ల ఏర్పడిన వ్యక్తిగత ఆస్తికి మొదటి అభావం. అయితే పెట్టుబడిదారీ ఉత్పత్తి తన అభావాన్ని తానే తయారు చేసుకుంటుంది. తానే ఏర్పరచుకుంటుంది. ఇది ఆపశక్యంకాని సహజ ప్రక్రియ లాగా సంభవిస్తుంది.

అది ఉత్పత్తిదారుని వ్యక్తిగత అస్తిని తిరిగి ప్రతిష్టచెయ్యదు. కాని, అతనికి పెట్టుబడిదారీ యుగంలో ఆర్జనల వల్ల ఏర్పడ్డ వ్యక్తిగత ఆస్తిని ఇస్తుంది. అంటే, సహకారం మీదా, భూమిమీదా ఉత్పత్తిసాధనాలమీదా ఉండే ఉమ్మడి యాజమాన్యం మీదా ఆధారపడ్డ వ్యక్తిగత ఆస్తిని ఇస్తుంది.

ఇక్కడ రెండు ప్రక్రియలున్నాయి:

1. వ్యక్తి శ్రమ వల్ల ఏర్పడి, చెల్లాచెదరుగా ఉన్న ప్రైవేట్ ఆస్తి పెట్టుబడిదారీ ప్రైవేట్ ఆస్తిగా పరివర్తన చెందే ప్రక్రియ
2. ఆ పెట్టుబడిదారీ ఆస్తి సామాజిక ఆస్తిగా మారే ప్రక్రియ. అప్పటికే ఆచరణలో సామాజికీకృత ఉత్పత్తి మీద ఆధారపడి ఉన్న పెట్టుబడిదారీ ప్రైవేట్ ఆస్తి సామాజిక ఆస్తిగా పరివర్తన చెందే ప్రక్రియ.

రెండు ప్రక్రియలూ హింసాత్మక మైనవే. అయితే, మొదటిప్రక్రియ రెండోదానికంటే పోల్చలేనంత మరింత దీర్ఘకాలికమైనది, మరింత హింసాత్మకమైనది, మరింత కష్టభరితమైనది. మొదటి సందర్భంలో ప్రజారాసుల ఆస్తిని కొద్దిమంది ఆక్రమణదారులు హరించడం జరిగింది. రెండో సందర్భంలో కొద్దిమంది ఆక్రమణదారుల ఆస్తిని ప్రజా రాసులు హరించడం జరుగుతుంది.

## ప్రణాళికలో చెప్పిందే మరొకసారి

కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక లోని కొన్ని వాక్యాలతో ఈ చాప్టర్ ముగుస్తుంది:

పరిశ్రమ పురోగమనాన్ని ఉద్దేశ పూర్వకంగా కాకున్నా, బూర్జువా వర్గం కొనసాగిస్తుంది. కార్మికుల్లో పోటీ వల్ల ఏర్పడే అనైక్యత స్థానంలో, పరస్పర సంబంధం వల్ల విప్లవాత్మక కలయిక వస్తుంది. అందువల్ల బూర్జువా వర్గం ఏ పునాది మీద ఉత్పత్తిచేసి, సొంతం చేసుకుంటుందో ఆ పునాదినే, ఆధునిక పరిశ్రమల అభివృద్ధి తొలిచి వేస్తుంది. కాబట్టి బూర్జువా వర్గం ఉత్పత్తిచేసే వాటన్నిటిలోకీ ముఖ్యమైనది: తనని పూడ్చేందుకు గొయ్యి తవ్వే వాళ్ళు (grave-diggers).

### బూర్జువావర్గ పతనం అనివార్యం. కార్మికవర్గ విజయమూ అంతే అనివార్యం

ఇవ్వాళ బూర్జువా వర్గానికి ఎదురొడ్డి నిలబడ్డ వర్గాలన్నిటిలోకీ ఒక్క కార్మిక వర్గమే నిజమైన విప్లవకరమైన వర్గం. మిగతా వర్గాలు క్షీణించి, క్షీణించి అంతిమంగా అదృశ్యమై పోతాయి .కార్మిక వర్గం దాని ప్రత్యేక సృష్టి, ముఖ్యమైన సృష్టి.

మధ్యతరగతిలో కింది శ్రేణికి చెందినవాళ్ళు – చిన్న ఉత్పత్తిదారులూ, దుకాణదారులూ, చేతిపనివాళ్ళూ, రైతులూ – వీళ్ళందరూ బూర్జువావర్గంతో పోరాడతారు; కాని వీళ్ళ పోరాటం మధ్యతరగతిలో భాగాలుగా తమ మనుగడ నశించిపోకుండా కాపాడుకోడానికి. అనగా వీళ్ళు విప్లవకారులు కాదు, యధాస్థితివాదులు. అంతే కాదు,

అభివృద్ధి నిరోధకులు కూడా. ఎందుకంటే వీళ్ళు చరిత్ర చక్రాన్ని వెనక్కు తిప్పడానికి కృషిచేస్తారు. – Karl Marx and Friedrich Engels, Manifest der Kommunistischen Partei, London, 1848, pp. 9, 11.

## కాపిటల్ లో కార్ల్ మార్క్స్ చెప్పిన సిద్ధాంతం ఇదే